శ్రీ

# ఆంధ్రసాహిత్యపరిషత్పత్రిక.

రెండు నెలల కొకసారి ప్రకటింపఁబడును.

**(Journal of the Telugu Academy.)**

సంపుటము ౨౬. { ఈశ్వరనామసంవత్సరము. చైత్రవైశాఖమాసములు. } సంచిక ౧.



కాకినాడ:

క్రొత్తపల్లి సూర్యరావుచే బరిషత్కార్యాలయమునఁ

బ్రకటింపఁబడినది.

చందా, పోస్టువ్యయములతో సంవత్సరమునకు రు 3-౦-౦.

విడిసంచిక రు ౦-౮-౦.

ఏప్రియల్, మే, 1937.

# విషయసూచిక.


1 విజ్ఞాపనము.

2. సత్యనారాయణా.

పిసుపాటి చిదంబరశాస్త్రిగారు.

3. మాచల్దేవిశాసనము.

పెండ్యాల వేంకటసుబ్రహ్మణ్యశాస్త్రిగారు.

4. శ్రీకృష్ణభూపతిదేవుమహారాజులుంగారి వర్ణన.

శిష్టు కృష్ణమూర్తిశాస్త్రిగారు.

5. ప్రకాశవర్షుఁడు - రసార్ణవాలంకారము.

ఈయుణ్ణి వేంకటవీరరాఘవాచార్యులుగారు. ఎం ఏ.

6. కఠినశ్లోకార్థము. 33-

కొండవీటి వెంకయ్యచౌదరిగారు.

7. మనవి. 3౫-3

8. గ్రంథస్వీకారము. 3౭-౮

9. రఘునాథరామాయణము. 73

రఘునాథభూపాలుఁడు.

10. లక్షణసారసంగ్రహము. 29.

చిత్రకవి పెద్దనార్యుఁడు.

శ్రీ

# ఆంధ్రసాహిత్యపరిషత్పత్త్రిక.

రెండు నెలల కొకసారి ప్రకటింపఁబడును.

**(Journal of the Telugu Academy.)**




## కాకినాడ

## ఈశ్వరనామసంవత్సరము

## సంపుటము ౨౬.

**1937—38.**

# ఈశ్వరనామసంవత్సరము

## విషయసూచిక.

౨౬ సంపుటము.

1. విజ్ఞాపనము ౧
2. సత్యనారాయణా ౨
శతావధాని-పిసుపాటి చిదంబరశాస్త్రిగారు.
3. మాచల్దేవి శాసనము ౩-౫
పెండ్యాల వేంకటసుబ్రహ్మణ్యశాస్త్రిగారు.
4. శ్రీకృష్ణభూపతిదేవుమహారాజులుంగారి వర్ణన ౬-౮
శిష్టు కృష్ణమూర్తిశాస్త్రిగారు.
5. ప్రకాశవర్షుఁడు-రసార్ణవాలంకారము ౯-౩౨, ౪౯-౬౯
ఈయుణ్ణి వేంకటవీరరాఘవాచార్యులుగారు ఎం. ఏ.
6. కఠినశ్లోకార్థము ౩౩.౩౪
కొండవీటి వెంకయ్యచౌదరిగారు.
7. మనవి ౩౫-౩౬
8. గ్రంథస్వీకారము ౩౭-౪౦; ౧౪౨-౧౪౬; ౧౯౭-౨౦౨; ౨౬౦- ౨౬౬; ౩౧౫-
9. రఘునాథరామాయణము 73-96; 97-99
రఘునాథభూపాలుఁడు.
10. లక్షణసారసంగ్రహము 29-32; 33-40; 41-48; 49-56; 57-64
చిత్రకవి పెద్దనార్యుఁడు.
11. బాలకవిశరణ్యము ౪౧-౪౩
12. శ్రీకృష్ణదేవరాయల సంస్థానమునందలి వీరశైవకవులు ౪౪-౪౭
తొగరచేటి సోమసుందరశాస్త్రిగారు.
13. ఆంధ్రసాహిత్యపరిషత్కృత్యములు ౪౭-౪౮
శతావధాని పిసుపాటి చిదంబరశాస్త్రిగారు.
14. ఆంధ్రసాహిత్యపరిషత్తు-రజతోత్సవసభావృత్తాంతము ౭౦-౯౩
15. అభినవభారతి ౯౪
16. పాల్కురికిమతరహస్యములు ౯౫-౯౭
యామిజాల ప[illegible]గారు.
17. ప్రశంస ౯౭-౧౦౦
విద్వాన్ పిసుపాటి విశ్వేశ్వరశాస్త్రిగారు.

18. చిత్రపటప్రశంస ౧౦౧-౧౦౨

వెంపరాల సూర్యనారాయణశాస్త్రిగారు.

19. రజతోత్సవపద్యములు ౧౦౩-౧౦౯

20. ఆంధ్రవ్యాకరణములు ౧౧౦-౧౧౯

చర్ల నారాయణశాస్త్రిగారు.

21. సంగీతసాహిత్యసమ్మేళనము ౧౨౦-౧౩౫

ఉ. ప్ర. పంతుల లక్ష్మీనారాయణశాస్త్రిగారు.

22. శ్రీవిశుద్ధాంధ్రభాషాదుర్దశ ౧౩౬-౧౪౧

పండిత పుల్య ఉమామహేశ్వరశాస్త్రిగారు.

23. లౌకికన్యాయవివరణము ౧-౮; ౯-౧౬; ౧౭-౨౪; ౨౫ ౩౨

శ్రీమాన్ మేడేపల్లి వేంకటరమణాచార్యులుగారు.

24 శాంతాన్వత్తాంతము ౧౪౨-౧౪౮

జొన్నలగడ్డ రామకృష్ణశాస్త్రిగారు.

25. కీ. శే నెమలి పట్టాభిరామారావుపంతులుగారు బి. ఏ. ౧౪౮

26 పునఃప్రార్థన ౧౪౯-౧౫౧

క్రొత్తపల్లి సూర్యరావు.

27. ఆంధ్రసాహిత్యపరిషత్తు ౧౫౧-౧౫౨

కాళూరి వ్యాసమూర్తిగారు.

28. ఆంధ్రసాహిత్యపరిషద్రజతోత్సవప్రశంస ౧౫౩

నల్లా చినరెడ్డినాయఁడుగారు.

29. ఆంధ్రసాహిత్యపరిషత్ప్రశంస ౧౫౪

వేదుల సూర్యసత్యనారాయణగారు.

30. కవిమాన్యవిభాగము ౧౫౫ ౧౬౭

కాశీభట్ట సుబ్బయ్యశాస్త్రిగారు.

31. "చజలు" ౧౬౮-౧౭౩

విద్వాన్ దర్భా సర్వేశ్వరశాస్త్రిగారు.

32. సరస్వతీరామాయణము ౧౭౪-౧౮౩

జనమంచి సీతారామస్వామిగారు.

33. ఆంధ్రవాఙ్మయము-కరుణరసము ౧౮౪-౧౯౬

సాగి వేంకట నరసింహముగారు, ఎం. ఏ.

34. మనవి ౨౦౩-౨౦౪; ౨౬౭-౨౬౮

35. విన్నపము ౨౦౫-౨౦౭

జనమంచి వేంకటసుబ్రహ్మణ్యశర్మగారు.

36. గోలంబాష్టకప్రశంస ౨౦౮-౨౦

కాశీభట్ట సుబ్బయ్యశాస్త్రిగారు

37. గోలంబాష్టకమ్ ౨౦౯-౨౧

వైద్యరాజ దంటు సుబ్బావధానిగారు.

38. అమరసింహుఁడు-నామలింగానుశాసనము ౨౧౧-౨౧

ఈయుణ్ణి వేంకటవీరరాఘవాచార్యులుగారు ఎం. ఏ.

39. శ్రీజయదేవకవి-అష్టపదులు ౨౧౯-౨౩

శ్రీ వింజమూరి వరాహనరసింహాచార్యులుగారు.

40. మతియొకమనవి ౨౩౭-౨౩౮

41. ఆంధ్రజయము ౨౩౯-౨౪౯

కాశీభట్ట సుబ్బయ్యశాస్త్రిగారు.

42. ఆంధ్రము-అనువాదవాఙ్మయము ౨౫౦-౨౫౯

జటావల్లభుల పురుషోత్తముగారు, ఎం. ఏ.

43. స్వవిషయము ౨౬౭

44. కీ. శే. వడ్డాది సుబ్బారాయఁడుగారు ౨౬౮-౨౭౦

45. బాలకవిశరణ్యము ౨౭౧-౨౭౮

వెంపరాల సూర్యనారాయణశాస్త్రిగారు.

46. పాల్కురికిపాత్రసృష్టి ౨౭౮-౨౮౨

యామిజాల పద్మనాభస్వామిగారు.

47. ఉత్తరాపరిణయము ౨౮౩-౨౯౫

కాశీభట్ట సుబ్బయ్యశాస్త్రిగారు.

48. ఘడియారము-ఘటశాసి ౨౯౬-౩౦౦

కుందూరి ఈశ్వరదత్తుగారు బి. ఏ.

49. నవనాథచరిత్రము ౩౦౧-౩౧౦

నిడుదవోలు వేంకటరావుగారు బి. ఏ.

50. బహుధాన్య ౩౧౧

శ్రీమత్తిరుమల పెద్దింటి రాఘవాచార్యులుగారు.

51. జయదేవకవి-అష్టపదులు ౩౧౨

శ్రీ వింజమూరి వరాహనరసింహాచార్యులుగారు.

52. ప్రాస్తావిక శ్లోకములు ౩౧౩

కాశీభట్ట సుబ్బయ్యశాస్త్రిగారు.

శ్రీ

# ఆంధ్రసాహిత్యపరిషత్పత్రిక.

## కాకినాడ.

రెండునెలల కొకసారి ప్రకటింపఁబడును.

సంపుటము ౨౬. { ఈశ్వరనామసంవత్సరము. చైత్రవైశాఖమాసములు. } సంచిక ౧.

## విజ్ఞాపనము.

ఆంధ్రసాహిత్యపరిషత్పత్రికకు- ఇరువదియైదేండ్లు గడచినవి. ఇరువదియాఱవసంవత్సరములో నిది మొదటిసంచిక: పెద్దలగు భాషాభిమానుల యాదరమున నిట్లింతవఱకు జరుగుచున్నది. వార్షికమూల్యముల నీయవలసినవారికి ముందు జ్ఞాపికలు వ్రాయుచున్నారము. దయచేసి వారువారీయవలసిన ధనమును బంపఁగోరుచున్నారము. మఱియు నూతనసంవత్సరమునకుఁ బంపవలసినధనమును బంపఁగోరుచున్నారము. మఱలఁ గాగితములకుఁ గఱవువచ్చుచున్నది. పత్రిక నడచుటకు ముందుగానే యేర్పాటులు చేసికొనక తత్తత్కాలములలోఁ జేసికొనుట కొంత తొందరకుఁ గారణము. కావున మాకుఁ బాఠకులు ముందుగానే తోడ్పడుదురుగాక. పాఠకులు స్వహస్తపరహస్తములచే సాయము గావింపవలయును. పరిషత్ప్రకటితగ్రంథములను గొనియుఁ బత్రికకుఁ బాఠకులయ్యు వారివారిమిత్రులు మాకుఁ బ్రోత్సాహమొసంగ మఱిమఱి కోరుచున్నారము. ఉభయభాషావేత్తలు మాపత్రికకుఁ దగిన భాషావిషయకములు చారిత్రకములు నగు వ్యాసములను రచియించి పంపవేఁడుచున్నారము.

పరిషత్పత్రికలు ప్రాఁతవి కావలసినవారికి వెల సులభముగా నొసంగెదము. వెనుకటిసంచికలు తగ్గిపోవుచున్నవి. విద్యార్థులు, పఠనమందిరములవారు, భాషాభిమానులు వానిని సంగ్రహించి యుంచుకొని వానిలోఁగల యమూల్యవిషయవ్యాసములను గుర్తింతురుగాక యని మనవి.

# సత్యనారాయణా!

—శతావధాని- పిసుపాటి చిదంబరశాస్త్రిగారు, పిఠాపురము.—

---

మ. తొలఁగంద్రోయుటకున్ విపత్తులు సంతోషంబు నెప్పట్ల వ
ర్ధిలఁగాఁజేయుటకుం ద్వదన్యుఁ డెవఁడున్ దేవుండు నీవంటివాఁ
డిలలో లేఁ డని లోక మంతయును నిన్నే కొల్చుచుండంగ న
న్యుల నే నేటికి నాశ్రయింతు శ్రితబంధూ సత్యనారాయణా!

మ. కలలో నీ వొకనాఁడు గన్పడినచోఁ గల్యాణముల్ పెక్కుఁజా
యలఁ బ్రాప్తించుచునుండ నిన్నెపుడుఁ బ్రత్యక్షంబుగాఁ గన్గొనం
గలుగం గల్గెడిభాగ్య మింత యని వక్కాణింపఁగా నెంతవా
రలకున్ శక్యమె సర్వనిర్వహణధుర్యా సత్యనారాయణా!

మ తపముం జేయఁగఁజాల క్షేత్రములు సందర్శింపఁగాఁజాలఁ బా
పపరీహార మొనర్చుకర్మములు సల్పంజాల నే నెట్లు నీ
కృపకుం బాత్రుఁడనై తరింతు భవవార్ధిన్ పీఁడు నావాఁ డట
న్నపితృప్రేమము నాపయిం గలుగకున్నన్ సత్యనారాయణా!

మ. కలిలోనన్ గలవార లుద్ధృతులు గాఁగన్ రెండుమార్గంబు లిం
దులసంసారవిరక్తుఁడై జగములందున్ నిండు నిన్నాత్మగాఁ
దలఁపం గల్గుటయొండె బద్ధుఁడయినం ద్వద్భక్తిసామ్రాజ్యముం
గలకాలంబు వహించుటొండె భృతలోకా సత్యనారాయణా!

మ. నను నే స్తోత్రముచేసికొంటయును నన్యస్తోత్రముల్ చేసి య
న్యునిచే స్తోత్రము లందికొంటయును నెంతున్ నాకుఁ బ్రాపింపకుం
డను నీపైఁ గలభక్తియుం దొలఁగకుండంగం బ్రసాదింపు మొ
ల్లను నే నైహికమైన తుచ్ఛసుఖమెల్లన్ సత్యనారాయణా!

---

# మాచల్దేవిశాసనము.

—పెండ్యాల వేంకటసుబ్రహ్మణ్యశాస్త్రిగారు. పిఠాపురము.—

---

"శ్లో॥ శ్రీశాకే రసబాణ రామశశి యుజ్యానందసంవత్సరే।
జ్యేష్ఠే(కృష్ణ)మృగాంక వారసహితే (దర్శే) ఖరాంశేగ్రహే।
సద్భార్యా పరదేశి మాచరమణీ రమ్యం శిలామందిరం।
ప్రాదా (చ్ఛ్రీ) గుడిమెట్టనామనగరే శ్రీకేశవస్వామినే॥
సప్తాంభోనిధిసంతతాంబుపటలీసంసక్త(ధీరా)చితః
......త్పరదేశిమాచరమణీ రత్నేన యత్నాత్కృతే
భూయిష్ఠం గుడిమెట్టనామనగరే విద్యోతమానం నవం
నూనం ప్రాప్య శిలాగృహం విజయతే లక్ష్మీసఖః కేశవః॥
పరదేశే మాచమాంబా పుణ్యప్రారబ్ధసప్తకం
రాజుపాళేతాండిచెర్లాగ్రహారద్విజరాజేభ్యోమహేత(ది)రమదాత్॥
రమ్యాయాః పరదేశి మాచయువతే ర్బ్రహ్మప్రతిష్ఠాప్రపా
వాపీకూప తటాక సత్ర సుకృతోద్యానంచ విభ్రాజితం।
స్వామి శ్రీగుడిమెట్ట కేశవ..............తలే
సించంతు ప్రతివాసరం ఘనకృపాసారై ర్మనోహారిభిః॥
శ్రీగుడిమెట్ట చెన్నరేని దేవర మారసాని దేవరముఁదర పరమసీచ సానుడదో—"

---

ఈశాసనము కర్నూలుజిల్లా సోమిదేవిపల్లె స్టేషనునకు నాలుగు మైళ్లు దక్షిణ భాగమం దున్న గుడిమెట్ట యను గ్రామమునందు శిథిలమైన చెన్నకేశవస్వామివారి యాలయమునం దున్నది.

నేను 1921 సంవత్సరమునందు శ్రీపిఠాపురము మహారాజావారి యాజ్ఞానుసారము ప్రాచీనగ్రంథసంపాదనము నిమిత్తము, ఆగ్రామమునకు వెళ్లినప్పు డీశాసనమును జూడఁ దటస్థించినది. గవర్నమెంటువారు

కర్నూలుమండలమునందలి ప్రాచీనశాసన పరిశోధనమును 1920 వ సంవత్సరప్రాంతమునకుఁ గాని ప్రారంభించినట్లు కనఁబడదు.

ఈశాసనము మాచల్దేవి యను నొకవారవనితచేత నెలకొలుపఁబడినది. ఈపెచే నాకాలముననే నిర్మింపఁబడిన పెద్దచెఱువు గూడ నాగ్రామమునందే ప్రసిద్ధికెక్కి యున్నది. మాచల్దేవి యనునామె రెండవప్రతాపరుద్రచక్రవర్తి యుంపుడుకత్తె యని క్రీడాభిరామమున నిట్లుగా వర్ణింపఁబడినది.

"శా. ద్వీపాంతంబుననుండి వచ్చితివె భూదేవా ప్రశాంతం మహా
పాపం సర్వజగత్ప్రసిద్ధసుమనోబాణాసనామ్నాయ వి
ద్యోపాధ్యాయి ప్రతాపరుద్రధరణీశోపాత్తగోష్ఠీప్రతి
ష్ఠాపారీణ నెఱుంగవయ్యెదవె మాచల్దేవి వారాంగనన్.

వ. చిత్రశాలాప్రవేశంబు చేయుచున్నది. మీరును.........జూడవచ్చునది యనిన.

గీ. లెస్సగాక కిరాట యీ లేమచరిత
మాడుదురు నాటకంబుగ నవనిలోన
దీనిఁ జూడంగఁబోదమా యీ నెపమున
నరసిచూతము మనకేమి యచట ననుచు.

వ. అనుచు...బల్లికూటంబున నిలువునం గైసేసి హంసతూలికాతల్పంబు మీఁదం గూర్చున్న హావభావవిభ్రమవిలాసనిధి మాచల్దేవిం గనుంగొని.

* * * * * *

గీ. కల్లఁ జెప్పము విను నీకుఁ గలప్రసిద్ధి
డిల్లి సురతాణికిని లేదు పల్లవోష్ఠి
యాదిలక్ష్మికి నీకును భేదమేమి
యుదధి జనియింపకుండుట యొకటిదక్క.

గీ. ఓరుగంటి మాచాంబ పయోరుహాక్షి
పంచబాణావతారుని మంచిఁ జూచి

కంకణాలంక్రియార్ఘుణాత్కారమెసఁగ
నయ్యగారికి జోహారు లనుచు మ్రొక్కె."

మఱియు చిత్రశాలవర్ణనమును బట్టిచూడ నామె మహాధనికురా లనియు దానశీల యనియుఁ జెప్పవలసి యున్నది.

ఈమెశాసనములు పెక్కు లుండిన వని క్రీడాభిరామపీఠికలో బ్ర॥ వేటూరి ప్రభాకరశాస్త్రిగారు వ్రాసియున్నారు, కాని, శ్రీశాస్త్రిగారి యభిప్రాయము ననుసరించియు నీశాసనమునందలి శకవర్షముల ననుసరించియు మాచల్దేవి ప్రతాపరుద్రునినాఁటిది కాక యాప్రతాపరుద్రుని యనంతరము నూటేండ్లనాఁటి దయి క్రీ. 1434 సంవత్సర ప్రాంతపుదిగాఁ గనఁబడుచున్నది. ఒకవేళ నీమాచల్దేవి పేరుగలడి ప్రతాపరుద్రుని యుంపుడుకత్తెగా నుండిన నుండవచ్చును. ఈమె శ్రీనాథుని కాలపు దనుట మాత్రము నిశ్చయము.

ఈమెభర్తనుగుఱించి-యీశాసనమున"సద్భార్యా"యనియును, "పరదేశమాచరమణి" యనియు నుదాహరింపఁబడి యుండుటచే నామె గృహనామము పరదేశి యనియు, సత్పురుషులను జేపట్టునదియే యని యుఁ దోఁచుచున్నది. మఱియు శాసనమునడుగున "మాచసానిదేవర ముందర పరమనీచసానుండవో'' యను నొకవాక్యమున్నది. దీనిని బట్టి యీమె వారవనిత యనియు స్వవృత్తిని నీచవృత్తినిగానే భావించుచున్న దనియుఁ దలంపఁబడుచున్నది. వృత్తి యెట్టిదైనను- బ్రహ్మప్రతిష్ఠ ప్రపా వాపీ కూప తటాక సత్రప్రతిష్ఠాది సుకృతకార్యములనుజేయు సద్వృత్తి గలది యని తలంపవచ్చును.

---

# శ్రీకృష్ణభూపతిదేవుమహారాజులుంగారివర్ణన.

— శిష్టు కృష్ణమూర్తిశాస్త్రిగారు. —

సీసమాలిక.

సిరిమించు మత్స్యభూవరునియన్వయమునఁ
గలశాబ్ధినిఁ ద పారకరునికరణి
మంజుకళాగరిమంబున జనియించి
మాడుగు లనఁ బ్రోల మహితలీలఁ
బ్రాజ్యసామ్రాజ్యధురంధరుఁడై జగ
న్నాథభూపతిదేవునందనుఁ డయి
పొలుపార శ్రీకృష్ణభూపతిదేవు సం
తత దానతోషితధరణిదేవుఁ
డఖిలమూర్ధాభిషిక్తాస్థానమండప
మాధుఁ ధుర్యవాఙ్మహితలలిత
సంస్కృతప్రాకృతసంగీతవైకృత
సాహితీకవితారచన(సు)చణ
కల్పితాత్యనవద్యగద్యపద్యప్రబ
బాధగీతవ్రాతబహుళవర్ణ
వర్ణ్యమానానూన వరగుణజాలుఁడు
సముదయోత్కీర్ణరసాప్రపూర్ణ
శీలుఁడు తేజోవిశేషసముత్సారి
తాశేషరిపుఁ డస్త్రకౌశలపరి
హసితకృపుఁడు హరిదంతరపలమాన
శారదనీరదపారదహార
హారనీహారసురాహారతారకా
కాశనీకాశప్రకాశమాన
యశుఁ డని తను నహర్నిశ మెల్లమానిసుల్
గొనియాడ బయలుబ్రాఁకనలరుపస
దగు జాళువాపైఁడితమ్మిమొగ్గలఁ తేవఁ
బయిపయిఁ బొల్చు పొంబనఁటుల...

సొంపును దెసవవు సొరిది నాడాడనేఁ
గెడు మొయిలందూలనడఁచుపసిఁడి
జండాలపెంపును జెలువగు నిలువగు
నలువగు బటువుపైనాలచాలు
గని తమ్మునొక్కటఁ గలయు గాటపుటాస
కుఁదటికి దగి నందమైన
చలువలవేల్పుచూపుల కోపు లని యెదం
దలఁచి వలచితమిఁదారుతార
కానికాయంబు నాఁగ్రాలురసపుబుడ్లు
బారులుభూస్థితి బంచజచుల
పాపములెడలించి పాలింప నవతరిం
చిన నిలింపులు నాగఁ జెలఁగుచిత్ర
పుషరంబుల (వగు) తవురులు బంగారుక
శీదాపనిహారంగు చెంగలించు
గజలక్ష్మ లలరు ఖీన్ ఖాబుకల్వడములు
నవరఁజిగొలుసుల నంటి్రవేలు
గ్లోబులు లస్టర్లుఁ గొమరారునార్గను
లాఁపులు, వాల్ సేఫ్లు నింపుఁ బొంపు
గాంచనడోలికల్ కౌచీలు, కుర్చీలు
నషరఫీల్ జవ్వాజి యగరుపునుఁగు
తాషుదస్తులు మహతాబుపోషకులు బ
నారసు వల్వలు నాణెమైన
యోణి కట్టాణి సుప్పాణి ముత్తియముల
హారము ల్వచ్చలపేరులు మగ
తాలసర్ఫేషు తురాయీల రతనంబు .
టొంటులు గొంపుల యుంగ్రములును
నింపిన మంజసల్ నిల్వుటద్దములను
గొనబుహొంబని పలంగులును గల్గు
కలువరాయని మానికమ్ముల మేడలో

బంగరుతళ్కుపై రంగుమీఱ
నాసీనుఁడై ప్రకృతిప్రత్యయార్థ్యాంశములనై
పుణిమించు వైయాకరణులు యుక్తి
శాలులౌ తార్కికుల్ జైమినిసూత్రప
విత్రపద్ధతి సక్త విశదమతులు
విమల వేదాంతకోవిదులు వేదవిదులు
హాయిగాఁ బాడుగాయకులుఁ గంపి
తారోహణావరోహాందోళమూర్ఛితా
ప్రత్యాహతాహతప్రముఖదశవి
ధగమకవిజ్ఞాన దక్షులౌ వైణికుల్
మార్దంగికాశ్రితమంత్రవేదు
లు రసజ్ఞులగుకవీశ్వరులు నొక్కొకవేళ
వచియించు పలుకులవలనడెంద
మానంద మొంద నొకప్డు డెందతే యస
మానలాస్యకళావిలాస...
సరసలైనట్టి యచ్చరల మచ్చరికించు
జటిపేమాటుల నట్టువులయుఁ
బాటల నాటల పరిపాటియింపొన
రింపఁగా బట్టుల గుంపొకమెడఁ
గై వారములుసేయఁగా వారివారికిఁ
దగుతెలుంగుల మంచిధరణులు రత
నాలుఁ దోడాలు దుశాలాల్బనారసు
దుస్తులు మొదలగు వస్తువుల వ
రాలు వజ్రాలసరాలు బిలాతిగు
ఱ్ఱాలు జాల్వాపల్లకీ లొసఁగుచు
నింద్రవైభవభోగని స్తంద్రుఁ డగుచు
ననయముఁ బ్రజాళి ననురక్తి మనుచుచు వసు
ధాతలం బేలుఁగాత నిరీతిరీతి
నంచు మముఁ బల్కుఁగల్గి పల్కించు నెప్పుడు.

# కఠినశ్లోకార్థము.

— కొండవీటి వెంకయ్యచౌదరీగారు- క్రోసూరు. —

శ్లో. పాయాద్వః కరణోరణోరణరణోరాణోరణోవారణో
దత్తా యేనరమారమారమరమా రామారమా సారమా
సశ్రీమానుదయోదయోదయదయోదాయోదయో దేదయో
విష్ణుర్జిష్ణు రభీరభీ రభిరభీ రాభీరభీసారభీః.

ఈ శ్లోకములో దశావతారములు చెప్పఁబడినవి.

టీక. శ్రీమాన్=సంపద్యుక్తుఁడైన (లక్ష్మీయుక్తుఁడయిన) అవతారములయందు సిరితోఁ గూడియుండునని-"రాఘవత్వే భవత్సీతా"ఇత్యాది విష్ణుపురాణము. కరణః- కే=ఉదకమునందు, రణతి= వెళ్లుచుండువాఁడు (కరణుఁడు) ఉదకములలోన సంచరించునది యని మత్స్యావతారముం జెప్పెను. అరణః=రణములేనివాఁడు. (యుద్ధాదిక్రూరకర్మలచేఁ గాక సామముచే శత్రువుల రూపడఁగించువాఁడు- (వామనావతారము) రాణః=రణసంబంధమైన, రణః=అయస్తంభ ధ్వనినుండి పుట్టిన, రణః= ప్రతిశబ్దమును విని వచ్చు రాక్షసులను, వారణః=వారించువాఁడు. (నరసింహావతారము) రమా=లక్ష్మి, యేన=ఏకూర్మ రూపముచేత, (సముద్రునకు) దత్తా= ఈయఁబడినదో-(కూర్మావతారము) అరమాః- అరః= సుదర్శనాంశమువలన నుత్పన్నమైన కార్తవీర్యుని, మినాతి=చంపువాఁడు, రమారమః=విష్ణువు, (వానియందు) రమాః=రమించువారలు, (రమారమరమాః) బ్రాహ్మణులు, అట్టివారలకు సంపాదించిన, అర= భూమి, (స్యాదరో యుద్ధకర్మణి, పిసునేచఖలా వహ్నావరొతు కమలేలయోః- అని శ్రీహర్షనిఘంటువు.) (దానియొక్క) మా=సమృద్ధియు, రమా=జయలక్ష్మియు (ఎవనిచే) ఆసా=స్థాపింపఁబడినదో యట్టిది (పరశురామావతారము) ఉత్=మిక్కిలి, అయః=ధాన్యమునకు (అయో

దన్తే ధనేధాన్యేకల్యాణేకరణేపిచ - శ్రీహర్షని ఘంటువు) ఉదయః=ఉత్ప త్తిభూత మైన భూమియందు దయః=దయగలవాఁడు. సర్వబీజాధార భూతమైన భూమిని హిరణ్యాక్షుని బారినుండి రక్షించినవాఁడు. (వరాహా వతారమున) అదయదయః=దయలేని క్రూరులయందే దయగలఁవాఁడు. క్రూరులయందేదయగలవాఁడు తదతిరిక్తులయందుఁ జెప్పనవసరము లేదు. (సకలజనహితకరమైన బుద్ధావతారము చెప్పఁబడినది.)

దామోదమోదాః-దాయ=జ్ఞాతులందు, అదయాః=దయాశూన్యులయిన (దుర్యోధనాదులను), ద్యతి=ఖండించువారు (పాండవులు), వారియందు- దయః=దయగలవాఁడు, (శ్రీకృష్ణావతారము.) అభీరాః= భయరహితులైన- (దుష్టకార్యవిషయమున) రావణాదులకు, భీ=భయ మును గల్పించి, రభిః=సంహారక్రీడగలవాఁడు, (శ్రీరామావతారము) అభీరః=అభి=నిగమాదివ్యాప్తమైన, ఇరః=దేవత్వముగల బ్రాహ్మణులను ఆభీరాః=ఆ=అంతటను, భీ=భయమును, రాన్తి=గ్రహించువారుగాన- ఆభీరాః=అంతటను భయమునుబొందువా రని యర్థము. అట్టి వారలకు, భీసారభిః= భీ=భయమును, సార=ప్రసరింపఁజేయువారు, (ములుచలు) అట్టివారలకు, భీ=భయమును గల్గించువాఁడు- (కల్కి) సః=అట్టి, జిష్ణుః=జయశీలుఁడైన, విష్ణుః=సర్వవ్యాపకుఁడైన దేవుఁడు, వః=మిమ్ము, పాయాత్=రక్షించుఁగాత!

ఈశ్లోకమునకు శ్రీతిరుమలకూరాన్వయ... సరససాహిత్యచక్రవర్తి కంఠీరవ...విశిష్టాద్వైతసంప్రదాయ నిరాతంక వేంకటరంగాచార్యేణ విరచితోయ ముపన్యాసః. అని సంస్కృతవ్యాఖ్య వ్రాసినట్లు కనఁబడు చున్నది. శ్లోక మెవ్వరు రచించినదో తెలియదు.

---

# మనవి.

విద్వద్వర్యులార! ఈక్రిందిశ్లోకమునకు బహుపురుకవులు రచించిన పూర్వకవద్యములు కొన్నిచూపినారము. మఱియు నెందైనఁ బూర్వకవుల పద్యము లున్న వానిం బంపుచు నిప్పటికవులుఁ బండితులును దాముఁగూడ నొక్కొక్క పద్యమును రచియించి మాకుఁ బంపఁ గోరుచు న్నారము. ఆంధ్రసాహిత్యపరిషత్పత్రికాధిపతి, కాకినాడ.

"ఉచ్చైర్గ ర్జగతి సిద్ధ్యతి ధర్మత శ్చే
త్తస్యప్రమాచ వచనైః కృత కేతరై శ్చేత్
తేషాం ప్రకాశనదశా చ మహీసురై శ్చే
త్తాన న్తరేణ నివతే త్క్వను మత్ప్రణామః"—భోజరాజః.

---

ఉ. ఇం బడరంగ సద్గతి సమృద్ధినిదానము ధర్మమేని ధ
ర్మంబు నెఱుంగఁ జేయ మహిమం దగునట్టిది వేదమేని వే
దంబు భరించు వారు వసుధాసురులేని తదీయపాదప
ద్మంబులఁ దక్క నొక్కయెడ మామకమౌళిమదాళివ్రాలునే.

ఋగ్వేదికవి వేంకటాచలపతికవి.

మ. పరికింపందగు ధర్మవృత్తి సుగతుల్ప్రాపించెనా దానిని
ల్వరముం గూర్పఁగనైన పల్కుబడుల న్వర్తిల్లెనా వానిని
ర్భరవిఖ్యాతి ధరాసురాగ్రణులచేఁ బాటిల్లెనా తన్మహ
త్తరులం జెందక యెందుఁ బోవఁగల వుద్యన్మన్మమోవాకముల్.

నడిమింటి వేంకటపతి (అభిషిక్తరాఘవము)

క. ఇల మేల్గతిధర్మముచే
నలధర్మంబునకుఁ బ్రమయు నామ్నాయపదం
బులవానికి విద్యలచే
నలరం దశగలుగ వారి కగునానతియుల్.

ఉ. ధారుణియందు మేటిగతి ధర్మముచే సమకూరెనేనియు
న్వారకదానికి న్నిజము వైదికవాక్యములన్ ఘటిల్లెనా
సారెకు వానికిన్ ఘనలసద్దశ విప్రులచేత నైనచో
వారలఁదప్ప మద్రచితవందన మొందువసించు నిత్యమున్.

చిత్రకవి రామాచార్యులు.

భోజభూపాలీయోపాఖ్యానంబను రఘునందనవిలాసము

గీ. ధర్మమునఁ గల్గునే నున్నతగతి జగతి
నకృతకోక్తులఁ దత్ప్రమ యడరునేని
వాని వెలయించువారలు పాఱులేని
వారిఁగాక నాదుప్రణతు లేరిఁ జెందు.

నిడమర్తి జలదుర్గాప్రసాదరాయకవిగారు

చ. భువనమునందు నుచ్చగతి పొల్పుగధర్మమునుండి ప్రాపితం
బవునదియేని ధర్మపుయథార్థమెఱుంగుట వేదవిద్యచే
నవునదియేని వేదముల నన్నిటినిం బ్రకటించురీతి వి
ప్రవరులచేత నేని మఱి వారినిగాకెటఁ జేరు మన్నతుల్.

అల్లమరాజు రంగశాయికవిగారు

చ. జనములు సద్గతిన్బొరయు సాధనమైనది ధర్మమేని య
మ్మనికి కకృత్రిమంబు నిగమంబె ప్రమాణమునయ్యెనేని దా
నిని ధరియించి మెంచి ధరణిన్వెలయింతురు పాఱులేని న
వ్వునమగు మత్ప్రణామములు వారికిఁగాక మఱెరి కయ్యెడున్.

పొన్నాడ కృష్ణమూర్తిగారు

ఉ. ధారుణిలోన సద్గతినిదానము ధర్మమయేని దాని కా
ధార మపౌరుషోక్తికలితం బగువేదమయేని వేదము
న్నేరిచి యాధరాస్థలిని నిల్పెడువారలు పాఱులేని నా
పాఱులఁ గాక యింకఁ బెఱవారల నెవ్వరిఁ జేరు మన్నతుల్.

జయంతి రామయ్యపంతులుగారు

---

# గ్రంథస్వీకారము.

## (1) నూతనరాజ్యాంగవిధానము.

రచయిత: తల్లాప్రగడ జగన్నాథరావుగారు, B.A., వెల 8 అణాలు. కాకినాడలో, ప్రతులు: గ్రంథకర్తయొద్ద దొరుకును.

స్వపరిపాలనము, స్వాతంత్ర్యమును, ఓటుహక్కు మున్నగుభావములు ప్రబలి, నలుడలఁ బ్రాఁకియున్న యీదినములలోఁ, బ్రతిమానవుఁడును, ప్రజలకు, ప్రభుత్వమునకు నొండొరులయెడఁ గలహక్కులు, బాధ్యతలు, సంబంధము తెలిసికొనవలసినయావశ్యకత మిక్కుటము.

ఈగ్రంథమున మొదటియేఁబదిపుటలందు నాంగ్లేయు లీదేశమున వర్తకమునకై ప్రవేశించి రాజ్యము నార్జించినది మొదలు 'కుంఫినీ'పాలనమంత మొుంపువఱకును, కుంఫినీవారిని దొలఁగించి 1858 లో విక్టోరియా రాణి భారతసార్వభౌమత్వము వహించిన దాది 1935 వఱకు మనపాలన మేవిధముగ నుండెనో, దిఙ్మాత్రముగ సూచితమై, 1935 వ సంవత్సరపు ఇండియాప్రభుత్వ చట్టముప్రకారము నేఁ డమలునందున్న విధానమునకు పోద్ఘాతముగనున్నది. నేటిభారతరాజ్యతంత్రమున, సార్వభౌముఁడు భారత రాజ్యాంగమంత్రి, రాష్ట్రీయగవర్నరులు, రాష్ట్రీయశాసనసభలు, గవర్నరుజనరలు లేక వైస్రాయి, అఖిలభార తాంతరరాష్ట్రీయశాసనసభ, ప్రజలు, వీరిస్థానములు, వీరికిఁ గలపరస్పరాధికారతారతమ్యములు, హక్కు బాధ్యతలు వివరింపఁబడినది. ఆంగ్లభాషాసంపర్కము లేనివారికిని, భారతచట్టము నామూలాగ్రముగఁ బఠించుట కవకాశము లేనివారికిని, సంక్షేపముగ నేటిభారతీయపాలన విధానమందలి మూలసూత్రములఁ దెలిసికొనుట కీగ్రంథ ముపయోగించును. పా.

---

## (2) బ్రహ్మవిద్యా. BRAHMAVIDYA (సంపు- 1 సంచి. 2)

అడయారువిద్యాలయసంఘము వారిచేఁ బ్రకటింపఁబడినది. ఇందు మాధవకృత మగుభాష్యముతో ఋగ్వేదము వెనుకటిసంచిక తరువాతి భాగము వెలువడినది. ఉపనిషత్తులకు నాశ్వలాయనగృహ్యసూత్రము

లకు నాంగ్లభాషాంతరీకరణమే కాక నూతనముగ మేళరాగమాలిక యను నపూర్వగ్రంథ మొకటి ప్రారంభింపఁబడినది. ఇది శ్రీ మహావైద్యనాథయ్యరుగారిచే రచియింపఁబడినది. సంగీతశాస్త్రజిజ్ఞాసువుల కత్యంతోపయోగ మనుటలో సందియము లేదు. కర్ణాటదేశమునఁ బ్రచారమునఁ గల డెబ్బదిరెండు రాగముల వివరణ మిందుఁ బ్రకటింపఁబడును. టిబెటను భాషనుండి యనువదింపఁబడిన భావసంక్రాంతిసూత్రమూలమును, దాని కాంగ్లభాషాంతరీకరణమును, గలవు. బోధిరుచి, బుద్ధశాంత, ఇట్సింగు మొదలగు సుప్రసిద్ధ బౌద్ధపండితుల మూలగ్రంథములకుఁ గలభేదములఁ దెలియఁజేయుటకై యాంగ్లానువాదము లోకచోసేయఁబడినవి.

**The Adyar Library Bulletin Vol. I - Part II.** This issue contains the continuation of Madhava's Rigveda Bhasya and of the English translation of the Yoga Upanishads commenced in the first part of the Journal. A new work on music called Mela - Ragamalika by Maha Vaidyanatha Iyer is commenced in this issue. The work aims at giving the description of the Seventy two Ragas prevalent in Karnata Music and commences with the Sri-Raga. It is bound to be very useful to lovers of South Indian Music. The Bhava Sankranti Sutra constructed from the Tibetan Version and its translation with the English Versions of the Texts of Bodhiruchi, Buddhasanta and Itsing for Comparative Study are given in this part. We congratulate the Editor and his staff for their useful contribution to Oriental studies in the pages of this Bulletin.

---

### (3) కథాసరిత్సాగరము.

వేంకటరామకృష్ణప్రణీతము. 2 వది కథాముఖలంబకము. 4 వది నరవాహనదత్తజననలంబకము. ఈరెండును మాకార్యాలయమునకుఁ జేరినవి. లావాణకలంబకము నిదివఱకే పరిషత్పత్త్రికాపాఠకు లెఱిఁగి యున్నారు. వేదము వేంకటరాయశాస్త్రులుగారి వచనమొక్కటి దీనికి ముందే యున్నది. ఉన్నను దీనిం జదువువారి కిది మృదుమధుర పద్యకావ్య మగుట నెక్కుడుసంతోషము కలిగింపకమానదు.

పూర్వపండితులకు మనకువలె గ్రంథములు లేవు. రామాయణ, భారత, భాగవతాదులే కాని మనకువలె వారి కితరకావ్యము లేవి!

వానిం జదివియే, యశక్తులమైన మనకొఱకు వా రమితము నమూల్యము
నైన వివిధకావ్యసంచయమును దయచేసియున్నారు. పైవానితోపాటు
పూర్వులు-కథాసరిత్సాగరమునో బృహత్కథనో చదువుకొనుచుండెడువా
రనుట కెన్నియో దృష్టాంతముల నీయవచ్చును. ఒక్క కాళిదాసునిం
దీసికొందము. ఆతఁడు రఘువంశము, కుమారసంభవము ననుపేరులు
కూడ శ్రీమద్రామాయణమునుండియే గ్రహించెనని చెప్పవచ్చును. మేఘ
సందేశమును గథాసరిత్సాగరములోని యొక్క శ్లోకమునుబట్టి రచించె నని
పెద్దలు చెప్పెదరు. దానిని ముందు విమర్శింతము. అభిజ్ఞానశాకుంతల
మును బృహత్కథను జదివియే యాకవి రచియించెను. ఒక్క చోటనున్న
దొక్క విషయము వేఱొక్కచోట నున్నది యొక్కవిషయమును దలలుమార్చి
యందందుఁ గూర్చినాఁడు. కథాముఖలంబకములో-తిలోత్తమ శతానీ
కుని శపియించుట దుర్వాసుఁడు శకుంతలను శపించినట్లు మాఱిచినాఁడు.

ఉ. ఎవ్వతె నీమనంబు హరియించుటఁజేసి యనన్యబుద్ధివై
యివ్విధి నాదుపల్కు గణియింపక నీవిపు డేఁగుచుంటివో
యవ్వనితాలలాము కెడమై పదునాలుగువర్షము ల్పదిక్
నెవ్వగ నొందుచుండెదవు నీవని శాపమొసంగె నయ్యెడన్.

వ. తదీయశాపవచనంబు లింద్రసారథియైన మాతలి యాలించెం గాని,
రాజున కట్టి యహితవచనంబు లెఱింగింపనొల్లక మిన్నకుండె.
ప్రథమతరంగము 49-50.

గీ. తండ్రికులముద్ధరింపంగఁ దగినయొక్క
యర్భకుం డున్నవాఁడు నీగర్భమందు
వెలయ నాతండు నీకుద్భవించు నిందు
నవుల భర్తృసమాగమం బదియుఁగలుగు.	1-96

(ఇది జమదగ్ని చెప్పినట్లున్నది) ఉదయనుని జననసందర్భమునఁ గల
దానిని కాళిదాసు భరతుని జననమునకు సందర్భించినాఁడు. పైమాటల
లో నాఁడువారిమాటలు మగవారికిని మగవారి మాట లాఁడువారికినిఁ
బెట్టినాఁడు.

గీ. ఇంతలోపల నయ్యాశ్వరేచ్ఛవలన
నుదయనునిచేత బహుమాన మొందినట్టి
చెంచు నప్పోఁడికడియమ్ముఁ గొంచుఁబోయి
యాపణమ్మున నది యమ్మఁజూపుటయును. 119

ఇక్కడికథ చదువుఁడు. మీకు శాకుంతలనాటకములో నభిజ్ఞాన మెట్లున్నదో విశదమగును. ఒక్కటికాదు:—

౧౨ లంబకము ౨౭ వ తరంగములోఁ జంద్రావలోకుఁ డిందీవర ప్రభయను నిరువదియవకథలోని విషయము కొంత శాకుంతలనాటక మునఁ జేర్చినాఁడు.

"అథ సప్రణయం రాజా తాం సప్రచ్ఛసోత్సుకః
భద్రే కః పుణ్యవాన్ వంశ స్త్వత్సఖ్యాలంకృతో నయా
కాని శ్రోత్రామృతస్యన్ది స్యస్యా నామాక్షరాణిచ
కిం చైవ మనసూ పుష్పసుకుమార మిదం వపుః
తాపసోచితయా వృత్త్యా విజనేస్మిన్ కదర్థ్యతే."

ఈభాగము దుష్యంతునితో ననసూయాప్రియంవదలు సంభాషించుసందర్భమున నదికినాఁడు.

ఇట్టి మెలఁకువలు మనకుఁ దెలియక కాళిదాసుని స్వకల్పనములే యని సంతోషించుచున్నాము. నయమే! ఒకవిద్వాంసుఁడు "దొంగగాని కవియు, వర్తకుఁడును లేఁడు, తనదొంగతనమును గప్పి పుచ్చుకొనువాఁడే గొప్పవాఁ"డను నర్థమిచ్చువిషయము వ్రాసినారు. దానిపరమార్థము నూహింపుఁడు. కొంచెమో గొప్పయో యీకథాసరిత్సాగరముం జదివిన సమస్తవిషయములుం దెలిసికొనఁగలరు. ఇట్టియుత్తమగ్రంథమును ముఖ్యముగా మన తెనుఁగువారు పండితులు మొదలందఱు నుపేక్షించుచున్నారు. ఇందు లేనివి మఱియెందును లేవని మఱియొక్కసారిచెప్పుచున్నారము. నరవాహనదత్తజననలంబకము నాగానందకథవలన నెల్లరకు సుపరిచితమైనదే. ఈగ్రంథములలోఁగూడ వెలలు తెల్పఁబడియుండ లేదు.

# శ్రీ
# ఆంధ్రసాహిత్యపరిషత్పత్రిక.

## కాకినాడ.

రెండునెలల కొకసారి ప్రకటింపఁబడును.

సంపుటము ౨౬. { ఈశ్వరనామసంవత్సరము. జ్యేష్ఠాషాఢమాసములు. } సంచిక ౨.


## బాలకవిశరణ్యము.

'ఆదివ్యంజనలోపము' అనుశీర్షిక (౨౬౪ పేజి) లో మెఱుఁగెట్టి, ఉసుకొసుకొను మున్నగుప్రయోగములతో పాటు అఱుగు + వెంట 'అఱుగెంట' అని పాండురంగమాహాత్మ్యములోని పద్యమొకటి యాప్రయోగముల నడుమ నీయఁబడినది. ఈ'అఱుగెంట' అనునది పరిమాణార్థకమై ఔపవిభక్తికాంత మగు 'అఱుగేఁడు' అనుదాని సప్తమ్యంతరూపము కాని 'అఱుగువెంట' అనుదానిలో వకారము లోపింపఁగా మిగిలిన 'ఎంట' రూపము కాదు, అని యాపద్యము చెప్పుచునే యున్నది. 'తత్పుటీహారులు (రౌతులు) కాసంత మరలించిరేని యొక్కయఱుగు పరిమితి గలస్థలమునందే (పరుగెత్తుచున్నను) సంభ్రమింపక నిలుచును. ఒకింత త్రోలినచో మెఱచాఁచి సప్తసముద్రములు దాఁటఁగలవు... అని గుఱ్ఱములగతిలాఘవము పై పద్యమున వర్ణింపఁబడినది. అచట 'నడుగువెంటనె నిలుచును' అని యర్థము చెప్పినయెడల 'నెవరియఱుగువెంట' అను నాకాంక్షకు సమాధానము లేదు కావున వెంట, ఎంట, అయినదనుట యుక్తముకాదు. అది వెంటశబ్దమే యగునెడల 'జుట్టెంటిలో', అనుమనుచరిత్రప్రయోగము కుదురు టెట్లు. 'వెంట'కు 'వెంటిలో' అను రూపము లేదు గదా. మఱియు,'జుట్టిలి'లోని లివర్ణకమునకుఁ బరిమా

ర్థక మగు ఎండు ప్రత్యయము పరమగునపుడు లోపము గాని మఱియే యజాదిశబ్దము పరమైనను లోపించుట కాధారము కానరాదు. 'బారెటి లో మూరెటిలో' మున్నగుశబ్దములందు వెంటలోని నిందు నున్నమాఱు ఎట్లో తెలియదు. పరిమాణార్థక మగు ఎండుప్రత్యయమున కిట్టిరూప ముతో బహుళముగా గ్రంథములందు వాడుక యున్నది.

ద్వి. జుట్టెంట నొక్కొక్కచోద్యంబు గలదు, ... జేనెంట నొక్కొక్క శివ మూర్తి గలదు, బారెంటనొక్కొక్క పర్వతం బలరు.

పండితా, పర్వ, ౩౮ ౪ పు.

సీ. జేనెంట జేనెంట శివలింగములు కోటిసంఖ్య నేపురమునఁ

జాలనొప్పు కాశీ. 3.

సీ. ఇవి గాలికనిన మూకవరాహదను జేంద్రు నైనజుట్టెంటిలో నాఁగఁజాలు

మదు, ౪.

కావున 'అడుగెంట' లోని 'ఎంట' ఎండుప్రత్యయాంతముపై వచ్చు నాపవిభక్తికసప్తమీవిభక్తిరూపము కాని వెంటలోని దో మఱి యేయిత రపదములోనిదో యాదివ్యంజనము లోపించిన రూపము కాదు.

ఈ 'ఆదివ్యంజనలోపము' అనుశీర్షికకు వెనుకనున్న 'ప్రథమ వ్యంజనలోపము' అనుశీర్షికతో మోపు + పెట్టె=మోపెట్టె, బొబ్బ + పెట్టె=బొబ్బెట్టె మొదలగునుదాహరణములతోపాటు 'తలపెట్టు' అను నొకపదము కూడ నీయఁబడినది. ఈ 'తలపెట్టు' ఎట్టిదో రవంత యా లోచింతము. తలఁపు + పెట్టు లోని పకారము ప్రథమవ్యంజనము లో పింప ఎట్టు అయి తలఁపు ఎట్టు=తలపెట్టు అగు నని యీగ్రంథాభిప్రా యము కావచ్చును. అట్లు సంధి యగునప్పు డందలి ఖండబిందువునకు లోప మెట్లు? ఖండబిందువు లేదేమో యనుటకు మ... మున్న కైపె క్కినట్టితలం పచ్యుత నీకుఁగల్గినది - భార, ఉద్యో, 3. ౭౨ మున్నగు ప్రా చీనకవిప్రయోగముల మొదలుకొని యీగ్రంథమునందలి ముఖబంధన మునందలి 'జనులతలఁపుదెలుపు సాధనములు' ౨. వఱకు ననంతముగాఁ

ప్రయుక్తమైనది యీ "ఎట్టు" పరమగునంతమాత్రమున లోపించు ననుటయు వలనుపడదు. కావున 'తలపెట్టు' నకీగ్రంథమునఁ గలయనుశాసనికము ప్రామాదికము.

ప్రమాదము మనుజులకు సహజము, కావుననే ప్రమాదములు ప్రమాణములు కావని విజ్ఞులయభిప్రాయము. ప్రాచీనులు మొదలుకొని నేటివఱకుఁగలలాక్షణికుల సందఱును గంఠోక్తిగాఁ దప్పులని వ్రాసిన యీగ్రంథమున నిట్టిప్రమాదము లుండఁగాఁ బ్రమాదము లేనికవి యెవ్వఁడైన నుండునా ? అట్టియాకవులప్రమాదము లన్నిటిని బ్రమాణము లని చూపి పూర్వలాక్షణికగ్రంథములఁ ద్రోసిపుచ్చుట యెట్టిదో చదువరు లూహింతురుగాక !

యాథాలాభముగ నీగ్రంథమును విప్పిచూడఁగా మా కారెండు తావులం దిట్టిపొరపాటులు కనఁబడినవి. సమగ్రముగాఁ జదివినచో వీని కెచట నయిన సమాధానము లందు ముందు వెనుకల నున్న వేమో చూచి యట్లున్నచో తెలిపెదము. ఇం కొక చిన్నసందేహము. 'ప్రథమవ్యంజనలోపము' అని యొకశీర్షికయును, వెనువెంటనే 'ఆదివ్యంజనలోపము' అని మఱియొకశీర్షికయు, నిందుఁగలవు. ఆరెంటికి భేదమేమి యో తెలియకున్నది. విషయసూచికయందు 'ప్రథమవ్యంజనలోపము' ఒకటియే కలదు. రెండవది దానిలో నంతర్భాగమేమో యనుకొనుటకు భేదమేమియుఁ గానరాదు. అందలిభేదము నెవ్వరయినఁ దెలిసినవారు తెలుపఁగోరుచున్నాము.

---

# శ్రీకృష్ణదేవరాయల సంస్థానమునందలి వీరశైవకవులు.

తొఁగర్చేటి సోమసుందరశాస్త్రిగారు-ఆదవాని.

---

విజయనగర సామ్రాజ్య కాలమునందు కర్ణాటకవాఙ్మయమునకు నపారమైన యుపకారము లభించినది. ప్రాచీనకాలవాఙ్మయమందు కర్ణాటకవాఙ్మయ మితరభాషావాఙ్మయముల కెంతమాత్రము తీసిపోకయుండె నని చెప్పుటకు సంతోషావహమగుట సహజము. కర్ణాటకదేశపరిపాలకు లగు మహారాజులు కన్నడభాషాభ్యుదయమునకై మిక్కిలి సాహాయ్యము గావించిరి. శ్రీకృష్ణదేవరాయలవారి యాస్థానమునందలి తెలుఁగుకవులఁగూర్చి తెలియనియాంధ్రుఁ డుండఁడు. రాయలవారి వీరశైవకవుల పరిచయ మాంధ్రసోదరులకుఁ గల్గించుట యీవ్యాసలేఖనోద్దేశము.

విజయనగరసామ్రాజ్య పరిపాలకులపైకి శ్రీబుక్కరాయలకాలమునందే కవులకు, పండితులకు నాస్థానప్రవేశము గల్గుచు వచ్చెను. ఈకాలమునందే భీమకవి బసవపురాణమును వ్రాసెను. ఇమ్మడి హరిహరరాయలకాలమునందు పద్మణాంకకవి పద్మరాజపురాణము వ్రాసెను. నీలకంఠశివాచార్యులవారు బ్రహ్మసూత్రములకు వ్యాఖ్యానరూపమయిన క్రియాసారమును వీరశైవధార్మికసంస్కృతోద్గ్రంథమును రచియించుటగాక, కన్నడమునందుఁగూడ ననేకగ్రంథములు రచించినట్లు తెలియుచున్నది. తర్వాత ప్రౌఢదేవరాయలవారికాలము వీరశైవవాఙ్మయాభివృద్ధికి మహాపర్వకాలముగ నుండె నని ధారాళముగఁ జెప్పవచ్చును. ప్రౌఢదేవరాయలు స్వయము వీరశైవదీక్షను గ్రహించుటయేగాక, యీమతప్రచారమునకు కర్ణాటకభాషాసాహిత్యకళాభ్యుదయమునకు నత్యంతసాహాయకుఁడై యుండెను.

ప్రౌఢదేవరాయలవారి ముఖ్యమంత్రియును సేనాధిపతియు నగు లక్కన్నకవి శివతత్త్వచింతామణి యనుగ్రంథమును రచియించెను. కర్ణా

టకులయొక్క, అంకునను, వీరశైవులయొక్క మాంద్యమువల్ల నింతవఱ కాగ్రంథము ముద్రితము గాకుండుట మిక్కిలిలజ్జాకర మని చెప్పఁదగియున్నది. ప్రౌఢదేవరాయల సేనాధిపతి యగుజక్కణాచార్యులవారు, "ఏకోత్తరశతస్థల" మనుగ్రంథమును వ్రాసెను.

ఈకాలమునందే చామరస వీరణ్ణోడయ, కుమారబంకనాథ, కల్మఠదప్రభుదేవ, మున్నగు ౧౦౧ మంది జనులు విరక్తులై రాజాశ్రయమువల్ల ననేకగ్రంథములను, వచనములను వ్రాసిరి. అవన్నియు నిచట వివరించుటకు సాధ్యముగా కున్నను గొన్నిరచనలంగూర్చి మాత్ర మిచట జేర్పవలసినదిగ నున్నది. గూళూరు సిద్ధవీరన్న, శూన్యసంపాదన యనుశ్రేష్ఠగ్రంథమును రచించెను. ఇతనిశైలి యమోఘమైనది.

ఈరీతి, కర్ణాటకభాషలో నేనుతకవిగాని వ్రాయలే దనుట యీ గ్రంథమును జదివినవారికిఁ దెలియును. చామరసకవిచే వ్రాయఁబడిన "ప్రభులింగలీల" యనునది కర్ణాటకకావ్యములలో సుప్రసిద్ధమైనది. ఈ గ్రంథము ఆంధ్ర, తమిళ, సంస్కృత, మరాటీ (ఈనాల్గు) భాషలయందుఁ బరివర్తనముఁ జెందియున్నది. ఇట్టి సుయోగము మఱి యే యితర కన్నడగ్రంథములకుఁ గలుగలేదు. కుమారబంకనాథకవి, షట్స్థలోపదేశమును, ప్రభుదేవర టీక వచనమును వ్రాసెను. కలస్థలద నాగదేవకవి త్రిపది యనుగ్రంథమును వ్రాసెను.

మగ్గెయమాయదేవకవి గూడ, ప్రౌఢదేవరాయలసహాయముననే (అనుభవసూత్ర (సంస్కృత) ప్రభుగీత, ఏకోత్తరస్థలదషట్పది, షట్స్థలగద్య, శతకత్రయ, అనుకొన్నిగ్రంథములను వ్రాసెను.

రెండవప్రౌఢదేవరాయలవారి కాలమునందు గురుబసవకవి, శివయోగాంగభూషణ, సద్గురురహస్య, కళ్యాణేశ్వర, స్వరూపామృత, వృషభగీత, మనోవిజయకావ్య, అను గ్రంథముల రచియించెను.

బొమ్మరసనునాతఁడు సుందరపురాణమును వ్రాసెను. కల్లరసను వాఁడు జనవశ్య అనుగ్రంథము వ్రాసెను. మఱికొందఱిని కన్నడకవుల ను కన్నడగ్రంథములను దెల్పుసూచిక :—

| కవులు. | గ్రంథములు. |
|---|---|
| చెన్నబసవాంకన- | అక్కమహాదేవీపురాణము. |
| కల్మఠప్రభుదేవన- | లింగలీలావిలాసచారిత్రము. |
| విరూపాక్షపండితుఁడు- | చెన్నబసవపురాణము. |
| తోంటదసిద్ధేశ్వర- | షట్స్థలజ్ఞానామృతసారము. |
| గుబ్బియమల్లనార్యుఁడు- | వీరశైవామృతము. |
| | గణభాష్యరత్నమాల. |
| చతుర్ముఖబొమ్మరసను- | రేవణసిద్ధేశ్వరపురాణము. |
| సింగరాజు- | మలబసవచరిత్రము. |
| లింగకవి- | చోళరాజచరిత్ర. |
| మహాలింగదేవకవి- | షట్స్థలవివేకము. |
| హరభక్త- | వేదభాష్యము. |

వేదభాష్యమును కన్నడమునకుఁ బరివర్తనము గావించిన మొదటికవి ఈహరభక్తకవి యని తెలియఁదగును.

| | |
|---|---|
| గురుసంజచు- | యజుర్వేదభాష్య (కన్న) |
| నీలకంఠార్యుఁడు- | పరవాదిగజాంకుశతారావళి. |
| చెరమాంకను- | చీరమహాకావ్యము. |
| వీరభద్రరాజు- | వీరభద్రవిజయకావ్యము. |
| కిక్కిరీయారాధ్యులు- | భైరవేశ్వరకావ్యము. |
| చెన్నవీరన- | సారస్వతవ్యాకరణశబ్దమణి. |
| లింగమంత్రి- | కబ్బిగరకైపిడియకోశము. |
| చంద్రరవి- | శంకరశతము. |
| ఎమ్మబసవన- | కాలజ్ఞానము. |

మొత్తమునకు విజయనగరమహారాజులకాలమునందు వీరశైవకవులసాహిత్యకళ యత్యున్నతదశను బొందియుండినది. ఆకాలమున వీరశైవకవులు తెలుఁగునఁ గూడ గొన్నిగ్రంథములను వ్రాసిరి. ఇంకను నెందఱో కవు లెన్నియో గ్రంథములను రచించినట్లు తెలియుచున్నది. విమర్శించుటకుసాధ్యము గాకున్నది. వీరశైవులందఱు తమ కన్నడసాహి

త్యము నభివృద్ధినొందించిన విజయనగర రాజులయెడ నెంతయుఁ గృతజ్ఞులై యుండుట పరమధర్మము.

ఈవ్యాసము వ్రాయుటకు సంయుక్తకర్ణాటకపత్రిక నా కెంతయుఁ దోడ్పడినది. అపత్రికాధిపతులకు వినతి.

---

# ఆంధ్రసాహిత్యపరిషత్కృత్యము.

—శతావధాని, పిసుపాటి చిదంబరశాస్త్రిగారు.—

సీ. కావ్యంబులును నాటకములు నలంకార
   ములును గూడను దెల్గుసలుపు టొకటి
వ్యాసప్రణీతంబు లగుపురాణము లెల్ల
   నంచితంబుగఁ దెలింగించు టొకటి
యాయుశ్శాస్త్రంబులయందుఁ జెప్పంబడ్డ
   విషయంబు తెల్గుగావించు టొకటి
తెలుఁగులోనికి రానికళ లన్నియునుగూడ
   సేకరించి తెలుంగుసేయు టొకటి
యుభయభాషలలోఁ బ్రజ్ఞ యున్నయట్టి
పండితుల నెన్నఁడును బాయకుండు టొకటి
యరయ మియ్యవి నియతకృత్యములు నీకు
నాంధ్రసాహిత్యపరిషదబ్జాయతాక్షి !

సీ. ఆంధ్రంబునం దుండినట్టిభారతమునఁ
   బడినప్రమాదముల్ వాపు టొకటి
తెలుఁగుబాసకు లోటు దీర్పఁగాఁగలయట్టి
   వ్యాకరణంబును వ్రాయు టొకటి
ముద్రితంబులు గాక మూల నుండినగొప్ప
   తెల్గుఁబొత్తములు ముద్రించు టొకటి
తప్పుగా వ్రాయుగ్రంథములలోఁ గలతప్పు
   నిశ్శంకముగను ఖండించు టొకటి

దేశభాషలయందు నాధిక్య మెనయ
తెలుఁగునఁ గలట్టిమహిమంబు తెలుపు టొకటి
యరయ మియ్యవి నియతకృత్యములు నీకు
నాంధ్రసాహిత్యపరిషదబ్జాయతాక్షి !

సీ. ఇది యయుక్తము యుక్త మిది యంచు నిర్ణయం
బొనరింపఁగలభార మూను టొకటి
పలుగాకితనమున భాషావిచారంబు
చేయువారలను శాసించు టొకటి
బహుకాలముననుండి పండితాగ్రణులు ద్రొ
క్కినమార్గములయంద చనుట యొకటి
గ్రామ్యంబనెడుచీడ గలుగకుండఁగ గ్రాంథి
కంబనుసస్యంబుఁ గాచు టొకటి
నియమములు లేని దనియెడునింద తెలుఁగు
బాసకు ఘటిల్లకుండఁ గాపాడు టొకటి
యరయ మియ్యవి నియతకృత్యములు నీకు
నాంధ్రసాహిత్యపరిషదబ్జాయతాక్షి !

సీ. సంస్కృతంబునఁగలశక్తి యంతయు నాంధ్ర
మునకుఁ జేకూర్పఁగాఁ బూనుమమ్మ
తెలుఁగుబాసకు వన్నె గలిగింపఁ గలిగిన
యట్టిమార్గము లెల్ల నరయుమమ్మ
ఘనుఁ డైనయాంధ్రభోజునినాయకత్వంబు
గలకాలమును నీవు గాంచుమమ్మ
పరిషత్తులం దగ్రపదము నాసాదించి
బ్రఖ్యాతియును నీవు వడయుమమ్మ
ఆంధ్రతత్త్వంబు దెలియనియాంధ్రుఁ డాంధ్ర
దేశమున లేఁ డనుచుఁ బరదేశజనులు
గూడ నుతియించుకీర్తి చేకొనఁగదమ్మ
యాంధ్రసాహిత్యపరిషదబ్జాయతాక్షి !

---

మ.రా. శ్రీ
శ్రీమాన్ మేడేపల్లి వేంకటరమణాచార్యులుగారు, విజయనగరము.
చెన్నాప్రెగడ భానుమూర్తిపంతులుగారు బి. ఏ., భీమవరము.
చిలుకూరి వీరభద్రరావుపంతులుగారు, కొవ్వూరు.
సేట్లూరి వేంకటరాఘవఅయ్యంగారు ఎం. ఏ., బెజవాడ.
అళ్ళక్కి వేంకటరామయ్యగారు, పెద్దాపురము.
కేశవరపు కామరాజుగారు, పెద్దాపురము.
కవిరాజు వత్సవాయ వేంకటనీలాద్రిరాజుగారు, తుని.
దర్భా సర్వేశ్వరశాస్త్రిగారు, పిఠాపురము.
వెంపరాల సూర్యనారాయణశాస్త్రిగారు, పిఠాపురము.
రుద్రరాజు నరసింహరాజుగారు, పోడూరు.
ఎఱ్ఱగుంట్ల సుబ్బారావుగారు బి. ఏ., రాజమహేంద్రవరము.
అనంతపంతుల రామలింగస్వామిగారు, పార్వతీపురము.
ఓరుమళ్ల అచ్యుతరావుగారు ఎం. ఏ., పిఠాపురము.
కళ్ళాప్రపూర్ణ శ్రీపాద కృష్ణమూర్తిశాస్త్రిగారు, రాజమహేంద్రవరము.
బండారు తమ్మయ్యగారు, రాజమహేంద్రవరము.
వఝ్ఝుల సూర్యనారాయణగారు, రేపల్లె.
నాళం అప్పలనరసయ్యగారు, రాజమహేంద్రవరము.
నల్లా చినరెడ్డినాయుడుగారు, అమలాపురము.
నండూరి బంగారయ్యగారు బి. ఏ., బి. ఎల్., రాజమహేంద్రవరము.
భావరాజు కృష్ణారావుపంతులుగారు బి. ఏ., బి, ఎల్., ,,
వడ్డాది శ్రీరామచంద్రమూర్తిగారు బి. ఏ., రాజమహేంద్రము.
బాలదారి నారాయణదేవుగారు. ,,
ఆర్య సోమయాజుల కాశీచయనులుగారు, కిర్లంపూడి.
బళ్ల రామచంద్రరాజుగారు, బిక్కవోలు.
డాక్టరు రామానుజము వేంకటకృష్ణయ్యగారు, పిఠాపురము.
దాసరి లక్ష్మణస్వామిగారు, ,,

దోగపర్తి స్వామిగు ప్తసిద్ధాంతిగారు.
పుల్య ఉమామహేశ్వరశాస్త్రిగారు, పాలకొల్లు.
గోటేటి జగన్నాథరావుగారు, విశాఖపట్టణము.
వేదుల వేంకటరావుగారు, కాకరపఱ్ఱు.
ఓలేటి సీతారామస్వామిగారు, పిఠాపురము.
వేదుల వేంకటరావుగారు, పుల్లేటికుఱ్ఱు.
వేదుల సూర్యసత్యనారాయణగారు, రాజమహేంద్రవరము.

(వ్యాసములు చదివినవారు నుపన్యాసముల నిచ్చినవారు నిందుఁ జేరలేదు.)

మఱియు, కాకినాడపౌరులలోఁ బ్రముఖులును, కళాశాలోపాధ్యాయులు, విద్యార్థులు, విద్యార్థినులు పెక్కురు వచ్చిరి. వేదపఠనము, ఈశ్వరప్రార్థనము నైనపిమ్మట ఆహ్వానసంఘాధ్యక్షులు శ్రీదురిసేటి శేషగిరిరావు పంతులుగారు స్వాగతముం దెలిపిన పిదప అధ్యక్షులను జయంతి రామయ్యపంతులు గారు సభవారికిఁ దెలియఁజెప్పి వారిసుగుణముల, నౌదార్యాతిశయముల, విద్యావైభవముం బ్రశంసించి యగ్రాసనము నారోహింప నుపపాదింపఁగా వేదికపై నిలిచి శ్రీమహారాజు లుచిత వచనరచనలతోఁ గొంత యుపన్యసించి యధ్యక్షాభిభాషణముం జదివిరి.

బ్ర. కాశీభట్ట సుబ్బయ్యశాస్త్రిగారు పారితోషికపద్యరత్నావళి యను శ్లోకములం జదివిరి. వింజమూరి వేంకటలక్ష్మీనరసింహారావుగారు, క్రొత్తపల్లి సూర్యరావుగారును, బరిషత్ప్రశంసయు, మహారాజప్రశంసలుం గావించుపద్యములం జదివి యభినందించిరి. ఇరువదియైదుసంవత్సరములలోని పరిషద్వృత్తాంతమును గార్యదర్శులలో నొకరగు కిళాంబి రాఘవాచార్యులుగారు రజతోత్సవసంపుటమునుండి చదివి యాసంపుట మొక్కటి శ్రీవారికి సమర్పించిరి.

పరిషద్రజతోత్సవసందర్భమున, కట్టమంచి రామలింగారెడ్డిగారు ఎం. ఏ., ప్రొఫెసర్ కే. నీలకంఠశాస్త్రిగారు, మదరాసు డైరెక్టరుగారు, శ్రీకిర్లమపూడిరాజాగారు, ధారాకోటరాజాగారు, బెంగుళూరు మిథిక్ సొసైటీ కార్యదర్శులు, భారతీతీర్థసభాధ్యక్షులు, బొంబాయి కామా

ఓరియంటల్ ఇన్‌స్టిట్యూటువారు, వడ్డాది సుబ్బారాయఁడుగారు, మైసూరుమహారాజ సంస్కృతకళాశాలాధికారులు, శ్రీ పర్లాకిమిడిమహారాజుగారు, డాక్టరు డి. వి. సుబ్బారెడ్డిగారు, ప్రభల లక్ష్మీనరసింహముపంతులుగారు మున్నగువారుపంపిన సందేశములలోఁగొన్నింటిని గార్యదర్శులు చదివిరి. ఈక్రిందియుపన్యాసములు గావింపఁబడినవి.

1. సాగి వేంకటనరసింహముగారు ఎం. ఏ. రాజమహేంద్రవరము, ఆంధ్రవాఙ్మయము, కరుణరసము. 2. పెండ్యాల వేంకటసుబ్రహ్మణ్యశాస్త్రిగారు, పిఠాపురము-తిక్కన సోమయాజి. 3. ఈయుణ్ణి వేంకటవీరరాఘవాచార్యులు ఎం. ఏ. గారు కాకినాడ-సంస్కృతవాఙ్మయము, ఆంధ్రకవులు. 4 జనమంచి సీతారామస్వామిగారు, అనకాపల్లి-సరస్వతీ రామాయణము. 5. గాడిచెర్ల హరిసర్వోత్తమరావుగారు ఎం. ఏ., బెజవాడ- దేశభాషలప్రాముఖ్యము-భారతజాతీయైక్యత, విద్యాలయములనాంధ్రము, నాంగ్లము, హిందీభాషల కీయవలసిన స్థానమునుంగూర్చి యుపన్యసించిరి. 6. కాశీభట్ట సుబ్బయ్యశాస్త్రిగారు, కవిమాన్యవిభాగము- కవుల వైదికి నియోగిభేదములచే విడఁదీయరా దనియుఁ గవిత్వమున రసభావాది విషయములే ప్రధానము లనియు నుపన్యసించిరి. 7. పోతుకుచ్చి వేంకటసుబ్బయ్యగారు బి ఏ. శ్రీకృష్ణదేవరాయులం గూర్చి చెప్పిరి. 8. చర్ల నారాయణశాస్త్రిగారు, పిఠాపురము-ఆంధ్రవ్యాకరణములలోఁ గల వైరుధ్యమునకుఁ గారణమును దెల్పుచుఁ గొన్ని ముఖ్యవిషయములం గూర్చి ప్రసంగించిరి. 8. కొండేపూఁడి సుబ్బారావుగారు (బి. ఏ. విద్యార్థి, కాకినాడ) శ్రీనాథుఁడు, కాశీఖండము నను చిన్నవ్యాసముం జదివిరి.

అధ్యక్షులవారు ప్రతియుపన్యాసకుని యుపన్యాసముపైని తమ యభిప్రాయము నప్పుడప్పుడే వెల్లడించుచు వచ్చిరి.

8 వ తేది, ఆదివారము, ఉదయమున,- గుంటూరుపౌరులచేఁ బరిషత్తునకు సమర్పింపఁబడిన శ్రీ జయంతి రామయ్యపంతులుగారి చిత్రపటమును- గుంటూరువారిపక్షమున మ. తెలికిచెర్ల వేంకటరత్నము ఎం. ఏ. గారు, ఆపటమును రచింపించుటకుఁ దగిన కారణముం దెల్పినపిమ్మట

శ్రీ జయపురాధీశ్వరులు, పంతులుగారి చిత్రపటమును బహిర్గతము చేయు కార్యము తమపైఁ బెట్టినందులకు సంతోషముతోఁ దత్త్రర్తను గారయిత లను బ్రశంసించుచు రామయ్యపంతులుగారిని స్తుతించి చిత్రపటమును బ హిరంగపఱచిరి. రామయ్యపంతులుగారు శ్రీవారి ప్రశంసావాక్యముల కు చితసమాధానము నిచ్చిరి. ఈపటమును గుంటూరుపురవాసులు రామ య్యపంతులుగారిపైఁ దమకుఁగల గౌరవాతిశయములు సూచించుటకై రచియింపించి, పంతులుగారు ౨౫ సంవత్సరములనుండి పరిషత్ప్రతిష్ఠా పకులు, కార్యనిర్వాహకులు నగుటచేఁ బరిషద్భవనమునందే యీపటము నుంచుట యుచిత మని, వారీపటమును బరిషత్తునకుఁ బంపుటకుఁ బూ ర్వము, ఈనెల ది 4 తేదిని గుంటూరు ఆంధ్రక్రిస్టియన్ కళాశాలాభవన మునందు సభగావించి యాసభలో నీచిత్రపటమును ముందుగాఁ బ్రద ర్శించిరి. ఆసభకు, కాలేజీప్రిన్సిపాలుగారు సభాసనాధిపతులుగాను, శ్రీ కొండా వెంకటప్పయ్యపంతులుగారు పటప్రదర్శకులుగాను నుండిరి.

ఆసమయమునను రామయ్యపంతులుగారిని గుంటూరుపౌరులు స ప్పించి గౌరవించిరి. అపుడు శ్రీ కాశీవ్యాసాచార్యులుగారు పౌరులపక్ష మునఁ గొన్ని పద్యములం జదివిరి. స్థలాంతరమున వానిం జూడనగును.

తరువాత రామయ్యపంతులుగారిని బ్రశంసించుచు, శ్రీ కొత్తపల్లి సూర్యరావుగారు, కొమరవోలు వేంకటసుబ్బారావుగారు, బి. ఏ., నిడు దవోలు వేంకటరావుగారు, బి. ఏ., నల్లా చినరెడ్డినాయఁడుగారు, మోచ రాల సూర్యనారాయణశాస్త్రిగారును బద్యముల ను జదివిరి. అనంత రము సభాకార్యక్రమము ప్రారంభింపఁబడినది.

1. బులుసు వేంకటేశ్వరులుగారు, ఎం. ఏ., (కాకినాడ) ప్రస్తు తాంధ్రసారస్వతము, మతము, 2. శతావధాని దోమా వేంకటస్వామి గుప్తగారు, (చెన్నపురము) వైశ్యకవులు, 3 పిసుపాటి సుబ్రహ్మణ్యశాస్త్రి గారు (కాకినాడ) శబ్దార్థవ్యవహారము, 4. విద్వాన్ శ్రీమత్తిరుమల పెద్దిం టి రాఘవాచార్యులుగారు, తిక్కన అర్జునపాత్రమును బోషించిన విధము నను వ్యాసములం జదివిరి.

మధ్యాహ్నము రెండుగంటలకు శ్రీమహారాజావారు పరిషత్కార్యాలయము దర్శింప విచ్చేసిరి. పరిషద్భవనమును, పుస్తకభాండాగారమును, పరిషత్ప్రకటితగ్రంథములను జిత్తగించిరి. తాళపత్రగ్రంథములలో శ్రీతాళపత్రములపై వ్రాయఁబడిన పుస్తకములం గొన్నింటిని దిలకించిరి.

మూఁడుగంటలకు శ్రీ పిఠాపురరాజకళాశాలావిద్యార్థులు శ్రీవారికి సమ్మానపత్రముల నర్పించిరి. అనంతరము పరిషత్సభ ప్రారంభమైనది. శ్రీ పిసుపాటి చిదంబరశాస్త్రిగారు (శతావధానులు) ఆంధ్రసాహిత్యపరిషత్కృత్యములను గూర్చియు, విద్వాన్ పిసుపాటి విశ్వేశ్వరశాస్త్రిగారు ప్రశంసయనియుఁ బద్యములనుజదివిరి. పిఠాపురరాజకళాశాలాపండితులు విద్వాన్ కోపల్లెశివకామేశ్వరరావుగారు ప్రేమభావమునుగూర్చియుపన్యసించిరి. వఝ్ఝులసూర్యనారాయణగారు భారతమునఁ దమకుఁగల సందేహములవిషయమై తాము రచించిన గ్రంథమునుండి కొన్నిపద్యములం జదివిరి. జటావల్లభుల పురుషోత్తముగారు ఎం. ఏ. (కొవ్వూరు) నేటివాఙ్మయమున ననువాదముల ప్రాముఖ్యమునుగూర్చియు, నిడుదవోలు వేంకటరావుగారు, బి ఏ. (కాకినాడ) ఆంధ్రరాజకవులలో నగ్రగణ్యు లగు నన్నెచోడ శ్రీకృష్ణదేవరాయ రఘునాథరాయలను గూర్చి యుపన్యసించిరి. శ్రీ పిఠాపురకళాశాలావిద్యార్థిని శ్రీమతి తణికెళ్ల రాజేశ్వరమ్మగారు తిక్కన సోమయాజినిగూర్చి యొక చిన్నవ్యాసముం జదివిరి. శ్రీ జయంతి రామయ్యపంతులుగారు శ్రీ సూర్యరాయాంధ్రనిఘంటు నిర్మాణమునఁ దామొనర్చుచున్న ప్రయత్నమును బద్ధతిని గూర్చి సభవారికి విశదపఱచిరి. పోతుకుచ్చి సుబ్రహ్మణ్యశాస్త్రిగారు, పాణినీయము, కావ్యభాషనుగూర్చియు, పింజమూరి వరాహనరసింహాచార్యులుగారు జయదేవుఁడు, అష్టపదులు- అనువిషయముంగూర్చియు ముచ్చటించిరి.

ఆమహాసభలో ననంతర మీక్రిందితీర్మానములు చేయఁబడినవి.

౧. ఆంధ్రసాహిత్యపరిషత్పోషకులలో నొకరును, విద్యాభిమానులును వేంకటగిరిసంస్థానాధీశ్వరులును నగు శ్రీశ్రీశ్రీ రాజా వెలుగోటి గోవిందకృష్ణయాచేంద్రబహద్దరు మహారాజావారి నిర్యాణమునకు నీసభవారు తమ సంతాపమును దెలుపుచున్నారు.

౨. ఆంధ్రసాహిత్యపరిషత్తునకు యావజ్జీవసభ్యులు దివాన్ బహద్దరు సర్ మోచెర్ల రామచంద్రరావుపంతులవారి మరణమునకును, సారస్వతాభిమానులు, విమర్శాదర్శకులు శ్రీయుత నడకుదుటి వీరరాజు పంతులవారి మరణమునకు నీసభవారు చింతిల్లుచున్నారు.

3. శృంగారగ్రంథప్రకటనవిషయమున దొరతనమువారి నిషేధ పుటుత్తరువును దొలఁగించుట కీసభవారు కోరుచున్నారు.

౪. ఈపరిషత్తునకు ముఖ్యప్రతిష్ఠాపకులై, అనేకవిధముల పరిషత్తును బోషించుచున్న శ్రీ పీఠికాపురాధీశ్వరులగు శ్రీశ్రీశ్రీ మహారాజా రావు వేంకటకుమారమహీపతి సూర్యారావు బహద్దరువారికి పరిషత్తువారింద మూలమునఁ దమకృతజ్ఞతను దెలుపుచున్నారు.

౫. వేంకటగిరి సంస్థానాధీశ్వరులు, శ్రీశ్రీశ్రీ మహారాజా వెలుగోటి శ్రీ రాజగోపాలకృష్ణయాచేంద్రబహద్దరువారును బొబ్బిలిసంస్థానాధీశ్వరులయిన శ్రీ మహారాజా రావు శ్వేతాచలపతి వేంకటరంగారావు బహద్దరువారును, పరిషత్ప్రతిష్ఠాపకులుగా నుండి పరిషత్తున కొనరించిన మహోపకారమును కృతజ్ఞతాపూర్వకముగ స్మరించుచున్నారు.

౬. ఉద్ధారకులై, పరిషత్తునకు ధనసహాయ మొనరించిన ఉయ్యూరురాజావారగు శ్రీశ్రీశ్రీ రాజా వేంకటాద్రి అప్పారావుబహద్దరువారి కభినందనము లర్పించుచున్నారు.

౭. పరిషత్పోషకులుగా నుండి సహాయ మొనర్చిన భాషాభిమానుల కెల్లరకు నీపరిషత్తువారు కృతజ్ఞతాపూర్వకవందనము లర్పించుచున్నారు.

౮. పరిషత్కార్య మితోధికముగ నిర్విఘ్నముగా జరుగుటకై తగు మూలధనము, విశాలమగుభవనమును మిక్కిలి యావశ్యకములు. వీని సంపాదనకై భాషాభిమానులగు నుదారహృదయులు తోడ్పడవలె నని యీసభవారు కోరుచున్నారు.

౯. ఆంధ్రసాహిత్యపరిషత్కార్యముల నాదినుండియుఁ గడు దక్షతతో నిర్వహించుచు, సూర్యరాయాంధ్ర నిఘంటువును రచించుచు నాంధ్రభాషాసేవకే తమజీవితమును వినియోగించుచున్న శ్రీజయంతి

రామయ్యపంతులుగారి కాంధ్రవిశ్వకళాపరిషత్తువారు "ఆనరరీ డి. లిట్." పట్టము నొసంగి గౌరవింతురుగాక యని యీసభవారు కోరుచున్నారు.

సభాధ్యక్షులగు శ్రీ మహారాజులుగారు భాషకు నియమమావశ్యక మనియు, నేపదములను మనము స్వీకరించినను నట్టివానియం దేదేనియు నొకనియమ ముండి తీఱవలయు ననియు, నేఁటి వాఙ్మయమున వాడుచున్న పదజాలము వాఙ్మయాభివృద్ధి నొనర్ప దనియు నింక ననేకవిషయములతో నుపన్యాసముం గావించి సభనుముగించిరి.

కళాశాలాధ్యక్షు లగు శ్రీ పెద్దాడ రామస్వామి ఎం. ఏ. గారు-అధ్యక్షులకు నుపన్యాసకులకు సభవారికిఁ బరిషత్పక్షమున వందనము లర్పించిరి. ఆహ్వానసంఘకార్యదర్శులలో నొకరగు శ్రీ ప్రతివాదిభయంకరము పార్థసారథిగారు, కళాశాలాధికారులు, బాలభటసంఘము, రజతోత్సవసందర్భమున నొసరించిన సహాయమును బ్రశంసించిరి. మంగళగీతములతో సభపూర్తియైనది.

ఇట్టి మహాసభలో, పరిషత్ప్రతిష్ఠాపకు లగు శ్రీ పీఠికాపురము మహారాజులుగారు లేనిలోప మొక్కటితప్ప మఱి యితరలోపము లేవియుఁ గనఁబడలేదు. ఈవిషయము నందఱును బలుమాఱు ఉగ్గడించిరి.

శ్రీ పిఠాపురము మహారాజులు తమ కొసంగిన యాతిథ్యమును, మహారాజులు రైలుస్టేషనుకడ (తమయుత్తరభాషలో) పిఠా- యనఁగా మిఠాయియనియు, పుర- యనఁగాఁ బూర్ణమనియు శ్లేషించుచుఁ జక్కఁగఁ గొనియాడిరి.

కార్యదర్శులు శ్రీవారితో చామర్లకోటవఱకుఁ జని యనిపి సెలవుగొని తిరిగివచ్చిరి.

---

# స్వాగతము.

జయపురాధీశ్వరా ! మిత్రులార !

శ్రీ జయపురము మహారాజావారు కడు శ్రమను వహియించి యిచ్చటికి విచ్చేసినందులకు వారికి మీయాంద్రపక్షమున నభినందనము లర్పించుచున్నాను వీ రనేకభాషలలో విద్వాంసులును, గొప్పపండితులును, విద్యాపక్షపాతులు నైయున్నారు. ఆంధ్రవిశ్వకళాపరిషత్తున కుపాధ్యక్షులుగానుండి సంవత్సరమునకు లక్షరూప్యముల నొసంగుచు మనలను జాలం గృతజ్ఞులనుగాం జేసియున్నారు. ఇంకను బెక్కుసంస్థలకును, బీదలకును ధనసహాయముం జేయుచున్నారు. ఆంధ్రభోజుండను బిరుదము వీరి యెడ సార్థకతను గాంచియున్నది. సాహిత్యపరిషత్తును స్థాపించినది మొదలు దీనియందు వీరికి మిక్కిలి యభిమానము కలదు. కొన్నిసంవత్సరముల క్రితము వీరు కాకినాడ దయచేసియున్నారు. ఇపుడు మరల వచ్చినందులకు వారికి మనయభినందనముల నర్పింపవలసియున్నది.

ఆంధ్రసాహిత్యపరిషత్తునకు నిరువదియైదేండ్లు గడచినవి. రజతోత్సవము జరుగుచున్నది. ఈసందర్భమున శ్రీశ్రీ పీఠికాపురాధీశ్వరుల యౌదార్యాతిశయములచే నభివృద్ధిగాంచుచున్న పరిషత్తునకు వీ రగ్రాసనాధిపత్యము వహించుటయు, నీయుత్సవము శ్రీ పీఠికాపురప్రభువుల కళాశాలాభవనమున జరుగుటయు నానందదాయకము.

శ్రీశ్రీశ్రీ మహారాజావారికిని, రజతోత్సవమునకు విచ్చేసిన పండితబృందమునకును కాకినాడపౌరుల పక్షమున స్వాగత మొసంగుచు సభాధ్యక్షులుగానుండి సభాకార్యక్రమమును జయప్రదముగ నడపించుటకై శ్రీ మహారాజావారిని బ్రార్థించుచున్నాను.

ఇట్లు విధేయుండు,
దురిసేటి శేషగిరిరావు,
ఆహ్వానసంఘాధ్యక్షుండు.

# అధ్యక్షాభిభాషణము.

ఆర్యమహాశయులారా,

ఆంధ్రసాహిత్యపరిషత్తుయొక్క "సిల్వరుజూబిలీ"ని నెఱవేర్పసమావేశ మగు నీపండితపరిషదధ్యక్షతను నాకొసంగుటవలనఁ గృతజ్ఞతాసూచకముగాఁ దమకు నమస్కరించువాఁడను.

"జూబిలీ" యనునది యాంగ్లశబ్దము. ఏదేని యొకసంస్థ యేఁబది వత్సరములు నిలుచునేని తత్స్మరణార్థము సేయఁబడు నుత్సవ మని దాని యర్థము. ఏఁబదివత్సరములు దీర్ఘకాల మగుటవలనఁ దదర్థకాలమునందుఁ జేయఁబడు నుత్సవమునకు "సిల్వరుజూబిలీ" యనియు నేఁబదివత్సరకాలమునందుఁ జేయఁబడు నుత్సవమునకు "గోల్డెనుజూబిలీ" యనియు నఱువదివత్సరకాలమునందుఁ జేయఁబడు నుత్సవమునకు "డైమండుజూబిలీ" యనియు నాధునికులు నామకరణము సేసిరి. డెబ్బదివత్సరకాలమునందుఁ జేయఁబడు నుత్సవమునకు నామకరణము గావలసియున్నది. యుక్తములగు నాచారవ్యవహారములను జ్ఞానము నన్యదేశమునుండి గ్రహించుట సముచితమె.

ఆంధ్రసాహిత్యపరిషత్తు ప్రాచీనరచనలను నవీనరచనలను వెల్లడించుచు ముఖ్యముగా నాంధ్రసాహిత్యాభివృద్ధికొఱకు నిరువదియైదువత్సరములనుండి పాటుపడుచుండుటవలనఁ దత్స్మరణార్థ మీయుత్సవము సేయుట గడు సమంజసము.

ఆంధ్రసాహిత్యపరిషత్తుయొక్క వార్షికోత్సవములందు నధ్యక్షమహాశయులు నుడువవలసిన విషయములను సమగ్రముగా వెల్లడించి యుండుటవలన నేను దేనిని జెప్పఁబూనిన నది చర్వితచర్వణముగానె యుండును మఱియు నుపదేశసమయము గడచెను. ఇది కార్యాచరణసమయము. విషయ మందఱకును గోచరము. కార్యముమాత్రము సాగకున్నది. నిద్రించువారిని మేలుకొలుపనగును; కాని నిద్రించునట్లు నటించువారిని మేలుకొలుప శక్యము గాదుగదా. కనుక నుపన్యసించుట యనావశ్యక మని నమ్మిన నేనాచారము ననుసరించి కొన్నిమాటలను మాత్రమె నుడివెదను.

శ్రుతి స్మృతిశాస్త్రపురాణేతిహాససహిత మగు నది సాహిత్య మని పూర్వపండితులయాశయము. కనుకఁ గొన్నిపురాణములును ప్రబంధములును ఖండకావ్యములును నవలలును నాటకములును చిట్టకథలును గల వర్తమానాంధ్రసాహిత్యము పూర్ణాంగముగలదియన వలనుపడదు. పండితులు శాస్త్రాదుల నాంధ్రమునందు రచించికాని, యనువదించి కాని దానిని బూరింపవలెను.

నాగరకతకుఁ బ్రధానలక్షణము నియమ మగుటవలన నాగరుల భాష నియమబద్ధమయి యుండవలెను. ఇప్పటి యాంధ్రవ్యాకరణము లసంపూర్ణములగుటవలన భాషాభిమానముగల పండితు లొకపరిషత్తుగా నేర్పడి యొకవ్యాకరణమును రచింపవలెను. దానిననుసరించియె కవులు గ్రంథములను రచించుచుండవలెను. అట్టిగ్రంథములనె జను లాదరించుచుండవలెను. "ఆపరితోషా ద్విదుషాం న సాధు మన్యే ప్రయోగవిజ్ఞానమ్," అను కాళిదాసమహాకవివాక్యమును గవులు నిజమనములందు నుంచవలెను. మఱియును గవులు పామరామోదముకొఱకును గేవల ధనార్జనముకొఱకును బ్రతీక్షించి యనియమభాషతో నసత్కావ్యములను రచించుటయు నట్టివానిని బ్రకాశకులు ప్రకటించుటయును గర్హితకార్యములు. అట్టి రచనలవలన నాంధ్రభారతి పాండురోగిణియె యగును; కాని సుస్థాంగకములతో బలుపుగలది గాఁజాలదు.

ఇప్పటి వ్యవహారమునుబట్టి కొన్ని యన్యదేశ్యశబ్దచయమును యథారూపముగానే యాంధ్రమునందు వాడవలెను. దానియనువాదము సరియగుభావమును బోధింపదు. ఉదాహరణము:—జడ్జియను శబ్దమును న్యాయాధిపతి లేక న్యాయాధికారి యని వాడినచో, విలేజిమునిసిఫా, సబుమేజిస్ట్రీటా, డిప్యూటికలక్టరా, కలక్టరా, డిస్ట్రిక్టుమునిసిఫా, జడ్జియా యనుసందేహము దోఁచును. కనుక జడ్జియని వాడుటయె సముంజసము. అన్యదేశ్య శబ్దగ్రహణము పూర్వపండిత సమ్మతము. అట్లని స్వభాషాప్రచారితశబ్దములకు మాఱుగా నన్యభాషాశబ్దముల నెప్పుడును వాడరాదు.

ఇప్పటి విమర్శనములు ప్రాయశః శాస్త్రజ్ఞానమును భాషాజ్ఞానమును లేనివారిచేతనె చేయఁబడుచున్నవి. అవి దోషారోపణముతోడ నసభ్యభావ గలిగి కవిదూషణముతోడను బూరితములు. పండితులు గుణదోషములను లెస్సగా వెల్లడించి భావికవులకు మార్గప్రదర్శకములుగా నుండునట్లు చక్కని విమర్శనములను బ్రకటింపవలెను. విమర్శనములు సాహిత్యమున కెంతయు నావశ్యకములు. ప్రత్యేకపత్రికాప్రకాశకుఁడును లేకరియును విమర్శకస్థానము నాక్రమించుట దుఃఖకరవిషయము.

వార్తాపత్రికలును నాటకములును సాధారణజనజ్ఞానాభివృద్ధికి సహకారులు. అట్లుండ మనవార్తాపత్రికలలోఁ గొన్ని పొటయందుఁ బాఱవేయఁదగు కాగితములతోడ, నంటియు నంటని సొట్టయక్షరములతోడను గుత్సితపదములతోడను బయలువెడలుచున్నవి. వాని సంపాదకులు విద్యాధికులు గారు వానియందలి కొన్నిశబ్దము లర్థశూన్యములు; సమాసములు వికృతములు. ధనాకర్షణమె వానిలక్ష్యము. అవి వానకారునఁ బుట్టు పుట్టగొడుగులువోలెఁ బెచ్చుగాఁ బెరుఁగుచు సామాన్యజనుల భాషాజ్ఞానమును జెఱచుచుండుటవలన వాని నాదరింపఁజనదు.

మనదేశమునందు నాటకములు దఱుఁగుచుఁ జలచ్చిత్రములు పెరుఁగుచున్నవి. వానియందు నేపథ్యము సమయోచితముగా నుండదు; సంవాదము యుక్తముగా నుండదు; మీఁదుమిక్కిలి కొన్ని యశ్లీలచేష్టలు గానవచ్చెడు. కనుక నవి సంస్కరింపఁబడవలెను.

మహాశయులారా! కొన్నిమాటలనె నుడివెద నని చెప్పి పెక్కుమాటలను నుడివితిని. అవి యప్రియసత్యము లని యెఱింగియును వానిని నాగర్భమునందె జీర్ణింపఁజేసికొనుట కిచ్చగింపక తమకు విన్నవించితిని. నాయీ కోర్కులలోఁ గొన్ని యైనను నెఱవేర్పఁబడు నేని ధన్యతను గాంతును.

ఇట్లు,
విబుధవిధేయుఁడు,
శ్రీవిక్రమదేవవర్మ.

# పారితోషికపద్యరత్నావళిః.

శ్లో. యం భూపాలం విమలయశసం సంశ్రితా రాజ్యలక్ష్మీః
యద్రాజ్యే చ ప్రకటిత మభూ త్పాలనం ప్రేమపూర్ణమ్
యస్యాస్థానే బుధకవిగణాః సాదరం పూజితాః స్యుః
పాయా న్నిత్యం జయపురవిభుం విక్రమాఖ్యం త మీశః. 1

శ్లో. భూపాలేషు య మాహు రేక మవనే ప్రాజ్ఞం ప్రభుం పండితం
సాహిత్యేపి య మామనన్తి విబుధాః సామ్రాట్పదాలఙ్కృతమ్
షడ్భాషాసు విశారదం య మనఘం శంసన్తి శ్లాఘ్యాశయం
భూయా దాశ్రితకల్పకో మృదుగిరః శ్రీవిక్రమేన్ద్ర శ్చిరమ్. 2

శ్లో. పూర్వాం కాష్ఠాం దినమణి రసౌ పశ్చిమాం చాపి నిత్యం
పూర్ణానంద శ్చరతి వసుమా న్నేక్షతే దేశభేదమ్
తద్వ చ్ఛ్రీమాం స్త్రినగవసుధా ముత్కలాం చాపి ధాత్రీం
తుల్యప్రేమ్ణా జయపురనృపః సాదరం ప్రేక్షతే హా. 3

శ్లో. సకలదురితహన్త్రీ జ్ఞానదా జహ్నుపుత్త్రీ
కువలయదళనీలా పావనా సూర్యకన్యా
మిళితరసగతీ తేవార్యగేయే ప్రయాగే
జయపురనృపచన్ద్రే సఙ్గతే చోత్కలాన్ధ్రే. 4

శ్లో. భృఙ్గాణాం నినదై ర్యథాతిసుభగం పద్మాకరం భాస్కరః
తారాణాం సమితిం యథా హిమకరః సన్తోషయ త్యాదరాత్
ఏవం శ్రీ జయపూర్నృపాలతిలకో మోదం విధత్తే ధునా
వః సాహిత్యసభాసదాం హి విదుషా మధ్యక్షభా గ్గీనిధిః. 5

శ్లో. కిం తస్య జన్మనా యేన నాదరం పూజితే ఉభే
స్వభాషా స్వీయమాతా చ కీర్తిసంపన్ముదావహే. 6

శ్లో. పూజ్యా మాతా వినయమధురైః సేవనై రార్యపుత్త్రైః
వన్ద్యా వాణీ సకలశుభదా స్వీయదేశాభిరామా

మాతా జన్తో ర్ముదితహృదయా సర్వసౌఖ్యం విధత్తే
స్వీయా భాషా విమలయశసం పూరుషం సా హి కుర్యాత్. 7

శ్లో. యోదితా నన్నయార్యాబ్ధేః చన్ద్రికేవ సుధానిధేః
భావగామ్భీర్యసమ్పన్నా పాతు సా భారతీసుధా. 8

శ్లో. భో విద్వాంసో విమలచరితాః సర్వతన్త్రస్వతన్త్రాః
హే కవ్యాద్యా మధురకవితాసృష్టిదక్షాః ప్రసిద్ధాః
భో భూపాలా వితరణచణా యేపి భాషానురక్తాః
ఆతిథ్యం నః సదయహృదయా శ్చానుగృహ్ణన్తు సర్వే. 9

ఏవం విబుధవిధేయః
సుబ్బయ్యానామధేయః.

## శ్రీశ్రీ పిఠాపురమహారాజప్రశంస.

గీ. జయము శ్రీరావువంశప్రశస్తమణికి
జయము శ్రీసూర్యరాయభూజానిమణికి
జయము తత్పుత్రయుగళికి జయము పీఠ
పురమహారాజ్యలక్ష్మికిఁ బురికిజయము.

శా. లేరే రాజులు సూర్యరాయనృపమౌళిం బోలువా రెందఱో
యేరీ యిట్టి జగత్ప్రసిద్ధ పరిషత్సృష్టిన్ యశం బందువా
రేరీ యీకరమిచ్చు దాన మితరం బింతైన గుర్తింపఁగాఁ
బో రాకుండఁగఁ దేవతేవ లొసఁగం బోషింప దక్షుల్ మహిన్.

ఉ. ఏరు సమర్థు లీ కలిని నిచ్చితినన్నను బుచ్చుకొంటిన
న్వారలెకాని నిస్పృహత స్వార్థపరచ్యుతి నాంధ్రభాషకుం
జేసుగడించుకోశమును బెక్కుసమ ల్బహుపండితాళి స
త్కారపురస్సరంబుగఁ బ్రకాశ మొనర్పఁగ బద్ధకంకణుల్.

చ. అరయఁగ రావు రావుమహిపాగ్ర్యమహాప్రభు గుప్తదానముల్
దురితభయుండు పోషితబుధుం డొనరించెడు మేళ్లు మించి త
త్పరిణతకార్యరూపమును బట్టి గ్రహింతురు లోకు లాతనిం
జిరముగ దివ్వెమెత్తి నతి చేయక యుండఁగఁ జెల్ల దాంధ్రికిన్.

శా. ఆవిద్యాదృతి యాబుధావనము నయ్యార్యానుకూలత్వ మా
సేవిత్రాతకృపార్ద్రదృష్టి కృపణశ్రేణీతృణీకార మా
శావైరాగ్య మనాథదీనజనరక్షాదీక్ష నిర్గర్వముం
భూవిస్తారయశుండు సూర్యనృపుఁ డెప్డుం బొంది దీపించెడుం.

ఉ. ఈరజతోత్సవప్రభయు నీమహనీయసభావినోదముల్
శ్రీరమణుండు రావునృపశేఖరు పెట్టినభిక్షగా దొకో
సారభుజాబలంబు పరిషద్భర మోపి వహింపఁ గోర్చు వాఁ
డీరహిరావుసూర్యనృపు నెంచుట దుర్లభ మాంధ్రవాణికిన్.

క్రొత్తపల్లి సూర్యరావు.

## శ్రీ శ్రీ జయపురమహారాజప్రశంస.

ఉ. శ్రీ, విభవంబు, ప్రాభవ, మశేషమసీమ, యుదారగౌరవం,
బీవి, దయాంతరంగము, సమిద్ధబుధావనవిక్రమంబులుం
శ్రీవిభుఁ డాత్రివిక్రమవశీకృతలోకుఁడు విక్రమాంకయు
గ్దేవున కిచ్చి ప్రోచుత స్వకీయగుణాదృతి నెల్లకాలముం.

చ. క్షమ కరుణించి శాంతి, యుదకంబు గభీరత చేర్చి, వహ్ని తే
జము దయచేసి, మారుతము సత్త్వము గూరిచి, మి న్నమున్నత
త్వము నిడి, సర్వభూతహితవర్తను బ్రోచుత నిన్ను నెప్పుడుం
విమలదయాంతరంగయుత విక్రమదేవధరాపురందరా.

చ. సతులపతివ్రతామహిమ, సజ్జనసౌహృదవృత్తి, సత్కవి
స్తుతబహుకార్యసారసుధ, కేవలసాధుకృతాశిషంబు, బం
ధుతతిప్రమోద, మాప్తజనతుష్టి నితాంతము మీకొసంగు ను
న్నతి జయపూర్మహాప్రభు ! ఘనా ! జయ ! విక్రమదేవ సన్మతీ !

చ. ఎనిమిదిదిక్కులుం గరులు నేడునగంబులు నేడుదీవు లం
బునిధులు నాదికూర్మ మహి పోత్రి మహి న్వహియించు నేర్పు నీ
ఘనతరబాహుసంస్థితముగా నొనరించునుగాత నిచ్చలుం
వినయకళాకలాప పృథివీవసురాధిప సజ్జనావనా.

ఉ. ఆర్గురుచక్రవర్తులుఁ బదార్గురుభూవలయాధినాయకుల్
భార్గవగీష్పతిప్రముఖభాసురమంత్రులు నీతిశాస్త్రకృ
ద్వర్గము వేదవేదులు ముదంబున విక్రమదేవవర్మ స
న్మార్గమహీప్రజావనసమర్థుని నిన్నొనరింతు రాదృతిన్. ౫

ఉ. భోజునిజూడఁగాఁ గవిత పుట్టె నటం చని రాయ్య లోమహా
రాజ! యసాక్షికం బది కరం బిపు డద్భుతసాక్ష్యమాచుఁ ద
ద్భోజనిభుండ వైన నిను బుద్ధిఁదలంచి వఁ బుట్టుచుండె నా
యోజ నిరక్షరాస్యులకు నుత్సుకతం గవితావినోదముల్. ౬

క్రొత్తపల్లి సూర్యరావు.

## స్వాగతము.

వింజమూరి వేంకటలక్ష్మీనరసింహ రావుగారు.

సీ. బహుకావ్యరససుధాపానానఁ దనిసిన
మహితసాహిత్య సమ్రాట్టులార!
సకలశాస్త్రనికరసాగరోత్తరణంబుఁ
గాంచిన విబుధప్రకాండులార!
సరసప్రబంధరచనల బాహ్యాప్రపం
చము మఱచు కవీంద్రచంద్రులార!
కావ్యదధిమథనకార్యాల నిపుణులౌ
విమలవిమర్శనవేత్తలార!
ఆంధ్రభారతీపాద భక్తాగ్రగణ్యు
లార! సువిశాలమార్గవిస్ఫారితంబు
నఖిలసౌఖ్యాలయంబు, వాయసపురంబు;
అందుఁ డియ్యెడమాసల్పు స్వాగతంబు! ౧

సీ. ఆంధ్రవిశ్వకళాలయపరిషద్రమణిని
బోషించుచేలెడు భూధవుండు
ప్రథిత "రాధామాధవ" కృతినొనర్చి "యాం
ధ్రజయదే" వాఖ్యకుం దగెడుతేఁడు

బహుకృతికర్తయై భర్తయై, "సాహిత్య
సమ్రా"ట్టనంగ నెసంగుసామి
సకలనూతనకళానికరపోషకుఁడై "క
ళాచార్య" బిరుదంబు నందునృపుఁడు
జయపురాధిపశ్రేష్ఠుండు సర్వసుగుణ
భూషణుండు, విక్రమదేవ భూమిభుండు
సభకు నధ్యక్షుఁడౌ టదృష్టంబుగాదె?
ఆమహారాజమౌళికి స్వాగతంబు! ౨

సీ. అనవరతప్రవాహాంచితస్వచ్ఛధా
రావిశిష్టవిమలజీవనంబు
బహుసుమనస్తోత్రపాత్రతాశోభిత
స్వర్ణాంబుజాదికసంయుతంబు
ఆత్మపూతప్రవాహప్లావితానేక
విబుధకోటీముక్తి విస్తరంబు
అతిమనోహరరూపకాధికదీపకా
లంకారసంశోభితాంకపాళి
సరసగీర్వాణగంగ; తత్ సారమెల్ల
నాంధ్రభూమిని విరివిగా వ్యాప్తిఁజేయు
సూర్యరాయభగీరథక్షోణివిభుఁడు
చేసిన మహాప్రయత్నముల్ సిద్ధిఁగాంచె. 3

చ. అరుదగ మాధరాధిపతి మొదట నిల్పిన యాంధ్రసాహితీ
పాదపదగంబు కావ్యసుమపంక్తుల నెన్నియొ వెల్వరించి యీ
యిరువదియైదువత్సరము లెంతొ ప్రమోదముఁ గూర్చి మించె, సు
స్థిరయశ మాంధ్రవాణి కిలఁ జేకుఱఁ జేసె విశాలశాఖలన్. ౪

సీ. అత్యమూల్యపదరత్నాకరంబౌ సూర్య
రాయనిఘంటువుం బ్రచురపఱచి

ధాత్ర్యంతరస్థాపితములౌ ప్రబంధాల
వెల్గులోనికిఁ దెచ్చివెల్వరించి
కమలాకటాక్ష భాగ్యంబుఁ గాంచని కవి
పండితకోటి కుపాధి నిచ్చి
ఆత్మాశ్రితాళి విద్యార్థిపాళికి సదా
విద్యాప్రదానంబు వేడ్క సల్పి
చతురమైన యాంధ్రసాహిత్యపరిషద్ర
మణికి విక్రమక్ష్మాధవుండు
నిండుపూన్కిఁ జేయు వెండిపండువునందు
నాట్యమాడు వాణి! నలువరాణి!

---

రజతోత్సవసందర్భమున బంపఁబడిన సందేశములు కొన్ని యిట జేర్పఁబడినవి.

(1) శ్రీయుత కట్టమంచి రామలింగారెడ్డిగారు ఆంధ్రవిశ్వవిద్యాలయోపాధ్యక్షులు, వాల్తేరు.

'I take this opportunity to congratulate the Parishat on the splendid career which it has had so far and to thank those who have been instrumental in making it the success it has been. And I trust that its future will be more glorious than its past.

The Academy is doing most useful work. It was started at a time when an organisation of its type had become a necessity for the Andhra Language.

You have chosen the right man to be the President on this auspicious occasion. As Patron of Literature, Scholar, Poet and a man of noble simplicity of life and universal benevolence, the Maharajah Saheb of Jeypore holds a place unique in the annals of South India. Please convey to him my respectful compliments. I congratulate the Parishat for getting him to preside.'

[ఈ పరిషత్తు భాషాభివృద్ధి కట్టిసంఘము లత్యావశ్యకములగుసమయమున స్థాపింపఁబడి నాఁటినుండియు నాంధ్రభాషకు మిక్కిలి యుపయోగకరమగు సేవ యొనర్చుచున్నది. నేనీసందర్భమున దాని మహోత్కృష్టమగు జీవితమును, అందులకు గారణభూతు లగు నుదారపురు

షులను బ్రశంసించి, యది యితోధికముగఁ బ్రశంసాపాత్రమై వర్ధిలుగాక
యని యాశించుచున్నాను.

ఈ యుత్సవసందర్భమున భాషాపోషకులును, విద్వాంసులును,
కవులును, త్యాగశీలురును, నిగర్వులు, సరళస్వభావులు నగు జయపుర
ధీశ్వరు లధ్యక్షతను వహించుట గడు సమంజసము. నేటి దక్షిణహిందూ
స్థానచరిత్రమున వీరత్యున్నతస్థానము నాక్రమింతు రనుట నిస్సందేహము.
వారికి నా వందనములు. అట్టి మహాపురుషు నధ్యక్షునిగాఁ బడసినందుకు
పరిషత్తును ధన్యతను గాంచినది.]

(2) ప్రొఫెసరు కె. ఎ. నీలకంఠశాస్త్రిగారు, మదరాసు విశ్వ
విద్యాలయచారిత్రోపన్యాసకులు.

'While expressing my regret at my inability to avail myself of the invitation and go over to Cocanada, for the occasion, I wish to congratulate you on the excellent work so steadily carried out by the Parishat all these years. Its Journal has rightly taken its place among the inp rtant Research Journals of our Counrty and I wish the Jubilee functi on great success and the Parishat itself a long and glorious career of service to learning and research.'

[తమ యాహ్వానము నంగీకరించి రాజాలనందులకుఁ జింతిల్లుచు
బరిషత్తు ఇన్నిసంవత్సరములనుండియుఁ జేయుచున్న కృషి నభినందించు
చున్నాను పరిషత్పత్రిక మనదేశమునఁ గల ముఖ్యపరిశోధనాపత్రికలలో
నొకటియైయున్నది. రజతోత్సవము నిర్విఘ్నముగ జరుగుఁగాక. పరిషత్తు
కను భాషాభివృద్ధి పరిశోధనల కృషిని సల్పి ప్రఖ్యాతిని బొందుఁగాక.]

(3) కిర్లంపూడి, ధారాకోట, పర్లాకిమిడి, సంస్థానాధీశ్వరులు సభకు
రాఁజాలకపోయితిమని రజతోత్సవము జయప్రదముగ జరుగుటకై తమ
యాశీస్సులను బంపిరి. మిథిక్‌సొసైటీ, బెంగుళూరు, కన్నడ సాహిత్య
పరిషత్తు, కామా ఓరియంటలు యిన్‌స్టిట్యూటు, మున్నగు సంస్థలు తమ
యభినందనములను బంపినవి. మ.రా.శ్రీ ప్రభల లక్ష్మీనరసింహము పంతు
లుగారు, బుర్రా శేషగిరిరావుపంతులుగారు, డాక్టరు డి. వి. సుబ్బారెడ్డి
గారు, వడ్డాదిసుబ్బరాయకవిగారు, మున్నగువారుపరిషదభివృద్ధినిగోరుచు
లేఖలను వ్రాసిరి.

శ్రీజయంతి రామయ్య పంతులుగారికి గుంటూరి పౌరులు సమర్పించిన

## వినుతిపత్రము.

శ్లో. జయ త్వనవ్యాప్తకళాభిరామః జయ త్వవాప్తైహికసర్వకామః
జయ త్వశేషప్రతివాదిభీమః జయంతి రామ స్సుగుణాబ్ధిసోమః.

చ. సరసత, శాస్త్రవేత్తృత, రసజ్ఞత, విజ్ఞత, వాగ్విహారని
ర్భరత, పరేంగితజ్ఞత, శుభంయుత, పూజ్యత, ధర్మకర్మత
త్పరత, దురుద్ధరార్థత్వ, ప్రధానత మున్నగు నీ పరశ్శతా
క్షరగుణముల్ ప్రశంస్యము; లెసంగునె రామయసూరి! యేరికేన్?

సీ. అకలంకసుగుణరత్నాపూర్ణమణిపేటి
నానార్థిబృందమందారవాటి
బహుకళావిభవప్రభావాప్తసితకీర్తి
ధర్మసిద్ధాంతావతారమూర్తి
ప్రకటప్రబంధనిర్మాతృవిద్వన్మాళి
న్యాయతంత్రార్థవిజ్ఞానశాలి
ఆంధ్రసారస్వతోద్యత్సంసమున్నేత
ప్రాచీనకావ్యసంపత్ప్రసూత
వైదికవ్యావహారికోభయబలాభి
రాముఁ డాంధ్రోక్తిసారసర్వస్వవేత్త;
యగుచు నలరు జయంతివంశాబ్ధివిధుఁడు
ప్రాజ్ఞచాతకఘనుఁడు శ్రీరామబుధుఁడు.

మ. పరవాగ్వశ్యులు మాతృభారతిని నిర్బంధించి, తత్పావనా
క్షరసంస్కారగతు ల్గలంచి, దురవస్థం గూర్చుచున్నంత, ని
ర్భరతన్ వారని యుష్మదుక్తిశితశస్త్రశ్రేణులం జేసి, ది
క్కృతి పోంద్రోయవె శ్రీజయంతి జయరామార్యా! యవార్యక్రియా.

సీ. చతురాననత్వంబుసాటి పల్కులచాన
దలవాకిటనె నిల్వఁగలిగినావు

అతుల 'శిరస్థదా' రాదిపదవు లంది
మాహేశసంపత్తి మసలినావు
సత్యసంగరసముత్సాహంబు నెలకొల్పి
భీష్మప్రతిజ్ఞచే వెలసినావు
నిస్తులతరకోశనిర్మాత వై రాజ
రాజసఖత్వ మేర్పఱిచినావు
మహిత! నీదివ్యరామనామంబు జగతి
సార్థకముగాఁగ సర్వరంజకుఁడ వగుచుఁ
గీర్తిచంద్రిక దిక్తటిఁ గీలుకొల్పి
యలరుచుంటి జయంతి రామార్యవర్య!

శా. ఆవేగంబున గర్జ సేయు కవిసింహద్వంద్వముం దేర్చి, స
ద్భావవ్యాకృతిఁ గట్టిగట్టి తుభయార్థత్యాగంబు శాంతింపఁ; బ్ర
జ్ఞావాచస్పతి వీవు; నీ పలుకు వ్యాసప్రోక్త మంత్రావళిన్;
నీ విద్వత్తకియత్త యున్నదె? జయంతిఖ్యాతరామాగ్రణీ!

## శ్రీ జయంతి రామయార్య ప్రశంస.

చ. కులపతివైతి పీఠపురికుంభినినాథునిపాఠశాలశి
ష్యులకును ద్వద్గురుత్వమున నున్నతికెక్కిరి పెక్కు రల్లవా
రలు ప్రకటింత్రు నీదయిన ప్రజ్ఞను బోధకశక్తి దానఁ బే
రొలసితి వోజ్జబంతివయి యొజ్జలబంతిని రామపండితా.

ఉ. నీపరిమర్శ్రప్రతిష్ఠఁగని నిచ్చలు నేఁటి కిసుళ్ళరీతి నె
న్నోపరిషత్తులర్థమును నుండని వృద్ధిని మందుచుండుఁ బో
నీ పరిమర్శనంగ నొక మెచ్చగుపండితమండలం బటం
చోపి గ్రహించె లోక మని యొప్పికొనం దగు రామధీమణీ.

ఉ. నీకవనంబు నీధిషణ నీసుముఖత్వము నీప్రభుత్వముర్
నీకమనీయరూపము ననిందితలోకహితార్థచింత యే
వీకలవే మహోన్నతికి నిన్నియు నుండిన నిస్పృహత్వము
న్నే కలికాలచర్యలకు నెక్కడిమాటది రామపండితా.

మ. ఒకచేచాలును నీవొనర్చినది గ్రామ్యుల్గొంద ఆంధ్రంబు వా
డుకలో నున్నయసంస్కృతంబె తగియుండన్ శాస్త్రమర్యాద లే
టికటంచు న్సభకెక్కి నాడుసలుపన్ డీకొంటి సత్పండిత
ప్రకరంబుం గొని వారిపైఁ; బ్రభులు నీపక్షైరిగా పండితా.

ఉ. మాటకుఁ దప్పులేక, మనమాటయె వేద మటంచు గ్రామ్యభా
షాటన మాచరించియును నయ్యది తప్పుగఁ దోఁచి వారలే
మాటమెలంకువ ల్గనుచు మార్చిరి దానిని వ్యావహారికా
ర్భాటముగాఁగ వీరలటె పాణిను లాంధ్రికి రామపండితా.

ఉ. నీవొనరించుమేలు నవని న్స్వభాషకుఁ జేయనేర్చునే
యేవిభుఁ డేకవీశ్వరుఁడు నింతటిదాఁకను నిన్నుఁగాంచి కా
దే వెలి కేఁగుదెంచెదరు ధీరులుగాకయు మేము మేమటం
చీపటు లెవ్వరోయి యనపేక్ష నొనర్పఁగ రామపండితా.

ఉ. మును పెనుమూలలం దడఁగి మూర్ఛిలియున్నపురాతనాశ్మశా
సనలిపిభారతిం దెలిపి సత్సభల న్వెలయంగఁజేసి యం
జనమిడి కోలుపోయిన ప్రశస్తకవిప్రభుదాతృవాగ్ధనం
బును దెలిపించి తాఁగతి యపూర్వముగాదొకో రామధీమణీ.

మ. అపరాధోచితదండమొండవయి న్యాయాలోచన న్వీఁడు యూ
రపు వాఁ డీతఁడు హైందవుం డనవు చిత్రం బౌర ! యాదండితుం
డెపుడున్ మైత్రిఘటించు నీ కదిగదోయీ తెచ్చెఁ బ్రఖ్యాతి యీ
విపులోర్వీతలి దానికంటె బిరుదుల్ వేయెక్కుడా పండితా.

మ. ఇపు డన్నన్ రుచిగాదుగాని సకలోర్వీశాధిరాణ్మౌళివా
రశరప్రజ్వలరత్నభాస్వరపదప్రాంతుండ వన్నన్ బలే
రపమా, రాష్ట్రనృపాలురెల్లరు భవత్ప్రజ్ఞాజ్ఞమన్నింపరే
యుపమాతీతనృపప్రభుత్వరచితోద్యోగాంక రామప్రభూ.

క్రొత్తపల్లి సూర్యరావు.

# ఆంధ్రసాహిత్యపరిషత్తు.

## (1) వెండిపండుగ.

నిడుదవోలు వేంకటరావుగారు బి. ఏ.

మ. సరసోదారవచఃప్రసూనములఁ బూజల్సేయ విద్వత్కవీ
శ్వరు లాసూర్యనృపాలవిక్రమమహీశశ్రేష్ఠు లానందని
ర్భరులై యంకనసేయ, రామబుధసంభావ్యంబు నౌ సాహితీ
పరిషత్పీఠి నాంధ్రవాణి! కొలువై భాసిల్లు మెల్లప్పుడున్.

సీ. తీరుతీయంబులై తేటతెల్లంబులై
చెలువారు తెల్గుపల్కులమెఱుంగు
నాణిముత్తెంబులై యపరంజిమువ్వలై
కనుపట్టు వ్రాల చొక్కపుమెఱుంగు
నుడిపోనినుడువులై గడిపోసబిగువులై
పోఁడిమినించు కూర్పులబెడంగుఁ
జనువులకుదురులై చతురుల కిరవులై
పాటిల్లు తొంటికబ్బపుమెఱుంగుఁ
దెలుఁగువారికిఁ బరిషత్తు తెలుప నిలిచి
యిరువదైదేండ్లనుండియు నెన్నిక యగు
నూడిగము సల్పె; పేర్కెక్కె నేఁడుగాదె
వెండిపండువు; వెండియుఁ బండు వీట్లు
వెలయు నది పసిఁడిపండువై యలరుఁగాత!

ఉ. భూనుత మాంధ్రి చేసికొనుపున్నెపుఁబ్రోవు నృపాలమాత్రుఁడే
దీనజనార్తికోటులకు దేవుఁ డితఁడు మనుష్యమాత్రుఁడే
కానఁగ నంచు సత్కవినికాయము సంస్తుతిసేయు నెప్పుడున్
మానిత రావు వేంకటకుమారమహీపతి సూర్యరాయనిన్.

గీ. సాహితీపరిషన్మహోత్సవమునకును
సాహితీసమరాంగణసార్వభౌముఁ
డై నవిక్రమదేవుఁ డధ్యక్షుఁ డగుచు

గౌరవ మొసర్చి ధన్యతగాఁగ మహాము
సహజ మదిగాదె నృపవంశసంభవులకు.
గీ. సాహితీపరిషత్తుకు జయము జయము
జయ మగుఁనుగాక తత్ప్రతిష్ఠాపకులకు
గీతి సాహితీరీతిని ఖ్యాతిఁజెందు
నాంధ్రభారతికిని జయం బహరహంబు.

(౭) శ్రీజయంతి రామయపంతులవారి ప్రశంస.

గీ. సాహితీపరిషన్మహోత్సవమునందుఁ
బూజ్యుఁడు జయంతి రామయబుధవరేణ్యు
వర్ణచిత్రసమర్పణ భావ్యమె కద
యాంధ్రపరిషత్తుపిఁ యతఁడైనకతన.
సీ. స్థాపించితివి యాంధ్రసాహితీపరిషత్తు భాషావధూటికిఁ బ్రాపుగాఁగ
వెలయించితివి సూర్యవిభుదయచే విపు లాంధ్రశబ్దైకబృహన్నిఘంటు
ప్రకటించి తెన్నేని ప్రాచీనలిపియుక్త శాసనావళిని నిస్సంశయముగ
నాంధ్రీకరించితి వమరక ముత్తర రామచరిత్రంబు రమ్యఫణితి
చంపురామాయణంబు సజ్జనులుమెచ్చ
దొరతనంబున నున్నతోద్యోగి వయ్యు
మాతృభాషాభిమాని వై మనెడు నీకు
నహరహంబును జయము రామయసుధీంద్ర !
గీ. సరసకవిత విచక్షణశక్తి గలుగు
నాంధ్రవిద్వాంసులకు మేఁటి వైనకతన
నీయభిప్రాయముద్ర వర్జితము గాని
గ్రంథ మేదేని తెనుఁగునఁ గానఁబడదు.
గీ. దేశభాషాచరిత్రంబు తేటపఱుచు
శాసనజ్ఞుల కీ వనుశాసకుఁడవు
ప్రథితపరిశోధకాచార్యపదవిగనుము
భవ్యగుణసాంద్ర ! రామయపండితేంద్ర !
క. శ్రీమహిజాధవుఁడో ముని, రామయసౌఖ్యంబు నాయురభ్యుదయంబుల్
ప్రేమంబుననొసఁగుచుమా, రామయవిబుధేంద్రు నెపుడు రాజితలీలన్.

# అభినవభారతి.

— విద్వాన్ కాశీ వ్యాసాచార్యులుగారు —

ఉత్పలమాల.

శాసనకర్త లై నన్నృపసత్తము లెల్లరుఁ దొల్లి, యాత్మ సం
తోసముతోడ రాజ్యరమతో సరిగాఁగఁ బరిగ్రహించి భా
షాసతిఁ గూడఁ బెంచిరి; విచారణకర్తలు వార లుండ సం
త్రాసము వాసి భారతియు రమ్యతరాద్భుతహావభావ చే
ష్టాసముదీర్ణయై, నిజవచస్సుధ లొల్కఁగ దివ్యపాదవి
న్యాసములం జరించెఁ జతురాననహర్మ్యతలంబులందె; నాఁ
డా సతిఁ గాంచుటే ఘనులకైనను దుర్ఘట మౌచుఁ దోఁచెఁ; గా
నీ సిరి డిందెనో! యిపుడిఁ కేమని తెల్పెదఁ, దొంటికీర్తి వి
న్యాసము జాఱెఁ, గాలగతి యంతయు మాఱె, స్వరాజవర్గ మా
వాసవుఁ జేరె, నన్యనరపాలురపాలన మీఱె, దేశభా
షాసతి నిద్రఁ గూరె, నను శాసకు లెవ్వరు లేరటన్న వి
శ్వాసముతోడ నెవ్వనికి వాఁడె కవీంద్రపదంబుఁ గాంచు పే
రాసదినంబు పుట్ట 'బళిరా! యదె భారతి చిక్కెఁ జిక్కె'నం
చాసతి కేలు బల్మిఁ గొని "యాఁగుమిపీ! యెట కేఁగు దిక ? నీ
వీసరి కొక్కపండితుల నే వరియించెద నన్నయట్టి యా
బాసలు మాను మింక, భయభక్తుల మాకయిఁ బట్టు మింక" నం
చాసురభావమూని వికటార్భటి లాగఁగఁ, బాప మర్కటా!
యా సతి మేనఁ దాల్చిన మహార్హవిభూషలు జాఱెఁ, బాదవి
న్యాసము మాఱెఁ, వాక్యములయందునఁ దొట్రిలుపాటు గూరెఁ, గ
ట్టా! సరసంపుఁ బాకముల యందు రుచుల్ పస తీఱె, సంధులున్
వాసి చలించు చర్చ సడలఁ బాఱెఁ, బోరింబోరి సర్వభావస
న్న్యాసము మీఱె, నీపయి వినం గనరాని విఁకెన్ని క్రొత్తలా
వేసము లూని భారతి నవీనగతిం జరియించునో గదా !

శ్రీ

# ఆంధ్రసాహిత్యపరిషత్పత్రిక.

కాకినాడ.

రెండునెలల కొకసారి ప్రకటింపఁబడును.

సంపుటము ౨౬. { ఈశ్వరనామసంవత్సరము. శ్రావణభాద్రపదమాసములు. } సంచిక 3.

## పాల్కురికి మతరహస్యము.

—యామిజాల పద్మనాభస్వామిగారు, విజయనగరము.—

---

సోమనాథునిమతము వీరశైవ మని తద్గ్రంథపాఠకులకును, దత్కాలపరిస్థితిజ్ఞులకును దెల్లంబు.

సోమనాథుఁడు శ్రుతివాక్యముల నుదాహరించుచు సర్వము పశుపతి పరముగ సమన్వయించిన శైవపండితుఁడు. ఆరాధ్యవంశమునకుఁ జెందిన విప్రుఁడయ్యు శైవాచారదీక్షారక్షాధురంధరుఁడై వంశనిర్ణయమును జేసికొనఁడయ్యె. శ్రియాదేవియు, విష్ణురామదేవుఁడును గారవింపఁగ నొప్పుగాదిలిసుతుఁడే కాని గురులింగవరకరోదరజనితుఁడఁట. కన్నవారినేని నసహ్యించు నాశైవనియమప్రభావ మయ్యారే;—భవిజనసమాదరణసంభాషణాదిసంసర్గదూరగుఁడు. తనకు జన్మలేదని యాత్మేంద్రియసంతృప్తిగావించుకొనినాఁడు. ధర నుమా మాతా పితా రుద్ర యనఁగఁ బరఁగినవాఁడు. "కర్మంబు త్రాళ్లు తాఁ గట్టుకోఁదగునె?" అని కర్మనునిందించిన మానిసి, శిలాదునిచేతను, నందీశ్వరునిచేతను ఘోరతపస్సు చేయించినాఁడు. నందికేశ్వరునినోము, తద్విధియుఁ జెప్పి యొప్పించినాఁడు. శ్రుతులను, స్మృతులను నొకవంక నాదరించుచునే కథ నడిపినాఁడు. సంధ్యావందనము సల్పినచో దేవత లందఱను మ్రొక్కవలె

నఁట. దాన నయ్యది దూష్య మని కేవల శివశివభక్తనామసంస్మరణమే కర్తవ్య మని కులసతియట్లు నిశ్చలయుక్తి భక్తి; వెలయాలియట్టు లవ్విప్రమార్గంబు." అని విప్రమార్గమును నిందించుట యాతనియిష్టము. భక్తియే చాలును. కర్మాచరణ మకర్తవ్య మనుట యాతని యాంతరంగిక ముఖ్యోద్దేశము. శాపమునకు శక్తికల దని యంగీకరించుచుఁ గర్మాచరణముల భక్తినిఁ బోలినది లే దనుట యాతని సిద్ధాంతము. శత్రు లైనను లింగసహితులై యున్నచో నాదరించుట యాతనిదినకృత్యము. చిత్తజాంతకుభక్తిఁ జెడనాడు ఖలుల మృత్యువుగతిఁ గ్రుంచుట తన్మతపరమసిద్ధాంతము. పరస్త్రీపరాఙ్ముఖత యాతని మతమహావాయుపథమున నాఱని విద్యుద్దీపిక. ప్రపంచము కలదు. అధీశ్వరుఁడు మాత్రము పశుపతి. దేవత లందఱును గలరు, అందఱును శివాంశసంభూతులు. జీవాత్మవేఱు. జీవుఁడు దుష్కర్మి. శివుఁడు నిష్కర్మి. ఆత్మ పంచభూతాత్మకము. శివుఁడు కపటనాటకసూత్రధారి. శివుఁడు నిర్మలుఁడు. అంగము పుణ్యపాపాలయము. నిష్కర్మి యైనశివునకును, అంగమునకును సంబంధము లేదు. తనయిచ్ఛాప్రభావమున సర్వమును బుట్టించిన శివునకుఁ దత్సంబంధిత్వ మంటఁగట్టుట యజ్ఞత్వము. మృషుఁడు లేఁడనినవాని నడుతల మెట్టి నడచుట వీరశైవులయాచారము. శివభక్తులు శివభక్తునిఁ జేరి నీభార్య చీరని మ్మనినచో నిచ్చితీఱవలెను. చచ్చితీఱవలెను. శివభక్తుఁడు చచ్చినదానిని బ్రదికింపఁగలఁడు. బ్రాహ్మణులు త్రాటిమాలలు, పచ్చిమాలలు నఁట. ఇరుగడలఁ గ్రిక్కిఱిసియున్న యద్వైతబౌద్ధమతమున నడఁచి తన్నియమస్వీకారాశక్త నికృష్టజాతీయులను సులభమోక్షప్రాప్తిపరమసాధనపరశివభక్తి శక్తిని తనలోఁ గొనివారితోఁ గూడి జనబాహుళ్యముచే మన్ననఁగొనుట యతని హృదయసమ్మతమగు మతము. విషము త్రావినను, కన్నులు పెఱికికొనినను, తలనఱికికొనినను భయము లేదు. ప్రాణాపాయము రాదు. అంతయు శివప్రీణనమునకై చేయుచున్న వీరశైవమతమార్గము. దాని కడ్డుతవులరాదు. వర్ణాశ్రమధర్మములు పాటింపరాదు. బసవనికి వడుగు చేయుఁబలేదు. అద్వైతులును, సాంఖ్యులును, జైనులును, బౌద్ధులును, నే శ్రుతిస్మృతులతోడ, యుక్తివాదములతోడఁ దమ

మతములకుఁ బ్రాబల్యము సంఘటింపఁదొరకొనిరో యాపద్ధతియే సోమనాథుని కరగ్రహణ మొనర్చి యప్రతిహతగమనముతో నితరశైవభిన్న మతమార్గములను జక్క దిద్దుకొని యితరమతములను రేకెత్తకుండఁ జేసినది. బాగుగా నాలుగు భాషలలోఁ బాండిత్యము గలదిట్ట. లక్కపుకు కవంటి సంస్కృతవాణిని నాటవెలఁదినిజేసి మించిన కీర్తి గడించి యితర భాషలం గబ్బములు రచించి ప్రాచీనమతముల నింకించి నటించి వీరశైవ నిరాటంకఘంటాపథప్రకర్షణ, గుర్వాజ్ఞఁ జెల్లించుకొనినవాఁడు పాల్కురికి సోమనాథుఁడు.

---

## "ప్రశంస."

— విద్వాన్ పిసుపాటి విశ్వేశ్వరశాస్త్రిగారు —

---

సీ. శ్రీజయంతికులాబ్ధిశీతభానుఁడు రామ
  యార్యుండు జనకుఁడై యలరుచుండఁ
బీడికాపురమహీభృన్మౌళి సూర్యరా
  ట్ప్రభుపు సోమకుఁడయి ప్రబలుచుండ
రాజాధిరాజ విక్రమదేవవర్మభూ
  నేత యధ్యక్షుఁడై నెగడుచుండ
సంస్కృతాంధ్రజ్ఞాన సంపూర్ణులైన
  విద్వాంసులు సభ్యులై తనరుచుండఁ
బాచవింశతివత్సరప్రాయమంద
మందగతి రాజతోత్సవానందలీల
ననుభవించితి సాటి నీ కవనిఁ గలదె
యాంధ్రసాహిత్యపరిషదబ్జాయతాక్షి!

ఉ. నన్నయభట్టు తిక్కకవినాయకుఁ డెఱ్ఱన నీకుఁ దండ్రులై
మన్ననఁ జేసినారు, నిను మానిని! నాచనసోమనాథపో

తన్నలు పెంచినారు, బహుధా భవదీయవిలాససంపద
ధ్యున్నతిఁ గృష్ణరాయఁడు ప్రభుప్రవరుం డొడఁగూర్చినాఁడు పె
ద్దన్నయు ముక్కుతిమ్మన సుధామధురోక్తుల నేర్పినారు త్యా
గన్న కృతుల్ రచించిన మహాత్ముఁడు గానము చెప్పినాఁడు సూ
రన్న కథాచమత్కృతుల కాకరముం బొనరించి శ్లేషసం
పన్న నొనర్చినాఁడు బహుభంగములం బడి, చేమకూర వెం
కన్న మఱెవ్వరుం బడయఁగాని పథంబునఁ ద్రిప్పినాఁడు, వీ
రన్న మదీయరాజ్ఞి యని యాదరణం బొనరించినాఁడు, తి
ప్పన్న వచించినాఁడు తగ భాణపథంబును, గూచిమంచి తి
మ్మన్నయుఁ బొన్నిగంటి తెలఁగన్నయు నచ్చ తెనుంగుదానిఁగా
ని న్నొనరించినారలు గణింపఁగ నెల్లరు, నాంధ్రసాహితీ
సన్నుతగాత్రి! నీకుఁ దగుసాటి జగంబున నెందుఁ గల్గునే ?.

ఉ. ఇంక నవీనసత్కవు లనేకులు చిన్నయసూరిముఖ్యు లే
వంక భవద్యశఃకుసుమనల్లరిఁ బ్రోది యొనర్చిరో నిరా
తంకముగాఁ ద్వదీయసవిధంబున విన్చెద నాంధ్రసాహితీ
పంకజనేత్ర! యొక్కపరి భావనసేయుము దాని నెమ్మదిన్.

సీ. నన్నయవ్యాకరణంబు నథర్వణ
కారికావళి మున్నుగాఁగఁ గలుగు
వ్యాకరణంబులు ప్రామాణికకవిప్ర
యోగంబులును జూచి యుక్తరీతిఁ
దెనుఁగువ్యాకరణంబు తీర్చిదిద్దినవాఁడు
గద్యకావ్యంబుల కాద్యగురుఁడు
చిన్నయసూరి నీచెలువంబునకుఁ గొంత
క్రొత్తందనంబును గూర్చినాఁడు
కడచన్న యాంధ్రసత్కవిజీవితచరిత్ర
సేకరించినవాఁడు స్వీయచరిత

రచనకాంధ్రమున మార్గము చూపినయతండు
ప్రహసననిర్మాణపటుమనీషుఁ
డివి యవి యననేల యెల్లమార్గంబుల
శోధించినట్టి విశుద్ధబుద్ధి
వీరేశలింగకవిబ్రహ్మ నిన్నెల్ల
తెలుఁగుల వృద్ధికిఁ దెచ్చినాఁడు
కనఁజేసినాఁడు లక్ష్మణరాయఁ డోకకొంత
విజ్ఞానసర్వస్వవిమలకీర్తి
యభినవకృష్ణరాయాస్థానికి ననర్ఘ
రత్నభూషణములు రామకృష్ణ
కవులు నిన్నుఁ బ్రసాదకలితఁగా నొనరింప
భావించి కవితఁ జేపట్టినారు
బ్రహ్మఁ దిమ్మనిఁ దిమ్మి బ్రహ్మానిఁగా సమ
ర్థించి యొప్పించెడి ధీయుతుండు
హాస్యరసాంబుధి నాదమించినప్రోఢ
నాటకగ్రంథసంధానచణుఁడు
లక్ష్మీనృసింహారాయాత్మానురాగణి
నీమ్రోల సాక్షియై నిలిచినాఁడు
నూటికెక్కువ గాఁగ భాటిమై గ్రంథముల్
రచియించినట్టి ధీరప్రశస్తి
యొకచేతిమీఁదఁ బాయక భారతంబెల్ల
నాంధ్రీకరించినయట్టిదిట్ట
శ్రీపాద కృష్ణమూర్తిబుధుండు నీచేత
నితిహాసరచనఁ జేయించినాఁడు
తిరుపతి వెంకటేశ్వరసుధీవరు లవ
ధానాశుకవితాప్రధానగురుపు

లాంధ్రదేశమ్మునం దఖిలస్థలంబుల
నీరాజనం బిచ్చినారు నీకు
వారిమార్గమునందె వర్తించిన మహాత్ముఁ
డస్మదగ్రజుఁడు చిదంబరకవి
యా సేతుశీతనగావనీనాయకు
లిచ్చినకాన్క లందిచ్చినాఁడు
హరికథాసృష్టికి నరవిందగర్భుఁడు
సంగీతకవితావిశారదుండు
నారాయణుఁడు నీకు నట్టువై నృత్యంబు
గఱపి ప్రశస్తిని గాంచినాఁడు
పూర్వరాజులు నిన్నుఁ బోషించిన చరిత్ర
శాసనంబులు విప్పి చదువుదంట
రామసూర్యుఁడు సూర్యరాయమహీపాలు
నాదరణాతిశయంబువలనఁ
బండితమండలీపరివృతుండు నిఘంటు
తారహారమునీకుఁ దగినదానిఁ
గూర్చుచున్నాఁడు తొలిపేట కొని ధరింపు
మచిరకాలంబుననె తక్కినట్టిపేట
లును ధరించెద-నీమాలికను ధరింపు
మాంధ్రసాహితీపుండరీకాయతాక్షి !

---

# —చిత్రపటప్రశంస—

## —వెంపరాల సూర్యనారాయణశాస్త్రిగారు—

---

క. శ్రీమజ్జయంతివంశమ
హాముక్తామణిని రామయార్యుని సతతం
బోమును ముక్తీశ్వరుఁడు ని
రామయపురుషాయుషాభ్యుదయము లొసఁగుతన్.

సీ. ఆంగ్లభాషాదేవి యనుకంప నాదిని
బట్టభద్రుం డయిపరఁగుసుకృతి
గీర్వాణభారతీకీలకంబుల శ్రద్ధ
నామూల మెఱిఁగినయట్టిప్రోడ
యాంధ్రసరస్వతి యంఘ్రు లారాధించి
మాత్పూణ మీఁగిన మహితమూర్తి.
కర్ణాటశారదాకరుణామృతము సైత
మాని గట్టనిత్రేన్చినట్టిదిట్ట
బహుశిలాతామ్రశాసనప్రకటనక్ర
మప్రవీణుఁడు నిరుపమానప్రభావుఁ
డాంధ్రసాహిత్యపరిషల్లతాంగిఁ గన్న
యతఁడు గాఁడె జయంతి రామార్యుఁ డనిన.

సీ. కవియాతఁ గవినన్న నెవఁడైన వానిలోఁ
తరసి కొన్కలొసంగ కనుపలేఁడు
శాస్త్రజ్ఞుఁడ నటంచుఁ జను దెంచు నెవ్వాని
ననువొందఁ బూజింప కనుపలేఁడు
వరుస వేదజ్ఞులు వచ్చుచో నెవని వ
ర్ణాశనమ్ము లొసంగ కనుపలేఁడు
ఇతరవిద్యల నెవ్వమేని నేర్చినవారి
నాదరింపక యెన్నఁ డనుప లేఁడు

ప్రాభవమ్ము విద్యావైభవమ్ము గల్గి
యిట్లు విద్యాధికులఁ బ్రోత్సహించునట్టి
మాన్యచరితుం డెవండు రామయ్యపంతు
లొక్కఁడే కాక యెన్నాళ్ళు లెక్కయిడిన.

శా. ఆచంద్రార్కము నిల్చు చందమున సూర్యారాయభాషాహ్వయ
శ్రీచిహ్నంబు నిఘంటుశేఖరము వాసిం గూర్చి యాంధ్రావనిన్
వాచాగోచరరీతి శారదకు సంధానించె సామ్రాజ్యము
న్వీచక్రం బరుదంద రామయబుధాగ్రీయుండు సామాన్యుఁడే.

ఉ. కంటను వత్తివెట్టుకొని గారవమొప్పఁ దెలుంగుబాసవా
లంటికి నీవు గూర్చినవికాసములన్ స్మరియించి యాంధ్రు లిం
టింటను నీమచిత్రపట మేడ్తెఱ నిల్పి యఖండభక్తి, దో
యింటి నొసంటఁ జేర్చి భజియించిన నీఋణ మీఁగనేర్తురే.

శా. ఎందాఁకన్ విలసిల్లు నాంధ్రమహియం దేకాక్షరిన్ శారదా
నందక్రీడలు సజ్జనుల్ వొగడ; నందాఁకన్ విపశ్చిన్మనో
బృందంబందు భవత్తనూవిలసచ్ఛ్రీ చిత్రితాకారమై
యందంబొందు నటంచు నీపటము రామయ్యార్య ! చాటెంజుమీ.

గీ. సర్వసంపత్సమృద్ధి యశఃప్రసార
మెనయు నీకది యిమ్మిది యిమ్మటంచుఁ
గోరఁ బరమేశ్వరుని, గాని గోరువాఁడ
నొక్కటే నీకుఁ జిరతరాయుష్యమీయ.

---

"ఉచ్చైర్గతి" యనుశ్లోకమునకుఁ దెనిఁగింపు.

గీ. క్షితిని సద్గతి ధర్మంబు చేతనేని
దానికిం బ్రమాణంబు వేదంబులేని
బ్రాహ్మణులు వానిఁ బ్రకటించువారలేని
వారిఁగాక మన్నమస్కృతు లేరిఁ జెందు.

బోడపాటి శివరామకవి
రాజమహేంద్రము.

# రజతోత్సవపద్యములు.

## (1) దివాకర్ల వేంకటావధానిగారు.

ఉ. ఈ రజతోత్సవమ్ము నొనరించుట సత్పరిషద్విలాసవి
స్తారయశోవిభూతుల కజస్రము కారకుఁ డైనవాని వి
ద్యారతు నుత్తమోత్తము జయంతికులీనుని రామయార్య నిం
పారఁగ గౌరవించు టని భావమునం దలపోయుటొప్పదే ?

సీ. ఆంగ్లభాషాపార మరసి యుద్యోగియై
యధికృతిమన్నన లందినాఁడు
ఆంధ్రగీర్వాణమ్ములందు నప్రతిమాన
మైన సంస్కారము నూనినాఁడు
రసవత్ప్రబంధనిర్మాణచాతురిఁ జూపి
కవిలోకవిఖ్యాతిఁ గాంచినాఁడు
స్వార్థమ్ము వీడి భాషాదేవిసేవయే
పరమార్థ మనుతలం పరసినాఁడు
అఖిలసమ్మత మైన విన్యాస మొప్ప
నాంధ్రసాహిత్యపరిషదభ్యాయుతాక్షి
యితని సంతతకృషిచేత నింతవఱకు
నరసిఁ గొనఁజాలె దైనందినాభివృద్ధి.

ఉ. శ్రేయము గల్గుకార్యములఁ జేయఁగ లేరు స్వయమ్ముగాఁగ భూ
నాయకు లెవ్వ రెంత సుగుణప్రియులైనను వారి నెవ్వరో
సాయము గా భవాదృశులు చక్కని ఫక్కికి దింపుచుందు రో
ధీయుత ! నిన్నుఁ బోలఁగలధీరులు దుర్లభు లీజగమ్మునన్.

మ. కవి విద్వాంసుఁడు కావ్యవేత్త విపులక్ష్మాపాలుఁ డుద్వేలభా
గ్యవిలాసుండు వదాన్యమౌళి వినయవ్యాపారుఁ డుద్యద్యశ
స్తవనీయుండగు విక్రమోర్వీపతి యధ్యక్షత్వముం గాంచు టొ
క్క విశేషంబని నమ్ముచున్న ! పరిషత్కల్యాణి ! నిక్కమ్ముగన్.

ఉ. రాజుల చేతి బిడ్డవయి రాణ వహించుచు నుంటఁజేసి వి
భ్రాజదనంతభోగములఁ బాల్పడియుం బ్రతివత్సరంబు నీ
వోజనయిత్రి! యాశ్రితుల నొక్కొకమండల మేఁగి చూచి త
త్పూజలఁ గాంచు నోపికయుఁ బూనికయు న్నుతియింపఁజెల్లదే.

ఉ. అందని మ్రానిపండ్లగునట్టి కళానిధులు న్గవీంద్రసం
క్రందను లొక్కచో నలరఁగాఁ దిలకించి తదీయ వాక్సుధా
స్యందము గ్రోలు భాగ్య మనయంబు భవత్కృపఁజేసి కల్గె నా
నందముతో నొసర్చెదఁ బ్రణామముల న్గయికొమ్ము తల్లిరో!

సీ. పలువిధంబులఁ బోవు భాషాకుమారుల
నేకసర్గులను గావించుటొకటి
యన్యభాషలయందు నలరు శాస్త్రావళి
నెలమిమై నాంధ్రీకరించుటొకటి
కాలానుగుణముగాఁ గలుగు మార్పుల సైఁచి
యితరదేశ్యముల చోటిచ్చుటొకటి
సహవాసజనితదోషముచేత మనభాష
పాడుగాకుండఁ గాపాడుటొకటి
చేయఁదగ్గపనులు చింతించి నెఱవేర్పు
మాంధ్రమందు లోప మసదు గాఁగ
చిరమునుండి వచ్చు గురుయశస్సంపత్తి
నాంధ్రపరిషదంబ! యాఁపుకొనుము.

క. నీవు జనించిన దాదిగ
భావుక మగురీతి నిన్నుఁ బాలించిన సూ
ర్యావనిపాలుఁ డితోఁడధిక
జీవనసౌభాగ్యసిద్ధిఁ జెంది సుఖించున్.

చ. జయపుర మేలుచుండిన విశాంపతికిన్ బునరుక్తిగాఁగ నే
జయమని పల్కు టేల? పరిషల్లలితాంగి యుదారుఁడైన భూ
దయితుని యాదరంబునకుఁ దద్దయుఁ బాత్రమవై సుఖంపు మా
శయముల సిద్ధి గాంచుత మజస్రము వాణి దయార్ద్రదృష్టిచే.

---

(2) తాడిమళ్ల నారాయణమూర్తిగారు, ఎం. ఏ.

గీ. రాజకవియామ మండితరాజసభల
గౌరవించి సన్మానించు ఘనతపేర్మి
నాంధ్రభాషాభివర్ధనుం డల్ల కృష్ణ
దేవరాయలే విక్రమదేవవర్మ.

గీ. అష్టదిశలందు దిగ్విజయుంబు గలిగి
నాఁటిసత్కవు లష్టసంఖ్యాకులైన
నేఁటిసత్కవీశ్వరు లసంఖ్యేయులైరి
నాఁటికంటె నేఁడే సద్గుణాధికంబు.

గీ. సంస్కృతాంధ్రభాషల నలసానిపెద్ద
నార్యుఁడు ప్రసిద్ధిఁ జెందె జయంతి రామ
యాఖ్యపండితవర్యుఁడు నాంగ్లభాష
నధికప్రఖ్యాతిఁగాంచెఁ బ్రజ్ఞానిరూఢి.

సీ. శ్రీమహాలక్ష్మి విశేషభాగ్య మొసంగు
బ్రహ్మ చిరాయుసంపద ఘటించు
జయము యత్నములందు సర్వేశ్వరుం డిచ్చు
భాస్కరుం డారోగ్యభాగ్య మిచ్చు
యంత్రమువోలె దేహము పనిచేయుత
మెల్లవిద్యల వాణి కిల్లువలెనె
స్థిరముగఁ గీర్తి సిద్ధించెను రవిచంద్ర
తారకముగనె విద్వత్ప్రసక్తి
రామభక్తిని జాటురామచరిత్రోక్తి
యాంధ్రగీర్వాణభాషాభిలాష
మలపు రానీయదు మనమున రాజకీ
యోద్యోగమహిమ మత్యుత్సుకతను
యమనియమాదుల నాయురారోగ్యముల్
ప్రకటించు దీక్షాప్రవర్తనంబు

పండితసన్మానభావ మీసభ దెల్పు
మహిమంబు జనులసమ్మతమె దెలుపు
త్తునిమె గ్రామ్యవాదమును దుత్తునియలుగ వె
ల్గుంగు నిపుణత ధర్మసత్సంగతులను
గౌరవమునకు నెల్లెడ మేగలేను
రుచిరగుణకీర్తి రామయార్యుండువఱలు.

చ. సరసకవిత్వవైఖరిని శాస్త్రసమన్వితశక్తి సత్కవీ
శ్వరులు రచించుగ్రంథములు శాశ్వతకీర్తియుతంబులై ధరన్
స్థిరపఱుప న్నిఘంటువు రచించి ప్రసిద్ధి వహించుచుండఁగా
నిరువదియైదువత్సరము లీపరిషత్తువయస్సు నేఁటికిన్.

గీ. ఇట్టి సిల్వరుజూబిలీ లెన్న లేని
సార్లు వచ్చుచుండవలె భాషావధూటి
శాస్త్రసమ్మతమౌచు సజ్జనులహృదయ
రంజకమయి వర్ధిల్లు నిరంతరంబు.

---

(3) కొమరవోలు వేంకటసుబ్బరావుగారు బి. ఏ.

శా. రాజాపిల్లకు నోచ్చి విత్తజలధారాపూరముల్ సేర్చి మో
కేదుం గడియుఁ గూర్చి సేద్యమును దానేనాఁట నీసీమలోఁ
బ్రారంభించె జయంతి రాముఁడను పూర్ణప్రజ్ఞుఁ డారైతు, సూ
ర్యారాయుం డటమీఁద సాకె ఫల మధ్యక్షింపుఁడీ ధీవరుల్.

చ. ఇరువదియైదువత్సరములేఁగెఁ గృషీవలసత్తముండు జ
ర్జరితవయస్కుఁడయ్యె నుపసర్పితమోదమనస్కులౌచు నె
ల్లరు శుభకాంక్షులం గృషిఫలమ్ముల ప్రాప్తికి వేచియుండఁగా
నురవడితోడఁ గూడె రజతోత్సవవేళలు విస్మయంబుగన్.

సీ. చెదపుర్వునోటిలోఁ జెఱవడ్డవాఙ్మయ
మ్మున కెల్లొ చిరకాల ముక్తిగలిగ.

శైథిల్యమునఁ గూలి సమయు పూర్వప్రబం
ధములకు సుస్థిరత్వంబు గలిగ
వ్యవహారభాషామహాఘాటి కోర్చి గ్రాం
థికభాష ప్రౌఢిమ నేదేటి నిలిచె
భావకవిత్వాది వాంతిరోగములను
బరిమార్చు సౌమధవల్లి యబ్బె
నేమహాసంస్థదీపనోద్దామమహిమ
విపులకీర్తిప్రసూనముల్ విరియు నట్టి
యాంధ్రసాహిత్యపరిషన్మహాప్రసిద్ధ
సభకు రజతోత్సవము నేఁడు జగతి వినుము.

గీ. భారతీతీర్థపరిషత్సభాశ్రయుక్త
సరససాహిత్యసామ్రాట్ప్రశస్తబిరుద
ఘనుఁడు జయపురాధిపుఁడు విక్రమనరేంద్రుఁ
డా సభాధ్యక్షుఁ డట్టె భాగ్యం బదేమొ.

మ. దిననాథప్రతిమానకోవిదుఁడు జ్యోతిశ్శాస్త్రపారంగతుం
డును నా విక్రమభూపుకీర్తిసతి గండూషించె దిఙ్మండలం
బుచునన్న ద్దొసఁగేమి సత్యమె యగు న్నబస్త్యైర్యశో లభ్యతే
యని గాదా వచియించు చుండెదరు సత్యాభిజ్ఞులౌ ధీయుతుల్.

సీ. బహుళభాషాగళగ్రహపాండితీమండి
తత్త్వజ్ఞ తనకు బాంధవుఁడుగాఁగ
గీతారహస్యనిర్ణీతిసేతివిధాన
చర్యయే తనకు దర్శకుఁడుగాఁగ
తతవనీపకదరిద్రాణదుఃఖత్రాణ
హస్తమ్మె తనకు వియ్యమ్ముగాఁగ
దశదిశావిశ్రాంత విశదయశఃపూర
వటలంబె తనకు దీపంబుగాఁగ

రాజ్య భోగాలఁ దేలు నీరాజమూర్తి
యయ్యు నధికారవైయాత్త్య మభిగణింపఁ
డొల్లఁ డాడంబరము నోర్మి నుజ్జగింపఁ
డహహ ! సామాన్యుఁడే విక్రమాధిపుండు ?

సీ. కవిసార్వభౌమసంగ్రథితకావ్యములకుఁ
గృతిభర్త యితఁ డన్న నుతికిఁ దెరువు
రసవత్ప్రబంధముల్ రచియించు నితఁ డంచు
వచియింప దడి వందివాక్యసరణి
లక్షలాదిగ విరాళము లిచ్చు నితఁ డంచుఁ
గొనియాడు టది మెచ్చుకోలుమాట
యతులవైభవసముద్ధతుఁడయ్యు నాడంబ
రవిహీనుఁడనుట కీర్తనకుఁ జొప్పు
పరువ కొకనికి నొప్పిన మరసి చూడ
సన్నిగుణములు నీయందు సార్థకములు
ప్రాక్తనాచారనియతవర్తనుఁడ వీవు
కలరె నీవంటి నృపులు విక్రమనరేంద్ర ?

చ. బుధులును సత్కవీంద్రులును భూపతులన్వలగట్టుచుండ్రు ద
త్తధనకప్రకర్షణవిధానమునన్ హితబృందవందిమా
గధనుతుఁడైన భూభుజు ముఖశ్రుతవాక్యమొకండె కోటి క
త్యధికము సేయు నంచెఱుఁగ కయ్యదియొ యెంతటియల్పులో కదే.

సీ. రాజరాజనరేంద్రరత్నరాజికిరీట
దివ్యదీధితులలోఁ దేలివచ్చి
రెడ్డిరాజన్యుల యొడ్డోలగంబున
సరససాహిత్యసౌష్ఠవముఁ బడసి
కృష్ణరాయలదివ్యకీర్తిసుధాశర
చ్చంద్రికాతతుల నైశ్వర్య మొనసి

భరతశాస్త్రప్రౌఢపరిణీతరఘునాథ
సరనాథు కడ కళాభిరతి నెఱపి
వార్ధకముతోడ ముదిరి చేవను దలిర్చు
నీదురసికత శేముషీవిరతి దాన
శీలసంపత్తులను బరీక్షింపఁగోరి
కడకు నినుఁజేరె నాంధ్ర విక్రమనరేంద్ర.

సీ. పరితృప్తులనె తృప్తిపఱచె నీతండన్నఁ
బరుల సంగతులఁ జెప్పంగ నేల
యంతర్విరోధుల నణఁచె నీతండన్న
బాహ్యశత్రులఁగూర్చి పలుక నేల
కవిభూషణులె పడిగాపు లీతని కన్న
నితరుల చందమ్ము లెంచ నేల
వైరాగ్యశిష్టజీవనవర్తి యితఁడన్న
నిహపరాఙ్ముఖభావ మెన్న నేల
యనుచు జగమెల్లఁ గీర్తింపఁ దనరునట్టి
జయపురాధీశ శ్రీకృష్ణచంద్రపుత్ర,
జరఠపార్థివమౌని మాసభను నడప
నేఁగుదెంచితె కొమ్ము మా యేటికోళ్లు.

గీ. అనఘ క్రతుఫ్యావ మనెడు కావ్యము గ్రహించి
నన్ను దయఁజూచినాఁడవు మున్నటులనె
యందఱకు నీనఁ కారుణ్య మబ్బునట్టు
లాయురారోగ్యములు నీకు నభవుఁ డిడుత.



# ఆంధ్రవ్యాకరణము.

చర్ల నారాయణశాస్త్రిగారు—పిఠాపురము.

సృష్టికిని దన్నియమసూత్రములకును నెట్టి యవినాభావసంబంధ మున్నదో యట్టియవినాభావసంబంధమే వాఙ్మయమునకును వ్యాకరణమునకును గలదు. భాష ప్రవాహరూప మైనది. వఱదలు వచ్చి ప్రవాహము గట్లుదాఁటి పోవునపుడు దానిని నియమించుట కవసర మైనట్లే భాషకూడఁ బామరవ్యవహృతమై నిరంకుశముగా వ్యవహరింపఁబడినపుడు దానికిఁ గూడ నియమ మావశ్యక మగుచున్నది. కాని కాలక్రమమున మొదటఁ జేయఁబడిన నియమములు పండితవ్యవహారమున సడలింపఁబడుట సంప్రదాయ మైనది. అట్లు కాలక్రమమున నియమములు సడలింపఁబడి దేశకాలపాత్రములఁబట్టి మార్పు చెందుట యవసరము కూడ నైనది. కనుకనే సంస్కృతభాషలోఁ బాణిని, వరరుచి, పతంజలులు, ఒకరి తరువాత నొకరు వారివారికాలములందుఁ బ్రసిద్ధములైన రూపములను వార్తికములచేతను, ఇష్టులచేతను సాధించుచు మిగిలినవానిని గణములయందును సార్థక్యకల్పనములయందు నంతర్భవింపఁజేయుచు వచ్చిరి. తరువాతిమహాకవుల ప్రయోగములు కొన్నిటి కింకను సాధకల్పన మేర్పడనేలేదు. ఇతరభాషలయందుఁ గూడ దేశకాలాములనుబట్టి వ్యాకరణములు మాఱుచు వచ్చిన వనుసంగతి మనీషులకుఁ దెలియనిది కాదు. ఒక్కవ్యాకరణములలో మాత్రమే కాదు. ఆచారవ్యవహారములలోఁ గూడ మార్పు గలుగుచున్నది. పూర్వాచారములగు దేవరన్యాయము, సహగమనము, నిప్పుడు లేవు. కనుక జీవద్వాఙ్మయములలోని వ్యాకరణములకు మార్పు తప్పదు. అదిగాక జీవద్భాషల వ్యాకరణములకు సంపూర్ణత కూడ నుండుట యసంభవము. ఎప్పటికప్పుడు వైయాకరణులు మహాకవిప్రయోగములను బట్టి వారివారికాలములలో మార్పు గావించుకొనవలసి యున్నది. దీనినే "సిద్ధిర్లోకాద్ధృశ్యా" ప్రయో

గమూలం వ్యాకరణం,అనుసూక్తులు స్పష్టపఱచుచున్నవి. ఇట్టిమార్పులు కాలక్రమమున నెట్లు వచ్చినవో ముందు చూపెదను.

ప్రస్తుతము మనవ్యాకరణములలోఁ బరస్పర మెట్టిభిన్నాభిప్రాయములు సంభవించినవో ముందు తెలిసికొనవలసి యున్నది.

ఆంధ్రశబ్దచింతామణి:—ఆంధ్రవాఙ్మయ మాంధ్రమహాభారతములోఁ బ్రారంభ మైనది. నన్నెచోడుని కుమారసంభవము భారతమునకుఁ బూర్వమే రచింపఁబడె ననువాదము లేకపోలేదు. కాని యీవిషయ మిపు డప్రస్తుత మగుటచే దానిసంగతి వదలిపెట్టెదను. ఆంధ్రవ్యాకరణములలో "ఆంధ్రశబ్దచింతామణి" మొదటి దనుసంగతి నిర్వివాదము. నన్నపార్యుఁడు తనభారతములోఁ దా నవలంబించిన కొన్ని సామాన్యనియమముల, నాకాలపుసంప్రదాయముల నందుఁ దెలిపియున్నాఁడు. ఈయాంధ్రశబ్దచింతామణి రచనమువలననే యితనికి వాగనుశాసనుఁడను బిరుదము వచ్చినట్లు పండితులకు విశదమే.

ఆంధ్రశబ్దచింతామణి నన్నయరచితము కా దను శ్రీవీరేశలింగము పంతులుగారివాదము సరియైనది. కా దని యిదివఱకే నిశ్చయింపఁబడినది. కేతన తనయాంధ్రభాషాభూషణములో "మున్ను దెనుఁగునకు లక్షణ మెవ్వఁడు నెవ్వరును జెప్ప రేఁ జెప్పెద" నని చెప్పికొనియున్నాఁడు. కాని యితనికాలమున నాంధ్రశబ్దచింతామణి కంతప్రచారము లేకపోవుటచేఁ గేతన యట్లు వ్రాసియుండును.

చింతామణివ్యాఖ్యలు:—ఆంధ్రశబ్దచింతామణిని బ్రచారములోనికిఁ దీసికొనివచ్చినవాఁడు- ఎలకూచి బాలసరస్వతి. బాలసరస్వతి చింతామణికి భాష్యము వ్రాసియున్నాఁడు. అది బాలసరస్వతీయ మను పేరితో నున్నది. మొన్ననే యీ యాంధ్రసాహిత్యపరిషత్తువారు దానిని బ్రకటించిరి. ఈచింతామణికే అప్పకవి సోదాహరణముగా నొక విపులవ్యాఖ్య వ్రాయఁ దలఁచెను. కాని కొలఁదిభాగమునకే వ్యాఖ్య వ్రాయఁగలిగెను. మొత్తముమీఁద నది ఛందోవిషయకముగానే మెక్కువగానుండుటచే దానికి ఛందోగ్రంథముగా వ్యవహారము గలిగినది.

అతనిపుస్తకమునకు బాలసరస్వతిగ్రంథమునకుఁ బాఠభేదము లనేకములు గనుపట్టుచున్నవి. వానియుక్తాయుక్తతలను నేను వ్రాసిన బాలసరస్వతీయపీఠికలో వివరించియుంటిని. బాలసరస్వతీయమునుపిదపఁ జెప్పదగినది యహోబలపండితీయము. బాలసరస్వతి వ్రాసినటీక సంగ్రహముగా నున్నది. అది చాలవఱకు నిర్దుష్టముగా నున్నది. తనటీకలో బాలసరస్వతి నన్నయసంప్రదాయములను జక్కఁగా సరిగాఁ దెలిపియున్నాఁడు. ఈబాలసరస్వతిపాఠము నతనిటీకను, ఆధారముగఁ జేసికొని యహోబలపండితుఁడు చింతామణికి విపుల మగు వ్యాఖ్యానము వ్రాసెను.

అహోబలపండితుఁడు చింతామణివ్యాఖ్యలోఁ దచ్ఛేషపూరక మగునథర్వణునివికృతివివేకమును జేరిచి రెండిటికిని సమన్వయము చేసెను. అథర్వణునికారికల కితఁడు వ్రాసినటీక చాల ముఖ్యమైనది. ఇతఁడు వ్రాయఁగా మిగిలినకారికలలోఁ గొన్నింటి కిప్పటికిని సరియైనయర్థము లభించుట లేదు.

కవిజనాంజన మనువ్యాఖ్యకూడఁ జింతామణికిఁ గలదు. ఇందులో నహోబలపండితీయములోని యుదాహరణములే తఱచు కన్పట్టుచున్నవి. ఇందులో నంతయెక్కువ విశేష మేమియునుఁ గానరాదు. కాని యహోబలపండితీయములో లేని కొన్నియథర్వణకారిక లిందుఁ గలవు.

—: నన్నయకాలమునఁ గలసంప్రదాయములు :—

నన్నయకాలమునకు దేశభాషాకావ్యములం దాసక్తి గలిగినట్లు "స్వస్థానవేషభాషాభిమతాః" అను చింతామణిశ్లోకము విశదపఱచుచున్నది. శబ్దానుశాసనుఁడు రససిద్ధికే ప్రాధాన్యము నిచ్చియున్నాఁడు.

గ్రామ్యము.

నన్నయ, పదసిద్ధి లోకమువలనఁ దెలియనగు ననియు లోక మనన్యాదృశము నిత్యము ననియుఁ జెప్పి నియమావశ్యకతను గూర్చి ప్రసంగించను. "అనియమా ద్గ్రామ్యం హి య త్త్వపభ్రంశః" అను సూక్తి వలన నన్నయకాలముననే కటిగల్లాద్యర్థవిషయక మగుగ్రామ్యపదము నియమరహిత మైనపదముల విషయమున నుపయోగింపఁబడిన దని

తెలియుచున్నది. నియమరహితముగా వాడఁబడిన పదము గ్రామ్య మనునన్నయభట్టారకుని యుద్దేశము తరువాతివైయాకరణులలో "లక్షణవిరుద్ధం బగుభాష గ్రామ్యంబు" అను నభిప్రాయములోనికి మాఱినది. దీనినిబట్టి ప్రాచీనలక్ష్యసంప్రదాయనియమవిరుద్ధ మగుభాష గ్రామ్యమనుశబ్దానుశాసనాశయము విభిన్నమై పోయినది.

వర్ణోచ్చారణము.

వాగనుశాసనుఁడు వర్ణోచ్చారణవిషయమున నప్పటివాడుకను గొంత విశదపఱచి యున్నాఁడు. ఇప్పటినవీనవైయాకరణులు సంధిలేని చోట యడాగమమును విధించియున్నారు. కాని నన్నయమాత్ర మట్లు చెప్పియుండలేదు. "అచ్చుపై నున్న యచ్చు యశ్రుతిఁ బొందు ననియు నది లఘు" వనియు నతనికాలపువాడుక తెలిపియున్నాఁడు. అథర్వణుని నాఁటికే యాయభిప్రాయము మాఱినట్లు "ప్రాణా త్ప్రాణో లఘు ర్య స్స్యాత్ సహల్చాచ్చ భవేత్ క్వచిత్" అను నతనికారిక స్పష్టపఱచు చున్నది. దీనినిబట్టియే చిన్నయసూరిప్రభృతులు "సంధిలేనిచోట స్వరంబుకంటెఁ బరంబయిన స్వరంబునకు యడాగమం బగు" నని సూత్రించి "హరియతఁడు- ఇత్యాదులం దాగమయకారము లఘువు- తక్కినయకారమలఘువు'' అని వివరించినారు. కనుకనే నేఁడట్టిపూర్వసంప్రదాయము తెలియకుండనే పోయినది.

నన్నయభట్టు వర్ణోచ్చారణమున సందిగ్ధస్థలములను గొన్నిటిని జూపి యచ్చట భ్రాంతిని నివారింపఁజేయుచు నెచ్చట నె ట్లుచ్చరింపఁ దగునో తెలిపియున్నాఁడు. భూతార్థక పదములందును శబ్దాదియందును దక్కఁ దక్కినచోట్ల నున్న యకారము అత్వముతో నుండు ననియుఁ బైవానియందలి యకారములు మాత్రము ఎత్వయుతము లనియుఁ జెప్పి యున్నాఁడు. ఇట్లే దంత్యతాలవ్యచజలవిషయమునను సందేహనివారణార్థము చెప్పియున్నాఁడు. ఇచ్చట నథర్వణుఁడు-

"భావిక్రియాసు యస్య స్యా దేత్వ మేవ ప్రయోగతః
డుడ్వాదివర్ణే భూతార్థే చాపి తద్వద్భవే త్సతా
డోలాభూషోత్తరీయాణి విసైత్వం నాస్తిమధ్యయః"

అని యెత్వ మెచ్చటెచ్చట నుండునో పరిగణనము చేసి చెప్పి యున్నాఁడు. దీనిని జూచి బాలవ్యాకరణకర్త "ఊఁయేల వయ్యెద తా యెతులం బ్రిక్క నామంబులందు యాకుం దాలవ్యవక్రయోగంబు లేదు." అని చెప్పెను. ఆంధ్రకౌముదిలోఁ గూడ నీమార్గమే త్రొక్కఁ బడినది. దంత్యతాలవ్యచజలవిషయమునఁ గూడ నథర్వణుఁడు చేసిన పరిగణనమును జిన్నయసూరి యనుసరించినాఁడు. ఇందు నన్నయ చూపినసంప్రదాయము సంగతి వేఱు, అథర్వణాదులు చూపినసంగతి వేఱు నగుచున్నది. నన్నయభట్టాదియందు యశ్రుతి నంగీకరించియున్న శ్రుతిసంగతి తలపెట్టక "ఆద్యవర్ణాస్తు హ్రస్వేన గృహ్యన్తే న కదాపి చ" అని యాదియందు యకార ముండనేయుండ దని యథర్వణాచార్యులు చెప్పెను.

ద్రుతాంతములు:—ద్రుతమువిషయములో ననేకములగుసభిప్రాయములు కలవు. మొదట వాగనుశాసనుఁడు "ద్రుతాఖ్యో నః" అని సామాన్యముగాఁ జెప్పియున్నాఁడు. అథర్వణుఁ డాద్రుతస్వరూపమును వివరించి యెచ్చోటను జెప్పియుండలేదు. కాని ద్రుతకార్యములను స్వత్వబిందుసంశ్లేషములుగాఁ దెలిపియున్నాఁడు. తట్టీకాకారు లగుబాలసరస్వత్యహోబలపండితులు స్వత్వాదిద్రుతకార్యములనే కాని ద్రుతము ప్రత్యయాగమావ్యయాత్మక మని కాని ప్రకృతిస్థనకారము ద్రుత మని కాని చెప్పలేదు. చిన్నయసూరికూడ ద్రుతవిషయము నెత్తుకొనలేదు, కాని, ద్రుతకార్యముగా "కను + దోయి" కందోయి, అనునుదాహరణ మిచ్చుటచేఁ బ్రకృతిస్థ నకారముగూడ ద్రుతముగా నతఁ డంగీకరించినట్లు తెలియుచున్నది. బహుజనపల్లి సీతారామాచార్యులుగారు మాత్రము "నకారం బసాధారణంబు ద్రుతంబు" అని సూత్రించి "ప్రత్యయాగమావ్యయాత్మకమై యుత్వవిశిష్టమైన నకారంబు ద్రుతసంజ్ఞకం" బని వివరించి ప్రకృత్యవయవనకారంబు ద్రుతముకా దనునభిప్రాయము వెల్లడించియుండిరి. కాని "కందోయి, పెన్జీకఁటి, వెంబడి, ఎందెందము, రాముఁడే సీతనేనిఁ గొలిచెద" ఇత్యాదులఁబట్టి సీతారామాచార్యులుగారి

నిర్వచనము సంకుచిత మయ్యె నని చెప్పవలసివచ్చుచున్నది. కనుకనే ప్రథమాచార్యుఁడు "ద్రుతాత్కోర్య నః" అని సామాన్యముగా సూత్రించియున్నాఁడు.

తద్ధర్మసంధి:—తద్ధర్మక్రియలకును దద్విశేషణములకును సంధి రాకుండుటకై "న స్యాత్ తద్ధర్మో తః" అని నన్నయభట్టు సూత్రించియుండెను. ఇక్కడ నొకసందేహము గలుగుచున్నది. వాగనుశాసనుఁడు తద్ధర్మములను ద్రుతాంతములుగా గ్రహించియుండెనా లేక కళలుగా గ్రహించి యుండెనా? అని- ఇతఁడు కళాపరిగణనములోఁ దిజ్ధర్మములను మాత్రమే, అనఁగాఁ, గ్రియలలో రమాంతక్రియలను మాత్రమే కళలుఁగాఁ జెప్పెను. ఇందువలనఁ దద్భిన్నము లగుతద్ధర్మక్రియలు ద్రుతాంతములని చెప్పవలయును. తద్ధర్మక్రియలతోపాటు తద్ధర్మవిశేషణములను గ్రహింపవలయును. ఇక్కడ "వచ్చున్ + ఇతఁడు" ఇత్యాదులలో ద్రుతవ్యవధానముచే సంధియే వచ్చుటలేదు. కాని తద్ధర్మసంధినిషేధమువలననే ద్రుతవ్యవధాన మున్నను సంధిరావచ్చు నని నన్నయ యాశయముగాఁ దెలిసికొనవలసియున్నది. కనుకనే "అనాదిషు విభక్తి ష్వాతో వా" అను విధి సార్థక మగుచున్నది. నన్నయయొక్క యభిప్రాయమునే-

'అచాం సంధౌ ద్రుతోఽదృశ్య స్థితోపిచ భవేత్సదా'

అను నథర్వణకారిక వివరించుచున్నది. తద్ధర్మక్రియలు తద్విశేషణములు ద్రుతాంతము లనునన్నయాభిప్రాయమునే యథర్వణాచార్యుఁడు

"ప్రథమ శ్చోత్తమ శ్చైవ తాసు తద్ధర్మసంజ్ఞికౌ,
భూతాద్యవిషయౌ, తత్ర చైక త్వార్థాభిధాయకౌ,
ఉదంతౌ చ సదా నాంతౌ నసంధి స్తత్రకల్ప్యతే."

అని స్పష్టముగాఁ జెప్పినాఁడు. ఆధునికుఁ డగుచిన్నయసూరి మాత్రము తద్ధర్మవిశేషణములను గళలుగానే యంగీకరించి వానికి నుగాగమమును విధించియున్నాఁడు. ప్రక్రియానిరూపణములో నిందు దోషము లేకున్నను సంప్రదాయము భేదించినది. లేక చిన్నయసూరి 'న స్యాత్ తద్ధర్మో తః' అనుసూత్రమునకు 'తద్ధర్మోత్వమునకు నకారము వచ్చును'

అనునర్థ మని భ్రాంతిపడె నేమో యని మనము సందేహింపవలసి వ
చున్నది. చిన్నయసూరి ఆంధ్రశబ్దానుశాసనములోఁ గూడ నుగాగ
విధియే కన్పట్టుచున్నది. 'నస్యాత్తద్ధర్మో తః' అనుదానిలో బాలసరస్వ
త్యాబాలపండితులు 'న' అనుదానిని నిషేధార్థకముగనే వచించియు
డిరి. అథర్వణాచార్యుఁడు 'న సన్ధి స్తత్రకల్ప్యతే' అని స్పష్టముగా సంధి
భావమునే చెప్పియున్నాఁడు. ఇాదర్థము చేసికొనుటలోఁ జిన్నయసూ
ప్రమాదపడెనేమో యనవలసివచ్చుచున్నది. అతఁడు 'న స్స్యా త్తద్ధ
తః' అనుచోట రెండుసకారము లున్న వని యనుకొననేమో- బాలస
స్వత్యాదులటీక గాని, యథర్వణుని వచనముగాని యితఁడు చూడలేదా
లేక చూచినను మఱచియుండెనా ? అనుసందేహము గలుగుచున్న

డుప్రత్యయాది విధానము:- నన్నయభట్టారకుఁడు మొదటిన
డియు సంస్కృతవ్యాకరణపద్ధతినే తనవ్యాకరణమును రచించియున్నా
డనుసంగతి యందఱకును దెలిసినదే. అతఁడు సామాన్యముగ సంస్కృ
తవిభక్తిప్రత్యయములే తెలుఁగుప్రాతిపదికములకంటె నగునను సభ్ని
యముతో 'సు ఔ జస్' ఇత్యాదిసంస్కృతప్రత్యయములకు డుప్రభృ
ప్రత్యయముల నాదేశముగాఁ జెప్పియున్నాఁడు కాని యాధునికు ల
చిన్నయసూరి మొదలగువా రట్లు విధింపక మొదటనే మహదాదుల
డ్వాదిప్రత్యయములను విధించి యున్నారు. ఆధునికులరచనలోఁ గొ
చోట్ల దోషము సంభవింపక తప్పినది కాదు. చిన్నయసూరి "స్త్రీలిం
బులప్రథమైకవచనంబునకు లోపం బగు" ననియు ను "ప్రథమైకవచన
నకు లోపం బగు" ననియును ప్రథమైకవచనంబునకు లోపము చె
యున్నాఁడు. కాని 'డు, 'ము' ప్రభృతివర్ణకంబులు మహదర్థకముల
కెను, అమహన్నపుంసకలింగములకెంకెను విశేషముగా విధించి య
డుటచే ఇకారాంతములకంటెను, స్త్రీలింగములకంటెను, ప్రథమైకవచ
ప్రత్యయములు లేవు. స్థాని యున్నఁ గదా లోపాదేశము విధించుట
వాగనుశాసనుల రచనములో సామాన్యముగా విభక్తులు విధింపఁబ
టచే వానికి లోపాదివిధానము సమంజసమే యగుచున్నది.

ఇట్టి వింక నాధునికుల రచనములలోఁ గన్పించుచున్నవి. విస్తర భీతిచే సామాన్యము లగువిషయములను గొన్నిటి మాత్రమే చూపియుంటిని. కాలక్రమమున మనవ్యాకరణములలోఁ గలిగిన మూఁడునాలుగు సామాన్యమగు మార్పులు చూపెదను.

వాగనుశాసనులు ద్రుతప్రకృతికముల కచ్చుపరమగునపుడు లుక్సంశ్లేషములు రావని "ద్రుతప్రకృతికేభ్యో లుక్సంశ్లేషౌ నాచి" అను సూత్రముచే నిషేధించియున్నారు. 'అన్నిష్టసఖి నూఁదియున్నదాని' భార. ఆది. ౩. ౭. అనుప్రయోగము ద్రుతసంశ్లేషరూప మని చెప్పరాదు. 'అను' అనుక్రియాజవిశేషణములోనిలుప్తశేషముగుప్రకృత్యవయవనకారము ద్రుతముకాదు. ద్రుతమైనచో 'గిరివ్రజమున్పురంబు' ఇత్యాదుల 'గిరివ్రజ మన్పురంబు' అని రూపభేదము గలుగవలసివచ్చును. "అన్నిష్టసఖి"పెను+ఉద్ది=పెన్నుద్ది, పెన్నూఁత, అన్నుర్వీశుఁడు, మొదలగురూపములవంటివి నకారద్విత్వము వచ్చినరూపములు" మదీయభాషిత మెన్నఁడు, న్నేని మోఘము గాదు దిగ్ధరణీరమణిలెఱుంగఁగాన్. భార. ఆది. ౭-౧౪౧ అనుచో ఏనిరూపాంతర మగు "నేని" అనునది గాని "ఏని" అని కాదు. కాన నిదిగూడ ద్రుతసంశ్లేషరూపము గాదు. నీవును జూదితట్టిసభ నేని వినంబడ దేయుగంబులన్. భార. సభా. ౨. ౬౫. అను నన్నయార్యుని ప్రయోగము "నేని" అనురూపాంతరములోఁ బ్రమాణ మగుచున్నది. 'నేని' యనుటకు నన్నయేతరకవి ప్రమాణములు కూడ నున్నవి. చందనంబు తడియాఱును నేనియు నంగజన్మ. కు. సం. ౫౫౧. ఆదిగర్భేశ్వరి నంటినఁ గందెదు నెలకన్నెఱుంగవు నేని ... కు. సం. ౬. ౬౭౦ అని. ఇట్లునన్నయకాలమున ద్రుతసంశ్లేషము సమ్మతము గాలేదు. ద్రుతసంశ్లేషమథర్వణునికాలమునను దరువాతను వాడఁబడి సాధు వయినది. అథర్వణుఁడు "నో వా ద్విత్వం క్వచి ద్దృష్టం పరప్రాణేవ సంగతేః" అని దానికి సాధుత్వము తెలిపియున్నాఁడు. 'ఘనచక్రాయుధనిష్ఠురక్షతగళద్రక్తాస్యసర్వాంగుని, న్ననుభూతాప్రతిమప్రగల్భ పరివాదాంతర్హితోద్వక్రముఖ. ఉ. హరి. 'షడఁతులమీఁద నేయ రతిపయ్యెదకు న్ననుపైనచే

తులర్. మనుచ. 3. ఇత్యాదిప్రయోగములు కాలక్రమమున సాధు
లైనవి. ఆంధ్రశబ్దచింతామణిలో 'సవికృతిశబ్దా త్పరతః సాంస్కృతిః
నాం భవంతి గసడదవాః' అని తెలుఁగుఁ బదములమీఁది సంస్కృతపద
దిగత కచటతపలకు గసడదవలు నిషేధింపఁబడినవి. కాని యావిధి త
వాత సాధువై పోయినది. అథర్వణుఁడు సామాన్యముగాఁ బై విధిని జె
యున్నాఁడు.

"వికృతాః పరుషాశ్చ స్యు స్సుప ఆద్యపదాదిగాః, అని "ప్ర
ల్గోపించిన నంతకుండు చెడు." శు. హరి. ర. "ఎవ్వండు పరించెడు వా
డు- కాశీఖండము. 'వేవణములు' (పణములు) విజ్ఞా. ప్రా. 'పెపు
క్షింపమె' వసు. 3. ఇత్యాదులు పై యథర్వణసూక్తివలన సాధ
వగుచున్నవి.

'అఖిలమునకు' ఇత్యాది నగాగమసహిత రూపములు 'నః కొ
అను నన్నయసూత్రముచే సాధింపఁబడినవి. అవి తరువాత మాఱినవి.

'నః ప్రాయ స్స్యాత్' అని యథర్వణుఁడు దానికిఁ బ్రాయికత
మును విధించి యుండెను. 'అఖిలమునకు' అని, ఉత్తరహరివంశములో
గలదు. 'విక్రమమునకు' అని నిర్వచనోత్తరరామాయణము. ౭. ఆశ్వా
'బచ్చురుర్' అండజాధీశ్వరుర్ ఇత్యాదిప్రయోగములు వ్యవహ
పఁబడి సాధుత్వము గాంచినవి.

ఇట్లే యింకను ననేకము లగుమార్పులు వ్యాకరణములలోఁ గ
వు. వ్యాకరణములను వదలి ప్రయోగములలోనికి వెళ్ళినచో మఱియ
ననేకము లగు మాఱురూపములు కన్పించుచున్నవి. ఒక కవిత్రయము
నందుఁ దక్క మిగిలినవారికృతులందు వ్యాకరణవిరుద్ధము లగు ననే
ప్రయోగములు కన్పట్టుచున్నవి. పూర్వులు గ్రామ్యము లని నిశ్చయి
చిన "నుయిదాఁటేవానికిర్, ఓర్రాత్రి, జారవనితతోటి, చేసుక, పోయర్
ఇరువై, అఱువై" మొదలగురూపములు గ్రంథములందు మహాకవులు
వాడియున్నారు. వీనికిని వ్యాకరణములకును నింకను నేకత్వము కుద
రలేదు. ఇట్టిమార్పు లంగీకారయోగ్యములా? కావా? అనువిషయ

ము పండితులు నిర్ధారణ చేయవలసి యున్నది. వ్యాకరణమునందు మార్పులుగూడఁ జేయవచ్చును గదా! అట్టిదాని కిట్టిపరిషత్తువారు పూను కొన్నచో బాగుండెడిది.

ఉ ప సం హా ర ము.

ఇట్లు వ్యాకరణములు భిన్నసంప్రదాయములు గలిగి పూర్వాధునికవైయాకరణులమతములు వేఱువేఱుగ నైపోయినవి. వాని నన్నిటి నేకముఖమునకుఁ దీసికొనిరావలయును. అన్నిటిని బరిశీలించి యొక్క వ్యాకరణము తిరిగి రచింపఁ బడవలయును. ప్రసంగవశమున నిట నొక మాట చెప్పవలసియున్నది. ఇట్టి యుద్దేశముతోనే నేను నన్నయాథర్వణులగ్రంథముల నాంధ్రీకరించితిని. ఇఁకను వివరముగా వ్యాకరణములన్నియు శోధించి క్రొత్తవిషయములు చేర్చి విపులముగా వ్యాఖ్య వ్రాయవలయు నని సంకల్పించియుంటిని కాని "శ్రీసూర్యరాయాంధ్రనిఘంటువు" పనిచే దానిసంగతి మానవలసివచ్చినది. కాని, యది నా పుత్రుఁడు చిరంజీవి గణపతిశాస్త్రి యుత్సాహపడి మిగులశ్రమపడి దానికి వ్యాఖ్య విపులముగా వ్రాసియున్నాఁడు. దానిలోఁ బూర్వోక్తములగు వైరుధ్యములు తొలఁగింపఁబడి నన్నయాథర్వణానుక్తము లగు ననేకము లగువిషయములు చేర్పఁబడియున్నవి. అది చాలవఱకు సమగ్రముగా నున్న దని నాయభిప్రాయము. దానిపేరు "నన్నయాథర్వణకారికావళి" అని పెట్టఁబడినది. అన్నిసంప్రదాయములను సమగ్రముగాఁ దెలుపుచు సర్వవిషయములను వివరించుచు వ్రాయుటకు నిట్టిపరిషత్తునకే శక్తి కలదు. కాని మావాఁడు వ్రాసినది సర్వవిధముల సమగ్రముగా నున్న దని చెప్పవలసియున్నది. అది యొకచేతిమీఁదుగా వచ్చియుండుటచే నందు నేవేని దోషము లుండవచ్చును. వానిని దెలుపుచు దానియందుఁ గొంతయభిమానము చూపవలయు నని పండితులను గోరుచున్నాను.

ఈపరిషత్తువారు సర్వగ్రంథపరిశీలనముతో నొకవ్యాకరణమును రచించిన బాగుండు ననియు నట్టిది త్వరలో రచింతురుగాక యనియుఁ గోరుచు నింతతో విరమించుచున్నాఁడను.

---

15

# సంగీతసాహిత్యసమ్మేళనము.

ఉభయభాషాప్రవీణ పంతుల లక్ష్మీనారాయణశాస్త్రిగారు,
విజయనగరము.

---

నాదబ్రహ్మోపాసనమే నాహృదయంబున నాలాపించెద ।

అ. ఆదిమధ్యాంతరహితంబై ఆధారంబై హృదయగతంబై
మాధవభజనామృతమహితంబై మంగళమయజీవితఫలమైన॥ నా॥

చ. రసకలితంబై పరమసుఖంబై రాగభావమయమై
అసమబ్రహ్మానందసమానంబై నాయజ్ఞానము మఱపించిన॥ నా॥

కవిచమత్కారజనకము లగుభావనలను బ్రతిపాదించుశబ్దార్థముల ద్వారా, రసోపాసకుండై పరబ్రహ్మాస్వాదసదృశ మగునానందమునుగల్గిం చునట్లు గాయకుండు మనోహరభావప్రతిపాదక మగు నాదోపాసనము ద్వారా పరబ్రహ్మాస్వాదతుల్య మగు నానందము నొదవించుచున్నాఁడు.

"నకారం ప్రాణనామానం దకార మనలం విదుః, జాతః ప్రాణాగ్నిసంయోగా త్తేన నాదోఽభిధీయతే" అని నాదశబ్దమున కర్థము నిర్వచింపఁబడినది. "ప్రాణానలసంయోగమువల్లా ప్రణవనాదము సప్తస్వరములై పరఁగ" అని "త్యాగరాజు." ఆనాద మోంకార మైనట్లు చెప్పియున్నాఁడు. అది-"ఆహతము అనాహతము" నని ద్వివిధముగాఁ జెప్పఁబడియున్నది. అనాహతనాదముచే ఋషులు పరబ్రహ్మోపాసనముఁ గావించుచున్నారు. ఆహతనాదమును గాయకు లుపాసించుచున్నారు. దీని వలనఁ బ్రజారంజనము గల్గుచున్నది, తన్మూలమున లోకోపకారసంపాదనము గాయకులకే సాధ్య మగుచున్నది.

శబ్దములు, విభావానుభావసాత్త్వికవ్యభిచారిభావప్రతిపాదనముచేత రసోత్పత్తిని గల్గించునట్లు, స్వరములు నాదబ్రహ్మోపాసనముచేత రసభావోత్పత్తిని గల్గించుచున్నవి. రసమే బ్రహ్మము. పరబ్రహ్మము రసస్వరూపుఁ డనుటకు మాకు "రసోవై సః రసం హ్యేవాయం లబ్ధ్వా

నందీ భవతి” అనుశ్రుతి ప్రామాణ్య మగుచున్న దని పండితరాయలు తన రసగంగాధరమునందుఁ దెలిపియున్నాఁడు.

“విభావాదిసంవలితమును, రత్యాదిమిళితమును, భగ్నావరణమును, నగుచైతన్యమే రసము'' అని యాలంకారికులు నిరూపించియున్నారు. ఈరసమే యానందజనకమైనది. విషయసంవలిత మగుచిత్తు నాలంబనముగాఁ గొనుటచే నిది పరబ్రహ్మానందముగా లేక పరబ్రహ్మానందసదృశమైనది.

ఈరసానందము కవులచేతను గాయకులచేతను గూడ సాధింపఁబడుచున్నది. కావునఁ గవిగాయకులచే మిక్కుటముగా సాధింపఁబడుట లోనాశ్చర్య మే మున్నది?

సత్యారాధకుఁ డగు కవికిని గాయకునకును గూడ గమ్యస్థాన మొక్క సత్యస్వరూప మగుపరబ్రహ్మమే. దేవతారాధనమూలముగా నిర్వికల్పసమాధ్యాదిసిద్ధియే గాంధర్వవేదమునకుఁ బ్రయోజన మని మధుసూదనసరస్వతి ప్రస్థానభేద మను గ్రంథమునందుఁ దెల్పియున్నాఁడు.

“కావ్యం యశసే'' అను నాలంకారికవచనమందుఁ గల కావ్యప్రయోజనము లగు కీర్తి, ధనము, వ్యవహారజ్ఞానము, నమంగళనివారణము, మహానందము (కాంతాసమ్మితత్వముచే) వాచ్యము గాకుండు నుపదేశము, గానమువలనఁ గూడ లభ్య మగు చున్న వని చెప్పవచ్చును. “ఏకమాపాతమధుర మన్య దాలోచనామృతమ్” అనుటచేత శీఘ్రోపస్థిత మగునానందమును గల్గించుసంగీతమే పై ప్రయోజనములను శీఘ్రముగా సంపాదించుచున్న దని చెప్పవచ్చును. అది ప్రస్తుతలోకానుభవముచేఁ గూడ నిర్ధారిత మగుచున్నది.

“సంగీత మపి” అను శ్లోకమునందు సాహిత్యము గొప్ప దను నభిప్రాయము గల దని కొంద ఱందురు- రెండును సమాన మైనవే యని నే నందును.

మాధుర్యముయొక్క శీఘ్రోపస్థితి మొదటిదానియందలిసుగుణము. కావుననే సంగీతము-“శిశు ర్వేత్తి పశు ర్వేత్తి వేత్తి గానరసం ఫణిః”అని కొనియాడఁబడినది.

ఆలోచనచే నమృతము వలె నుండుట రెండవదానియందలి సు
ణమై యున్నది.

కవి యిం దొకదానిని గొప్ప దని తెలుపుటలేదు. దీనికిఁ
మాణము వీనిని భారతీ స్తనద్వయముగా నిర్ణయించుటయే. మనోహ
ము లగుటచేతఁగాని క్షీరరసప్రకృత్యాదులచేతఁ గాని యిందొకదా
మహత్త్వమును నొకదాని కల్పత్వమును నిర్ణయించ వలనుపడదుగదా
కావున రెండును సమానములే యని నాయుద్దేశము.

ధ్వని రసవ్యంజక మగునట్లు వర్ణ(అక్షర)సంబంధము లేకయే
లనాదము రసవ్యంజక మగుచున్నది.

శబ్దార్థములు లేని కేవలనాదమువలన శృంగారాదినవరసముల
బుట్టింపవచ్చును.

కోయిలకుహూధ్వనియును శృంగార ముట్టిపడుచుండును. గా
భధ్వని హాస్యమును బ్రకటింప దని యెవ్వ రనఁగలరు ? సముద్రఘో
వీరరసప్రతిపాదకము గాఁ దోఁచుచుగదా ! కాకధ్వని బీభత్సరసము
గలుగఁజేయుచుగదా ! గుడ్లగూబ, యఱపు లేక మేఘనాదము భయా
నకరసప్రతిపాదకముగా నుండునుగదా ! సింహనాదము రౌద్రరసవ్యం
జకముగాఁ దోఁపదివా రెవ్వరు ?

(గ్రుడ్డి) మూఁగబిచ్చగానిధ్వని కరుణరసస్ఫోరకమై యుండును.
నిశ్శబ్దాకాశము శాంతరసప్రతిపాదకము గదా !

ఇట్లే గాత్రమునందలి యాయా (వర్ణసంబంధము లేని) ధ్వను
(సాత్త్వికాదిధ్వనులు) భక్త్యాదులను బ్రకటించును.

అద్భుతమగునీనాదరూప మగు సంగీతము, మాటలు లేకుండ
రసజ్ఞుఁ డగువాని నాకసమున కెగిరించును, స్వర్గాధిపత్యముఁ గావింప
జేయును. అద్వైతానందసాదృశ్యమును సంఘటించును.

అధికదీనునిఁ గావించి యంధతామిస్రములఁ బడఁద్రోయును. అలౌ
కికము లగుసుఖదుఃఖముల ననుభవింపఁజేయును.

దీనివలన సాహిత్యము లేకుండినను గూడఁ గేవలనాదరూప మగు సంగీతము సాహిత్యభావములను గొంతవఱకుఁ బ్రకటింపఁ గల దని తెలుచున్నది.

సాహిత్యభూషితము కాని కేవలము సంగీతమువలన సాహిత్యభావములు ప్రకటింపఁబడినట్లే రాగాదిజ్ఞానము లేనివానిచేఁ జదువఁబడినప్పటికిని, పద్యములలోను, గద్యములలోను, సంగీతము ప్రకటిత మగును.

కేవలనాదరూప మగుసంగీతమువలన నారసభావములు ప్రకటింపఁబడినప్పటికి నవి సుస్పష్టముగా గోచరింపఁబడవు. ఈనాదమువలన నీభావము ప్రకటింపఁబడి యుండు నని యూహింపవలసియే యుండును.

కేవల మగుసంగీతమున సాహిత్యమును గేవలసాహిత్యమున సంగీతమును నుండుటవలనను, శ్రుతిమాధుర్యము, రాగము, మొద లగు సుగుణములచే సామరస్య మేర్పడుటవలనను, శబ్దార్థములకు వలెను, పార్వతీపరమేశ్వరులకు వలెను, సంగీతసాహిత్యములకు నిత్యమగు నవినాభావసమ్మేళనము గల దని తెలుచున్నది. సంగీతముతోఁ గూడిన సాహిత్యమువలననే సంపూర్ణ మగు రసభావములు సుస్పష్టముగాఁ బ్రకటింపఁబడును.

సాహిత్యముతోఁగూడని కేవలనాదమువలన సుస్పష్ట మగు నర్థము లభింపనట్లే సంగీతముతోఁ గూడనిసాహిత్యమువలనఁ గూడ సుస్పష్ట మగు నర్థము ప్రకటింపఁబడఁజాలదు.

వాద్యములందు నాదరూప మగు సంగీతముమాత్రమే వినఁబడుటచే వానివలన భావములు స్పష్టీకరింపఁబడఁజాలవు. సంపూర్ణ మగురసోత్పత్తి గలుగనేరదు.

సభ్యులమనస్సులయం దాయారసములను భావములను గల్గించుటకు సాహిత్యయుక్త మగుసంగీతమే సమర్థ మగును. సాహిత్యయుక్త మగు సంగీతము వాద్యములందుఁ బ్రకటింపఁబడదు కావున నట్టిసంగీతము గాత్రసాధకునకే సాధ్యమగుచున్నది. కావుననే గాయకునకుఁ బ్రాధాన్యమును వాద్యకారునకుఁ బ్రక్క వాద్యమును యుక్తమగుచున్నది.

పరబ్రహ్మవాచకముగా వేదాంతములందు నిర్ధారితమగు నోం రము నుచ్చరించుట కొక్క మనుష్యకంఠమే సమర్థమైనది- ఆప్రణవ సాహిత్యమును, అసాహిత్యమును బోధించునదియే సంగీతము.

దివ్యమాధుర్యసంకలితమును నుత్తమంబును నగు ప్రణవనాదశ్ర వణముచేత సత్కావ్యశ్రవణముచేతను వలెనే దుర్మార్గుఁడు సైతము న్మార్గుఁడగుచున్నాఁడు.

సత్కావ్యమువలెనే యట్టిప్రణవనాదముగూడ నరుదుగా నున్న

గాయకశ్రేష్ఠులు దీనికొఱకు గాఢతపోదీక్ష వహింపవలసియుం దని విన్నవించుచున్నాను.

గీత, వాద్య, నృత్యముల చేరికవలన సంగీతమేర్పడు నని యొ మతము. గీతవాద్యముల కూడికయే సంగీతమని వేఱొకమతము. మొ టిమతమునుబట్టి హరిదాసులే (భాగవతారులే) గాయకులగుదురు. రెం వమతమునుబట్టి ప్రస్తుతము గానసభలందుఁ బాడుచున్నవారును గాయ లగుదురు. మొదటిమతమే యుత్తమమైనట్లు నిర్ణయింప వీ లగుచున్న

శాస్త్ర మన నేమి? సంగీతశాస్త్రజ్ఞుఁ డెట్టివాఁడు?

అనుభవమే శాస్త్రరూపముగాఁ బ్రకటింపఁబడును. అనుభ రుద్ధ మగు శాస్త్రము శాస్త్రము గానేరదు. పూర్వము గాయకశ్రేష్ఠ నిర్దిష్ట మగుసంగీతానుభవమే సంగీతశాస్త్ర మైనది. ప్రపంచమందునగు ప్రతిశాస్త్రము ననుభవరూపమే యై యున్నది. లక్ష్యము ముందుపుట్టును తరువాత దానిని సంగ్రహించినది లక్షణము. నిర్దుష్ట మగు లక్ష్యము విరుద్ధ మగుశాస్త్రము శాస్త్రము కాదు.

యోగ్యములగు నూతనానుభవములచే శాస్త్రములు తిరుగ శాల్యము నొందుచుండును. వివిధశాస్త్రములును నిట్లు వైశాల్యము బొందుచునే యున్నవి.

పారతంత్ర్యమువలన మనశాస్త్రపరిశోధనలు చాలకాలముక్రిం టనే యాఁగి పోయినవి. ప్రస్తుతానుభవము పూర్వానుభవముకం జాల హీనదశయందున్నది. కావున మరలఁ బరిశోధన జరుగవలసియు న్నది. ఇందుకొఱకు సంగీతరసాలంకారాదివిషయములు గలభరతాది

గ్రంథములను బఱుపవలయును. సామవేదముయొక్క గానమునకు సంబంధించిన సంగీతగ్రంథములు కొన్నిగలవని తెలియుచున్నది. అవిమిగుల ప్రాచీనకాలికములుగా నిర్ణయింపఁబడినవి. మఱియు, సంగీతరత్నాకరము మొదలగు సంగీతగ్రంథములఁ బరిశోధించి గాయకులు యథార్థమగు సంగీతమును బ్రకటింపఁ గోరెదను.

నవీనులచే నిటీవలఁ బ్రచురింపఁబడిన, సంగీతవిద్యాదర్పణము, సంగీతసుధాంబుధి మొదలగుగ్రంథములయందుఁ గలసాహిత్యగ్రంథము చాలవఱకు దోషసంకలితమై యున్నది. కావున గాయకులు తెలుఁగునందుఁ బ్రకటింపఁబడిన యీగ్రంథములను బ్రమాణముగా గ్రహింపఁగూడ దని మనవిచేయుచున్నాను.

నిర్దుష్ట మగు సంగీతసాహిత్యసమ్మేళనము గలగ్రంథములు తెలుఁగునందుఁ బ్రకటింపఁబడవలయును. దీనికై గాయకోత్తములు కృషి గావింపఁగోరెదను. ఇంతవఱకు బ్రకటింపఁబడిన గ్రంథములలో నిర్దుష్టములగుగ్రంథములు చాలఁ దక్కువ.

సువిమర్శకులగు సంగీతశాస్త్రజ్ఞులు నూతనమగు సంగీతానుభవమును విమర్శించి లక్షణసమన్వయమును గావింపవలయును.

సంగీతసాహిత్యములలో నెంతను బాండిత్యము లేని యల్పజ్ఞుఁడనగు నేను సంగీతసాహిత్యసమ్మేళన మొ ర్చుట సాధ్యము గాని పనియైనను త్సాహాతిశయమువలన నించుక పరిశోధనము చేయఁదలఁచుచున్నాను. ఇందులకు విద్వాంసులప్రోత్సాహ మత్యావశ్యక మయియున్నది.

శ్రుతి స్వర రాగ తాళ లయజ్ఞానములు గలవాఁడు సంగీతశాస్త్రజ్ఞుఁడు. ఇతఁడు చమత్కారజనక మగుభావన లేనిచో గాయకుఁడు కాఁజాలఁడు. స్వరరాగాదిజ్ఞానము గల్గి శక్తి వ్యుత్పత్తులు గల్గిన భావనాశాలి గాయకోత్తముఁ డగుచున్నాఁడు. స్వరలయాదిజ్ఞానము లేకయే పాట పాడువా రనేకు లున్నారు. శబ్దార్థజ్ఞానము లేని కవుల కావ్యములవలెనే వారిగానము నింద్యము కావచ్చును. శబ్దార్థములు మాత్రమే కవిత్వము కానట్లు స్వరములే సంగీతము గాదు.

కవిత్వమునకు శబ్దార్థాదిజ్ఞాన మావశ్యక మైనట్లు గాయకునకు స్వరలయాదిజ్ఞాన మావశ్యకము.

ప్రతిభ లేని శాస్త్రజ్ఞుఁడు గాయకోత్తముఁ డనుకొనుటకంటెఁ బరిహాసాస్పద మైనసంగతి వేఱొకటి యుండదు.

భావము లేని స్వరకల్పనము భావనారహితుఁ డగు శాస్త్రజ్ఞునిచేఁ గావింపఁబడు చుండును. అది శాస్త్ర మని యవివేకు లగుజనులు విశ్వసింతురు. భావహీన మగుసంగీతము, సంగీతము కానేరదు. అర్థము లేని మాటవలె సర్థము లేని పాటకూడ నపరిగ్రాహ్యము.

కావున స్వరరాగలయాదులే సంగీతము గానేరవు.

శబ్దార్థాలంకారములు రసోత్పాదకములై కవిత్వ మగునట్లు స్వరరాగలయాదులును, రసోత్పాదకము లైనపుడే సంగీత మగుచున్నది.

కర్ణాటకపద్ధతి గలగానమే సంగీత మనుబూటకపు వాద మొకటి గలదు. దీనిని గొందఱు విశ్వసించుచున్నారు. ఇది యజ్ఞానమూలక మగు నంధవిశ్వాసము.

ప్రపంచమునం దనేకములగు బానీలుకలవు. శ్రుతిస్వరాదిజ్ఞానము గలభావనాశాలిచేఁ బాడఁబడిన యేబానీయును శాస్త్రవిరుద్ధము కాదు. బొంబాయిబానీ గాని హిందూస్థానిబానీగాని సంగీతము కాదనుట యవివేకవిలసితము.

కృష్ణభాగవతుల నాడుసాంప్రదాయ మాంధ్రులలోఁ జిరకాలమునుండి యుఁ గలదు. వీనియందలి గేయములను శ్రుతిస్వరరాగలయ యుక్తముగాఁ బాడుభాగవతు లగువేమగాంద్రనేకు లిప్పటికిని గలరు.

ఈబానీ సామాన్యముగా పల్లెలయం దుండువారికిఁ బరిచిత మై యుండును.

ఇట్లే తోలుబొమ్మల నాడించువారు పాడెడిబానీ వేఱొకరీతి నుండును. ఇట్లే బోనెలవానిపదములయందలి బానీయు హరికథలందు గలమట్లమొక్క బానీయు భజనకీర్తనలఁ బాడువారిబానీయు వేర్వేఱుగ నుండును.

శ్రుత్యాదిజ్ఞానయుక్తముగఁ బాడఁబడినను గొందఱు నాగరకంమన్యులు పైవానిని సంగీతముగా నంగీకరింపరు. ఇది దుర్భ్రమ.

శ్రుత్యాదిజ్ఞానరహితముగా, త్యాగరాజకృతులు పాడినను నదిసంగీతము కానేరదు. శ్రుత్యాదియుక్త మైనపుడు తందనాలపదాలుకూడ సంగీతమే యని నానిశ్చితాభిప్రాయము. బహుళనియమయుక్తము నుక్రమసాధనసంకలితము ను నగు, సంగీతము, ఉత్తమసంగీతముగా నంగీకరింపఁబడుట న్యాయమే యగును.

దానిని గ్రహింపఁగలవారు కూడఁ గొలఁదిగనే యుందురు. దీనికి గానసభలే దృష్టాంతమై యున్నవి. కాని యివి యింకను సంస్కరింపఁబడవలసి యున్నవి. ఇది యనవసరము లగుస్వరకల్పనలకు, లెక్కపంపకములకు, యుద్ధములకుఁ బ్రాధాన్యము నొసంగుట మాని రసభావములకు భగవద్భక్తికిని బ్రాధాన్య మొసంగు టుచిత మని మనవిచేయుచున్నాను. గానసభలయందు "ప్రోగ్రాము"నిర్ణయము రసభావభంజకమేమో యని నాతలంపు సహృదయులు విమర్శింతురుగాక.

ఆంధ్రులలోఁ బలువు రనుకరణాసక్తు లగుటచేతఁ దమప్రత్యేకతాలక్షణ మగు నాంధ్రబానీని విడిచి దాక్షిణాత్యులను, బొంబాయివారిని, హిందూస్థానీవారిని ననుకరించుచున్నారు.

ఆయాసంగీతముల విధానముల గ్రహియించుట మంచిదే కాని యిట్లు ప్రతిభాశూన్యముగా వారిసంగీతము ననుకరించుట యభివృద్ధికిభంగకరము.

ఆంధ్రభాషవలె గానమున కనుకూలించు భాష వేఱొంటి కానుపింపదు. నవరసములను బ్రకటింపఁజేయఁగల సౌకుమార్యాదిగుణము లొక్కయాంధ్రభాషయందే కలవు. కావుననే "దేశభాషలందుఁ దెలుఁగులెస్స" అనినాఁ డా మహారాజశేఖరుఁడు. కావుననే దాక్షిణాత్యగాయకులు త్యాగరాజాదులకృతులనే యాదరించిరి. ఆంధ్రభాష మనోహరవర్ణసంకలితము. ఆంధ్రసాహిత్యవిశిష్ట మగుసంగీతము స్వర్గసుఖతుల్యము. అనుపమానభావపదమంజులము లగుత్యాగరాజకృతు లాంధ్రుల భాగ్యచిహ్నములు !

వీనిని భావయుక్తముగాఁ బాడుటను గాయకు లింకను నభ్యసింపవ లసియున్నది.

త్యాగరాజు పాడిన స్వరసంప్రదాయము దాక్షిణాత్యగాయకుల కెంతవఱకు లభ్యమైనదో తెలియదు. కాని యిప్పుడు వారు పాడుచున్న కృతులలోఁ బెక్కింటి కనుగుణ మగు భావప్రకటన, గల స్వరవిధానము వారిలోఁ గాన్పించుట లేదు. ఇట్లు భావహీనముగా, త్యాగరాజు గాన ముచేసి యుండు నని సహృదయు లూహింపఁజాలరు.

వీరిలో ననేకులకు భాషాజ్ఞానము లేనందునఁ గృతులలోని యర్థ వంతము లగుపదములు నిరర్థకములుగా మాఱినవి. భాషాభావములయొ క్క జ్ఞానము లేనందుననే భావమునకు విరుద్ధ మగు స్వరముల పోకడ యేర్పడెను.

అర్థము చెడుటకు, పదములమార్పునకు:—

భుజగభూషణా: రామ:- తారకాధిపా: రామ:- తరయా రఘువర:

శ్రీరాముఁడు భుజగభూషణుఁడు, తారకాధిపుఁడు గాఁ జేయఁ బడియెను. 'భుజగభూషణుఁడు! తారకాధిపుఁడుగాఁ జేయఁబడియె. 'భుజగ భూషణార్చితా" అనియు, "తారకాధిపాననా" అనియు నుండవలెను. "తరయా" అనుచోట, "తారయ!" (తరింపఁజేయుము) అని యుండ వలెను.

"జనియించెదరు జాలినకరుణతో,
మొదలు సంటగఁజేయు మందనుచు, (ఇందర్థము లేదు.)
ఇట్లే, తొలి నేను జేసినపూజా, ఫలమే
ఆడ మోడిగలదె రామయ్యా.

మొదలగు కృతులయందు సరియగు నర్థము లభింపదు.

గాయకులు కృతులయొక్క భావార్థములనైన నెఱుఁగుటకుఁ బ్ర యత్నించుచుండుట యన్యాయము.

గాయకులు కొంతవఱకైన సాహిత్యజ్ఞానమును సంపాదింపనంత వఱకు, నిట్టిదోషము లు తప్పవు.

సంగీతమునందు సాహిత్య మెట్లున్న నేమి ? అను దురభిప్రాయము కొందఱికిఁ గలదు. ఈయభిప్రాయమును పామరులు హర్షింపవచ్చును. కాని పండితులు హర్షింపఁజాలరు. సాహిత్యార్థమునకుఁ బ్రాధాన్యము లేకుండఁ గృతులను పాడుటకంటె వానిని విసర్జించి నాదరూప సంగీతముల నాలపించుట యుక్తము.

సంగీతసాహిత్యములలో సాహిత్యభావమును సంగీతము పోషింపవలెను. ప్రస్తుతకాలమున నట్లు పాడుటలో గానకళానిధి బిరుదాంకితులును మద్గురువర్యులు నగు బ్ర|| శ్రీ పట్రాయని సీతారామశాస్త్రి గారును, వాగ్గేయకారక బ్ర|| శ్రీ హరి నాగభూషణముగారు నగ్రగణ్యు లని చెప్పకతీరదు. సాహిత్యభావపోషకము గాని సంగీతము సంగీతము కాదు.

త్యాగరాజకృతులలో సాహిత్యమునకుఁ బ్రాధాన్యము లే దని మ. రా. పి. సాంబమూర్తి అయ్యరుగారీనడుమ విజయనగరాంగ్లకళాశాలయం దుపన్యసించియున్నారు. పై వాదము యుక్తివిరుద్ధము ననుభవవిరుద్ధమును నై యున్నది. కొందఱు దాక్షిణాత్యగాయకులచే భావార్థశూన్యముగాఁ బాడఁ బడుచున్న కృతులను గాంచి వీ రిట్టిభ్రమకు లోనై యుందురు. త్యాగరాజు మహాభక్తవరేణ్యుఁడు. మహాకవి. భావనాశాలి. అట్టిమహానుభావుఁడు, భావహీనముగా, సాహిత్యార్థమును బోషింపని సంగతులతోఁ గృతులను బాడియుండు ననినచో నెవ్వఁడును నమ్మఁజాలఁడు. ఇప్పు డీకృతులను గొందఱు దాక్షిణాత్యగాయకులు పాడినట్లే పూర్వము త్యాగరాజు పాడినట్లు నిదర్శనము లేదు. కావున వీరి వాదము నిరాధారము, వీని కాధార మొక్క దాక్షిణాత్యగాయకుల త్యాగరాజకృతిగానవిధానమే.

కావున త్యాగరాజకృతులందలి సాహిత్యమునకే ప్రాధాన్య మనుట నిర్వివాదాంశము. గాయకులు తత్ప్రాధాన్యమును బాడుచేయుటచే నిట్టివాదమున కవకాశము గల్గినది. త్యాగరాజకృతులలోని గంభీరభావములు విశేషముగా సంగీతమును బ్రకటించుటకు వీలు గల్గించుచున్న వని చెప్పవచ్చును.

గీతములు, వర్ణములు, కృతులు, మున్నగువానియందలి లక్ష విశేషముల నించుక విమర్శించెదను.

ఆంధ్రభాషయందుఁ గలపద్యములలోని సంప్రదాయము గేయ ములం దనుసరింపఁబడిన దనుట నిర్వివాదాంశము.

పద్యములందుఁ దాళము గలదు- కాని యవి గణనిబద్ధము కావుననే తాళజ్ఞానము లేనివాఁడును బద్యముల వ్రాయ వీలగును. తా ళము ననుసరించి శబ్దములను గూర్చుట గేయలక్షణము. నియమితగ ముండవలె ననునియమము వీనియందు లేదు. కావుననే తాళజ్ఞానము లేనివాఁడు గేయములను వ్రాయఁజాలఁడు.

ప్రాసనియమము కన్నడమునందును నాంధ్రమునందును గలదు యతినియమ మాంధ్రభాషయందే గలదు.

ఇట్టిది యాంధ్రభాషకు సహజ మైనది. కావుననే జానపద పాటలలోఁ గూడఁ బ్రాముఖ్యము నందినది.

ప్రాసము లేనిపాట లుండిన నుండవచ్చును గాని సామాన్యముగ యతి లేని పాటలు కానుపింపవు. అర్థము లేకుండినను సరే యతి యు డవలెను! యతికొఱకు వ్యర్థపదము లైనను బ్రయోగింపవలయును! ఇ చెవుల కింపుగా నుండుటచేత నన్నయభట్టారకాదు లనుసరించిరి. ఇ టివఱకును బద్యకవులేమి, గేయకవులేమి యనుసరించుచున్నారు. జాన ద లగేయములలో యతిని నిర్వహించుటయందుఁ గలదీక్షను మీఱగ నింపుఁడు!

"చేతిగాజులతోను చెల్లెళ్ళతోను."

ఇట్లని యతికొఱకు వ్యర్థపదములను బ్రయోగింపవలె నని నా యుద్దేశము కాదు. సమర్థులగు కవులు వ్యర్థపదములు లేకుండ యతి ప్రాసనియమమును నిర్వహించుచున్నారు. కాఁగా, గణయతిప్రాసనియ మము పద్యములం దెట్లనుల్లంఘనీయమో తాళయతిప్రాసాదినిర్ణయ ము వర్ణములందును గృతులందును, బదములందును, నట్లే యనుల్లంఘ నీయమైనదిగా ననుసరింపఁబడుచున్నది. శ్రవణమాధుర్యమును సంపాది

చుటలోఁ బద్యములలోఁ గేయములలో సౌలభ్యము గల దని యంగీక రింపనివా రుండరు గదా: అట్టిగేయములలో యతిప్రాసల యావశ్యకత హెచ్చుగానుండు ననుట నిర్వివాదాంశము.

పిళ్లారిగీతములందు యతిప్రాసనియమము సరిగా ననుసరింపఁబడి నట్లు కనుపింపదు. అనేకము లగుపెద్దగీతములయందు యతిప్రాసనియమ ముకానుపింపదు.

ఉ. (ఆనందభైరవి. ఆదితాళము) కమలసులోచన—

శ్లోకములను స్వరము ననుసరించి యిమిడ్చి గీతములుగా వ్రాయు ట యొకపద్ధతి.

ఉ. భైరవి. శ్రీ ఇరఅమా—

ఇందు యతిప్రాసము లుండుట కవకాశము లేకపోవుట యటుండ భావపోషణమునకే యవకాశము లేకుండ నున్నది. ఇట్లు గీతములను వ్రాయుట యన్యాయ్యము.

గీతము లనేకములు కన్నడాదిభాషలయం దున్నవియే యాంధ్రు లకు శరణ్యము లైనవి. వీనికి బదులుగా నేను వ్రాయుచున్న యాంధ్రగీత ములను మున్ముందు గాయకలోకమునకు సమర్పింపఁ బూనియున్నాను. గీతములందు-పల్లవి, అనుపల్లవి, చరణము, యతిప్రాసాదినియమము లేన ట్లు తోఁచుచున్నది. స్వరజితులయం దీయతిప్రాసనియమము గోచరించు చునే యున్నది. సంస్కృతగేయములం దీయతిప్రాసనియమము లేకున్నను నాంధ్రలక్షణానుయాయులచే వ్రాయఁబడిన కొన్ని సంస్కృతగేయము లం దీనియమము పాటింపఁబడినది.

వర్ణములవలన లయజ్ఞానము, స్వరజ్ఞానము, అకార ఇకారాదు లను హెచ్చుగ గాత్రమునందు పాడఁగల్గుటయు ననుభవసిద్ధమై యున్నది. వర్ణములందు, పల్లవి, అనుపల్లవి, చరణములు నుండును. పల్లవియం దొకటిగాని రెండుగాని యతులుండును. అనుపల్లవియందును నిట్లే యొ కటిగాని రెండుగాని ప్రాసము లుండును. పల్లవికి ననుపల్లవికిని బ్రాసని యమ ముండును. చరణమునకు పల్లవి యనుపల్లవుల కున్నప్రాస ముండ నక్కఱలేదు.

చరణములెక్కువగా నుండినయెడల వానికి వేఱుగాఁ బ్రాసము
డును. మొదటియావృత్తియందలి మొదటియక్షరమునకుఁ (సవర్ణ
సమానమగు నక్షరము రెండవయావృత్తియందలి మొదటియక్షర
యుండుటయే యీయతినియమము. అట్లే మొదటియావృత్తియ
రెండవయక్షరమునకు సమాన మగునక్షరము మూఁడవయావృత్తి
దలి రెండవయక్షరమై యుండుట ప్రాసనియమము. పద్యములంద
తిప్రాసల కెట్టినియమము గలదో యట్టినియమమే యిందును నాదర
బడినది. కావున వర్ణములయందును గృతులయందును యతిప్రాస
మము లే దని తలంచుట యవివేకము. ఇట్లనుటకు వలసినంత ప్రమ
గ్రంథము నాయొద్దఁ గలదు.

శంకరాభరణము.

ప. సామీ నిన్నే కోరి చాల మరులుకొన్నదిరా

అ. తామసము సేయక దయఁజూడరా గోపాల.

చ. నీరజాక్షి నీపై ...

ఇట్లు యతిప్రాసనియమముగాఁ బాటింపఁ బడిన దని వందఁ
లఁది వర్ణములను గృతులను బ్రమాణీకరింపఁగలను.

వర్ణకారులు పాటించిన యతిప్రాసనియమమునకు విరుద్ధము
బ్రస్తుతసంగీతవిద్వాంసులు వీనిని బాడుచున్నారు.

కొన్ని సంగీతగ్రంథముల (సంగీతవిద్యాదర్పణాదుల) యందుఁ
డ నీనియమమునకు విరుద్ధముగా సంగీతగ్రంథము కనఁబడుచున్న

శ్రీరాగము—(ఆది)

ప. సామీ! నిన్నే కోరి యున్నాను—చలము సేయ మేరగాదుర॥
అ. భూమిలో వెలయు శ్రీగర్భ—పురినివాస! పశుపతీశ॥
చ. నీరజాక్షి నీపై॥

ఇందు పల్లవి, యనుపల్లవుల రెంటియందును యతిగల దని స
దయులకు సుస్పష్టమే గదా!

ఇది సంగీతవిద్యాదర్పణమందు యతికి భంగకరముగా ముద్రి
బడి యున్నది. ప్రస్తుతము సంగీతవిద్వాంసులచే నట్లే పాడఁబడుచున్న

ఇంత ముఖ్యమగువిషయములో సంగీతవిద్వాంసులు శ్రద్ధతీసికొనకుండుట యన్యాయ్యము. వీరిలో ననేకులకు యతిప్రాసాదు లున్న వని తెలియక పోవుటయే దీనికిఁ గారణము- తెలిసి యుండినచో నిట్లు పాడుట యలసత వలన నైయుండును. వీ రెట్లు యతిభంగము చేయుచున్నారో

3. అ. నీనీ. నీసని. పమారి. గరిసరి. సాసాసామరి. పమనిప. సనిమప.
భూఊఊమిఇ ఇలోవె ఎఎలలఅయూఊఊ. శ్రీఇగలర్భల పుడరిఇ
నిసరి గారిసరినిసానిపనిసరి. సనీపదనిపమరిగారినిసరిమ॥ పా॥
నిఇఇఈఇ వలఅసఆఅ వ అఅఅ శుఊపలఅళఅలతి ఈఇఇఇఇశ!॥

"పురినివాస" అనుదానియందుఁగల పువర్ణము 4వ ఆవృత్తిమొక్క మొదట నుంచుట వర్ణకవి యుద్దేశముగదా!

,,　　మరి-పమనిప. సనిమప
,,　　ఊఊ ఊఊ శ్రీఇ గలర్భల

నిసరీ గారిసరి నిసానిపనిసరి సనీపదనిపమరిగారినిసరిమ.
పుడఊరిఇనిఇవలఅస అఅఅపఆసు ఈఊపలతి ఈఇఇఇఇశ.

వర్ణములలో నర్థస్ఫూర్తి యెట్లును లేదు గావున నిట్లు సర్దుకొని పాడినయెడల "పువర్ణము" ఆవృత్తిమొదటికి వచ్చి యతిభంగము కాకుండును. కావున సంగీతవిద్వాంసు లిఁకముం దట్లుచేయుదు రని నమ్ముచున్నాను.

ఇట్లే యనేకవర్ణములలో యతిప్రాసనియమమును గాయకులు భంగపఱచిన సందర్భము నాయొద్దఁ గలదు. ముస్ముందు నేను బ్రకటింపఁబూనిన "సంగీతసాహిత్యసమ్మేళనము" అనుగ్రంథమున వానిని సమగ్రముగాఁ బ్రకటించెదను. దానినిఁ బరికించి సంగీతవిద్వాంసు లిట్టిదోషములనుండి విముక్తులు గాఁ గోరెదను.

అపస్వరముల నుచ్చరించుటవలన సంగీతమున కెట్టినష్ట మని విద్వాంసులు భావింతురో యతిప్రాసనియమభంగమువలన సాహిత్యమున కట్టినష్ట మేర్పడు ననియు, సంగీతసాహిత్యములలో దేనికి భంగము కలిగినను

రెండిటికిని భంగముకల్గి నట్లుగానే యెంచవలసి యుండు ననియును,
గీతవిద్వాంసులకు మనవిచేయుచున్నాను.

వర్ణకవులు యతిభంగముఁ గావించిన పరిస్థితులు చాలస్వల్ప
గానున్నవి. ఇదిపొరపాటువలన జఱిగిన దని నిర్ణయింపవచ్చును.

నాట—సామి: నిన్నె కోరినాను—చాలదయఁజూడర !

భూమివెలయు శ్రీ వేంకటేశ !

'పఫ బభ వ' లకు యతిమైత్రి లేదు. యతి యుండు నను
చే నిట్లు జఱిగినను జరుగవచ్చును. లేదా పొఱపాటై యుండవచ్చు
ఇట్టియుదాహరణములు స్వల్పముగనే లభించినవి. వర్ణకవులకు య
యమము పాటింపవలె నను నుద్దేశము లే దనుట పొసగనిమాట. ని
మపాలనోద్దేశ మే వారి కున్నట్లు వందలకొలఁది యుదాహరణము లీ
గలను.

వర్ణములలో నకారాదులు హెచ్చుగా నుంచుటకు వీ లగు
వర్ణకవులు చిన్నచిన్న వాక్యములను వ్రాసి యున్నారు. అందువల
వాస" ఇత్యాదులగు ననేకస్థలములందు 'నిఇఇఈఇనఅసఇఅ' అని
స్వాక్షరములనుగూడ అకార, ఇకారాదులచేఁ బెంచుట వర్ణముల
గానఁబడుచున్నది.

సంస్కృతకవుల గేయములలో దీర్ఘాక్షరములకు మఱిం
దైర్ఘ్యము సంపాదించుట కానవచ్చును, గాని, హ్రస్వాక్షరములను
ముగాఁ జేయుట యెచ్చటనో గాని కానుపింపదు.

అట్లు వ్రాయ వీ లగు ననియు, గీతాదులందు స్వరానుసారి
సాహిత్యము లేదనియు నేను, రెండుసంవత్సరములక్రిందట జఱిగిన భా
తీర్థసభయం దుపన్యసించియున్నాను. ఇట్లు వ్రాయకుండినయెడల
బోధగలుగనేర దని గీతవర్ణకారు లింకముందు గమనింపఁ గోరెదను.

అష్టపదులందును, తరంగములందును దీర్ఘాక్షరము లున్నచో
ను, సంబోధనాదు లున్నచోటను అకారములను హెచ్చించుట
బడును గాని హ్రస్వాక్షరములయొద్ద అకారములను పెంచుట సా

ణముగాఁ గానుపింపదు. పదవిరామమును మాత్ర మొక్కొక్కచో ప్రా స్వాక్షరమున కించుక దీర్ఘ ముంచుట కానవచ్చును. ఇట్లుండుటవలననే వానియం దర్థబోధ గలుగును.

"పశ్యతి దిశిదిశి రహసి భవంతం
తదధరమధుర మధూని పిబంతం
నాథహరే! జగన్నాథహరే!
సీదతి రాధావాసగృహే కృష్ణ!"

గాయకులకు ఛందోలక్షణాది జ్ఞానము లేకుండుటవలన త్యాగరాజాదుల కృతులయందుఁ గలిగిన దోషములను వేఱొకవ్యాసమునందుఁ జర్చింపఁ దలఁచితిని. కావున నింతతో దీనిని విరమించుచున్నాను.

ఆంధ్రసాహిత్యపరిషత్తు నాను నాయభిప్రాయములను విమర్శించి పై విషయములను దేశవ్యాప్తములు గావించెద రనియు నీవ్యాసమును వారిపరిషత్పత్రికయందుఁ బ్రకటించెద రనియు విశ్వసించుచున్నాను.

ఈనడుమ విశాఖపట్టణమునందుఁ జరుపఁబడిన, భారతీతీర్థసభ యందు నే నీవిషయమును గూర్చి యుపన్యసింపఁగా నాయభిప్రాయ ముతోఁ జాలవఱకు కేకీభవించి నాకు మిగులఁ బ్రోత్సాహము నిచ్చిన సాహిత్యసమ్రాట్టు లగు శ్రీ జయపురాధీశ్వర శ్రీ విక్రమదేవవర్మమహా రాజావారికిని, నాకు సంగీతవిద్యాగురువు లైన గానకళానిధి బ్ర. శ్రీ పట్రాయని సీతారామశాస్త్రిగారికిని ధన్యవాదముల నర్పించుచున్నాను.

---

# శ్రీవిశుద్ధాంధ్రభాషాదుర్దశ.

(ఆంధ్రసాహిత్యపరిషత్పత్త్రవ్యాసము.)

విద్వత్కవిరత్నాదిబిరుదాంచితులు పుల్య ఉమామహేశ్వరశాస్త్రిగారు
పాలకొల్లు.

---

శ్లో. యస్యా గీర్వాణవాణీ శిర ఉదరతలం తద్భవా దేశ్యవాణీ
పాదాన్తా ధశ్శరీరం వదన మపి పరా వ్యాకృతిః ప్రాణవాతాః
సాహిత్యాత్మా రసాఙ్గా న్యఖిలశుభకలా గ్రామ్యవాణీచ పాయు
స్సైషాన్ధ్రీ స్వాఙ్గభేదా త్తుకవిజనకృతా త్కోపి వాన్యాశిగుప్త్యై. ౧

శ్లో. శ్రీమన్నన్నయతిక్కనాఖ్యభయవాగీశానసంవర్ధితా
శ్రీమత్కృష్ణమహీపతిప్రముఖసద్భూపాలసంభూషితా
విద్వద్రాజరసజ్ఞమస్తకధృతా సద్దేశ్యసమ్మానితా
వాణ్యాన్ధ్రీ విలపత్యహో కలివశా దాత్మావనా యాఘనా. ౨

మహాశయులారా! గతవర్షములలో నేను వ్రాసిన వ్యాసము వలన నెట్టిప్రయోజనము కలిగిన దని విచారించిన నాచారనిర్వహణమే యని తేలినది. ఇపుడు గూడ నట్టిదియే యైన నాచారనిర్వహణమే ఫలమగు ననియు లేకున్న నుద్దిష్టఫలము చేకూరు నను నాసతోనే యావు ల కుపక్రమించుచుంటిని. పరిషన్మధ్యమున నేప్రాచీనవీనకవుల కవితామతల్లికలం గూర్చియో లేక యేయతిప్రాసాదులం గూర్చియో లేక యేవ్యాకరణాంశములం గూర్చియో యాన్ధ్రభాషాభిమాను లగు విద్వద్వతంసులచే వ్రాయంబడిన వ్యాసరాజములం జదువుటయుం బారిషద్యులు విని మెటో మస్తకములం గదల్చుటయు వానిని బరిషత్పత్త్రికాముఖమున వెల్లడించుటయు, వీనివలన నుభయులును గృతార్థుల మని తలంచుటయు నొకయాచార మైనది. కాని యాన్ధ్రసారస్వతోద్ధారకసంఘము లెన్నియున్న నధోగతిం జెందుచున్న యాన్ధ్రభాషాయోషామణి నుద్ధరించుటకు వలయు కార్యక్రమము నారంభించి పనిచేయుచున్న సంఘ మొక్కటియు నింతవఱకుం గానరాకుండుట విచారకరము. తమతమయభిమా

నానుసారము బిరుదముల నొసంగుటకు మాత్రమే యేర్పడిన సంఘము లవారు తమకర్తవ్యముల నిర్వహించుచుఁ బత్త్రికాముఖముల వానిని వెల్లడించుచున్నారు. ఆన్ధ్రదేశమున విశ్వతోముఖముగఁ బ్రచారమున నున్న పత్త్రికలు సాధారణముగ గ్రామ్యభాషకును భావకవితకును బ్రాముఖ్యము నొసంగుచు నాన్ధ్రభాషాయోష యలంకారములం దీసివైచుటయే గాక ముఖాద్యవయవములఁ గూడఁ గ్రమక్రమముగ ఖండించుచున్నవి. ఇందులకు సుప్రసిద్ధవిద్వత్కవులే స్వీయవ్యాసనిశితాసిధారలఁ బ్రయోగించి పోషించుచువారుగ నున్నారు. ఇట్టులే యాధునికకవికులశిరోమణులు రచియించి వెలువడఁజేయుచున్న గ్రంథరాజములు గ్రామ్యభాషాభూయిష్ఠములై భావకవితావలంబిగీతమాలికలతో నిండి భావికవిమార్గదర్శకములై విశుద్ధాన్ధ్రభాషావినాశనోద్యమమును బోషించుచున్నయవి. మహోద్యమముతో నెట్టకేల కేతెంచి పనిచేయుచున్న యాన్ధ్రవిశ్వవిద్యాలయమునుండి ప్రతివత్సరమునను దయారగుచున్న ప్రవీణు లేమి బి యే. మున్నగు పట్టపరీక్షలలో నుత్తీర్ణులైన విద్వన్మణు లేమి యాన్ధ్రభాషాస్వరూపలోపమునకే యత్నించుచుండుట సర్వవిదితము. ఈయాశమును వీరివ్యాసము లేమి వీరి గీతములేమి స్పష్టముగా రుజువుచేయుచున్నవి కదా. వీనివలన విశుద్ధాన్ధ్రభాష యత్యల్పకాలముననే స్వరూపలోపము నొంది యపభ్రష్టరూపముతోనే యుండుదశకు వచ్చిన దని లోకజ్ఞులకుఁ దేటతెల్లమే. అయిన నిటఁ గొన్ని యంశములు విచారణీయములు కాకపోవు- విశ్వవిద్యాలయ పట్టపరీక్షలలో నుత్తీర్ణులైన విద్వాంసులు భాష నిట్టిదశకుఁ గొనివచ్చుటకుఁ గారణము వా రేర్పఱచిన పాఠ్యగ్రంథములయందలి లోపమా- లేక యాయాకలాశాలలలో నుండునట్టి యధ్యాపకుల యధ్యాపనమునందలి లోపమా- లేక యధ్యేతల యధ్యయనమునందలి లోపమా- లేక యుత్తీర్ణు లగునీవిద్వత్పుంగవులు వశ్యభాషులై మతధర్మములయందు వలెఁ గలిప్రేరణమున నపభ్రంశప్రచారముం గావించి భాషాసంస్కర్తలను విఖ్యాతిం గాంచఁ దలఁచి బుద్ధిపూర్వకముగఁ జేయుచున్న సంస్కరణాభాసప్రవృత్తియా

యని విమర్శించునపుడు నిర్ణీత పాఠ్యగ్రంథములు భాషాతత్త్వవిజ్ఞానసా
ధకములును శాస్త్రతత్త్వవిజ్ఞానసాధకములు నైనయుత్కృష్టగ్రంథము
లగుటంబట్టి వానిలోప మరుటకు వలనుపడదు- కాని యవి విస్తరిం
యేర్పఱుపఁబడియుండుటంబట్టి యిప్పటి "టీపార్టీ"లలోని భోజ్యవస్తువు
వలె నాస్వాదనమాత్రోపయుక్తములై తృప్తికరతత్త్వానుభావకము
కాకుండుటయుఁ దత్త్వలిప్సువులకుఁ దత్త్వగ్రహణానవకాశకములైయుం
టయు, నిష్కృష్టదత్త్వగ్రహణముతోఁ బరీక్ష్యులకు నిమిత్తములేదు,
చూచి యున్నఁ జాలు నని యుద్బోధించుచున్నవా యనునట్లు ప్రతిక
ను బాఠ్యగ్రంథములకు నేర్పడియున్న సారబోధక(నోట్సు) గ్రంథముల
ర్గాణప్రచారణములును, గతవత్సరములలోని ప్రశ్నపత్రముల విక్రయమ
మున్నగు యూనివర్సిటీవారి యేర్పాట్లవలన నధ్యాపకులు నధ్యేతలు
బాఠ్యగ్రంథములవంకఁ జూడక సారగ్రంథములను బ్రశ్నపత్రములు
మాత్రమే యధ్యాపనాధ్యయనములలోనికిఁ గొనివచ్చుటకు వలను
నవకాశము నేర్పఱచుటయే యీ భాషాదుర్దశకుఁ గారణ మని తోఁ
డిని- నేఁ గొందఱుహూణభాషావిద్యార్థులను బ్రాచ్యవిద్యాపరీక్షలకు
జదువుచున్న విద్యార్థులను వారు చదువుచున్న గ్రంథములలోఁ జదివి
భాగములలోఁ బరీక్షించితిని- వారాగ్రంథములలోని పద్యములనుగా
వాక్యములను గాని ప్రతిపదార్థవిజ్ఞానముతో నొక్కవ్యక్తియు సమన్వ
యింపలేకపోయిరి- "నోట్సుబుక్సు"లోననుగుఁ డనియు మా కదే చెప్ప
చున్నా రనియు హూణవిద్యార్థు లనిరి. ప్రవేశప్రవీణాదిపరీక్షలకుఁ జ
పుప్రాచ్యవిద్యార్థులు వ్యాఖ్యానములతోఁ గూడఁ గష్టించి చదువవలసి
యుద్గ్రంథములలోనిమూలపంక్తుల యర్థములనైనఁ జెప్పనేరనివా
త్సరముననే యటఁ గృతార్థు లైరి- పిమ్మట నిందుల కారణమును
ముఁగఁ గనుఁగొనఁగాఁ బ్రాచీనప్రశ్నపత్రములను వెలకుఁగొని వానిలో
ప్రశ్నములను సమాధానములను గురుసన్నిధిం దెలిసికొని వాని ధా
ణతో నుత్తీర్ణులైనట్లు ధ్రువముగఁ దెలిసికొని విచారించితిని- కనుక ప్ర
పదార్థజ్ఞానపూర్వకసమన్వయజ్ఞానముతో సవిశేషముగ నధ్యయనాధ్య

ఘనములు జరుగనపుడు సాధారణముగ నాభాషాగ్రంథములయందు వారి కెల్లు తత్త్వజ్ఞానము లభించును. ఇట్టిదశలో నతిబుద్ధిక్లేశమున సూక్ష్మ బుద్ధితో సాధింపవలసిన తర్కవ్యాకరణాది శాస్త్రములలోఁ బ్రశ్నపత్రాధ్యయనమాత్రమున నెట్టిప్రావీణ్య ముదయించునో విజ్ఞులకుఁ దెలియును.

ఏశాస్త్రమునఁ దాను ప్రవీణపదము నందెనో యాశాస్త్రమునందలి యారంభగ్రంథములనే ప్రాచీనపద్ధతి నిప్పటిప్రవీణులు చాలవఱకు నధ్యాపనము చేయలేకపోవుటకుఁ గారణము శాస్త్రాధ్యయనసంప్రదాయములతో నాయాశాస్త్రములఁ జదువకుండుటయే గాని వేఱొండు లేదు-ఇట్లు చదువకుండుటకు ముఖ్యకారణ ముదరదరీపూరణసాధనము లగుపట్టముల నందికొనుటయందు మాత్రమే యధ్యేతలదృష్టులు ప్రసరించుచుఁ దత్త్వవిజ్ఞానసమగ్రదృష్టులు లేకపోవుటయే యని విజ్ఞు లెఱుంగుదురు. ఏనాఁడు విద్యలు దేశీయులదృష్టులలో జ్ఞానసాధనము లనుస్వార్థమును విడనాడి పొట్టకూటికి సాధనము లనువర్థముతో గోచరించినవో యానాఁడే వానివిజ్ఞానసాధనత్వమునకుఁ దిలాంజలి ఘటించినది-"యూనివర్సిటీ"వారు శ్రమపడి యిట్టిశమపట్టముల నందినవారికే దేశీయవివిధకలాశాలలలో నధ్యాపకత్వము గౌరవము మున్నగు వానిని నిర్ణయించియు నిర్ణయింపఁజేసియుఁ బ్రచారమునకై పాటుపడుచుండినను బ్రతివత్సరమునను వందలకొలఁదియును వేలకొలఁదియుఁ దయారగుచున్న ప్రవీణులకు నత్యల్పముగ నున్న దేశీయకలాశాలలలో నధ్యాపనస్థానములు లభింపకుండుటంబట్టియు నితరమార్గముల నుదరదరీపూరణముం జేసికొనుటకుఁ దమ విద్య లనుపయుక్తము లగుటంబట్టియు విజ్ఞానోదరపూరణోభయభ్రష్టతం జెంది యపభ్రంశప్రచారమునఁ దమకాలమును దమవిద్యల నుపయోగింపవలసిన వారగుచున్నారు-కనుక విద్యాశబ్దార్థమగు విజ్ఞానసాధనత్వము మీఁద నధ్యేతలదృష్టులు ప్రసరించునట్లు చేయుట విశ్వవిద్యాలయము వారి ముఖ్యకర్తవ్యమగుటచే నది యేనాఁడు ఘటించునో యానాఁడు విద్యార్థులకు 'మార్కు'లమీఁదఁ దృష్టియు విద్వాంసులకు మొదటితేది మీఁద దృష్టియుమరలి న్యాయ్యార్థవాచకవిద్వత్పదవాచ్యులు దేశమునఁ దయా

రగుదురు- అట్లు కానంతవఱకును భాషలకును శాస్త్రములకును నీ
శ తప్పనిదై యుండును-అట్లు తయారగుటకు గ్రంథబాహుల్యము
దగ్గించి యధ్యయనకాలమును విస్తరింపఁజేసి సవ్యాఖ్యముగ నిష్కృష్ట
సాధక మగుపాఠ్యగ్రంథసముదాయము నేర్పఱచి నోట్సుబుక్కులను
చీ-ప్రశ్నపత్రముల విక్రయమును విరమింపఁజేసి నిష్కృష్టపరీక్షల నే
చుట సాధన మని నాయూశయము. అట్టివారు తయారైననాఁడుదర
పూరణమున కనేకమార్గములు లభించును. 'యథా రాజా తథా ప్రజా
అనునది యిట ననువర్తించును గనుక విద్యాలయాధికారులదృష్టి తత్త్వ
వేత్తలఁ దయారుచేయుటమీఁదఁ బ్రసరించినచోఁ దత్త్వవేత్తలే తయా
గుదురు. పాశ్చాత్త్యదృష్టిని మాలించి ప్రాచ్యదృష్టిని గ్రహించుట
యులకు న్యాయ్యము. దేశీయవిద్యోద్ధారమున దేశీయదృష్టి ప్రసరిం
చో విదేశీయుల కెట్లు గ్రసరించును. వైదేశికవిద్యావిధానము స్వదేశీ
విద్యలకు విపరీతజ్ఞానసాధకత్వమును జేకూర్చుటలో వింతయేమి? కను
యింతవఱకున్న విద్యావిధానమే తత్త్వగ్రాహకము కానందున నాన్ధ్
షకును బ్రాచ్యవిద్యలకు నిట్టిదుర్దశ నొనర్చుచున్న దని నాభావ
అధ్యయనకాలమున లేనితత్త్వజిజ్ఞాస యుత్తరణానన్తరమునఁ గలుగుట
ర్లభముకదా. కలిగినను బ్రయోజనకారిణి కాదు. కనుక యధ్యయ
లమున నేర్పడినయీదోషమును గప్పిపుచ్చుటకును గలిప్రేరణమున
చిన పాశ్చాత్త్యవిధానానుకరణమును బ్రస్తుతాపభ్రంశప్రచారము వి
వాదములతోఁ బ్రారబ్ధమై తొలుత భాషామతల్లికయొక్క ముఖావ
మును భ్రంశింపఁజేసి క్రమక్రమముగ నన్నియూన్ధ్ర కాయావయవము
భ్రంశింపఁజేసి తుద కిప్పటి కిట్టి యపభ్రష్టదశకుఁ గొనివచ్చినది. అస్థి
పము లగుప్రాచీనగ్రంథములు మాత్రము భాషాయోషను సజీవము
నిల్పినవి. ఇట్టిదశలో నాత్మరక్షణమునకై విలపించుచున్న యాన్ధ్రభా
వధూటిని రక్షించుట కాన్ధ్రసాహిత్యపరిషత్తువారికన్నఁ దగువారు
న్పింపరు. ఈపరిషత్తున కాంధ్రభోజుఁ డనివిఖ్యాతిఁగన్న శ్రీపీఠికాపుర
శులు ముఖ్యపోషకులై యుండ నాంధ్రకాళిదాసమహాకవి యన
శ్రీజయన్తి రామయ్యపంతులు వారు ప్రధానప్రవర్తకులై యుండ శ్రీ

పారిషద్యపండితపుండరీకులఁ బోలుమహనీయులు పారిషద్యులై యుండ నాంధ్రభాషాయోషోద్ధారమున కన్నివిధములఁ జిరకాలమునుండి పాటుపడుచు ననేకప్రాచీనాముద్రితాంధ్రగ్రంథముల సేకరించుచు వానిరక్షణమునకై ప్రతికలవ్రాయించి శక్యమైనంతవఱకు లోకమునకుఁ బ్రకటించుచు సలక్షణభాషను నవీనాంధ్రగ్రంథములను రచియించియు రచియింపఁజేసియుఁ బ్రకటించుటయుఁ జిరకాలమునుండి యమూల్యవిద్వద్రాజవ్యాసరాజదామములతోఁ బరిషత్పత్రికాపత్రకరములచే నాంధ్రభాషామణి నలంకరించుటయు మున్నగు ఘనకార్యము లన్నిటికన్న మిన్నయు ననితరసాధ్యము నగు శ్రీసూర్యరాయాంధ్రమహానిఘంటువు నిర్మింపఁజేసి ప్రకటించుచుండుటయునను మహాకార్యముల నొనర్చుచున్న యీపరిషత్తువా రుభయభాషానిష్కృష్టసాహిత్యసంపాదకసద్గ్రంథముల నుత్తమమధ్యమాధమకక్ష్యావిశేషములతోఁ బరీక్ష్యములనుగా నేర్పఱచి సక్రమపరీక్షల నేర్పఱచి పారితోషికముల నొసంగుచు నుభయభాషాసాహిత్యతత్త్వవేత్త లగువిద్వన్మణులను దేశమునఁ దయారుచేయించుచు విశ్వవిద్యాలయమువారికిఁ గూడమార్గదర్శకులు గా నుండి యపభ్రంశప్రచారమున నుత్క్రమణావశకు వచ్చుచున్న యాంధ్రభాషామతల్లిక నుద్ధరించి తమకుఁ గలయీకొఱఁతను దీర్చుకొననిచో నాంధ్రభాష కిపుడుపట్టిన దుర్దశను బాపువా రెవరాంధ్రదేశమున నుండరు. ఇట్టిముఖ్యకర్తవ్యాంశమున వీరి కింతవఱ కౌదాసీన్య ముదయించుట కూడఁ గలికృతభాషాదౌర్భాగ్య మనకతప్పదు. కనుక యన్నియంశములను సమర్థులగు విశుద్ధభాషాభిమానులు గలయీపరిషత్తువారు వెంటనే యింకనైనఁ దమకుఁ గొఱఁతపడియున్న యీయననతరముఖ్యకార్య మగు నాంధ్రభాషాసాహిత్యపరీక్షాకార్యమునకుఁ గడంగి యాంధ్రభాష నుద్ధరింపఁగోరుచున్నారము. ఇక్కార్యమున వీరు వెంటనే ప్రవర్తించునటులు సర్వాన్తర్యామి సర్వేశ్వరుఁడు సర్వదా యనుగ్రహించి ప్రేరణమునొనర్చుచుండుఁగాత. విశుద్ధాంధ్రభాషాయోషామణి యాంధ్రదేశమున నఖిలాలంకారశోభితయై నిఖిలావయవలావణ్యవిలసితయై యపభ్రంశసంపర్కదోషలేశదూషితయుఁ గాకుండ సంతతము వెలయుఁగాత.
సమస్తసన్మంగళానిసర్వేషాంభవంతు.

---

# గ్రంథస్వీకారము.

(1) ఓదార్యప- (సారస్వతం)- దీపాల పిచ్చయ్యశాస్త్రిగారు- నెల్లూరు.

వెల రు. 0-10-0.

గ్రంథకర్తగారి ప్రణయకుసుమకావ్యముపై 'సరస్వతిరాష్ట్రి' నా గరకాచార్యుఁడు' వ్రాసిన విమర్శనమునకును, ములుమూడి నారాయ రెడ్డిగారి కాలగతితలపోత లనుగ్రంథమునకును ప్రతివిమర్శనగ్రంథము పైవిమర్శకులు గ్రంథకర్తల గురువర్యులును విద్వత్కవులునగు శ్రీ చెళ్లపిళ్ల వేంకటశాస్త్రిగారిని మఱికొందఱను తీవ్రముగవిమర్శించియుండుటచే గ్రం థకర్త వారిని వారిగురువులగు కీ. శే. వేదము వేంకటరాయశాస్త్రిగారి తత్తమచితవాక్యముల విమర్శించిరి. విమర్శకవిషయములు కొలఁదిగను పద్యగద్యరూపమున హేళనాదికము లెక్కువగను గలవు. ఇట్టివి పత్రిక నపుడపుడు వెలువడుచుండుటయే యాంధ్రుల దురదృష్టము. పుస్తకప పమును దాల్చుటను గూర్చి చెప్పనేల? మలిపలుకున నిట్టిగ్రంథము వ్రాయుట పొరపాటని గ్రంథకర్తలు గుర్తించియే యున్నారు. అదిమొ టనే గ్రహించిన బాగుగనుండి యుండునేమో! విమర్శకుల 'తిట్టుపా మును వారికే యప్పగింతుగాక యని వారివాక్కులను వానివంటివాని మఱికొన్నింటిని నేనును వాడితిన'ని గ్రంథకర్తలు వ్రాసిరి. ఇదియే గ్రం థస్వభావమును వివరించుచున్నది. పండితు లిట్టిగ్రంథములను వ్రాసి కష్టపడి ముద్రణమొనర్చి తమధనమును, కాలమును, పాండిత్యమును వ్యర్థముచేయక, తమకుఁ దోఁచిన రీతిని భాషాసేవ యొనర్చుటయే యు మ మని విన్నవించుచున్నాము.

(2) త్రిపురాంతకోదాహరణము:—రావిపాటి త్రిపురాంతకమహాకవిప్రణీతము- నిడుదవోలు వేంకటరావు బి. ఏ. గారిచే ప్రకటితము- వెల రు. 0-12-0.

ఆంధ్రమునఁ గలయుదాహరణగ్రంథముల సుప్రసిద్ధ మగుదీనిని తంజావూరు సరస్వతీభవనప్రాచ్యలిఖితగ్రంథభాండాగారమునఁ గలప్రతి ననుసరించి ప్రథమమున శ్రీమానవల్లి రామకృష్ణకవి గారు ప్రకటించియుండిరి. దానినే విపుల మగుపీఠికతోడను, లఘుటిప్పణము తోడను ప్రకటించి గ్రంథప్రకాశకులు తమయాంధ్రభాషాభిమానమును ప్రకటించియున్నారు. త్రిపురాంతకుఁడు ప్రాచీనాంధ్రకవులచే సంస్తుతి నొందినకవివర్యుఁడు. సంస్కృతమునఁ బ్రేమాభిరామమును రచించె నని క్రీడాభిరామమునఁ గలదు గాని యది మన కలభ్యము. అంబికాశతకము, చంద్రతారావళి, మదనవిజయగ్రంథముల మనకు లభ్యములగు పద్యములు పీఠికయం దీయఁబడినవి. సంస్కృతోదాహరణగ్రంథములఁ గూర్చియు, నుదాహరణగ్రంథముల స్వరూపమును గూర్చియుఁ బెక్కువిషయములును గలవు. ఉదాహరణగ్రంథముల నుపయోగింపఁబడిన విభక్తిప్రత్యయముల వలన నేయేప్రత్యయము లేయే కాలములఁ గలవో నిశ్చయ మొనర్చుట సులభము కాదు. భాషాశాస్త్ర పరిశోధనలవలన నిర్ణయ మొనర్పవలసియుండును. 'నై' యనునది చతుర్థీవిభక్తిప్రత్యయము కాదు. న్ + అయి అని పదవిభాగ మొనర్చి స్వరూపనిర్ణయ మొనర్పవలసియున్నది. ద్వితీయభాగమున టీకాయుతముగ మూలము ప్రకటింపఁబడినది. టీక యింకను విపులముగ నుండవలయును. ఈగ్రంథ మాంధ్రభాష కత్యంతోపయోగము.

---

(3) మహామహోపాధ్యాయ బ్రహ్మశ్రీ కల్లూరి వేంకటరామశాస్త్రిగారి జీవితచరిత్రము:—గ్రంథకర్త చిలుకూరి వీరభద్రరావుగారు, వెల రు 1-0-0.

కీ. శే. శ్రీవేంకటరామశాస్త్రిగారి జీవితవిశేషముల గ్రహించి గ్రంథకర్త లీవిపులగ్రంథమును రచించిరి. శాస్త్రిగారి రచన లగు వంశముక్తావళి, శ్రీకోటిలింగేశ్వరస్తోత్రము, నారసింహాష్టకము, స్త్రీనీతిరత్నావళి, చాటుశ్లోకములు నచ్చటచట నీయఁబడినవి. ఆంధ్రమేఘసందేశము, గుప్తార్థప్ర

కాశిక మొదలగుగ్రంథములపై విమర్శనప్రతివిమర్శనములు గలవు. నే
టిదినములఁ బ్రచారములో నున్న కళావతీ, భారతీ పత్త్రికల శ్రీవేంకట
మశాస్త్రిగారును, వారి శిష్యులగు శ్రీపాద కృష్ణమూర్తిశాస్త్రిగారును జరి
వాదోపవాదములు గలవు. వానిపై గ్రంథకర్త శ్రీవేంకటరామశాస్త్రి
రిని సమర్థించుచు వ్రాసినవిషయములు పెక్కులు గలవు. పీఠికయు
కనుగుణముగఁ గలదు. ఈ వాదోపవాదములలోఁ గలవిషయములలో
జాలభాగము సహృదయరంజకములు గావని యు, నట్టివానిని వదలినచో
నీగ్రంథము ప్రశంసార్హము గ నుండు ననియుఁ దలంచుచున్నాము. ఒకవేళ
నట్టివాదములఁ దమయభిప్రాయముతోఁ బ్రకటించుటకే యీగ్రంథము
రచింపఁబడినదేమో ? వ్యక్తిదూషణాదులను వదలి, గ్రంథవిషయము
లనే గైకొని సహేతుకముగ నిష్పాక్షికబుద్ధితో విమర్శించుట యాగ్రంథ
మర్శకులును జరిత్రకారులును ముఖ్యముగ నేర్చుకొనవలసియున్న ద
మాయాశయము.

---

(4) బరోడా ప్రాచీనవస్తుపరిశోధనాసంఘప్రచురణములు:—ప్రకాశ
కులు శ్రీయుత హీరానందశాస్త్రి గారు.

(1) 1934-35 సంవత్సరకార్యనివేదిక.

(2) ప్రాచీనగ్రంథములఁ గన్పడు చిత్రలేఖనము.

(3) గిర్నారులోని యశోకునిశాసనము.

సంస్కృత భాషకును ప్రాచీనహైందవవిజ్ఞానపరిశోధనములకును
బరోడాదొరతనమువారొసంగు సహాయ మనల్పము. వీరిసంస్కృతగ్రం
థావళి యందమూల్యమగు గ్రంథములు పెక్కులు ప్రచురింపఁబడినవి.
ఇటీవల 1934-వ సంవత్సరమున బరోడామహారాజుగారిచే నీసంఘము
స్థాపింపఁబడినది. మొదటివత్సరమున బరోడారాజ్యమునఁ గలప్రాచీనశిల్ప
ములు, కట్టడములు, శాసనములు పరిశోధింపఁబడి, యవి శిథిలముగా
కుండు ప్రయత్నములు శాఖాధికారులచేఁ జేయఁబడినవి. మనదొరతన
మువారి వార్షికనివేదికలందువలె వారికృషి మొదటిగ్రంథమున వివరిం
పఁబడినది.

ప్రాచీనగ్రంథములఁ జిత్రలేఖన మందంద గన్పడుచున్నది. అం దగల చిత్రములు గ్రంథవిషయములకు సంబంధించినవై యతిమనోహరములై యున్నవి. అహమ్మదాబాదునందున్న గుప్తలములఁ గలఁజైన భాండాగారముల నిట్టిగ్రంథసంపుటము లెన్నియేని గలవు. అందలి చిత్రలేఖనము మొగలుసామ్రాజ్యస్థాపనముకన్నఁ బ్రాచీనమై హైందవసంప్రదాయముల వ్యక్తీకరించుచున్నది. మనప్రాచీనచిత్రలేఖనము గ్రంథములలోని విషయముల కెంతమాత్రమును సంబాధింపక యుండినదను పాశ్చాత్యవిద్వాంసుల యూహలను ఖండింప నీగ్రంథమును హీరానందశాస్త్రిగారు వ్రాసియున్నారు. కావ్యాలంకారగ్రంథములఁ గలఖడ్గానిబంధములును నట్టిచిత్రలేఖనమున కుదాహరణము లని వారువ్రాసిరి. రామాయణమహాభారతములు, అనంగరంగాది కామశాస్త్రగ్రంథములును, తంత్రగ్రంథములు, భగవద్గీతయందలి దశమాధ్యాయము, పెక్కు జైనగ్రంథములు సచిత్రములగు సంపుటము లింకను భారతదేశమునఁ బెక్కుస్థలములఁ గలవని యు నందలి జిత్రలేఖనములఁ బ్రకటించి భారతీయుల చిత్రకళాప్రావీణ్యమును విమర్శింపవలయు ననియు వీరు వ్రాసి యున్నారు. గ్రంథమును విశదీకరించుటకై యిరువది ప్రాచీనచిత్రము లీయఁబడినవి.

భారతీయులలో నశోకుని స్మరింపనివా రరుదు. ఆతనిశిలాశాసనములు దక్షిణదేశమునఁ గూడ వ్యాపించి, యతనిధర్మపరాయణత్వము, నహింసావ్రతము మున్నగు సద్గుణములను ఘోషించుచున్నవి. వీనిని హుల్ష, భండార్కరు మున్నగు శాస్త్రపరిశోధకులు ప్రకటించియున్నారు బరోడారాజ్యమునఁ గలగిర్నారుశిలలపై నశోకుని పదునాలుగు శిలాశాసనములు, రుద్రదామ, స్కందగుప్తుల శాసనములుఁ గలవు. ప్రాచీనచారిత్రపరిశోధకుల కివి యమూల్యములు. వీనిని మూలముతోడను, ఆంగ్లభాషాంతరీకరణముతోడను శాస్త్రిగారు ప్రకటించియున్నారు. అశోకుని పరిపాలనమును గూర్చిన ముఖ్యవిషయములు పీఠికయం దీయఁబడినవి. ఇట్టిగ్రంథములఁ బ్రకటించి భారతీయుల యౌన్నత్యమునకుఁ బాటుపడుచున్న బరోడాదొరతనము వారికిని, గ్రంథప్రకాశకులకును మనకృతజ్ఞతను దెలుపవలసియున్నది.

(5) Tirupathi Devasthanam Epigraphical Report and Inscriptions, text and translation. (3 Vols.)

తిరుపతిదేవస్థానము పురాతనపుణ్యస్థలములలో నొకటి. అందలి దైవ మగు శ్రీవేంకటేశ్వరులు విజయనగరరాజుల కిష్టదైవము. దేవస్థానకుడ్యములపై, పెక్కు ప్రాచీనశాసనములు గలవు. వానిలోఁ జాలభాగము దొరతనమువారు ప్రతిబింబములఁ దీసి దమశాసనసంపుటములఁ బ్రచురించిరి. అయినను విశేషపరిశ్రమ మొనర్చి మహంతు శ్రీప్రయాగదాసుజీగారును, వారి ప్రాచ్యపరిశోధనాశాఖాధికారి యగు సుబ్రహ్మణ్యశాస్త్రిగారును నీమూఁడుగ్రంథములను ముద్రణ మొనర్చిరి. ఇందు మొదటిసంపుటమున దిరుపతిక్షేత్రము, నందలిదేవాలయములు, వాహనాదికము వర్ణింపఁబడినవి. అందే, ద్వితీయభాగమున పల్లవచోళపాండ్య యాదవవిజయనగరరాజులకును, నీక్షేత్రమునకుఁ గలసంబంధము, వారిచరిత్రమున కుపకరించుశాసనవిషయములు వివరింపఁబడినవి. రెండుమూఁడుసంపుటముల శాసనములు ఆంగ్లభాషానువాదముతోడను, విమర్శనముతోడను బ్రకటింపఁబడినవి. చరిత్రకారుల కీశాసనసంపుటములు మిక్కిలి యుపయోగకారులు. మూఁడవసంపుటము సాళువనరసింహరాయల శాసనములతో ముగియుచున్నది. మిగిలినశాసనసంపుటములను గూడ ద్వరలోఁ బ్రకటించి దేవస్థానాధిపతులు దాక్షిణాత్యచారిత్రపరిశోధనమునకు మూల్యసహాయ మొనర్తు రని యాశించుచున్నాము.

---

(6) పురాణచిత్రములు:—శ్రీ పెద్దిభొట్ల కృష్ణశాస్త్రి గారు, కాకినాడ. (మూఁడు భాగములు). ఈగ్రంథభాగములు వేదాంతవిషయములు సామాన్యులకు దెలుపుటకై వ్రాయఁబడినవి. రామాయణభాగవతాదిగ్రంథములఁ గలయుపాఖ్యానములకు నాధ్యాత్మముగ నంతరార్థమును వివరించుటకు గ్రంథకర్తలు ప్రయత్నించిరి. అందు వీ రెంతవఱకుఁ గృతకృత్యతను గాంచిరో పాఠకులే యూహింపవలసియున్నది. భాషయు నస్వాభావికము. ఆంగ్లభాషాపదముల నాంధ్రీకరించుటలోఁ బడినశ్రమ వ్యక్తమగుచున్నది.

శ్రీ

# ఆంధ్రసాహిత్యపరిషత్పత్రిక.


కాకినాడ.

రెండునెలలకొకసారి ప్రకటింపఁబడును.

సంపుటము ౨౬. { ఈశ్వరనామసంవత్సరము. ఆశ్వయుజకార్తికమాసములు. } సంచిక ౪.


## శాంతావృత్తాంతము.


—జొన్నలగడ్డ రామకృష్ణశాస్త్రిగారు, కొల్లూరు.—


ఆంధ్రపరిషత్పత్రిక ౨౧ వ సంపుటము, ౬ వ సంచికలో 'శాంతి యెవరికూఁతురు?' అనుశీర్షికతో నొకవ్యాసము గలదు. అందొఁ గడపటివాక్య మిది. "ఎటులైనను శాంతజన్మవృత్తాంతము ప్రమాణగ్రంథములం దెచ్చటను విస్తరముగ వ్రాయఁబడి యుండ లేదు. నే నీవ్యాసమును జిజ్ఞాసచే వ్రాయుచున్నాఁడను"

ఆవిషయమై నేనుగనిన ప్రమాణవాక్యముల నిట వ్రాయుచున్నాఁడను:- హరివంశములో శాంత లోమపాదుఁ డనుమఱొకపేరుగల దశరథునికొమార్తె యని యుండెను. ఈక్రిందిశ్లోకములఁ గననగును:

హరివంశము. 31 వ అధ్యాయము :—పుణ్యాఖ్యపట్టణమందలి చిత్రశాలాముద్రణాలయమందు ముద్రితము :

"అంగపుత్రో మహానాసీత్ రాజేంద్రో దధివాహనః
దధివాహనపుత్రస్తు రాజా దధిరథోఽభవత్. ౪౩
పుత్రో దధిరథస్యాపీ చ్ఛక్రతుల్యపరాక్రమః
విద్వా న్ధర్మరథో నామ తస్య చిత్రరథ స్సుతః. ౪౪
తేన చిత్రరథేనాథ తదా విష్ణుపదే గిరౌ
యజతా సహశక్రేణ సోమః పీతో మహాత్మనా. ౪౫
అథ చిత్రరథస్యాపి పుత్రో దశరథోఽభవత్

లోమపాద ఇతిఖ్యాతో యస్యశాంతా సుతాఽభవత్. ౪౯
తస్య దాశరథి ర్వీర శ్చతురంగో మహాయశాః
ఋష్యశృంగప్రసాదేన జజ్ఞే కులవివర్ధనః." ౫౦
నీలకంఠవ్యాఖ్య లోమపాదాపరనామా దశరథోఽయ మన్యః.
ఋష్యశృంగస్య శాంతాభర్తుః ప్రసాదేన.

శాంత శ్రీరామునితండ్రి యగుదశరథునికొమార్తె యని భవభూతి తనయుత్తరరామచరితనాటకములో వ్రాసెను. ఈవిషయమై లోకప్రతీతియుఁ గలదు. ఇందుకుఁ బ్రమాణము మృగ్యము.

---

## కీర్తిశేషులు—

### నెమలి పట్టాభిరామారావు పంతులు బి.ఏ. గారు.

వీరు చెన్నపురి సమీపమునం గల అమింజిక్కర్ అను చిన్నపేటలోఁ దమగృహమున స్వర్గస్థులైరనివినుటకు మిగులఁ జింతిల్లుచున్నారము. వీరు మరణించునాటికి వీరివయస్సు డెబ్బదిరెండుసంవత్సరములు. మొదట వీరు రివిన్యూబోర్డులో నుద్యోగులైరి. తర్వాత "సెటిల్‌మెంటు డిపార్టుమెంటులో" ఘనోద్యోగముం గావించుచునే కొచ్చిన్ దివానుగానియమింపఁబడిరి. తరువాత నుపకారవేతనముం గొని చెన్నపురి వచ్చియుండిరి. అప్పటిలో నాంధ్రసాహిత్యపరిషత్తు స్థాపింపఁబడునపుడు దానికి యావజ్జీవసభ్యులుగాఁ జేరిరి. పిమ్మట, పరిషత్కార్యదర్శులలో నొకరగు వేదము వేంకటరాయశాస్త్రిగారు తమకార్యదర్శిత్వమును జాలించుకొన్నప్పుడు వారికి బదులు వీరు కార్యదర్శులుగా నెన్నుకొనఁబడి, పరీధావిసంవత్సరములోనుండి నలసంవత్సరాంతమువఱకుఁ గార్యముల బహుసమర్థతతో నిర్వహించిరి. వీరంతటఁ జెన్నపురినివిడిచి మదనపల్లినివాస మేర్పఱుచుకొనిరి. ఆసందర్భములోనే వీరికి మాఱు వీరిబంధువులగు రాయిసాహెబు గుమ్ముడూరి వేంకటరంగారావు ఎం.ఏ. గారు నియమింపఁబడిరి. రామారావుపంతులుగారాంధ్రభాషయందును బరిషత్తునందును గడవఱకు మిగుల నభిమానముతో నుండిరి. మిగుల శాంతులు, నిగర్వచూడామణులు

# పునః ప్రార్థన.

—క్రొత్తపల్లి సూర్యరావు, కాకినాడ.—

వేత్తలారా !

దీనారటంకాల తీర్థమాడిన శ్రీనాథుని గుఱించి ముచ్చటించుచు నొకప్పుడు నేనొడ్డెరాజులొనర్చిన శ్రీనాథునిశిక్షను గూర్చి మొదయినఁ జరిత్రములలో నాధారము లున్నవా యని యడిగియుంటిని. లోకములోఁ గల్పితము లనేకములు నిక్కమును మఱుఁగుపఱచుచున్నవి కలవు. ఒడ్డెరాజు లెడ్డెరాజు లంటిని; శ్రీకృష్ణదేవరాయలే తిమ్మరుసుకన్నులు పీకించినాఁ డనుచున్నారు. రాజులు తలఁచిన నెట్టియకార్యములైనఁ జేయఁగలరు. బిలబిలాక్షు లనఁగా నర్థమే మని వేఁడియుంటిని. అది కాదిది కాదని ఖండనములు పూర్వపక్షములు చేయుచుండు నిప్పటివిమర్శకులలో నొకరైన నాపైఁ గరుణింపలేరు. మాటమాటకు మాబోంట్లకు సందేహములు గలుగుచున్నవి. పండితులకుఁ బ్రతివిషయమునను విమర్శలు, పరిశోధనలు పొడముచున్నవి. ఈసమయములోనే నాసంశయము తీఱునని సంతోషపడుచున్నాఁడను. "తుమికీ బాయిలబాయిరే ములికియా దుష్మింటికిఁబోవుచుండ్" ఇత్యాది పద్యములు గలవు. వానియర్థము నే పుళిందభాషనుండియో యే "ముండా" భాషనుండియో తెల్పఁగోరుచున్నాఁడను.

"ఒడయ చిత్తేశ యోనడలింగమూర్తి" యని కాళహస్తిమాహాత్మ్యములో నున్నది. దానిం బ్రకటించినవారు చివర లఘుటీకలోఁ గూడ చిత్తేశ కర్థముం గూర్చి వ్రాయలేదు.

మహాప్రభూ! దేవరా! యిట్లేదో యర్థముగావచ్చునని నాయూహ. "దేవ చిత్తేశు (శ) సాత్రాజితీతనూజ" చంద్రభాను ౪-౧౨౦. దీనిమాట యేమి. ఒడయచిత్తేశ వంటిదే, దేవచిత్తేశ. ఆలోచించి యిట్లని యర్థమును దెల్పఁ గోరెద.

"నాచిత్తేశుఁ డొఁగాక నిర్జితులై పోదురుగాక" వంటి దది కాదు.

నిశ్శంకలకొమ్మయకవి శివలీలావిలాసములో—

"అంతకుం డసరి శాంభవమందిర మారఁజొచ్చి లో
చనముల నిప్పులుం గురియ సంయమిపుంగవుఁ దాఁకె నుద్ధతిన్

చ. తొలఁగక తాపసుండు శివదో శివదో (శివదో) యటంచుఁ జం
 చలమతిఁ గూయఁగా నతని శంకరలింగనిషక్తహస్తముల్
 బలువిడి విప్పి దండి నిజపాశములం బెడకేలుగాఁగ న
 చ్ఛలముగఁ గట్టి వెల్వలికిఁ జక్కఁగనీడిచి తెచ్చె"

నని యున్నది. ఇందు "శివదో" యనఁగా నేమి. ప్రార్థనమునం దిట్టిదూవ మున్నదా, ఏదేశములోనైన నిట్టివాడుక కలదా, యతులు ప్రాసములు దిద్దుదురా !

"కర్తార" శబ్దమొక్కటి నన్ను బాధించునది. కొందఱు శివుఁడని కొందఱు హరియని యందురు. యవనులు కర్తారుఁ డను రని యర్థమిచ్చున ట్లెక్కడనో చదివియున్నాను. యయాతిచరిత్రములో—

"అతఁడు దానైన కర్తారుఁ డలమి కూర్మిఁ
 బ్రోవ సత్యచింతామణి పొట్ల చెలువు"

అని ప్రయోగము, మొదటియాశ్వాసములోనున్నది.

"కర్తారుఁ డుండు తుర్కలమసీదు"అని క్రీడాభిరామము, పుట ౫౹. మీ గ్రంథములలో నెచ్చటనైన దీనికాధార మున్నదా యని శ్రీ ఉమ్రా ఆలీషాకవిగారి నడిగియుంటిని. వారికిఁ దెలియరా లేదని సెలవిచ్చిరి. ఆంధ్రగీర్వాణములు నరబ్బీ ఉర్దూభాషలు నేర్చినవారే యెఱుఁగ మని నుడివిరి. మనకవు లేయాధారమునఁ బ్రయోగించుచున్నారు ?

ఈ కర్తారు, చిత్తేశశబ్దములు నిఘంటువుల కెక్కవలసి యుండు నను కొందును.

కెటిల్ కన్నడ నిఘంటువులో "కర్తార" కర్తృశబ్దతద్భవ మనియు శబ్దమణిదర్పణములోఁ బ్రయోగము గలదనియుఁ జెప్పఁబడినది. పండితులు- ముఖ్యముగ, విద్వాన్, శిరోమణి, ఉభయభాషాప్రవీణ పరీక్షల నిచ్చినవారు వానిలోఁబరిశోధకులై పన్నెకెక్కినవారు, విద్వాంసులు, ప్రపంచానుభవము గలపెద్దలు, వాచస్పతులు, కావ్యతీర్థులు, మహామహోపాధ్యాయులు, కళాప్రపూర్ణులుఁ గరుణించి విచారించి తెల్పఁబ్రార్థించెదను. శాస్త్రపండితులను వర్ణమాల నేర్పుమన్న ట్లుండు నని విద్వాంసులు నిరసింపక కొంచెము దయచేసి యీయాంధ్రసాహిత్యపరిషత్పత్త్రికలో వివ

రముగాఁ బై విషయములను జర్చింప వేఁడుచున్నాఁడు. పెద్దపెద్ద గూనలు బానలు వానుకున్నరిని పొడుముకుండు చేసిపెట్టు మనిన నది పిల్లలు చేయుపని నాచేతఁబడ దనును. నిక్కమే - మఱి మాకుఁగావలసినవస్తువెల్ల లభ్యమగును. చిన్నలు (ఎఱిఁగినవారు) లేనపుడు మధ్యరకము వారూర కున్నపుడు పెద్దలుపూనుకొనకున్న భాష కొంతవడి మాయట్టివారు సంశయగ్రస్తులైన నది యెవ్వరిమీఁదికి వచ్చును.

---

# ఆంధ్రసాహిత్యపరిషత్తు.

—కాళూరి వ్యాసమూర్తిగారు, విజయనగరము.—

ఏతత్సభారజతోత్సవాహ్వానమునకు మిక్కిలి సంతసించితిని.

ఆంధ్రసాహిత్యముయొక్క ఘనతనుగూర్చి మనపూర్వులు చిరకాలము క్రిందటనే గుర్తించియున్నారు. అట్లే భారతదేశమందలి యన్యభాషాకోవిదులుకూడ గుర్తించియున్నారు. వీరందఱుచు గూడ భారతదేశప్రధానభాష యగుసంస్కృతభాష కుచితస్థానమును స్థిరపఱచియే స్వదేశభాషలను వృద్ధినొందించియున్నారు. పూర్వులు సంస్కృతకావ్యములను యథామాతృకముగ భాషాంతరింపక స్వేచ్ఛగొని యందు స్వశక్తిని గనఁబఱచియున్నారు. నేఁడ నేకులు యథామాతృకముగ భాషాంతరీకరించుటలో స్వశక్తిని జూపించుచున్నారు. ఎందఱెందఱెన్నివిధముల భాషాంతరీకరించినను సంస్కృతవాఙ్మయమం దున్నఘనత ప్రాముఖ్యత యించుకంతయుఁ గొఱవపుటలేదు. ఎప్పుడును దానిప్రాముఖ్యము నశింపదు. అదిగాక వారందఱును సంస్కృతవాఙ్మయప్రాముఖ్యతను మనస్సునం దిడుకొనియే మఱియు భాషాంతరీకరించియున్నారు. వేదశాస్త్రములను గూడ నేడు స్వదేశభాషలలో వ్రాయుచున్నారు. కావున నిదంతయు సంస్కృతభాషయం దున్నఘనత, పవిత్రత, యేకీభావత నెఱుంగుటకుఁ జేయుచున్న కృషిగా నందఱు గ్రహింపవలసియున్నది. సంస్కృతభాష, ఆసేతుహిమాచలపర్యంతము ననాదికాలమునుండి యెట్టిమార్పులను బొందక యేకరీతి నున్నది. దేశభాష లన్నిటియందు మిళితమై యు

న్నది. పర్వతములవ్యాప్తి, నదీప్రవాహములు భరతఖండ మొక్కదేశ యని యుఁ బ్రజ లందఱు భారతీయు లని యు స్పష్టము చేయుచున్న కావుననే పర్వతనామములు, నదీనామములు నన్నియు సంస్కృతశబ్ద లై యున్నవి. కావున దీనినంతయు గ్రహించి సంస్కృతమున కున్న ముఖ్యతను గుర్తించి దేశభాషలందు సంస్కృతమువాడునట్టి పద్ధతిని ప్రో త్సహింపవలయు నని సభవారిని గోరుచున్నాను.

దేశకాలములనుబట్టి చూచినఁ బ్రభుత్వములు మాఱుచుండు నియు, స్వాతంత్ర్యపారతంత్ర్యములు ప్రతిదేశమునకుఁ గల్గుచుండు యుఁ దెల్లమగుచున్నది. ఇందువలనఁ బ్రజల కగువానికన్న నెక్కువ య కారము దేశభాషలకే జరుగుచున్నది. ఈసంగతి యందఱికి విశద యున్నది. వ్యావహారికపదములనే కావ్యములం దుపయోగింపవలయు ననునూహ యిందువలన నపోహ మగుచున్నది. కొన్నిచోట్ల భావా ములు వ్రాసియుఁ గొన్నిచోట్ల నేమర్థమును వ్రాయక కొన్నిచో స్వభాషాపదములు తెలియక యనేకమైన యింగ్లీషుపదములను వారు నేఁడు విరివిగ వాడుచున్నారు. ఈవ్యావహారికపదములు స్థిర యిగ నుండి మనముందుసంతతివారి కందఱకు నర్థమగు నని తలంచు రొకరుకూడ నుండరనునది స్పష్టమే. దేశభాషల కింగ్లీషుపదములు గ చుచున్నంత యపకారము మఱేవియుఁగావింపలే దనునదికూడ యథా మే కావున నన్యభాషాపదములను (సంస్కృతము తప్ప మిగిలిన స్వదే విదేశభాషాపదము లేవియు) నుపయోగింపకుండునట్టి పద్ధతిని, ఒకవే విధిలేక యట్టిపదములు వాడవలసి వచ్చినట్టిచొప్పులం దచ్చటనే వా యర్థములను స్వభాషయందు స్పష్టముచేయుచుండునట్టి పద్ధతిని, ఈస పదములను వ్యర్థము చేయుచుండునటులను బ్రోత్సహింపవలయును.

వచనము, పాట కాని గంభీరమైన రసవత్తరమైన శ్లోకముల నొప్పునట్టి సంస్కృతమునకుఁ బిమ్మట నాంధ్రభాషయే పద్యముల నన్నివిధముల నిక్కిలి శోభించుచున్నది. కావుననే దేశభాషలందుఁ దెలు గు లెస్స యయినది. అట్టిపద్యవాఙ్మయమునకుఁ దగుప్రోత్సాహ మీయ వలయును.

# ఆంధ్రసాహిత్యపరిషద్రజతోత్సవప్రశంస.

—నల్లా చినరెడ్డినాయఁడుగారు, అమలాపురము.—

---

శ్రీవిద్యానిధి సూర్యరాణ్మణికిఁ బు- త్రీరత్నమై నీకుఁ బెం
పై, వర్ధిల్లెడియావనస్ఫుటతఁ జె-న్నై, సత్కవిశ్లాఘకుం
డావై యిర్వదియేనువర్షములు స-త్ప్రాయాన నాంగ్లేయపుం
బ్రాపన్ నీకుఁ బత్తురాఁగనె 'సి-ల్వర్ జూబిలీ' తత్స్ఫూర్తిన్
గావింపన్ సమకూడె నీవిబుధలో-కం బెంతయున్ వేడ్కన్; వి
ద్యావైశద్యమునన్ సుశీలగుణమ-ర్యాదానుభావంబునన్
దావెల్గున్ నినుఁబోలెఁ, దండ్రిసరిక-న్యల్ ధన్యలన్ సూరివా
చావైశిష్ట్యము సార్థకంబుగ మనీ షాసారవాచస్ఫూర్తిన్
భావోదారమనోజ్ఞవాగధిపతిన్-భాస్వద్యశస్సత్పతిన్
క్ష్మావల్లభ్యరమాపతిన్ జయపురీ-సామ్రాజ్యలక్ష్మీపతిన్
భావైక్యం బొంఁగూడు విక్రమపతిన్-సారస్యసత్యాపతిన్
భావిప్రాభవసూచకంబుగ వరిం-పం గాంచెఁ దాఁ; జూచితే?
యీవైదగ్ధ్యము వర్ణనీయ మని వే-త్తే చెప్పఁగానేల? ప్ర
భావైవాహికపద్ధతిన్ బుధులు గొం-డాడంగ నర్హంబు లౌ
రేవల్ మేలగునట్టి వొప్పు నని చా-టన్ మేటిచందాన; వి
ద్యావృద్ధుండు విభూతివృద్ధుఁడును నౌ-దార్యప్రవృద్ధుండునై
భావంబందును జేతియందు వెలితిన్-బాటిల్లఁగా నీని స
ద్భావపుండౌ పతి దన్నుమన్నఁగన సౌ-భాగ్యంబు శోభిల్లఁగా
నేవేళన్ సుకవీంద్రకల్పలతయై-యింపొందుఁగా కట్టిమేల్
తీవుల్ సూచుచు మీపితాపతులు 'గో-ల్డెన్ జూబిలీ' చేసి సం
భావింపంగల భాగ్యరేఖ గలదై-భాసిల్లుతన్; సత్కవి
త్రాపుష్టాత్మక! శ్రీజయంతికులసో-మా! రామయార్యాగ్రణీ!

---

# ఆంధ్రసాహిత్యపరిషత్ప్రశంస.

—వేదుల సూర్యసత్యనారాయణగారు.—

---

తే. సీ. యన్మహాయశోలాభ మీయాంధ్రవనిత
కాంధ్రతను నిలఁబెట్టె నాయాంధ్రసాహి
తీపరిషదంకురములఁ, నుతింప నిప్పు
డదను కల్పించు శారదాంబా! నమోస్తు.
నవనవోన్మేషమైన యానందవల్లి
కవిహృదయసీమలోఁ గలకండమేసి
యాలవాలముగూర్చి తయారుచేసె
ధీవిశాలుఁడు విక్రమదేవవర్మ.
క్రకచబాధలకోర్చు భారతపురంధ్రి
పూర్వసౌభాగ్య మెంచి మేఁ పులకరింప
నేఁటిగతిఁజూచి యడుకుకన్నీరురాల్చు
ప్రతికవికిఁగూడ నీతఁడే ప్రభువుసుండీ.

---

"ఉచ్చైర్గతిర్జగతిసిధ్యతి" యనుశ్లోకమునకుఁ బద్యము.)

చ. భువిఁ బరికింప సద్గతికిఁ బూనికమైనది ధర్మమేని దా
నివశమునందు వేదములు నిర్మలవృత్తిని నుండెనేని యా
యవి దలఁపంగ భూసురుల యందునఁ గల్గెనయేని వారలం
దవులకె యేఁపాదముల దాపును జెందును మత్ప్రణామముల్.

ఉభయభాషాప్రవీణ,
కొండపీటి వెంకయ్యచౌదరిగా.

---

# కవిమాన్యవిభాగము.

—కాశీభట్ట సుబ్బయ్యశాస్త్రిగారు-కాకినాడ.—

శ్లో. నిధే స్సంజాయతే రత్నం నికషా ల్లభతే రుచిమ్
కవే స్సంజాయతే కావ్యం విమర్శా దశ్నుతే యశః.

హృద్యాంధ్రకవితోద్యానసీమలోని కావ్యఫలతరుసమితిలో నన్నయభట్టారకుఁడు మొదటనాటిన భారతరసాలము మంజులపదసుమమంజరీసుందరమై, మధురార్థఫలకదంబబంధురమై నిజామోదమాధుర్యసంపదలచే సాహిత్యరసపిపాసుల నాకర్షించుచున్నది.

ఇందుకుఁ గారణ మామహితాత్ముఁడు సంస్కృతాంధ్రముల రెంటనసమానపాండితీప్రభాభాసితుఁ డగుటయె. సంస్కృత మెఱుఁగని కేవలత్రైలింగ్యులకును, తెలుంగు తెలియని కేవలసాంస్కృతికులకు సట్టిమనోహరాంధ్రకావ్యనిర్మాణనైపుణ్య మబ్బనేరదు కావుననే నన్నపార్యునకు నీవలఁ బుట్టిన కవితాకన్య లెల్లను నావాగనుశాసనుని కవితను మాతనుగా భావించి, వినయభయభక్తులతో వందనముల నందఁజేయుచున్నారు.

ఈవిషయమును సహృదయు లెల్లరు నానాఁడు మొద లీనాఁటివఱకు నైకకంఠ్యముగా సంగీకరించుచున్నది యే కాని కౌశికములకు భట్టారకునికాంతి పట్టనట్టు కొంద ఱభినవకుశలురకు నన్నయభట్టారకుని ప్రతిభ గిట్టకున్నది. అందుచే నపు డపుడు వా రేవేవో విపరీతరచనలఁ బ్రకటించుచుందురు.

తిక్కనార్యాదికవిపుంగవుల కిట్టియసూయాద్యవగుణములు గిట్టవు. కావుననే వారు తమకృతులలో నన్నయభట్టారకుని వేనోళ్లఁ గొనియాడియున్నారు. విశాలహృదయుల మానసములయందు నన్నపార్యుఁడు వంద్యుఁ డగువిద్యాద్వైతుఁడుగానే ప్రత్యక్ష మగుచున్నాఁడు. ఉదారభావముతోఁ బలుకవలసినచో నాంధ్రకవిత్వవిశారదుని కవితాధార యనన్యదుర్లభ మగునమృతధార యని యొప్పుకొనక తప్పదు. కావుననే సదాశయులగు కావ్యకళాద్రష్ట లీకవిగురుని రసభరితము లగురచనల

నాధారముగాఁ జేకొని, మనోహరములగు కృతులవిరచించి, నిజకావ్యములయందుఁ గృతజ్ఞతతో నన్నపార్యునిఁ బ్రస్తుతించియున్నారు.

అద్వైతబుద్ధి కల యానాఁటి తిక్కనాదులే కాక, యీనాఁటికవులు కూడ నావాగనుశాసనుని కవితామాధురినిఁ బలు తెఱంగులఁ గొనియాడుచున్నారు. కనుఁడు:-

"తీయని తెల్గుతేటల శ్రుతిప్రతిబోధితధర్మశక్తి నం
దీయఁ జళుక్యరాజ్యరమణీమణి కన్నరమోడ్పు వెట్టి నిన్
హాయి సెబాసు బాగు బళిరా యని మెచ్చుచుఁ బొంగు గౌతమీ
తోయతరంగగానములతో జతగూరిచి పాడుకొన్నదా."

శ్రీ వేంకటసుబ్రహ్మణ్యదీక్షితులుగారు, భా

ఇంతటి యెన్నిక గాంచిన నన్నయకవిసార్వభౌమునిఁగూర్చి యీ మధ్యను బ్రహ్మశ్రీ కోరాడ రామకృష్ణయ్య ఎం. ఏ. గారు మహారా శ్రీ నండూరి బంగారయ్య బి. ఎ. బి. యల్. గారితోడ్పాటుతోఁ బ్రకటిం "ఆంధ్రభారతకవితావిమర్శనము" అను గ్రంథమునం దాంధ్రకవిమా న్యమును రెండు విడివిడి వాటాలుగాఁ దెగఁగొట్టి, అందొకభాగము వైదికదృష్టి యనియు, మఱియొకభాగమునకుఁ గావ్యకలాదృష్టి యని యు నామకరణముల నొనర్చి, రెండుపంపులనడుమనుఁ గోరాడవా కోరడిని వేసి, మొదటిమడిని నన్నయావధానికిని, రెండవమడిని తిక్కనమ త్రికి నందఁజేసి పత్త్రముల లిఖించిరి.

ఈయేర్పాటు ముగిసినయనంతరము శ్రమయని తలంపక తరము నిర్ణయించి, నన్నపార్యునిమడి యించుమించుగా వట్టిచవుటిపట్టి యయ్యె, గరణముగారిపంపు సారవంత మనియు స్థిరపఱచి, శ్రోత్రియమా న్యములోని శాలికణిశములను, ప్రెగ్గడపొలములోని జొన్నవెన్నుల సాహిత్యపణ్యవీథికిఁ గొనివచ్చి, వెలలేర్పాటు చేయింపఁ బాటుపడిరి.

పాపము వీరు వాటాలజాపితాలు వ్రాయుటలోను, తరము నిర్ణయించుటలోను, పాక్షికదృక్కునకు లోనైరే కాని, పరమార్థావలో కనమునకు రానేరరైరి. వినుఁడు మనరామకృష్ణయ్యగారి భాషితముల "ఆతని (నన్నయయొక్క) వైదికదృష్టికి నిదర్శనములను గొన్నిటిని పరి

తము" "ఆతనికి (తిక్కనకు) రచనావిషయమున కావ్యకళాదృష్టి ఎట్లు ప్రబలెనో"

ఈరీతిగాఁ బాడితకివిమాడలిచే మధురాధ్రకవిత్వమునకు సర్వవిధముల నగ్రగణ్యుఁ డని, పేర్వడసిన నన్నపార్యునికవితలో వైదికదృష్టి గోచరమగును గాని, తిక్కయజ్వకైతలోవలెఁ గావ్యకళాదృష్టి కానరాద నుభావమును బలుతావుల వెల్లడించియున్నారు- పరిశీలింప నిది కోరాడవారి కోలాహలము కాని విశాలమగు వాదము కాదు.

శ్రీ రామకృష్ణయ్యగారు మొదట వైదికదృష్టి యన నెట్టిదో, కావ్యకళాదృష్టి యన నెటువంటిదో, నిర్దుష్టము లగులక్షణములను నిర్వచించి యుండవలసినది. అట్లొనర్పక, మాటలను మాత్రము వాడుటచే సందేహరహిత మగుపదార్థతత్త్వము బోధపడకున్నది. సందర్భములను బట్టిచూడ వీరు దేనిని వైదికదృష్టి యనిరో, యయ్యది నన్నయభట్టారకుని కవిత్వమునందుకంటె తిక్కనసోమయాజికైతలో నెక్కుడుగాఁ జూపట్టుచున్నది. వీరు దేనిని గావ్యకళాదృష్టి యనిరో యది తిక్కనకైతలలో కంటె నన్నయార్యునికవితలలో హెచ్చుగాఁ గన్పట్టుచున్నది.

తమకుఁ దిక్కయజ్వకైత నచ్చినచో మెచ్చఁదగును కాని, నన్నయకవితను గూర్చి యిట్టి పిచ్చితలఁపులఁ దెలుపనగునా? ఇది తమపాండిత్యగరిమకు సరి యగునా ? శ్రీ రామకృష్ణయ్యగారు నన్నపార్యుని కవిత వేదగానమువలె మొఱకుగాను, తిక్కనార్యునికైత జావళీపాటవలె మృదువుగాను వినఁబడు నని, భావించి యీదృష్టిభేదముల నెంచిరో! లేక నన్నయకవితలో వైదికకర్మనిష్ఠలును, తిక్కనకైతలో లౌకికకార్యకలాపములును, గానవచ్చుటచే నిట్టిభేదమును బాటించిరో!

వీరివిమర్శన నైపుణి యింతటితోఁ బూర్తి గాలేదు. వేఱొకక్రొత్తపుంతనుఁ గూడ నడచినారు. "నన్నపార్యుని కవితాప్రవాహగాంభీర్యమునకు తిక్కనార్యుని యసమానకవితాచాతుర్యము వన్నెవెట్టుటచే దీని కట్టిమహాప్రతిష్ఠ గలిగినది" అని సెలవిచ్చిరి.

ఇది కలమున సిరామిగిలి యుండుటచే నుబుసుపోక, వ్రాసినవాక్యము కాని, సరసమగు విమర్శనము కాదు. తిక్కనార్యునికవితాకలాచా

తుర్యము నన్నపార్యునికవిత కేరీతి వన్నెను గొనివచ్చినది ? తిక్కన నన్న యకవితలోని పదదోషముల సరిచేసెనా ? అర్థలోపముల దిద్దెనా? భా వసౌభాగ్యముల సమకూర్చెనా? యతిభంగములఁ దొలఁగించెనా ? ప్రా సల సవరించెనా ? రసాలంకారాదులఁ జక్కనొత్తెనా ? అవిద్యాద్వైతుఁ డు కీర్తిశేషుఁడైన రెండువందలసంవత్సరములకుఁ బిమ్మట జననమంది, నన్నపా ర్యునికవితయందలి మాధుర్యసారమును జక్కగఁ గ్రోలి, తైత నల్లినతిక్క నన్నపార్యునికవితకు వన్నె వెట్టుట యెట్లు పొసఁగును ?

అందుచేఁ దిక్కనకవిత నన్నయకవితకు వన్నెఁదెచ్చుట యసంభవ ము. వాదసౌకర్యమునకు రామకృష్ణయ్యగారి యుక్తుల నంగీకరింతము. తిక్కనకైత నన్నయకవితకు వన్నెఁబెట్టునపుడు నన్నయకవితలోని వై కదృష్టిదోషమును సవరించి, కవితాకలాదృష్టిలోని కేల మార్పదాయె? అది సుధాకరబింబమునందలి యంకమువలె దిద్దసాధ్యము కాకపోయెనో? తిక్కనకైత మొత్తముమీఁద నాంధ్ర భారతమునంతటికిని గొప్పను గొని వచ్చిన దని తెలిపిన దనుభావమునకుఁ గొంత సరిపడియుండెడిది.

వీ రింకనొకయపూర్వ వాదమునకుఁగూడఁ బూనికొనిరి. ఆక్రొ తళు కేదియనఁ దిక్కనసోమయాజి నన్నయభట్టారకునిఁ బ్రస్తుతించుచు వాడినవిద్యాద్వైతాదివిశేషణములు నన్నయకుఁ బ్రత్యేకముగాఁ జెం దినవియే కాని, యామహాత్మునికవితకు సంబంధించినవి కావట. కావునఁ దిక్కన నన్నయను స్తుతించెను గాని, యతనికవితను మెచ్చ లేదఁట ! ఇది యపూర్వవాదము కాదా ? వినుఁడు వీరివాక్యుల- "ఆభా రతమున మూఁడుపర్వములు ఆంధ్రకవిత్వవిశారదుం డగునన్నయభట్టు ఆంధ్రభాషలో రచించెను" అని మాత్రమే చెప్పినాఁడు. విద్యాద్వైతుఁ డు, మహాత్ముఁడు, అనునవి నన్నయనుగూర్చిన విశేషణములు గాని ఆతనికృతినిగూర్చినవి కావు. ఆకృతియందు నాకవితయందును విశేషా రమును వ్యక్తపరచుటలేదు. ఆంధ్రమున మొదట నుద్గ్రంథమును రచి చినవానిని ఆంధ్రకవిత్వవిశారదుం డనుటలో విశేషము లేదు" (పుట 115, 116.)

ప్రాజ్ఞుఁడగు తిక్కయజ్వ ప్రకరణార్థపోషకము లగు విశేషణములచే నన్నయభట్టారకుని నుతించియుండ నావిలువను గుర్తింపనేరక, యిట్టివె డఁగునుడుల జాఱవిడిచిరి. విశేషణములు నాలుగువిధములు- పోషకములు, వ్యావర్తకములు, వ్యతిరేకములు, తటస్థములు నని.

ఆజానుబాహుఁ డగువీరుఁడు రిపువిజయమున కేఁగుచున్నాఁడు. ఇట-ఆజానుబాహువిశేషణము ప్రకరణార్థ మగువిజయమునకుఁ బోషకము. నీలఘటమును దెమ్ము. ఇట, నీలవిశేషణము రక్తఘటాదివ్యావర్తకము. నిద్రాళుఁడగు భటుఁడు కోటను గాపాడుచున్నాఁడు. ఇట, నిద్రాళువిశేషణము ప్రకరణార్థ మగుదుర్గసంరక్షణమునకు వ్యతిరేకము. పీతాంబరుఁ డగుఱేఁడు రాజ్యమేలుచున్నాఁడు. ఇట, పీతాంబరవిశేషణము ప్రకరణార్థ మగురాజ్యపాలనమునకుఁ బోషకమును, వ్యతిరేకమును గాక తటస్థము.

కావ్యకలాచతురుఁ డగుతిక్కనార్యుఁడు నన్నయభట్టునుగూర్చి వాడినవిశేషణము లన్నియుఁ బ్రకరణార్థ మగుభారతరచనమున కత్యంతపోషకములై తనరారుచున్నవి. కనుఁడు- "ఆంధ్రకవిత్వవిశారదుండు, విద్యాదయితుండు, మహితాత్ముఁడు, నగునన్నయభట్టు మూఁడుకృతుల దక్షత నొనర్చెను" వివేకనిధు లీవిశేషణముల విలువను గుర్తించిన నివి తప్పక భారతకావ్యనిర్మాణమునకుఁ బోషకము లని యొప్పుకొనకుందురా? వీనియందుఁ గావ్యనిర్మాణకలాచాతుర్యమున కక్కఱకురాని దొక్కటైనఁ గలదా?

తిక్కనసోమయాజి యేవిశేషణముల వాడినఁ గావ్యనిర్మాణకలాచాతుర్యము ప్రత్యక్షమగునో యట్టివిశేషగుణవిశిష్టము లగువిశేషణముల నన్నపార్యుని బ్రస్తుతించుపద్యమున నలంకరింపఁజేసి యున్నాఁడే! అట్టితఱి నిట్టియాక్షేపమెట్లు నిలువఁగలదు? దక్షతన్, అనుక్రియావిశేషణము కూడ నన్నయకుఁ జెందినదేనా? లేక "ఒనర్చెన్" అనుక్రియకా? "దక్షతన్" అనఁగా సామర్థ్యముతో నని కదా యర్థము. కవి యసమర్థుఁ డగుచో నాతనిచేఁతలకు దక్షత యెట్లు సమకూడును? ఇదికాక, తిక్కన నన్నయను నుతించుపట్ల వాడినవిశేషణములు కావ్యనిర్మాణమునకుఁ బో

షకములు కానిచో నట్టివ్యర్థపదములచే బద్యమును బూరించుటవలన దక్షిణస్రావ్రాతలయందుఁ జేతగానితనము కన్పట్టదా ?

మఱియుఁ దిక్కయజ్వ నన్నపార్యుని స్తుతించినట్లే వ్యాసమునీంద్రునిఁ గూడఁ బ్రస్తుతించియున్నాఁడు. ఆప్రశంసలో నన్నయకు వలెనే వ్యాసయ్యకుఁ గూడ మూఁడువిశేషణములు వాడియున్నాఁడు.

శా. విద్వత్సంస్తవనీయభవ్యకవితావేశుండు విజ్ఞానసం
పద్విఖ్యాతుఁడు సంయమిప్రకరసంభావ్యానుభావుండు కృ
ష్ణద్వైపాయనుఁ డర్థి లోకహితనిష్ఠంబూని కావించె ధ
ర్మాద్వైతస్థితి భారతాఖ్య మగు లేఖ్యంబైన యామ్నాయమున్.

ఈపద్యమునందలి విద్వత్సంస్తవనీయ భవ్యకవితావేశుండు, లో నగువిశేషణములుకూడ వ్యాసవ్యక్తికిఁ జెందినవేనా? ఆపారాశరిభారత రచనాచాతుర్యమున కక్కఱకువచ్చునవి కావా?

శ్రీరామకృష్ణయ్యగారి విమర్శనమార్గ మనుసరించి, కొంచె మీ పైపద్యమునందలి కావ్యకలాదృష్టినిగూర్చి చర్చింతము. "విద్వత్సంస్తవనీయభవ్యకవితావేశుండు" అనఁగా వేదవేదాంగవేత్త లగుశ్రోత్రియులచేఁ గొనియాడఁబడఁదగిన యోగ్యత గలకవిత్వోద్రేకము కలవాఁడు. అనిక దా భావము? ఈదీర్ఘసమాసవిశేషణముచే నెట్టికావ్యకలాదృష్టి బో ధింపఁబడుచున్నది? మఱియుఁ బండితులు మెచ్చఁదగు కవితావేశము కలవాఁ డనుటచే నాతనికవిత్వము సామాన్యులకు బోధపడ దని కదా చెప్పవలయును? అట్లగుచో "లోకహితనిష్ఠం బూని", అని తెలుపుట యెట్లుపొసఁగును?

"స్త్రీశూద్ర ద్విజబంధూనాం త్రయీ న శ్రుతిగోచరా।
ఇతి భారత మాఖ్యానం మునినా కృపయాకృతమ్"

అని వ్యాసుఁడు దయార్ద్రహృదయుఁడై స్త్రీశూద్రబ్రహ్మబంధు లనిమిత్తము భారతమును విరచించె నని ప్రకటింపఁబడియుండ విద్వత్సం స్తవనీయముగా భారతము రచింపఁబడిన దనుటలోఁ గలకావ్యకలాదృష్టి యేదియో ?

విద్వాంసులు దీనిం బఠియించి, సామాన్యులకు బోధింపరాదా యందురా ? అట్లగుచో వారు వేదములద్వారముననే ధర్మబోధ చేయఁగలరు. ఈభారతామ్నాయముతో వారికిఁ బని యేమి? కావున వ్యాసుఁడు భారతమును సామాన్యలోకమునిమిత్తమే వ్రాసెను, కాని, పండితుల కొఱకుఁ గాదు. "సంయమిప్రకరసంభావ్యానుభావుండు" ఈవిశేషణముచే లోకజ్ఞానదూరులును శృంగారరసవిరోధులును నగునాటవికజటాధారులచేఁ బ్రశంసింపఁదగిన లేఖ్యామ్నాయమును విరచించెను గాని, కావ్యకలాదృష్టిగల ప్రౌఢలౌకికులు హర్షించుటకు సర్వానుగుణ్యమైతను సృష్టింపలే దని కదా తెలును.

"లేఖ్యంబైనయామ్నాయమున్" అని భారతమునకు లేఖ్య మని విశేషణమును వాడుటచేఁ దిక్కన యేమిచక్కఁదనమును దెలుపనెంచెనో యిందలి కావ్యకలాదృష్టి యేదియో ? పాఠ్యము, గేయము, శ్రావ్యము, ఆస్వాద్యము లోనగువిశేషణములు కావ్యముయొక్క మనోహరతను దెల్పును గావున నట్టివానిని వాడవలయును గాని, యీలేఖ్య మేమిటి? లేఖ్య మనఁగా వ్రాయఁదగినది. ఇట్లనుటచేఁ జక్కనివ్రాఁతగానికి సాధ్యమనియా? అట్లగుచోఁ జదువుట కింపుగా నుండదా? సత్యము తెలుపవలసినచో నీలేఖ్యంబైన యనుపదము భారతాఖ్యమగు లేఖ్యంబైన యని, ఖ్యాలయొక్క ప్రఖ్యాతికొఱకు వ్రాసినదిగాఁ గన్పట్టుచున్నది గాని, భావవిశేషమును వ్యక్తము చేయునదిగాఁ జూపట్టుటలేదు.

మఱియు "వేదామ్నాయమున్" అనుటచే వ్యాసుఁడు వైదికదృష్టితో భారతమును విరచించెను గాని, కావ్యకలాదృష్టితోఁ గా దని, స్పష్ట మగుచున్నది. "ధర్మాద్వైతస్థితిన్, కావించెన్" అని తిక్కన వాక్రుచ్చినాఁడు. ఇట ధర్మాద్వైతస్థితి యన భావ మేమి ? ధర్మముతో నభేద మగు రీతి యని యా? లేక ధర్మాభేదముల నియతితో ననియా భావము? మొదటి దైన యెడల నీధర్మము వైదికమా? లేకలౌకికమా? ఉభయాత్మకమా? యీపదము లేకున్నఁ గల్గులోప మేమి? ఇదియున్నఁ బొందు సొం పేమి.

"లోకహితనిష్ఠన్" అను వేఱొకపదము కలదు. దీనిభావ మేమి? లోకహితమును గూర్చినపట్టుదలతో ననిభావ మందురా? "పూని" అను

పదము కలదే! మఱి దీనిప్రయోజనమేమి? పోనీ యేదో కావ్యకళ
దృష్టిలో నిది దొరలె ననుకొందము. "అర్థిలోకహితనిష్ఠన్" ఈసమా
మునందలి మొదటిమాట కర్థమేమి, "అర్థో భిధేయ రై వస్తు ప్రయో
జననివృత్తిషు" అను నైఘంటిక ప్రమాణముచే నర్థిలోక మన యా
లోకమా? ధనికలోకమా? పేరుగల ప్రజాసమూహమా? వస్తువల్లో
మా? ప్రాయోజనలోకమా? నివృత్తికలజనమా? ఈయర్థిలోకనిష్ఠలో
కావ్యకలాదృష్టి యేదియో?

తిక్కయజ్వ కావ్యకలాదృష్టితోఁ జిత్రించిన పైపద్యమునందు
లుచున్న భవ్య, ఆవేశ, ప్రకర, అనుభావ, అర్థి, నిష్ఠ, పూని, ధర్మాద్వై
స్థితి, లేఖ్యాదిపదములన్నియుఁ బదాడంబరమునకు నక్కఱకువచ్చును గా
భావోన్నతికిఁ బనికివచ్చునవి కావు. ఈపదములు లేకున్నఁ బద్యము
భావము చెడదు. కనుఁడు, జ్ఞానసంపద్విఖ్యాతుఁ డగుకృష్ణద్వైపా
నుఁడు భారతామ్నాయమును గావించెన్. ఇదియే కదా, పద్యము
ముఖ్యమగు నర్థము? ఇఁకఁ బైవివరించిన పదము లేమిటికి? తిక్క
పైపదములవిలువను గావ్యకళాతులతోఁ జక్కఁగఁ దూఁచి, వాడలే
పదజాలము నెఱింగినవాఁ డగుటచేఁ జేతికందిన మాటల నెల్లఁ బద్య
లోఁ బొందుపఱిచినాఁ డనుభావము తట్టుచున్నది. ఈరీతియూహ
విద్వత్సంస్తవనీయపద్యము తావొసంగుచున్నది. కావున రామకృష్ణయ
గా రీపద్యమునందలి యద్వైతభావకలితమగు కావ్యకలాదృష్టి యె
యో యోపికతోఁ జూపెదరుగాత.

తిక్కన వ్యాసుని స్తుతించుపట్లను, నన్నయను నుతించుపట్లను
రచించిన పద్యములందలి విశేషణములు కావ్యరచనకుఁ బోషకములు
నన్వయించునాఁడే పైపద్యములు హృద్యము లగును గాని లేకున్న
వల నర్థశూన్యము లగుమాటలప్రోగు లగును.

వీ రింతటితోఁ దనివినొందక, పై పెచ్చు నన్నయార్యునికవిత
నార్యునికైతకుఁ గూటఁ దీసిక ట్టని, సమర్థించుటకు నిట్లు సెలవిచ్చి
న్నారు. కనుఁ డాయున్నతభావవైఖరిని- "వైదికోత్తముఁడగు నన్న

రణితో నతుకక, రసోచితములై తరువాతి ప్రబంధకవులధోరణికి మార్గదర్శకంబులైన గడుసుపోకడ లీయరణ్యపర్వ శేషమున నచ్చటచ్చటం గలవు." (పుట 142.)

సదాశయులారా! ఇ దెంతటిసాహసోక్తియో కంటిరా! బాఁపఁడు మాల నంటక దూరముగాఁ దొలఁగి పోవునట్లు, ఎఱ్ఱన ధోరణి శ్రోత్రియోత్తముఁ డగునన్నయధోరణిం దాఁకక, దూరముగా నిలిచి, రసోచితము లగుగడుసుపోకడలతోఁ బరుగులిడిన దంట! "శహబాస్" విమర్శనమన నిట్లు కావ్యకలాదృష్టితో వెలయవలయును. ధర్మాద్వైతసిత్ప్యుపబృంహితంబై భూమ్యంతరిక్షములు మాఱుమ్రోగునట్లు శబ్దీకరింప వీరికిఁ గాక నేరికి శక్యమగును!

మన ఎం.ఏ.గారు నన్నయమాటలు పేలవము లనియు, ఎఱ్ఱనను డులు గంభీరము లనియు రుజువుచేయుట కరణ్యపర్వ శేషమున, ఎఱ్ఱనవర్ణించిన పరీక్షితుఁడు మండూకనాయకుఁ డగు "ఆయు" వనువాని కూఁతురు సుశోభన యనుదానిఁ గాంచి, కామించుటను బ్రమాణముగా నొసంగిరి. వినుఁ డాసందర్భమును:- "పరీక్షితుఁ డనునొకరాజు మృగయారతుండై పోయి, వనంబున నొకపూవుఁబోఁడిం గనియె"
"కని యంతఁ గదిసి యాకామినియొప్పులఁ జూడ్కి దగుల మిఱుమినతమకంబున ననిమిషలోచనుఁడై, జననాథుఁడు మదనబాణసంహతిఁ దూలెన్"

అదియు నతిసుందరం బయిన తదీయమూర్తివిభవంబునకు మెచ్చి సాభిప్రాయంబుగా నవలోకించె నంత నమ్మహీకాంతుఁ డక్కాంత కిట్లులనియె.

"ఎవ్వరిదాన వంబుజదళేక్షణ యేకత మిట్టు లేల నీ
విప్పనభూమియందుఁ జరియించెదు నావుడుఁ దండ్రి పంపునం
దివ్వనభూమియందుఁ జరియించెద నవ్వరుఁగోరుకన్య నే
నెవ్వరిదానఁ గావలయు నేర్పడఁ జెప్పుము రాజనందనా"

అనిన దానిప్రగల్భవచనంబులకు నధికలోలుండై భూపాలుండు దనయభిలాషం బెఱింగించిన"- ఈరంగమంట! ఎఱ్ఱనప్రాగల్భ్యమును వెల్లడిసేయుటకు నక్క ఆరువచ్చినది! ఇట నెఱ్ఱనార్యుని కైత సొంపుగా నున్నదని యనవచ్చును గాని, నన్నపార్యునికవితను ధిక్కరించియున్న దనుట

యనాలోచిత మగు వాదము. ఎం. ఏ. గా రాదిపర్వమున నన్నపార్యు చిత్రించిన యయాతి, దేవయానింగాంచి సంభాషించిన ఘట్టమును చియుండిన నిట్టివాదమునకు నడుముకట్టి యుండెడివారుకారు.

పరికింపుఁడు, విద్యాద్వైతుఁ డాతావునఁ జిత్రించిన సరససాహి విలాసలాలిత్యమును - యయాతిమహారాజు మృగయాభిలాషియై వనమున కేఁగి, కొంతవడికిఁ బిపాసార్తిచేఁ బానీయములకై తిరిగి తిరిగి, యొక నూతిదరి కేఁగి యందుఁ బడియున్న యొక యువతీమణి నీక్షించెను. భూపావలోకిత యగు నతివ యొంతెంతయింపుగా వర్ణింపఁబడినదో కనుఁడు.

"తత్కూపమున విలసత్కాలఘనవల్లి
యన్నిట్టసఖి నూఁదియున్నదాని
గురుకుచయుగముపైఁ బరువడిఁదొరఁగెడు
కన్నీరు పూరించుచున్నదానిఁ
దన సమీపమునకు జనులరాగమనంబు
పన్నుగాఁ గోరుచునున్నదాని
వరుణదేవుతోడఁ గరమల్గి జలనివా, సంబువిడిచి భూస్థలంబునలని కరుగుదేరనున్న వరుణేంద్రుదేవియుఁ, బోనిదాని దేవయానిఁగనియె."

నన్నయభట్టారకుఁ డీపద్యమునందుఁ దరంగింపఁజేసిన భావగాంభీర్యసంపదను గావ్యకలాకోవిదులు కన్నుల నద్దికొని "బళిరే! నన్నయకవిసార్వభౌమా!" అని శిరఃకంపంబులఁ జేయకుందురా?

అట పరీక్షితుఁడు సుశోభనను జూచి "ఎవ్వరిదానవు" అని పద్యముతోఁ బ్రశ్నించియుండ నిట యయాతి దేవయానింగాంచి "నీ వెవ్వరిదాన విక్లలల మేకతంబ యిప్పాపినాంతరకూపమున నున్నదానవు" అని వచనముతోఁ బ్రశ్నించెను. పరిశీలింపఁ బరీక్షితుని ప్రశ్నగీతికిని యయాతి ప్రశ్నరీతికిని దారతమ్యము విదిత మగును. యయాతి ప్రశ్నలో దేవయానిపై నంకురించిన కనికరము గోచరించును. అయ్యది ప్రకరణార్థ మగు నాపన్నసంరక్షణమున కొంతయుఁ దగియున్నది. ఇంతియ కాదు దేవయాని చరితమును విని, యాసార్వభౌముఁడు దయాళుఁడై యావిప్రకన్య నా

దనుండి యుద్ధరించె ననుపద్య మాంధ్రకవితాసతీమతల్లికి శిరోమణియై తనరారుచున్నది. కనుఁడు-

"జలధివిలోలవీచివిలసత్తలకాంచిసమంచితావనీ
తలవహనక్షమంబయిన దక్షిణహస్తమునం దమున్న స
ద్దళకరుఘర్మవారికణకమ్రకరాబ్జమువట్టి నూతిలోఁ
వెలువడఁ గోమలిం దిగిచె విశ్రుతకీర్తి యయాతి ప్రీతితోన్."

ఈపద్యమున నన్నయభట్టారకుఁడు కురుక్షితీంద్రునియొక్క యాత్తజనరక్షణదక్ష మగుదక్షిణహస్తముచు బ్రతిపక్షవక్షఃస్థలవిదళనక్షమ మగునట్లు వర్ణించియున్నాఁడు. ఈకూర్పక్షరలక్షల కర్హమైయున్నది. పరులక్షేమముల సంఘటింప నభిలషించు క్షత్రియవీరుని కరమును వర్ణింపఁదగులక్షణము నీపద్యము బోధించుచున్నది.

ఇందలి విశేషణము లన్నియుఁ బ్రకరణార్థ మగు నాత్తసంరక్షణమును బహుసరసముగాఁ బోషించుచున్నవి. ఇందు వ్యర్థమగుపద మొక్కటియుఁ గానరాదు. కవిత్వ మన నిట్లు మనోహరార్థకలితమై యుండవలయును. కావ్యకలాద్రష్ట లద్వైతదృష్టితో నీపద్యరాజమును గాంతురేని నన్నయభట్టారకునకు వినయాభివందనముల సమర్పింతు రనుట యతిశయోక్తి కాదు.

ఇ ట్లెనలేని తెలుఁగుకైత తేనెసోనలు నన్నయభట్టారకుని భారతమునఁ బెక్కులు కలవు. సత్యదృక్కులకు నన్నయకవిత వెన్నెలవలెఁ జల్లనై, రసాలఫలమువలెఁ దియ్యనై, హృదయాహ్లాదమును సమకూర్చుచుండును. రామకృష్ణయ్యగారు నన్నయకవితకడ నెఱ్ఱకవితను బెద్దఁజేయఁజూచుట రాయంచకడ నూరఁబిచ్చుకను మెచ్చువంటిది. ఏమందురా, అసమానసాహితీసౌందర్యశోభిత మగునన్నపార్యుని కవితను, అద్దానియొద్దిలఁ గన్నులనద్దికొనిన తిక్కయజ్వకైతను, నాధారముగాఁ గొని, సర్వవిధముల వారిరచనల ననుకరించుచుఁ గావ్యరచనకు దిగినయెఱ్ఱన స్వతంత్రకవి యనుటకు వీలులేదు. ఈవిషయమును మన రామకృష్ణయ్యగా రంగీకరించియే యున్నారు. చూడుఁడు, "ఇది యంతయు కేవలకథాకథనపద్ధతిని

(నారెటివ్ స్టయిల్)గాక సంభాషణశైలిలోఁ బడిన దగుటచే, తిక్కనార్యు
శైలి ననుకరించినది. ఎఱ్ఱాప్రెగ్గడ కవిత్వ మనుటకు సందేహము లే
తిక్కన నన్నయకవిత ననుకరించియుండుటచేఁ బరంపరాసంబంధముచే
యిరువురికవిత్వమును నెఱ్ఱన యనుసరించె ననఁదగునుగదా ?

ఎఱ్ఱనకవితనుగూర్చి యభినవతిక్కన బిరుదాంకితు లగు శ్రీదుర్గా
సుబ్రహ్మణ్యశర్మగారే మనితో వినుఁడు. "భారతరచనయందు ఎఱ్ఱన
క్కినయుభయకవులమార్గములను సమ్మేళన మొనర్చుకొని, తనరచన
గించినాఁడు".

ఇ ట్లెఱ్ఱనకావ్యమును సాకల్యముగాఁ జదివినప్రాజ్ఞు లెల్లరు నెఱ్ఱ
నన్నయకవిత్వము ననుకరించి, కావ్యముల విరచించె నని తెలుపుచుం
వీరుమాత్ర మెఱ్ఱన నన్నపార్యుని కవితావాసన నాసనుబడకుండ ముక్కు
మూసికొని, భారతమును వ్రాసినట్లు సిద్ధాంతీకరించుచున్నారు.

ఎఱ్ఱన నన్నపార్యుని వైదికధోరణితో నతుకకుండ నెడమై కవి
నల్లెనో లేదో తెలియదు కాని మన ఎం.ఏ గారుమాత్ర మెఱ్ఱనను నన్న
యకవిత్వము దఱికి రాకుండ దూరముగఁ దఱిమిరి. కాని యెఱ్ఱన రా
లలో నన్నయపోకడలు చూపట్టుచున్న వి కనుఁడు:—"ఎవ్వరిదానవు"
నన్నయ- "ఎవ్వరిదానవు" ఎఱ్ఱన- "ఇట్లేల యేకతంబ యీవిపినాంతః"
నన్నయ- "ఏకత మిట్టులేల నివివ్వనభూమి" ఎఱ్ఱన.

ఇటులుండ నెఱ్ఱన నన్నయకవితకు దూరుఁడైనట్లు తెలుపు
యెట్లు పొసఁగును ? ఎఱ్ఱన వీరికిఁ గలలో సాక్షాత్కరించి చెప్పెనా ?

శ్రీరామకృష్ణయ్యగారెవఁడు వైదికోత్తముఁ డగునన్నయధో
తో నతుకక దూరముగఁ దొలఁగి, కొండపైకెక్కి ప్రౌఢకవితాస్రవంతి
ప్రవహింపఁజేసె ననిరో యతఁడు తన హరివంశనృసింహపురాణముల
యందు నన్నయభట్టారకు నిట్లు ప్రశంసించియున్నాఁడు.

ఉ. ఉన్నతగోత్రసంభవము నూర్జితసత్త్వము భద్రజాతిసం
పన్నము నుద్ధతాన్యపరిభావిమదోత్కటము న్నరేంద్రపూ
జోన్నయనోచితంబు నయి చొప్పడు నన్నయభట్టకుంజరం
బెన్న నిరంకుశోక్తిగతి నెందును గ్రాలుటఁ బ్రస్తుతించెదన్. (హరి)

"భాసురభారతార్థముల భంగులు నిక్క మెఱుంగనేరమిఁ
గాసట బీసటే చదివి గాథలు ద్రవ్వు తెనుంగువారికిన్
వ్యాసముని ప్రణీతపరమార్థము తెల్లఁగఁ జేసినట్టి య
భ్యాసనకల్పులం దలఁతు నాద్యుల నన్నయతిక్కనార్యులన్. (నృసిం)

తిక్కనార్యుని శిష్యుఁడగుమారన నన్నపార్యున కెట్లువందన మొనర్చియున్నాఁడో చూడఁదగును.

"సారకథాసుధారస మజస్రము నాగళపూరితంబుగా
నారఁగఁగ్రోలుచున్ జనులు హర్షరసాంబుధిఁ దేలునట్లుగా
భారతసంహితన్ మును ద్రిపర్వము లెవ్వఁ డొనర్చె నట్టి వి
ద్యారమణీయు నాంధ్రకవితాగురు నన్నయభట్టుఁ గొల్చెదన్."

ఈరీతిగా నన్నయభట్టారకుని మధురరసభరిత మగుకవితాస్రవంతి జాహ్నవీప్రవాహమువలె నాంధ్రదేశమును బావనము చేసియుండ నన్నయకవిత రసహీన మగువైదికదృష్టితోఁ గూడియున్న దని, మన కోరాడ రామకృష్ణయ్యగా రెట్లు వ్రాయసాహసించిరో?

ఇదికాక సాహిత్యరచనలయందు లలితము లగుకళావిలాసములు చూపట్టును గాని, జాతిధర్మములు పొడకట్టునా? వైదికుల కావ్యములలో హోమసమిథలును, రాచవారికైతలలో సాముగరిడీలును, వైశ్యులరచనలలోఁ దూనికరాలును, కాఁపులకబ్బములలోఁ గలుపుతీతలును, కాంతామణులకవనములలోఁ గాటుకమఱకలును, నాడింధములకవిత్వములలో హసంతీఫూత్కారములును, నాపితులవ్రాఁతలలోఁ దంటసపుచిటికలును, కువిందగ్రంథములలోఁ బనుగుపేకలును, లోనగు కులకృత్యములు చూపట్టునా? చూపట్టునందురా? అయినచోఁ గరణముల పొత్తములలో ననలుమినపాలు చూపట్టును గాని కావ్యకలాదృష్టు లెట్లుకన్పట్టును? ఇదంతయు, యం. యే. గారి విమర్శనముచే జనితమైన ప్రతివిమర్శనము కాని, తిక్కనార్యుని కవితపై జనించిన యీసుచే వ్రాసినదికాదు.

నన్నయతిక్కన లిరువురును నసమానకవితావైదగ్ధ్యభాసితులగు పండితప్రకాండులు; నా కీమహితాత్ము లిరువురిపైనను భేదరహిత మగు గౌరవభావముకలదు కాని, భేదదృష్టి లేదు.

# "చజలు."

— విద్వాన్ దర్భా సర్వేశ్వరశాస్త్రిగారు, పిఠాపురము. —

సూ:—ఇ ఈ ఎ ఏలంగూడినచజలు తాలవ్యములు.
అఆ ఉఊ ఒఓఔలంగూడినచజలు దంత్యములు.
అని బాలవ్యాకరణము

శ్లో. అద్ద న్త్య స్తాలవ్యశ్చు ర్వక్ర స్స్యాత్ - అను చింతామ పై రెండుసూత్రములకును మూలము. ఈచింతామణిసూత్రమున దంత్య తాలవ్యపదార్థములకు నుద్దేశ్యత్వ మని యొకపక్షము విధేయత్వ మ మఱొకపక్షమును నాయావ్యాఖ్యానములఁ బట్టి లభించుచున్నవి.

వీనిలో, అప్పకవి, అహోబలపండితుఁడు మున్నగువారు దంత్య తాలవ్యపదార్థములకు నుద్దేశ్యము నే యాశ్రయించినటులును బ్ర. వజ్ఝ చినసీతారామస్వామిశాస్త్రులుగారు, ఈమతము నే యనుసరించినటులు అథర్వణాచార్యులు చిన్నయసూరి మున్నగువారు వానికి విధేయత్వమ నాశ్రయించినటులును వారిగ్రంథసందర్భములఁబట్టి గోచరించుచున్నది ఉద్దేశ్యత్వవాదుల మతములకు నవాంతరభేదములు కూడఁ గలవు.

దంత్యః చుః అకారపరకః తాలవ్యః చుః వక్రపరకః. ఇటుల ఉద్దేశ్యత్వపక్షమున నన్వయము. ఇట దంత్యచవర్గ ఉద్దేశ్యము, అకా రపరకత్వము విధేయము. ఇటులే తాలవ్యచవర్గ ఉద్దేశ్యము, వక్ర పరకత్వము విధేయము. విధేయత్వపక్షమున అత్ అకారః పరశ్చేత్ చుః దంత్యో భవతి. వక్రః పరశ్చేత్ చుః తాలవ్యో భవతి అని యన్వయము ఇట చవర్గ ఉద్దేశ్యము. అకారము నిమిత్తము, దంత్యత్వము విధేయము ఇటులే చవర్గ ఉద్దేశ్యము, వక్రము నిమిత్తము తాలవ్యత్వము విధేయ ము. ఉద్దేశ్యనిమిత్తములు ప్రమాణాంతరసిద్ధము లనియు విధేయము తత్ప్ర మాణమాత్రగమ్య మనియు శాస్త్రమర్యాద.

ఉద్దేశ్యత్వపక్షమునఁ దాలవ్యముగా నుచ్చరింపఁబడు చవర్గ చేట, చేద మున్నగుచోటుల చకారముసహఁ బరమందు ఆకారమ

ఏకారమా? అనుసంశయము నీవాక్యము తొలఁగించి ఏకారమే కలదను నిశ్చయమును గలిగించుచున్నది.

విధేయత్వపక్షమున అకారవిశిష్టముగా నుచ్చరింపఁబడు చవి, చాన మున్నగుచోట్ల చకారము దంత్యమా? తాలవ్యమా? అనుసంశయమును నివర్తింపఁజేసి, అద్దంత్యాః అనువాక్యము దంత్యమే అను నిశ్చయమును గలిగించుచున్నది. ఇట్లే ద్వితీయవాక్యార్థ మూహించునది.

అప్పకవి తనమతము నిట్లు ప్రదర్శించెను.

ఆ. వె. ధరణి దంత్యములును దాలవ్యములు నన
వికృతిచజలు రెండువిధము లయ్యె,
నీని నెఱుఁగకున్న విశ్రమభంగంబు
దొడరి కావ్యములను దోష మొదవు.

చజలదంత్యతాలవ్యత్వ వ్యవస్థ తెలియనియెడల విశ్రమభంగము కలుగునను నీపద్యార్థముపై యతియందు దంత్యతాలవ్యములకు మైత్రి యుండఁగా యతిభంగ మెట్లు? అని ప్రశ్న వొడముచున్నది. కాని దంత్యతాలవ్యవర్ణములకు నుత్తరమున నుండుస్వరము తెలియనియెడల యతిభంగము గలుగు నని పైపద్యతాత్పర్య మని యూహింపనగు.

ఆ. వె. దంతజంబులెల్లఁ దలకట్టులును వాని
యందు దీర్ఘములును బొందియుండు
తాలుజాక్షరములు తనరారు హ్రస్వాది
వక్రయుతము లగుచు వనజనాభ.

ఇట "దంతజ బులెల్ల"అనునది యుద్దేశ్యవాచక మనియు "తలకట్టులు వానియందు దీర్ఘములును బొందియుండు" అనునది విధేయవాచక మనియును నూహింపనగును. ఇట నుద్దేశ్య విధేయభావవ్యత్యాసము చేసినయెడల విశ్రమభంగాపాదనానుపపత్తియు చిగురు చుట్టము మున్నగుపట్ల వ్యవస్థచేయుమి న్యూనతయు సంభవించును. కాని ఆ...... జాగనంగ దంతజ బు లయ్యె. ౨ ౧౧౭ ఆ. చెప్పరాని...చిఱుతయే నంచుని, పట్టియనఁగఁ దాలుభవము లయ్యె. ౨. ౧౨౦ ఆ. చందమామ...అనఁగ దంత్య చజలు ౨. ౧౨౮, ఇత్యాది పద్యస్వారస్యముంబట్టి

విధేయత్వపక్షము స్ఫురించును. అయినను బూరోక్తదోషప్రసక్తిచే నీపక్షమునఁ దాత్పర్యము లేదని యనుకొనఁదగి యున్నది. పైపద్ధతిం బట్టి యుభయవిధాన మాశ్రయించె ననుటకు నన్యోన్యాశ్రయదోషము వలన వలనుపడదు. దంతజాబు లెల్ల నను పైపద్యమందలి వానియం దీర్ఘములు అనునది మూలసూత్రమందలి అత్పదముయొక్క తకారము ముఖసుఖార్థ మని వ్యాఖ్యానము చేయుచున్నది. హ్రస్వాదివక్రము ములు:—వక్రము=ఏజ్. ఆదివక్రము=ఏ. హ్రస్వాదివక్రము=ఎ. యప్పకవిమతమున దాలవ్యచజలు సార్వత్రికముగా హ్రస్వఎకారవిశిష్ట ములు. చేయి, చేర, చేయు మున్నగుకొలఁదిపదములయందలి తాలవ్య చజలుమాత్రము దీర్ఘఏకారవిశిష్టములు. బహుళముగా దంత్యచజలకే దీర్ఘఏకారవైశిష్ట్యము కలదు. ఈవిషయము—

ఆ. చేతఁజీరలేదు చేసేఁడువరహాలు

... ... ...

వఱలుకొన్నిదీర్ఘవక్రలిపులు. ౨౧౨౧.అనుదానింబట్టి స్పష్టమగుచున్నది.

ఈమతమున, చెయివు మున్నగుచోట్ల చకారము లోకవ్యవహారమువలనఁ దాలవ్య మని తెలియచున్నది, గాన, పైనున్న యచ్చ ఎకారము గాని అకారముకా దనుటయే ముఖ్యప్రయోజనము కాన చవిమున్నగువాని అకారముతో చెయివు మున్నగువాని ఎకారమునకు యతి ఘటింపఁబడినందున "వీనిఁదెలియకున్న" అనుపద్యము సంగతమగుచున్నది.

అహోబలపండితుఁడును, అద్దంత్య ఇతి అత్ర వికృతౌ దంత్యః చః చవర్గః అత్ అకారవాన్ భవతి. చవి, చాన, చమురు, చప్పు ఇత్యాది. తాలవ్యః చః చవర్గః అత్ర వక్రః స్యాత్ ఎకారవాన్ భవతి. చెవి, జేగుఱు, చెమట, చెలువు ఇత్యాది. అని వ్యాఖ్యానము చేసెను. దీనిఁబట్టిదంత్యతాలవ్యములకుద్వైత్వముస్వారసికముగాసిద్ధించుచున్నది.

ఆథర్వణాచార్యులు శ్లో. "చుస్తాలవ్యే స్వరే కంఠతాలవ్యేపి చ తాలుజః। దంత్యోన్యత్ర పదాద్యేచ బహుళం పూర్వవద్భవేత్" అని వివరించుటచేత, నీతనికి విధేయత్వపక్షమభిమత మని స్పష్టమగుచున్నది.

ఈకారిక, అథర్వణకృత మని పెద్దలవ్యవహారము ననుసరించి యిట్లు వ్రాయుట యైనది. ఈమతమున మూలస్థమైన అత్వపదము అఆఉఊఒఓఔలకును వక్రపదము ఇఈఎఏ(ఐ)లకును లక్షకము లని యెఱుఁగవలయును.

చిన్నయసూరి సూ:—చుస్తాలవ్యే తాలవ్యః- అక్కజాదిషు దంత్యోన్యత్ర- అని తనసూత్రాంధ్రవ్యాకరణమునఁ జెప్పెను. ఈతఁడును దీనిఁబట్టి విధేయత్వవాదియే యని స్పష్టము. సూ:—చుస్తాలవ్యే తాలవ్యః దంత్యోన్యత్ర అక్కజాదిషు అను ముద్రితపాఠక్రమము అసాధువు. కానిచో అక్కజాదిషు సూత్రము దంత్యపదానువృత్తిచే దంత్యవిధాయక మగును గాన దంత్యోన్యత్ర అనుసూత్రముచేతనే అక్కజాములయందు దంత్యవిధానము సిద్ధించుటచేత ఈసూత్రము వ్యర్థమగక తీరదు. చుస్తాలవ్యే తాలవ్యః అనుసూత్రోత్తరమందు 'అక్కజాదిషు' అనిపఠించినయెడల తాలవ్యపదానువృత్తిచే తాలవ్యవిధాయక మగును గాన వైయర్థ్యశంక కవకాశము లేదు. అక్కజాదిసూత్రమువలన చాయ, జాణ, జలగ మున్నగునవి సంగృహీతము లని యెఱుఁగునది. ఈసూత్రమును దనబాలవ్యాకరణమున ననువదింపమికి నావ్యాకరణమునకుఁ గలబాలత్వమే కారణము కానోపును. అక్కజాదిపదములయందు దంత్యములే యని శబ్దరత్నాకరమునఁ గలదు. కాని యిది యీ చిన్నయసూరిమతమునకును లోకవ్యవహారమునకును విరుద్ధము.

బ్ర. వ. చి. సీ. శాస్త్రులుగారు చింతామణివిషయపరిశోధనమున "ఉచ్చారణమునం దెచటి చజలు తాలవ్యములుగా నుండునో వానిపైని యిత్వమున్న దని యెంచుట సాధు వగు ననియు యెచటిచజలు దంత్యములుగాఁ బలుకఁబడునో వానిపైని అత్వమున్నదని యెంచుట సాధువగు ననియు నీసూత్రము నిర్ణయించుచున్నది. కాఁగా చాఁద, చాఁట, చాఁప, జాన మున్నగుస్థలములలోని చజలు తాలవ్యములుగాఁ బలుకఁబడుచున్నవి గాన నవి యిత్వవిశిష్టములే యని సిద్ధాంతిత మగుచున్నది. అయ్యవి అత్వవిశిష్టములై యుండుటయే సత్యమైనయెడల చాఁప, చందురుఁడు, జాము మున్నగువానివలెనే పలుకఁబడుచు నుండవలసియుండును గదా

అని పరిశీలించుకొనవలె నని యీసూత్ర మువదేశించుచున్నది" అని
యుటవలన వీరికి నుద్దేశ్యత్వపక్షమే యభిప్రేత మని తోఁచుచున్నది.

ఉద్దేశ్యత్వపక్షమున చవి, చాన మున్నగుచోట్ల స్వరసంశయ
లేదు గాన స్వరసంశయనివృత్తికై యారంభింపఁబడిన 'అద్దాత్యః' అను
క్యము వ్యర్థమగును. విధేయత్వ పక్షమం దన్ననో చవి మున్నగుచో
స్వరసందేహము లేకున్నను దంత్యతాలవ్యసందేహ ముండుటవలన
న్నివృత్తికై యీవాక్యము సార్థకము. ఇఁక- ఉద్దేశ్యత్వపక్షమునఁ
లేని లక్షణ మీవిధేయత్వపక్షమున నాశ్రయింపఁదగి యున్నది. వై
ర్థ్యము నాశ్రయించుటకంటె లక్షకత్వము నాశ్రయించి సార్థక్యము
వర్ణించుటయె సముచిత మని శాస్త్రజ్ఞులకుఁ దోఁపకమానదు.

మఱియు లోకవ్యవహారమున, తాలవ్యములుగాఁ బ్రసిద్ధముల
అక్కజము (చూ. సూత్రాంధ్రవ్యాకరణము), జాణ (చూ. యయాతి
త్ర ౪-౯౦), చాయ (చూ. వసుచరిత్ర ౧-౧౦౨), జలగ (చూ.
త్నాకరము), జడ (చూ. విజయవిలాసము 3-౧3) మున్నగుచోట్ల
పరకత్వరూపవిపరీతవిధానరూపదోష మీయుద్దేశ్యత్వపక్షమునఁ దట
చుచున్నది. ఇట్టిదోషము చిన్నయసూరిమతమున లేదు.

శ్రీశాస్త్రులుగారు "ఇఁక వీ రనుకొనిన యుత్పత్తిస్థానములను
రాయణముచేయుటకే నన్నయభట్టు అద్దాత్య ఇత్యాది పైసూత్రము
రంభించె నన్నచో వక్రమగునోత్వముతోఁ గూడిన చజలు గూడ నీసూ
త్రముచేఁ దాలవ్యములే కావలసివచ్చును గాన నిచట నన్నయభట్టు
కుఁ డసమగ్రముగనే గాక ప్రమాదముగఁ గూడ సూత్రించె నని చె
వచ్చును. నిజముగాఁ జింతామణిలో నిట్టి ప్రమాదముగూడ నన్న
తలఁచియే సూరిగారు పైరీతిని సూత్రించిరా యని యాలోచింప
యున్నది.'' అని చిన్నయసూరిపై దోషము చెప్పిరి. కాని నన్నయభ
రకుఁడు 'ఏజధోవక్రః' అని ఓకారమునకుఁ గూడ వక్రసంజ్ఞ చేసి
వక్రశబ్దమును దనచింతామణియందుఁ 'దాలవ్యశ్చ ర్వక్రస్యా'
నొక్కచోట మాత్రమే వ్యవహరించుట యు నాస్థలమునఁగూడ ఓకార

నకుఁ బ్రయోజనాభావము తటస్థించుటయుఁ గలుగుటచే ఓకారము నకు వక్రసంజ్ఞకు నేమి ఫలమో, "అద్దంత్యాః తాలవ్యశ్చ్సస్స్య దెత్వే మిథ స్సవర్ణశ్చ" అనులఘున్యాసమున నభీష్టసిద్ధి యగుచుండఁగా నిష్ప్రయోజనమగు ఓకారమును గూడ బోధించెడి వక్రశబ్దఘటనమున కేమిఫలమో శ్రీశాస్త్రులుఁగా రూహింపవలయును.

సామాన్యముగా- ఇతరులకు అభిమతము గాని పదాదియకారమును నన్నయభట్టారకుఁడు కంఠోక్తిగా నంగీకరించినట్లే ఓకారము పరమగునపుడు చవర్గునకుఁ దాలవ్యోచ్చారణము గూడ నీతని కభిమత మని వక్రశబ్దమునకు సార్థక్యము చెప్పవలయు నేమో విచక్షణు లూహింతురుగాక ! సర్వం శమ్.

---

# సరస్వతీరామాయణము.

## — జనమంచి సీతారామస్వామిగారు—అనకాపల్లి. —

శ్రీసూర్యరాయమహారాజపోషణముచే దేశభూషణమై కవిబుధతోషణమై, యాంధ్రవిద్రోహిజనభీషణమై విరాజిల్లుచున్న 'ఆంధ్రసాహిత్యపరిషత్తు'నకు రజతోత్సవ మగుదినముకంటె సౌభాగ్యదినము గలదే? ఈతెలుఁగుతల్లి పండుగున కమందానంద మొందని యాంధ్రుని జన్మము జన్మమే? ఆంధ్రభాషాభిమాను లందఱు నిట్టిశుభసమయమున స్వోత్సాహసూచకముగ శక్త్యనుసారముగఁ గానుకలు తెచ్చి యమ్మపాదారవిందముల సాన్నిధ్యమ్మున సమర్పించి చరితార్థులు కావలదా? కావున నేనును "ఉడుతభక్తి"ని జ్ఞప్తికిఁ దెచ్చుకొని, ధైర్యసాహసభక్తివిశ్వాసములతో నొక్కవ్యాసము వ్రాసి, "యిదియ పదివేలుగ భావించి పరిగ్రహింపవే తల్లీ" యని పరిషదంబాభద్రపీఠముకడ నర్పణముసేయఁ బూనితిని. కామోద్రేకజనకములునవినీతిబోధకములు నసహ్యాధోరణీసమన్వితములు నగుగ్రంథము లిప్పుడు కుప్పతిప్పలుగ నుప్పతిల్లుటఁగాంచి, తిక్కన పోతనాది మహనీయాంధ్రకవితాసామ్రాజ్యపట్టభద్రులఁ గన్నయాంధ్రజననీమతల్లి కిప్పు డెంతటిదుర్దినములు సంభవించెనో" యని కంటఁ దడివెట్టి యాంధ్రవాఙ్మయ శ్రేయోభిలాషులు కొందఱు హాహాకారములు చేయుచున్నారు. కాని, యంతనిరాశకు నంతనిరుత్సాహమునకు నంతవిషాదమునకు నవసరము లేదని నామనవి. ఈకాలమునందును సారస్వతాభరణము లని చెప్పఁదగిన గ్రంథరత్నములు రచించుచు దేశోపకారపరాయణులైన మహనీయు లెందఱో కలరు. వారిలోఁ గొందఱు కీర్తిమంతులైరి. పూజాపురస్కారములు లేక బూజుపట్టిన దేవతావిగ్రహములవలె మఱికొంద ఱున్నారు. ఎంతటిప్రజ్ఞ కలవారికైన నదృష్టవిశేషము లేనిదే యశోధనము లభింపదుగదా!

"Full many a gem of purest ray serene
The dark unfathomed caves of the ocean bear,

Full many a flower is born to blush unseen
And waste its sweetness on the desert air."

(మహాంభోరాశిగర్భమున నకలంక తేజోవిరాజమానము లైన యనర్ఘరత్నము లెన్నియో పడియున్నవి; నిర్జనప్రదేశములయందు దివ్యకుసుమము లెన్నియో పొడమి తమమనోహరసౌరభమును వ్యర్థముగ గాలిపాలు చేయుచున్నవి.)

అనిచెప్పిన యాంగ్లకవీశ్వరునిమాటలు యథార్థములుగదా.

అట్టిభావమునే చమత్కారముగ లీలాశుకమహాకవి యీక్రిందిశ్లోకమున వెల్లడించె:—

శ్లో. ఉర్వ్యాం కోఽపి మహీధరో లఘుతరో దోర్భ్యాం ధృతో లీలయా
తేన త్వం దివి భూతలేచ సతతం గోవర్ధనోద్ధారకః
త్వాం త్రైలోక్యధరం వహామి కుచయో రగ్రే న తద్గణ్యతే
కిం వా కేశవ భాషణేన బహునా? పుణ్యై ర్యశో లభ్యతే.

కావున, యశోవ్యాప్తి లేనంతమాత్రమున నెవరికవిత్వ మైనను బ్రశంసనీయము కాదనుట యుక్తముకాదు. ఇట్టి యభిప్రాయము కలవాఁడ నగుటచేతనే, యొకమిత్రుఁడు "సరస్వతీరామాయణము" అనునొక పుస్తక మిచ్చి "యిదిమీరు తప్పక చదివి యెట్లున్నదో మొగమోటము లేక వచింపుఁడు" అని కోర, గ్రంథము రచించినవారిపేరు నేనింతకు ముం దెన్నఁడు విని యుండకపోయినను, సరే యని వెంటనే దానినింటికిఁ దీసికొనిపోయి చదువుట కారంభించితి. తన్మాధుర్య మే మనినుడువుదు? విస్మయానందపరవశుఁడనై పోయితి ననుట యతిశయోక్తి కాదు. నాకు సహజముగా రామాయణ మన్నఁ బ్రాణము. అంతహృదయంగమ మైన కథ మఱియొకటి జగత్తులో లే దని నానమ్మకము. కథయననేల రామనామమే చాలు నొడలు పులకరింపఁజేయుటకు. భారతీయులకు శ్రీసీతాకళత్రపవిత్రచరిత్రకంటెఁ బ్రియమైనది లే దని చెప్పనొప్పు. "జగత్ప్రథమమంగళమ్" అని కాళిదాసుచు "యది తుణ్ణం పూర్వైరితి జహాతి రామస్యచరితం, గుణై రేతావద్భి ర్జయతి పున రన్యో జగతి

ళః?" అని మురారియు, "స్వసూక్తీనాం పాత్రం రఘుకులతిలక మేకం కలయతాం। కవీనాం కోదోష స్సతు గుణగణానా మవగుణః"-అని జయదేవుఁడును, "రఘురామచరిత్ర మొదట తెల్పెన్నిన, నన్నిరూపుల కహీనగతిం దగి యుండు నుర్వరన్" అని గోపీనాథ వేంకటకవియు "జానకీజానికథల్ రచింపక యస్కృతార్థ లెన్ని రచించె నేనియున్ వాని వివేక మేమిటికి వానికవిత్వమహత్త్వ మేటికిన్" అని కంకంటిపాపరాజును, ఇట్లే మఱికొందఱు గుణజ్ఞులును రసవత్తరవాక్యములలోఁ దమరామాయణాభిమానము వెల్లడించుట యెఱుఁగమే ? సంపూర్ణరామాయణము హరికథారూపమున నెలలకొలఁది నెన్నిసారులో చెప్పి హరిదాసులు ప్రజలచే నెంతెంత సత్కారములు పొందుచున్నారో చూచుచున్నాము గదా. "టాకీ" లన్నిటిలోను "లవకుశ" జనుల నాకర్షింపఁగలిగినట్లు మఱేదైన నాకర్షింపఁజాలెనా? త్యాగరాయకృతులు, అధ్యాత్మరామాయణకీర్తనలు రామభజనలు శ్రోతల కెంతయానందముఁ గలిగించునో యనుభవైకవేద్యము గాక వర్ణింప సాధ్య మగునా ? రంగనాథుఁడు భాస్కరుఁడు పాపరాజు గోపీనాథుఁడు వాసుదాసుఁడు శేషాద్రిశర్మగారు మొదలగు కవిచంద్రులు యథాశక్తి రామకథ రచించి, తాము కృతార్థులై పాఠకకోటిని గూడఁ గృతార్థత నొందించువారైరిగదా! కాని యింతవఱకు రామాయణరచనచే నఖండవిఖ్యాతి నొందినస్త్రీరత్నము లరుదు. రామభక్తిప్రపూర్ణయు విదుషీమణియు సరసకవితాధురీణయు కృష్ణరాయశకాభరణప్రాయము నగు మొల్ల యొక్కతె యె సర్వాంధ్రహృదయసింహాసనారూఢ యైనది. ఆకవయిత్రీశిరోమణిని దలంపించుచు కవిత్వము చెప్పఁగల కాంతాతిలకము లీకాలమున లేరా? ఉన్నా రున్నా రనుటకు సరస్వతీరామాయణ మొకప్రత్యక్షనిదర్శన మని నామనవి.

ఈసరస్వతీరామాయణగ్రంథకర్త్రి సరస్వతీదేవి. పద్మనాయక వంశసంజాత. చేబ్రోలు రాజగోపాలముగారి యర్ధాంగి. ఆంధ్రగీర్వాణాంగ్లహిందీభాషావిశారద. శ్రీమీర్జాపురసంస్థానవిద్యాధికారిణి. జటప్రోలు సంస్థానపండితులగు వాజపేయయాజుల రామసుబ్బారాయఁడుగారి

ష్కారాలు. ఈసంగతులే గాక కవయిత్రీపాతివ్రత్యాదిమహనీయగుణసం పత్తి మొదలగువిషయములు గూడ నుపోద్ఘాతమునందు హృదయంగమముగఁ దెలుపఁబడినవి. ఇమ్మహాగ్రంథమును శ్రీమీర్జాపురపురాణిగారు ముద్రింపించుటచేత సరస్వతీదేవిగారు తమకృతజ్ఞతను వెల్లడించుచు రచించిన నవరత్నమాల గ్రంథాది నొప్పుచున్నది. రామాయణరచన మాట యటుండ, ఈపద్యములే సుధామాధురీభరితములై దేవిగారి కవిత్వనైపుణ్యమును భక్తివిశ్వాసాదిగుణ ప్రభావమును బ్రకటించి, పాఠకుల యుల్లములఁ బల్లవింపఁజేసి గ్రంథ మామూలాగ్రము చదువ నువ్విళ్లూరించుచున్నవి. మచ్చున కొకపద్య ముదాహరింతు :—

సీ. కనులు విప్పిననాఁడె కరుణావలోకన
　　　　పీయూషవర్షంబు... గురిసె
　పలుకనేర్చిననాఁడె పరమాత్మనామమా
　　　　ధురి రుచిఁజూడ సంతుష్టిగలిగె
　కరము లెత్తిననాఁడె కలితోనఁ
　　　　గవిరాజపండితదారిద్ర్యభార మడఁగె
　వ్రేళ్లు విప్పిననాఁడె విప్రార్థిరోగుల
　　　　కభయప్రదానైకహస్త మయ్యె
　అనుచు వేనోళ్లఁ బొగడుదు రఖిలజనులు
　సరససద్గుణమణిమాల ! సత్యశీల !
　రాజ్యలక్ష్మిపవిత్రగర్భప్రదీప !
　విమలకరుణావలంబ ! శ్రీ వేంకయాంబ !

"ఇట్టి కవితావైఖరులు మన మెఱుఁగనివి గావు. పూర్వకవుల రచనలలో నెగడుచున్నవే" అని యాసడించువా రుందురా ? ఉందురేని వారు రసజ్ఞులు కా రనవలసివచ్చును. నేటిదాఁక మనభాషలో వెలసిన సర్వగ్రంథములును దొలిపుటనుండి తుదిపుటవఱకుఁ గ్రొత్తపోకడలతోనే యలరారుచున్న వనియు నొకదానిని మఱొకటి యెందును బోల దనియుఁ జెప్ప సాహసింపఁగలవా రెవరు ?

గ్రంథకర్త్రీసమర్పిత నవరత్నమాల తరువాత రాజశేఖర వే... శేషకవుల మనోహరోపోద్ఘాతమును గురువాక్యమును బడితాభిప్రా... ములును బొంద(బడు)టబడి కావ్యప్రాశస్త్యమును జాటుచున్నవి. ... ధానిశిరోమణి కాశీకృష్ణాచార్యులవారీసరస్వతీరామాయణమును గ... ర్చి యిట్లు పలికిరి :—

క. కృతి తెల్గ(ట, శ్రీరాముని
కథయ(ట విషయంబు, దానికవయిత్రి సర
స్వతియ(ట, పద్యములు సహి
ప్రతియ(ట, నీభాగ్య మేమి రామాయణమా !

ఇట్టి మఱికొందఱు పండితప్రకాండులును ఏతద్గ్రంథపఠనసంజ... సంతోషాతిరేకమును మృదుమధురోక్తులచేత నెఱ(గించిరి. లోకము... సామాన్యముగా "అభిప్రాయములు" అని ప్రకటింప(బడినవెల్ల నతిశయో... క్తులయి యుండు నని వచింపవచ్చును. అంతమాత్రమున నెంతవా... గ్రంథవైముఖ్యము చూప(దగ దని నామనవి. "తినకున్నరుచి, దిగకు... లోతు తెలియదు" అను వార్యోక్తి మఱువ(గానిది.

పాఠకులెల్లరు మొల్లముగ నుల్లసిల్ల మొల్ల రచించిన రామా... యణము షట్కాండయుతము, సరస్వతీరామాయణము సప్తకాండసమ... తము, దానికంటె నిది గొప్పదా దీనికంటె నది గొప్పదా ? అని ... ర్చింప(బూనుట కవకాశము గాని యావశ్యకము గాని లేదు. "మైసూ... పాక్ రుచి హెచ్చా బందరులడ్డు రుచిహెచ్చా" అని వ్యర్థముగ వా... లాడుటకంటె లభ్యమైన రెంటిని భుజించి సంతుష్టి నొందుటె మే... గదా ? "చతురకవిత్వతత్త్వరససంపద యొక్కరిసొమ్ము గాదు భారతీదు... గ్ధసాధవార్ధి, కవిరాజులమానసముల్ ఘటంబు, లాయతము కొలంది ల... మగు నయ్యమృతంబు"అని పలికిన కవీశ్వరునియభిప్రాయము సకలస... దయసమ్మత మనుటకు సందియము లేదు.

వాల్మీకిరామాయణములోని ముఖ్యకథాంశములను విడువక, ... నవచోరచనానైపుణ్యము మెఱయ, నీరామాయణము సంతరించి, ... స్వతీదేవి శ్రీమదాంధ్రసరస్వతీదేవి కమూల్యాభరణము( జేకూర్చి...

తత్త్వౌశస్త్య మెట్టిదో తెలుపుటకై స్థాలీపులాకన్యాయముగఁ గొన్నిపద్య
ము లుదాహరింపఁ గడఁగు వాఁడ :—

సీ. చిన్నారిలేనవ్వుఁ జిగురువెన్నెలవెల్లిఁ
దేలించు నెవతె జేజేలపెద్ద
వాల్చూపుఁదూపులు వఱపి యేదేవి య
బ్జాసను మది హాళాహళి యొనర్చుఁ
గంఠనాదము వీణఁ గలిపి మ్రోయించి యే
యమ ధాత వేదపాఠము మరల్చు
వెలిపట్టుచీరయంచులు జాఱఁ దెలిదమ్మిఁ
గొలువుండి వలపించు నలువ నెవతె
అట్టి వాగ్దేవి నావాక్కునందు నిలిచి
పొలుపుమీఱంగఁ బదములఁ బ్రోగుఁజేసి
యర్థసంసిద్ధిఁ జక్కఁగా ననువు పఱచి
శుభము లొనరింప భక్తిమై స్తుతియొనర్తు.

ఉ. మారుతనందనాయ, సురమానితభీమపరాక్రమాయ, సం
సారపరాఙ్ముఖాయ, బహుశాస్త్రవివేకవిచక్షణాయ, గం
భీరగుణాకరాయ, పృథివీతనయాసుఖయోగదాయ, శ్రీ
తారకరామనామ ఘనతత్త్వవిదే భవతే నమోనమః.

కవయిత్రి యట్టిహృద్యములగుపద్యములతో శ్రీహరి కవి దేవతా గురుస్తోత్రము గావించి, నిజభర్తను భక్తితో సంస్మరించి, యథావిధిగ షష్ఠ్యంతములు విరచించి కథాప్రారంభ మొనరించెను. కృతిభర్త శ్రీమహిళాప్రియభర్తయే. కథాంశములు సర్వజనవిదితములే. పూర్వకావ్యములం దున్నట్లే సందర్భానుసారముగ ధర్మబోధ మొనర్పఁబడినది.

నవనాగరకత మూర్తీభవించినట్లు విజృంభించి విఘాతులచట్టమునకై హోరాహోరిగఁ బోరాడు నాంగ్లమానసపుత్రీపుత్త్రులకు అట్టిసనాతనధర్మోపదేశము రుచింపదేమో ? "అందఱనర్క దనియింప మమ్ము సృష్టించిన బ్రహ్మకైనఁ దరమే యిది పెద్దలెఱుంగకుండురే" అను కవీశ్వరో

క్తియే సరస్వతీసతీతిలకమునకును ధైర్యోత్సాహసంధాయకము కా
పోదు. అయోధ్యాకాండమున సీతాలక్ష్మణభరతాదుల రామభక్తివెల్లడి
చు పద్యములు ప్రశంసనీయములు. మచ్చున కీక్రిందివి చాలు:—

మ. క్షణమాత్రంబును ఛాయ వీడనిగతిన్ సర్వంబు నీవంచు నే
మ సారంగను నీదుపాదయుగముల్ మన్నించి సేవించుచున్
జననంబాదిగ నిన్నువీడి యెఱుఁగన్ సాకేతరాజాగ్రణీ!
వినుమా! నీవెనువెంట వచ్చెద భవద్విశ్వాసపాత్రుండనై.

ఉ. రక్కసికైక నాకొఱకు రాజ్యముఁ గోరి, జగంబునవ్వ నన్
దక్కువచేసె; నీకుఁ దగు ధారుణి నే భరియింపనేర్తునే
నిక్కము నీవులేని పురి నేఁ జనియెట్టులఁ జూడనేర్తు నే
నక్కట! కైకకుం గొడుకనై జనియించితి నెంతపాపినో!

అరణ్యకాండమున సీతారామవనవిహారాదివిశేషములు శకుం
దంపతుల యన్యోన్యానురాగాదివైచిత్ర్యములు వర్ణింపఁబడిన విధము
రమణీయములై తనరుచున్నవి. మచ్చున కీపద్యరత్నము గనుఁడు:—

చ. వెలఁదిరో! రాజకీర మదె వేయుఫలంబులఁ ద్రోయుచున్ రుచుల్
గలిగెడు పండొకండు ననుఁగుం జెలికియ్యఁగ సంగ్రహించి, యా
చిలుకమిటారి వ్రక్కలుగఁజేసి నిజేశ్వరునోటి కిచ్చెఁ బ
త్తుఁయనురాగసంపదల సొంపు వచింపఁగఁ దీఱ దేరికిన్.

రావణాపహృత యగునప్పుడు జనకసుత శోకానలసంతప్త
మానస యై రామనామస్మరణపరాయణ యై బాష్పపూరితలోచన యై
యెట్లు విలపించెనో తెలుపునీక్రిందిపద్య మెట్టిహృదయమునైన ద్రవి
పఁజేయదే:—

సీ. పూర్వజన్మంబున బుద్ధివిహీనతఁ
గావించినట్టి దుష్కర్మఫలమొ
కన్నతల్లిగ నన్నుఁ గడుభక్తినెంచు నా
మఱఁదిని దిట్టినమాటఫలమొ
పెద్దలమాటలు పెడచెవినిం బెట్టి
వచ్చిన యామహాపాపఫలమొ

మెట్టిఫల మని చెప్పుదు నిసకులేశ !
పావకర్ముఁడు చెలిఁబట్టె భయములేక
శీఘ్రముగ వచ్చి వాని హింసించి నన్నుఁ
దీసికొని పొమ్ము శౌర్యంబు వాసిమీఱ.

కిష్కింధాకాండము సంగ్రహమైయున్నను సముచితరసభరితమై పరఁగుచున్నది. "నాహం జానామి కేయూరే" అనుశ్లోకములోని భావ మిట్లు విశదీకరింపఁబడినది:—

ఉ. చూపులనీరుగ్రమ్మ ననుజుంగని లక్ష్మణుఁ డన్న ! రత్నసం
దీపితకర్ణభూషలు ననిందితహారము లేనెఱుంగ; నీ
నూపుర మేనెఱుంగుదు ననూనవుభక్తి నమస్కరించుచో
శ్రీపదరాజితంబులయి చెల్వమరున్ ఖిలమయ్యె నేఁ డిటుల్.

పైపద్యములో "అనుజుంగని" అనుట పొరపాటు, శ్రీరాముఁడు లక్ష్మణున కగ్రజుఁడు గాని యనుజుఁడు గాఁడు.

తే. ఎంత గొప్పకవితనైన నేదొ దోష
మగపడునుగానఁ గృతి దూష్య మనఁగఁ దగునె

అని నేను వేఱొకసందర్భమున వ్రాసితిని. కావున "సుకవులసూక్తులం దు సరసుల్ నెరసుల్ వెదకంగఁబోరు" అని నుడివిన కనుపర్తి అబ్బయామాత్యకవీంద్రునితో పాటు నేనును విశ్వసించుచున్నాఁడ.

ఈసరస్వతీరామాయణమున కెల్ల సుందరకాండము నాయకమణియై భాసిల్లుచున్నది. దానిశైలి తెలియుటకై—

"చూడకు కన్నులం దెఱచి చుట్టు వసించెడి దైత్యకాంతలన్, జూడదు"
"నల్లనిమేనివాఁడు, చిఱునవ్వులు చిల్కెడుమోముతోడ శోభిల్లెడువాఁడు,"

అనుపద్యములఁ జూడనగును.

యుద్ధకాండమునందును క్రిందిపద్యమువంటి వెన్నియో గలవు.

సీ. ప్రాజ్యలంకారాజ్యవార్ధిమంథరము శ్రీ
రామకోదండంబు రాక్షసేంద్ర
దివిజారిమదతమస్సవితృబింబంబు శ్రీ
రామకోదండంబు రాక్షసేంద్ర

అసురాంగనావైభవాంబుదాశుగము శ్రీ
రామకోదండంబు రాక్షసేంద్ర
దశశిరఃకాలాహితార్క్ష్యమాత్రంబు శ్రీ
రామకోదండంబు రాక్షసేంద్ర
ప్రలయసమయసముద్భూతభాసమాన
వాయుసఖసమరఘురామబాణములకుఁ
దప్పి ప్రాణంబు లింక నిల్పఁదరమె నీకుఁ ?
గనవె ఖరదూషణాదులగతులు మున్న.

ఉత్తరకాండముగూడఁ గొంతవిపులముగనే వ్రాయఁబడెననవచ్చు. కంకంటి పాపరాజకృతోత్తరరామాయణమాధుర్య మిట్టి దట్టి దనియొ వారు వర్ణింపఁజాలనట్టి దని నాగట్టి నమ్మకము. ముఖ్యముగా నందలి సీతాలక్ష్మణసంభాషణఘట్టము కరుణరసపూరితమై నిరుపమశైలి నలరారుచుండు. ఈరామాయణములోని ఉత్తరకాండపద్యములు పెక్కులు పాపరాజకవిధోరణిలో నొప్పుచు హృద్యములై యున్నవి, మచ్చున కీరెండుపద్యరత్నములను గనుఁడు:—

గీ. తల్లి ! సాధ్వీమతల్లి ! నీధవునిఁ బాపి
యడవివాల్సేయ వచ్చిన యధమజనుఁడఁ
గఠినచిత్తుఁడ నేనెట్టి కార్యమైనఁ
జేయఁగలనంచు నెంచియే చెప్పనేమొ !

క. తెల్లనివన్నియుఁ బాలని
నల్లనివియుఁ నీరమనుచు నమ్మెడి మాయీ
తల్లి వెతఁదీర్చి నానుడి
కల్లగఁ జేయకయ ప్రోవఁగదె భూదేవీ !

ఈసరస్వతీరామాయణమును గూర్చి యెంతేని వ్రాయఁదగియున్నను, వ్యాసవిస్తరభీతిచే నింక విరమింపవలసినవాఁడ నైతి. ఉభయభాషాప్రావీణ్యము గడించి, రసవత్తరకవిత్వము చెప్ప నేర్చి, పాతివ్రత్యాదిగుణరత్నములచే మించి, వినిర్మలశోభనము గాంచి యాంధ్రమాత కనుంగుబి

యనిపించుకొన్న సరస్వతీదేవి ధన్యురాలు- ఈకవయిత్రి యింతకుముందు సరస్వతీశతకాత్మోపదేశాది గ్రంథరాజములు రచించెనఁట. అనవద్యమగు విద్య- విద్యకుఁ దగినకవిత- కవితకుఁ దగిన గ్రంథరచన- అన్నిటిని మించినగుణసంపద ! పురాకృతసుకృతపరిపాకవిశేషము చేఁ గాక యట్టి భాగ్య మెవరు పొందఁగలరు ? ఈమెను గన్నతల్లిదండ్రుల పుణ్యవిశేష మగ్గించుచు,అర్ధాంగిగాఁ జేసికొన్న పురుషవరేణ్యు నభినందించుచు,విద్యావతి నొనర్చిన గురుపుంగవు సన్నుతించుచు, నిట్టివిదుషీమణులకు సర్వ విధములఁ బ్రోత్సాహము గలిగింపుఁ డని సకలాంధ్రజనమునకు విన్నవించుచు, నీసరస్వతీదేవి సమస్తసౌభాగ్యములతోఁ జిరకాలము వర్ధిల్లునట్లనుగ్రహింపుమతండ్రీ యని శ్రీరామచంద్రమూర్తినిఁ బ్రార్థించుచున్నాఁడ.

సీ. భోజరాజును బ్రోసిరాజను లోకబాం
  ధవుకృపామహిమ నుద్భవముఁ జెంది
పండితమండలీమండనం బైనరా
  మయ్యచే నక్షరాభ్యాస మొంది
వాణీకటాక్షసంప్రాప్తులై క్రాలు స
  త్కవులచే విద్యాధికతను జెంది
వాఙ్మయోద్ధారణబద్ధకంకణు లైన
  ఘనులచే దివ్యభూషణము లొంది
ఇరువదైదేండ్లప్రాయాన నెసఁగుచున్న
ఆంధ్రపరిషద్రమణి వృద్ధుఁడైన జయపు
రేంద్రుసైతము తా వలపించె నౌర !
యెవరి ధన్యత హెచ్చొప్ప వచింపఁ దరమె ?

చ. ప్రవిమలకీర్తిసంపద విరాజిలు నీపరిషత్తు కాంచనో
త్సవమును గూడ మేము కనఁజాలెడునట్టు లనుగ్రహింపవే
కవిబుధగాయకార్థిజనకల్పమహీజము లైన సూర్యభూ
ధవునకు విక్రమేంద్రునకుఁ దద్దయు భద్రము లెప్డు నీయవే
భువి జనులెల్లరున్ సుకముఁబొందఁగఁజేయవె లోకరక్షకా ?

---

# ఆంధ్రవాఙ్మయము—కరుణరసము.

—సాగి వేంకటనరసింహముగారు, ఎం. ఏ., రాజమహేంద్రవరము.

---

ఆంధ్రవాఙ్మయమునందలి కరుణరసపు పట్టులను బేర్కొని వాని సవిమర్శముగాఁ దిలకించి, వాఙ్మయసక్రమాభివృద్ధి కనువగు మార్గము ను సూచించుటయే యీవ్యాసముయొక్క ప్రధానోద్దేశము. ఇందుకు ముందుగాఁ గరుణరసమును గూర్చిన సంస్కృతాలంకారికుల యభిప్రాయ ములును సంస్కృతకావ్యనాటకాదులయం దున్న కరుణరసలక్ష్యములు దెలిసికొనుట యావశ్యకము.

"ఇష్టనాశా దనిష్టాప్తేః కరుణాఖ్యో రసోభవేత్" (సాహిత్యదర్పణము)

"ఇష్టజనవియోగాదినాత్మని దుఃఖాతిభూమిః శోకః

'ఆదిగ్రహణా దనిష్టప్రాప్తి ర్గృహ్యతే' వ్యాఖ్య-(ప్రతాపరుద్రీయము)

"కరుణస్య బంధునాశాదయః ఆలంబనాని, తత్సంబంధి గృహోప కరణాభరణదర్శనాదయః తత్కథాశ్రవణాదయశ్చ ఉద్దీపకాః, గాత్రక్షేప అశ్రుపాతాదయోఽనుభావాః, గ్లాని క్షయ మోహ విషాద చింతా ఔత్సుక్య దీనతా జడతాదయో వ్యభిచారిణశ్చ" (రసగంగాధరము)

నవరసములలో మూఁడవదగు కరుణరసము, ఇష్టనాశమువలనను అనిష్టాప్తివలనను సంభవించును. దీనికి స్థాయిభావము శోకము. బంధు నాశ ప్రభృతు లాలంబనము. నష్టసంబంధి గృహాతురగాభరణదర్శనాదు లుద్దీపకములు. గాత్రక్షేప అశ్రుపాతాదు లనుభావములు. గ్లాని, క్షయ, మోహము, విషాదము, చింత, ఔత్సుక్యము, దీనత, జడత మొదలగు నవి వ్యభిచారీభావములు. కరుణ రౌద్రకర్మవలన జనించును. హాస్యము దీనికి విరోధి. దశమన్మథావస్థలలో చివరదగు మరణము కరుణకు హేతు వగును. పునఃప్రాప్త్యాశ లేని కరుణమును గేవలకరుణ మందురు. రఘువం శమునందు భార్యామరణమునకై యజమహారాజు విలపించుట యిందుకు ఉదాహరణముగా గ్రహింపవచ్చును. ఇష్టుఁడు మరణించినను మరల

దుకఁగలఁ డనియు నెప్పటికో సమావేశము కలుగఁగల దనియు విశ్వాస మున్నచోటఁ గరుణవిప్రలంభము రస మని యందురు. ఇట్టిస్థితికి కాదంబరిలోని మహాశ్వేతవృత్తాంత ముదాహరణము; మఱియు, కుమారసంభవములోని రతీవిలాపముగూడ నీతెగకుఁ జేరిన దగును. ఇఁకఁ బ్రాప్త్యాశ యున్నట్లు నిశ్చయముగఁ దెలిసినచోటుల వియోగమునందు రసము విప్రలంభశృంగారమే గాని కరుణము గాదు. మేఘసందేశమునందలి యక్షదంపతులస్థితి యిట్టిది. కావ్యప్రబంధాదులయందలి వియోగములు ప్రాయికముగా నిట్టివే యగుచున్నవి.

ఇఁకఁ గావ్యనాటకాదులయందుఁ బ్రదర్శితమై సహృదయులచే ననుభవింపఁబడు దుఃఖము లౌకికదుఃఖమువంటిది కా దనియు, నది కేవలానందస్వరూప మగుటయు నందువలననే ప్రేక్షకులు తఱచు దానినభిలషించుచుందు రనియు సంస్కృతాలంకారికులు రుజువుచేసి యున్నారు. హరిశ్చంద్రాది పాత్రల స్థితిలోఁ బ్రేక్షకులు తాదాత్మ్యముఁ జెంది విగళితవేద్యాంతరత్వమువలన యనిర్వచనీయసుఖము ననుభవించుట లోకప్రసిద్ధమేగదా !

ఇట్టికరుణరసము కావ్యములయం దంగముగా నుండవలయునే గాని యంగిగా నుండరా దనునియమము గలదు. నాటకములలో శృంగారవీరములలో నన్యతరము మాత్రము అంగి కావలయు ననియుఁ దదితరములు కారా దని చెప్పుటవలన నిట కరుణయు నిషిద్ధములలోఁబడినది. ఇట్లు కరుణ నిషిద్ధమై యంగిగా సంస్కృతవాఙ్మయమున నెచ్చటను తద్ప్రాయమునఁ గానరాకున్నది. అంగముగా మాత్రము పెక్కుచోట్ల మన కది గోచరించుచున్నది. కరుణరసపూరితమైన యుత్తరరామచరితము వీరరసప్రధాన మైన దని సంస్కృతపండితులు సాధింపఁజూచుట పరిచిత మైన విషయమే. మోక్షమను మంగళము ప్రధానాశయముగాఁ బ్రవర్తించు హైందవజాతి పతంజలి నుడివినట్లు-

'మంగళాదీని మంగళమధ్యాని మంగళాంతాని కావ్యాని ప్రథంతే'

అను వాక్యమును ఒరవడిగాఁ బెట్టికొని సర్వత్ర సంచరింతు రనుట యతిశయోక్తి గాదు. సాధ్యమైనంతవఱకు దుఃఖమును నిషేధిం

పవలయు ననియు 'ధర్మమేవ జయతి' యని నిరూపింపవలయు ననియు గర్మసిద్ధాంతమును బ్రతిపాదింపవలయు ననియుఁ బొటుపడు భారతీయు సంస్కృతాలంకారికుల శాసనమునకు విరుద్ధముగా నెట్లు నడువఁగల

మనపూర్వులు నాటకములలోఁ గరుణరసమునకుఁ బ్రాధా మును నిరాకరించుటకు మఱియొకకారణము గలదు. కరుణరసము నాటకావయవములతో సమన్వయము పొసఁగదు. "యత్నము శోక నకా? ఫలప్రాప్తి దుఃఖమా? ఏమి బాగుగ నున్నది?" అను నిట్టి ఖ్యానముల కవకాశము గలుగును. ఈవిధముగా నాలంకారికులయభి యములను జూచినను సంస్కృతాంధ్ర కావ్యములను బరిశీలించినను గ ణరసమునకుఁ బ్రాధాన్య మెచ్చటను గోచరించుటలేదు.

కరుణ ప్రాప్త్యాశ లేనివియోగమువలనఁ బుట్టినదిగదా. అట్టికరు ప్రియాప్రియుల యెడఁబాటు వలన మాత్రమే కలుగ నక్కఱలేదు. బంధుమిత్రులైన మరణించినచో దుఃఖము తప్పక కలుగును. మానవజీ తము ప్రారంభమునుండి తుదివఱకును గరుణరసపూరితముగనే యున్న మానవులలో దుఃఖవిమగ్నులసంఖ్య సుఖభోగులసంఖ్యకంటె విస్తార గ నున్నది. సుఖభోగులును, అనుభవించు సుఖములకంటె దుఃఖముల యెక్కువగ ననుభవింతురు. మఱియు సుఖభోగ మెంత యనుభవించి మనస్సున నాటదు. ఆసమయమున కాలము క్షణముగఁ గడచిపోవు కాని దుఃఖము కొంచెమైనను గాఢముగ నాటుకొని యనంతముగ కా మును దీర్ఘము చేయుచు మఱవరాని దగును. కాఁబట్టి మనజీవితము ను, జీవితావస్థ కనుకృతి యగు నాట్యములోను మిగిలినరసము లన్ని కంటెఁ గరుణకే యెక్కు డవకాశము గలదు. ఆంగ్లనాటకములను జ చుచున్న నవీనులయం దీపైఁజెప్పిన యభిప్రాయము ప్రబలముగ నున్న

ఇఁక సాధారణరీతిని లోకమునందు దుఃఖమునకుఁ గారణము విచారింతము. దుష్టుల క్రౌర్యమువలన సజ్జనుల కాపదలు ఘటిల్లు దుష్టులు స్వార్థపరులై వేఱుకారణము లేకయే శత్రుభావమును బూ ట లోకప్రసిద్ధమే. రావణాదు లిందులకుఁ దార్కాణము. ఆంగ్లనాటక

గు 'ఒథెల్లో' లోని 'అయాగో' గూడ నిట్టిపాత్రమే. ఒథెల్లో అతని భార్య 'డెస్డెమోనా' వీరిరువురును సుఖులై యుండుటను 'అయాగో' సహింపలేఁ డయ్యెను. అతనిద్వేషమునకుఁ దగినకారణములే లేవు. కారణాన్వేషణమున నతఁడు కొంతకాలము గడపి తుదకుఁ గారణమున్నను లేకున్నను వారిరువురి నెడఁబాపి యుభయులమరణమునకుఁ గారకుఁ డయ్యెను. విశుద్ధచరిత్ర యగు డెస్డెమోనాకు కళంకము నాపాదించి యాకళంకమును కృత్రిమముగా ఋజువుచేయుటచే నాతఁ డింతపని నెఱవేర్చుకొనఁ గలిగెను. ఇతని క్రౌర్యము పులివలెను పామువలెను సహజమని విమర్శకులు నుడివియున్నారు. కరుణకు మఱియొక కారణము సజ్జనులలోపము. అతిదయ, అత్యౌదార్యము, తొందరపాటు, అతివిశ్వాసము, అలసత మొదలగునవి దుర్గుణములు కాకపోయినను, అపాయహేతువులై, ఒక్కొక్కమాఱు నాయకునిప్రాణములఁ దీయును. ఈలోపముల నాధారము చేసికొని దుష్టులు తమ తంత్రములను నెఱవేర్చుకొందురు. కైకపై నతిమోహముగల దశరథుఁడు ముందాలోచింపక వరములిచ్చి యావరములను నెఱవేర్చుటలోఁ జిక్కులఁబడిమరణించెను. ద్యూతవ్యసనమునఁ జిక్కి నలుఁడు రాజ్యముఁ బాసెను. ఇట్లే షేక్స్పియరు సృష్టించిన 'లియరు' గూడ దుఃఖనిమగ్నుఁడై మరణించెను. పూర్వోక్తములుగాక కేవల దైవికకారణములవలనఁ గూడ దుఃఖము గలుగును. తుపానులు, జలప్రళయములు, క్షామములు, భూకంపములు, పిడుగుపాటులు మొదలగునవి సంఘమరణములను వ్యక్తిమరణములను ఘటించును. ఇది ప్రారబ్ధకర్మ మనక మఱేమనఁగలము. యుద్ధములవలనఁ గొందఱు చత్తురు; అంటువ్యాధులు కొందఱఁ గబళించును. ఇట్టివి మరణములకుఁ గారణములై బంధుమిత్రాదుల నఖండదుఃఖమున ముంచివేయును. ఇందుండికరుణపూరితగాథలు రచింపఁ గావలసినంత విషయములభించును. పైఁ జెప్పినవిషయము లన్నియు లోకమునందలి దుఃఖపుపట్టులు. వాని ననుభవించువారు లౌకికరసానుభూతి నందుదురు. ఇట్టి లౌకికరసానుభూతి యనుభవితలకే గాని సహృదయు లగుప్రేక్షకుల కెంతమాత్రము లభింప

దు. నాట్యములో నన్ననో తదనుభవము తద్రసప్రదర్శనము చేయ
టుల కుండదు. సహృదయులగు ప్రేక్షకులకుమాత్రమే యట్టిరసాను
ము గలుగును. అలౌకికరసము కరుణ మైనను రసత్వసంజ్ఞను
యానందమునే యొసంగును. కరుణరసభూయిష్ఠము లగు గ్రంథములు
నాటకములును బఠితలకును ప్రేక్షకులకును లౌకికదుఃఖమును గలిగి
నేని వా రీకనెన్నడు నట్టిగ్రంథములఁ బఠింపరు. అట్టినాటకములు
జూడరు. అట్టిగ్రంథములను నాటకములను బలుసారు లనుభవింపవల
ననునిచ్ఛ శోకమున సహృదయులలో మనము చూచుచున్నారము
కావున నట్టివి యానందప్రదము లనియు దుఃఖదములు కావనియు ని
శ్చిత మైనది.

ఇఁక మానవహృదయముపై కరుణప్రభావమును గూర్చి కొం
ము విచారింతము. శోకము హృదయము నుద్రేకింపఁజేయుటలో నగ్ర
నము వహించును. శోకఫలముగ, బెక్కురు భక్తులైరి. పలువురు కవులై
అసంఖ్యాకులు దుర్జనులు సజ్జనులైరి. భావపరిణామమునకును ఉత్కృ
భావావిర్భావమునకుఁ జాలినంత యుద్రేకమును గరుణ కలిగింపఁగల
మనము వాల్మీకిచరిత్రము ననుసరించి గ్రహింపఁగలము. ఆదికావ్య
రామాయణ మాదికవియగు వాల్మీకిచే రచింపఁబడుటకు బీజ మిది
క్రౌంచద్వంద్వము రాగాతిరేకమున సుఖించుచుండఁగా నం దొకదా
నిషాదుఁడు సంహరించెను. ఆదృశ్యమును జూచి వాల్మీకి శోకపూరి
దయుఁ డయ్యెను. అతనిహృదయమునుండి బయలుదేఱిన శోకము శ్లో
రూపమునంది తదనంతరరామాయణరచనమునకు బీజప్రాయమైనది.
చ్ఛిన్నభక్తి నభిలషించు భక్తులు నిరంతరము దుఃఖమునే కోరుచుం
రామాయణమునందువలెఁ గాకపోయినను భారతమునందుఁ గూడ దుః
పూరితగాథలు పెక్కులు గలవు. ఈరామాయణభారతము లాంధ్రీక
ము లై మనవాఙ్మయమునఁ గరుణాబీజారోప మొనర్చినవి. భవభూ
సప్తమకాండగాథను సంస్కృతనాటకరూపమునను, కంకంటి పాపరా
ఆంధ్రకావ్యరూపమునను వెలయించి వన్నెకెక్కిరి. భారతమున

పర్వమునందలి శోకము సుప్రసిద్ధము. సంస్కృతకావ్యములలో రఘువంశములోని యజవిలాపము, కుమారసంభవమునందలి రతివిలాపము, కాదంబరియందలి పుండరీకమరణము తెలుఁగుకావ్యములలో బసవపురాణమునందలి భక్తులకథలు పల్నాటివీరచరిత్రము మొద లగునవి, శోకమును గలిగించి తన్మయత్వమును బ్రసాదించు ననుటలో నెంతమాత్రమును సందియము లేదు.

నాటకము గాని కావ్యము గాని దుఃఖాంతము కావచ్చునా? కారాదా? అనుచర్చ నిచ్చట విచారింపవలసిన యావశ్యక మున్నది. సుఖాంతముగనే యుండవలయు నని వాదించువారు కొన్ని కారణములను జెప్పుదురు. ఈపక్షము ప్రాచీనభారతీయపక్షము. దుఃఖాంతముగ నుండ వచ్చుననుటయే గాక దుఃఖాంతములయం దెక్కువ స్వారస్య మున్నదని నవీనులు పాశ్చాత్యనాటకసంప్రదాయాభిమానులు వాదింతురు. ఇందొక్కొక్క పక్షమును గ్రహించి వారికారణములను సంగ్రహింతురు.

"మంగళాదీని మంగళమధ్యాని మంగళాంతాని కావ్యాని ప్రథంతే" అని మహాభాష్యకారుఁడు నుడువుట తత్పూర్వసంప్రదాయమును స్ఫురింపఁజేయుచున్నది. తదనంతరము సంస్కృతకవులును దాని వెనుక నాంధ్రకవులును పూర్వాలశాసనముల ననుసరించి కావ్యములను మంగళాంతములనుగ నొనర్చిరి. మనస్సున కానందమునే గాని దుఃఖమును గలిగింపఁగూడ దనియు దుఃఖము తాత్కాలికముగ వచ్చినను సుఖప్రాప్త్యాశ యున్నయెడల నంతబాధ యుండ దనియు వీరియభిప్రాయము. మఱియు లోకసహజముగ సజ్జనులు దుఃఖాంతజీవనులైనచో తదనుగుణముగ దుష్టులు జయించినచోఁ బ్రజకు సత్ప్రవర్తనమునందు నిరుత్సాహము గలుగు ననియు దుష్ప్రవర్తనమునకుఁ బ్రోత్సాహము గలుగు ననియు వారు వాదింతురు. 'ధర్మయేవ జయతి' అనుదాని స్థాపించుటకు వారు దుఃఖాంతములను బూర్ణముగ నిషేధించిరి.

సంస్కృతశాసనములను నిషేధించుటలో బద్ధకంకణులైన బౌద్ధులును శైవులుఁను ముఖ్యముగా పైవాదములను తిరస్కరించి విషాదాం

తగాథలను రచించిరి. లోకమునకై ప్రాణమును ద్యజించినవారును భక్తి
సర్వమును ద్యజించినవారును వారి కాదర్శపురుషులు. అట్టివారల గా
లు విషాదాంతములు గాకుండునా? ఆంగ్లనాటకములందును ప్రాచీన
కునాటకములందును విషాదాంతనాటకము లగ్రస్థానము నలంకరించి
అవస్థానుకృతి నాట్యముగదా, లోకసహజ మగుదుఃఖావస్థ నేల ప్రద
పరాదు? అని వారు ప్రశ్నింతురు. సుఖముకంటె దుఃఖమునకే హృ
యక్షాళనసామర్థ్యము విశేషముగఁ గల దని వారివిశ్వాసము. ఈ
యభిప్రాయములను, ఆంధ్రపండితులుగూడఁ గొంద ఱంగీకరించి యున్నా
రు. ఒకవ్యక్తియందలి భావసంఘర్షణము, పెక్కురువ్యక్తులలోఁ బరస్పరసం
ఘర్షణము, దురదృష్టసంఘటనములు లభించినప్పుడు విషాదాంతవృత్త
లు జరుగును. మానవహృదయతంత్రులను మ్రోగించుట కీవృత్తాంతము
కున్న ప్రభావ మితరములకు లేదు. 'కన్నీరుకథ' పీఠికలో బ్ర॥ వజ్ఝల చి
సీతారామశాస్త్రిగారీక్రిందివిధముగా నుడివిరి.

"దుఃఖపర్యవసాయి కావ్యము లుత్కృష్టతరము లన్నవిషయము
పాశ్చాత్యమహాకవులకే గాక ప్రాచ్యమహాకవులకు సహితము సమ్మ
మనుటకు భారతరామాయణాదిమహాగ్రంథముల సందర్భమె ప్రబల
ర్శన మనవచ్చును. కరుణరసముమూలమున నుత్తమనీతులను సభ్యు
మనముల నెలకొల్పుటలో దుఃఖపర్యవసాయికావ్యముల కున్నశక్తి సు
పర్యవసాయికావ్యములకు లేదనుట సాహసోక్తి కానేరదు"

ఆంధ్రమునందుఁ బ్రథమవిషాదాంతనాటకమును వ్రాసిన శ్రీబళ్లా
ధర్మవరము కృష్ణమాచార్యులవారు తమవిషాదసారంగధరపీఠికలో విషా
దాంతకథల యాటితిని గూర్చి సర్వాంకషముగఁ బ్రసంగించియున్నా
"దుర్నీతిని బ్రకటింపవచ్చునా?" అనునంశముపై వారియభిప్రాయ మి

"దుర్నీతి నించుకైనఁ బ్రకటింపకున్న నీతికిఁ గాంతి గలుగదు
రావణుని దుర్నీతి లేకున్న శ్రీరామునకుఁ గీర్తి గలుగునా? దుర్యోధను
దుర్నీతి లేకున్నఁ బాండవుల కంతటిఖ్యాతి గలిగియుండునా? కావ్య
నీతి కుదుర్పవలెనన్న దుర్నీతి నించుక ప్రకటించియే తీరవలె నని

విషయవిజ్ఞాపనము. రుచిభేదములు నభిప్రాయభేదములు నున్న నుండుఁ గాక, విశ్వామిత్రునకుఁ గ్రోధమే లేక యతఁడు వసిష్ఠునితోఁ గయ్యమా డకుండెనా హరిశ్చంద్రుని సత్యవాక్పరిపాలనమును బరీక్షించు టెట్లు?"

'సత్పురుషులకు దుఃఖము వచ్చునా ?'

సత్పురుషుల కెందుఁగాని ప్రాయికముగా బాధలు వచ్చుటయే కనుచున్నాము. అదిగాక లోకమున జరుగువిషయములలో నెన్నియో పొరపాటులు గలవుగదా ! సద్గుణములు గలవారల కెందఱకో దుఃఖము కలుగుట చూడమా ! వాని కన్నిటికిని గారణము చెప్పుట సాధ్యమా?" విషాదాంతగాథల యౌచిత్యమును గూర్చి విశేషముగ నెఱుఁగఁ గోరువారు 'బ్రాడ్లీ' మొదలగు నాంగ్లవిమర్శకాగ్రేసరుల గ్రంథముల నుండి గ్రహింపనగును.

కరుణ ప్రధానములైన గ్రంథములు లేకున్నను కరుణరసపుపట్టులు గల గ్రంథము లాంధ్రవాఙ్మయమునఁ దక్కువగా లేవు. ముందు, ప్రాచీనగ్రంథములలోఁ జూచెదము. శివపురాణములలో నిమ్మవ్వకథ, సిరియాలునికథ మొదలగునవి శోకముతో హృదయమును నింపివేయును. పాల్కురికి సోమనాథుని బసవపురాణము, పిడుపర్తి సోమనాథుని చెన్నబసవపురాణము నిందుల కుదాహరణములు. ఇఁక భారతమునందలి మహాయుద్ధముచే మృతవీరులకు సంబంధించిన మాతృదారాస్వసృదుహిత్రాదులదుఃఖము స్త్రీపర్వములో వెల్లివిరియుచున్నది. శల్యపర్వములోని దుర్యోధనుని దుఃస్థితికి కంటఁ దడిపెట్టనివా రుండరు.

క. మదమడఁగి యొక్కరుండును
గదచేకొని రాజరాజు కాల్నడ నేటఁబో
మదిఁదలఁచి తొలఁగె నాహా యీ
పద లిట్టివి గలవె మనుజపతులకు నెందున్.

సీ. ఏకాదశాక్షౌహిణీశుఁడై పెంపునఁ
బొంపిరిపోవు నప్పుడమిఱేఁడు
వెనుక నొక్కరుఁడును జనలేక యేకాకి యైపోయె... శోక...తప్త చిత్తుఁ
డయ్యె దైవ మెవ్వారి నెట్లుచేయుఁ జాల జెప్పఁగలదు".

ఇందు దుర్యోధనుని దుఃస్థితి చక్కగ వర్ణితమైనది. ఇట్లే ధృతరాష్ట్రుఁ డాశ్ర
మవాసమున కరుగుకాలమున హస్తినాపుర మంతయు శోకపూరితమై
యుండెను.

"కుంతిమొదలైన కౌరవ, కాంతాజనులెల్ల నెవ్వగలఁ బొగులుచుఁ
స్వాంతంబుల బాష్పసలిల, సంతానము లురులఁ దోన చనుదేరంగా;

అజ్జనపతి చనుచుండె—
పాండవాగ్రజుఁ డక్కురుభర్తవలను
శోకలీనుఁడై తప్పక చూచియేడ్చి
హామహారాజముఖ్య యెందరిగె దనుచు
నోడలు గంపింపఁ జదికిలఁబడియె నధిప.
నరుఁ డనునయించె వెస న
న్నరపతి నెత్తుచును దాను ననయము వనటం
బురపురఁబొక్కెం గురుభూ
వర యద్దెస తెలుఁగు రాచ వారువ్వంగా.

రామాయణము నందలి సీతాపరిత్యాగఘట్టము రాతిగుండెగల
వారినైనను గరఁగింపకుండునా? ఆంధ్రమున కంకంటి పాపరాజు చేసిన
ది మిక్కిలిమెఱుఁగునందినది. చూడుఁడు పరిత్యక్తయగుసీత వాక్యములు:-

కటకట లక్ష్మణా పిడుగుకంటెను బెట్టిదమైన మాట నేఁ
డిటు విని యూడియూ బగుల దింతలు నింతలు గాను గుండె యె
ప్పటివలె నున్న దీకటికభావముతో నసువుల్ భరించి యి
య్యటవిని యింక నేవలన నాపద లొందఁగ నున్నదాననో!
నాదు మే
నున్నది చెంత గంగమడుగున్నది యైనటులయ్యెడుం దుదిన్.

సీత భూగర్భమునఁ బ్రవేశించు ఘట్టముగూడ నిట్టిదే.

శ్రీమద్భాగవతమున కావ్యదృష్టికంటె వేదాంతదృష్టి విస్తారము
అందుఁ జచ్చినవారికై గాని బ్రదికియున్నవారికై గాని యెవ్వరును విలపిం
చ టనుట దృఢముగా బోధింపఁబడుచున్నది. అయినను గరుణారసమ

రితఘట్టములు కేవలము లేకపోలేదు. ఒక్కయుదాహరణము-చిత్రకేతూపాఖ్యానమున బాలకునిమరణమును జూచి-

దాసి—పుడమి నిట్టకనిల్వనుబడి పొక్కుచుఁగను దీనయై
యడఁకు వేమియు లేని వాక్కుల నావురంచు విలాపమాం
దెడరు దోప భృశాతురోన్నతి నేడ్చినన్ విని భీతితో
గడుపు బిట్టవియంగ భూపతికాంత గ్రక్కున నేగుచున్.

ఆ కొడుకుఁజూచి తల్లి యడలఁజొచ్చె-

తండ్రి—బాలుని మీఁదన్
వ్రాలి మోపుత్ర నీవార్త దంభోళియై
కూలఁగా నేయుకీఁగొల్ది నన్నేటికిన్
జాలినొందించె నాజాడ యిఁకెట్టిదో
తూలు మీతల్లికిన్ దుఃఖ మెట్లాఱునో.

ఇఁక స్వతంత్రప్రబంధములసంగతి విచారింతము. ప్రబంధ మన్నఁ బెండ్లితో ముగించుటయే గదా. అందు విప్రలంభశృంగారము విస్తారముగ నుండును. కేవలకరుణ కవకాశమే లేదు. విరహావస్థను వర్ణించుట మితిమీఱి యది విరస మగునే గాని హృదయమును విశేషము చలింపఁజేయదు. మన్మథదూషణము తత్పరివారదూషణము శ్లేషలకాకరము. శ్రీనాథుఁడును ముఖ్యముగా సూరనయు నౌచిత్యమునకై పాటుపడినవా రయ్యుఁ బ్రబంధశృంఖలలను ద్రెంపలేరైరి.

పల్నాటివీరచరిత్ర మాంధ్రవాఙ్మయహారమునఁ దలమానికము వంటిది. అది మహాభారతమువలె వీరరసప్రధానమై తుదకుఁ గరుణరసభూయిష్ఠమగును. ఇందు బ్రహ్మనాయఁడు కృష్ణునివంటివాఁడు; అతనిపక్షము పాండవపక్షమువంటిది. నాయకురాలిపక్షము కౌరవపక్షము, కార్యమపూఁడి కురుక్షేత్రము. రాజ్యమునకై జరిగిన యుద్ధము మహాభారతయుద్ధసదృశ మైనది. బ్రహ్మనాయని కొడుకగు బాలచంద్రుని మరణముకంటె శోకాకర మగుదృశ్యము మఱియొకటి లేదు. యుద్ధమునకు ముందే యనపోతు మరణము శోచ్య మైనది. అనపోతు బ్రాహ్మణయువ

కుఁడు. బాలచంద్రునిసఖుఁడు. అతఁడు, బ్రాహ్మణుఁడుగావున యుద్ధమునకు రావద్దని బాలచంద్రుఁ డానవెట్టెను. ఆయానఁ జూచి యుద్ధము చేయ నోఁచనందుకు అనపోతు దుఃఖించి యాత్మహత్య గావించుకొనెను. రక్తసిక్తమైన యాతనిజందెమును మాడచి యనునామె బాలచంద్రునకుఁ జేర్చెను. దానిని జూచి బాలుఁడు కానున్న సంధి విభగ్నము చేసి యుద్ధమున కుఱికెను. బాలచంద్రుని యుద్ధమును మరణమును రైతులు శోకసమయములయందు పంబరవాండ్రచేఁ బాడించుకొని విందురు. అట్లే బాలుఁడు గతించినను బ్రహ్మనాయని యోర్పును గమనించి తమదుఃఖమునుఁగూడ నట్లే సహించుట నేర్చుకొందురు.

అనపోతుమరణమును గూర్చి తలిదండ్రుల దుఃఖమును మాత్ర ముదాహరించెదను.

"తద్గతిఁ దెల్పిరి తల్లిదండ్రులకు
విని మూర్ఛనొందిరి వేగమె వారు
కొంతసేపటికి ని గొంచెము తెలిసి
కుందుచుఁ జనుదెంచి కొడుకుపై వ్రాలి
బొమ్మ గుద్దికొనుచు బోలుచుఁ బకుచుఁ
దనయుఁడా! మాపుణ్యదశ యిట్టులాయె
మాయ చావయ్యెను మాముద్దుకొడుక
ఇచ్చోట నుండెనా మృత్యువు నీకు"

నాటకము:—ఆంధ్రవాఙ్మయమున సంస్కృతాంగ్లములపట్టిని నాటకరూప మిటీవల జనించినదే. పూర్వకాలమున వీథినాటకములే యుండినవి. అవి విశేషముగఁ గవిపండితాదరమును బొంద లేదు. ఆంధ్రనాటకపితామహులు బళ్లారి ధర్మవరము కృష్ణమాచార్యులవారు కరుణరసప్రధాన మగునాటకములను వ్రాయుటలోఁ గూడ మార్గదర్శకులైరి. వారివిషాదసారంగధర నాటకమును, దత్పీఠికయు నాంధ్రమునఁ గరుణరసమునకు నిధానము లని చెప్పవచ్చును. అప్పటిపండితుల నెదుర్కొనుటకై వారు పీఠికలో గరుణరసమును గూర్చి యంతగా వాదింపవలసివచ్చెను

ఇప్పు డంతగా వాదింప నక్కఱలేదు. విషాదాంతము లైన "చంద్రహాస" (దుష్టబుద్ధి) "షరాబ్" (విజయనగరసామ్రాజ్యపతనము) "బొబ్బిలి," "పూర్ణిమ" "అన్నార్కలీ" వంటి పెక్కునాటకములను జవి యెఱిఁగిన ప్రజలును గవిపండితులును బూర్వమువలె దుఃఖాంతములను గూర్చి యంతగా నేవగించుకొనుట లేదు. మీఁదు మిక్కిలి యానాటకములఁ జూడఁ బరువు లెత్తి వచ్చుచున్నారు. 'సోరాబు రుస్తుములు', తెలుఁగు 'జూలియస్‌సీజర్', 'రాణాప్రతాప్' మొదలగుభాషాంతరీకరణములుగూడఁ గరుణరసప్రాధాన్యవాదమునకు బలము నిచ్చుచున్నవి. ప్రజల మనస్సు లాకర్షించుటయే ప్రధానకార్యముగాఁ గల సినీమాలలో శోకరస పూరిత ఘట్టములకుఁ గొదవ యుండునా ?

నవలలు:—నవలగూడ పాశ్చాత్యదేశములనుండి మనకు లభించినదే గావున నందును గరుణరసప్రధానము లగునవి పెక్కులున్నవి. అపరాధపరిశోధకనవలలు కరుణను గల్గించుఘట్టములు గలవయ్యు భయమును, నద్భుతమును గలిగించుటకే విశేషముగాఁ బాటుపడును.

ఖండకావ్యములు:—భావప్రాధాన్యమునకే పాటుపడు ఖండకావ్యములు పెక్కులు కరుణరసప్రధానముగ నున్నవి నేఁటికాలపు యువకవుల జీవితములు నిరుద్యోగాదిబాధలచే శోకసహితము లగుటచే వారు పెక్కుశోకగీతికలను విషాదగాథలను వ్రాయఁగలుగుచున్నారు. "అనంతపంతుల"వారి సరోజిని (a tale of tears)కి పేరే "కన్నీరుకత" యైనది. రాయప్రోలు సుబ్బారావుగారి కావ్యమొకటి 'కష్టకమల' "అశ్రుతర్పణము" "......విలాపము" వంటిపేరులకుఁ దక్కువలేదు. దువ్వూరి రామిరెడ్డిగారు, దీపాల పిచ్చయ్యశాస్త్రిగారు మొదలగు కవులు కరుణరసము నొప్పింపఁ బ్రయత్నించిరి. ఖండకావ్యములలో ముఖ్యముగా స్మృతికావ్యములు కరుణరసప్రధానములు. 'సతీస్మృతులు' 'సుతస్మృతులు' 'దేశనాయకస్మృతులు' మనకుఁ బెక్కులున్నవి. కాశీవ్యాసాచార్యుల వారి "శ్రీరామనిర్యాణము" చక్కని 'సుతస్మృతి' కావ్యము. వా॥ సు॥ రాయని 'సతీస్మృతి' 'సుతస్మృతి' యనుకావ్యములు ప్రసిద్ధములే. శ్రీ

చెళ్లపిళ్ల వేంకటకవిగారు రచించిన "దివాకరాస్తమయము" శ్రీతిరు కవిని గూర్చినయద్భుత స్మృతికావ్యము. ఇట్టి కావ్యములను జదివి దు నిజముగా మనహృదయము లశ్రుప్రక్షాళితములై పరిశుద్ధము లగు

ముగింపు:—కవిహృదయము నుడికింపఁగలది ప్రేక్షకులను ర్ణముగ నాకర్షింపఁగలదియుఁ గరుణరస మొక్కటియే. ప్రాచీనులు క ప్రధాన మగుకావ్యరచనమును నిషేధించినను "ఏకో రసః కరుణ యనఁగల కవులు లేకపోలేదు. ఆంధ్రవాఙ్మయమునఁ, గరుణ కాకర పట్టులు భారతాదిగ్రంథములయందు విరివిగ నున్నవి. ప్రబంధముల దంతగాఁ గరుణరసము లేకున్నను, ఇటీవలి వారు పాశ్చాత్యసంప్ర యములఁ బురస్కరించుకొని పెక్కునాటకములను, నవలలను, ఖండ వ్యములను గరుణరసప్రధానములనుగఁ జేసియున్నారు. ఇప్పటికిని ర్వాలంకారికులమతమునే యాధారము చేసికొని విషాదాంతముగఁ లను వ్రాయరా దనుట న్యాయము గాదు. నూత్న మన్నంతమాత్ర ను బ్రాచ్యము కా దన్నంతమాత్రమునను గరుణరసప్రధాన గాథ యం మాధుర్యము కొఱవడదు.

"పురాణ మి త్యేవ న సాధు సర్వం
న చాపి సర్వం నవ మి త్యవద్యమ్
సంతః పరీక్ష్యాన్యతర ద్భజంతే
మూఢః పరప్రత్యయనేయబుద్ధిః"

ఇతోఽధికముగఁ గరుణరసప్రధానకావ్యములు బయలు సహృదయుల కానందప్రదము లగుఁగాక !

---

# గ్రంథస్వీకారము.

## (1) వాసవీవిలాసము.

ఇది పదియంకముల నాటకము. విద్వాన్ సోమపల్లె కృష్ణమూర్తికవి గారు రచించినది. కథ శ్రీకన్యకాపరమేశ్వరిని గూర్చినది. ఈకథకుఁ బూర్వపురాణము లనేకము లాధారములు. ఇప్పటికవులును బెక్కుఁడు కావ్యనాటకాదులను రచియించిరి. వైశ్యులకుఁ గులదేవత యగునీదేవి చరిత్రము పెనుగొండ మొదలగుతావులం గలయాలయములచేఁ బ్రసిద్ధమైయున్నది. ఈనాటకములోఁ గవిగారు కథకుమూలము లేనితావులనున్నవో తెలిపిరి. విష్ణువర్ధనుఁ డనురాజెవ్వఁడను విషయము దీనిలోఁ జర్చింపఁబడినది. పలువురు వ్రాసినవిషయములు గొన్నియుక్తులతో ఖండింపఁబడినవి. కాని, యిప్పటి కెవ్వరికిని విష్ణువర్ధనునిస్థితి సరిగాఁ దెలియరాలేదు. కల్పితకథ లొకదానికొకటి యెట్లతుకును. కవిగారి యీనాటకముపైఁ బలువురు పండితు లభిప్రాయముల బాగుగ నిచ్చియున్నారు. కవిగారు "ఇతఃపూర్వప్రకటితములై యుండు గ్రంథములనెల్ల నేతద్రచనమునకై పఠించి యుచితము పరిగ్రహించి యనుచితము పరిత్యజించితి" మని వ్రాసిరి. ఈమాటను బట్టియే యెవ్వరికిఁ దోఁచినది వారి కుచిత మనుకొనుటయేగా నిక్కమిది యని గ్రహించుట కష్టమని స్పష్టమైనది. నాటకములోని భాష పాత్రోచితముగా నున్నది. ఒక్కపద్యము చవిచూపెదము.

చ. గొనములప్రోవు దుష్టజనకుంజరసింహము దీనసంచయా
వనఘనసత్కృపామతి యపారయశఃపరిపాలకుండు పా
వనచరితాత్ముఁడున్ విమలవంశనిధానుఁడు భక్తియుక్తుఁడౌ
తనయునికంటె వైభవవితానము సౌఖ్యము వేఱుకల్గునే. పుట 15.

వెల రు. 1—4—0 కవిగారియొద్ద అనంతపురముజిల్లా కొక్కంటిలో దొరకును.

(2) ఆంధ్రమేఘప్రతిసందేశము- కాళిదాసమహాకవికృత మేఘ సందేశము తరవాయి— సంస్కృతమున మహాశూరపురమహారాజాస్థాన విద్వాంసులు శ్రీమండికల్ రామశాస్త్రిగారు రచించిరి. దానికిది బల్లారిమ్యు నిసిపల్ హైస్కూలులో, ప్రధానాంధ్రోపాధ్యాయులు శ్రీరావాడ వెం కటరామశాస్త్రిగారి తెనుఁగు. మూలము రెండుసర్గలిందు రెండాశ్వాసములై నవి. యక్షుఁడు మేఘునిచే వార్తపంపఁగా దానికి యక్షునిభార్య పంపిన ప్రతివార్తయే యిందలివిషయము. ఇందు యక్షదంపతులనామములు యక్షునియధికారము కుబేరక్రోధశాపాదులును వర్ణింపఁబడినవి. ఇటీవలి శ్రీశంకరరామానుజవ్యాసరాజాదులు, విజయనగరమైసూరురాజులు, ... ద్వ్యర్థీపములు మున్నగువిషయములు వర్ణింపఁబడినవి. ఈతెనుఁగుపుస్తక ముపైఁ బలువురు ప్రసిద్ధపండితులు సదభిప్రాయముల నొసంగిరి. ఒకపద్య ము మచ్చుచూడుఁడు.

చ. కుశలి భవత్ప్రియుం డనుచుఁ గూర్చి ముదంబు సుధాక్షరావళిఁ
విశదముగాఁ బయోద ప్రియుప్రేముడి నింపగువార్త దైవస
ద్వశగతి వీరుల న్నినిచి ప్రాణము నిల్పఁగ వచ్చి తివ్వడీ
దృశమగు నిక్క మస్మ దఘతీవ్రత యించుక తగ్గె నెమ్మదిన్. 1-5

మూలశ్లోకము:—

చిత్త్రోడాఖ్యం జయతి నగరం తైర్నృపైః పాల్యమానం
ఘోరే యుద్ధే వినిహతధవా విశ్రుతా వీరపత్న్యః
క్షుద్రాదిభ్యో నిజకులభయే శంకమానాశ్చ యస్మిన్
పాతివ్రత్యప్రవణమతయో బృంద శోగ్నిం ప్రవిష్టాః.

శాస్త్రిగారియాంధ్రపద్యము.

ఉ. పోఁడిమిరాజపుత్రనృపపుంగవపాలితమై చెలంగు చి
త్త్రోడపురంబునన్ ధవులు తొల్త మృతింగన వీరపత్నులా
చేడెలు క్షుద్రశత్రువులఁ జేడ్పడు శీల మటన్న భీతిచేఁ
గూడి పతివ్రతాత్వమతి గుంపుగఁ జిచ్చునఁజొచ్చిరచ్చటన్. 2-25

వెల రు. 0—10—0 కవిగారియొద్ద దొరకును.

(3) ఈ క్రిందిపుస్తకములు-వ్యాసకుటీరమునుండి వెలువడిన యాంధ్ర సేవా ప్రసూనములు:-

1. రామనామం—చిన్న నాటిక (వ్యావహారిక భాష) రు. ౦-౧-౦.
2. శ్రీవివేకానందస్వామి వారియతిగీతములు—కూచి నరసింహము పంతులుగారిచే నాంధ్రీకృతము. రు. ౦-౧-౦.
3. దివ్యవాణి—(ఒకహరిజనునికథ)కూచినరసింహముపంతులుగారు అమృతబజారుపత్రికలోని యొకయాంగ్లవ్యాసమునకుఁ దెనుఁగు.
4. రామనామం—ఇంగ్లీషు, ముద్దా విశ్వనాథముగారు.
5. ఆనందసామ్రాజ్యము—శ్రీ రామతీర్థస్వామివారి యుపన్యాసమునకుఁ దెనుఁగు. ముద్దా విశ్వనాథముగారు. రు. ౦-౧-౦.
6. సంధ్య—(ఆఱడుగుల నేల) టాల్‌స్టాయి విరచితమునకుఁ దెనుఁగు వచనము. రు. ౦-౬-౦.
7. శుభోదయము—సౌశీల్యనిర్మాణము దక్షమును సౌజన్యోత్తేజకమునగు నిప్పటికాలపుకథ-వచనము. రు. ౦-౩-౦.
8. గ్రిసెల్డా—శ్రీ రామతీర్థస్వామివారి యుపన్యాసమున కాంధ్రము-వచనము, కూచి నరసింహముపంతులుగారు. రు. ౦-౧-౦.
9. ఆత్మజ్యోతి—(మానవసేవయే మాధవసేవ) కౌంటులియోటాల్‌స్టాయ్ వచనము. బడులలోఁ జదువుటకు విద్యాధికారు లామోదించినది. ముద్దా విశ్వనాథముగారిది. శ్రీ జయపురమహారాజావారు సంతోషించినది. రు. ౦-౮-౦.
10. ప్రేమాంజలి—(సుగుణసంపదగల పంచమదంపతులసుందరచరిత్ర) ముద్దా విశ్వనాథముగారి వచనము. రు. ౦-౪-౦.
11. తూలిక—ఇదియును బడులలోఁ జదువుటకు విద్యాధికారు లనుమతించినదియే. ముద్దా విశ్వనాథముగారిది. వెల రు. ౦-౧౦-౦.
12. జన్మభూమి—(కరుణారసభరితమగునాటిక) ఒక చిన్నకథ నాధారముగాఁ జేసికొని స్వదేశవిదేశకవుల భావములు కొన్ని చేర్చి ముద్దావిశ్వనాథముగారు రచించినవచనము. రు. ౧-౪-౦.

ఇవి యన్నియు స్వగృహముననే కూర్చుండి దేశమంతటను విఖ్యా తిని గడింపనున్న ముద్దా విశ్వనాథముగా రనునొక యువకునిచే రచి యింపఁబడినవియుఁ బ్రకటింపఁబడినవియు. చక్కని చెన్నపురియచ్చు చిన్న చిన్నకథలు, హృదయంగమములు. పెద్దలు సంపన్నులు నీయువకుని సద్య త్నమునకుఁగానొక్కొక్కరొక్క "సెట్టు"కొనుటయే గొప్పసాయము. ఆతనిపె ట్టుబడి యాతనికి గిట్టినఁ జాలినంత యాంధ్రసేవ చేయనున్నాఁడు. ఆ ర్వదింతురుగాక !

ఆంధ్రసేవాకార్యాలయము- ముద్దా విశ్వనాథముగారు, మొబు పాళ, ఎలమంచిలితాలూకా, విశాఖపట్టణముజిల్లా, అని వీరివిలాసము.

---

(4) శ్రీమహాభారతనవనీతము:— ఆదిభార- ప్రథమాశ్వాసము. కవి, కీ. శే. ఆకుండి వ్యాసమూర్తిశాస్త్రిగారు. ఇది యాంధ్రీకరణయుగము. అనువాదములుపెక్కులుబయలుదేఱుచున్నవి. వ్యాసప్రోక్తమగుభారతము నాంధ్రమున వ్యాసప్రోక్త మనిపించుటకీ యాంధ్రీకరణ మొనర్పఁబడినయ ది. గ్రంథకర్తలు సుప్రసిద్ధపండితులు. పెక్కుగ్రంథములు రచించిరి. భా తమునఁ బదునాఁడుపర్వములను మాత్ర మాంధ్రీకరించి రఁట. శ్రీకృష్ణ భారతము కంటె నిది మొకటి ప్రయత్నము. వీరి శిష్యులు విద్వా ఓలేటి సీతారామశాస్త్రిగారిచే నీగ్రంథము ప్రకటింపఁబడినది. కాని, వా భయపడినటులు నారికేళపాకమున రచింపఁబడలేదు. మిగిలిన గ్రంథభా గము త్వరలోఁ బ్రకాశిత మగునుగాక !

మ. ఒకనాఁ డాకపికన్య; దైత్యసుత తద్యోషాసఖు ల్క్రీడనో
త్సుకలై వారివిహారముం జలిపి, సేతుస్న్యస్తవాతోద్ధతా
వికచేలమ్ము లెఱుంగ కందినవి సావేగంబుగాఁ గట్ట నో
పిక వీడె న్భృగుకన్య; గాంచి దనుజప్రేష్ఠాత్మజ న్దోషిణిక్.

ఉ. కావుము పుత్త్రసత్యమును; గాపటికత్వము మాను; మించెదు
న్బావికతంబు కూపముల; బావుల నూఱిటి మిాఱు జన్నమో
భూవర ! నూఱుజన్నములఁ బోలు సుతుండు; శతాత్మజాధికం
బౌ విను సత్యమే; సుకృత మన్యము సత్యసమమ్ము నున్నదే.

దీనితో 'నుతజలపూరితంబు లగునూతులు నూటికంటె' నను నన్నయభట్టారకుని పద్యమును బోల్చిచూడుఁడు. 'తద్భారతదుగ్ధవార్ధిఁ గొనెద నవనీతము మెచ్చ భూసురుల్' అనుటచే గ్రంథము శ్రీమహాభారతనవనీత మని పేరుం గాంచినది. ఆదిపర్వ మాదిధార మైనది. పాఠకులు గ్రంథప్రకాశకులకుఁ దగుసహాయ మొసఁగి మిగిలినగ్రంథభాగములను బ్రకటింపింతురుగాక.

---

(5) మేఘసందేశము—(ఆంధ్రీకృతము) శ్రీ మాడభూషి మఠం వేంకటాచార్యులుగారు— తిరుపతి. వెల రు. 0-8-0.

సుప్రసిద్ధసంస్కృతగ్రంథమున కిది మఱియొక భాషాంతరీకరణము. మూలమునందు వీరికిఁ గలయాదరమే దీనికిఁ గారణము. గ్రంథకర్తలు, ఋతుసంహారముఁ గూడ నిది వఱలో నాంధ్రీకరించిరఁట. వీరి యాంధ్రీకరణము పెక్కుస్థలముల మూలమును దలపించుచున్నది. కవిత్వశైలి యొకింత సరళముగ నుండిన బాగుగా నుండును. మహాకవి కాళిదాసుని కవిత యాంధ్రీకరించుట దుర్ఘట మనుట కీమేఘసందేశపు టాంధ్రీకరణములే నిదర్శనము. మచ్చునకొకపద్యము.

సరసంబౌ నడబావి గారుడశిలాసోపానమార్గంబుతోఁ
వరవైడూర్యసమాననాళవికచస్వర్ణాబ్జసంఛన్నమై
యిర వానీటను గాంచి హంసములు నిన్నీక్షించి యున్ మానసం
బరయంబోవు సమీపమయ్యు వగవాయం గాంచి యచ్చేరువన్.

---

(6) స్వప్నానసూయ—ఆకొండి రామమూర్తికవిగారు. వైద్యులు, విద్వచ్ఛిఖామణులు-పీఠికయందు పానుగంటి నరసింహారావుపంతులుగారు గ్రంథప్రకటనకారణమును, ప్రాశస్త్యమును దెల్పియున్నారు. వీరి యద్భుతకవితాగుంఫనము ప్రతిపదరమణీయము, రంజితకమనీయార్థగుణవిశేషము నఁట. వైశ్యశిఖామణు లొకరు తమభార్య సద్గుణాదికమును వర్ణింపఁ గోరఁ గవిగా రీగ్రంథమును రచించిరి. ఆమెపే రనసూయ. స్వప్న

మునఁ గవి యామెను, అత్రిమహామునిభార్య యగు ననసూయా
గాంచి, వారిసంభావణాదికమునే కృతిగా రచించె నఁట. ఇరువుర
మిం దభివర్ణితము.

ఉ. అబ్బురపాటుదోఁచు నయనాంబుజయుగ్మమునుండి పొంగిపై
కుబ్బెకు తళ్కులెల్లెడల నుత్పలమాలికలై చెలంగఁ ద
బ్బిబ్బుగ నట్టునిట్టుగని భీతియు నచ్చెరుపాటు వంతయుం
బ్రబ్బికొనంగ నప్పడుచు పైదలి సంభ్రమసంకులాత్మయై.

ఇది పెద్దనకవనమును స్ఫురింపఁజేయుచున్నది. అనసూయ పా చరిత వర్ణనమున స్త్రీల కుపదేశములు పెక్కు లీయఁబడినవి. ఇందలి నము సులభగ్రాహ్యము. లలిత పదభూయిష్ఠము. మాదిరి కొకటి-

ఉ. వారలరూపసంపదయు వారియమానుషదివ్యతేజమున్
వారలభాగ్యచిహ్నములు వారివినూత్నవిలాసలక్ష్మిఁ గ
న్నారఁగఁ జూచి చూచి కడునబ్బురమందుచు నీసునుంగు లె
వ్వారొకొ యాత్రిమూర్తులయు వైభవముల్ గనుపట్టు వీరికిన్.

---

(7) కవ్వడి కైవారము—తిరుమామిడి రామస్వామిశాస్త్రి ము- బ్రహ్మశ్రీ అనంతపంతుల రామలింగస్వామిగారిచే సంపాదింప ప్రకటింపఁబడినది. కవి పదునెనిమిదవశతాబ్దాంతమున జన్మించినటుల కయుంచుఁ గలదు. కిరాతార్జునీయమునందలి కథ కిది యాంధ్రీకరణ అచ్చతెనుఁగు ప్రబంధము. అయిదుతున్కలు గలవు. దీనిని బ్రకటి ప్రకాశకు లాంధ్రమునకుఁ గొప్పయుపకారము మొనర్చిరి. కవిత్వము రస ము. కాని వ్రాతప్రతినిసవరింపక యున్నదున్నట్లు ముద్రించి భాషకుఁ గొ తేఁ దెచ్చిరి. వలయువారు ప్రకాశకులకు వ్రాయవలయును.

చ. బలుజడి నించి తెల్లనయిబాసి మెరుఁగుల రంగులుర్మి వో
నలవడ క్రిందిమట్టలను నమ్మెఁగులం దెలిరెక్కలూనెనా
మలల మలంగు నేకలు చూటికిద్రోఁవగ నేపుద్రోవలం
గలబలు యొడ్లతమ్మిగమి గ్రమ్మిన నేరులు బారు మీరుచుఁ. (పు

శ్రీ

# ఆంధ్రసాహిత్యపరిషత్పత్రిక.

## కాకినాడ.

రెండు నెలల కొకసారి ప్రకటింపఁబడును.

సంపుటము ౨౩. { ఈశ్వరనామసంవత్సరము. మార్గశిరపుష్యమాసములు. } సంచిక ౫.

## మనవి.

మహాశయులార !

మీ యభిమానమున నిట్లు పరిషత్పత్రిక యవిచ్ఛిన్నముగా నడచుచున్నది. ఎప్పటి యభిమానము నిఁక ముందును గనఁబఱుపఁ వేఁడుచున్నారము. లోకమున భాష యతివ్యాప్తిని గాంచుచున్న సంగతి యొకరి కొకరిపుడు చెప్పనక్కఱలేదు. భాషాభిమానులు పండితులు కవులు పలువురు బైలువెడలి పేర్వెలసి యనేకవిధముల నాంధ్రమును వృద్ధి చేయుచున్నారు, గాని, యీవృద్ధి దృఢతనొందునా? "పొడవెనుఁగుఁబడుటకై" యన్నట్లు గాదుగద! అట్లు శంకించుటకు మాకనేక కారణములు కనఁబడుచున్నవి. కొందఱు కవి యట్లు కనఁబడవు. దృఢత భాషకు వాటిల్లఁ జేయవలయు నన్నఁ బూర్వపద్ధతియే మంచిది. పూర్వపద్ధతి యంధపద్ధతి యని కొంద ఱనుచున్నారు. అది ముందుదృష్టి లేక యనుమాట. ఇప్పటిరచనలే యాంధపరంపరలోని వనిమానమ్మకము. ఒక్క నియమము నొక్కమార్గమును లేనిపద్ధతులను బ్రతిపండితుఁడు నాదరించుట శోచ్యము. వారికిఁ దోఁచు యుక్తులు వారు చెప్పుదురు, గాని భాషకు దార్ఢ్యము కలుగవలయుననినఁ బూర్వపద్ధతియే మంచిది. నవీనపద్ధతి యంత మంచిది గాదు. తేలిక పనులు చేయుట తేలికయగుచున్నగలవారికిష్టము శ్రమపడి

యభ్యసించిన విద్యకును నశ్రమంబుగ సంపాదించిన విద్యకును భేద లేదా ! నియమరహితమున కొక్క మార్గ మని చెప్ప వలను లేదు. ని మసహిత మెన్ని తావులనొక్కవిధమున నేయుండును. సర్వజనవిదితమగ ష కావలయు ననినఁ బూర్వగ్రంథములనే చదువవలయును. ఇప్పుడిప్పు తొల్లింటి గ్రంథములనుఁ జాలమంది యాదరింపకున్నారు. కారణ తొల్లింటివలె గ్రంథములు సులభ సాధ్యములు కాకపోవుట చేతనా సులభసాధ్యములగు గ్రంథములలోఁ దప్పులు మెండుగా నున్నవని వా రెఱుఁగకపోరు. ఎక్కువవెలలు పెట్టి వర్తకులు ధనార్జనము చేయ జూచుట దూరాలోచనము లేకయే. మున్ను ౧ రూపాయకువచ్చు భా వత మిప్పుడు ౭ రూపాయ లైనదన్న మాట వాస్తవమే. తప్పు లున్న సవరించుకొనఁ గలవా రిప్పుడు లేరు కావున శుద్ధప్రతులను బ్రకటించు యవసరమే. ఇట్టి వెన్నియో యోజించి మేము పరిషత్తులోఁ బ్రకటించ గ్రంథముల కన్నిటికిఁ దక్కువమూల్యములను నిర్ణయించి యున్నారము సాధ్యమైనంతవఱకుఁ బరిశుద్ధముగా నుండఁజూచుచున్నారము. ఇట్టి డులాభములుగల మాగ్రంథములు విస్తారవ్యాప్తిలోనికిఁ దెచ్చుటకుఁబరి త్సభ్యులాలోచించి 1938సంవత్సరాది మొదలు బహుధాన్యసంవత్సర త్సరాదివఱకుఁ బ్రతిపుస్తకమును సగమువెలకే యిచ్చుటకుఁదీర్మానించి రు. కావునఁబరిషత్తుమీఁదను నిక్కమైన మాతృభాషమీఁదను నభిమా ముగలవారు మాయుద్యమమునకుఁదోడ్పడుదురుగాకయని కోరుచున్నా రము. దీనికై ముఖ్యమగు నొక పుస్తకములపట్టికను బ్రకటించియున్నా ము. దానిని జిత్తగింపఁ గోరుచున్నారము. చందాదారులును దమమి మిత్రులకీ విషయమును దెలియఁజేసి పరిషత్తునకు సాయపడుదురుగా

---

# విన్నపము.

— జనమంచి వేంకటసుబ్రహ్మణ్యశర్మగారు-కడప. —

---

మహాశయులారా !

ఈశ్వరవత్సరము ఆశ్వయుజకార్తికమాసములలో ౨౩ సంపుటము ౪వ సంచికగాఁ బ్రకటితం బయిన పరిషత్పత్రికలో శ్రీకొత్తపల్లి సూర్యరావుగారు వ్రేత్తలనుగుఱించి పునఃప్రార్థన మను శీర్షికయందు సంశయములని యీక్రింద వివరింపఁబడిన వానిని సూచించియున్నారు. నేను వ్రాయు విషయము నధిక ప్రసంగముగా భావింపక యిదియు నొకవిధమగు నభిప్రాయముగాఁ బరికింతు రనియు, నిందలి సత్యాసత్యములను గూర్చి విజ్ఞులు నిర్ణయింతు రనియుఁ దలంచుచున్నాఁడను.

1. 'తుమికీ బాయిల బాయిరే ములికి యందు ర్మింటికిం బోవుచున్'- ఈపద్య మెల్లవారును నెఱింగినయదియ.

ఇది "ముండా" భాషయుఁ "బుళింద" భాషయుఁగాదు. ఉర్దూభాషయే. తుమికీ-అనునది 'తుముకూ' యని యుండవలయు-'మీకు' అనియర్థము.

'బాయిల బాయిరే' అనునది భాయిరె బాయిరే యని యుండవలయు-ఓసోదరులారా యని భావము. ములికి-అనఁగా-దేశము-రూపాంతరము-మ్లుల్కి-శత్రువులగు యవనులు (మహమ్మదీయులు) చచ్చిస్వర్గమునకుఁ బోవుచు 'ఓసోదరులారా ! ఓసోదరులారా ! మీకుదేశము-(మీకేదేశము)-అని వెఱచి చెప్పుచుండుటఁ గననగు-అచ్చటికిని వెన్నంటుదురేమో యని సంశయించి 'దేశము మీకే సోదరులారా!' యని కేకలను బెట్టుచు వెళ్లుచున్నా రనుభావము కన్పట్టుచున్నది. వైరిఘాటి యత్యద్భుతము-

బాయిలె బాయిరే యనునది-క్రమక్రమముగ వ్రాతలోనిమార్పుగా నుండనోపు. నోటికొక్కమాట ట్రోటికొక్కపాట యన్నట్లుగ నానోటి నుండి యానోటికి నిట్లుమార్పులుగలుగుకొలఁది నిట్టిపదములు మార్పు

చెందుట సహజముకాఁబట్టి తుముకూ (తుముకీ) (తుమ్కూ) భాయి భాయిరే (భాయిరె భాయిరే) ముఁలికి (మ్లుల్కీ) యను మార్పుగ భావించితును. అన్యదేశ్యములు కావున నిట్టిమార్పు సహజమే-విమర్శకు కేటట్లు తోఁచునో? నేను గొందఱ ముసల్మానుపండితుల నడిగితి. వారు నాకిట్లే యర్థము తెల్పినారు.

2. "ఒడయ చిత్తేశ యోనడలింగమూర్తి" ఇందలి చిత్తేశపదము నర్థము సందియము.

ఇట్లే 'దేవచిత్తేశ' యనునదియు-

'నాచిత్తేశుఁడొఁగాక నిర్జితులై పోదురుగాక' వంటి దిదికాదు'అ

'నాచిత్తేశుఁడొఁగాక' యనుటలోఁ బ్రాణేశుఁడనుభావము. గా భర్తయనునర్థము స్ఫుటముగఁ గనఁబడుచున్నది. అట్టియర్థము పై ములలోఁ గనఁబడ దని యూహామై యుండనోపు.

కన్నడదేశమునందును, మధ్వసాంప్రదాయమునందును, 'ప్రాణే అనునది దేవునకును నుపయోగింతురు. ఇట్లే యిందును, ఒడయ=ప్రభూ, చిత్తేశ=ప్రాణమునకు నధిపతీ! ఓనడలింగమూర్తి=నడచునట్టి లింగాకా ము గలవాఁడా; ఓశంకరా! యనుట- చిత్తేశుఁడు=భర్త (పెనిమిటి మాత్రమేకాఁడు- ప్రాణమునకు నాథుఁడు, అనుభావము-

జీవో దేవ స్సనాతనః- అనుమాట యట్లుండఁగా మాధ్వులలో 'ప్రాణేశాచార్యులు, ప్రాణేశరావులు- పెక్కురు గలరు- చంద్రభానుచి త్రము మాధ్వసంప్రదాయములుగల మాధ్వకవికృతము.

శ్రీకాళహస్తిమాహాత్మ్యమునందును గర్ణాటకసంప్రదాయ ములు దొరలినవి. చిత్తేశుఁ డనఁగా చేతస్సున కధిపతి యనుట-వై పరమున నర్థముఁ జెప్పుట యుక్త మని తోఁచుచున్నది.

బళ్లారిప్రాంతములకు వచ్చి చూచిన స్పష్టము కాఁగలదు. దేవా లయమునఁ బ్రాణేశా యని ప్రార్థించుట చూడవచ్చును.

3. సిర్శ్యంక కొమ్మయ శివలీలావిలాసములోని,

'చ. తొలఁగక తాపసుండు శివదో శివదో (శివదో) యటంచుఁజం
చలమతిఁ గూయఁగా సతిసిశంకరలింగ నిషక్తహస్తముల్

బలువిడి విప్పి దండి నిజపాశముఁలం బెడకేలుగాఁగ న
చ్చలముగఁ గట్టి వెల్పలికిఁ జక్కగ నీడిచితెచ్చె-'

ఇందు "శివదో" యనఁగా నేమి. ప్రార్థనమునం దిట్టి రూపమున్న దా; ఏదేశముఁలోనైన నిట్టి వాడుక కలదా, యతులు ప్రాసములు దిద్దరా !'' ఇది సందియము. నాయూహ:—ఇది ప్రార్థనముకాదు. దో-ఇదో అనుట- ఇందలి సందర్భము—యముఁడు మార్కండేయుని బట్టుకొనిపోవుటకు వచ్చుట. మార్కండేయుఁడు శివాలయంబున శివలింగమును బట్టుకొని కూర్చుండియుండును. అతిభయంకరుండయి యముఁడాతాకసుని నెదుర్కొనఁగాఁ దాపసుఁ డనన్యశరణుండై శంకరునింగూర్చి శివ ! దో, శివ ! దో యని యార్తమున దిక్కు తెలియక (చంచలమతి) వల్లఁగా యముఁడు శివలింగమునం దుంపఁబడిన కరములను బలవంతమున విప్పి తన పాశముఁలచేఁ బెడకేలు (ఱెక్కలు విఱిచి) కట్టి వెల్పలికి నీడిచితెచ్చె- అని యర్థము దో, అనునది (ఇదిగో) ఇది+ఓ=ఇదో-అని శత్రువును, బ్రాణసంహరణ ప్రయత్నమునునుండు యమునిఁ జూపుట-

దో- యనునది తెల్గుదేశము (దత్తమండలముల) లో మిక్కిలి యలవాటుగ నుండుమాట-

ఇదో యనుటకు దో యనుట సహజము. (Behold) వచ్చె శివదో (ఇదో) ఇంక గతియేమి యని చూపుచుఁ బ్బలినపల్కుగా నెంచుట లగ్గు. దీన యతిభంగము కలుగఁబోదు. అర్థమునకు హాని రాదు. Brown's Dictionary బ్రౌన్యనిఘంటువున- దో- ఇదో యనుటకు రూపాంతరము- అని వ్రాయఁబడియున్నది. ఇంతకంటె నాకుఁ దోఁచు నభిప్రాయములేదు. ఇది సరిగానుండు నని తలంతురుగాక !

4. 'కర్తార' శబ్దమును గుఱించి-

కర్తారశబ్దము యయాతిచరిత్ర ననుసరించి యర్థము-హుమాయియాపుడమిఱేఁడు కుఁ దైవముగా భావింపనగును. మఱి కవర్యాయము దీనిని గుఱించి తెలుపఁబ్రయత్నింతును.

---

కర్తార్ శబ్దమునకు హింద్రీ, పారశీకనిఘంటువులలో భగవంతుఁడను నర్థమీయఁబడినది. ప. సం.

# రోలంబాష్టక ప్రశంస.

వైద్యరాజ దంటు సుబ్బావధానిగారు- చెన్నపురి.

---

షడ్భాషాకోవిదుఁడై సకలకలాప్రవీణుఁడై పండితరాజబిరుదము తో భూమండలమునఁ బ్రసిద్ధింగాంచిన జగన్నాథకవీంద్రునిచే గీర్వాణ వాణిని రచింపఁబడిన భామినీవిలాస మను రసాలమున కంటుగట్టఁబడిన శ్రీదంటు సుబ్బావధానిగారి యాంధ్రభామినీవిలాసమును, కవితిలక శ్రా ఛసవల్లి కనకాంబగారి యింటఁ గవిముఖమున వింటిఁ గంటి నానంద భరవశతను.

నాదఫలకపరివర్తనమున (గ్రామోఫోనుప్లేటు) గాయకశిఖామణి వాణి గోచరమగునట్లు అవధానిగారి యనువాదమునఁ బండితరాజవాణి ధ్వని విదిత మగుచున్నది. అనువాద మన నిట్లనన్యూనాతిరిక్తమై సాంపు గా నుండవలయును గాని కవిహృదయమును గంగపాల్సేయునదిగా నుండరాదు.

అంతఁ గొంతవడి కవధానిగారు, అన్యాపదేశసుందరము లగు కొన్నిసంస్కృతశ్లోకముల మనోహరముగాఁ బఠింప నే వానింబండితరాజ విరచితములనుగా నెంచి "పండితరాజశ్లోకములు వేమనపద్యములవలె వేనవేలుగాఁ జూపట్టుచున్నవంటి. అది విని కనకాంబగారు మందహాస ముతో "ఈశ్లోకములు వైద్యరాజకృతములు కాని పండితరాజనిర్మితము లు కావనిరి. ఆపైని వైద్యరాజుగారు రోలంబాపదేశముతో భక్తపరుల జీవితము నుపదేశించుచుఁ దాము విరచించిన రోలంబాష్టకముచు శ్రోత్ర పేయముగా గానమొనర్చిరి.

దాని నాకర్ణించి యీకటికికలినాఁటఁ గూడ నిటులు నీటుగా సం స్కృతమున నసర్గళకవితాధారను బ్రసరింపఁజేయసమర్థులగు నాంధ్రకవి సోదరులువిరాజిల్లుచున్నందులకు సంతస మంది, "ఏకః స్వాదు న భుంజీత" అను న్యాయముచే శ్రీవైద్యరాజ సుబ్బావధానిగారిచే నిర్మితమైన రోలం

బాష్టకరసాయనమాధుర్యమును బాఠకమహాశయులకు రుచిచూపుతలం పుట నీవత్రికారజతపాత్రమున దానిఁ బొందుపఱచితిని.

శ్లో॥ హృద్యం పండితరాజపద్యలహరీసారం బుధామోదదం
ఆనీతం కవినా మనోహరగిరా దంటూప్వాఖ్యవంశేందునా
ఆంధ్రాణాం ప్రముదే సుధారససమం గాంభీర్యభావోజ్జ్వలం
వైద్యేంద్రేణ సుభావధానివిదుషా సాహిత్యరాణ్మౌళినా॥

శ్లో॥ శ్రూయంతాన్న కవే స్సుభావలలితా రోలంబసంబోధకాః
శ్లోకా స్సాంస్కృతికా స్సమోపమగుణా స్సుబ్బావధానే రిమే
యో వాచాసమతాం సుధీ రనుగత స్సాహిత్యసృష్టౌ స్వయం
వేగీదేశభవేనపండితవరే ణాంధ్రేషు భోఃపండితాః॥

ఇట్లు విబుధవిధేయుఁడు,
కాశీభట్ట సుబ్బయ్యశాస్త్రి.

---

## —రోలంబాష్టకమ్—

వైద్యరాజ దంటు సుబ్బావధానిభి ర్విరచితమ్.

---

శ్లో॥ శ్రీవాణీచరణారవిందమధుప శ్చేతోహరాం ఝుంకృతిం
కీటానాం నికటే కరోతి వితరన్ తాదాత్మ్య మీశేచ్ఛయా
తామ్రాశా ననునాదయన్ శ్రుతిహితం తామ్రామ్రశాఖాస్థితాన్
కేళీలోలవిఘూర్ణ బాలకగణాన్ నిద్రావయన్ లీలయా॥

శ్లో॥ ఓంకారాభ మశేషమంత్రఫలదం బుద్ధేః ప్రబోధం పరం
ఝుంకారం బుధసమ్మతం శ్రుతిహితం యచ్చిత్తవృత్తే ర్లయమ్
శాంతం సంసృతిదుఃఖభారశమనం కళ్యాణసంవర్ధనం
శ్రీవాణీచరణారవిందమధుపో గాయత్యజస్రం ముదా॥

శ్లో॥ ఫుల్లాంభోజమరందబిందురశనం హంసై స్సహాలాపనం
తీర్థానాం నికటే సదానివసనం సూర్యాబ్జసంసేవనమ్

నాదోపాసన మన్వహం విహరణం కోశైశ్చకోశైస్సహ
భోగోలంబ త వాఖిలం శుభకరం ధన్య స్త్వ దన్యో స్తి కః॥

శ్లో॥ అభ్యస్తాఖిలవేదశాస్త్రనిచయాః ఆజన్మశుద్ధా ద్విజాః
నిత్యోపాసితసత్యశౌచకరుణా నిర్లిప్తచిత్తాస్తు యే
త్వద్వృత్తే రనువర్తనేన మునయో జీవంతి తే నిర్భయాః
భోగోలంబకదంబ సత్కవివరైర్మాన్య స్త్వ దన్యో స్తి కః॥

శ్లో॥ పంకే జన్మ సుధాంశువైర మనిశం మధ్యే జడానాం స్థితిః
ఇత్థంభూతకుశేశయేఽమృతసమం గూఢం విలీనం రసమ్
భోగోలంబ వివేక్తు మస్తి కిమహో లోకే పటు స్త్వాం వినా
నీరక్షీరవివేచనం కి మధికం హంసస్య పుణ్యై ర్యశః॥

శ్లో॥ లక్ష్మీమందిరనిత్యవాసరసిక స్త్వత్తోస్తి కిం భాగ్యవాన్
సారాసారవివేచనేతి కుశల స్త్వత్తోస్తి కిం తాత్త్వికః
ఆనందామృతనిత్యపానరసిక స్త్వత్తోస్తి కిం యోగిరాట్
భోగోలంబ తవావలంబన మహో నూనం భవే త్తారకమ్॥

శ్లో. దూరం ముంచసి చంపకం తు విరసం భోగం వినా వాసనాం
దూరం ముంచసి కేతకీం సరజసం స్నేహం వినా బాంధవమ్
దూరం ముంచసి కింశుకం కిమరుణం రాగం వినా రంజనం
భోగోలంబ భవద్వివేకగరిమా త్వాలంబనం యోగినామ్॥

శ్లో. కామస్యాపి భవత్కృపావిరహితం కాష్ఠం భవే త్కార్ముకం
దుష్యంతోపి భవత్కృపావిరహితః కిం ప్రాప్నుయా ద్వల్లభామ్
ఆచార్యోపి తవోపమా విరహిత స్తత్వం కథం నిర్దిశేత్
భోగోలంబ తవావలంబనవిధా సర్వేపి బద్ధాదరాః"

---

# అమరసింహుఁడు–నామలిఙ్గానుశాసనము

శ్రీయుత్ణి వేంకటవీరరాఘవాచార్యులుగారు, యం. ఏ., కాకినాడ.

— అమరసింహప్రశంస. —

ప్రభాకరునిశిష్యుఁడును, క్రీ. 750 కి నించుక తరువాత జీవించినవాఁడును, మీమాంసాగ్రంథనిర్మాతయు నగు శాలికానాథమిశ్రుఁ డమరసింహుని బ్రశంసించుచు రచించిన యీశ్లోకము శ్రీధరదాసుని 'సదుక్తికర్ణామృతము' (V-28-2; 296 పు.) న లభించుచున్నది.

1. శ్లో. 'ప్రయోగవ్యుత్పత్తౌ ప్రతిపదవిశేషార్థకథనే
ప్రసత్తౌ గామ్భీర్యే రసవతి చ కావ్యార్థఘటనే
అగమ్యాయా మన్యై ర్దిశి పరిణతే రర్థవచసో
ర్మతం చే దస్మాకం కవి రమరసింహో విజయతే'.

2. శ్లో. 'కవి రమరః కవి రచలః కవి రభినన్ద శ్చ కాలిదాస శ్చ
అన్యే కవయః కపయ శ్చాపలమాత్రం పరం దధతి'.
— జల్హణుని "సూక్తిముక్తావళి."

3. శ్లో. 'కవి రమరః కవిరమరుః కవి ర్హ్రీ చోరో మయూర శ్చ'.

4. శ్లో. 'వాల్మీకే రజని ప్రకాశితగుణా వ్యాసేన లీలావతీ
వైదర్భీకవితా స్వయం వృతవతీ శ్రీకాళిదాసం వరమ్
యాసూతామరసింహ-మాఘ-ధనికాన్ సేయం జరా నీరసా
శూన్యాలఙ్కరణా లసన్మృదుపదా కం వా జనం నాశ్రితా'.

పండిత మాడభూషి కృష్ణమాచార్యులవారు సంస్కృతవాఙ్మయచరిత్రమున నిట్లువ్రాయుచున్నారు (1906 సం.): క్రీ.శ.ద్వితీయశతాబ్దిలో నీయమరకోశము చైనాభాషలోని కనువదింపఁబడుటచే నమరసింహుని కృతి క్రీ.శ. ప్రథమశతాబ్దికంటె నవీనము కాఁజాలదు. లాటిన్ భాషలో డెనేరియస్ (Denarious) అనుపదమే "దీనార" అని యమరములోఁ గల దని 'ప్రిన్సెప్' (Princep) పండితులు వ్రాసియున్నా రని వేబర్

(Prof. Weber) పండితులు వ్రాయుచున్నారు. క్రీ. శ. 5-6 శతాబ్దము లలో జావాద్వీపమునకు వలసపోయిన హైందవులచే "తంత్ర" పదము గ్రంథపర్యాయముగా వాడఁబడుచుండెను. అందువలన నీతంత్రపదము గ్రంథవాచకముగా వాడిన యమరుఁడు 5-6 శతాబ్దములప్రాంతమువాఁ డైయుండు కావచ్చునని వేబరుపండితుల యభిప్రాయము.

శ్లో. 'ధన్వన్తరి క్షపణ కామరసింహ శఙ్కు
వేతాళభట్ట ఘటకర్పర కాళిదాసాః
ఖ్యాతో వరాహమిహిరో నృపతేః సభాయామ్
రత్నాని వై వరరుచి ర్నవ విక్రమస్య'.

అనుశ్లోక మర్వాచీనుఁ డగునొకానొక కాళిదాసకవి రచించిన 'జ్యోతిర్విదాభరణము' నఁ గలదు. విక్రమనృపతిసభ నలంకరించినట్లు చెప్పఁబడిన యీనవరత్నములు భిన్నకాలికము లైనట్లు దేశచరిత్రము బట్టియు, వాఙ్మయచరిత్రలను బట్టియు, బలవత్తరము లగు ప్రమాణాంతరములను బట్టియుఁ దెలియుచున్నది. అమరసింహుఁడు క్రీ. 414-6.. నడుమ జీవించియుండు ననియు, వరాహమిహిరుఁడు క్రీ. 587 లో స్వర్గస్థుఁడయ్యె ననియు మోరేశ్వర రామచంద్ర కాళేపండితుఁడు 'విక్రమోర్వశీయ' పీఠికలో వ్రాసియున్నాఁడు. (21.పు.) ధన్వంతరి అమరసింహుని కంటె నించుక వృద్ధుఁడో పూర్వుఁడో కావచ్చును.

'గాయత్రీ బాలతనయః ఖదిరో దన్తధావనః'. (అమర.II కాం.౪ వర్గ. 49 శ్లో.)

అను శ్లోకమునకు 'అమరకోశోద్ఘాటనము' న క్షీరస్వామి— 'బాలపత్త్ర'పదమును చంద్రచెట్టునకుఁ బర్యాయపదముగాఁ జెప్ప, నమరసింహుఁడు స్థూలదృష్టితో దానిని 'బాలపుత్ర' పద మని భ్రమసి 'పుత్త్రి'కు 'తనయ' అని-'బాలతనయ'శబ్దమును ఖదిరమునకుఁ బర్యాయముగా వ్రాయుట ప్రమాదము- అని వ్రాసియున్నాఁడు.

'బాలపత్త్రో యవాసః ఖదిర శ్చేతి ద్వ్యర్థేషు ధన్వన్తరిపాఠ మదృష్ట్వా బాలపుత్రభ్రాన్త్యా గ్రన్థకృత్ బాలతనయ మాహ'-క్షీరస్వామి.

అమరుఁడు పాణినిమతానుయాయి. నృపసభ మిత్యాది సభాంత పదములనుఁ జెప్పుచు-'శాలార్థాపి పరా రాజా మనుష్యార్థాదరాజకాత్'- అను నెడ 'సభా రాజా మనుష్యపూర్వా' (II. iv. 23.) అను పాణినిసూత్రమునే ప్రమాణముగాఁ గొనెను, గాని యింతకంటె సరళమును సరసమును నగు 'ఈశ్వరార్థా దరాజ్ఞస్సభా' అను చంద్రగోమి 'చాంద్రవ్యాకరణసూత్రము' ననుసరింపఁడయ్యె. అమరుఁడును చంద్రగోమియు బౌద్ధులే. అనువలన 'చాంద్రవ్యాకరణ' మమరునకంటెఁ బ్రాక్కాలికమే యగుచోఁ దప్పక యీతఁడు చంద్రగోమికృతినే ప్రమాణీకరించుకొని యుండును.

'ఆప్యము, అమ్నయము'- అను రెండురూపముల నమరుఁడొసఁగుట యెఱిఁగియే 'ఆప్యంవా' అను సూత్రమును, అమరుఁడు 'మంద' శబ్దము నాలస్యవాచకముగాఁ జూప 'మది=జాడ్యే' అనుధాతువును చంద్రగోమి కల్పించె ననియు క్షీరస్వామి వ్రాసియున్నాఁడు.

[ 'అత ఏవ ఆప్యం వేతి చాంద్రంసూత్రమ్. అత ఏవ మది=జాడ్యే ఇతి చాంద్రో ధాతుః'] చంద్రగోమి క్రీ. 480 ప్రాంతముల జీవించియుండుటచే నంతకుఁ బూర్వుఁడగు నమరసింహుఁడు క్రీ. 4 వ శతాబ్దిలో జీవించియుండు నని నిర్ణయింపఁ దగును.† అమరసింహుఁడు కవియే కాక శాబ్దికుఁడుగాఁ గూడఁ బరిగణింపఁ బడియున్నాఁడు. వోపదేవుఁడు 'కవికల్పద్రుమము' నందలి

శ్లో. 'ఇన్ద్ర శ్చన్ద్రః కాశకృ త్స్నాపిశలీ శాకటాయనః
పాణిన్యమర జైనేన్ద్రా జయ న్త్యష్టాదిశాబ్దికాః'.

అను శ్లోకమున అష్టశాబ్దికులలో నమరునిగూడఁ బేర్కొనియున్నాఁడు. ఈతఁడు వ్యాకరణమును రచించినట్టులు ప్రమాణాంతర మేమియును లభించుటలేదు. నామలింగానుశాసనమును బట్టియే యీతఁడు వైయా

† చూ. శ్రీ మల్లాది సూర్యనారాయణశాస్త్రిగారు: 'సంస్కృతవాఙ్మయచరిత్ర'- ద్వితీయసంపుటము, 396-398 పు.

కరణులలోఁ జేర్పఁబడియుండును.†

క్రీస్తుశకము 700 ప్రాంతమున జినేంద్రబుద్ధిచే రచియింపఁబడి న్యాసమునందు అమరసింహుఁడు గాని యతనికృతి గాని పేర్కొనఁబడ లేదు. భారతవర్షమున బౌద్ధమతక్షీణతను బట్టి చూచినచో. నీతఁడు క్రీ. శ. 8 వ శతాబ్దికిఁ బిమ్మట విలసిల్లియుండె ననుట యసంభవము. ఈతఁడు క్రీ. శ. 6 వ శతాబ్దిలో నుండెననుట కీతఁడు విక్రమార్కుని సభ నలంకరించె ననుటదక్కఁ బ్రమాణాంతరము మృగ్యము.

అని ఆచార్య ఏ. బి. కీత్ 'సంస్కృతవాఙ్మయచరిత్ర' (ఆంగ్లము. 413 పు.)-అను బృహద్గ్రంథరాజమున వ్రాసియున్నాఁడు.

అన్ని నిఘంటువులలోవలెఁగాక యమరకోశములోని విశేషమేమనఁగా:- ఆంధ్రాంగ్లాదిభాషలలోవలెఁ గాక సంస్కృతమునఁ బదములకు లింగనిర్ణయము చేయఁబడినది. ఉదా. 'భార్య' యనుపదమునకు దారాః (పుంలింగము.) జాయా (స్త్రీలింగము.) కళత్రమ్ (నపుంసకలింగము) 'ని మూఁడులింగములలోను బదములు కానవచ్చుచున్నవి. ఇట్లు దుర్బోధమైన లింగనిర్ణయమును అమరుఁడు సుగమముగా నొనర్చి తనగ్రంథమునకు "నామలింగానుశాసన" మనునన్వర్థనామము నిచ్చియున్నాఁడు. ఇట్టిదీని ప్రాముఖ్యమును బట్టియే కాఁబోలును మన భాషలో "అమరము నెమరునకు వచ్చినఁ గావ్యము లెందుకుఁ గాల్పనా" యనులోకోక్తి పుట్టియుండును. అమరము చదివినంతనే ప్రయోజనము లేదు; నెమరునకు రావలయును. లేకున్న నాచదువు గుజ్జుపుఁజదు వగును.

అమరసింహుఁడు బౌద్ధుఁడు. మహాయానబౌద్ధమతమును, గాళిదాసుని గ్రంథముల నీతఁ డెఱుంగును. ఇతఁడు కవీశ్వరుఁ డైనట్లు గూడ దెలియవచ్చుచున్నది. 'సదుక్తికర్ణామృతము'లో నమరసింహకృతములు

† ఈతని వైయాకరణత్వమునుగూర్చి మ. మ. శివదత్తశర్మగా రిట్లు వ్రాసియున్నారు: "అస్య వైయాకరణత్వం తు- 'అమరసింహోఽపి పాపీయాన్ సర్వం భాష్యమచూచురత్'- ఇతిపద్యాత్ సకలభాష్యతత్త్వజ్ఞత్వస్య (సంపూర్ణమహాభాష్యస్తేయత్వస్య) ప్రతీతేః ప్రతీతమేవ. ఇత్థం భఙ్గ్యన్తరేణోక్తిస్తు బౌద్ధత్వేన సకలవైదికవిరుద్ధత్వాత్

౧ నేడుశ్లోకము లుదాహరింపఁబడి యున్నవి. వేణీదత్తుని 'పద్యవేణి' యను సుభాషితగ్రంథమునందుఁగూడ నమరసింహకృతములుగ మూఁడు శ్లోకములు కానవచ్చుచున్నవి. ఆశ్లోకముల నిట నుదాహరించెదను.

సదుక్తికర్ణామృతమునందు (లాహోరుప్రతి.)

౧ సింహః.

శ్లో. అసంజ్ఞాః ఖ ల్వేతే జలశిఖిమరుద్ధూమనిచయాః
ప్రకృత్యా గర్జన్తి త్వయి తు భువనం నిర్మదమదః
ప్రసీద ప్రారమ్భా ద్విరమ విజయేథాః క్రుధ మిమాం
హరే! జీమూతానాం ధ్వని రయ ముదీర్ణో న కరిణామ్. (పుట 251.)

౨. నదనద్యౌ.

శ్లో. ఆజన్మస్థితయో మహీరుహ ఇమే కూలే సమున్మీలితాః
కల్లోలాః క్షణభఙ్గురా శ్చ సహసా నీతా పరా మున్నతిమ్
అన్తః ప్రస్తర సంగ్రహో బహిరపి భ్రశ్యన్తి గన్ధద్రుమా
భ్రాతః శోణ న సోస్తి యో నహసతి త్వాశ్సన్నృదాం విప్లవే. (పు 239.)

3. లక్షితవిరహిణీ.

శ్లో. కుచౌ ధత్తః కమ్పం నిపతతి కపోలః కరతలే
నికామం నిశ్వాసః సరల మఁళకం తాణ్డవయతి
దృశః సామర్థ్యాని స్థగయతి ముహు ర్బాష్పసలిలం
ప్రపఞ్చోఽయం కిఞ్చి త్తవ సఖి హృదిస్థం కథయతి. (పుట 84.)

("కవీంద్రవచనసముచ్చయము"లోఁ బైశ్లోకము నరసింహనిర్మితముగాఁ గానవచ్చుచున్నది.)

౪. దుఃశ్వరసేవకః.

శ్లో. తోయం నిర్మథితం ఘృతాయ మధునే నిష్పీడితః ప్రస్తరః
పానార్థం మృగతృష్ణికోర్మితరళా భూమి స్సమాలోడితా
దుగ్ధా సేయ మచేతనేన జరతీ దుగ్ధాశయా గర్దభీ
కష్టం యత్ఖలు దీర్ఘయా ఘనతృషా నీచోజనస్సేవితః. (పుట 307.)

౫. సముద్రవాతః.

శ్లో. యే కల్లోలై శ్చిర మనుగతా దక్షిణ స్యామ్బురాశేః
పీతోచ్ఛిష్టా స్తదను మలయే భోగిభి శ్చన్దనస్థైః

అన్తర్భ్రాన్తాః ప్రతికిసలయం పుష్పితానాం లతానాం
సమ్ప్రాప్తాస్తే విరహశిఖినో గన్ధవాహాః సహాయాః. (పుట 63

౬. స్త్రీమాత్రమ్.

శ్లో. సోఽ నగజః కుసుమాని షట్చ విశిఖాః పుష్పాణి బాణాసనం
స్వచ్ఛన్దచ్ఛిదురా మధువ్రతమయీ పఙ్క్తిర్గుణః కార్ముకే
ఏతత్సాధన ఉత్సహేత స జగజ్జేతుం కథం మన్మథ
స్తస్యామోఘమయూర్భవన్తి నహి చేదస్త్రాః కురఙ్గీదృశః. (పు.

౭. గజః.

శ్లో. మధ్యే విన్ధ్యవనం సలీలవసతిః స్వచ్ఛన్దసత్పద్మినీ
కన్దైర్యస్య సదాశితం భవషిధిః క్రీడా కరిణ్యాశ్శతమ్
తల్పం శైవలినీదలాని మిలితో ద్వైవా స్మరాణాం తటే
జిహ్మాస్తామ్యతి సంస్మరన్ననుదినం విన్ధ్యం స గన్ధద్విపః. (పు. 25

పద్యవేణిలో నీ మూఁడుశ్లోకములు నమరకృతములుగ నున్న
1. 'ఉన్నాహోమ్బుదవద్ధ్వాన్తమసి'. 2. 'కస్తూరీ జాయతే కస్మా
3. 'కాళీభాగగ్రహావ్యగ్రే'. (పూర్తిగాదొరకలే

అమరకోశమున 3 కాండములు, 27 వర్గములు, 1532½ శ్లో
ములును గలవు. ఈవిపరముల నీపట్టికయందుఁ గననగును.

ప్రథమకాండము : 12 వర్గములు- 300 శ్లోకములు.

| | | | |
|---|---|---|---|
| 1. స్వర్గవర్గము. | (73 శ్లో.) | 7. శబ్దాదివర్గము. | (4 శ్లో.) |
| 2. వ్యోమవర్గము. | (3) " | 8. నాట్యవర్గము. | (40) " |
| 3. దిగ్వర్గము. | (40) " | 9. పాతాళవర్గము. } | (18) " |
| 4. కాలవర్గము. | (33) " | 10 భోగివర్గము. } | |
| 5. ధీవర్గము. | (20) " | 11. నరకవర్గము. | (4) " |
| 6. వాగ్వర్గము. | (23) | 12. వారివర్గము. | (44) " |

5 పరిభాషాశ్లోకములు, 2. అనుక్రమశ్లో. [మూల 282 + ప్రక్షిప్త 18=300.]

ద్వితీయకాండము : 10 వర్గములు- 745 శ్లోకములు.

| | | | |
|---|---|---|---|
| 1. భూమివర్గము. | (19 శ్లో.) | 6. మనుష్యవర్గము. | (141 శ్లో.) " |
| 2. పురవర్గము. | (21) " | 7. బ్రహ్మవర్గము. | (63) |
| 3. శైలవర్గము. | (9) " | 8. క్షత్త్రివర్గము. | (120) " |
| 4. వనౌషధివర్గము. | (170) " | 9. వైశ్యవర్గము. | (113) " |
| 5. సింహాదివర్గము. | (46) " | 10. శూద్రవర్గము. | (47) |

(మూలశ్లోకములు: 733; ప్రక్షిప్తములు: 12 = 745. శ్లో.)

తృతీయకాండము : 5. వర్గములు—488½ శ్లోకములు.

| | | | |
|---|---|---|---|
| 1. విశేష్యనిఘ్నవర్గము. | (113) [1] | 4. అవ్యయవర్గము. | (23) |
| 2 సంకీర్ణవర్గము. | (43) | 5. లింగాదిసంగ్రహవర్గము. | (46) |
| 3. నానార్థవర్గము. | (263) | మూలశ్లో. 480, ప్రక్షిప్తములు 8½ = 488½ శ్లో | |

— అమరకోశవ్యాఖ్యానములు —

| వ్యాఖ్యాననామము. | వ్యాఖ్యాత. | కాలము. |
|---|---|---|
| 1. అమరకోశపంజిక. (=పదార్థకౌముది) | నారాయణచక్రవర్తి | క్రీ. శ. 1619. |
| 2. అమరకోశపంజిక. | బృహస్పతి. | |
| 3. అమరకోశపదవివృతి. (=లింగాభట్టీయము.) | వంగల లింగాభట్టు. | |
| 4. అమరకోశమాల. | పరమానందశర్మ | క్రీ. 1350—1600. |
| 5. అమరకోశవివేకము. | మహేశ్వరుఁడు. | క్రీ. 1582కంటె నవీనము. |
| 6. అమరకోశాదర్శము (=తెనుఁగర్థముతోడిపదసూచిక) | సరస్వతీ తిరువేంకటాచార్యులు. | క్రీ. 1886 న ముద్రితము. |
| 7. అమరకోశోద్ఘాటనము. అమరదీపిక. | భట్టక్షీరస్వామి. | క్రీ. 1100 ల ప్రాంతము. |
| 8. అమరపంచిక. | ఆత్రేయవేంకటేశభట్టు. | |
| 9. అమరపంజిక. | | |
| 10. అమరపదపారిజాతము. | మల్లినాథుఁడు. | |
| 11. అమరపదముకురము. | రంగాచార్యులు. | |
| 12. అమరపీయూషము. | రామకృష్ణదీక్షితులు. | |
| 13. అమరవివేకము.(?) | | |
| 14. కామధేనువు. | సుభూతిచంద్రుఁడు | క్రీ. 1159 ప్రాంతము. |
| 15. కాశిక. | కాశినాథుఁడు. | |
| 16. కౌముది. | నయనానంద-రామచంద్రులు | |
| 17. క్రియాకలాపము. | ఆశాధరుఁడు. | |
| 18. అ. గురు(నానా?) బాలప్రబోధిక-తెనుఁగుటీక. ఆ. గురుబాలప్రబోధిని(?) | తాళ్లపాక తిరువేంకటాచార్యులు. | |

[1] ఇట్టిగురుతుఁగలచోట ½ శ్లో. తక్కువయని యెఱుఁగునది.

| వ్యాఖ్యాననామము. | వ్యాఖ్యాత. | కాలము. |
|---|---|---|
| 19. టీకాసర్వస్వము. | వంద్యఘటీయ సర్వానందుడు. | క్రీ. 1159. |
| 20. త్రికాండచింతామణి. | రఘునాథచక్రవర్తి. | క్రీ. 1650 ప్రాంతము |
| 21. అ. త్రికాండరహస్యము(=21.ఆ?) | | |
| 21. ఆ. త్రికాండవివేకము. | రామనాథవిద్యావాచస్పతి. | క్రీ 17-వ శతాబ్ది. |
| 22. నామలింగాఖ్యకౌముది. | రామకృష్ణతర్కాలంకార భట్టాచార్యులు. | క్రీ. 1550—. |
| 23. పదచంద్రిక. | రాయముకుట బృహస్పతి. | క్రీ. 1431. |
| 24. పదమంజరి. | లోకనాథశర్మ. | |
| పదార్థకౌముది (=అమరకోశ పంజిక.) | నారాయణచక్రవర్తి. | |
| 25. ప్రదీపమంజరి. | రామేశ్వరశర్మ. | |
| బాలప్రబోధిక (=గురు (నానా)...?). | తిరువేంకటాచార్యులు. | |
| 26. బాలబోధిని. | గోస్వామి. | |
| 27. బోపదేవానుసారిణి(?). | ముకుందశర్మ. | |
| 28. ముగ్ధబోధిని. | భరతమల్లికుడు. | క్రీ. 1639 ముందు |
| 29 విద్వన్మనోహర. | మహాదేవతీర్థులు. | |
| 30. వైషమ్యకౌముది. | రామప్రసాద తర్కాలంకారుడు. | |
| 31. వ్యాఖ్యాప్రదీపము. | అచ్యుతోపాధ్యాయులు. | |
| 32. వ్యాఖ్యామృతము. | మైథిల శ్రీకరాచార్యులు. | |
| 33. వ్యాఖ్యాసుధ (=సుబోధిని; రామాశ్రమి.) | భానుజీదీక్షితులు. | క్రీ. 17-వ శతాబ్ది. |
| 34. శబ్దార్థసందీపిక. | నారాయణ విద్యావినోదాచార్యులు. | క్రీ. 1475—1525. |
| 35. సారసుందరి. | మథురేశ విద్యాలంకారుడు. | క్రీ. 1666. |
| సుబోధిని(=వ్యాఖ్యాసుధ.) | భానుజీదీక్షితులు. | |
| 36. సుబోధిని. | | |

# శ్రీజయదేవకవి: అష్టపదులు.

శ్రీమాన్ వింజమూరి వరాహనరసింహాచార్యులుగారు-
సంగీతవిద్వాన్, కాకినాడ.

---

శ్రియఃపతినిఁ బ్రఫుల్లమానసమున సాక్షాత్కరించుకొని యాడి, పాడి, యానందమునఁ బులకితశరీరులై, మూర్ఛఁజెందుచు సంగీతసాహిత్యముల యవినాభావమును రసవంతముగ వెల్లడించు భక్తవాగ్గేయులలో శ్రీజయదేవమహాకవి యొకఁడు. ఈయన,

"వాగ్దేవతాచరితచిత్రితచిత్తసద్మా
పద్మావతీచరణచారణచక్రవర్తీ
శ్రీవాసుదేవ రతికేళి కథాసమేత :
మేతం కరోతి జయదేవకవిః ప్రబంధమ్॥"

అని చెప్పుకొనినాఁడు. వాగీశునిరాణి సరస్వతి కలంకారమగు సంగీతసాహిత్యనైపుణ్యమున గీతగోవిందకావ్యముఁ బాడినాఁడు. అంతియె కాదు. తా నాడి తనయనువర్తినిఁ బద్మావతినిఁ గూడ నృత్యముఁ జేయించి శ్రీకృష్ణు నేకాగ్రచిత్తమున ననుభవించి సాక్షాత్కరింపఁ జేసికొనినాఁడు. ఈకావ్యమునుఁ బాకటయు సాహిత్యరచనాచాతురీమాధుర్యమును జవిచూచి యందలి 'శృంగారవివేకతత్వము'ను భక్తిమానసమునఁ దెలిసి తద్భావప్రకటన కాలవాల మగునాట్యము నొనర్చుటయు సులభము కాకపోవుటచేఁ గాఁబోలు నిప్పటి పెక్కుసంగీతవేత్తలు, కవులు, భక్తులు, "గీతగోవిందకావ్యము" నంటకున్నారు. ఇది శోచనీయము. ఈమహాకావ్యము పూర్వమునుండియుఁ (౧౧ వ శతాబ్దము) పెక్కువ్యాఖ్యానములకు లోనై భారత భావలయమునఁ జుట్టివైచి సామ్రాజ్యముఁ జేసినసంగతి జ్ఞప్తికిఁ దెచ్చుకొనిన మన మీ గ్రంథము నించుకస్థూలముగ నైనఁ దెలిసికొనఁ బ్రయత్నింతుము.

తనగ్రంథము 'గీతగోవిందకావ్య'మని జయదేవకవిరాజు వ్రాసె మెను. కాని యందలిగేయములయొక్క రసప్రాబల్యముచేఁ గాఁబోలు మనముఁ జయదేవకవి 'అష్టపదు'లనియే చెప్పుకొందుము. శ్లోకములు మున్నగునవి యు ఛందోబద్ధములై యందుచే లయానుగుణ్యములై యుండినను నాట్యయోగ్యములై 'గాంధర్వకళావిలాసకౌశల'మున నొప్పి యుండిన వగుట నీగేయములకు వానిలో నగ్రస్థాన మొసఁగఁబడు టచే 'అష్టపదు'లను నామము ప్రసిద్ధముగ నుండుటకుఁ గారణ మగు చుంట గ్రహింపవచ్చును. ముఖ్య మగు సంగతి భారతావనిలోఁ బూర్వపు సంగీతకళ నారయుట కష్టపదులు లక్ష్యదృశ్యములై తనరారుచున్నవి ౧౧ వ శతాబ్దమునందలి సంగీతము నారయుట కివియే లక్ష్యమున నాధారము లగుచున్నవి. ఈగేయము లెనిమిదిచరణములచొప్పున నుండుట వలనను, అష్టపదు లనఁ బరఁగు ననుట విదితము.

జయదేవుని నివాసము:—జయదేవకవి లక్ష్మణసేనమహారా కాలమున నుండినట్లు తెలియుదుము. డాక్టరు బహులర్ లక్ష్మణసేనుఁడు క్రీ. వె. 1116 ప్రాంతమువాఁ డని యెంచెను. రాజేంద్రలాలమిత్ర వల్లా సేనుని కుమారుఁడు లక్ష్మణసేనుఁడు బంగాళమును క్రీ. వె. 1106 మొదలు 1136 వఱకును బరిపాలించినట్లు తెలిపినాఁడు. జయదేవకవి యీకాలమున (1106-1136 క్రీ. వె) నుండినట్లు తెల్లము. ఈయన నివాసగ్రామము బిందుబిల్వము.* ఇయ్యది పూరీకి సమీపమున నున్నది. ఇప్పుడు ఒరిస్సారాష్ట్రమునఁ జేరినది. కొందఱు జయదేవుఁడు బంగాళ దేశమువాఁ డనునది సరికాదు. ఒరిస్సాదేశముననే యితఁడుండె ననవ యును. ఈయనతండ్రి భోజదేవుఁడు. తల్లి రామాంబ.

పద్మావతీపరిణయము:—ఆయూరనే భక్తుఁడు దేవశర్మయను విప్రోత్తముఁ డుండెను. ఆయన భక్తవరప్రసాదు, శ్రీజగన్నాథుఁ గొల్చి పద్మావతిని గాంచెను. దినదినప్రవర్ధమాన యై బాలిక నిండుజవ్వనపు సొంపునఁ దులఁదూఁగుచుండు నొక్కనాఁ డామెతండ్రి శ్రీజగన్నాథునకు

*కెందుబిల్వ మనియు, తిందుబిల్వ మనియుఁ గొన్నిచోట్లఁ జూతుము.

యాపెను బాణిగ్రహణ మొనర్చుటకుఁ దలఁచియుండ నాదేవుఁడు జయదేవున కామె నొసఁగుట తనకు సమ్మత మని చెప్పుట గ్రహించి యట్లా బిడ్డను జయదేవు నొద్దకుఁ దీసికొని వెళ్ళెను. జయదేవుఁడు తనకుఁ బెండ్లియందు విరక్తి కల దని చెప్పి వారించెను గాని దేవశర్మ భగవంతుని యాజ్ఞ యవిలంఘనీయ మని యెంచి యాకొమార్త నచ్చట విడిచి వెడలెను. కొంత కాలమువఱకుఁ బద్మావతి జయదేవునకుఁ బరిచర్యఁ జేయుచు నచట నేయుండి తుదకుఁ బరిణయ మాడి కృతకృత్య యాయెను. ఈపెపాణిగ్రహణ మీయన యచలభక్తిప్రపత్తులకు దోహద మొనర్చుచుండెను. కాని, జడము నశ్వరము నగు సంసారమగ్నతకుఁ దోడు కాకుండెను. వీరిరువు రన్యోన్యానువర్తులై భక్తిప్రభావనిమగ్నులై గీతగోవిందకావ్యమునుఁ బాడి, యాడి, యానర్తకులై, కవులై, భక్తులై, వాగ్గేయులై, మనిరి.

అష్టపదుల ప్రభావము:—జయదేవకవిరాజు భగవంతుని వలగొని సమాపసమున నేకాగ్రత నొంది శ్రీమన్నారాయణుఁ డగు శ్రీకృష్ణుని సాక్షాత్కరించుకొని నప్పు డెల్ల తనహృదయదీర్ఘికయం దూరుచున్న జీవపరమేశ్వరసంబంధపుటూటలను రసవంత మగువాక్యానుసరణమునఁ జెప్పి "గీతగోవిందకావ్యము" అని నామ మిడెను. గోవిందునిఁ గీర్తించి గానము సేయుట నిందుఁ జూతుము. ఈయనకృతి ప్రతివారిమానసము నావిధముననే ప్రఫుల్లత నొందించి శ్రీకృష్ణుని కట్టెదుటఁ దాండవింపఁ జేయుచుండె ననుటకుఁ బెక్కుసంగతులు యథార్థముగ జరిగినవి, చంద్రదత్తకృతము "భక్తమాల" గ్రంథమునఁ జూతుము. ఇందుచే నీ యష్టపదులు భారతభూమియం దమితాదరణ నొందె ననవచ్చును. ఈసంగతులు కొలఁదిగ నిటఁ జెప్పుట యప్రస్తుతము కాదు.

ఒకరా జష్టపదులను బోలు కొన్ని గేయములు విరచించి జయదేవుని వానిఁ బాడుటకుఁ గోరఁగా నందుల కాయన సమ్మతింప లేదు. రాజు కుపితుఁ డాయెను గాని వీ రుభయులుఁ దమతమ గ్రంథములను శ్రీజగన్నాథునిచెంత నుంచి యాదేవునిచే నంగీకరింపఁబడు గ్రంథము నాదరించుట కంగీకరించిరి. అట్లు వారు తమ గ్రంథములను శ్రీజగన్నాథునిచెంత

నుంచి వెడలిరి. మఱునాఁడు చూచునప్పటికి జయదేవుని "గీతగోవి మాదేవునిమస్తకమున నుండెను. రాజుగారును శ్రీజయదేవునిఁ గర్వ మెచ్చుకొని యాదరించి గీతగోవిందమును మిన్నగ నెంచెను.

౧౧ వ యష్టపది "రతిసుఖసారే" అనుగేయము నొకసాలెవఁ విలీనమానసమున నొకబిచ్చగానినుండి నేర్చి పాడుకొనుచుఁ దన మగమును సాగించుచుండఁ బింఛధరుఁడును, నీలనిభగాత్త్రుఁడు నా తసులభుఁడు నగు శ్రీకృష్ణుఁడు తనకట్టెదుట నాపాటకు నృత్యము సే చుండఁ గన్నులారఁ గాంచెను. ౧౯ వ యష్టపది ఏడవచరణము జ దేవుఁడు "స్మరగరళఖండనం మమశిరసి మండనం దేహి పదపల్లవ ము రం" అని పాడునంత జ్ఞప్తికలవాఁడై రాధచరణములు శ్రీకృష్ణుడు మస్తకమునఁ దాల్చుట కడుగుట యసమంజసము నపచారము -మెంచియిఁక వ్రాయుట మానివైచి గ్రంథమును బద్మావతి కిచ్చి యభ్య గన మొనర్చుకొనుచుండెను. ఇంతలో శ్రీభగవానుఁడు జయదేవకవి షమున నరుదెంచి యాగేయము నట్లే పూర్తిచేసి వెడలెను. శ్రీజయ వుఁడు తనగ్రంథమునందలి గేయము పూర్తియగుటఁ జూచి జరిగి పద్మావతివలనఁ దెలిసి తనభార్యయొక్క భగవద్దర్శనాదృష్టమునకు చ్చుకొని తనయభాగ్యతకుఁ జింతించెను. ఇందుచే నీయష్టపదియం మాత్రము "జయతిపద్మావతీరమణ జయదేవకవి భారతీభణిత మతి తమ్" అనుపాఠాంతరము కలదు.

నాయకుఁడు కృష్ణుఁడు:—శ్రీజయదేవకవి రాధాకృష్ణులను కావ్యమునకు నాయికానాయకులుగఁ గ్రహించెను. శ్రీకృష్ణుని నిర్హేతు కటాక్షము, స్వస్వామిత్వము, శేషత్వము, సౌశీల్యసౌలభ్యాదులు, కళ్యా ణగుణైకత్వము, మున్నగు ధర్మములు నిరూపించి, యానందించి, కీర్తించి చెప్పుట యీయనగేయములందుఁ జూతుము. "పూర్ణస్య పూర్ణ మాదా య పూర్ణ మే వావశిష్యతే" అను శ్రుతివాక్యముచొప్పున (1) నంతర్యా మిత్వ (2) పరమపద (3) వ్యూహ (4) అవతార (5) అర్చావతా స్వరూపములందు సౌలభ్యాదులకుఁ గరము నాశ్రయ మగు దశావతా రములందు మిన్నగ నెంచఁబడు శ్రీకృష్ణునియెడ మగ్నమనస్కుఁడై జయ

దేవకవి యట్లు శ్రీకృష్ణుని నాయకునిగఁ దనకావ్యమునకుఁ బాడినాఁడు. తక్కినయవతారములందుకన్న సులభత్వమునుఁ బ్రకటించుచు గోగోపకులనుప్రజలకుఁ దననారాయణపరత్వమును జాటుచు, నాడి, పాడి, తిరుగునప్పటి వాత్సల్యమును దెలిసికొని, గురుఁడై, యాచార్యుఁడై, శ్రీభగవద్గీతను బోధించుట నెఱింగియుఁ బ్రతిభక్తుఁడు-కవి-ఆళ్వారు శ్రీకృష్ణునిఁ బ్రేమించి యుగ్గడించి పాడుచుండిరి.

ఈకావ్యము భక్తిప్రతిపాదితము:— ఈగీతగోవిందకావ్యమున శ్రీజయదేవకవి రాధాకృష్ణులయన్యోన్యప్రేమ-భక్తి-ప్రపత్తుల-ననుభవోపేతముగఁ బాడినాఁడు. రాధామాధవులప్రేమ జీవేశ్వరులసంబంధమును జాటుచున్నది. ఈసంబంధము తొమ్మిదివిధములుగ శ్రీవైష్ణవులు చెప్పుదురు. శ్రుతులందునుఁ దెలియుచును. ఇయ్యవి యిట్లు చెప్పఁబడును.

(1) పితృపుత్రసంబంధము. (2) రక్ష్యరక్షకసంబంధము (3) ఆధారాధేయసంబంధము (4) శరీరాత్మసంబంధము (5) జ్ఞాతృజ్ఞేయసంబంధము (6) భోక్తృభోగ్యసంబంధము (7) స్వస్వామిసంబంధము (8) భార్యాభర్తృసంబంధము (9) శేషశేషిసంబంధము.

ఈసంబంధములను భక్తకవులు విలీనమానసమున వర్ణించి చెప్పుట, పాడుట, మనదేశమందు మిక్కుటముగఁ జూతుము. జయదేవకవి యిట్లు రాధామాధవుల శేషశేషిభావమునుఁ బ్రకటించుచు వీరిభార్యాభర్తృసంబంధము ననేకవిధముల విప్రలంభ, సంభోగశృంగారముల చొప్పునఁ గవనముఁ జేసి చెప్పికొని, చిత్తమునకు హాయిఁ గొలుపునట్లు పాడి కావ్య మొనర్చినాఁడు. ఈవిధమున నాయికానాయకులుగ జీవాత్మపరమాత్మలను నిరూపించుట భక్తులు, ప్రపన్నులు, ఆళ్వారాచార్యులకాచారమే. శృంగారవాహిని ప్రపత్తియను యమునాప్రవాహమునఁ జేరుచున్ననదియే. శోకాద్భుతభయానకాదినవరసములలో శృంగారము జీవేశ్వరుల పైసంబంధములనుఁ జాటుటకు బాగుగ నుపకరించుటఁ గవులు గ్రహించిరి. కటుతిక్తౌషధగుళికను మధురపదార్థముతోఁ జేర్చి భిషక్కులు దాని సేవింపఁ జేయఁజాలినట్లు భక్తకవులు భక్తిప్రపత్తులు సులభగ్రాహ్య మగుటకు శృంగారాది

రసములను వానికిఁ బైపూఁత నొసర్చుట యీదేశమున నాచా
చుండెను. ఇట్లు శృంగారము బాహ్యమున నాంతరంగికముగ, భక్తి
తిల్లఁ జేయుకావ్యము లీదేశముననే కాక పరిశియా, అరేబియా, మ
దేశములందును గందుము. జయదేవుని యష్టపది యిట్లుండుటఁ జె
దుము. అష్టపదులందలి శృంగారమునకు విలీనులై కేవలులై యు
చుట కీకావ్యముఁ దాను జేయనట్లు జయదేవకవియే—

"యద్గాంధర్వకళాసు కౌశల మనుధ్యానం చ యద్వైష్ణవం
యచ్ఛృంగారవివేకతత్వరచనా కావ్యేషు లీలాయితమ్
తత్సర్వం జయదేవపండితకవేః కృష్ణైకతానాత్మనః
సానందాః పరిశోధయంతు సుధియః శ్రీగీతగోవిందతః"

అని హెచ్చరించినాఁడు. అంతియె కాని యష్టపదులు శృ
వర్ణనలఁ జొప్పనఁ దనరారుచున్న వనియెంచి యాయాశృంగారచే
రసాకృతి, విస్పష్టముసేయుసంగతులు, సారాంశములు, కలాశాస్త్ర
ననుసరించి ఉదాహరణములు- ఈచొప్పన వ్యాఖ్యానములు గా
ట కవిహృదయమునకు వ్యతిరేక మగుట తప్పదు. ఆయావర్ణనలు
కళాదృష్టితోఁ గాక కవి కేవలము భౌతికమగ్నతతో మానుష
ముగ వర్ణించినట్లు వ్యాఖ్యాన మొనర్చుట యొప్పగు. కాని జయ
కవి శ్రీకృష్ణునియం దేకాగ్రత నొంది రాధామాధవులసంబంధ
విలీనమానసమున వర్ణించి తాను రాధవలె నగుట కుత్సాహుఁడై
వంతముగ సరససరసాలంకారయుతముగఁ దనయష్టపదుల వర్ణించె
హ్యమున గోచరించు శృంగారవిషయ మగు సంగతులు వ్యాఖ్యా
నుదాహరించుచు నందలి తత్త్వము లేక కవి భావించినభక్తిని వ్యా
కర్తలు వెల్లడించుట యావశ్యకము. జయదేవుని కావ్యమునఁ శే
వ్యాఖ్యాన మొనర్చిరి. అందు 'కుంభరాణా' కృతమాకరమాదరణీయ
నెంచఁబడుచున్నది. ఈయన సరసముగనే యనఁగా నాయాశృంగా
నలభౌతికవిషయలోలత్వమున విపులపఱపకుండఁ దెలుపుటఁ దెలియ
ము కాని కొంద ఱాయాశృంగారవర్ణనల నట్టే కేవలశృంగారశాస్త్ర
చొప్పనఁ జెప్పుట యనాయుసులఁ బెకత్రోవ ద్రిప్పుటను హా

సందము. కొన్ని ప్రయోగములం దుదాహరణముగ "ప్రథమసమాగమ లజ్జితయా- పటుచాటుశతై రనుకూలం" అనుచోట బ్రథమసమాగమమం దు బ్రియురాలిని స్వాధీనపఱచుకొను నుపాయములు—

"ప్రథమ మిహ హి దేయం పూగపుష్పాదికం స్యా
న్మృదుమధురవచోభి ర్విజయే త్సన్నిధానే
కరతల మథ గాత్రే భ్రామయన్ శశ్వ దస్యా
శ్శ్లథ ముదరపృష్ఠే మంద మాశ్లిష్య దద్యాత్"

ఇట్లును

"కృతపరిరంభణచుంబనయా పరిరభ్యకృతాధరపానమ్"(౭. అష్ట)అను చో "జఘనోపశ్లేష" మను నాలింగన మిటఁజెప్పుచు లక్షణ ముదాహరించుటయు "సమాఘ్రాత"మను చుంబనము; "లాలాటిక"చుంబనములుఁ గూడఁ జెప్పి వాని లక్షణములుఁ గూడ నుదాహరించుటయు నిట్లు వ్యాఖ్యానములు సేయుట పాండిత్య ప్రకటనము నిరూపించునుగాని యన్యముకాదు. అట్లు బాహ్యశృంగారవిషయములను జెప్పినను గవియొక్క నిజభావము, అంతరంగికానుభవముఁ గూడ నం దుందే తెలిపిన వీరివ్యాఖ్యానములు ఘనములుకాకపోవు. ఇట్టి యష్టపదులందలి శృంగారముయొక్క నిజతత్త్వము నెఱుఁగుట యావశ్యక మగుటయేకాక కవిభావ మదియే కావున నీవిధము నారయుటకు వలయువ్యాఖ్యానాదులు నాకు లభ్యములుకాక పోయినను నా తెలియుచొప్పున క్లుప్తముగ నిట్లుఁ దెలుపుట కుత్సహింతును.

జీవేశ్వరుల భార్యాభర్తృసంబంధము:—జీవేశ్వరుల - నవవిధ సంబంధములలో జయదేవకవి భార్యాభర్తృసంబంధమును విశదీకరించి నట్లు తెలిపితిమి. ఇయ్యది యీయన స్వానుభవోపేతముగఁ గూడ దెలిపినట్లు గ్రహింతుము. తాను భక్తుఁడు. భక్తుఁడు పరమేశ్వరుని బ్రేమించుటలో భార్యవలె స్వయత్న స్వశక్తులను వదలుకొని యట్లు కైంకర్యము చేయుచుండవలె ననుట. అట్లు సంచరించుట విదితము. సీతాపిరాట్టివలె స్వశక్తిని వదలుకొనుటయును, ద్రౌపదివలె లజ్జను బాటింపకపోవుటయుఁ బ్రపన్నుల లక్షణముగ శ్రీవైష్ణవు లెంచుదురు.

రాధ భగవంతు ననుభవించినవిధమును జెప్పుకొనుచుఁ దాను
యగుట కుద్యుక్తుఁ డాయెను గావుననే జయదేవకవి రాధామాధ
యీసంబంధమును గవనము చేసి వర్ణింపఁగలిగినాఁడు. భగవంతు
భార్య మై చునవలయు ననుకుతూహలము, ఆర్తి, ప్రపన్నులకుఁ
కాదు. ఈవిషయమునే జయదేవుఁ డష్టపదులందు వర్ణించినాఁ
"తిరుప్పావై" (ద్రవిడప్రబంధము) యాండాళ్ శ్రీరంగేశునిరాణియై
డుటకు శ్రీకృష్ణునికిని గోపికలకునుఁ గలయీసంబంధమును జ్ఞప్తికిఁ
చ్చుకొని విలీనమానసమున నాసంబంధమునుఁ బాడి తుదకుఁ గృతకృ
యాయెను. ఈమెపాటలు (పాశురములు) శ్రీవైష్ణవులకు నిత్య
సంధనీయములై యున్నవి. ఇట్లే శ్రీజయదేవకృతములును దనరారు
న్నవి. ఇట్లు భగవంతుని భర్తగనెంచి ప్రేమించి మించి తాము భార్యా
ములుధరించినవారు పెక్కురుమనదేశమునఁ బదేపదేచూడఁబడుచున్నా

కావ్యమునందలి రాధ దూతికలు:—జయదేవునిరాధ యిం
నాత్మగను నీపెచెలికత్తె యాచార్యుఁడుగనుఁ దెలియవచ్చును. ఆచా
యావశ్యకత పురుషకారముకొఱకని వైష్ణవులమతము. జయదే
జీవేశ్వరులశేషశేషిభావమును వెల్లడించుచు వీరియుభయులసంబంధ
శాశ్వతము స్వతస్సిద్ధము ననుసంగతి తొలుతనే తెలుపుటకు నా
భయపడుబాలకృష్ణుని రాధ కొప్పగించె నని "మేఘై ర్మేదుర మ
వనభువ శ్శ్యామా స్తమాలద్రుమైః నక్తం భీరు రయం త్వ మేవ
దిమం రాధే!" ఇట్లు పాడినాఁడు. భగవంతు నొక్కక్షణమును వీడలే
దుర్బలమానసము విడిచినందువలన దుఃఖము తిరిగి చేరవలెనను
ఈర్ష్య, కోపము, ఆవేదనము, శిథిలావయవములతోఁ దొట్రుపా
మున్నగు పెక్కుభావములు భక్తులందుఁ జూతుము. ఈభావములు
ష్ణునియం దనురక్త యగురాధయందుఁ జూపుటకు విప్రలంభశృంగా
మీజయదేవునకుఁ బెక్కుకాలము(౧౧ సర్గలవఱకు)ఉపకరించెను.
ష్ణుఁడు తన్నుపరివేష్టించి కైంకర్యము సల్పు పెక్కునిత్యసూరులు
గువారు గోపికాదులవలెఁ దనయొద్దనుండినను బ్రతిజీవుఁడు దన్నుఁ
ట-కాసించి వారి నభిముఖులుగఁ జేయుట కుపాయముల నిరూపించు

పురుషకార మొనర్చుటకే కావ్యమునందలి దూతికలవంటి యాచార్యుల నియోగించి తనయభిమతము నెఱవేర్చుకొనుభగవత్సంకల్పమును నిర్హేతుకకటాక్షమును జయదేవుఁడు బాగుగఁ దెల్పినాఁడు. ఇందుచే "శ్రీజయదేవభణితవిభవద్విగుణీకృతభూషణ"మని యితఁడు చెప్పికొనినట్లు శృంగారరసమథనము మూలమున భక్తిప్రపత్తు లను వెన్నను దీసి భక్తుల కొసంగి యిట్లు రెండువిధము లగుకార్యములు తనకావ్యమున నెఱవేర్చుకొనినాఁడు. అందుచేఁ బ్రతివారు నీకావ్యమునకు విలీను లగుచున్నారు.

సర్గలు, అష్టపదులు:—ద్వాదశస్కంధములు గల శ్రీమద్భాగవతమువలె గీతగోవిందకావ్యము పండ్రెండుసర్గలు కలదై యిరువదినాలుగష్టపదులతో శోభిల్లుచున్నది. ఇందలి కవిత్వనైపుణ్యముఁ గూర్చిజయదేవకవియే యిట్లు చెప్పికొనినాఁడు.

"యది హరిస్మరణే సరసం మనో। యది విలాసకలాసు కుతూహలమ్।
మధురకోమలకాన్తపదావలీం। శృణు తదా జయదేవసరస్వతీమ్।

ఈకావ్యము నవరసభూయిష్ఠమై వసంతవర్ణన, మన్మథహేళన, చంద్రదూషణ, ప్రకృతిభావన, యిత్యాదిధర్మము తో రసమునుజిల్కుచున్నది. పదిసర్గలవఱకు విప్రలంభశృంగారము వర్ణింపఁబడెను. తక్కిన రెండుసర్గలు సంభోగశృంగారమునుఁ జెప్పును. భగవంతునిఁ దలఁచినంతనే కట్టెదుటఁ గోచరింపఁ జేయునప్పటి యాంతరంగికానుభవప్రేమకన్న విప్రలంభశృంగారము చొప్పున (నట్లు త్వరలో సాక్షాత్కరింపమి) మనస్సు సంక్షోభముఁ జెందిచెంది, శిథిలావస్థ నొంది, భగవద్విరహము ననుభవించి యనుభవించి, తుదకు దివ్యమంగళవిగ్రహసందర్శనము నొందు నప్పటియానందము నవ్య మని యెంచి కాఁబోలు జయదేవుఁడట్లు పెద్దకాలము విప్రలంభశృంగారము చొప్పునఁ గావ్య మొనర్చెను.

అష్టపదులందలి శృంగారవివేకతత్త్వము:— ఆయాసర్గలకు శ్రీజయదేవకవి చెప్పినపేరు లనుభవవేద్యములుగను నాదరణీయములుగ నున్నవి. ఆయాయష్టపదులందును, మఱి ప్రతిపాదమునను నాయికాశృంగారాదివర్ణనలతత్త్వము నిరూపించుచుఁ బోవుట వేఱువ్యాఖ్యాన మొనర్చుటయె కాక యందులకుఁ దగినపెద్దల కావని వదలుచు, నాయాసర్గలం

దలి రాధామాధవులప్రేమ-భక్తి- శేషత్వము నెట్లు కనుఁగొనుదుమో నాతెలియువిధమున సూచింతును.

ప్రథమసర్గ:— పేరు-సామోదదామోదరము. ఇందు నాలు గష్టపదులు కలవు. విప్రలంభశృంగారము వర్ణింపఁబడెను. నాయికప్రౌఢ. ఇందలి (1) వ యష్టపదియందు భగవంతుని సౌలభ్యాదులు ప్రకటించు దశావతారవర్ణనము మంగళాశాసనపూర్వకముగఁ జేయఁబడెను. (2) వ యష్టపది "లలితలవంగ" యనునది- శ్రీకృష్ణుని స్వరూపగుణవిభూతు లనిరూపించుచు మంగళాశాసనపూర్వకముగ నున్నది. ఇందలి నాయకుఁడు ధీరలలితుఁడు. (3) వ యష్టపదిలో శ్రీకృష్ణుని వాత్సల్యము ధ్వనించు నట్లు జీవునియెడ నాయనకుఁ గలప్రేమచొప్పున నల్పువిహారములు వర్ణించి రాధను నట్టి శ్రీకృష్ణునిఁ జేరుమని ప్రోత్సహించు చెలికత్తె వచనముల చొప్పున నాచార్యపురుషకార ముగ్గడింపఁబడెను. ఇందలి నాయకుఁడు దక్షిణుఁడు. (4) వ యష్టపదియందు ముగ్ధప్రియురాండ్రతో విలసితుఁడై యుండు శ్రీకృష్ణుని వర్ణించి నాయికయందీర్ష్య జనింపఁ జేయు చెలియవాక్యములు చెప్పఁబడెను, ఇట నాయకుఁడు శఠుఁడు, ధృష్టుఁడు, అనుకూలుఁడు. నాయిక లభిసారికలు.

ద్వితీయసర్గపేరక్లేశకేశవము. రాధయనుభవించుస్మరణరూపమిందువర్ణింపఁబడెను. అయిదవయష్టపది శ్రీకృష్ణుఁడు వేణుగాన మొనర్చుచు నితరస్త్రీల ననురక్తలుగఁ జేసికొనుటను రాధ చూచియు నతనిని మనమున వీడలేకుండుట దెలుపును. ఈనాయిక యుత్కంఠిత. ఆఱవ యష్టపది శ్రీకృష్ణుని యెడఁబాటు వలనఁ దనకుఁగలిగిన తాపార్తిని రాధ దూతికతో వెల్లడించును. ఈయవస్థలో భగవంతుని యాగమనమును కాంక్షించి యాసించి యాతనివిలాసచేష్టలను దలపోసి శిథిలమానసమున భక్తుఁ డుండు నని తెలుపుట గ్రహింతుము. ఇందలి నాయికయు నుత్కంఠితయే.

తృతీయసర్గముపేరు ముగ్ధమధుసూదనము. ఇందు శ్రీకృష్ణుఁడు "భక్తపరాధీనః" అనున ట్లాయన జీవాత్మానువర్తిత్వము విశదీకరించుట కందుము. ఇ ట్లేడవయష్టపది శ్రీకృష్ణుని యనుతాపముఁ దెలుపును. లేక

సౌలభ్యాదులఁ బ్రకటించుచు రాధను (జీవుని) వెదకుచు ననుసర్తుఁడై యుండునట్టియవతారవిశేషమునుఁ గూడ నిందుఁ దెలియుదము. నాయకుఁడు ధీరలలితుఁడు.

చతుర్థసర్గము పేరు స్నిగ్ధమధుసూదనము. ఇందు రెండష్టపదులు కలవు. చేతనులవిషయమై నిర్హేతుకకృపారతుండగు శ్రీకృష్ణునితో రాధయొక్క పారతంత్ర్యమును దెలుపుచుఁ బురుషకారముసల్పు నాచార్య (దూతిక) వచనము లీసర్గయందు వర్ణింపఁబడెను. 8 వ యష్టపదియందు భగవంతుని క్షేమ మారయుచు రాధ యున్మాదినివలె నొకప్పుడు నవ్వుచు నొకప్పుడు దుఃఖించుచు నిట్లు పరిపరివిధముల ధ్యానించుటను శ్రీకృష్ణునితో దూతిక తెల్పుచున్నది. ఇట నాయిక విరహోత్కంఠిత. తొమ్మిదవయష్టపది రాధజడమై శరీరావస్థనుఁ దెలియక ప్రకృతిని విసర్జించి సమాధి నొంది యుండు వ్యాధ్యవస్థను దూతిక శ్రీకృష్ణునితోఁ జెప్పుట వర్ణించునది. ఇందలి నాయకుఁడు దక్షిణుఁడు, నాయిక యుత్కంఠిత.

పంచమసర్గపేరు సాకాంక్షపుండరీకము. ఇందు శ్రీకృష్ణునియాజ్ఞ చొప్పున రాధకడకు దూతిక యరుగుదెంచి శ్రీభగవానుని యభిమతము రాధ (జీవుఁడు) తన్నుఁ జేరవలయు నను కాంక్ష......యానంగతులు రాధతోఁ జెప్పుట వర్ణింపఁ బడెను. ఇందు రెండష్టపదులు కలవు. పదియవయష్టపదిలో శ్రీకృష్ణుఁ డిట్లు రాధకై పరితపించుటయు వెదకుటయు మున్నగు నాతనిచేష్టలు రాధతో దూతిక చెప్పుట కలదు. ఇందలి నాయిక యభిసారిక. ౧౧ వ యష్టపదిలో నున్ముఖులగు చేతనులు భగవంతునిఁ జేరుటలోఁ గాలవిలంబమును జేయక యట్టిభక్తులు తమత్వరనుఁ బురస్కరించుకొనుదు రనునది తెలుపుటకు దూతిక రాధను వేగముగ యమునానదీతీరమునఁ బొదరింటియందుఁ గాచి యుండు శ్రీకృష్ణునిఁ జేరుమని హెచ్చరించుచున్నది.

షష్ఠసర్గము పేరు ధృష్టవైకుంఠము. ఇందు (జీవుఁడు) రాధ శిథిలావయవములు కలిగి యశక్తితో నత్యంత పారతంత్ర్యమున నుండు నవస్థను వెల్లడించుచు దూతిక శ్రీకృష్ణునితో రాధయొక్క యనురాగము నశక్తిచే నెట్లు కదలలేకపోవునది చెప్పుటకలదు. ఇందలి ౧౨ వ యష్టపది రా

ధయొక్క శిథిలావస్థను దెలుపుచు, నాపి తానే శ్రీకృష్ణుఁడ నను నాభావము ననుభవించుట, లజ్జపడుట, యేడ్చుట, యిట్టిభావము దెలుపును. ఇందలి నాయకుఁడు శఠుఁడు-నాయిక వాసకసజ్జిక.

సప్తమసర్గపేరు నాగరనారాయణము. ఆచార్యుఁడు భగవత్పాదారవిందచింతనామృతమును గ్రోలునట్టి ప్రపన్నులతో భగవద్గుణానుభవము లేక మనుట దుర్ఘటము, నింద్యము, నని తెల్పుచు, నిత్యాళ్వారులు భక్తులు వీరివై భవము నానందము, లీనత్వమును, కైంకర్యము నిత్యాదులు భగవంతుఁడును వీరిచే సపర్యల నొందుచుండు నప్పటి యాయన పరాధీనత్వము (అర్చకపరాధీనః) అనుట జ్ఞాపకము మున్నగు సంగతులు జయదేవుఁడు లలితరీతి వర్ణించెను. ఇందు నాలు గష్టపదులు కలవు. ౧౩ వ యష్టపదిలో జీవుని యనన్యశరణత్వము వెల్లడించుటకు రాధ తనపరాధీనావస్థలో నెవరు శరణ్య మని విలపించుట వర్ణింపబడెను. పదునాల్గవయష్టపదిలోఁ దదితరభక్తులు శ్రీకృష్ణునితో నానందించు విధము రాధ "కాఽపి మధురిపుణా-విలసతి యువతి రత్యధికగుణా" అని తెలుపుకొనుచు ధ్యానించుట వర్ణింపఁ బడెను. ౧౫ వ యష్టపదిలో అర్చకపరాధీనుఁ డగుభగవంతుని భక్తులు వివిధరీతుల స్వాతంత్ర్యముతో ననుభవించుభాగ్యము రాధ స్వాధీనభర్తృకతోఁ గూడి శ్రీకృష్ణుఁడనుభవించు విలాసమును వర్ణించుకొనుచున్నది. ౧౬ వ యష్టపదిలో భగవత్సాక్షాత్కారపూర్వక మగు ననుభవము గలవారి యానందము మఱి యదిలేనివారి పరితాపము రాధ యనుభవించి వర్ణించుట కలదు. ౧౩,౧౪,౧౫, అష్టపదులందు నాయకుఁడు శఠుఁడు. నాయిక విప్రలబ్ధ. ౧౬ వ యష్టపదియందు ధూర్తుఁడు నాయకుఁడు, ఖండితనాయిక.

అష్టమసర్గపేరు విలక్షలక్ష్మీపతి. ఇందు భగవత్సాక్షాత్కారము వర్ణింపఁబడెను. మఱియు భక్తుఁడు తనయిష్టముచొప్పున భగవంతుఁడు తనకు దృశ్యుఁడు కాక యాయన కను పగుభావమున సాక్షాత్కరించుట నంగీకరింపకపోవుట జయదేవకవి మెంచి మించి వర్ణించినాఁడు. భక్తు లిట్లు భగవంతునితో వాదాడుట యాచారముగఁ దోఁచును శ్రీత్యాగరాజు.

"అడిగి సుఖము లెవ రనుభవించిరి రా - ఆదిమూలమారామా ?
ఆశ్రయించి వర మడిగిన సీత - అడవికిఁ బో నాయె......
వాసిగ నారదమౌని వర మడుగ - వనితరూపుఁ డాయె
ఆశించి దూర్వాసుఁ డన్న మడుగ - అప్పుడె మంద మాయె"-

అని మెత్తి చెప్పినాఁడు. ఇట్టులే ౧౭ వ యష్టపదిలో శ్రీకృష్ణుని సాక్షాత్కారముఁ జేసికొనిన రాధ "యాహి మాధవ ! యాహి కేశవ! మా వద కైతవవాదమ్" అని నిష్ఠురోక్తు లాడు ఖండితయువతి విలాపము వర్ణింపఁబడెను. నవమసర్గము పేరు ముగ్ధముకుందము. కాని భక్తుఁడు భగవత్సేలభ్యము నానందింపక యప్పుడెల్ల నిష్ఠురోక్తులు వలుకుట కన్న యారూపము నానందించుట యుక్త మని తెలిసి తన తప్పిదమునకు చింతించి కలహాంతరితయై పరితపించు రాధను గూర్చి చెలికత్తియ ''మా కురు మానిని! మానమయే'' అని చెప్పుట యిందు వర్ణించినాఁడు. ౧౮ వ యష్టపది యీసంగతులు వర్ణించును.

దశమసర్గము పేరు చతురచతుర్భుజము. ఆర్తత్రాణపరాయణుఁ డగు శ్రీకృష్ణుఁ డార్త లగు భక్తులను రక్షించుటలోఁ దన కించిదుదాసీనతకు సహింపమియును వారిని బుజ్జగించుటయును నట్టివారు తనశిరోభూషణములుగఁ జెప్పుటయు జయదేవకవి యిందు వర్ణించినాఁడు. ౧౯ వ యష్టపదిలో రాధతో శ్రీకృష్ణుఁడు చెప్పువాక్యములు వర్ణింపఁబడెను. ఇందు "స్మరగరళఖండనం - మమశిరసి మండనం దేహి పదపల్లవ ముదారం" అని చెప్పుట భక్తులయెడ శ్రీకృష్ణునికిఁ గలపరాధీనత, గౌరవము, వారియందలి యుత్కృష్టతను దెలుపుట కిది గ్రహింతుము.

ఏకాదశసర్గము పేరు సానందదామోదరము. భగవత్సాక్షాత్కారము నొంద భక్తు లందులకుఁ దగినట్లుగ నుండుటకు, మఱి కైంకర్యము చేయుటకు, సంసిద్ధు లగుటయును, నట్లు భగవంతుఁడు వేంచేసి యుండు తావున కరుదెంచుటయు, దివ్యమంగళ విగ్రహ సందర్శ నానంద పరవశమున మైమఱచి యుంటయు, నిట్టిసంగతులు జయదేవకవి స్వానుభవోపేతముగ వర్ణించినాఁడు. ౨౦ వ యష్టపదియందు శ్రీకృష్ణుని యారాధించుటకు కైంకర్యము సేయుటకుఁ దగినవేషము నలంకరించుకొని

యనుసరించునదిగ రాధను చెలికత్తె "మధుసూదనం అనుగత మ
రాధే" అని హెచ్చరించుచున్నది. ౨౧ వ యష్టపదిలో శ్రీకృష్ణు
జేరిన రాధ నాయకునకుఁ గైంకర్యము సల్పి యిష్టార్థసిద్ధి నొంద
జెలికత్తె ప్రోత్సహించును. ౨౨ వ యష్టపదిలో దివ్యమంగళవిగ్ర
తానందము నంపాదలనఁ గలుగు తన్మయత్వమును రాధ పొందె
దదర్శ గురుహర్షవశం వద వదన మనంగనివాసమ్" అని చెప్ప
౧౮ మొదలు ౨౨ వ యష్టపదివఱకు నాయకుఁ డనుకూలుఁడు.
కప్రౌఢ. ద్వాదశసర్గము పేరు సుప్రీతపీతాంబరము. అట్లు దివ్య
విగ్రహము ననుభవించు భక్తులతో శ్రీకృష్ణుఁడు "క్షణ మధునా
యణం అనుగత మనుసర రాధే" అను నాదేశము చాటఁబడెను.
యష్టపదిలో శ్రీకృష్ణుఁ డిట్లు రాధతోఁ బలుకుట కలదు. 24 వ య
దిలోఁ బరమాత్మ ననుభవించినరాధ (జీవుని) కైంకర్యప్రియత్వము
వాక్కులచే జయదేవకవి వర్ణించినాఁడు. ఇందలినాయకుఁడనుకూ
నాయికస్వాధీనభర్తృక.

అష్టపదులందలి సంగీతము:—ఇంతదనుక జయదేవకవి
వివేకతత్త్వరచనాచాతురిని జూచితిమి. ఇఁకను గాంధర్వకళాసు కౌశల
జూతము. ఇతని యష్టపదులే పురాతనసంగీతము నారయుటకు
నాధారములుగ నున్నవి. క్రీ. వె. 1106-1136 కాలమున రచిం
యీగేయములు జయదేవకవి యేర్పఱచిన రాగములచొప్పునఁ
బడుట లేదు. గురుపరంపరనుండి చేర్చునప్పటి గేయము లా యా
ప్రాంతము, భక్తి ననుసరించుట విదిత మగుటచే నీయష్టపదు
శతాబ్దముల కాలమునుండి యనేకదేశముల యాచారముల చొ
బాడఁబడుచు మార్పుఁ జెందియుంట యాశ్చర్యము కాదు. అనేక
నములకు లోనై యుండుటయుఁ బెక్కువిధము లగు రాగముల
బాడఁబడుటకుఁ గారణము కాకపోదు. కుంభరాణాకృత మగు
ప్రియ' యనువ్యాఖ్యానమందలి రాగములు కర్ణాటగాయకుల
ణీయములుగ నున్నవి. ఈరాగములతో నష్టపదు లిట్లున్నవి:—

అష్టపదుల రాగములు, తాళముల-కథకము.

| సర్గలు. | అష్టపది సంఖ్య. | జయదేవకవి మతము. | | వ్యాఖ్యానకర్త మతము. | | కర్ణాటకగాయకులమతము. | |
|---|---|---|---|---|---|---|---|
| | | రాగము. | తాళము. | రాగము. | తాళము. | రాగము. | తాళము. |
| 1 వ సర్గ | 1 | మాళవ | రూపక | మాళవగౌడ | రూపకం | సౌరాష్ట్రం | ఆది |
| | 2 | ఘూర్జరీ | నిస్సారు | భైరవి | త్రిపుట | భైరవి | త్రిపుట |
| | 3 | వసంత | యతి | వసంత | ఆది | వసంత | ఆది |
| | 4 | రామక్రియ | యతి | రామక్రియ | యతి | కామవర్ధని | ఆది |
| 2 వ సర్గ | 5 | ఘూర్జరీ | యతి | ధన్యాసి | ఆది | తోడి | చాపు |
| | 6 | మాళవగౌడ | ఏక | గుణక్రియ | ఏక | కాంభోజి | త్రిపుట |
| 3 వ సర్గ | 7 | ఘూర్జరీ | యతి | భూపాల | ఆది | బహుళి | చాపు |
| 4 వ సర్గ | 8 | కర్ణాట | ఏక | కానడ లేక సౌరాష్ట్ర | ఏక | కన్నడ | ఆది |
| | 9 | దేశాఖ్య | ఏక | దేశాక్షరీ | ఏక | బిలహరి | ఆది |
| 5 వ సర్గ | 10 | దేశవరాళి | రూపక | దేశాక్షి | రూపక | ఆనందభైరవి | ఆది |
| | 11 | ఘూర్జరీ | ఏక | పాడి లేక ఘూర్జరీ | ఏక | కేదారగౌళ | ఆది |
| 6 వ సర్గ | 12 | గుణకరీ | రూపక | గుండక్రియ | రూపక | శంకరాభరణం | త్రిపుట |

అష్టపదుల రాగములు తాళముల-పట్టికము.

| సర్గలు. | అష్టపది సంఖ్య. | జయదేవకవి మతము. |  | వ్యాఖ్యానకర్త మతము. |  | కర్ణాటకగాయకులమతము. |  |
| --- | --- | --- | --- | --- | --- | --- | --- |
|  |  | రాగము. | తాళము. | రాగము. | తాళము. | రాగము. | తాళము |
| 7 వ సర్గ | 13 | మాళవ | యతి | అహిరి | ఝంపె | అహిరి | ఝంపె |
|  | 14 | వసంత | ,, | వసంత లేక సారంగ | యతి | సారంగ | త్రిపుట |
|  | 15 | ఘూర్జరీ | ఏక | సావేరి లేక ఘూర్జరీ | ఏక లేక చాపు | సావేరి | చాపు |
|  | 16 | దేశవరాళి | రూపక | పున్నాగవరాళి | ఆది | పున్నాగవరాళి | ఆది |
| 8 వ సర్గ | 17 | భైరవీ | యతి | భైరవి | ఆది | అరభి | ఆది |
| 9 వ సర్గ | 18 | ఘూర్జరీ | ,, | రామకరీ | ఆది | యదుకులకాంభోజి | త్రిపుట |
| 10వ సర్గ | 19 | దేశవరాళి | అష్ట | ముఖారి | ఝంపె | ముఖారి | ఝంపె |
| 11వ సర్గ | 20 | వసంత | యతి | కళ్యాణి | చాపు | కళ్యాణి | ఆది |
|  | 21 | వరాళి | రూపక | ఘంటా | ఝంపె | ఘంటా | ఝంపె |
|  | 22 | ,, | యతి | మధ్యమావతి లేక మాళవి | ఆది | మధ్యమావతి | ఆది |
| 12వ సర్గ | 23 | విభాస | ఏక | నాదనామక్రియ | ఆది | నాదనామక్రియ | ఆది |
|  | 24 | రామక్రియ | యతి | మంగళకైశికి | చాపు | మంగళకైశికి | చాపు |

జయదేవకవి ఘూర్జరీరాగము నా అష్టపదులం దుపయోగించె ను. ఈరాగముతోఁ గలవి భైరవి, ధన్యాసి, భూపాల, పాడి, సావేరి, రామకరీ రాగములతోఁ జేర్చి వ్యాఖ్యానకర్తలు చెప్పిరి. వీనినే భైరవి, తోడి, బహుళి, కేదారగౌళ, సావేరి, యదుకులకాంభోజిరాగముల చొప్పునఁ గర్ణాటగాయకులు పాడుచున్నారు. ఒక్కరాగమునఁ గల యష్టపదు లిట్లు కాలానుసరణముగ మార్చుట కమనీయము. దేశకాల తత్వము ననుసరించుట సంగీతమునకు ముఖ్య మగుచున్నది. భావాను గుణ్యము రసము, రసానుగుణ్యము రాగము కావున భావము మాఱు కొలఁది రాగము మాఱుచుండుట నీదేశమునఁ జూతుము. ఇప్పటి ఘూర్జరి రాగము పదునేనవమేళకర్తజన్యమై సరిగమపదనిససనిదపమగరిస-ఇట్లా రోహణావరోహణములు కలిగి యున్నది. పూర్వపు ఘూర్జరీరాగమున కిట వ్యత్యాసము కలిగినది.

2. వసంతరాగము 3, 14, 20 అష్టపదులందుఁ జూతుము. ఈ రాగమునకుఁ దుల్యముగ వీనియందు వసంత, సారంగ, కళ్యాణి, రాగ ములు చేర్చి పాడుచున్నారు.

3. మాళవరాగము 1,13, అష్టపదు లందుఁ జూతుము. వీనియం దిప్పుడు వరుసగ సౌరాష్ట్రము, అహీరిరాగములు చూతుము.

4. రామక్రియ, 4, 24 అష్టపదులందు కలదు. ఈరాగమునకు మాఱుగ కామవర్ధని, మంగళకౌశికిరాగము లిప్పుడు వాడఁబడుచున్నవి.

5. వరాళిరాగము 21,22 అష్టపదులందుఁ జెప్పఁబడెను. ఇందు లకు భిన్నముగ నిప్పుడు ఘంటా,మధ్యమావతిరాగములతో వీనినిఁబాడు చున్నారు.

6. దేశవరాళిరాగము 10,16,19 అష్టపదులందు కలదు. ఇప్పు డు వీనియందు వరుసగా ఆనందభైరవి, పున్నాగు, వరాళి, ముఖారిరా గములు చేర్పఁబడెను.

7. 6 వ యష్టపదియందలి మాళవగౌడ, కాంభోజిగను, ఎనిమిద వయష్టపదియందలి కర్ణాటరాగము కన్నడగను 9 వ యష్టపదియందలి దేశాఖ్యరాగము బిలహరిగను 12 వ యష్టపదియందలి గుణకరీరాగము

శంకరాభరణముగను 17 వ యష్టపదియందలి భైరవిరాగము, అట్లు లేక మోహనరాగముగను మార్చి భిన్నరాగములతోఁ బాడుచున్నారు. 23 వ యష్టపదియందలి విభాసరాగమునకు మాఱుగ నాదనామక్రియ రాగము చేర్పఁబడెను.

ఇఁక యతి, రూపకము, ఏకతాళములకు మాఱుగ చాపు, చతురశ్ర, త్రిశ్ర, జాతులు గల త్రిపుట, ఝంపె తాళములుగను వెలయించి పాడుచున్నారు. నిస్సారుతాళముఁ ద్రిపుటగను, అష్టతాళము ఝంపె తాళముగను మార్పఁబడెను.

అష్టపదులు నాట్యయోగ్యములు:—అష్టపదులు గానము సేయుటకు మాత్రము కాక ముఖ్యముగా నాట్యముకొఱకు నిర్మితము లనుట చెల్లును. భావముప్పతిల్లుసమయమున విలీనమానసమున నృత్యము సల్పుచు హావభావములతో నాయానాయికానాయకులరసముం బోషించుచు నీవిధమున జీవపరమేశ్వరసంబంధమును దెలిసి, యనుభవించి, యానందించుటకు మాత్రము జయదేవుఁడు వీని రచించెను. ఈతని గాంధర్వకళాసుకౌశలము ఈవిధ మగునాట్యము నుద్దేసించుచున్నది.

నాట్యము భరతశాస్త్ర మనఁబరఁగు. భావరాగతాళయుతము భరతము. ఇందలి మూఁడుభేదములు- నాట్యము, నృత్యము, నృత్తములం దుఁ గ్రమముగాఁ జేతనత్వము మెల్లమెల్లగ సన్నగిల నాట్యమునఁ గల భావరాగతాళవిశదీకరణము నృత్యమున రాగతాళాదికముగ మాఱి తుదకు నృత్తమునఁ దాళప్రకటన చొప్పునఁ దన్మయత్వమునఁ దాండవమై యిట్లు పరిణామముఁ జెందుట భక్తులనటనయందుఁ దెల్లము. ఇట్లు చేతనత్వమును మార్చిమార్చి నిశ్చలత నొందించి తన్మయత్వము కలిగించి యానందపరవశత నొందుట నృత్యముయొక్క పరమావధి.

నాట్యప్రకటన కావ్యరసప్రకటనానుగుణ్యమై యుండుటధర్మము. ఆయా కావ్యభావముల నంగన్యాసకరన్యాసాదికముగఁ జెప్పుటే నృత్యముయొక్క రూపము. కావ్యము నుచ్చరింపక పోయినను నృత్యమున నాభావమే తెలుపుట భారతీయులసొమ్ము. ఇట్టి భరతశాస్త్రసమ్మతములగునవే యష్టపదులు. అప్పుడే వానిరసము చిల్కును. జయదేవకవి

యీచొప్పుననే తానాడి, పాడి, తాండవించి, తన పద్మావతినిఁ గూడ నృత్యము సేయించి తన్మయుఁడై తరించెను. ఇట్టిరసము ననుభవించుటకు శక్తిచాలమింగాఁబోలుఁ బెక్కురు గాయకు లష్టపదుల నరయకున్నారు. ఇది శోచనీయము. ప్రతిసంగీతవిద్వాంసుఁడు నష్టపదు లందలి భక్తినెఱిఁగి నటించుట కర్తవ్యము కాకపోదు. స్త్రీలుఁ గూడఁ బూర్వమునుండియు నటించుచు రనున దీజయదేవునిరాణి పద్మావతిచరిత్ర వలనం దెల్లము. నాట్యకళఁ బ్రతివారు నేర్చుటకు యోగ్య మగున దనియు నీకావ్యము నుండి గ్రహింతుము. ఇట్టివిద్య యగు నాట్యమును దిరుగ నభివృద్ధించుటకుఁ బ్రతివారుఁ గోరఁబడుచున్నారు.

---

# మఱియొక మనవి.

—క్రొత్తపల్లి సూర్యారావుగారు.—

---

సంశయముల నడుగుట తప్పుగాదు, ఎఱుఁగని విషయముల నడిగినఁ బెద్దలు (వేత్తలు) తెలియఁ జెప్పుట వారికృత్యము. పరిపూర్ణులుగానివారును వారికిఁ దెలిసిన విషయములను గోరకున్నను లోకమునకు వెల్లడించిన సహృదయులు గలరు. తెలిసియుఁ దెలియ దనువా రున్నారు. తెలియకున్నను దెలిసినట్లు నటించువారు నందందు వెలయుచున్నారు. చూపోపనివారు నోరులు నేర్చుకొనిపోదు రనుకొనువారు నచ్చట నచ్చటఁ బరిపూర్ణకోవిదులలో నున్నట్లు తొల్లిటినుండి వదంతులు గలవు. వదంతులే గాదు నిక్కమును తెలియఁ గలము. నిజము నిలుకడమీఁదఁ దెలియఁ గలదు. కాని వదంతులను వానిలోని నిజానిజములను దెలిసికొనుటకుఁ బ్రపంచానుభవము ను విమర్శకజ్ఞానము ను, యుక్తియు ను దర్శము ననేకవిషయములకుఁ గావలసి యున్నది. యుక్తులకు దొరకని కింవదంతులు పండితులకు వానిపై విశ్వాసము లేకున్నను వాదుకలో నున్నవాని నెట్లు త్రోసి వేయవచ్చునా యని తలపట్టాయింపఁ దగిన వదంతులును బెక్కులు వినుచున్నారము. ఇది యిట్టిది, యిది సత్యము నని నిర్ధారణ చేయుటకుఁ గష్టముగా నున్నది. త్రోసివేసినఁ బ్రపంచమున

కేమి భంగము వాటిల్లునో యను వదంతులును గొన్నిగలవు. నిష్ప
పాతు లగు విద్వాంసులకు సత్యాసత్యముల గు ర్తెఱుఁగఁగల బుద్ధి
తులకును, యుక్తులచే సిద్ధాంతపూర్వపక్షములఁ జేయఁ జాలిన ప్రజ్ఞ
లకు విమర్శకత్వానై పుణి వాస్తవ మిది యని, యిది యవాస్తవ మ
యూహించు కోవిదులకుఁ జనశ్రుతులలోని సత్యాసత్యములు తెలి
పోవు. సాధారణుల కయి నెట్టి యపనిందలు వచ్చిపడినను మన కంత
నిబ్బంది యుండదు, గాని, పెద్దలు, పండితులు, కవులు, రాజులు, మ
ప్రభులు- ఇట్టి వీరిమీఁదికి వచ్చిన నిందలను మన ముపేక్షించి యు
రాదు. అది యెంతవఱకు నిజము, నిజ మనుట కెట్టి గట్టి యా
మున్నది; కా దనుట కేమి నిదర్శన మున్నది, యని నిర్ణయించి, లో
మున కావిషయ మిపుడు కా దనిన- పెద్దనష్టము వాటిల్లినను, ఇదివ
కున్న నిందయే చాలు నీక మీఁద నట్లు విశ్వసింపరా దని జన
హృదయములలో దృఢముగ నాటుకొనున ట్లొనర్చుట పండితులకు
సాధారణులపై నైనను నిందలు మోపుట న్యాయమా, కావున, ని
మారసి యీక్రింది వదంతులు వదంతులో నిక్కములో కనుగొ
యీపరిషత్పత్త్రికాముఖముననే లోకోపకార మొనర్పఁ నేను బ్రార్థిం
చున్నాఁడను.

౧. నన్నయభట్టు-అథర్వణాచార్యుని భారతమువిషయమైచేసి
డనిన యకార్యము. ౨ భీముని ఛందమును గోదావరిలోఁ గలుపు

౩. సారంగధరుఁ డెవ్వరు, చిత్రాంగివృత్త మెట్టిది. ఇది రా
మహేంద్రపురములో జరిగినదా.

౪. పోతరాజకవి దున్నుకొనుట శ్రీనాథుఁడు సవారి మీ
వెళ్లుట వారికిఁ గల బంధుత్వము.

౫. శ్రీనాథునిపైఁ గలసందేహములను నేనిదివఱకు గోరితిని

౬. కృష్ణదేవరాయలు తిమ్మరుసు కుఁ గావించిన కృతఘ్నత.

౭. తిక్కనకు మంచముచాటునఁ బసుపుముద్దలతో నీళ్లు పో
పోసిరా మ్మనుట. ౮. నన్నయభట్టేమయినాఁడు, నారాయణభట్టు
భారతమును బూర్తిచేయలేదా.

౯. ఇంకను నాకుఁదెయని యిట్టివి.

# ఆంధ్రజయము.

—కాశీభట్ట సుబ్బయ్యశాస్త్రిగారు, కాకినాడ.—

శ్లో॥ నిఘే స్సంజాయతే రత్నం నికషా ల్లభతే రుచిమ్
కవే స్సంజాయతే కావ్యం విమర్శా దశ్నుతే యశః॥

తిక్కనార్యుని విరాటపర్వమును గూర్చి మాయన్నగారు బ్రహ్మశ్రీ బ్రహ్మయ్యశాస్త్రిగారు విపులముగా విమర్శించుచునే యున్నారు. అయినను శ్రీ కోరాడ రామకృష్ణయ్య, ఎం. ఏ. గారు, ఆంధ్రభారతకవితా విమర్శమునఁ బ్రదర్శించిన సాహిత్యవిమర్శనసరణి ననుసరించి, తిక్కన కవీంద్రుని భారతాంధ్రీకరణమునందలి కొన్నిరంగములపై వినోదార్థము కొంచెము ముచ్చటింప నెంచితిని. సాహిత్యచర్చ వివేకానందసాధన మగుటచే నే నీవ్యాపారమును సాగింపఁ గుతూహలి నైతిని. కావున సహృదయు లగుసోదరు లాగ్రహావేశములకు లోనుగాక, శాంతభావముతో నావాదముల నాదరింపఁగోరుచున్నాను.

తిక్కయజ్వ విరాటపర్వమునఁ బాండవులు మాఱువేసములతో విరాటునికోటలోఁ జేరుసమయమునఁ గవ్వడి వడిపిడిన పేడినడపులతోఁ దనకడకు వచ్చుటను గాంచి, యాపార్థివుఁ డప్పార్థుని నీ వెవ్వండ వని యడుగ నే బృహన్నల నామధేయుఁడ నాట్యకలాకోవిదుఁడ నిను సేవింప వచ్చినాఁడ నన నామత్స్యభూపాలుఁ డుత్తరయనుతనకూఁతు నాతనికడఁ జదివింపఁ దలంచి తనతనయఁ బిల్వఁబుచ్చెను.

ఇటఁ దిక్కనకవివరుఁ డుత్తరను రాజసభాభవనమున నవతరింపఁ జేయుచుఁ జేసిన రాజకుమారీయౌవనవైభవవర్ణనమును గాంచినచోఁ బునస్సంధానమందిరమునఁ బ్రవేశించి, ప్రియునితో సరస మాడ నర్హ మగుకామినీశృంగారభావము పొడకట్టుచున్నది. కాని విద్యాభ్యాసము నకై పాఠశాలాసదనమునకుఁ బోయి యాచార్యునికడ విద్యలఁ బఠింప నభిలషించువిద్యార్థినికి నుండఁదగువినయాదిగుణసంపద స్ఫురింపదు.

తిక్కనార్యుఁడు నిజకావ్యరంగమున యువతీసౌందర్యసౌభాగ్య నవతరింపఁ జేయుట కిదియే నాంది. ఇప్పట్టునఁ దిక్కన యొనర్చిన రావయోవర్ణనము మృదుపదసుందర మగు ద్రాక్షాపాకమునఁ క్లిష్టపదబంధుర మగు నారికేళపాకమునఁ బడినది. మధుమాసమ సుమసౌరభముచందమున సుందర మగు లేఁబ్రాయంపు సోయగము పు, సుఖావగతి మగుపట్టులు గోమలపదవిన్యాసములతో సాగిం యును గాని, ప్రయాసబోధ్యము లగుశబ్దాడంబరములతో నడపింప తిలకింపుఁ డాపద్యమును,

"సీ. అల్లఁదనంబున ననువు మైకొనఁ జూచు
  నడపుకాంతికి వింతతొడవు గాఁగ
వెడ వెడ నూఁగారి వింతమై యేర్పడుఁ,
  దారనివళులలో నారు నిగుడ
నిట్టలఁ ద్రోఁచుచు నెలవులుకలమేర,
  లెల్లను జిగి మెక్కి యేర్పడంగఁ
దెలుపును నలుపును వెలయంగ మెఱుఁగెక్కు,
  తారకంబులఁ గ్రొత్తి తసముదొడరఁ
జరణములును నడుముఁ జన్నులుఁ గన్నులు
జవ్వనంబు చెన్ను నివ్వటిల్లు
చునికిఁ దెలుపుచుండ నుత్తర చనుదెంచె
నలరువిలుతుపువ్వుటమ్ముఁబోలె."

ఈపద్యము పాఠకుల కనాయాసముగా బోధపడుట కను పదములతో నడచుట లేదు. నైఘంటుకసాధ్య మగుశబ్దవ్యా ధావన మొనర్చుచున్నది పరికింపుఁ డేమఁగు వారి పద్యంపు సొ

ఉ. ఇంచుక ముద్దులేనగవు నింపగు నవ్యవిలాససూక్తు ల
భ్యంచితలోలదృష్టియు నవారుణపల్లవముండనాబు ని
ర్తించు సలీలయానములు మేలుగ యౌవనలక్ష్మితోడ వ
ర్తించుమృగాక్షిచంధము లతిప్రమదంబు ఘటింపఁ జాలవే.

ఈపద్యమునందలి పదలాలిత్యము తిక్కనవ్రాసిన పైపద్యమునం గానరాదు. మఱియుం గవివరుం డుత్తరసౌందర్యమును బాదాదినేత్రాంత ము వర్ణించియున్నాఁడు. ఇట్లు మానవస్త్రీలయౌవనసౌందర్యము నారో హణక్రమముగా వర్ణించుట ధార్మికమర్యాదావిరుద్ధము. ఇది దేవతావని తల వర్ణించునపుఁ డనుసరింపఁదగినమర్యాద. మానవాంగనల వర్ణించు నపుడు శిరోజములనుండి పాదములవఱకు నవరోహక్రమముగా వర్ణింప వలయును. ఈధర్మమును మల్లినాథసూరి కుమారసంభవమున బార్వతీ వయోవర్ణనసందర్భమునఁ దెలిపియున్నాఁడు కనుఁడు.

“దేవతానాం రూపం పాదాంగుష్ఠప్రభృతి వర్ణ్యతే మానుషాణాం కేశాదారభ్యేతి ధార్మికాః” తిక్కయజ్వ కుమారసంభవవర్ణిత మగు పార్వతీరూపవర్ణనము ననుకరించుచు నుత్తరరూపమును జిత్రించి నట్లు తోఁచెడిని. అదు “కామస్య పుష్పవ్యతిరిక్త మస్త్రం” అను భావమునే “అలరు విలుతు పువ్వుటమ్ముఁబోలె” అని నుడివెను.

ఈయుత్తరావయోవర్ణనము వ్యాసభారతమున లేనే లేదు. ఇది క్రొత్తగాఁ దిక్కనార్యునిచే సృజింపఁబడినది. అసలిట నీయువతీవయో వర్ణనప్రస్తావన యెందులకు ?

పోనీ యీసోయగమును విజయునకు వినిపించి యింపొద వించు తలంపుతో వ్రాయఁబడిన దందుమా! ఇది తిక్కనసోమయాజివచ నము కాని కథావస్తువుతో సంబంధించిన ప్రసంగము కాదు. ఇఁక బిల్హ ణీయమున—

“మోము ముఖలంబు గన్నుఁగవ ముచ్చట మీఱఁగ వక్షమంతయున్
గామిడిచన్నుదోయి కసుగాను సమస్తము మిన్న చూడఁగా
హేమము తత్తనూవిభవ మీరుచిరాంగికి విద్య చెప్పఁగా
నీమహి నెవ్వఁ డోపు స్మరియించినమాత్రనె భ్రాంతిపుట్టఁగన్.

అనియచటిమంత్రులు తలంచిన ట్లీమంత్రివరుఁడు బృహన్నల విద్య నేర్పు సమయమున నిట్టు నిందువయసు వాని నంటకుండుట యెట్లను తలంపుతో సర్వాంగీణయౌవనసౌందర్యమును వర్ణించె నందుమా! ఇదియుం బొసంగదు. ఏమందురా ? ఇట విద్య నేర్పవచ్చిన బృహన్నల

బిల్హణీయమునందలి యుపాధ్యాయునివలె రూపగరిమ గలయువకుం
కాఁడు. పరిపూర్ణ నపుంసకస్వరూపుఁ డగుపేడివాఁడు. ఇట్టి వానిముం
మందయానలరూపసంపద యడవినిగాసినచందమామవెలుంగుచంద
గును గాని చిత్తవికారకారణము కానేరదు.

ఇంతయె కాదు. కిరీటి కుత్తర భావిబాంధవముచేఁ గోడలగుటను,
స్తుతసంబంధముచే శిష్య యగుటను, బుత్త్రికగా భావింపఁ దగియున్న
కావున నిటు శృంగారరసోచిత మగువయోవర్ణనమును దాండవిం
జేయుట యంత యుచితముగాఁ దోఁపదు.

ఇఁక సభ కేతెంచినయుత్తరను గాంచి తత్తఱపాటుతో విరాటుం
ప్రదర్శించిన ప్రేమకలాకలాపములఁ జూడఁ జిరకాలము పుత్త్రికావియో
పీడితుఁ డగుజనకుఁడు హఠాదాగత యగు నందన నవలోకించినపు
చెందుభావోద్రేకము ప్రకటిత మగుచున్నది, కాని, యనుదినావలో
యగుతనయను గాంచి యింతటియనురాగమును వెలిపుచ్చుట య
రసవంతముగాఁ గోచరించుట లేక — చూడుఁడు.

చ. తిగిచి కవుఁగిలించి జగతీవిభుఁ డక్కమలాయతాక్షి నె
మ్మొగము మొగంబునం గదియ మోపుఁ గరాంగుళులం గపోల
పుగఁ బుడుకుం బొరింబొరి న, పూర్వవిలోకన మాచరించుఁ గ
ప్పుగుమృదువాలి నుజ్జ్వలనఖాంకురచేష్ట యొనర్చు సగ్గిలిన్.

నిజ మారయ నీపద్యము దీర్ఘవియోగసందృష్ట యగు నా
యెడ నాయకుని యనురాగచేష్టలు తెలుపునదిగాఁ జూపట్టుచున్న
కాని, తండ్రి కూఁతుపైఁ బ్రకటించువాత్సల్యకృత్యముల నంతగా స్ఫు
పఁ జేయుటలేదు.

ఇదియునుం గాక విరాటమహారాజేల పేరోలగమున
బాలికపై నింతటిమక్కువను బ్రకటింప నెంచె ? తనకుఁ గోమలిపైఁ
యల్లారుముద్దును బృహన్నలకుఁ జూప సమకట్టెనా ? ఈమురిపెపు
తలు మూలమున మృగ్యములు.

వేఱొకసంగతి — తిక్కన యీక్రిందివచనమున విరటుఁడు
తోనుత్తరను గూర్చి ప్రసంగించినజాలును జిత్త్రించియున్నాఁడు.

వ. "ఇవ్విధంబున గాదిలికూఁతు నుపలాలించి, బృహన్నలదెసం గనుంగొని, సాదరదరస్మితరుచిరాననుండై యిమ్మగువ నీకు నాటగఱపం దగుపాత్రంబగునే యని యడిగి తత్ప్రతివచనంబులయందలి నాగరకత్వం బునకుఁ జిత్తంబు రంజిల్ల మధురసల్లాపంబు సేసి, కర్పూరసహితం బగు తాంబూలంబు వెట్టి, చిత్రంబు లగుచీనాంబరంబు లిచ్చి, మణిమయంబు లగునాభరణంబు లొసంగి, సంభావించి, యవ్విభుండు"

కవివరుఁ డిటఁ బొందుపఱిచిన "సాదరదరస్మితరుచిరాననుండై" అను సమాసవిశేషణముచే నేమివిశేషము స్ఫురింపఁ జేయనెంచెనో? బృహన్నల పేడిమూతినిఁ గాంచుటచేతనా! యీదరస్మిత ముదయించుట? అట్లగుచో సాదరపదము గోదావరిపా లగునుగదా! ఆచార్యునకుఁ దన తనయను విద్యాభ్యాసమునకై యొప్పఁ జెప్పుసమయమున గౌరవభావము వెలిపుచ్చుట యుచిత మగును గాని, ఈచిఱునగ వెందుల కుపయుక్త మగును? ఇది వెకిలిచేతను వెల్లడించును గాని, గురుగౌరవము నుబ్రక టింపదే? మఱియు నిట విరటుఁడు గవ్వడితో నాడినమాటల వాలకము చూడ నీప్రసంగము మహారాజగాంభీర్యమునకుఁ దగియున్నట్లు కన్పట్టదు. పరికింపుఁడు. "ఇమ్మగువ నీకు నాటగఱపందగుపాత్రం బగునే?" ఈయడుగుట మోటుగా నున్నది. కాని మహారాజున కను వగు నాజూకు చూపుట లేదు. ఉత్తరనుగూర్చి నిజవాత్సల్యప్రకాశక మగుపదమును వాడవలయును గాని, "ఇమ్మగువ=ఈమూఁడుది" అని తెలుపుట సున్నితముగా లేదు. నిజముచే నుత్తరశీలగుణాదుల వెల్లడించి, యీనాబిడ్డ నీకు శిష్య యగుట కర్హయా? యనియో, యీబాలిక నీయొద్ద విద్యార్థినిగాఁ జేరఁ దగునా? యనియో, లేక యీపాటికి నీకడఁ జదువ యోగ్యత కలదా? యనియో ప్రశ్నించిన నాణెముగా నుండును గాని "యాట గఱపం దగుపాత్రం బగునే?" యని యడుగుట యంత గొప్పగాఁ జూపట్టుట లేదు.

యోగ్యోచితేత్యాదిపదము లుండ వానిని వాడక, యీపాత్రమును జేకొనుట మంత్రిపుంగవుఁడు సోమయాజి యగుటచే యాగసమయమున శ్రోత్రియు లగు ఋత్విజు లుచ్చరించిన స్రుక్స్రువాదిపాత్రములు

శ్రుతిపుటమునఁ బడి ధ్వనించుచుండుటచే నిట నీపాత్రమును బ్రశ్న నేమో? ఇఁక నొకవింత-తన ప్రశ్నలకు సవ్యసాచి యెట్టి సమాధానము దెలిపెనో వెల్లడింపకయే "తత్ప్రతివచనంబులయందలి నాగరకత్వంబు చిత్తంబు రంజిల్ల" నని యుపాంగుట యెంత సొంపుగా నున్నదో యోజింపుఁడు. ఇట విజయుఁ డాడిన మాటలయందలి జాణతన మేడి చక్కఁగాఁ జిత్రించి, యాపైని దనకుఁ గల్గినసంతసమును వెల్లడించి గుగా నుండెడిది. సాహిత్య మన మంజులాలాపములకు నిలయము

మఱియు బృహన్నల తన్నుఁ గూర్చి చెప్పికొన్న "ఆఁడుఁద నిక్కముగ నారసి చూచిన లేదు పుంస్త్వము" అను పద్యభావ బట్టి చూడ నీతఁడు శుద్ధడబ్ధుఁడు గాఁ బొడకట్టుచున్నాఁడు కాని రాలాపనిపుణుఁ డగు నాగరకుఁడు గాఁ జూపట్టుట లేదు. బృహ యితరులకు ననాగరకుఁడు గాఁ గన్పట్టుచున్నను విరటునితో సప ముగాఁ దననాగరకతను వ్యక్తము చేసెనేమో?

సందేహము లేదు. అటులే నడచి యుండును. కావుననే రంగమున విరటునివాగ్ధోరణి యల్లుఁడుకుఁ బిల్ల నప్పఁజెప్పుచోఁ సిల్లఁజేయుచున్నది. పరికింపుఁడు:—

"గీ. నీవు చతురమతివి నీకు నిక్కన్నియ
నప్పగింప నేల యైన నాదు
హృదయ మలరు దీనియెడఁ గడునార్ద్రమై
యుండుఁ గానఁ జెప్పకుండరాదు.

క. నెచ్చెలులతోడ నెంతయు
మచ్చికఁ దనయిచ్చ నాడమరగినయది యై
విచ్చలవిడి నింతకు ము
న్నిచ్చెడియ మెలఁగు శిశు వెఱుఁగదు సుమ్మీ.

గీ. బాలకేలివినోది భరము క్రమంబున
విడువఁ గళలయందు వేడ్క సొనిపి
నయముతోడ నర్తనంబుల శిక్షింపు
నెలఁత కేఁడుగడయు నీవ కాడె."

వ.శ్లోకవిశేషము-పైనివ్రాయఁబడినపద్యములలో రెండుమూఁడు పద్యములభావమును బట్టిచూడ నుత్తర చిన్నబొట్టెగాఁ బొడకట్టుచున్నది కాని "అల్లఁదనంబున ననువు మైకొనఁ జూచు" అనుపద్యమునఁ దిక్క కవీంద్రుఁడు వర్ణించిన ప్రౌఢయువతీభావము గోచరింపదు. ఉత్తరకడఁ బ్రౌఢభావము కల దని యెవరు చెప్పి రందురా? తిక్కనార్యుఁడే; కనుఁడు- "కదిసి ప్రౌఢవనితకైవడి ముద్దియ ముద్దువుట్టఁ దనకు మ్రొక్కుటయు" నని కవివరేణ్యుఁ డుత్తర తండ్రికి మ్రొక్కినవైఖరినిఁ జూడఁ బ్రౌఢవనితా ప్రాగల్భ్యము గోచరించు చున్నట్లు వర్ణించి యున్నాఁడు.

అన్న ట్లన్నలారా! పితృపాదములకు వందన మొనర్చునపుడు భక్తి వినయములు వెల్లడింపఁ బడవలయుచు గాని, యీప్రౌఢిమ యేమి లకు? లేక ప్రౌఢవనితానమస్కారము లనియు,ముగ్ధనారీవందనము లనియు, వృద్ధస్త్రీనమస్కృతు లనియు వేఱు వేఱు లక్షణము లెవ్వియేని గలవా? ఇదేమి కావ్యనిర్మాణమా? రాజకార్యనిర్వహణమా?ప్రౌఢతఁ జూపుటకు- నమస్కారాచరణమే! ఇంతఁ బ్రౌఢి యేమిటికి?

ప్రౌఢవనిత యన నెట్టిదో లక్షణజ్ఞులు వివరించి యున్నారు, పరి కింపుఁడు, లక్షణమును,

"స్మరమందీకృత వ్రీడా ప్రౌఢా సంపూర్ణయౌవనా" అని- ఇంకలకు లక్ష్యముఁ జూతుఁడు- కొక్కోకమున-

చ. కులుకుమెఱుంగుఁజూపులును గొంతెపుఁజేతలుఁ దియ్యమాటలున్
జిలిబిలిపాటలుం గలికి చిత్తము మన్మథబంధభేదముం
దలకొను చుంబనంబులును దాటవపేటవభూషణవ్రజా
బలుకలుఁ గల్గిపైకొనుచు నాసఁ జేల్తురు ప్రౌఢభామినుల్.

మఱియుఁ బదునాఱేండ్లలోపు వయసు కలది బాల యనియును, ముప్పదియేండ్లదితరుణి యనియు నేఁబదియైదేండ్లదనుకఁ బ్రౌఢయనియును, నాపైవయసుది వృద్ధ యనియు వయోనిర్ణయము కలదు. కావున నుత్తర వయసుముదిరినముదితవలెఁ దండ్రికి నమస్కరించిన దన్నమాట-పదముల వాడునపుడు ప్రకరణౌచిత్యమును గమనింపవలదా? పిడుగునకు బియ్యమునకు నొకటే మంత్ర మన్నట్లు శబ్దముల నుపయోగింపనగునా?

కాదు కా దిక్కడ నేదియో కావ్యకల యంతర్లీనమై యుండును. ... న్నమంత్రివరుఁడు ప్రౌఢపదమును వాడియుండఁడు. కావున శ్రీరామ... య్యగారి ప్రౌఢవనితవైపు దృష్టిని ద్రిప్పి యిట విలసిల్లుచున్న కావ్యకళా దృష్టిని బాఠకసోదరులకుఁ బ్రకటీకరింపఁ గోరుచున్నాను.

ఇఁక నొకసంగతి. విరటుఁడు కిరీటికడ నీచేడియ కిదివఱ కుపా... ధ్యాయునియొద్ద విద్య నభ్యసించుజాడయే తెలియ దని, నుడువుటచే నిద్దియే విద్యాభ్యాసమునకుఁ బ్రాథమికదివస మని విదిత మగుచున్న... కనుకనే చదువు లేక నెచ్చెలులతో మచ్చికగా నాడుకొను ననియు ... బాలకేళి మీఁదిభరము క్రమముగా వీడునట్లు కళల శిక్షింపు మనియు ... పార్థునితో మత్స్యభూపాలునిచేఁ జెప్పఁబడినది.

ఇఁక దిక్కనచేసిన వయఃప్రాగల్భ్యవర్ణనమును విరటునిమాటలను సమన్వయించి చూచినచో నుత్తరకుఁ బదునాఱేండ్లు వయసు వ... వఱకుఁ జదువు రా దని తేలును. కాని, యిది యసంభవవిషయము. సామాన్యముగా ద్విజబాలికలకుఁ జిన్ననాఁడే విద్యాభ్యాసముఁ జేయు... పఁబడును. అందులో మహారాజపుత్రికలకుఁ బదునాఱేండ్లదనుక గు... శిక్ష లేక యుండునా! ఇదంతయు నేదియో చిక్కుదారినిఁ బడినది కా... చక్కఁగా సాగినటు తోఁచదు.

ఈచిక్కుత్రోవ వ్యాసభారతమునఁ గాన రాదు. అట విరటుఁడు బృహన్నలతో నుత్తరకు నృత్తమును నేర్పు మనియెనే కాని, మాగు... తోడిబొట్టెలతో నాడుకొనుటయే కాని గురుశిక్ష యన నెట్టిదియో యెఱుఁగదు సుమ్మీ యని తెలుపలేదు-వినుఁ డాభాగమును,

“దదామి తే హంత వరం బృహన్నలే సుతాం చ మే ... యా శ్చ యాదృశీః” దీనిచే నిదివఱకే యీయలివేణి నాట్యకల ... మిగతవిద్దెల నాఱితేఱిన నారీమణియే యని చెప్పనొప్పు.

మఱియు విరటుఁ డుత్తరహస్తమును బృహన్నలకరమున ... యించి, పుత్రికతో నిట్లు తెలిపెను.

గీ. ఎల్లచుట్టములును దల్లియుఁ దోడును
జెలియుఁ బఱిజనంబుఁ జెలువ నీకు

గురువ యింక న్కొక్క కొఱంతయు లే దింధుఁ
జేరి బ్రతుకు బుద్ధిగౌరవమున.

ఈపద్యమున వివరింపఁబడిన బోధలు—ఇల్లువిడిచి, చుట్టాలఁ బాసి దూరమున నుండు గురుకులమునకుఁ బోవు ముద్దియల కనువు కాని, ముప్పొద్దులఁ గూడారగించి మిద్దెలలో నెచ్చెలులతోఁ ముచ్చటగాఁ దండ్రి వజ్జ దిరుగాడు పూఁబోండ్ల కీసుద్దులు సరిపడునా ?

వేఱొకవింత—యింత ప్రసంగము సాగినను సవ్యసాచికి నుత్తర విరటునిచెల్లెలో, మఱఁదలో, కూఁతురో, కోడలో లేక మనుమరాలో తెలియ నవకాశము చిక్కదాయె. విరటుఁడు కిరీటితో నుత్తరను గూర్చి మాటలాడినపుడు "ఇమ్మగువ, ఇక్కన్నియ, ఇచ్చేడియ, నెలఁత, బోటి" అను స్త్రీసామాన్యవాచకములే వాడఁబడినవి కాని, పుత్రి, తనయ, నందన, లోనగుపదము లుపయోగింపఁబడ లేదు. అందుచేతఁ బార్థున కుత్తరావిరాటులబాంధవ మెట్టిదో తెలిసికొనుటకు సాధ్యము కాదు. ఉత్తర విరటునినందన యనుసంగతి కవిపాఠకులకుమాత్రము విదిత మగుచున్నది.

విరటుఁడు కవ్వడితో "బాలకేళిమీఁది భరము క్రమంబున విడువఁ గళలయందు వేడ్క సొనిపి" అని చెప్పెను గాని పార్థుఁ డాపార్థివుని ప్రార్థనమును నెఱవేర్పఁ జాలఁ డాయెను. కనుఁడు:—

"కురువీరుల గెలిచి తదంబరములలోఁ జిత్రవర్ణభాసురములుగాఁ, దర మెఱిఁగి లోచనోత్సవకరములుగా బొమ్మపొత్తికలకుం దెండీ" అని యుత్తరగోగ్రహణవారణసమయమున నుత్తరునితో నుత్తర తెలిపినది. దీనిచే నుత్తరకు బొమ్మలాటపై మిక్కుట మగుమక్కువ కలదు, కాని, యీయబలాట యెంతమాత్రము తొలఁగలేదని విదిత మగుచున్నది.

అసలు తిక్కయజ్వ చిత్రించిన "అల్లఁదనంబున"ననుపద్యము మొదలు "మనయింట నిచ్చట" అనుపద్యమువఱకుఁ గల గ్రంథము సంస్కృతభాగమున లేదు. ఇది యంతయుఁ దిక్కనార్యుఁడు క్రొత్తగా నల్లిన కయితయే కాని వ్యాసమునివిరచిత మగుకవిత కాదు. మంత్రివరుఁ డీయవరూప మగుమార్పు నెట్టినేర్పుఁ జూపసృజించెనో తెలియవచ్చుటలేదు.

మఱియు నీఘట్టమున విజయుఁడు తనకుఁ దెలియునన్న దండలాస్యాదివిద్యలు సంస్కృతభారతమునఁ దెలుపఁబడి యుండలేదు. "గాయామి నృత్యా మ్యథ వాదయామి భద్రోస్మి నృత్యే కుశలోస్మి గీతే" అని తెలుపఁ బడినది.

మన తిక్కనమంత్రివరుఁడు నాటకకళాచతురుఁ డగుటచేత నీదండలాస్యాదినాట్యవిద్యలఁ జేర్చినాఁడు. అంతియే కాని యివి బృహన్నలకుఁ బోధపడినట్లు పొడకట్టదు.

మఱియొకనూత్నవిషయము—తిక్కన భారతమున నర్జునుఁడు—

"ఆఁడుఁదనంబు నిక్కముగ నారసి చూచిన లేమ పుంస్త్వముం
బోఁడిమి తప్పియున్నది నపుంసకజన్మ మవశ్యభోగ్యమై
వాఁడిమిగల్గుశాపమున వచ్చెఁ బురాకృతకర్మభాగ్య మే
వాఁడును నేర్చునే తొలఁగవైవఁగ నోర్వకపోవవచ్చునే"

అని నిండుసభలోఁ దనస్వరూపస్వభావముల వెల్లడించుకొన్నట్లు వ్రాయఁబడినది. విజయుఁ డిట్లు పేరోలగమునఁ దనశాపరూపముల వెల్లడించుకొనునా ?

ఇవి కేవలము తిక్కనచే సృష్టింపఁబడిన కవ్వడినుడులు కాని, వ్యాసమునివర్ణితుఁ డగుధనంజయునిపలుకులు కావు. వ్యాసగాఁడీవిని విరటుఁడు నీ కీక్లీబరూపము రాఁ గారణ మే మని యడుగ నాతఁ డిట్లు తెలిపెను:

"ఇదం తు రూపం మమ యేన కిం తవ ప్రకీర్తయిత్వా భృశశోకవర్ధనమ్। బృహన్నలాం మాం నరదేవ విద్ధి సుతం సుతాం వా పితృమాతృవర్జితామ్॥"

అనఁగా- నా కత్యంతదుఃఖహేతు వగునపుంసకత్వాదికారణకారణముతో నీ కేమిప్రయోజనము- అని గోప్యముగాఁ బలికెను. కాని మనయమాత్యశేఖరులకవ్వడి వివరించినట్లు "ఆఁడుఁదనంబు నిక్కముగ నారసి చూచిన లేమ పుంస్త్వముం" అని నిజాపమానరూపమును వెల్లడించుకొన లేదు.

వ్యాసభారతమున విరటుఁడు బృహన్నలమాటల నమ్మక, యతని స్వరూపస్వభావాదులఁ గూర్చి కైతవనిపుణు లగు తనమంత్రివరులతో సంప్రతించి వెంటనే నెఱజాణ లగునలివేణులచేఁ బృహన్నలను బరీక్షింపఁ జేసి, వారివలన నిజస్థితిని దెలిసికొని, నపుంసకుఁడే యనువిషయమును స్థిరీకరించి, పిమ్మట నుత్తరయంతిపురమునఁ బ్రవేశింపఁ జేసెను.

"సంమంత్ర్య రాజా వివిధైః స్వమంత్రిభిః
పరీక్ష్య చైనం ప్రమదాభి రాశు వై
అపుంస్త్వ మ ప్యస్య నిశమ్య చ స్థిరం
తతః కుమారీపుర ముత్ససర్జ తామ్"

వ్యాసభారతమున నీరీతి నున్నది. పరిశీలింప నిదియే సమంజస మగురచన కాని గాండీవి తననపుంసకత్వాదిదోషముల వెల్లడించె ననుట యుచితము కా దని తోఁచెడిని.

తిక్కనసోమయాజి కభిమానస్థాన మైనయీవిరాటపర్వములో నర్జునుఁడు పేడిరూపమున విరాటునిఁ గొల్వవచ్చినయీఘట్టమున నెటనెట నద్వైతదృష్టియుఁగావ్యకలాదృష్టియుఁ బుష్కలములైయున్నవియో విమర్శకు లగుశ్రీరామకృష్ణయ్యగారు వివరముగాఁ దెలుపఁ గోరుచున్నాను.

మఱియొకవిన్నపము-తిక్కనార్యుఁడు "ఇవ్విధంబున గాదిలికూఁతు నుపలాలించి"యనువచనభాగమున "ఆభరణంబు లొసంగి, సంభావించి" యని శ్రోత్రియార్హ మగుసంభావనక్రియను వాడుటచేఁ దిక్కనమంత్రివరునకు వైదికదృష్టిదోషము సోఁకిన దేమో కనుఁగొని, మేధానిధు లగు విమర్శకులు తన్నివారణమునకుఁ దగుప్రతిక్రియఁ జేయఁ బ్రార్థించుచున్నాఁడను. విన నున్నాఁడను సరసములగు సమాధానములను.

---

# ఆంధ్రము-అనువాదవాఙ్మయము.

జటావల్లభుల పురుషోత్తముగారు, ఎం. ఏ., కొవ్వూరు.

---

ఆంధ్రవాఙ్మయ మనువాదముతోనే ప్రారంభ మైన దను సువిదితము. పిమ్మటఁ గూడఁ గొన్ని యనువాదగ్రంథములు బయ దేఱినవి. నేటికిఁ గూడఁ గొన్ని యనువాదములు బయలుదేఱుచున్న ఈయనువాదములు భాషాగౌరవమును దగ్గించుననియు స్వతంత్రరచన భాషాగౌరవాపాదకము లనియుఁ దలఁచునాంధ్రులు కొందఱు కల కాని వా రొక్క సంగతిని గుర్తింపవలెను. జ్ఞాన మనునది యొకరి స్వ కాదు. అది వివిధకాలములలో వివిధదేశములలో వివిధభాషలలో బ పడుచుండును. భాష యనునది జ్ఞానమున కుపాధియే కాని భాష జ్ఞానము కాదు. మ ఱొకకాలములోనో మ ఱొకదేశములోనో బయ దేఱిన వాఙ్మయమును ద్వేషించువా రెట్టివారో మ ఱొకభాషలో బ లుదేఱిన వాఙ్మయమును ద్వేషించువారును నట్టివారే. వీ రందఱును యాదేశకాలభాషలను ద్వేషించువారు మాత్రమే కాక విజ్ఞానమ ద్వేషించువారు కూడ నగుచున్నారు. ఇరువదవ శతాబ్దిలోనివారికి మూఁడవ శతాబ్దిలోని వాఙ్మయ మెట్లు సమాదరణీయమో య యొకఖండములోనివారికి మ ఱొకఖండములోనివారి వాఙ్మయము సమాదరణీయమే; మఱియు నట్టే యొకభాష మాటలాడువారికి భాష మాటలాడువారి వాఙ్మయమును సమాదరణీయమే. కాని మ మల్పమేధస్కుల మగుటచే నన్నిభాషలను నేర్చి యన్నివాఙ్మయము జదువలేము. కనుకనే మనలోని కొలఁదిమంది బహుభాషా ఆయాభాషలలోని విజ్ఞానమును మనభాషలోనికి దింపి మనము దా గ్రహించునట్లు చేయుచున్నారు. అంతర్జాతీయ మైనవిజ్ఞానము విశ్వమానవకోటికి సామ్యవాదపద్ధతిని బంచి యిచ్చుచున్న యీమహా నుభావులకు మన మెంతయు ఋణబద్ధుల మై యున్నాము. మాన లకు యోగక్షేమము లపేక్ష్యములు. యోగ మనఁగా మనకు లే నది వచ్చిపడుట. క్షేమ మనఁగా మన కున్న మంచి నశింపకుండ

విశ్వమానవకోటిలో భాగమై యున్న యాంధ్రదేశసంభూతులకు వైజ్ఞానికక్షేమము కావలె నన్నచో జ్ఞాన మేదేశములో నేకాలములో నేభాషలో బయలుదేఱి యున్నను వారు దానిని భద్రపఱచుకొనవలసి యున్నది. భగవంతుఁడు, ఇంగ్లండులో షేక్స్పియరును జనింపఁజేసినాఁడు. వానిద్వారా ప్రపంచములో నొకకొంతజ్ఞానమును వ్యాపింపఁజేయుటకును గళను వికసింపఁజేయుటకును భగవంతుఁ డుద్దేశించియుండెను. వానిని గాని యట్టివానిని గాని భగవంతుఁడు మనదేశములో జనింపఁజేయ లేదు. ఏమన నట్లు జనింపఁజేయుట, సారస్వతములోఁ బునరుక్తి యెట్టి దోషమో, సృష్టికళలో నట్టిదోషమే యగును. మానవహృదయమును స్తనశల్యపరీక్ష గావించి మానవప్రకృతి యెన్నెన్నిత్రోవలఁ ద్రొక్కుట కవకాశ మున్నదో యన్నిటిని బ్రదర్శించిననాటకకర్త షేక్స్పియరు. ఈతని నీవిషయమున మించినవారు మఱొక్కరు లేరు. పరమేశ్వరసృష్టిని మనము సార్థకము చేయవలె నన్నచో నాషేక్స్పియరుద్వారమున బయటకు వచ్చిన వాఙ్మయమును మన మాంధ్రములోని కనువదింపవలదా? విశాలహృదయు లెవ్వరును నిట్టిభాషాన్తరీకరణమును నిరసింపరు. సరికదా మన మాతృభాషలో ననువాదవాఙ్మయ మింతతక్కువ యున్నదేయని చింతింతురు.

అన్నిభాషలలోని యనువాదములకును నేయేచిక్కులు గల్గుచున్నవో యట్టిచిక్కులే మనభాషలోని యనువాదములకును గల్గినవి. ఆంధ్రవాఙ్మయములోఁ ద్రిమూర్తు లని చెప్పఁదగిన నన్నయ తిక్కన యెఱ్ఱాప్రెగడలకుఁ గూడ నీచిక్కే గల్గినది. వారి యనువాదములు యథామూలములు కాక కొన్నిచోట్లను సరళములుగను గొన్నిచోట్ల ననుకరణములుగను గొన్నిచోట్ల స్వతంత్రములుగను నుండుట కీచిక్కే కారణ మని నాయభిప్రాయము. ఆచిక్కేదన- కవిత్వమునకు భావోద్రేకము (Emotion) అవసరము. భావోద్రేక మనునది యౌరసపుత్రునివలె మనలోననుండి జనింప వలసినదియే కాని దత్తపుత్రునివలెఁ దెచ్చిపెట్టుకొనఁ దగినది కాదు. ఈభావోద్రేకము లేనిదే కవిత శోభింపదు. భాషాన్తరీకర్త కీయుద్రేకము గలుగుట యసంభవప్రాయము. భావో

ద్రేక మొకవిధ మయిన హృదయానుభూతి. అనుభవము లేక
బయటకు వచ్చుమాటలలోఁ బటిమ తక్కువగ నుండును. కనుక నే
భవవాఙ్మయ మెప్పుడును ననువాదవాఙ్మయముకంటె మేలుగ నుం
అనుభవవాఙ్మయమునకును ననువాద వాఙ్మయమునకును నడుమ
కరణ వాఙ్మయము గలదు. ఇందుఁ గవికిఁ గొంత యనుభూతి క
వీ లున్నది. కావుననే తమ కావ్యము శుష్కకాష్ఠమువలె నుండక
ముగ విఁకసిల్లవలె నని కోరు ననువాదకర్తలు కొంతవఱ కనుకర
రణిలోనికి దిగుచుందురు. నన్నయాదు లవలంబించినపద్ధతిని దిలకి
వారు మహాకవులు; వారు సంస్కృతభారతమును దెలుఁగులోనికి య
మూలముగ దింపవలె ననియే కోరుచో వారికిఁ గల కవితాశక్తి కే
వినియోగ ముండదు. అపుడు వారిశిల్పచాతుర్యము మాత్రమే
టఁ బడును. మూలములోనిపదమునకుఁ దగినపదము వేయుట, మూ
ములోనిలాలిత్యమును గాని గాంభీర్యమును గాని, తెలుఁగులోఁ గ
చుట మున్నగున వన్నియు శిల్పికృత్యములే కాని కవితాకృత్య
కావు. ఇవి కవికృత్యములే యని చెప్పినపుడు కవికూడ శిల్పియే
మన మంగీకరించుచున్నా మని యర్థము. నిజమైన కవిత్వము రస
ణలో నుండును. అలంకారములను బెట్టుటలో నుండును. ధ్వని,
గ్యము మున్నగుశోభలను దెచ్చుటలో నుండును కేవలానువాద
మూలాదృష్టములైన వీనిని గావించుట కధికారము లేదు. ఇట్లు య
మూలానువాదముఁ గావించువారికి శిల్పచాతుర్యమునే కాని క
కౌశలమును గన్పఱచు నవకాశము గలుగదు, కావుననే, నన్న
మహాకవులు తమకవితను గూడఁ బ్రదర్శించుటకై యథామూల
బోవుపద్ధతిని విడిచిపెట్టిరి. ఇది వారియహంభావమును సూచించు
తలంపరాదు. వారికి మనపైఁ గల యపారప్రేమయే వారి నిట్లు చే
బ్రోత్సహించినది. మన మందఱము వారి కావ్యములను జదివి య
దింపవలె నన్నచో వానిలో జీవ ముండవలెను. జీవ ముండవలె నన్న
నవి భావోద్రేకము ధారముగఁ జేసికొని బయలుదేఱవలెను.
కావలె నన్నచో వారు కొంతవఱకుఁ దమకవితావిహంగమము

రెండు ఱెక్కలను విప్పి విహరించుట కవకాశమును గల్గింపవలెను. పంజరములోని పిట్టవలెనే యథామూలానువాదకుని కవితావిహంగమమును రెండు ఱెక్కలను విప్పి విహరింపంజాలదు. ఇట్టి విహారావకాశమును గొంతవఱకుఁ గల్గించుకొనుటకే నన్నయాదులు కొంతవఱకు స్వతంత్ర మార్గమును ద్రొక్కిరి. కాని ముఖ్యవిషయములలో వారు మూలభారతమునకుఁ గట్టుపడకపోలేదు. దానికుఁ గట్టఁబడి యుండుగో వేవిధముగఁ గట్రాట కనతిదూరములోనే యుండి తన కంఠంబా మైనంతమేరలో యథేచ్ఛముగ మేఁత మేయునో యట్లే యీకవిపుంగవులును మూల విరాట్టగు పంచమవేదమునకుఁ గట్టువడి యుండి దాని కనతిదూరములోనే తిరుగుచుఁ దమకవితాశక్తినిఁ గన్పఱచియున్నారు.

ఈపద్ధతికి భిన్నమైనపద్ధతిలో నేఁడు కొంతయనువాదవాఙ్మయము బయలు దేఱుచున్నది. కీ. శే. వావిలికొలను సుబ్బారావుగారి రామాయణము యథామూలముగనే వ్రాయఁబడినది. అట్లే మహామహోపాధ్యాయ శ్రీపాద కృష్ణమూర్తి శాస్త్రులవారును నించుమించుగ యథామూలముగనే భారతము నాంధ్రీకరించిరి. ఋషిప్రోక్తములైన గ్రంథములలోని ధర్మముల నెఱుఁగఁ గోరువారికిని జారిత్రకపరిశోధకులకును నీ గ్రంథము లుపయోగించును.

ఇంతవఱకును నాంధ్రములోనికి వేద మనువదింపఁబడక పోవుట మిగుల శోచనీయము. కొందఱు పూర్వాచారప్రియులు వేదము నాంధ్రీకరించుటను బ్రతిఘటించుచున్నమాట వాస్తవమే, కాని, యీప్రతిఘటనలో న్యాయము గన్పట్టదు. ఇట్లు ప్రతిఘటించువారు మూఁడుకారణములను దెల్పుదురు. (1) వేదమును దేటతెల్లముగ వ్రాయుచో జనులకు దానియందలి గౌరవము తగ్గును. (2) వేదార్థమును గ్రహించి వివరింపఁ దగినవా రిపు డున్నారో లేరో యనునదియే సందేహాస్పదము. కనుక నసమర్థుల చేత వేదము ననువదింపఁ జేయవలసియుండును. (3) వేదమాంధ్రములోని కనువదింపఁజేయఁబడుచో వేదార్థశ్రవణాధికారము లేనిస్త్రీశూద్రాదులుకూడ వేదార్థమును జదువుకొనుటకు వీ లగును. ఈ మూఁ డాక్షేపణములలో నొక్కటియు నిలుచునది కాదు. (1) వేద

ముఁలో నున్న ఘనవిషయములను దెలిసికొనినపుడే ప్రజలకు దానియం నిజమగు గౌరవము గల్గును. (౨) ఆంగ్లము మున్నగు భాషలలోనికి వే ము లిదివఱకే యనువదింపఁబడియున్నవి. ఆయనువాదములను బ్రజ చదువుకొనుచున్నారు. తెలుఁగులోఁ గూడ నాయాయవసరములను బ వేదమంత్రముల కెవరికిఁ దోఁచిన లేక, యెవరికి వీ లైన, యర్థము వారు వ్రాయుచున్నారు. ఇం దెవరుచెప్పెడియర్థము గ్రాహ్యమో పా ఠులకుఁ దెలియుటకు వీలులేదు. కనుక సర్వజనవిదితమైన వైదికసా త్యముఁ గలమహావిద్వాంసులచే వైదికవాఙ్మయమున కంతకును నా ధ్రములో ననువాదము వ్రాయించి ప్రచురింపవలసినయావశ్యకత డెంతయో కలదు. ఇట్టిపనిని జేయించుట కాంధ్రసాహిత్యపరిషత్తువం మహాసంస్థలే సమర్థములు. (౩) గ్రంథము లేనాఁడు ముద్రితములు జొచ్చినవో యానాఁడే విజ్ఞాన మంతయు విశ్వప్రజాధీన మైనది. వేదము యాంగ్లభాషాన్తరీకరణములను మ్లేచ్ఛులు మొదలైన యన్యమతస్థు చదువుచుండఁగా వేదస్థవిషయమును స్త్రీశూద్రాదులకుఁ దెలియనీ కుండ యత్నింపవలె ననుట మౌఢ్యము. కావున వేదముల యనువాద లేకుండుట యాంధ్రసారస్వతమున కొకగొప్పలోటు.

షట్ఛాస్త్రములు, షడ్దర్శనములు, స్మృతులు మున్నగుసమ ర్యవాఙ్మయమును గూడ నాంధ్రములోని కవతరింపవలసియున్నది.

మొదట మనము సంస్కృతగ్రంథముల ననువదించుకొంటి పిమ్మట నాంగ్లగ్రంథముల నెత్తికొంటిమి, తరువాతఁ గొంతవఱకు బం గాగ్రంథములవైపుఁ దిరిగితిమి. ఇపుడిపుడు హిందీపుస్తకములను బ ర్తన చేయుచున్నాము. భారతదేశములోని వివిధరాష్ట్రములవా భాషనుండి మఱికొన్ని గ్రంథములను బరివర్తనముఁ జేసికొనుచో వి రాష్ట్రములనడుమ నున్నయంతరము తగ్గి పరస్పరావగాహన మే సామరస్యము గల్గును. కాన నట్టిభాషాన్తరీకరణము లత్యవసరము. ధరాష్ట్రసారస్వతవిషయములను బ్రచురించి భారతదేశములోని వి ప్రాంతముల నున్నసారస్వతసేవకులలోఁ బరస్పరావగాహనమును వ్యా పింపఁజేయుటకుఁ బూనుకొనిన "హంస" "Indian PEN" అను డుపత్త్రికలును నభినందనార్హములు.

అనువాదకుఁడు మూలరచయితయొక్క భావములను బూర్తిగాఁ దెచ్చుటయే కష్టము. మూలరచనలోని భాషాసౌందర్యమును దెచ్చుట మఱింత కష్టము. సంస్కృతగ్రంథములను దెనిఁగించువా రెన్ని తత్సమపదములను వేసినను మూలగ్రంథమాధుర్యమును దేలేకున్నారు. అంతియే కాక సంస్కృతశ్లోకములలోని వృత్తములమాధుర్య మసమానము. ఆమాధుర్యమును దెనుఁగుపద్యములలోనికిఁ దెచ్చుట యసాధ్యము. మేఘసందేశమును దెనిఁగించువా రెవరైన నామందాక్రాంతావృత్తమాధుర్యమును దెనుఁగులోనికి దింపఁగలరా యనునది పెద్దసందియము. శ్రీ అనంతవంతుల రామలింగస్వామిగారు కాళిదాసకృతమేఘసందేశమును బాటలరూపమున ననువదించియున్నా రనివినుచున్నాను. అదియునొక నూతనపద్ధతియే.

మొత్తముపై ననువాదవాఙ్మయవిషయములో నాంధ్రము హిందీ, బంగాళీ మున్నగుభాషలకంటె వెనుకఁబడి యున్న దనుట నిస్సందేహము. సంస్కృతవాఙ్మయములోని ప్రధానగ్రంథముల నైనను మన మింతవఱకు నాంధ్రీకరించుకొనలేము. శాకుంతలనాటక మాంగ్లములోనికి 1790 వ సంవత్సరములోనే యనువదింపఁబడినది. దానికి నొకశతాబ్ది పిమ్మటనే కాని మన మానాటకరత్నము ననువదించుకొనలేము. ఇట్టివిషయములు మనకు లజ్జావహము లేకదా! నేఁటికిఁ గూడ వివిధశాస్త్రములలోనిపాఠ్యగ్రంథము లాంధ్రములోనికి రాలేదు.

తెనుఁగులో గ్రంథములు వ్రాయఁబడి ముద్రింపఁబడినను దానిని గొనువారు చాలఁ దక్కువగ నుండుటచే రచయితలకుఁ గాని, ప్రకాశకులకుఁ గాని, యార్థికముగ లాభము గల్గుటలేదు. అందునను గ్రంథము పెద్దదై విలువ హెచ్చగుచోఁ గొనువారు మిక్కిలి యరుదు. కనుకనే యుద్గ్రంథములకుఁ గూడ నాంధ్రములో సంగ్రహానువాదములు వెల్వడుచున్నవి. అనువాదమే మూలమునకు సాధారణముగ నన్యాయముఁ జేయును గదా! అందునను సంగ్రహానువాద మెంత మూలదూరముగ నుండునో వేఱుగఁ జెప్పవలెనా? ఒక్కొక్కప్పుడీసంగ్రహానువాదములు మూలగ్రంథకర్త ప్రతిష్ఠను దగ్గించునవిగఁగూడనుండును. కావున సాధారణముగ సంగ్రహానువాదపద్ధతి ననుసరించుట సమంజసముకాదు.

# ముష్టాముష్టిప్రయోగ విచారము.

కిళాంబి రాఘవాచార్యులుగారు ఎం. ఏ., బి. ఎల్., కాకినాడ.

నన్నయభట్టారకుఁడు మహాభారతారణ్యపర్వమున (ఆశ్వా. 1-395) 'భీమాసురవీరుల ముష్టాముష్టిరణచ్ఛటాచ్ఛటశబ్దా బుద్ధా... బై' యని ప్రయోగించెను. దీని నిటీవల భారతిలో (ఈశ్వర-మా... శీర్ష సంచిక) బ్రహ్మశ్రీ మల్లాది సూర్యనారాయణశాస్త్రిగారు నిరంకు... మని యధిక్షేపించిరి. ఇందులకు శ్రీ కోరాడ రామకృష్ణయ్యగా... శ్రీపాద లక్ష్మీపతిశాస్త్రిగారు నాంధ్రపత్రికయందు నన్నయ యథేష్ట... గఁ బ్రయోగించి యుండలే దనియు నది సంప్రదాయసిద్ధమే యని... సమాధానమును వ్రాసియున్నారు ముష్టాముష్టిశబ్ద మసాధు వని... పు రింకను సంశయించుచున్నారు. శ్రీనాథుని కాశీఖండమున (5-15...

కం. ఆహవముచేసి రంగజ
మోహాంధులు గడిమి మెఱసి ముష్టీముష్టిన్
బాహాబాహిఁ గచాకచి
సాహసముఁ జలంబు దివిజసంఘము పొగడన్.

అని వావిళ్ళవారి ప్రతిలో ముద్రితపాఠము (పు 269) ... యాపుటలోనే 'అన్నిమాతృకలలో ముష్టాముష్టిన్ అని యున్న... ప్రమాద మని సవరింపఁబడినది' యని పరిష్కర్తలు వ్రాసియున్నా... సాహిత్యపరిషద్భాండాగారమునఁ గలప్రతులలో ముష్టాముష్టి యని... కలదు. దీనినిబట్టి పరిష్కర్తలు పొరపడి గ్రంథము నెట్లు దిద్దిరో ... మగుచున్నది. హరవిలాసమున (ఆశ్వా 7-86) ముష్టీముష్టిరణ... చేసిరి యసన్నోహప్రకారంబులన్- అని ముద్రితము. ఇదియు వా... వారిచేఁ బరిష్కృతమే. రెండుగ్రంథములకును బరిష్కర్త లొకరే ... విలాసపు వ్రా. తప్రతులఁ గూడ ముష్టాముష్టియే యుండు నను... ను. పండితు లవలోకింతురుగాక.

ముష్టాముష్టి ప్రయోగమును గూర్చి సిద్ధాంతకౌముదియందు 'తత్ర తేనేద మితి సరూపే'(2 2-27)అన్యేషా మపి దృశ్యతే(6-3-137) అను సూత్రముల వ్యాఖ్యానమున 'దీర్ఘ ఇ త్యనువర్తతే కేశేషు కేశేషు గృహీ త్వేదం యుద్ధం ప్రవృత్తం కేశాకేశి- దణ్డైశ్చ దణ్డైశ్చ ప్రహృ త్యేదం యుద్ధం ప్రవృత్తం దణ్డాదణ్డి- ముష్టీముష్టి' అని కలదు. అందులకుఁ దత్త్వబోధినీకారులు వ్యాఖ్యాన మొనర్చుచు 'ఆత్వంవానచి' ఇత్యుక్తమ్- తత్ర ఆత్వం వా ఇ త్యపాణినీయమ్. ముష్టాముష్టీత్యుదాహరణ మప్యప్రామాణికమేవ అతఏవ ఏతచ్చ మనోరమాయాం స్పష్టమ్." అని వివరించిరి. ప్రాచీను లిటులు వ్రాసియుండ నవీనులు పొరపడి రనుట వింత కాదు. వైయాకరణమతములు పెక్కులుగలవు. శాకటాయనస్య, శాకల్యస్య మొదలగునని యష్టాధ్యాయియందు మనకుఁ బరిచితములే. ఆయా సంప్రదాయములను భిన్నమతములను గమనింపక మనము కవులను నిరంకుశు లనుట సమంజసము కాదు.

విశ్రామశబ్ద మపాణినీయ మని శంకించి 'తత్రవిశ్రామహేతోః' అను మేఘసందేశప్రయోగమును జాంద్రవ్యాకరణముచే మల్లినాథసూరి సమర్థించుట మనకు విదితము. అటులే 'అవతరావచాయశబ్దయోర్దీర్ఘహ్రస్వవ్యత్యాసో బాలానామ్' అని వామనుని కావ్యాలంకారసూత్రవృత్తి. (5-2-48) కాని మహాకవి కాళిదాసుఁడు రఘువంశమున 'మాభూత్ పరీవాదనవావతారః' అని ప్రయోగించెను. ప్రౌఢిమాదిశబ్దములు నట్టివే.

ముష్టాముష్టిశబ్దము నిఘంటువుల కెక్కిన దనియును నందులకుఁ బ్రమాణము బోపదేవుఁ డనియు శ్రీలక్ష్మీపతి శాస్త్రిగారు వ్రాసిరి. శబ్దకల్పద్రుమమున నిట్లు కలదు:—

'ముష్టీముష్టి- ముష్టాముష్టి- ముష్టిభి ర్ముష్టిభిః ప్రహృత్య యద్యుద్ధం వృత్తం తత్ - కిలాకిలి ఇతి భాషా ఇతి ముగ్ధబోధవ్యాకరణమ్' ముగ్ధబోధ పదియవశతాబ్దమున కిటీవలిగ్రంథము. దానిచే నన్నయాదుల సమర్థించుటకు వీలుకాదు. శాకటాయన సూత్రముల 'ఆదిజాతే'

అనుసూత్రము కలదు. (పుట 88 సమాససంగ్రహః సూ. 38 శాక
యనవ్యాకరణము Edited by Gustev Oppert 1893.) దా
నభయచంద్రసూరి తనప్రక్రియాసంగ్రహ మను వ్యాఖ్యానమున
వ్రాసెను. 'ఇజంతే ఉత్తరపదే పూర్వపద స్యాద్ భవతి। కేశా
దణ్డాదణ్డి ఏవం ముష్టాముష్టి ఖడ్గాఖడ్గి ప్రభృతయః । బహుల
రాత్ క్వచిదాకారో నభవతి' దీనినిబట్టి ముష్టాముష్టిప్రయోగ
సాధువే యగునుగదా. ఇజంత ముత్తరపద మైనచోఁ బూర్వపద
కాత్వ మీసూత్రమువలన సిద్ధించుచున్నది. ఈశాకటాయనుఁడు క్రీ
7, 8 శతాబ్దములవాఁ డనియుఁ బాణినీయమున నుదహరింపఁబడిన
టాయనుఁడు కాఁడనియుఁ దోఁచుచున్నది.

హేమచంద్రుఁడు తన సిద్ధహేమచంద్ర మను వ్యాకరణ
నిట్లే విధించె ననియు నంశుల కుదాహరణముగాఁ దన ద్వ్యాశ్రయ
వ్యంబున 'యష్టాయష్టి యష్టీయష్టి యను ప్రయోగాంతరముల
నియు శ్రీవల్లె పూర్ణప్రజ్ఞాచార్యులవారు తమ భారతలఘుటీకయం
వ్రాసిరి. అందే పాణినీయమతానుసారముగ ముష్టాముష్టిప్రయోగ
సాధింప నగు ననియును, తత్ర తేనేద మితి సరూపే- అనుసూత్ర
తేన + అ + ఇదమ్ అని విభజించి, యాకారమును బ్రశ్లేషించినఁ
చోటులఁ బూర్వపదంబున కాత్వము వచ్చు నని ముష్టాముష్టిప్రయో
మును శ్రీనాగేశభట్టు తనభాష్యప్రదీపమున నుదహరించె ననియు
వ్రాసిరి. కాని భాష్యప్రదీపమున నిదియపాణినీయ మనియును
ప్రశ్లేషించుట భాష్యకారకైయటులకు సమ్మతము కాదనియును,
త్యాదుల నిది యప్రసజ్గ మనియు వ్యాఖ్యాన మొనర్పఁబడినది.
బోధయాదును, బాలమనోరమయందును నపాణినీయ మని నిరా
బడినది.

బాహాబాహిప్రయోగమును ముష్టాముష్టివంటిదే. పూర్వ
బున కాత్వమును విధింపనిచో నిది బాహాబాహి యన
చ్చును. గాని బాహాబాహి యనునది కూడ సుప్రసిద్ధప్రయో
పై శ్రీనాథుని కాశీఖండపద్యమునఁ నిదియుఁ గలదు. ఈసందర్భ

గర్ణాటభాషాసంప్రదాయముకూడ నట్టిదనుటకు శబ్దమణిదర్పణభాగము నుదాహరించి శ్రీలక్ష్మీపతిశాస్త్రిగారు బోపదేవుఁడే ప్రమాణ మని ముగించిరి. శాకటాయనమతము నుదాహరించి యుండలేదు. సంస్కృత సారస్వతమున నీప్రయోగము క్వాచిత్కముగఁ గలదు. నిర్ణయసాగర ముద్రిత మగుమహావీరచరితమున ముష్టీముష్టి యనియే కలదు.

ముష్టీముష్టి కచాకచి ప్రహరణ ప్రక్షేప మూఘాత్మభిః.

(అంక 6-31.)

కాని తోడరమల్లుగారిచేఁ బెక్కువ్రాతప్రతుల యాధారమునఁ బ్రకటింపఁబడిన గ్రంథమున (Oxford University Press 1928) ముష్టాముష్టి యనియే ముద్రింపఁబడినది. అందులకుఁ బాఠాంతరము లున్నటులు వ్రాయఁబడియుండలేదు అదియే సరియగు పాఠ మని తోఁచెడిని.

సంస్కృతముననే కాక యాంధ్రమునఁ గూడ నీప్రయోగ మచటనచటఁగలదు. నన్నయశ్రీనాథుల ప్రయోగములు మీఁదనుదాహరింపఁబడినవి. భాగవతమునఁగూడ నీప్రయోగము ప్రాచీనముద్రణములఁ గలదనియు నది యిటీవల మార్పఁబడిన దనియు శ్రీరావుసాహెబు గిడుగు రామమూర్తిపంతులవారు వ్రాసియున్నారు. వావిళ్లవారు 1912 లో ముద్రించిన భాగవతమున 'ముష్టాముష్టి' యనియే ముద్రించి యిటీవల ముష్టీముష్టి యని దిద్ది ప్రకటించిరి. కాని శ్రీరామమూర్తిపంతులుగారు వ్రాసినటు లీప్రయోగ మాంధ్రభాషాస్వభావానుసారముగ వచ్చియుండలేదు. చెకాచెకి, ఎగాదిగ వంటిది కాదు. సంస్కృతభాషాసంప్రదాయసిద్ధము. శాకటాయనభిన్నమతానుసారము సాధువే యగును. అసాధువు కాదు. ఈప్రయోగము నన్నయ నిరంకుశత్వమును సూచింపదు. ఇంకను సంస్కృతాంధ్రసారస్వతములఁ బ్రయోగాంతరములు లభ్యమగుచో ముందుఁజూపుదును.

# గ్రంథస్వీకారము.

## 1. అనర్ఘరాఘవము.

### మురారికవిరచిత సంస్కృతమునకుఁ దెనుఁగు.

కీ. శే. సత్యవోలు కామేశ్వరరావుగారిచే రచియింపఁబడినవి. ఐదంకములు మాత్రమే. ఒకవిశేషము- పాఠకులకు మూలవిషయము గూడఁ దెలియుటకై యెడమప్రక్కను సంస్కృతమును గుడిప్రక్క దెనుఁగును జేర్చి ముద్రింపఁబడినది. పాఠభేదములు దేశభేదములచే మూలగ్రంథమున వివిధరీతులఁ గొన్నిప్రతులలో నున్నవి. వానిని విడిచి చూచినచో నిందుఁ గొన్ని సాధారణలోపములు గనఁబడుచున్నవి. మూలములోఁ బ్రాకృతమునకు మాఱు ఛాయ సంస్కృతముననే ముద్రించినారు. వేదములోఁగూడఁ బ్రసిద్ధుఁడైన శునశ్శేఫుఁడు మొదలగు పేరులు. ఈ కవిగారి కసహ్యముగాఁ దోఁచి హ్రస్వబాహుఁడు, వక్రనాసుఁడు, అని మార్చిరి. ఇవిమాత్ర మేమంత చక్కఁగా నున్నవో; నైజముగ వారికి వారా-యనుసంశయము కలుగును. అజామీఢుఁ డను పేరు నేమిచేయుదురోగదా !

"స్వస్తిభవతే సపరివారాయ" (పుట 23) దీనికిఁ దెనుఁగులేదు. 'విహస్య' (పుట 90) నవ్వి యనలేదు. ఇతియథోచిత ముపవిశతః (పుట 96) దీనికిఁ దెనుఁగులేదు. ద్వితీయాంకములో (పుట 98)

యతో౽స్తమేష చరమాచలచూడచుమ్బి<br>
పఙ్కేరుహప్రకరజాగరణప్రదీపః<br>
అః సర్వతః స్ఫురతు కైరవమాః పిబన్తు<br>
జ్యోత్స్నాకరమ్బ ముదరమ్భరయశ్చకోరాః.

ఈశ్లోకము గనఁబడదు. అనుబంధములోఁ జేర్పఁబడలేదు.

"సర్వతో౽వలోక్య. వత్సలక్ష్మణ-" అనువాక్యమునుగొంత (పుట 98-99) క్రిందిపద్యములోఁ గలిపివేసినట్లున్నది. (పుట 104-105) "అల్పకించి సాభిప్రాయముగా" అని తెనుఁగులో నున్నది. దానికి మూలము లే

దు. (పుట 108) "జగద్గురో గాధినందన" దీనికిఁ దెనుఁగు లేదు. వశిష్టు,
వసిష్ట, వసిష్ఠ, వశిష్ఠ-ఇట్లు నియమరహితమగు పొరపాట్లు కొన్నిగలవు.
(పుట 90-91) "కథం రజనీచరవినాశోత్థ్సాపనసంస్థుల మార్యహృదయ
మతి దీర్ఘదర్శినం కౌశిక మపి న సమ్భావయతి" ఇది ప్రస్తుతపుస్తకము
లోనిది-బొంబాయి ప్రతిలో-"కథం రజనీచరచక్ర వినాశోత్థ్సాపనసంస్థుల
మార్యహృదయ మదీర్ఘదర్శినం భగవన్తమ్ కౌశికమపి సమ్భావయతి."
దీనిలో నౌచిత్య మేదో విచారింతురుగాక.

ఈపుస్తకమునకు శ్రీజయపురమహారాజు "లాశయము"ను రచించిరి. శ్రీమాన్ ఈయుణ్ణి వేంకటవీరరాఘవాచార్యులుగారు, ఎం. ఏ, "అవతారిక" రచించిరి. దానిలో మురారికవింగూర్చి విశేషములు దెలియఁగలవు. శతావధాని బ్ర॥ చెళ్లపిళ్ల వేంకటశాస్త్రిగారుపోద్ఘాతమును రచించిరి. దానిలో ననర్ఘరాఘవము దాని యాంధ్రీకరణములు నితర కవుల యాంధ్రీకరణముల తారతమ్యములుం దెలియవచ్చును.

కీర్తిశేషు లగు కామేశ్వరరావుగా రిదివఱ కెన్నో గ్రంథములను రచించుటవలన విఖ్యాతపురుషులు. వీరికొమాళ్లు శ్రీలక్ష్మీసత్యనారాయణరావుగా రీగ్రంథము నచ్చువేయించి లోకోపకార మొనర్చిరని సంభావించుచున్నారము.

దీనివెల రు ౧. సత్యవోలు లక్ష్మీనారాయణరావు,
బి. ఏ., బి. యల్. గారికి-కాకినాడ వ్రాయవలయును.

---

## 2. అమరుకకావ్యము.

శిష్టు సర్వశాస్త్రి ప్రణీతము—ఆంధ్రవాచస్పతి కొట్ర శ్యామల
కామశాస్త్రిగారు ప్రకటించినది.

కవి దీనిని "అమృగ"కావ్యమన్నాఁడు. అమరుక, అమృగనామముల భేదమెఱుంగఁదగినది. ఇట్లే చంపూకావ్యము జంబూకావ్యములం గూర్చి-వేత్తల నడుగవలసియున్నది. "ఎలమి రచింపనేర్పరివి యెన్నిక నీయమృగోక్తకావ్యమింపలర"-అని 14 వ పద్యములో వాడఁబడినది. ఈ చిన్నిమనోహరకావ్యమున కిదివఱ కెన్నొ యాంధ్రీకరణములు ప్రకటిం

వఁబడినవి. శిష్టు కృష్ణమూర్తిశాస్త్రిగారి కుమారుఁడు రచించుటచే, యొక ప్రశస్తాంధ్రీకరణ మగుచున్నది. ఇట్టిదానిలోఁ దప్పు లమిత ముగాఁ బడినవి. అవి, కేవలము వ్రాఁత ప్రతిలో నున్నది యున్నట్లుగా నచ్చు యుటచే వచ్చిన పెద్దలోపము. గుజలీ ప్రతులవలెఁ దప్పులు దిద్దుకొంచు యచ్చువేసి రనవచ్చును.

ఈ గ్రంథమునకు శ్రీ నిడుదవోలు వేంకటరావు బి. ఏ. గారు స్వానుభవమున ౧౪ పుటల పీఠికను వ్రాసి గ్రంథముఖమున కలంకార సమర్పించిరి. దీనిలోఁ బూర్వాంధ్రీకర్తలనుగూర్చియుఁ గవివంశాదికము గూర్చియు విశేషముగఁ జర్చింపఁబడినది. ప్రారంభము గాన మరల నిప్పు చక్కగా దిద్ది ప్రకటించినఁ జాలఁ బ్రశస్తముగా నుండును.

దీని వెల రు 0-4-0. ప్రకాశకులయొద్ద- కాకినాడ సమీపములోని కరపలో దొరకును.

## 3. The Oriental Literary Digest.

Edited by Dr. S. M. Katre, M. A. PH. D., Poona.

This is a very useful monthly started in Poona by the above Editor in collaboration with scholars like Sukthankar, De, G... and others. The object is to review from time to time the new books published on oriental subjects in a critical manner. We are sure the Journal will become very popular with all students of Indology and other branches of oriental learning. The annual subscription is Rs. 3/-

ఈ పత్రిక పూనాలో ప్రాచ్యగ్రంథ విమర్శనమునకై నూతనము స్థాపింపఁబడినది. మాసమున కొకసారి వెలువడును. మనదేశమునఁ బండి తులగు సుక్థంకరు, డే, మొదలగువారి సహాయమున నిది నడుపఁబడు చున్నది. ప్రాచ్యపరిశోధనావిషయములను గూర్చిన గ్రంథములను వారి ప్రామాణ్యమును గ్రహింపఁబోవువారి కిది మిక్కిలి యుపయోగకరము.

చందా సంవత్సరమునకు రు 3-0-0.

### 4. దశమస్కంధము.

తాండవకృష్ణభాగవతము- బ్రహ్మశ్రీ జనమంచి శేషాద్రిశర్మగారిచే రచింపఁబడినది. వెల రు. 4-

గ్రంథకర్తలు సుప్రసిద్ధులు- దత్తమండల కవీశ్వరులు- కావ్యస్మృతి తీర్థ బిరుదాంకితులు- బ్రహ్మాండపురాణాదిబహుగ్రంథనిర్మాతలు, శ్రీమద్రామాయణాంధ్రీకరణానంతరము శ్రీకృష్ణచరితమును రచియింప సంకల్పించి మూలగ్రంథమునఁగల విశేషవిషయములఁ జేర్చి సారమును గ్రహించి మూలమును వదలక శ్రీమద్భాగవతమున దశమస్కంధము నాంధ్రీకరించితి మని పీఠికలో వ్రాసియున్నారు. భాగవతార్థరహస్యములను వివరించుటయే వీరియాశయము. వీరికవిత్వశైలి నాతికఠినము. పోతనభాగవతముతో నిట్టిగ్రంథములఁ బోల్పఁ జనదు. పూర్వకవుల యాంధ్రీకరణోద్దేశము వేఱు. మూలగ్రంథమునందలి విషయమును గ్రహించి కొన్నిఘట్టముల విడిచి రసపోషకము లగువానిని స్వకవితానుగుణ్యముగఁ బెంచి యాంధ్రీకరించిరి. పోతనభక్తిపారవశ్యరసపోషణాదికములు మనకు మైమఱపు పుట్టించి తన్మయ మొనర్చును. గ్రంథకర్తలును దమశక్త్యనుసారము లలితకవనమున శ్రీకృష్ణచరితమును మూలగ్రంథవ్యాఖ్యానానుసారముగ వ్రాయుటయు యుక్తమే. రామకృష్ణచరితముల ననేకులు రచించుచుండుటకు వారిగుణోత్కర్షతయుఁ బూజ్యతయుఁ గారణములుగదా. "స్వసూక్తీనాం పాత్రం రఘుతిలక మేకం కలయతాం, కవీనాం కోదోషః" అనుజయదేవునిసూక్తియిప్పట్టుల సార్థకమగుచున్నది. శ్రీశర్మగారు బాల్యమున, తాండవకృష్ణాభిధానులఁట. అందుననే యీగ్రంథము తాండవకృష్ణభాగవతమనఁబడినది. గ్రంథమును గృష్ణాంకితము. మచ్చునకొకపద్యము—

చ. గలగల మ్రోగు నందియలకాంతుల నగ్రతలంబు గ్రమ్ముచున్
వెలికిని బాఱుచుండ నొకవింతగఁ బాదము లుర్వి మోపుచున్
లలితమరాళరాజగతులన్ మఱపించు గతుల్ చెలంగ గా
లలనయు శ్యామనాఁ దగి విలాసము మూర్తిధరించినట్లుగన్.

5. సర్వమంగళాపరిణయము— శ్రీకావ్యస్మృతితీర్థ జనమంచి శేషాద్రిశర్మగారిచే రచింపఁబడినకావ్యము. బ్రహ్మపురాణమునఁ గలపార్వతీవి

వాహాఘట్టమును గైకొని పెక్కు మార్పులతో రచియింపఁబడినవి (అ
32,33,34). మూలకథ శివునియాధిక్యతను దెలుపుటకై పార్వతీస్వ
వరంబునఁ బార్వతియంకమున నున్న బాలుని శివుఁడు తక్క నొరు
సశక్తులై రనియు, శివుఁడు దేవతలకు స్వమాహాత్మ్యముచే బాహు
భన మొనర్చుటయుఁ, బార్వతి యతనివరించి పాదములఁ గుసుమము
నర్పించుటయు వర్ణితము. శర్మగారు హరిహరాదుల యైక్యము నెఱిం
నారదునిఁ బడరానిదుర్దశల ననుభవింపఁజేసి పార్వతిని వరింప శ్రీహ
బయన మొనర్చి కథాభాగమును మార్చిరి. నారదుఁ డిం దనుభవిం
దుర్దశలఁ గాంచినఁ బగతురకేనియుఁ గరుణ కలుగక మానదు. మా
జెందిన కథాభాగముల రసపోషణము కొంత కొఱవడియున్న దన
యున్నది. హరిహరాదుల యైక్యమును గవిగారు వారిచేతనే పలికి
శ్రీనాగపూఁడి కుప్పుస్వామయ్య గారు వివిధవిషయములఁ జర్చించి
లమగు పీఠికను రచించిరి.

6. మనుచరిత్రహృదయావిష్కరణము-కవి-శ్రీజనమంచి శేష
శర్మగారు మనుచరిత్రము ప్రబంధములలో నుత్తమస్థానమును వహిం
చిన దగుట నద్దానిని విమర్శించి పెక్కువిషయముల మన కీగ్రంథ
దెలిపియున్నారు. వానితోఁ గొన్నివిషయముల మన మేకీభవింపఁజా
ల్ననును, వారిప్రయత్నము శ్లాఘాపాత్ర మనఁ దగి యున్నది. పెద్ద
స్థానాదికములు, పాఠభేదములు మున్నగునవి వివరింపఁబడినవి.
కాలప్రశంస సమర్థింపఁబడినది. గ్రంథకర్త 'లాకాశరామన్న వంచా
లను వదలి ముఖ్యవిషయములనే చర్చింపఁబూనిరి కాని కొన్నిస్థలము
నవియే దొరలినవి. 'దోసెఁడుకొంపలోఁ బసులక్రొక్కిడి' (పుట
'వరుఁడు చెఱఁగుపట్టుకొని...' (పు. 30) పీఠికకి సంబంధించిన గా
పుక్కిటిపురాణములు. విశ్వాసార్హములు గావు. మార్కండేయపు
మునఁ గలమూలకథ వచనరూపమునఁ దెలుపఁబడినది. 'మారన
మును జెంత నునుచుకొని యందలిచమత్కృతుల సంగ్రహించి ప్రాస
వాదము నిస్సార' మని తెల్పుఁబడినది, మారన ననుకరించె నన్న

నకు గౌరవలోప ముండ దనియే మానమ్మకము. శ్రీనాథుని నెన్నిస్థల ములఁ బెద్దన తనగ్రంథమునఁ దలపింపఁ జేయుటలేదు ? మహాకవుల పోక డలఁ గైకొనిన నది న్యూనతాపాదకము గానేరదు. మనుచరిత్రమునందలి మొదటిమూఁడాశ్వాసములకథాభాగ వివరణములో విశేషార్థము లీయఁ బడినవి. 'అస్మద్గృహంబు పావనము చేసి' యనుచో గృహ మనఁగా దేహ మనియు, నర్మగర్భముగాఁ బలుకుయువతి యగుట 'నాదేహము పావన ముచేసి......' అని స్ఫురింపఁ బల్కె ననుట సరసముగా లేదు. ప్రతిపద మునకును ధ్వన్యర్థములఁ దెలుపఁ బూనిన నట్టియర్థములే వచ్చును. 'చిగురుకొమ్మైనఁజేవ' 'లేవణనౌదు నెనీరజేక్షణా' మొదలగువాని కీయఁబ డునర్థములు తప్పని సరియగు నర్థము లొనఁగఁబడియున్నవి. 'సతులమా యల్' అనుచో సతీశబ్దమును (పు. 123) గూర్చి వీరు వ్రాసినది సరికా దని తలఁతుము. అది 'చెలులమాయ లని' దిద్దనవసరము గాన్పింపదు. కవి దానిని బహువ్రతావాచకముగఁ బ్రయోగించియుండ లేదు. 'బాహుమూల రుచు' లనుచో వీరువ్రాసినది విమర్శనీయము. పెక్కువిషయము లీగ్రంథ మున వివరింపఁబడినవి. ఇట్టి వివరణములు ముఖ్యములగు ప్రబంధములకును భారతభాగవతాదికములకును రచింపఁబడవలయును. పుక్కిటిపురాణ ముల విడిచి రసపోషణాదికములనే యింకను విపులముగఁ జర్చించి, సాహిత్యప్రపంచముల నాయూకవుల ప్రాధాన్యమును నిరూపింపవలయు నని మాయాశయము దెలుపుచు శర్మగారి ప్రయత్నమును శ్లాఘించు చున్నాము. వెల 0-12-0 వావిళ్లవారిచేఁ బ్రకటితము:

7. తిమ్మరుసుమంత్రి:-కవి, శ్రీ చిలుకూరి వీరభద్రరావుగారు-వెల రు ౧-౦-౦. ఆర్యపుస్తకాలయము-రాజమహేంద్రవరము.

ఈగ్రంథము చరిత్రచతురానన బిరుదాంకితు లగు గ్రంథకర్తలచేఁ జిరకాలముక్రిందటనే రచింపఁబడి మరలఁ బ్రకటింపఁబడినది. సకలకర్ణాట రక్షావిచక్షణుఁ డగు తిమ్మరుసుమంత్రిని గూర్చియును, నాఁటివిజయనగర రాజులనుగూర్చియు, విశేషించి కృష్ణరాయనిగూర్చియుఁ బెక్కువిషయము లిందు వివరింపఁబడినవి. కృష్ణరాయని నిధనకాలము, తిమ్మరుసు కారా

గృహావాసమరణములను గూర్చి సహేతుకముగఁ జర్చింపఁబడినవి. పెక్కు స్థలముల గాథలపై నాధారపడి గ్రంథము వ్రాయఁబడినది. విషయ నాఫలితము లగు చారిత్రకవిషయములనే గయికొని యీ రీగ్రంథము రచించిన నింకను నుపయోగకరముగ నుండి యుండును. మహాపురుషుం తిమ్మయసు జీవితము నీగ్రంథరూపమున నాంధ్రలోకమున కందిచ్చిన శ్రీ తులుగారు ధన్యులు అట్టిమహాపురుషులజీవితములే లోకమున కాదర్శ యములు

8. ప్రత్యూషము. కవి, శ్రీ కొమరవోలు వేంకటసుబ్బారావుగా బి.ఏ. కాకినాడ. వెల 1-0-0.

ఆంధ్రసారస్వతమున నూతనమార్గముల నిరూపింపఁ బ్రాచీన తులఁ గల మెఱుఁగులను గ్రహించి తా మీగ్రంథమును రచించితి గ్రంథకర్తలయాశయము. జయపురసార్వభౌమున కంకితము ఆంగ్ల నిట్టిగ్రంథమును 'Allegory' అందురు. ప్రకృతివిషయముల గ్రహి వానికిఁ బాత్రత్వమును ఘటిల్లఁజేసి గ్రంథకర్త లీగ్రంథమును రచి పాఠకులకు సుగమముగ బోధపడుటకై పీఠికయందుఁ గథాసంగ్రహ ను నంతరార్థప్రశంసయుఁ గానింపఁబడినది. 'కవి భావమయశరీరము బరవీథి' నెగయుచు వ్రాసినటులఁ గలదు. పాఠకులును నామార్గము విహరించి యీ ప్రబంధమును జదివి యానందింపవలయును. గ్రంథ ప్రత్యూషమగుట నిం దైనమనోచులు గలవు. విషయ మస్పష్టముగ డుటచేఁ గవితయుఁ గొంత వడినది.

9. సత్యభామాసాంత్వనము—లింగనమఖి శ్రీ కామేశ్వరకవికృత శృంగారకావ్యగ్రంథమండలియందుఁ బ్రచురింపఁబడినది. పమనేడవ బ్దమునాఁటి కవిత్వము. తంజావూరు మధురరాజుల కాలమునాఁటి ర ప్రబంధములవలె శృంగారభూయిష్ఠము. మధురనాయకుఁ డగు ముద్దు ఘున కంకితము. విపరీత మగుశృంగారవర్ణనలచే నీకాలపుకవు లాంధ్ర కపయశస్సును జేకూర్చియున్నారు.

శ్రీ

# ఆంధ్రసాహిత్యపరిషత్పత్రిక.

## కాకినాడ.

రెండునెలల కొకసారి ప్రకటింపఁబడును.

సంపుటము. ౨౭ { బహుధాన్యనామసంవత్సరము. చైత్రవైశాఖమాసములు. } సంచిక ౧.

## మనవి.

ఈసంచికతోఁ బరిషత్పత్రిక యిరువదియేడవవత్సరము ప్రారంభించినది. స్థాపించినది మొదలు సలక్షణ మగునాంధ్రభాషకై తనశక్తికిఁ దగినటులు పాటుపడుచున్నది. పరిషద్భవనమున నమూల్యమగు పుస్తకభాండాగార మొకటి సమకూర్పఁబడినది. అముద్రితములగు గ్రంథములు కొన్ని ప్రకటింపఁబడినవి. ఇంకను బెక్కింటిని బ్రకటింపఁ బ్రయత్నము చేయఁబడుచున్నది. భాషాభిమానులు లెప్పటియట్లు తమ యాదరమును జూపఁగోరుచున్నారము. ఈశతాబ్దమునఁ బాశ్చాత్యవ్యామోహముననేమి, యితర కారణములచేనైననేమి మనసారస్వతము భిన్నమార్గములను జనుచున్నది. కేవలము నూతనత్వమే ప్రధానముకాదు. కవులు, గ్రంథకర్తలు, వ్యాసరచయితలుఁ దమబాధ్యతను దాము గుర్తెఱుఁగవలసియున్నది. నేటిగ్రంథములలోఁ బెక్కు లనుకరణములు. వానిలోఁ జాలభాగ మనుకరణ మని తెలియకుండునటులు గూడ రచింపఁబడుచున్నవి. పాశ్చాత్య సారస్వతపద్ధతుల నెంతవఱకు మనము గైకొనవలయునో, యవి యెంతవఱకు మనవాఙ్మయాభివృద్ధికిఁ దోడ్పడునో మనము విమర్శింపవలసియున్నది. పాశ్చాత్యదేశములఁ గల సాంఘికాదిపరిస్థితులు వేఱు. వాని ననుసరించి రచియింపఁబడిన కావ్యములు కొన్ని సహృదయరంజకములు

గా వని మనము తెలిసికొనవలసియున్నది. ఉన్నతాదర్శములు, స్వ
భాషాభిమానములు గ్రంథకర్తల కావశ్యకములు. ఖండకావ్యము
లలుఁ, జిన్నకథలు ననుకరణములుగ నుండక స్వతంత్రములుగ
యుత్తమభావములతో రచింపఁబడవలయును. పెక్కుకథలు గ్రంథక
బాల్జాక్, మాపసా మొదలగు ఫ్రెంచివారివ్రాఁతల ననుసరించుచు
వానిని గూర్చి విశేషముగ వ్రాయవలసినది లేదు. పాఠకలో
వానిని నిరసింపఁగలరు. నీతికిని గావ్యప్రపంచమునకును సంబం
లే దని వాదించు వారి కొక జోహారు. విమర్శకులును వ్యక్తి
లగువిమర్శనములను వదలి విషయ విమర్శనమునకే తమకాల
బుద్ధిని వినియోగింపవలసియున్నది. తమకుఁ దోఁచునటులు వ్రా
గవులు, వ్యాసకర్తలును 'యేనామకేచి దిహ' యనుకొనుట య
యినది. 'సమకాలమువారలు మెచ్చ' రని విచారింపవలసి వ
న్నది. సాహిత్య మొకకాలమునకుఁ జెందినదికాదు. అందునసే
వేలసంవత్సరములు గతించినను కాళిదాసాది ప్రాచీనకవు లికను
త్యప్రపంచములో దేదీప్యమానులై వెలుఁగొందుచున్నారు.
లును గ్రంథకర్తలును వారివలెనే యమూల్యములగుగ్రంథముల
టకు యత్నించి యాంధ్రవాఙ్మయవికాసమునకుఁ దోడ్పడుదురు

# నేటివిద్యావిధానము—మాతృభాష. *

తనస్నేహితుని కొక గొప్ప భవనమును నిర్మించుటకుఁ బూను కొనిన యొకమనుష్యుని నే నెఱుఁగుదును. మంచిపనివాండ్రను, నిర్మాణసామగ్రిని సమకూర్చి భవననిర్మాణమును బూర్తిచేసెను. కాని యందు, క్రింది భాగమునుండి పైయంతస్తునకుఁ బోవుటకు మెట్లను నిర్మించుట మఱచెను. మనవిద్యావిధానముగూడఁ బ్రథమమునుండియు నారీతిగనే యున్నది. కావున మనయున్నతవిద్యాభ్యాసనమున కగువ్యయమును భరించుచున్నను, ప్రజాసామాన్య మావిద్యల నుపయోగింపలేకున్నది.

పాశ్చాత్యదేశములలో భోజనపదార్థములు సరిపోవునవి, లేక పోవుటచే, వారిలో నాందోళన మెక్కువయగుచున్నది. దేశములో బుద్ధిమంతులు, ప్రభుత్వమువారు సంధులకుఁ దగినప్రయత్నము లన్నియుఁ జేయుచున్నారు. తమదాత్మత్వమును బుద్ధి నందుల కుపయోగించుచున్నారు. మనదేశమం దన్ననో చాలమంది ప్రజలకు రెండుపూఁటలును దినుటకుఁ దిండి లేదు. అట్టిదుర్దశలో నున్నను మిగిలినవా రది వారిపూర్వజన్మదుష్కృతఫలముగ భావించి వారికిఁ దగినసహాయమును జేయుట లేదు. మనదేశమునఁ గలదౌర్భాగ్యము, దైన్యము, నిరుత్సాహమును సూచించు యంత్రము లున్నచో, మనదేశముయొక్క దుఃస్థితి మనకు గోచరింపఁగలదు. ఏస్వతంత్ర దేశమును నట్టివిషయములఁ గాంచి యూరకుండఁ జాలదు.

విద్యావిషయమునఁగూడ మనదేశముయొక్క దౌర్భాగ్య మట్లే యున్నది. నాగరకుల మనుకొనువా రెవ్వరును దమదేశములోఁ దక్కువమందికి మాత్రమే యుపకరించుచున్న విద్యావిధానమును జూచి యొప్పకొంచి యుండఁజాలరు అట్టిదుఃస్థితిని గనులారఁ గాంచియు నేమి యుఁ జేయఁజాలని మనదేశమును జూచిన నాకు సిగ్గగుచున్నది.

కొన్నిగ్రహములు సూర్యునివైపు తమతమగోళముల నొకభాగమునుమాత్రమే చూపుచుండు నని శాస్త్రజ్ఞులు చెప్పుదురు. ఆయాగోళ

---

*రవీంద్రనాథటాగూరుగారి యుపన్యాసమునకు స్వేచ్ఛానువాదము.

ముల నొకభాగ మెల్లపుడును గాంతియుతముగను మిగిలినభాగ తమోవృతముగ నుండును. ఆప్రకారముగనే మనసంఘమున నొకభాగము మాత్రమే విద్యవలనిలాభమును బొందఁజాలి యున్నది. జాతిజాతికిని నెట్టిభేదముకలదో యట్టిభేదముఁ బ్రజాసామాన్యమునకును విద్య నేర్చినవారికిని గలుగుచున్నది. నేఁటికాలమున ప్రజాసామాన్యమునకు విద్య నందఁజేయఁజాలని దేశము లధమస్థితిని గాంచుచున్నవి. అందులకు వలసిన ధనము లేదని యేనాగరకదేశమును నూరకుండఁజాలదు. ఆ యూఖండమున మిగిలినదేశములలోఁ గొన్నిటియందు విద్య మొత్తముగ వ్యాపించుచున్నదో మనకుఁ దెలియును. విప్లవకాల మైనను రష్యాదేశ మెనిమిదిసంవత్సరములలో నెటులు విద్యావ్యాప్తికై పాటుపడినదో చూచిన మన కది యైంద్రజాలికుని మాయ యనిపింపకమానదు. ప్రజల కందఱకును విద్య సమానముగ నేర్పఁగలిగినపుడు మనదేశము కభ్యుదయము, సంఘీభావము చేకూరఁగలదు. మహనీయుఁడగు గోఖలే నిర్బంధవిద్యావిధానమును గూర్చి ప్రయత్నించినపుడు, హైందవసంఘాభ్యుదయమును గూర్చియు సంఘీభావమును గూర్చియు ఘోషించుచున్న నంగదేశీయులే యతనిప్రయత్నములను బ్రతిఘటించిరి.

ప్రాచీనకాలములందును బ్రజలలోఁ గొందఱు విద్యావంతులును గొందఱు విద్యావిహీనులును గలరని మీర నవచ్చును. తత్త్వవ్యాకరణ సిద్ధాంతములను గూర్చి పండితులు మాత్రమే చర్చలను సలుపుచుండిరని నాకుఁ దెలియును. కాని పర్వతశిఖరములయం దుద్భవించి నిమ్నప్రదేశములఁ బ్రవహించు నదీజలములవలె విద్యావంతులశాస్త్రజ్ఞానము సాధారణప్రజలహృదయములఁ బ్రవేశించి వానిని ఫలవంతముగఁ జేయుచుండెను. గొప్పవిద్యాలయములు లేకున్నను, శరీరమునఁ బ్రవహించురక్తమువలె విద్య సామాన్యులను గూడఁ జేరుచుండెను. కొన్ని రక్తనాళములు పెద్దవిగను, గొన్నిచిన్నవిగ నున్నను రక్తము ప్రతిభాగమున నెటులు ప్రవహించుచున్నదో యటులే విజ్ఞానము దేశ మంతటను వ్యాపించుచుండెను.

అరణ్యప్రదేశములఁ బెరుఁగువృక్షములు భూమినుండి సారమును గ్రహించి తమశాఖలయందు దుండుఫలముల కందిచ్చి, తిరుగ నాసారమునే భూమి కిచ్చుచున్నవి. అందువనే యాప్రదేశములలో నెల్లపుడు నరణ్యము లభివృద్ధిని గాంచుచున్నవి. అట్లే విద్యావంతులు తమవిద్యను సామాన్యుల కందఁజేసి వారిని గూడ విద్యావంతులనుగఁ జేయుచుండిరి. నేఁటిపాశ్చాత్యవిద్యావిధానమున నిది కొఱవడినది.

ప్రాచీనకాలమున మనపండితులకును బ్రజాసామాన్యమునకును బుద్ధివికాసమున గొప్ప యంతరము లేకుండెను. పండితులశాస్త్రజ్ఞానమును బాండిత్యమును సామాన్యులుకూడ గ్రహించి తమశక్త్యనుసారము జ్ఞానలాభమును బొందుచుండిరి. నేఁటినాగరకదేశములలో మనదేశమున నూటికెనిమిది, పదిమంది మాత్రమే యక్షరాస్యులు గలరు...

ఇట్టిపరిస్థితులకుఁ గారణము మాతృభాషలో విద్యను నేర్పకుండుటయే. ఆంగ్లాదిభాషలయందు విద్యను గ్రహించుచున్నది మనసామ్మైనదని యనుకొనుచు 'దివాలా' తీసిన వర్తకుఁడు బాకీలు తెచ్చిన ధనమును లాభ మనుకొనునట్లు మనము మురిసిపడుచున్నాము.

విద్యార్థులకు మాతృభాష తల్లిపాలవంటిది. కొంతమందివిద్యార్థులు పెక్కుభాషలను నేర్చికొనఁజాలరని యుపాధ్యాయులకుఁదెలియును. వచ్చియు రాని యాంగ్లభాషతో నెటులో 'మెట్రిక్క్యులేషను' పరీక్షయందుత్తీర్ణులై, యున్నతవిద్యాభ్యాసమును జేయలేకున్నారు. ఇందులకుఁ గారణములు చాలఁగలవు. వంగదేశీయుల కాంగ్లమున విద్య నేర్పుటకంటె హీనస్థితి మఱియొకటియుండదు. మంచియుపాధ్యాయులయొద్దనాంగ్లము నభ్యసించుట కష్టము. అది బీదవారి కసలే లభింపదు. అట్టివారి కున్నతవిద్యలను నిరసించుట మనకు ధర్మమా? పూర్వ మింగ్లండులో దొంగతనము చేసినవారి నురిదీయుట యాచారము. దొంగతనము చేయలేనివారిని దండించుట విశ్వవిద్యాలయాధికారుల దండనసూత్రముగఁ గన్పడుచున్నది. గ్రంథములందలి విషయములను సరిగ నర్థముఁ జేసికొనక, యెటులో జ్ఞాపకశక్తిపై నాధారపడి పరీక్షాసమయముల

నొప్పగించుట దొంగతనము గాక మఱి యేమి కాఁగలదు? ఆగ్రంథ ములనే తమదుస్తులయందు దాఁచికొని పరీక్షలకుఁ బోవుటకంటె నది యెటులుమంచిది? పరీక్షలయం దుత్తీర్ణు లైనవారిని గూర్చి నాకెట్టివిచా రమును లేదు. విఫలు లైనవారిని గూర్చియే నావిచారము. వారిజ్ఞాన మును బరీక్షించుట కింక మార్గములు లేవా? హజారావంతెనమార్గ మును మూసివేసినచో గంగానదిని బడవలలోఁగాని బల్లకట్టుపైఁ గాని దాఁటఁగూడదా?

మనకును బాశ్చాత్యదేశములకు నొకభేదము కలదు. ఆయాదే శములందుఁ దమవిద్యను సంపూర్ణము గావించుట కొఱకే వారు విదే శీయభాషల నభ్యసించుచున్నారు. అది వారి దినచర్య కుపచరింపకు. మనదేశమం దన్నియో యాంగ్లముననే యన్నివిషయములును నడుప బడుచున్నవి. మనవారిని మనపరిపాలకులను మెప్పించుటకై మన మాం గ్లవిద్య నభ్యసించుటయే గాక యందుఁ బ్రావీణ్యమును బొందవలసి వచ్చుచున్నది. నే నొకసారి జర్మనీదేశీయుఁడును, దత్త్వశాస్త్రజ్ఞుఁడు నగు 'యూకెను' ఆంగ్లమున మాటలాడుట వింటిని అతనిభాష నాకుఁ జాల వింతగ నుండెను. అట్టిభాషయే నేను మాటలాడిన నాగతి యేమైయు డునో యని నాలో నేను దర్కించుకొంటిని.

విదేశీయుల పరిపాలనయం దుండునంతకాలము మన మాంగ్లము ను నేర్చుకొనవలసి వచ్చుటయే గాక యందుఁ బ్రావీణ్యమును గూడ సంపాదింపవలసి యుండును. కాని యాకాల మంతయు మనకు నష్ట మగు చున్న దని మనము గ్రహింపవలెను. మన స్వభాషను మనము సరిగ నభ్యసించినచో విదేశభాషలను గూడఁ ద్వరలో నేర్చుకొనవచ్చును. మనవిశ్వవిద్యాలయము బంగాళీభాషనే విద్య నేర్పవలయు నని నేనను సాహసము కావచ్చును. కాని మనము వెంటనే శ్రద్ధనువహింపనియెడల మనజాతీయవిద్యావిధాన మడుగంటఁగలదు.

ఆంగ్లముననే యున్నతవిద్యలను నేర్పవలయు ననుటకు హైందవ భాషలలోఁ దగిన గ్రంథములు లేకపోవుటయే కారణ మని కొంద ఱందు రు. చాలకాల మిది వాగ్వాదముక్రిందఁ బరిణమించినది. ఆయడ్డంకు లిప్పు

డు లేవు. హైదరాబాదు విశ్వవిద్యాలయము నిన్నమొన్నఁటి దయ్యు, నుర్దూభాషనే ప్రధానభాషగ నంగీకరించినది. అందులకు దానిస్వాతంత్ర్యమే కారణము. ఈసందర్భమున మనము సర్ అక్బరుహైదరీగారి కార్యదీక్షను బ్రశంసింపవలసి యున్నది. ఉర్దూభాషయే ప్రధానభాషగ నుండుటచే, నున్నతవిద్యకును, సాధారణ విద్యకును సోపానము లేర్పడినవి. మాతృభాషయందే విద్యను బోధింపవలయు నను వాదము నాయనుభవముపై నాధారపడి యున్నది. నాచిన్నతనమునఁ బెక్కు విద్యాసంస్థలలో నాంగ్లముననే విద్య నేర్పఁబడుచుండెను. కాని నేను జదివిన నార్మలు పాఠశాలలో బంగాళీభాషలోనే విద్యను జెప్పుచుండిరి. ఆభాషయందే గణితము, భూగోళశాస్త్రము, దేశచరిత్రము నేర్పఁబడుచుండెను. ఆంగ్లభాషాసంపర్కము లేని యాపాఠశాలలోఁ బండ్రెండవ సంవత్సరము వఱకుఁ జదివి తరువాత నాంగ్లపాఠశాలకుఁ బోయితిని. మాతృభాషయందు నేను నేర్చినవిద్య నామనోవికాసమునకుఁ దోడ్పడినది. విదేశభాషలలోఁ గష్టపడి కుంటినడకల నేర్చుకొను గండము తప్పినది.

విద్యవలని ప్రధానోపయోగము భాషారూపకముగ మన యూహలను, భావములను, బైకి వెలిపుచ్చుటయే. ఆప్రకార మితరులభావములను మనము గ్రహించుచు మనభావముల నితరులకుఁ దెలియఁజెప్పుటయే నిరామయమానసికజీవనమున కవసరము. అట్టి భావసంచలన మన్యభాషల జరుగవలయు నన్నచో, బుట్టబొమ్మలను ధరించి నాటకమాడఁబోవునటు లుండును. వాఙ్మయాభివృద్ధి నొందించుటయే కష్టసాధ్య మగుచుండ నందు విదేశభాషలలో రచించుట మనశక్తిసామర్థ్యములను మఱియు సంకుచిత మొనర్చుచున్నది. ప్రథమమున మాతృభాషయందే విద్యను నేర్చి యుండుటచే నాంగ్లమునఁ గూడఁ గొంతప్రావీణ్యమును బొందఁగలిగితిని. ఏ భగీరథుఁడైనను వంగభాషామూలకముగ విద్యాస్రవంతిని నడపి సర్వమానవవిజ్ఞాన మహోదధియందుఁ జేర్చి నిర్జీవములై తమోవృతము లగు మనమానసములను వికసింపఁ జేసి, మనమాతృభాషను గూడఁ బ్రపంచమున ముఖ్యభాషలతో సమముగఁ దలయెత్తుకొనునట్లు చేయుఁగాక యని కోరుచున్నాను.

# మ హ తి.

ఇది తెనాలిపట్టణమున (గొ)త్తగా బైలువెడలుచున్న యాం(ధ్ర)
మాసపత్రిక. శ్రీయుత వాసిరెడ్డి వేంకటసుబ్బయ్యగారు సంపాదకులు.
మాకు మొదటిరెండు సంచికలందినవి. శ్రీ బోడేపూడి వేంకటరావుగారు,
వడ్లమూడి వేంకటరత్నముగారు, వేలూరి శివరామశాస్త్రిగారు, తుమ్మల
సీతారామమూర్తి చౌదరిగారు, జమ్మలమడక మాధవరామశర్మగారు, కొ
డవటిగంటి కుటుంబరావుగారు మొదలగువారి గద్యపద్యవ్యాసములుగ
లవు. విశేషించి పత్రికాసంపాదకులగు శ్రీ వాసిరెడ్డి వేంకటసుబ్బయ్యగా
రాంధ్రభాషాభిమానులు—

శా. "కింపాకుల్ కుకువుల్ పదార్థహరణాగ్రీయుల్ గిరాందేవతా
సంపల్లుంఠక సాంపరాయకలనాసన్నద్ధులౌచో నికా
ర్ఘుంపాతాండవమాడుఁ బత్తులు ఫణీంద్రశ్రీఫణామండలిం
జంపున్ సింహములన్ సృగాలములు నాశాదంతులన్ ముంగిసల్.

మ. "ఘనుఁడీ తేఁటి సురేంద్రనందనవనీకల్పప్రసూనైకవా
సన స్వర్వాసులకన్న మొట్టమొద లాస్వాదించి వర్జించె యా
చనకై నేఁ డిటు చేయిసాఁచె దురదృష్టప్రేరణన్ దేనె బొ
ట్టునకై; నీ వది దాఁచుకొన్న నెటులుండుం జెప్పుమా పద్మినీ."

అను నీరెండు ప్రాస్తావికపద్యములం దిలకించినఁ బాఠకులకు వేంక
టసుబ్బయ్యగారి యుభయభాషా పరిశ్రమము తెలియకపోదు. అట్టి
వారిచే నడుపఁబడుచున్న యీమహతి సార్థకనామమై హృదయాహ్లా
దులు శ్రుతిరంజనములు నగువ్యాసరాగములతో సభారంజనముచేయు
గాత. ప్రతి ౧కి రెండణాలు. సంll రముచందా రు. ౨.

# దమయంతీద్రౌపదులు.

—కాశీభట్ల సుబ్బయ్యశాస్త్రిగారు - కాకినాడ.—

"పురాణ మి త్యేవ న సాధు సర్వం న చాపి కావ్యం నవ మి త్యవద్యమ్
సన్తః పరీ క్ష్యాన్యతర ద్భజన్తే మూఢః పర ప్రత్యయనేయబుద్ధిః"

మహాశయులారా! దమయంతీద్రౌపదులు నిస్తులరాజ్యవైభవములఁ గోల్పోవుటయే గాక, తుదకుఁ బరులకడఁ బరిచారికావృత్తిలోఁ జేరి, కాలము గడపవలసినయవస్థకు వచ్చిరి. అట్టిదుర్భరావమానసమయమున నాయుదార లగురాజదారలు పరనరపాలపురములఁ జేసినదారుల నన్యయతిక్కన లెట్లు వర్ణించిరో యీవ్యాసమునందుఁ బ్రకటింప నెంచితిని.

కావున సహృదయు లగుసోదరీసోదరులు సహనభావముతో సాంతముగా నీవ్యాసమును జదివి, నాస్వాంత మెట్టిదో కనిపెట్టుట న్యాయము కాని, త్వరపడి నాపై వేఁడిముడుల విడుచుట పాడి కాదు, వినుఁడు, సుమతిమోహనగానమును—: "క. వినఁదగు నెవ్వరుసెప్పిన, వినినంతనె వేగపడక వివరింపఁ దగుం,గని కల్ల నిజముఁ దెలిసిన, మనుజుఁడె పో నీతిపరుఁడు మహిలో సుమతీ."

—: దమయంతి :—

నలుఁడు నడిరేయిఁ ద న్నడవిని విడనాడి, వెడలిపోయినతోడనే మేలుకొని తనయొడయనికై యాకాన నలుగడలఁ గలయఁ దిరిగి, ప్రాణేశునిఁ గాననేరక, దీనాతిదీనము లగునిజపతిసంబోధనపదనాదతరంగసంచారములచే నెండుమోడులును, బండఱాలును గూడఁ గరఁగఁ గనుఁగొనలనుండి దుఃఖవారిపూరములు కాల్వలై పాఱఁ బడరానియిడుమలఁ బడి, యాయండజయాన యాకాన దాటి, చేదినృపాలరాజధానిం జేరి, రాజమార్గమున జాలిగొల్పుచూపులతో నధోముఖియై నడువఁ దొడఁగెను.

అపు డాచేదిరాజమాత నలునియిల్లాలిని గాంచి, తలడిల్లి తన దాదితో నిట్లు పలికెను. "జీర్ణమైన కడుమాపుచీర కట్టి ధూళిధూసరాలకములు దూలుచుండ, నబల యున్మత్తవేషిణి యైనలచ్చికరణి వచ్చుచున్నది కంటే, అక్కోమలియందు నా కతిస్నేహం బై యున్నయది దానిం దోడ్కొనిరమ్ము." అనిన నదియు దమయంతిం దోడ్కొని రాజమాతయొద్దకుం జనిన రాజజననియు దానిం జూచి-

"నీ వెవ్వరిదాన వి ట్లేల దఃఖావేశవివశ వై యున్నదానవు? చెప్పు" మన దమయంతి తనదీనావస్థను వివరింప నారాజమాత "నీ వుండుము మాకడ నీకతి నఱయ భూదేవోత్తములం బంపెద" ననిన దమయంతి యిట్లు పలికెను. "నేను సైరంధ్రి నై యుండియు నుచ్ఛిష్టంబు ముట్టను, బదధావనంబు సేయను, పరపురుషులతోం బలుక నోపం, బతి నన్వేషించుపొంటె నరిగెడుబ్రాహ్మణులతోం బలుకుదును. అ ట్లయిన నీ యొద్ద నుందు నొండువిధంబయిన నుండ నేరను" అన నాజ్ఞేనితల్లి యందుల కంగీకరింప నలకాంత యాపిచెంత నుండెను. ఈరీతిగా నన్నపార్యుఁడు దమయంతి చేదిరాజమాతయంతఃపురంబునం జేరినట్లు వర్ణించియున్నాఁడు.

## —౩ ద్రౌపది ౩—

యాజ్ఞసేని పతులు మున్ను తన్ను విడిచి, మాఱువేసములతో విరటునివీటి కేఁగి యటం గొలు వమరి యుండం దా సైరంధ్రీవేషధారిణి యై విరటుని కోటకుం బోయి, రాజవీథిని రాఁదొడఁగె. అపుడు విరాటుభార్య యగుసుదేష్ణ యాయంచయానసంచారమును బరికించి, ప్రణయసఖులతో నిట్లు తెలిపెను. "ఎక్కడనుండి యెక్కడకు నేఁగెడినో! యిది యొక్కకాంత యూ, పెక్కుడు పెంపు సొంపు మన కేర్పడుచున్నది దావినీతయై, స్రుక్కుచు నీచభామినులచొప్పునం బల్లెదుం బొరులుం గడున్, వెక్కసమంది చూచెదరు వేగమ తోడ్కొని రండు నెమ్మితోన్" అని పలికిన నపుడు బ్రాహ్మాంగన లిరువురు వోయి, ద్రుపదకన్యకతో ని ట్లనిరి. "విరాటమహిషి నినుం దనపాలికిం బిలువ నంపె దయ పెంపెసగన్." అనవుడు దనతలంపు నెరసె నని యవ్వనితారత్నంబు వినయవైభవము సతీ, తను

పొందినచందంబున, జనియెం గేకయసుతానుచారికలబడసిన్. అట్లు తన కడ కేతెంచినపాంచాలిం గాంచి సుదేష్ణ—

"ఏది కులము నామ మెయ్యది యెవ్వరిదాన వేమిపనికిం బూని యిక్కు డెచట బుద్ధి దలంచి యేఁగెద వింతయు నెఱుఁగఁ జెప్పు మాకు మెఱుఁగుఁబోఁడీ" అన ద్రౌపది తనగాథను వివరించి, యిట్లు నుడివెను. "నీచము లయ్యెడుపనులకు, నాచాలమి యెఱిఁగి మన్ననకుఁ బాత్రను గా, నీచిత్తంబుఁ గైకొని, యాచారము దప్పకుండ నరయుము నన్నున్." అని తెలుప నావిరటుభార్య యాదుల కంగీకరిప ద్రౌపది విరాటరాజాంతఃపురమునఁ జేరెను. అని తిక్కన వర్ణించెను.

ఈఘట్టముల రెంటను దమయంతీద్రౌపదులు సైరంధ్రీవేషధారిణులై, పరుల సేవించి, జీవింప నలసినదశకు నచ్చట సదృశమైనను నీ రాజకాంతలకుఁ గలయవస్థమాత్రము విసదృశముగా నున్నయది. దమయంతి నిజపతిగతి యే మయ్యెనో యనుమనోవ్యాకులతచేఁ గృశించు చున్నమానిని. ఇఁక ద్రౌపదియన్ననో పాత్రధారులై నాటకరంగమున నున్నపతులఁ గలయ వేషధారిణియై వారిం జేరఁబోవు నటివంటిప్రౌఢ కామిని. ఇట వేషభేదమే కాని వియోగఖేదము లేదు. కావుననే యట నన్నపార్యుఁడు- "జీర్ణమై కడుమాసినచీరకట్టి ధూళిధూసరాలకమ్ములు దూలుచుండ" అని నలకాంతయొక్క శోచనీయావస్థను వర్ణించియున్నాఁడు. ఇటఁ దిక్కనార్యుఁడు "పదతలముల కెంపు పరఁగినతలము కుంకుమలిప్తమైనచందము వహింప" అని ద్రౌపదినడయాడినవిన్నాణమును వినుతించియున్నాఁడు.

మఱియు నిట వర్ణింపఁ బడినదమయంతీమలినరూపము సహజము కాని, ద్రౌపదిధరించినమాలినీవేషమువలెఁ గృత్రిమము కాదు. అఁగా నన్నయ దమయంతీరూపమును జిత్రించుటలో దైన్యభావమును బ్రకటించియుండఁ, దిక్కన ద్రౌపదీసౌభాగ్యమును వర్ణించుటలో జాణతనమును వెల్లడించెను. నన్నపార్యుఁ డవతరింపఁజేసినదమయంతియందు విచారకళయు, తిక్కనము ద్రించిన ద్రౌపదియందు విలాసకళయు స్పష్టముగఁ గన్పట్టుచున్నవి.

మఱియుఁ గిరాతుఁడు దమయంతిసౌందర్యమును బరికించి, మోహితుఁ డైనరీతిని నన్నపార్యుఁడును, కీచకుఁడు ద్రౌపదిహావభావములఁ గాంచి, పరవశుఁ డగుటను తిక్కనార్యుఁడును మనోహరముగా వర్ణించి యున్నారు. పరికింపుఁ డాపద్యహృద్యనిర్మాణనైపుణ్యమును- "రజనికరాననఁ బీనపయోధర రాజితరాజసుతన్ విలసద్గజపతిగామినిఁ జందనగంధిబ్రకాశితకాంతిసమన్వితఁ బంకజదళలోచనఁ జూచి కిరాతుఁడు కామునిశాతశరాహతుఁడై, నిజహృదయం బెఱిఁగించె లతాంగి కనింద్యచరిత్రకు వేడుకతోన్". వ్యాధుఁడు—"అక్కజ మైనరూపమున నాత్మకు వేఁగయిపొల్చుపొల్తిపై, నెక్కొనుచూడ్కిఁ గ్రమ్మఱుప నేరక నిల్చెఁ గాముచే జిక్కిననెమ్మనంబు గడుఁ జేడ్పడ మానముఁ జెప్పితంబులం, ద్రక్కినయంగముల్ దలఁకుధైర్యము నై యతఁ డప్పు డయ్యెడన్." కీచకుఁడు.—

నన్నయభట్టారకుఁడు సార్థవాహసమూహము దమయంతిని జూచిననైఖరిని, తిక్కనార్యుఁడు పౌరజనబృందము ద్రౌపది నీక్షించినవిదమును, నందముగాఁ జిత్రించి యున్నారు. వినుఁడు- "పాంసుజాలముపైఁ బ్రాకినఁ గరముఱ్ఱాత్తమము లగునూర్ధ్వాలకములదాని, నతిమలినంబై నయర్ధవస్త్రంబుచే నావృతంబగుదేహయష్టిదాని, నాఁకలి తృష నిద్రనుపీని నెఱుఁగక యున్మాదినియుఁ బోలె నున్నదాని, దమయంతిఁ జూచి కొందఱు పిశాచం బనిపఱచిరి, కొందఱు భయము వొంది,రందు గొందఱధికహాస్యంబు సేసిరి, యడవి నేమిరోసె దనిరి కొంద, ఱవ్వ నీవు వేల్పవదనిరి కొందఱు, మొగిన కేలు మొగిచి మ్రొక్కి రంత."—సార్థవాహులు.

"పఱి మొయి ల్గప్పినఁ బాడఱినునుఁగాంతి గదలినయమృతాంశుకళ యనంగ, బెరుమంచు మీఁదఁ బర్విన వికాసము దప్పి చెలువు గుదినసరోజినివిధమున, ధూమంబు వొదలినదఱిఁగలి మెఱుఁగులు నలంమాసినదీపకళిక భంగి, ధూళి పైఁ బొరసినఁ దొంగలించుట మాని లావణ్య మెడలినలతికమ్మాడ్కి, గంధకారివేషంబుకతన మ్మూర్తి, యుజ్జ్వలత్వమఱువడియుండఁ బాండు,తనయమహిషి యంచితగతిఁ జనంగ వీక్షింబౌరజనంబు లవ్వేలఁది గాంచి."—పౌరులు.

ఈరీతిగాఁ గవిపుంగవులు పౌరు లుభయులును సురూపములు స డలి విరూపములతో నడయాడు రాజకాంతలరూపముల నించుమించుగా న్యాకపోలికను వర్ణించియున్నారు. ఇట్లీకవిద్వయకవితలకును సాహచ ర్యము చూపట్టుచుండఁ గొందఱు విమర్శకపుంగవులు తిక్కన, నన్నయ భారతమును జూచి యెఱుంగఁ డనియు, విరాటాదిపర్వములఁ బహునైదిం టిని స్వప్రతిభావైభవము నాధారముగాఁ జేసికొని, వ్రాసె ననియు, సా హసోక్తులఁ బలుకుచున్నారు. కాని యందులకుఁ దగుకారణములనుమా త్రము చూపనేరకున్నారు.

తిక్కనార్యుఁడు, నన్నపార్యుఁ డాంధ్రభాషాదధిమహోదధిని ద రచి, సమకూర్చిన భారతనవనీతమాధుర్యమును జవిఁజూచి యున్నాఁ డన్నఁ దిక్కయజ్వయెన్నికకు వన్నె తగ్గు నని వీరియూహ. ఇది వట్టి పిచ్చి ముచ్చట. అసమానరససుధాసారపూరితము లగుసత్కావ్యములఁ బఠిం చుటచేఁ గవులు ధీసంపన్ను లగుదురు కాని, బుద్ధిమాలినవారు కాఁజా లరు. దురభిమానదూషితస్వాంతుల కీసారస్యము కానరాదు.

వివేకనిధు లగుకవివరేణ్యు లన్నన్నో పూర్వకవివరనిర్మితము లగు సత్కృతులఁ బఠించి, సరసవిజ్ఞానసంపన్ను లై, యాపెద్దలకుఁ గృతజ్ఞతా భివందనముల నందఁ జేసి, స్వకీయవినయసంపదల వెల్లడింతురు, కాని, మూఁగవారివలె నూరకుండరు. కావుననే వివేకనిధి యగుతిక్కనమంత్రి నిజకావ్యారంభమున నన్నయభట్టారకునిఁ బ్రస్తుతించి యుండెను. కాని నాఁడెగాఁ డాణెముత్యమనుచుండఁ బొసఁగుఁడుగాఁడు గుల్లముత్తె మను నట్లు తిక్కయజ్వ నన్నయకవితాప్రాభవమును బ్రస్తుతించియుండ నవ్యప్ర బుద్ధులు నన్నయకావ్యమును సోమయాజి చూచియే యెఱుంగఁ డని, వ్రాయుచున్నారు. ఇంతటితో నీకవిద్వయకవితలకుఁ గలసామ్యవాదము ను ముగించి, తిక్కనసోమయాజి వ్యాసభారతము ననుసరింపక, క్రొత్త దారిని సంచరింపఁ జేసినభాగములఁ గొంచెము విమర్శించెదను. తిక్కన మంత్రివరుఁడు మొదట ద్రౌపదిని మలీమసవేషముతో విరాటరాజవీథిని నడపించి, పిమ్మట నాయాజ్ఞసేని నసమానసౌభాగ్యసంపన్ననుగా దిద్ది,

సుదేష్ణమేడను నడయాడఁ జేసెను. రాజవీథిని రూపురేఖలు లేక,
వాకృతితో సంచరించినపాంచాలి యంతిపురమున సౌభాగ్యకాంతికలి
మాఱు టెట్లు పొసఁగును? ఇది పూర్వాపరవిరుద్ధ మగువర్ణనము
వీకరసాశ్రయ మగుప్రకరణమున నవతరింపఁ జేయఁబడినపాత్ర
ఘట్టముననే పూర్వరసవిరుద్ధముగాఁ జిత్రించుట రసాభాస మగు
దర్శింపుఁడు, రాజవీథి నేఁగుద్రౌపదిని "పఱమొఱు లగ్పిన" అను
దహరించినపద్యభావమును—

మేఘచ్ఛన్న మగుచంద్రరేఖవలెఁ గాంతిహీన యై,
ముంచఁబడినసరోజినిచాడ్పున సొంపు దూలి, పొగచేఁ జుట్టఁబడి
శిఖవలెఁ గళాహీనయై, దుమ్ములోఁ బొరలినతీఁగచాడ్పున లావణ్య
యై, యాయగ్గిపుట్టువు గట్టివాలువేసఱుచే సొంపు మాపు
దారిని నడువఁదొడఁగె ననిభావము. ఇఁక నంతఃపురసంచారిణిం గను

ఈపద్యము పాంచాలీసంచారబోధకము-"పదతలంబుల కెంపు
నతలము కుంకుమలిప్తమైనచందమువహింప, నంగంబునునఁగాంతి
రినగోడలు వేదులు మణిమయవిధము నొందఁ, గనుఁగవమెఱుఁగు
రినముందఱఁబుష్పోపహారంబుపోలుపుఁదాల్ప, వేనలికప్పుపర్వ
లదుకూలంబు మేల్కట్టుకొమరువడయఁ, దాను జొచ్చినకతనముశ్చ
నింట నిమ్మెయిఁ గ్రొత్తయొ ప్పెసకమెసఁగ, నమ్మహాదేవి యు న్నెడ
ల్లఁ, బాండురాజతనూభవపత్ని యరిగె". అనఁగా ద్రౌపదీపదవిన్యాస
మగుకుట్టిమతలము కుంకుమలిప్తమైనట్లు చెన్నువహింప, పాండవపత్ని
రకాంతి ప్రసరించినగోడలు తిన్నెలు రత్నస్థగితములట్లు తేజరిల్లఁ,
లిచూపు లొలికిననేలలు సుమవ్యాప్తసీమలవలె సొంపువహింప,
ష్ణయొక్క కొప్పునలుపు పర్వినమిన్ను నల్లపట్టు మేల్కట్టుచాదంబున
వహింపఁ, దానసంచారమువలన మత్స్యభూపాలాంతఃపుర మంతయు
త్తవిన్నాణముతో నలరుచుండ, ద్రౌపది సుదేష్ణకడ కేఁగె ననిభావము

చూచితిరా! వీథిద్రౌపదికిని, సౌధద్రౌపదికిని గలవిపరీతభేదము
గంధకారివేషంబుకతన మూర్తియుజ్జ్వలత్వంబు మఱుఁగువడియుండ"

రాజవీథి ద్రౌపదీరూపమును గళావిహీన మైనదానినిఁగాఁ జిత్రించి యావెం టనే యాబిడను మేడపై కెక్కించి "తాను జొచ్చినకతన మత్స్యక్షితీశు నింటఁ గ్రొత్తయొ ప్పెసకమెసఁగ" నని, పాంచాలిప్రవేశించినతోడనే విరాటుని మేడలోనిగోడగొందులు మెఱపు మెఱసినట్లు తళుకొత్తె నని వర్ణించుటఁ జూడఁ దిక్కన కేవలకవివరుఁడే కాక, గొప్పగారడీడు గాఁ గూడఁ జూపట్టుచున్నాఁడు. లేకున్న మలినవస్త్రను గాంతికలితముగా మార్పఁ జాలునా?

రామాయణమున రాక్షసీరూపముతోఁ బంచవటినిఁ బ్రవేశించిన చుప్పనాతి సీతాపతిసోయగమును జూచి, తోడనే సొగసుకత్తెగా మాఱి, శ్రీరాముని సమీపించినట్లు, ద్రౌపది మలినాకృతితో రాజవీథినిఁ జేరి, విరటురాణివాసమునఁ గాలిడినతోడనే రాజ్యలక్ష్మీవిలాసశోభిత యై సుదేష్ణను సమీపించెను.

కాని యాశూర్పణఖవలె నీపాంచాలి కామరూపిణి యగునిశాచరకామిని కాదు, మానవమానిని; యట్టిచో నిట్టిరూపభేద మెట్లు సమకూరును? ఊసరవెల్లి తనతనువల్లిరంగుల మార్చునట్లీ పాండుకుమారమహిషీమతల్లి నిజదేహకాంతులఁ దాఱుమాఱు సేయనేర్చిన నేర్పుకత్తె యై యుండునా?

ఈతబ్బిబ్బుసోయగము వ్యాసులవారిభారతమునఁ గానరాదు. అటఁ బురజనులు రాజవీథి నేఁగుచున్న పాంచాలిం గాంచి, నీ వెవ్వతెవని యడుగ, నేను సైరంధ్రి నని యామె తెలుపును. అప్పుడు పౌరులా ద్రౌపదిని బదులఁ జేరి జీవింప నగుపరిచారికనుగాఁ దలంప రైరని, తెలుపఁబడినది. వినుఁ డావ్యాసవచనములను—

"తస్యా వేషేణ రూపేణ శ్లక్ష్ణయా చ గిరా తథా।
న శ్రద్దధాతి తాం దాసీం అన్నహేతో రుపస్థితామ్"

ఇందుచేఁ దిక్కనార్యుఁడు మూలమున లేనిద్రౌపదీరూపవర్ణనములఁ గ్రొత్తగాఁ దెచ్చిపెట్టెను, కాని, యీముస్తాబునకుఁ దగిన ప్రస్తావము కానరాకున్నది. దీని నటుంచి వేఱొకవిషయమును గమనింపుఁడు.

అసలు నిజసౌభాగ్యలావణ్యగరిమల వెల్లడి కాకుండ గోప్యము నొనర్చి, సైరంధ్రీవృత్తిని రహస్యముగా రాణివాసమునఁ గాలము గడుప సంకల్పించుకొన్న యానెఱజాణమిన్న రాదాఁటిని బేదరాలిచ్చె దమునను, రాజమందిరమున రాజ్యలక్ష్మివడువునను సంచరించునా! వ్యాసుఁడు పాంచాలిని యుక్తాయుక్తవివేకనిపుణ యగువిదుషీలలామము గా భారతమున నవతరింపఁజేసి యున్నాఁడు. కాని, మంచిసెడ్డల నెఱుఁ గని వెంగలినిగాఁ బ్రకటించి యుండలేదు.

నిజముగా మత్స్యరాజాంతఃపురమునఁ బాంచాలి సంచరించిన విన్నాణముం జూడ దేవేంద్రమందిరమున నాట్యమాడ నవతరించిన యచ్చరలేమ ముచ్చట కానవచ్చుచున్నది కాని, పనులకడఁ బరిచారికా వృత్తిని జీవింపవచ్చిన సైరంధ్రీచిహ్నము గోచర మగుట లేదు. నిపు ణాతినిపుణ యగునావిరటుని రాణి యీయలివేణివిలాసవైభవములఁ బరి కించినతోడనే యేమహారాజుభార్యనుగానో భావించును గాని సామా న్యసేవకురాలినిగాఁ దలంపదు. ఒకచో ద్రౌపది నిజోక్తులచేఁ దనసౌభాగ్య బెళుకులఁ గప్పిపుచ్చఁ బ్రయత్నించినను ఆయాజ్ఞసేనిసౌభాగ్యవైభవ ములఁ గన్నులారఁ గాంచిన మత్స్యరాజకాంత యాద్రౌపదిని మోసకత్తె యనుగా భావించునే కాని సత్యవాదినిగాఁ దలంపదు. ఈద్రౌపదీసౌ భాగ్యాభివర్ణనము కవిరుచికి ననువుగా నున్నది కాని కావ్యౌచిత్యమున కనుకూలించి యుండలేదు.

—జడ విప్పి కొప్పుగాఁ దుఱుముట.—

తిక్కనమంత్రివరుఁడు ద్రౌపది సైరంధ్రివేషముతో విరాటకటకమున నఁ జేరె ననుసందర్భమున నిట్లు వ్రాసియున్నాఁడు.

క. "గారవమున నిజదేశా, చారముమై నల్లియున్న జడ యగు కబరీ
భారమును విచ్చి తుఱుముగ, సైరంధ్రీవేషమునను సముచితభంగిన్.

క. వలపలిద్దిక్కున కించుక, మలగంగాఁదుఱిమి కుఱుచమాపుకుపుట్టం
బలవడఁ గట్టి జటావ, ల్కలమున నఖ్యీఁగుఁజన్నుఁగవ గప్పి తగన్.

క. పరిచారికాత్వరేఖా, పరిణతి తనమేన నచ్చుపడ భావసకుం
దిరమై తలకొనునంతః, కరణముతోఁబురము ద్రుపదకన్యకసొచ్చెన్.

సోమయాజిగా రిట్లు ద్రౌపదిజడను విప్పి కొప్పుగా నొప్పఁజేయుటకుఁ గారణమేమి? వేణీధారణము మత్స్యదేశాచారవిరుద్ధమా ? కొప్పుపెట్టుకొనుట విరాటవిషయమర్యాదయా ? నిజదేశాచార మన, ద్రౌపది పుట్టి పెరిఁగిన పాంచాలదేశాచారమా? లేక కాలుపెట్టిన యత్తింటివారి దేశాచారమా ? ద్రౌపది సైరంధ్రిగా జీవింపఁదలంచిన మత్స్యదేశమున స్త్రీలు జడవేయక కొప్పుపెట్టికొనుట యాచారము కాదే! మత్స్యదేశము వింధ్యనగాళి కుత్తరదిగ్భాగమున నుండుటచే నుత్తరదేశాచారము ననుసరించి, మత్స్యదేశకాంతలు వేణీబంధముల ధరింతురు కాని కొప్పులఁ బెట్టరు. కొప్పుపెట్టుకొను నలవాటు వింధ్యగిరిసరణికి దక్షిణభాగమున నున్న దేశముల నివసించు స్త్రీలయాచారము. అందుచేఁ బాండవులరాణి వేణీబంధమును విప్పి కొప్పుగాఁ బెట్టె నని చెప్పుట తప్పుగాఁ గన్పట్టుచున్నది గాని యొప్పుగాఁ జూపట్టుట లేదు.

ద్రౌపది పుట్టిన దేశమును గాలుపెట్టిన నాఁడును బరిచారికగాఁ బ్రవేశించినవీడును గూడ స్త్రీలు శిరోజముల జడలనుగా ధరించునాచారము కల విషయములే కాని, కొప్పులుగా సవరించు తావులు కావు. ప్రాజ్ఞు లీరీతిని మత్స్యదేశమర్యాదను వివరించియున్నారు.

టి. ఆర్. కృష్ణమాచార్యులవారిచే వ్రాయఁబడిన మహాభారత విషయానుక్రమణికలో నిట్లు తెలుపఁబడియున్నది:—విరాటరాజధాని ఢిల్లీకి నైరృతిదిక్కున ౧౦౫ మైళ్లదూరమునను, జయపూరున కుత్తరమున ౪౧ మైళ్లదూరమునను, నున్నదనియు శూరసేనదేశమునకుఁ బశ్చిమమున జయపూరును జుట్టియున్న ఆల్వారురాజ్య మిందులోనిదే యనియు వ్రాయఁబడినది.

ఆప్తేపండితుఁడు-సంస్కృతనిఘంటువులో మత్స్యదేశము ఢోల్పూరునకుఁ బశ్చిమముగా నున్న దనియుఁ, బాండవు లజ్ఞాతవాసకాలమున యమునానదీతీరము నంటి పోయి, రోహితక, శూరసేనదేశముల దాఁటి, దశార్ణదేశమున కుత్తరముగా నేఁగి, విరాటదేశమును బ్రవేశించి రనియు,

3

మత్స్యదేశమునకు రాజధాని యిప్పటి బైరట్ అనియు, నిది జయపురము కుత్తరమున నిరువదిక్రోశముల దూరములో నున్న దనియు వ్రాసెను.

మెక్డనల్ మహాశయుఁడు సంస్కృతవాఙ్మయచరిత్రమున మత్స్యదేశము యమునానదీపశ్చిమతీరము నంటి యున్న దని వ్రాసెను. రైస్ పండితుఁడు మైసూరు కూర్గుదేశములను గూర్చి వ్రాయుచుఁ, బ్రస్తుతము మైసూరు రాజ్యమునకు వాయవ్యదిక్కునకుఁ గొంచెము పైఁగా ధార్వాడ జిల్లాయందున్న 'హానుగల్' అనిపిలువఁబడు పట్టణమే పాండవు లజ్ఞాతవాసమును గడపిన విరాటరాజధాని యని తెలిపియున్నాఁడు.

కాని యిది సరియగు నిర్ణయముగాఁ గన్పట్టదు. కారణ మేమనఁగా మహాభారతములో మత్స్యదేశము కురుదేశమునంటియున్నట్లు స్పష్టముగా వివరింపఁబడి యున్నది. అందుచే మైసూరురాజ్యమునకు వాయవ్యమున విరాటరాజధాని యుండుట పొసఁగదు. కనుఁడు భారత మేమి తెల్పుచున్నదో-"సన్తి రమ్యా జనపదా బహ్వన్నాః పరితః కురూన్ । పాఞ్చాలా శ్చేదిమత్స్యా శ్చ" అని తెలుపఁబడినది.

'విల్సన్' పండితుఁడు సంస్కృతకోశమునందు మత్స్యదేశము హిందూదేశమునకు మధ్యభాగమున నుండె ననియు, నాప్రదేశ మిప్పుడు దినజపూర్, రంగపూర్ అని పిలువఁబడు ప్రదేశ మనియు వ్రాసెను.

వ్యాసుఁడు విరాటపర్వమునందుఁ బాండవు లజ్ఞాతవాసమునకు దశార్ణదేశమున కుత్తరమునను బాంచాలదేశమునకు దక్షిణమునను శూరసేనదేశమధ్యమున నడచి, మత్స్యదేశమును జేరినట్లు తెలిపియున్నాఁడు. కనుఁడు—"ఉత్తరేణ దశార్ణాం స్తే పాఞ్చాలాన్ దక్షిణేన తు। ఉత్తరేణ యకృల్లోమాన్ శూరసేనాం శ్చ పాణ్డవాః॥ లుబ్ధా బ్రువాణా మత్స్యస్య విషయం ప్రావిశన్ వనాత్" అనియు నవే యధ్యాయమున "కాళిందీ మభితో యయుః" "కాళిందీ దక్షిణం తీర మన్వగచ్ఛన్" అనియుఁ దెలుపఁబడినది.

ఈపైని వివరింపఁబడిన నిర్ణయములను బట్టి చూడ మత్స్యదేశము వింధ్యపర్వతమునకు కిఁ బశ్చిమోత్తరదిగ్భాగమున జయపూరున కుత్తరమున

౪౦ మైళ్లదూరములో నున్నట్లు విదిత మగుచున్నది. అందుచే మత్స్య రాజధాని యుత్తరదేశములోని దగుట నిర్వివాదాంశము. ఉత్తరదేశ స్త్రీలు కురుల జడగా నల్లుదురే కాని యెప్పుడును గొప్పుగాఁ దురుము రు. కొప్పు పెట్టుకొనుట దాక్షిణాత్యవనితల ముచ్చట.

కావునఁ ద్రిక్రమఖి పాంచాలి వేసియున్న జడయల్లికను విప్పి కొ ప్పుగాఁ జేయుట సంగతము గాదు. ఇదియు గాక ద్రౌపది తాను లోఁగ డఁ బాంచాలికడఁ బరిచారికను గా నుంటి నని విరాటకాంతతో స్పష్ట ముగాఁ జెప్పనే! ఇఁక నీస్వదేశాచారత్యాగమును, బరదేశాచారస్వీ కారమును నేమిటికి?

అసలు వ్యాసభారతమున జడ విప్పి కొప్పుగా దద్దినట్లు వ్రాయఁ బడి యుండలేదు, సరియకదా! విడఁబారి యున్న కురులఁ జేరఁ దీసి జడ గా నల్లి కుడిభాగమునఁ గనఁబడకుండఁ బైఁటచేఁ గప్పి యుంచె నని తెలుపఁబడినది. "తతః కేశాన్ సముత్క్షిప్య వేల్లితాగ్రా ననిందితాన్ । కృష్ణాన్ సూక్ష్మాన్ మృదూన్ దీర్ఘాన్ సముద్గ్రథ్య శుచిస్మితా॥ జుగూ హే దక్షిణే పార్శ్వే మృదూ నసితలోచనా । వాసశ్చ పరిధా యైకం కృష్ణా సుమలినం మహత్॥ కృత్వా వేషం చ సైరంధ్ర్యా స్తతో వ్య చర దార్తవత్" ఈశ్లోకములకు వ్యాఖ్యానముల వ్రాసిన నీలకంఠ, చతుర్భుజ, సర్వజ్ఞనారాయణ, వాదిరాజ, విరోధభంజనీకారాదిపండి తులు "సముత్క్షిప్య" అనుపదమునకు "వేణీకృత్య" (అనఁగా జడగా నల్లి) యనునర్థమును వివరించియున్నారు. శ్రీకృష్ణభారతమున జడగొప్పు లమాట లేదు. కాని యచటి వర్ణనమును బట్టి చూడ, జడగా నల్లినట్లే తోఁచెడిని. "శిరోజము లులిపి యన్నియుఁ జేరిచి కట్టి బెట్టుగా వలపలి చక్కిఁ రాఁ దుఱిమి" అని యున్నది. ఇట—కట్టి యన జడగాఁ జుట్టి యని యర్థము చెప్పనగును.

పరిశీలింపఁ గురుల జడగా నల్లిన దనుటయే సమంజసము- ఏ మంటారా? ఆనాఁడు కురురాజసభలో దుశ్శాసనస్పర్శన దూషితము

లగుకురుల నానీచు డీల్లువలకు ముడువ నని యాజ్ఞసేని ప్రతిన చే
నట్లు లోక ప్రసిద్ధి కలదు. అందుచే విడువడియున్న శిరోజములను వేణిగా
నల్లకున్న, బ్రాజ్ఞ యగుసుదేష్ణ తన్నుఁ బాండవమహిషినిగాఁ గ్రహించు
నని తలంచి, పాంచాలి యాపద్ధర్మముగాఁ గురుల జడగా నల్లిన దనికె
లుపుటయే ప్రకరణోచిత మగువర్ణనము.

మహాభారతమున ద్రౌపది కురుల ముడువ నని ప్రతిన చేసినట్లు
కానరా దందురా! శపథము చేసినట్లు కంఠోక్తిగా నటఁ దెలుపఁబడ
కున్నను సందర్భానుసారముగా ద్రౌపది కురుల ముడువక జాఱవిడిచి
యుంచినట్లు వర్ణింపఁబడినది, కనుఁడు - సభాపర్వములో ౭౮ అధ్యాయ
మున "తథేత్యుక్త్వా తు సా దేవీ స్రవన్నేత్రజలావిలా। శోణితాక్తైకవస్త్రా
నా ముక్తకేశీ వినిర్యయా" అని ద్రౌపది కేశముల సంస్కరింపక వీడఁజే
యుంచినట్లు స్పష్టము చేయఁబడినది.

నన్నపార్యుని యాఁద్రీకరణమునఁ గూడ నిట్లే తెలుపఁబడినది.
"పతులపిఱుఁద మందగతి ముక్తకేశయై పోవుదాని ద్రుపదపుత్త్రిఁ జూచి"
మఱియు భారవికవి కిరాతార్జునీయమున నీభావమునే తెల్పియున్నాఁడు.
"దుశ్శాసనాకర్షరజోవికీర్ణై రేభి ర్వ్యనాథైరివ భాగ్యనాథైః। కేశైః కద
ర్థీకృత వీర్యసారః కచ్చి త్స ఏవాసి ధనంజయ స్త్వమ్॥

భట్టనారాయణుఁడు వేణీసంహారనాటకమున ద్రౌపది కురులు వీ
డఁబాఱియున్నట్లు తెలిపియున్నాఁడు, కనుఁడు—"భానుమతి—అయి
యాజ్ఞసేని! కస్మా దుష్మాక మద్యాపి కేశా నసంయమ్యం తే" ఈరీతిగా ద్రు
పదాత్మజ నిజశిరోజముల ముడువక దిగజాఱవిడిచి యుంచినట్లు తెలుపఁబ
డియున్నది.

పరిశీలింపఁ గురుల ముడువ ననుశపథమును జేసియున్నది కావు
ననే పాండవమహిషి శిరోజముల దఱుమక జాఱవిడిచినది. లేకున్న
సువాసినులు ముక్తకేశినులుగా నుండుట మంగళావహము కానేరదు.

ద్రౌపది సైరంధ్రీవేషముతో విరటుపట్టణమునఁ బ్రవేశించునపుడు
విడఁబారి యున్నకురులఁ జేరఁదీసి, జడగా నల్లె ననువిషయ మాక్రింది

గ్రంథములయందుఁ గానవచ్చుచున్నది. చంపూభారతమున, అనంతకవి యిట్లు వర్ణించియున్నాఁడు. కీచకుఁడు పాంచాలిని వర్ణించుటలో—"త్రేధావిభజ్య రచితాం వహ సేద్య వేణీం..." అని ద్రౌపదిజడను మూఁడు పేటలు గలదానినిగా వర్ణించి యున్నాఁడు. అగస్త్యముని సంస్కృతమున విరచించిన బాలభారతమున "కీచకేన పదాక్రాన్తాం క్లిష్టాం వేణీంచబిభ్రతీ" అని యున్నది. దీని నాంధ్రీకరించిన శ్రీకొత్తపల్లి సూర్యరావుగారిట్లు వ్రాసియున్నారు. కీచకావమానిత యగుద్రౌపది విరాటసభనుండి యేఁగుచు "కీచకుఁడు ద్రొక్కిన వేణి నాడించుచు......" అని వేణీబంధము తెలుపఁబడియున్నది.

ఇంతయె కాదు. ఉద్యోగపర్వమున "ఈవెండ్రుకలు వట్టి యీడ్చిన యాచెయి, దొలుతగాఁ బోరిలో దుస్ససేను తను వింతలింతలు తునియలై చెదరి రూపఱి యున్నఁ గని యుడు కాఱుఁగాక" అని యాజ్ఞసేని శ్రీకృష్ణునితోఁ దెలిపెను. ఈసంగతులను బట్టి చూడ ద్రౌపది కురురాజసభనుండి ముక్తశిరోజయై పతులవెంట నరణ్యమున కేఁగి, యజ్ఞాతవాస సమయమునఁ గురుల జడగా నల్లి యాయజ్ఞాతవత్సరము ముగిసినతోడనే జడను విప్పి తిరుగ శిరోజముల వ్రేలాడఁజేసినట్లు స్పష్టమగుచున్నది. మఱియుఁ బైనిఁ దెలుపఁబడిన ద్రౌపదీపీరాలాపములనుబట్టి చూడ దుఃశాసన మరణాంతమువఱకును గురుల ముడువనని ద్రౌపది శపథముచేసినట్లు ధ్వనించుచున్నది.

తిక్కనార్యుఁడు, వ్యాసభారతమున ద్రౌపది జడను గుడివైపునఁ గొంగుచేఁ గప్పె నని తెలుపఁబడియుండ, నందులకు విరుద్ధముగా "జరతవల్కలమున నవ్వేఁగుఁజన్నుఁగవ గప్పి తగన్" అని పయోధరగూహనమును వర్ణించెను. ఇదిసరి యగువివరణము కాదు. ఏమన, ద్రౌపది సుదేష్ణకడకుఁ బోవునపుడు జడచు గనఁబడకుండ దాఁచుట యవసరము గాని పాలిండ్లఁ దెలియరాకుండఁ జేయుట యగత్యము కాదు. కావుననే వాదిరాజను వ్యాఖ్యాత "జుగూహే దక్షిణే పార్శ్వే" అనుశ్లోకభాగమునకు వ్యాఖ్యానము వ్రాయుచు "కచభార మంతః ప్రవేశ్య ఆచ్ఛాదితవతీ"

అని స్పష్టముగా వేణీగూహనమును వివరించియున్నాఁడు. పోనీఁడు, తిక్కనార్యుఁడు తలఁచినట్లు సైరంధ్రి కొప్పుపెట్టుకొనుట ముఖ్యధర్మ మని తెల్పుతుమా! సైరంధ్రీలక్షణములలో నట్టివివరణము కానరాదే! "చతుఃషష్టికలాభిజ్ఞా శీలరూపాదిసేవినీ । ప్రసాధనోపచారజ్ఞా సైరంధ్రీ పరికీర్తితా" అని కాత్యాయనుఁడు తెలిపెను. "సైరన్ధ్రీ పరవేశ్మస్థా స్వవశా శిల్పకారికా" అని యమరుఁడు తెలిపెను. ఈపైలక్షణములయందు సైరంధ్రి కొప్పుపెట్టవలయు నను నియమము కానరాదు.

వేఱొకవిషయము- వ్యాసభారతమున సుదేష్ణ ద్రౌపదినిఁ దనయొద్దకుఁ దోడ్కొనిరం డని వృద్ధాంగనలఁ బంపె నని యుండఁ దిక్కన సుదేష్ణయాజ్ఞచే నిరువురు ప్రౌఢాంగనలు యాజ్ఞసేనిని గొనివచ్చుటకు వెడలినట్లు వర్ణించియున్నాఁడు. అట మూలమున నున్నవృద్ధపదమునకు విరుద్ధముగా నిటఁ బ్రౌఢపదమును, అక్కడ బహువచన ముండ నిక్కడ ద్వివచనమును వాడి, యీరీతిగా వ్యాసునియూహలఁ దాఱుమాఱుఁ జేయుటఁ జూడ మంత్రివరుఁ డేవియో యపూర్వకావ్యకలను దళుకొత్తింపఁ దలంచియుండును. లేకున్న నిట్లు మూలానుకూలములు కానిరచనలఁ జిత్రింప సాహసింపఁడు.

ఇఁక నొకవిషయము——వ్యాసుఁడు ద్రౌపదికి వేణీగూహన మొనర్చుటకుఁ దగిన పొడుగునుడుపును గట్టఁబెట్టియుండ మనతిక్కనమంత్రి యాయగ్గిపుట్టువునకుఁ బొట్టిబట్టను జుట్టఁబెట్టినాఁడు. కాని యాకుఱుచచీర జడనునొప్పుగాఁగప్పుట కనుకూలింపదు. వినుఁడు మూలమును— "వాసశ్చ పరిధా యైకం కృష్ణా సుమలినం మహత్" "మహద్వాసః= పెద్దకోకను" అని యుండ- తిక్కనభారతమున "కుఱుచమాపుఁబుట్టం బలవడఁగట్టి" అని వర్ణించుటచే నీకుఱుచచీర వేణీగూహనమునకు సమకూలింపదు.

ఈరీతిగాఁ దిక్కనార్యుఁడు మూలవిరుద్ధము లగు విద్దఁబాట్లను సమకూర్చుటచేఁ బ్రకరణౌచిత్యము సడలుట తటస్థించినది. తిక్కన వ్రాసినదంతయుఁ గావ్యకలావిలసితమే యను పిచ్చినమ్మిక కలవారెల్లు తలం

చినను గుణగ్రహణాసక్తచిత్తులు మాత్రము యుక్తాయుక్తములఁ బరిగణింపక మానరు.

—సంస్కృతాంధ్రపదప్రయోగములు.—

కొందఱు ధీమంతులు నన్నపార్యుని కవితను సంస్కృతపదము లధికముగా నుపయోగింపఁబడిన వనియు, దిక్కప్రెగ్గడ కైతను దెలుఁగునుడులు విరివిగా వాడఁబడిన వనియు, నందుచే దిక్కామఖి కవిత నన్నపార్యునికవిత్వమువలె సంస్కృతపదసముదయజటిలము గాక, తెనుంగునుడికారంపుసొంపు వహించి యుండుటచే నింపు గొల్పునం దనియు, వాదించుచున్నారు. పరిశీలింప నీవాదము యుక్తముగాఁ గానరాదు. నన్నపార్యుఁడు భారతమునఁ బ్రస్తరించిన సంస్కృతపదకదంబములు ద్రాక్షాఫలగుచ్ఛములవలె ననాయాసముగా రసమాధుర్యముల నందఁజేయుచుండును. ఇఁక, తిక్కనకవి భారతమున నిడిన తెలుఁగునుడు లన్నో కఱకుతాలవలెఁ గొఱుకుపడవు. ఈసంగతిని శ్రీ బుట్టా శేషగిరిరావు పంతులు ఎం. ఏ. గారు స్థిరపఱిచి యున్నారు.

"శుద్ధాంధ్రగ్రంథములుచేసిన పాండితీధనులు కలరు... కాని వారి కవనము లంతసులువుగా సాహిత్యపదముకె అన్వయము కా వని అంగీకరింపక తప్పదు." (ప్రతిభ—ఏప్రిల్ 1938)

మఱియొకసొగసు, నన్నయ వర్ణ్యానుకూలము లగుపదములనే వాడును గాని తిక్కనవలె ననవసరపదసముదయములఁ గుప్పింపఁడు.

పరమార్థదృష్టితోఁ బరికించినఁ దేలువిషయ మేమనఁ-దెలుఁగుపలుకులు సంస్కృతపదముల సన్నిధిని సుధానిధికడఁ జుక్కలవలె వెలవెలఁబాఱి యుండును. సంస్కృతపదసాహచర్యము లేకున్నచోఁ దెలుఁగునుడులు చీఁకటి నుడులవలెఁ దళుకొత్తును. పరికింపుఁడీక్రిందిపద్యమును—

"పఱమొయి ల్గప్పినఁ బాడఱి నునుఁగాంతిఁ
గదలిన యమృతాంశుకళయుఁబోలెఁ
బెనుమంచు మీఁదఁ బర్విన వికాసము దప్పి
చెలువుగుందిన సరోజినివిధమున

భూమంబు వొదివిన దుఱఁగలి మెఱుఁగులు
నలఁగిమాసినదీపకళిక పగిది
ధూళి పైఁ బొరసినఁ దొంగలిచుట మాని
లావణ్య మెడలిన లతికభంగి."

ఇట మకుటాయమానములుగాఁ బాదాంతముల నున్న-అమృతాంశుకళ, సరోజిని, దీపకళిక, లతిక, అను సంస్కృతపదము లెట్లు శ్రుతిసుఖదములై వెలయుచున్నవియో! మిగిలిన తెలుఁగుమాట లెట్లు చెవులకు జవులు పుట్టించుచున్నవియో! నాదసుధామాధుర్యవేత్త లెఱుఁగఁగలరు.

ఇట్లాంధ్రకవితకు నోజఃప్రదము లగుసంస్కృతవాక్యుల వాడుక కావ్యమునకు శోభావహ మగుటచే నన్నయభట్టారకుఁడు గీర్వాణవాక్పదసరసిజములఁ దనరచనలయందుఁ బొందుపఱచెను. ఈసంగతి నెఱుఁగని తెలుంగులు కొందఱు నన్నయకవితను గేలిసేయఁ దొడరుచున్నారు కాని సంస్కృతపదముల వాడుటలోఁ దిక్కన నన్నయను మించినాఁడను సంగతిని గమనింప నేరక, గతానుగతికముగాఁ బాడినదే పాడుచున్నారు.

భారతము పదునెనిమిది పర్వములు గలప్రబంధము. అందు మూఁడుపర్వములను నన్నపార్యుఁడు విరచించెను. శేషించిన పర్వములు దిక్కనార్యుఁడు సమకూర్చెను. మొత్త మీపదునెనిమిదిభాగములయందును గలసంస్కృతపదముల నేర్చి పర్వక్రమముగాఁ బంచినచో నన్నపార్యుని భాగమునకుఁ గొలఁదిగాను, తిక్కనవాటాకు మిక్కుటముగను వచ్చు నని నావిశ్వాసము.

వే ఱొక ముచ్చట—నన్నపార్యుఁడు సమకూర్చిన సంస్కృతసమాసములకును, దిక్కనార్యుఁ డమర్చిన సంస్కృతసమాసములకును సన్నిధియముచేసి చూచినచో మొదటివాని కుందువర్ణ్యానుకూలత రెండవవానికిఁ జూపట్టదు. మంత్రివరుని కైతయందుఁ బద బాహుళ్యమును, సమాసదైర్ఘ్యమును విరివిగాఁ బొడకట్టుచుండును. అంతయే విశేషము.

కానిండు, నన్నపార్యుఁడు తెనుఁగుభాషయందుఁ గలమాధుర్య గాంభీర్యాదికావ్యగుణముల నంతగా నెఱుఁగనివాఁ డగుటచేఁ దెలుఁగు మాటలఁ బాటింపక సంస్కృతపదముల బహుళముగాఁ దనభారతకవిత్వమున నెదచల్లె ననుకొందము. అందుచే నాతనిభారతము రసవిరహితమైయున్న దనువాదమునకు నొప్పుకొందము. ఇఁకఁ దెలుఁగుబాసయందలి నుడికారపుసంపుల బాగుగా నెఱింగి, సంస్కృతపదముల నంతగా దరికి రానీక, తేనె లొలుకు తెలుఁగునాఁటిమాటలతో నీటుగాఁ గైతను బుట్టించిన తిక్కనార్యుని కబ్బములందలి తెలుఁగుమాటల సొంపును గన్నులారఁ గాంచి, కవితల నల్లిన కేతనమారనాదికవిపుంగవులు, తమ కృతులయందు సంస్కృతపదముల విడనాడకుండుటకుఁ గారణ మేమి? ఇప్పటి ధీశాలుర కున్న తెలుఁగుపదవిజ్ఞానము గాని, యాంధ్రభాషాభిమానము గాని, వారికి లేకయా?

తెనుఁగునుడికారపుఁ దీఁగ సంస్కృతపదరసాలసాలము నాశ్రయించుటచేతనే యౌన్నత్యాభివృద్ధుల నంది, నిజకవితాసుమమంజరీసౌరభసంచారములచే మానవలోకము నానందింపఁజేయఁగలుగుచున్నయది. అట్టి మాకందపు ప్రాపు లేకున్న నీతెలుఁగుతీవ పైకెగయ నేరక నేలఁ బ్రాఁకులాడుచుండెడిది.

నిజముగా నాంధ్రభాషకు శ్రుతిసుఖద మగునాదమును, రసవిలసిత మగు భావమును, సమకూర్చినది గీర్వాణవాణీపదసరసిజసాహచర్యమే యని, కవిపండితు లనేకులు ప్రకటించియున్నారు. సనాతనపండితాభిప్రాయముల మాట యటుంచి, యధునాతననాగరకవిద్వాంసులభావములఁ బరికించినను దెనుఁగుకైతకు సౌభాగ్యమును సంఘటింపఁజేసినది సంస్కృతపదసమ్మేళనమే యని విదిత మగుచున్నది.

ఈనడుమ నవీనముగా శ్రీపిఠాపురము మహారాజావారిచేఁ బ్రకటింపఁబడిన చింతలపూఁడి యెల్లనార్యకృత మైన విష్ణుమాయానాటకమను తెనుంగుప్రబంధరాజమునకు నతివిపుల మగు పీఠికను వ్రాసిన మ. రా. రా. చేకుమళ్ల అచ్యుతరావు ఎం. ఏ., ఎల్. టి., గారేమి తెలిపినారో పరికింపుఁడు.

"సువర్వవాణి యగు సంస్కృతవాణి తనమంజులభాషానిధి సం తయు నీకవివరుని కైవసముఁజేసెనో యనునట్లు సంస్కృతశబ్దమాధుర్య మమృతవర్షమువలెఁ గురియుచున్నది."

ఈపీఠికను వ్రాసినవారు కేవల ప్రాచ్యభాషాభిజ్ఞులే కారు. ఆఙ్గ్ల భాష నాచార్యపీఠ మధిష్ఠించిననాగరకులు. వీరు స్పష్టముగాఁ దెలుఁగు నకు మంజులతను సమకూర్చినది సంస్కృత మని తెలిపియున్నారు. శ్రీశ్రీ రాడ రామకృష్ణయ్య ఎం. ఏ. గా రిట్లు సెలవిచ్చియున్నారు. "గీర్వాణ సారస్వతమహావృక్ష శాఖకిఁ గట్టిన యంటుగా బయలుదేఱి, విజృంభించిన యాంధ్రసారస్వతమునందు"—(ఆంధ్రభారతరచనావిమర్శనము.)

శ్రీజొన్నలగడ్డ సత్యనారాయణమూర్తి ఎం. ఏ., బి. యల్ గారు ఈరీతినిసంస్కృతమును బ్రశంసించియున్నారు. "సంస్కృతమున కెన యైన భాష పృథ్వియందు లేదు. దీనియందలి ప్రత్యక్షరము......భావబంధుర మైనది."—(సాహిత్యతత్త్వవిమర్శనము.)

ఈరీతిగా నాంగ్లాంధ్రసంస్కృతభాషాకోవిదులు వక్కాణించుచున్నారు. ప్రాజ్ఞు లగునాంధ్రకవివరేణ్యు లెల్లరు సంస్కృతపదములఁ గృతులయందుఁ బొందుపఱిచి, నిజకవితాసుధాధారలచే లోకము నానందిమఁజేయుచున్నారు. ఇట్లుండ దీని నంతను ద్రోసిపుచ్చి, కొందఱు బుద్ధిమంతులు సంస్కృతము తెలుఁగుకైతను రూపుమాపుచున్న దని ఘోషించుచున్నారు. ఇంతకు మించిన వింత యేమున్నది! ఇంతకంటె వితండవాద మేది కలదు!

## —ః విరాటపర్వకవితాప్రశంస ః—

న్యాయముచేఁ గావ్యమునందుఁ దుమ్మెదలవంటి ముంగురులు, చందమామవంటి మోము, తామరరేకులవంటి కన్నులు, దొండపండువంటి పెదవి, సంపెఁగమొగ్గవంటి ముక్కు, అరఁటికంబములవంటి తొడలు, కోకిలకూజితములవంటి మాటలు, చెఱకువిలుకానితూపులవంటి చూపులు, నని యీరీతిగా నుపమానోపమేయపట్టికల వ్రాయుటచే గవివరుని ప్రతిభ యంతగా గోచరింపదు. రసానుకూలము లగునవయవ

విలాసప్రకటనముల చేతను, అందు కనువు లగుపదములపొందికల చేతను, అందముగా౯ బాఠకహృదయపటములపై భావరూపములఁ జిత్రించినవాఁడే ప్రతిభాశాలి యనఁదగు కవిచంద్రుఁడు.

కాళిదాసకవికులతిలకునిచే శాకుంతలనాటకమునఁ గణ్వశిష్యులు శకుంతలను దుష్యంతునికడకుఁ దోడ్కొనివచ్చి "రాజేంద్రా! ఈసుదతి నీవు పరిగ్రహించిన యిల్లాలు, శకుంతలాభిధాన, కణ్వమునీంద్రుని నందన కావున నీ వీపెను జేకొని గారవింపుము" అని తెలుప నానృపాలుఁడు శాపదోషమున జరిగినవిషయము నంతను మఱచి, యావటులమాటలను వెఱఁగంది "తాపసకుమారులారా! మీపలుకులు వింతగొల్పుచున్నవి. ఈమదవతిని నేను జూచియెఱుంగను. ఈరమణిని నేఁ బాణిగ్రహణ మొనర్పలేదు. కావున నీటక్కులాఁడిని నాయింట విడువక మీవెంటఁ గొని పొండు" అని తెల్పెను.

అప్పు డాయమాయకురా లగుమునితనయ మహారాజు తన్నవమానించి పొమ్మనుటచే నట నిలువ వెఱచి, సోదరసము లగుమునిబాలురతోఁ బుట్టినింటికిఁ బోవ నుద్యమింప, నాకణ్వశిష్యులు కన్ను లెఱ్ఱఁజేసి "శకుంతలా! గురువరులు నిన్నీరాజమందిరమున దిగవిడిచి రమ్మనిరే కాని తోడ్కొని రమ్మన లేదు—కావున మావెంట రావలదు. ఆఁగు మిట" - అని నిరోధించిరి. అపు డాతపస్విని "ఈదుర్భరావమానమున కంతకును నీమోసము కదా కారణము" అని తెలియునట్లు వెనుదిరిగి రాజుపైఁ బ్రసరింపఁజేసిన చూపులు బహురమ్యముగా వర్ణింపఁబడినవి. నిజముగా నీపద్యము శాకుంతలనాటకమునకు మకుట మనఁదగి యున్నది. వినుఁడు—

శ్లో॥ ఇతః ప్రత్యాదేశా త్స్వజనమనుగన్తుం వ్యవసితా
తత స్తిష్ఠే త్యుచ్చై ర్వదతి గురుశిష్యే గురుసమే
పున ర్దృష్టిం బాష్పప్రసరకలుషా మర్పితవతీ
మయి క్రూరే యత్త త్సవిష మివ శల్యం దహతి మామ్॥

అనఁగా "ఆశకుంతల నావలనఁ గల్గినపరాభవమును భరింపనే రక స్వజనులతోఁ బోవనెంచ, వా రాఁగుము రావలదనుచు గద్దింప, గురుకులముఖి యై యున్నయామునికన్నియ వెనుదిరిగి బాష్పవారిదిగ్ధ మగు చూపును నాపైఁ బ్రసరింపఁజేసినది, అబ్బా! ఆయవలోకనము విషలిప్త మగునలుగువలె నన్ను బాధించుచున్నది" అని భావము.

దుష్యంతుఁ డీపద్యము నుంగరమును గాంచిన తోడనే శకుంతలావివాహవృత్తాంత మంతయుఁ గన్నులకుఁ బొడకట్టఁ బట్టరాని దుఃఖావేశముతో విదూషకునికడఁ దనహృదయకాఠిన్యమును దెలుపునట్టుగఁ జిత్రింపఁబడినది. ఇట శకుంతల దుష్యంతునిపైఁ బ్రసరింపఁజేసిన కోరచూపులో "మోసగాఁడా! ఱేఁడా! నన్నంతటి మోహపరవశనుగాఁ జేసి చేపట్టి యిపు డింతటి యసహ్యావమానము పాల్సేసితివి! నీమూలమున నాజీవితసుమము రూపుమాసి నేల రాలినది. నన్నింత యుసురుపెట్టనగునా? ధర్మాధికారి కీచేఁత తగునా"—అనుభావము వ్యక్తముసేయఁబడినది. ఇట్టిదియే మిగుల వెలగలకైత. ఈరీతిభావవివరణములే కవివరుల విన్నాణమునకుఁ దగినయుదాహరణములు.

తిక్కనార్యుఁడు, కీచకుఁడు పాంచాలిని బలాత్కరింప నున్నప్పుడు యాజ్ఞసేని యసహాయభయాభినయచేష్టలఁ జక్కఁగాఁ జిత్రించియున్నాఁడు. వినుఁడు—

సీ. దైన్యంబు తలపోఁత దలకొన్నఁ జెలువ కా
 ననమున వెల్లఁదనంబు గదిరె
భయరసవేగంబు పైకొని ముట్టినఁ
 గాంతకుఁ దనులత కంప మొందె
బెగడంతకంతకు మిగిలిన నింతికిఁ
 బదముల నట దొట్రుపాటు బెరసెఁ
దల్లడం బొందినఁ దన్వికి నవయవం
 బుల నెల్ల ఘర్మాంబుకళిక లెసఁగెఁ

దలఁకువృత్తిగొంకు గొలఁదికిమీఱ వె
న్బాటు దోఁచె ముట్టుపాటు దొడరె
వెఱఁగుపాటు దనికె నెఱనాఁడె నొవ్వ నె
వ్వగలు వగలనీనె దిగులు వొడివె.

తిక్కనార్యుఁ డీపద్యరాజమునఁ దనకు మానభంగము సంభవ మగు నను భయంబుచేఁ దల్లడ మందుచున్న పాంచాలి యవయవచేష్టల నింపుగా వర్ణించి యాయిల్లాలి భయస్వభావమును బాఠకులకుఁ బ్రత్యక్ష మొనర్చెను.

మఱియుఁ, గీచకుఁడు యాజ్ఞసేనిం గామించుటను గాంచి సుదేష్ణ యాతనికిఁ జేసిన హితబోధ మనోహరముగాఁ జూపట్టుచున్నది.

"ఆయురైశ్వర్యకీర్తుల నపహరించుఁ
బరసతీసంగమము ధర్మపథమునందుఁ
బరఁగువారలు పరిహరింపంగఁ గనియు
వినియుఁ దెలియవె యిది దుర్వివేక మగుట."

ఈపద్యమున వివేకకలిత లగుసతుల హితబోధలయందలి లాలిత్యపు నిగ్గగ్గలమై వెలయుచున్నది.

వాల్మీకిరామాయణమున సీత కామాంధుఁ డగురావణుని బాగు సేయ నెంచి మొదట శాంతము లగుసాంత్వనములచేతను, అనంతరము ప్రాభవము లగుసంభాషణములచేతను, బోధించిన రీతిని తిక్కనార్యుఁడు యాజ్ఞసేని కామమోహితుఁడగుకీచకుని బోధించినట్లు వర్ణించియున్నాఁడు. పరికింపుఁడు—

"నాయున్న బాము దలఁపవ, యీయెడ లీచీరయిట్టియేవపుఁజందం
బోయన్న మదనవికృతిం, జేయుననుట యెంతయును నిషిద్ధము కాదే".

"చనునె యిమ్మాట లాడ సజ్జనుల కాఁడుఁ
బుట్టువులతోడ నీవును బుట్టినాఁడ
వట్లు గాకయు హీనవంశాభిజాత
నైన పతివత్ని నగు నన్ను నడుగనగునె".

అని యిట్లు సాత్త్వికమార్గమున బాగుసేయఁ బలికి, వాఁ డుడుకు
పొగరులాడుచుండుటచేఁగినిసి నిజప్రాభవ తేజము మెఱయ నిట్లుపలికెన్

"దుర్వారోద్యమ బాహువిక్రమరసాస్తోకప్రతాపస్ఫుర
ద్గర్వాంధప్రతివీరనిర్మథనవిద్యాపారగుల్ మత్పితృ
వ్యుర్వీశాకృతు లేవు రిపు నిను దోర్లీలన్ వెసం గిట్టి గంధ
ర్వుల్ మానముఁ బ్రాణముం గొనుట తథ్యం బెమ్మెయిం గీచకా!"

ఈరీతి హృద్యభావములతోఁ జోద్యముగా నున్న పద్యము లీవి
రాటపర్వమునఁ గలవు. స్థాలీపులాకన్యాయముగాఁ గొన్నింటి నుదాహ
రించితిని.

మహాశయు లగుపాఠకులు నేవ్రాసిన విషయముల నోర్పుతో
బరిశీలింపఁ దగినవి కాని, యుడుకుపాటుతోఁ దొందరగాఁ బరికింపఁ దగి
నవి కావు. "ప్రమాదో ధీమతా మపి" యనెడు నార్యోక్తి ననుసరించి
యెంతటివారికిని భ్రమప్రమాదము లుండుట తప్పదు. పరికింపుడు—
జొ. సత్యనారాయణమూర్తి ఎం. ఏ., బి. యల్గారిమాటలు.—"లక్షణ
భాషాణిధమనుచే అజా. డమునుమాఱుమ్రోగించినమహాకవియేని
క్షాప్పుడు పప్పులో కాలువేయవచ్చును". (21 5-38 ఆంధ్రపత్రిక)

తిక్కన మంత్రిపుంగవుఁడు విరాటపర్వమును విరచించుటలో
గొన్నికొన్ని తావులఁ దనప్రతిభకుఁ దగినరీతిని బొందికగా గ్రంథమును
గూర్పలే దని తెలుపుట తటస్థించినది.

గ్రంథవిమర్శన మనఁగాఁ గావ్యమునందలి యౌచిత్యానౌచిత్యము
లఁ జర్చించుట కాని, మహాకవుల నధఃకరించుట కా దని, తెలియనేరక
దురహంభావపూర్వకములై, కొఱగాని వ్రాఁతలకుఁ దొరకొను సోదరులు
పలుకులకు మందహాస మొనర్చుటయే మర్యాద—చందనతరువు మల
యగిరి నుదయించును గాని, కంకరగుట్టను బుట్టనట్లు సుబోధము శాం
తస్వాంతము నుండి వెలువడును గాని, తామసమానసమునుండి వెలు
వడదు.

ఈర్ష్యాసూయాదిదోషములం దరికిఁ జేరనీక, ప్రసన్నహృదయముతో నావిమర్శనములకు సరసముగా సమాధానముల నొసంగు మహాత్ములకు వినయాభివందనముల నందఁజేయుదును.

న్యాయముచే విమర్శనమును సారస్వతమునకుఁ గళనుగాఁ దలంపవలయును గాని, కాళిమనుగా భావింపరాదు. పూర్వకవివరులకవితలఁ జేసతో నిరసింపఁ దగదు గాని, జిజ్ఞాసతో విమర్శింపఁ దగును. సాహిత్యవీధి నాక్షేపసమాధానములు సాగుచుండుట యార్యాభిరుచికనుకూలమగుకార్యము కాని ప్రతికూల మగుకృత్యము కాదు.

విద్యావివాదము ద్యూతాదులవలె నవినీతిద మగుకృత్యము కాదు. దధిమథనమువలె నవనీతప్రద మగుకార్యము. కాని దీనిం దరుచునపుడు కవ్వమునకు వలెఁ గలమునకు నడుమ నడుమ వేఁడి జనించుట సహజము. సారజ్ఞు లగుసజ్జను లందులకు సంతసింతురు కాని విరసులవలెఁ దామసింపరు. ఇంతటితో నీవిరాటపర్వవిమర్శనమును ముగించుచున్నాను.

---

# తిక్కనార్యుని సంస్కృతాభిమానము.

(ఆంధ్రకవితాసార్వభౌముఁడగు తిక్కనసోమయాజికి సంస్కృతభా
షయందుఁ గలగౌరవాతిశయము:-)

వ్యాసకర్త— విమర్శకాగ్రేసరాదిబిరుదావళీవిరాజిత
బ్రహ్మశ్రీ కాశీభట్ట బ్రహ్మయ్యశాస్త్రిగారు.

---

ఆంధ్రపదములనే హెచ్చుగా వాడుచుఁ జక్కగాఁ గవిత్వము చెప్పిన కవికులతిలకుఁడగు తిక్కనసోమయాజి కూడ మనయితరనన్నయభట్టాద్యాదికవిపుంగవులవలెనే సంస్కృతమునే హెచ్చుగా వాడుచుఁ దన కవిత్వములో గీర్వాణవాణినే పోణిమిమీఱ నాదరించియున్నాఁడు. మన కవుల కందఱికును సంస్కృతమునందు గౌరవాతిశయ మున్నట్లే యతకిని గలదు. కనుఁడు:— ఈతఁడు తన ప్రథమకావ్య మగునుత్తరరామాయణమునకు మొదట-

శ్లో. శ్రీ రాస్తాం మనుమక్షితీశ్వరభుజా స్తంభే జగన్మండల
ప్రాసాదస్థిరభారభాజి దధతీ సా సాలభంజీశ్రియమ్
శుండాలోత్తమగండభిత్తిషు మదవ్యాసంగవశ్యాత్మనాం
యా ముత్తేజయతే తరాం మధులిహా మానందసాంద్రా స్థితిః

అని తన తెలుఁగుపుస్తకమునకు నొకప్రౌఢ మగుసంస్కృతశ్లోకమును మొదట వేసియున్నాఁడు. ఎందుచేత ననఁగా, సమస్తభాషలకు మాతృభాషయని తా నితరులవలెనే సంస్కృతమును మాతృభాషయని నమ్ముచున్నాఁడు, కావునఁ, దాను మొదట గౌరవింపఁగలందులకై యట్లొనరించియున్నాఁడు.

తిక్కనసోమయాజి ప్రప్రథమమునఁ దా నంతగాఁ గవిత్వములో నంతప్రౌఢముగా లేనిదినములలో వ్రాసినయుత్తరరామాయణము నుదాహరణమునకుఁ బనికిరా దందురా? కవిబ్రహ్మ యగుసోమయాజి తన యుత్తరరామాయణములో మొదటనే, తా నుభయభాషలఁ బాటించు

శిల్పమునఁ బారగుఁడన్ గళావిదుఁడ ననియును వ్రాసికొనియున్నాఁడు. ఇట్లుండ నామహాకవి వాక్యములను బాటింపక యుత్తరరామాయణము వ్రాయునప్పటి కంతగాఁ బ్రౌఢుఁడు కాఁ డని మనము చెప్పవచ్చునా? ఇదియా! కవిబ్రహ్మయందుఁ జూపు గౌరవము? పోనిండు. తిక్కనార్యుఁ డప్పటి కంతగాఁ బ్రౌఢుఁడు కాఁ డనియు, భారతము వ్రాయునప్పటికిఁ బరిపూర్ణప్రౌఢుఁ డాయె ననియు, భావింతము. అయినను నది (భారతము) వ్రాయునప్పుడు కూడఁ దెలుఁగునందుకంటె సంస్కృతమునందే యెక్కువ గౌరవము చూపెను. భారతములోని మొదటిపద్య ముత్తరరామాయణ మునందువలె సంస్కృతశ్లోకము కాకపోయినను సంస్కృతపదభూయిష్ఠ మై యున్నది. కనుఁడు:—

ఉ. శ్రీ యన గౌరి నాఁ బరఁగుచెల్వకుఁ జిత్తము పల్లవింప భ
ద్రాయితమూర్తి యై హరిహరం బగురూపము దాల్చి విష్ణురూ
పాయ నమ శ్శివాయ యని పల్కెడుభక్తజనంబు వైదిక
ధ్యాయిత కిచ్చు మెచ్చు పరతత్త్వముఁ గొల్తు నభీష్టసిద్ధికిన్.

ఇది కేవలసంస్కృతశ్లోకము కాకపోయినను, సంస్కృతపదబహుళ మై గీర్వాణశ్లోకతుల్య మై తిక్కనార్యునకుఁ గలదేవభాషాగౌరవమునే సూచించుచున్నది. అది వదలివేయుఁడు. అది గాక విరాటపర్వముగూడఁ దిక్కనార్యునకుఁ గలసంస్కృతభాషాగౌరవమునే యీక్రిందిరీతి వేనోళ్లఁ జాటుచున్నది. తిక్కనార్యుఁడు తనకృతిపతి యగుహరిహరనాథుఁడు, తన యొక్క తెలుఁగుపద్యముల నన్నింటిని నటుంచి యీక్రిందితనయొక్క సంస్కృతశ్లోకము నాధారముగాఁ గొని, యాతఁ డొనరించిన తెలుఁగుభారతమునకుఁ, గృతిపతిత్వము నర్థించి వచ్చిన ట్లాతఁడు తనభారతములో మొదటనే వ్రాసికొనినాఁడు. తా నెప్పుడో రచించిన యీక్రిందిసంస్కృతశ్లోక మొకటి కల దఁట. అది యేది యన-

కిమస్థిమాలాం కిము కౌస్తుభం వా పరిష్క్రియాయాం బహుమన్యసే త్వమ్
కిం కాలకూటః కిము వా యశోదాస్తన్యం తవ స్వాదు వద ప్రభో మే.

అనుశ్లోకము నెంతయో యాదరించెను. దీనిం బట్టి హరిహరనాథుఁడు తెలుఁగుభారతమునకుఁ గృతిపతిత్వము నర్థించె నఁట. తిక్కన ర

చించిన పందలు వేలు తెలుఁగుపద్యము లుండఁగా వానిని వేసిని [illegible] పక, యెవ్వఁడో రచించిన సంస్కృతశ్లోకము నింతగాఁ బాటింప నేల? [illegible] గీర్వాణము నందలి గౌరవవిశేషముచేతనే కదా! ఇఁక భారతము [illegible] బోవుదము. తిక్కన యొనరించిన విరాటపర్వములో నతిదీర్ఘసంస్కృ[illegible] మాసములు వేసినపద్యము లనేకములు గలవు. అతఁడు తెలుఁగు[illegible] యిట్లు గౌరవము కలవాఁడు మాత్ర మెట్లగును? బ్రహ్మశ్రీ గుఱ్ఱ[illegible] రామయ్య ఎం. ఏ. గారు తమకవిత్వవిమర్శనములో నన్నపార్యుఁడు [illegible] చ్చగు సంస్కృతాభిమానియగుటచేఁ, దనభారతములో హెచ్చుగా [illegible] డైనసంస్కృతదీర్ఘసమాసములను వేసె ననియుఁ, దిక్కనార్యుఁడు సం[illegible] తమునం దెచ్చుగుగౌరవము లేనివాఁ డగుటచేఁ దెలుఁగువాక్యము[illegible] చ్చుగా వేసె ననియు, శాసించి వ్రాసిరి. కాని యీయనవ్రాఁతలో సత్య[illegible] లేదు. తిక్కనయే తనపద్యములలో నతిదీర్ఘము లగుసంస్కృతసమాస[illegible] లను వాడియున్నాఁడు, కనుఁడు:—

"మౌళిస్రక్సంగరంగన్మధుకరపటలీమాంసనాకృష్టవిద్యా
శాలిస్ఫారాబ్జరేఖాంజలిపుటఘటనాచారుఫాలస్థలశ్మా
పాలశ్రేణీపిశాలాంబకకుముదవనీబాంధవాయత్తచంద్ర
శ్రీలీలాగాఢకాంతిస్మితవదనరుచిస్ఫీతు నాగేంద్రకేతున్.

ఇది యొక్కటేసమాసము. అతిదీర్ఘము. సంస్కృతపదభూయిష్ఠ[illegible] ఇంత దీర్ఘసమాసములు గలపద్యములు నన్నయభట్టు కూడ రచి[illegible] యుండలేదు. అతఁడు మృదుమధురసమాసములు చదువరులకు సు[illegible] ముగా బోధలోనికి వచ్చురీతిగా వ్రాయుచుండెడివాఁడు. కాని తిక్కన[illegible] గవిత్వములోఁ దనప్రౌఢత్వాతిశయమును జూపుటకుఁ బ్రయత్నించె[illegible] డు కాఁడు. తిక్కన నాగేంద్రకేతుని వర్ణించి యుండఁగా, నన్నయ[illegible] ర్వములో ధర్మరాజు నీక్రిందిరీతిగా వర్ణించెను.

మ మదమాతంగతురంగకాంచనలసన్మాణిక్యగాణిక్యసం
పద లోలిం గొనితెచ్చి యిచ్చి ముద మొప్పం గాంచి సేవించి[illegible]
య్యుదయాస్తాచలసేతుశీతనగమధ్యోర్వీపతుల్ సంతతా
భ్యుదయున్ ధర్మజుఁ దత్సభాస్థితు జగత్పూర్ణప్రతాపోదయున్.

ఈపద్య మైనను దిక్కనార్యునిపద్యమంత దీర్ఘ మైనది కాదు. తిక్కనార్యుఁడు వాడినపష్ఠ్యంతములు:—

పష్ఠ్యంతములలోనికిఁ దెలుఁగుపదములు తిక్కనార్యుఁడు చేరనైనఁ జేరనీయలేదు. తిలకింపుఁడు:—

క. ఓంకారవాచ్యునకు నస, హంకారనిరూఢభావనారాధ్యునకున్
హ్రీంకారమయమనోజ్ఞా, లంకారోల్లాసనిత్యలాలిత్యునకున్.
క. హరిహరనాథునకు మరు, త్సరిదాకల్పితమనోజ్ఞచరణశిరస్సుం
దరమూర్తికి భావనత, త్పరచేతోయుక్తభక్తపరతంత్రునకున్.

(విరాట- ప్రథ- 31-35)

ఏమి యిట్టితావులఁ దెలుఁగుండదా ? ఆశ్వాసాద్యంతపద్యములలోఁ గూడఁ దెలుఁగుపదముల రానీయలేదు. తిలకింపుఁడు:—

క. శ్రీమదపాంగాలోకన, దామసకృత్సంగరూఢతాదృశవిభవో
ద్దామాశ్రితలోకాలో, కామయనిర్వారణనిపుణ హరిహరనాథా.

(విరా. ద్వితీయాశ్వాసము. 1)

మాలిని. సురపతిదృఢచూడాశోభిరత్నాంశువీచి
స్ఫురణసుభగపాదాంభోజసంచారకేళీ
పరిచయకలనాలబ్ధవ్యయాతీతసౌఖ్యో
త్తరమునిజహృన్మాద్యన్మరాళప్రసన్నా.

(విరా. ఆశ్వాసము 2. 365)

క. శ్రీత్వశివత్వాలంబన, తత్వాశ్లేషాత్తశబలతాసంగతక
ర్తృత్వాదికలీలాత్తమ, హత్వాలంకారభావహరిహరనాథా. విరా-3ఆ.

తనకృతినాథుఁడైన హరిహరనాథునిగూర్చి ముచ్చటించుటయుఁ దనయందనుగ్రహముచేఁ గృతిపతిత్వమున కంగీకరించుట లోనగు విషయములను సంస్కృతపదములతోనే చెప్పెను. నడుమనడుమ నేదేనియొక చిన్న తెనుఁగుపదము పడినఁ బడునుగాక ! తనకుఁ గొల్లలుగాఁ దెలుఁగుపదము లుండ వానిని వదలి దేవభాష నాశ్రయింప నేల? కనుఁడు.

క. భూరిభవత్కారుణ్యా, క్షీరాంబుధి నాదుతుచ్ఛచిత్తంబును వి
స్తారమహితముగ నుసిచితి, వారయ నచ్చెరువుగాదె యఖిలాండపతీ.

(విరాట ఆ. 1. పద్యము 19)

ఇట్టితావులఁ బ్రయోగార్హత సంస్కృతమునకే కల దని దీక్షి తలఁచి యుండవచ్చును. స్త్రీరత్న మగుపాంచాలి కీచకునితోఁ బల్కిన పల్కులలో గీర్వాణవాణి యాక్రిందిరీతి నవతరించినది. చిత్తగింపుఁడు:—

శా. దుర్వారోద్యమబాహువిక్రమరసాస్తోక ప్రతాపస్ఫుర
ద్గర్వాంధప్రతివీరనిర్మథనవిద్యాపారగుల్ మత్పతు
ల్గీర్వాణాకృతు లేవు రిప్డు నిను దోర్లీలన్ వెసం గిట్టి గం
ధర్వుల్ మానముఁ బ్రాణముం గొనుట తథ్యం బెమ్మెయిం గీచకా!

తరువాతను ద్రౌపది కోపించి మాటలాడు మాటలలోఁ దిక్కన హెచ్చుగసంస్కృతవాక్యముల వాడెను. ఈవిధముగా గీర్వాణమును వాడినతిక్కన దేవభాషయం దెంతగౌరవము కలవాఁడో వేఱుగాఁ జెప్ప నేల? ఆతఁడు తెలుఁగుపదముల హెచ్చుగా వాడెను గాదా? యఁను రేనిఁ బలుతావుల శుద్ధాంధ్రపదములఁ బెట్టుచు వచ్చినమాటయు నిజమే. మఱికొన్ని తావుల సంస్కృతము హెచ్చుగా వాడెను. అసలు సోమయాజి జాను తెలుఁగుకాలములోనివాఁడు. కావునఁ దెలుఁగుపదములు హెచ్చుగా నుఁడిన నుండవచ్చును. ఏమైన నేమి గీర్వాణమునందు ననంత మగుగౌరవాతిశయము గలవాఁ డని భారతమువలన స్పష్టమగుచున్నది.

కురుసేనను జూచి భయపడి యుద్ధభూమినుండి పాఱిపోయిన గేహేశూరుఁ డగుభూమింజయుఁ డర్జునునితోఁ బల్కినపల్కు లెట్లున్నవో చూడుఁడు:—

ఉ. బాహుసమగ్రశత్రుమదభంజనశౌర్య సమస్తలోకచే
తోహరమూర్తి నీ విటులు దోఁచుట నాకుఁ బ్రసన్నవిస్ఫుర
ద్దేహము తోడ భాగ్యమయదేవత సన్నిధిసేత గాదె స
మ్మోహమువాసెఁ జిత్తము ప్రమోదరసత్వముఁ బొంది పొంగెడున్.
విరా. ఆ ౪. ప ౧౧౦.

ఈరీతిగాఁ బ్రతిసామాన్యుచేతను గీర్వాణవాక్యముల జోరుగా బలికింపఁబడి యున్నవి.

అతివిస్తర మేల? గ్రంథవిస్తరభీతిచే దీని నింతటితోఁ గట్టిపెట్టుదము.

# శ్రీ. శ్రీ కాశీనాథుని నాగేశ్వరరావుపంతులుగారు

---

ఆంధ్రసాహిత్యపరిషత్తునకు యావజ్జీవసభ్యులు, దేశోద్ధారక, విశ్వదాతృకళాప్రపూర్ణాదిబిరుదాంచితులు, శ్రీ కాశీనాథుని నాగేశ్వరరావుపంతులుగారు శివసాయుజ్యమును బొందిరని వ్రాయుట కెంతయుఁ జింతిల్లుచున్నారము. దేశముమీఁదవలెనే పరిషత్తుమీఁదను వీరికిఁ జాల నభిమానము గలుగుటచే నాంధ్రదినపత్రికను, భారతిని, ఆంధ్రపత్రికా ప్రచురణము లగుననేకగ్రంథములను నుచితముగాఁ బరిషత్తున కొసంగుచుండిరి. వీరికిఁ గళాప్రపూర్ణబిరుదము చిరకాలముక్రిందటనే రావలసినది. ఆంధ్రవిశ్వకళాపరిషత్తువారు మొన్నమొన్న గుర్తించి యీబిరుదము నొసంగిరి. విశ్వదాతృదేశోద్ధారకబిరుదములు పంతులుగారిస్వార్జితములు. లోకము మహార్థులకు బంతులుగారివలనఁ గైకొని యల్పార్థము లగు బిరుదముల నొసఁగినది. "ఇద్ధపుణ్యు నింద్రుగృహమ్ము నెఱుఁగుదయ్య" యన్నట్లీపంతులుగారింగూర్చి యెన్నియుగములు గతించినను లోకమునకుఁ బరాకుండకుండునట్లు వీరే తమయశస్సును స్థిరముగాఁ జేసికొని చన్నారు. కావుననే లోకము వీరికిటీవలఁ గీర్తిశేషబిరుదమును శాశ్వతము చేసినది. ఈబిరుదము మ్రోల నెన్నిజ్ఞాపకచిహ్నములు నెలకొల్పినను నిలుపవు. వీరియౌదార్యమునుగూర్చి వర్ణించుట సాహసము. కవులు, పండితులు, వ్యాసకర్తలలోఁ బెక్కండ్రు వీరిచేఁ బారితోషికములను బడసి రనుట నిర్వివాదాంశము. ఆంధ్రభాషయందు దినపత్రికను స్థాపించి వీరు మన భాషకును మనకును మహోపకారమును గావించియున్నారు. భాషావిషయకము లగువ్యాసములను నాంధ్రపత్రిక సారస్వతానుబంధమునఁ బ్రకటించుచుండిరి. మాతృభాషయం దాంధ్రు లెంత యభిమానమును జూపవలయునో, దానియభివృద్ధికై యెటులు పాటుపడవలయునో వీరి ధన్యజీవితము మనకుద్బోధించుచున్నది. వీరియుత్సాహము, కార్యదీక్ష, త్యాగము సర్వజనవిదితములు ఆంధ్రగ్రంథమాలను స్థాపించి యందు

బసవపురాణము మొదలగు మంచి గ్రంథములను బెక్కింటిని బ్రకటించి యున్నారు. కీ. శే. కొమర్రాజు లక్ష్మణరావుగారిచేఁ బ్రారంభింపఁబడిన యాంధ్రవిజ్ఞానసర్వస్వమును దిరిగి నూతనముగఁ బ్రకటింపఁగోరి రెండు సంపుటములను బ్రకటించిరి. మిగిలినసంపుటములఁ గూడఁ బ్రకటింపవలయు నని యుత్సాహముతో నుండఁగనే కాలధర్మమును జెందిరి. ఆంధ్రపత్త్రికాకార్యాలయమువారు మిగిలినసంపుటములను గూడఁ ద్వరలోఁ బ్రకటించినచో వీరియాశయము సఫలము కాఁగలదు. ఇటీవల వ్యాసకర్తలకును, గ్రంథకర్తలకు నుపయోగించు నటులు పారిభాషికపదకోశము నొకదానిని ముద్రించియున్నారు. అట్టిగ్రంథ మాంధ్రభాషకు మిక్కిలి యుపయోగకరమైనది. శ్రీనాగేశ్వరరావుపంతులుగారు తాము వ్యాపారమున నార్జించిన ద్రవ్యమును సద్వినియోగ మొనర్చి ధన్యతను గాంచిరి. వీరియుదారాశయముల మనసునం దుంచుకొని యాంధ్రు లందఱును దమ శక్తికొలఁది నాంధ్రభాషకు నాంధ్రరాష్ట్రమునకును సేవ యొనర్చి కృతకృత్యతను గాంతురుగాత.

కొంతకాలముక్రిందట నొకరు వీరిదానముపై రచించిన కొన్ని పద్యములఁ బాఠకులకై యిందుఁ జేర్చుచున్నారము.

ఉ. దానము సాజమైననిను దగ్గఱ జంకిన దాను లప్పటి
గ్యానముసేయ వెంబడి యఖండితతావకకీర్తి యేఁగి య
ద్దానులదానకీర్తి బురదం గలిపించెను వారిచేతనే
దానను మాన్యతం గనిరె దద్గతి యోవరదానమానితా.

ఉ. దాత యొకండు చేముడిచెఁ దావకదానము గాంచి లజ్జచే
దాత యొకండు నిల్వవను దాఁగుచుండెను నీదు సిగ్గునన్
దాత యొకండు డాఁగె వసుధావివరంబున నీదు లేక యీ
దాతలు దాతలయ్యె ఋణదాతలుగాక ధరాతలామరా.

ఉ. దాతలమాచు లేచినను దావకదానయశం బదొక్క పెన్
దాతను వీఁపుచీల్చె నొకదాతను దస్సులుచెక్కె నొక్కమే

ద్దాతను బట్టి కోసి చెవులం జమడా యొలిపించె ధాత్రి నీ
దాతలు దాతలయ్య ప్రణదాతలుగాక ధరాతలామరా.

మ. న్నపతుల్ దాతలమంచుఁ జెప్పుకొనుచుర్ హేమాద్రిచందంబుగా
నుపరాగంబుల యప్పు డేకదిపదార్థో యుప్పఁ బప్పిచ్చి; పూ
ర్వపుశిబ్యాదుల దాతలందురు శరీరచ్ఛేదనార్థిఁ బలే
యపదానంబులుగావె నాఁటి భవత్త్యాగంబు మ్రోల న్నధీ.

మ. నపదానంబులఁ ద్రాగఁబోతులను సన్మానించుఁ, జండాలికిం
జవిచూపున్మదరేఖ, నాగమది యా నాగమ్మ, యట్లయ్యు హ
స్తవిశేషంబున దానిసేరు వెలసెం ద్వద్దానసందర్భము
దు విశేషించి వచింపఁబోలునొకో యామర్దాని నాగేశ్వరా.

---

# అభిమన్యుపరాక్రమము.

—కర్త్రా అచ్యుతరామశర్మగారు, విజయనగరము—

---

అభిమన్యుఁడర్జునునికిఁ దగినకుమారుఁడు. ఈతనిసాహసము, ధైర్య స్థైర్యములు, సంగరకౌశలము వర్ణనాతీతములు. ధర్మరాజుపద్మవ్యూహం బర్జునునకుఁదప్ప నన్యుల కభేద్యంబగుటఁదెల్పి యాతని దచ్ఛేదనంబునకు నియోగించుసమయంబున నాతఁడనినమాట లతనిసాహసమును, సహజ శౌర్యమును వేనోళ్ళఁజాటుచున్నది. పద్మవ్యూహంబు వెడలునట్టి తెఱం గు తానెఱుంగకున్నను, అభిమన్యుఁడు పెదతండ్రికోర్కె నెఱవేర్పఁబూ నుటయందే యాతని క్షత్రియకులోచితమైన సంగ్రామోత్సాహము తేట పడుచున్నది. అభిమన్యుఁడు భీమునితో నన్న "నరుఁడున్ సుభద్రయున్ దనయుని గాంచి సంతసముఁ దాల్చుట యంతయు రిత్తఁబుత్తునే" యను వాక్య మాతనినిర్భీకతను నపారపరాక్రమముతోఁ బ్రకాశించుసాహస మును దేటతెల్లము చేయుచున్నది.

యుద్ధము చేయుపట్ల నభిమన్యుఁడు ప్రదర్శించిన చాతుర్యము, నుత్సాహము, ననన్యసామాన్యములు. ఎందఱెన్ని నిశితసాయకముల నేసినను జంకక వెనుకంజ వేయక తనపై కెత్తివచ్చిన కౌరవయోధుల నందఱ నొంచిన యీతని విక్రమస్ఫూర్తి యిట్టిదని వర్ణింప నలవి కాదు. తానొంటరి యైనను నెదిరివీరు లనల్పసంఖ్యాకులై యున్నను నించుకేని భయపడక 'యశో వా మృత్యుర్వా' అని యపారోత్సాహమున సంగరకేళి నొనరించిన యభిమన్యుని ధైర్యపటిమ కొనియాడఁదగి యున్నది. కౌరవవీరు లెంత ప్రథితులైనను నభిమన్యుని విక్రమావిక్రమును జూచి వెఱఁగుతోడి వెఱపునొంది కంపితులైరి. నిజముగాఁ బొంగెడు కౌరవ సేనకు వాసవిసుతుఁ డేచిన చెలియలికట్ట విధంబున నుండె ననుటలోను, నతని చుట్టుముట్టిన పెక్కుబలమ్ములు మహోదధిఁ బోలఁగ నాతఁడు మందరమ్ము చందమ్మున నొప్పె ననుటలోను నత్యుక్తి లేదు.

అభిమన్యుని ధాటి కోర్వలేక పెక్కురు మడియుటయుఁ గౌరవసేన లన్నియు భీతిఁ దెరలుటయు నస్త్రగురుండైన ద్రోణుఁ డాతనిని "అర్జునుఁడును నభిమన్యుఁడును నని నొక్కరూప, చూడఁ జిన్నవాఁడు కాని యలంతులఁ బోయెడివాఁడు కాఁడు." అని వెఱపుతో నాతని నగ్గించుటయుఁ గర్ణునంతటి మహాయోధుఁడు ద్రోణునితో "గాండీవిఁ గలనఁ గలచె ఱుఁగునుమ కాదె యాతనిచే యింత బెట్టిదంబు కాదని" అభిమన్యుని సర్వనాతిశాయిగాఁ జెప్పుటయు నాతని సంగ్రామకేళీవిజృంభణమును బెక్కుతెఱంగుల వివరించుచున్నది. ఆతఁడు పలువురు యోధులొక్కమ్మడిఁ దన్నుఁ జుట్టుముట్టినప్పుడు వెనుకంజ వేయకుండుట యే కాక సహాయమునైన నరిపలేడు. భీమాదు లనినట్లు తోడుపడ రాలేదని వారి నిందింపలేదు. ధైర్యముతోఁ గౌరవసేనామహాంభోధి నడుమ దుర్ధర్షమగు మందరనగంబుకై వడి నిలిచి తన దోర్విక్రమస్ఫురణంబు తెల్లంబు నేసె.

అభిమన్యుఁడు దుశ్శాసనుని పుత్త్రులతో ననిన మాటలోని ధైర్యమున కనుగుణముగా నున్నవి. అతఁడు సంగరంబున నెన్నివిధ

బుల బాణంబులు వచ్చి తగులుచున్నను భయపడక వానినన్నిటి వెను కను మరల్చుటయో ఖండించుటయో యొనర్చెను. వీని నన్నిటిం బట్టి చూడ నభిమన్యుఁడు తండ్రిని మించినధైర్యశాలి యని యనకతప్పదు. పెక్కురు బోయలు మదవారణంబు నుక్కడంచు చందంబునఁ గౌరవ యోధు లందఱుఁ గ్రూరగతి నాతని జంపిరి, కాని, ధర్మరణంబున నైన నాతని జయింప నెవ్వారికిని శక్యమై యుండెడిది కాదు. అతఁడు తొలు దొలుతఁ దనతండ్రులతో నన్నట్లు కౌరవులను గోపకుఁడు గోగణంబులం దోలువిధంబున దోలి తనయపారవీరతావిస్ఫూర్తిని వెలువరించెను.

---

# గ్రంథస్వీకారము.

## 1. సిద్ధిగణపతిసీసములు.

రాజమహేంద్రవరము లక్ష్మివారపుపేట నివాసులు శ్రీ అల్లక వీరభద్రకవిగారిచే రచియింపఁబడినది. "సిద్ధిగణపతీ"యను మకుటముతో భక్తికాండమున ౧౧౮ కందములును, జ్ఞానకాండమున ౨౦౫ కందము లును, వైరాగ్యకాండమున ౧౭౭ కందములును గలవు. కవిగారు రాజ మహేంద్రవరములోని పెద్దపెద్ద పండితులకు శుశ్రూషయొనరించి యల వఱిచికొనిన కవితావిశేషమున సీసములను రచియించిరి. ప్రతిపద్యమున నొక్క లోకోక్తి సాధారణముగా నిమిడ్చియున్నారు. కొన్నికొన్ని చక్కగా మృదువుగా, నున్నవి. కొన్ని మోటుగా నున్నవనక తప్పదు. వీరికిఁ బెద్ద పెద్దమాటలు ను మాఱుమూలపదములు ను బద్యములలో నిముడ్చుట యిష్టము. మూఁడవకాండములోఁ గడపట ౨౫ పద్యముల కంతరార్థము కూడఁగలదని తెల్పి భావమునుసూచించుచువచ్చిరి. తాము ప్రయోగించి నక్లిష్టపదముల కర్థములఁ గొన్నింటిని దుదను బుటలయడుగునను జేర్చిరి. పద్యములన్నియు నొక్కప్పుడు వ్రాసినవిగావు. చాలకాలమునుండి యపు డపుడు వ్రాయుచువచ్చినవి. పూర్తిమాత్రము శా.శ.౧౮౪౦ కాళయుక్తిలో జరిగినట్లు మూఁడవకాండలో ౧౭౬ పద్యము తెల్పుచు. పలువురుమహా

పండితులు వీరిపద్యములపై వారివారియభిప్రాయముల నిచ్చియున్నారు. ముద్రణవ్యయము శ్రీ శ్రీ శ్రీ జయపురముమహారాజావారొసగిరి.

క. తనపూర్వజన్మసుకృతము, నను గాక ప్రబంధ మల్లునైపుణ్యము గ ల్గునె పండితుఁడైన చుదోఁ, చినయట్లఁగవిత్వఫణితిసిద్ధిగణపతీ. ౧-౧౨

అని కవిగారనినది వాస్తవమే.

కొన్నిపద్యములు సంస్కృతమునకుఁ దెనుఁగుని గలవు.

క. కవితయువనితయు విత్తము, దవులుండితమంతఁదామెవాఙ్గాన సుఖమొ నవి బలితమున న్వచ్చినఁ, జివుకులవున్గాదె జగతి సిద్ధిగణపతీ. ౧-౨౧

వీరిస్వాతిశయరాహిత్యమునకుఁ దగుపద్యము.

క. తెలియనిగ్రంథార్థము మా
తెలిసినవారివలెఁ గవులఁ దెగడుదు రజ్ఞుల్
పలువుర చీవాట్లం బడఁ
జిలిపి ప్రసంగముల జగతి సిద్ధిగణపతీ. ౧-౬౯

క. సిరిమంతులు నొసఁగిన వం, కరమాటలనైన మాన్గానరు కాదని ద గ్గఱు; వారిమొగముగనియే?,సిరిగన్గొని గాని జగతి సిద్ధిగణపతీ.

మా తెలిసిన- తెలిసినవాళ్లు-సిరిమంతులు మొదలయినవి ప్రమా దపతితము లేమో.

నంటుసెడియింట, నటె, తా
సింతానఁ దగులుట జగతిసిద్ధిగణపతీ. పుట 66- ౧౩౦

ఇది యేకవిప్రసంబోధనవంటిది గాఁబోలును

క. కుంచము కూడంబెట్టిన
మంచము మాయించెనన్న మాద్రి సరియ యా
ర్జించినదొకఁ డైనను వె
చ్చించినదొకఁ డౌటఁ బ్రకృతి సిద్ధిగణపతీ. ౨-౪౯

ఇది లోకోక్తి ప్రయోగమున కుదాహరణము.

వీరినీతిపద్యములు బహువిధముల నుపకరించి వీరిశ్రమమునకుఫల ము నొసంగుఁగాక, దీనివెల అణాలు. కవిగారియొద్దనే దొరకును.

## 2. ఆర్యాసప్తశతీసారము.

సికిందర్రాబాదు మహబూబు కాలేజి తెలుఁగుపండితులు శిరోమణి సన్నిధానము సూర్యనారాయణశాస్త్రిగారిచే నాంధ్రీకరింపఁబడినది. గోవర్ధనాచార్య విరచిత సప్తశతిలోనుండి ౪౦౧ పద్యములు మాత్రమే యిందుఁ దెనిఁగించి ముద్రించిరి. కావుననే దీనికి సప్తశతీసార మని నామకరణముచేసిరి. అమరుకకవికృతమగు నమరుకమువలెనే యిదియు నాయికానాయిక ప్రశంసలు గలిగిన శృంగారకావ్యము. ఇందలిపద్యములు కొన్ని తొలుత, భారతి, ఉగాదిసంచికలలోఁ బ్రకటింపఁబడినవి.

గ్రంథము సరస మైనది. శ్రీ శ్రీ శ్రీ దైవముదిన్నె రామారెడ్డిగారికి దీని నంకితముగావించిరి. చక్కనిపద్యములుకొన్ని —

గీ. పల్లవిగఁ గూర్చి వర్ణంబుఁ బాడు; వేణు
వల్లివాయించుఁ; బల్లించు వల్లకిపయిఁ;
జిలుక మొకరికిఁ బాఠంబుఁ జెప్పుచుండు
నీకునామాక్షరంబు లానెలఁతమిన్న. ౧౨౨

గీ. తనమసన్ననిదార మాధారముఁ గొని
వ్రేలుచున్నది యువకుఁడా! సాలెపురుగు
కరముఁ బైకెత్తిపట్టిన గాలముతుదఁ
గర్కటమువోలె నల్లదే కాంచుమోయి. ౧౮౩

గీ. తాళఁజాలక క్రేగంటితాఁకుఁదలకు
సొమ్మసిల్లె నతండు మార్గమ్మునందె
జందెపుఁబ్రోఁగు వానివంశంబుఁ దెలిపె
రమణి! నినుఁ జుట్టుకొన్నది బ్రహ్మహత్య. ౯౪

గీ. ఓకురంగమ! మడి వ్రాలియున్న సరస
శాలిమంజరిఁ ద్యజియింపనేల యిపుడు
గడికతూపులు గడికవిల్ గడికయొడలు
గలగడికమానిసి యితండు వలదు వెఱవ. ౧౧౩

గీ. తొలకరిఁ బరిత్యజించి యాలలితమైన
గిరినితంబంబు, నెదఁ గన్నె మెఱుఁగుఁబూని
జలదమా ! సంచరింతువు చదలివీథి
గాలి సోఁకెనె యేమి యీవాలకంబు.

వెల రు. ౧. సికింద్రాబాదులో 3993 మార్కెట్టువీథి వేంకట్రామా అండు కోలో దొరకును.

—3. మురారిమహాకవి—

కాకినాడ, పిఠాపురము రాజకళాశాలలో, ఆంధ్రగీర్వాణభాషోపన్యాసకులు ఈయ్యణ్ణి వేంకటవీరరాఘవాచార్యులు ఎం. ఏ. గారు రచియించినది. అనర్ఘరాఘవనాటకకర్త యగు మురారికవిం గూర్చిన యనేకవిషయము లిందుఁ జర్చింపఁబడినవి. పలువురు పలువిధములుగాఁ జర్చించిన మురారికవివిషయము లిందు విమర్శించియున్నారు. ఈచిన్నిపొత్తము, మొదట కీ. శే. సత్యవోలు కామేశ్వరరాయకవిగారి యనర్ఘరాఘవమునకుఁ బీఠికగా నందుఁ జేర్పఁబడినది. తరువాత వేఱుగాఁ బుస్తరూపమున నేర్పడినది. ఇందు 48 పుటలలో మురారి జన్మాదికము, నివాసస్థానము, కాలము, బిరుదములు, సుభాషితావళులలో నతనిశ్లోకములు, సాహిత్యవాఙ్మయము, మొదలగునంశములు, పూర్వచరిత్రకారులును విద్వాంసులుం జేసిననిర్ణయముల యుక్తాయుక్తతలునిరూపింపఁబడినవి. అనర్ఘరాఘవమునకు వ్యాఖ్యానముల నెందఱువ్రాసిరో యెందఱు తెనిఁగించిరో, వాఖ్యాములు నాంధ్రీకృతములు, వీనిలో నచ్చుపడినవెన్నియో, యచ్చుపడని వెన్నియో తెలిపియున్నారు. నడుమనడుమ, కామేశ్వరరాయకవిగారి యనర్ఘరాఘవాంధ్రీకరణములోని యాచిత్యానౌచిత్యములను సూచించుచు వచ్చిరి. మురారికవింగూర్చిన విషయములను విపులముగాఁ దెలియఁగోరువారు దీనిని దప్పక చదువఁ దగును. ఆచార్యులుగారి యథోజ్ఞాపికలలోఁ బరిశీలించు వారికి విశేషాంశములు పెక్కులు తెలియవచ్చును.

శ్లో. మురారిపదచిన్తాయాం భవభూతేస్తు కా గతిః
భవభూతిం పరిత్యజ్య మురారి మురరీకురు.

శ్లో. భవభూతి మనాదృత్య నిర్వాణమతినా మయా
మురారిపదచిన్తాయా మిద మాధీయతే మనః.
శ్లో. మురారి పదచిన్తా చే త్తదా మాఘే మతిం కురు
మురారిపదచిన్తా చే త్తదా మాఘే మతిం కురు.
వెల ౮ అణాలు.

## 4. మొయిలురాయబారము.

ఇది బ్ర. చర్ల గణపతిశాస్త్రిగారిచే రచియింపఁబడినది. వీరు నారాయణశాస్త్రిగారి కుమారులు. మొయిలురాయబార మనునది కాళిదాసకృత మగు మేఘసందేశమునకుఁ దెనుఁగుపేరు. రాయబారము తగ వొక్కటి యున్నది. రాయభారమా! రాజభారమా యని కొందఱు. పలువురు రాయబారమును దెనుఁగే యనుచున్నారు. రాయబారమన దౌత్యము. భారతములో సంజయయానము, భగవద్యానము నని కలదు. లోకములో వాడుకయే కాని సంజయరాయబారము, శ్రీకృష్ణరాయబార మని కనఁబడదు. ఉదయనోదయములో-

"భద్రాసనోపరిభాగంబున రాయభారులు సుధీపౌరాణికు
లైదిసీశ్వరులు నున్నత్వపుఁబుం బ్రధాను"లని కలదు—కొండొకచో-

"కర్ణాటసింహాసనసామ్రాజ్యలక్ష్మీసార్వభౌమ కారుణ్యలబ్ధకొండవీటిప్రముఖనిఖిల దుర్గాధిపత్యాభిరామ బయకారరామప్రధాన సుత్రామ సర్వసర్వంసహాభారభరణ...దక్షిణ భుజా స్తంభుండును...తృణీకృత పంచబాణుండును, దౌవారికాహూయమానావని ధరరాయభారామాత్యోదగ్రతరస్వర వ్యాహారసంకులభవనబహిర్ద్వారుండును"- అనియుంగలదు. పలువురు అంగదురాయబారము. శ్రీకృష్ణరాయబారము నని యీరీతిఁ దప్పుకొనుచున్నారు. పెద్దలు నిర్ణయింతురుగాక. ప్రకృతము ననుపత్తము:—

శాస్త్రిగారు మేఘసందేశములోని కథను దీసికొని చక్కఁగఁ దోఁచినవృత్తములలో నొక్క శ్లోకమున కొకటిరెండు పద్యములుగా మృదులముగ రచియించిరి.

మ. ఒకనాఁ డాతఁడు సుందరప్రకృతి వీక్షోన్మత్తుఁడై యుఁడ నం
తకె యాషాఢము తొంటినాఁడు చలియంగాఁ గింటిలో గ్రుచ్చిగొ
మ్మునొగ్గన్ డీకొన నాటితేటిన గజమ్ముంబోలె మేఘంబుకం
డ్లకుఁగట్టెం గడుదర్శనీయ మయి యర్థాంగిన్ స్మృతిందెచ్చుచున్.

ఈరీతిగా వీరికవనము ధారాళముగాఁ గన్పట్టుచున్నది. స్ఖాలిత్య
ము లందందుఁ గలవు. మేఘసందేశాంధ్రీకరణ మెవ్వరికయినను గష్టమే.
గ్రంథకర్తల ప్రయత్నము శ్లాఘనీయము. దీనివెల యెనిమిదణాలు. కవి
గారియొద్ద నిడుదవోలులో దొరకును.

## 5. కాశ్మీర గ్రంథావళి.

ఆంధ్రసాహిత్యపరిషత్తునకు ఘనతవహించిన శ్రీ శ్రీఅనంతశయన
ము, మైసూరు, బరోడా, మద్రాసు దొరతనములవారు తాముతాము
లోకోపకారముకొఱకు నుదారభావముతోఁ బ్రచురించుచున్న సంస్కృ
తాదిగ్రంథములను బెక్కింటిని దయచేసియున్నారన్న సంగతి పాఠకులకం
దఱకు విదితమే. ఈబహుధాన్యసంవత్సర ప్రారంభములో శ్రీరాజరాజే
శ్వర మహారాజాధిరాజ కాశ్మీరనరేంద్ర శ్రీహరిసింహాజీ బహద్దరువారి
యాజ్ఞానుసారము ప్రాక్తనపరిశీలన కార్యాలయాధ్యక్షులచేఁ బ్రకటింపఁ
బడుచున్న కాశ్మీరదేశ శైవసంప్రదాయగ్రంథములు ౨౧ సంపుటముల
ను ఘనతవహించిన శ్రీకాశ్మీర ప్రభుత్వమువారు కూడ నత్యుదారభావ
ముతో దయచేసియున్నారు. వీరికిఁ బరిషత్తెంతయుఁ గృతజ్ఞతాపూర్వ
కాభివందనములఁ గావించుచున్నది.

ఇందులో, నరేంద్రపరీక్షా -షట్త్రింశత్తత్త్వసందోహః- తంత్రసా
రః- శ్రీమాలినీవిజయోత్తరతంత్రమ్- శ్రీమృగేంద్రతంత్రమ్- స్పందసన్ది
యః,-శివదృష్టిః- నేత్రతంత్రమ్, స్తవచిన్తామణిః- మాలినీవిజయవార్తి
కమ్- స్వచ్ఛందతంత్రమ్ (7 సంపుటములు) ఈశ్వరప్రత్యభిజ్ఞా- లౌగా
క్షిగృహ్యసూత్రాణి- శ్రీతంత్రాలోకః- (10 సంపుటములు) మొదలగునవి

ముఖ్యగ్రంథములు. Hindu Realism, Kashmer Shaivism అనునవి యింగ్లీషుపుస్తకములు మనప్రాంతములోని శైవసంప్రదాయజ్ఞులీగ్రంథములను బలువురు చూచియుండరని తలంచుచున్నారము. దేశోపదేశము, నర్మమాల, యని క్షేమేంద్ర కృతములు గూడ రెండుగలవు- పండితులు పైదొరతనముల వారొసంగిన యుద్గ్రంథములను బఠింతురు గాక యని కోరుచున్నారము.

### 6. భక్తజీవనము.

శ్రీయుతులు పుతుంబాక శ్రీకృష్ణయ్యగారిచే రచియింపఁబడినది, పెదపాలెము సేవాశ్రమగ్రంథమాలలో నిది మొదటిపూవు. దేశోద్ధరణబుద్ధులు పెదపాలెము సేవాశ్రమమువారు చేయుకార్యములను దప్పక సర్వజనులు గుర్తింపఁదగిన విషయము. ౧. సారస్వతము ౨.కృషి 3. స్వదేశవస్తుప్రచారము నని దీనిలో మూఁడుశాఖ లున్నవి. ప్రస్తుత భక్తజీవనము సారస్వతశాఖలోనిది. శ్రీపుతుంబాక శ్రీకృష్ణయ్యగారు భక్తాంఘ్రిరేణువునని వ్రాసికొనిరి గాని భక్తాగ్రేసరు లనవలయును. నైచ్యానుసంధాన మది. వీరి భక్తిపారవశ్యమునకుఁ దగిన వాక్యములతో నీగ్రంథమిమిడి యున్నది. ఇం దష్టోత్తరశతమితప్రార్థనము లున్నవి. అష్టోత్తరశతమహిమవేత్తలకు విదితమే. "పరిపూర్ణా! అష్టోత్తరశతనామములచే నిన్ను సంబోధించి యొక్కొక్క నామమున కొక్కొక్క విన్నపమును రచింపవలె నని సంకల్పించి ప్రారంభించితిని. అది నేఁటితోఁ బరిపూర్ణము గావింపఁజేసితివి." అని నూటయెనిమిదవ విన్నపములో నున్నది. కావున నీవిన్నపములు మానవుని హృదయమును భక్తిరసపూరితునిఁ జేయును. ఈవిన్నపములను సేవాశ్రమములోని కర్మకరులచే నిత్యమును జదివింతు రని తలంతుము. ఇది వఱకున్న శ్రీవిష్ణుని యష్టోత్తరశతనామములుగాక యిందలి యష్టోత్తరశతవిన్నపము లితరనామములతోఁ జెప్పఁబడినవని యెఱుంగవలయును. ఈభక్తిరసగ్రంథమును శ్రీకృష్ణయ్యగారు తమతల్లిగారి కంకితము గావించియున్నారు. ఇంతకుమున్ను వీరు "తమ కష్టపరంపరలను భవదీయకీర్తిని ఛందోబద్ధము గావించి యున్నామని రెండవవిన్నపములోఁ

దెల్పికొనినారు. వానిని బాఠకులు వినవలసినదే. "నేఁటి మనోవేగము ఛందోబద్ధము గావించుటకుఁ దావిచ్చుటలేదు. మనసునఁబుట్టిన తలంపు లెల్లను నీకెఱిగింపక తప్పదు. అయ్యది పద్యమా గద్యమా యను శంక తో నీకు బనిలేదుగదా. నాకంతకు మున్నే పనిలేదు. ఇంక నాలేఖిని కడ్డేమి కలదు. నమోనమ శ్రీమన్నారాయణా!" అనిరి. నిజమే. ఒక్కొక్క విన్నపమునకు మొదట, శ్రీహరీ! పతితపావనా! కృపావిలోకనా! జగన్నాథా! అని యను గడపట నమోనమశ్శ్రీమన్నారాయణా! అని యను జేర్పఁబడినవి. గ్రంథమామూలాగ్రము మృదుమధురపదజాల ముతో నిరుద్దముగ నున్నది. అర్ధానుస్వారశకటరేఫములను మాత్రము విడచిరి. మచ్చునకొక్క విన్నపము:—

గీ. ఆశ్రితజనావనా! నీయాశ్రితుల నీవు చక్కబెట్టక మఱెవ్వరు చక్కబెట్టెదరు? అఁకుల కసియే నీభక్తుల శిక్షించియు భయపెట్టియు, నరిషడ్వర్గము పొంతబోనీయక జాగరూకుడవై గురుడవై పాఠము నేర్పు చుందువు. ఇతరు లన్ననో నిన్నెరుగరు. ని న్నెరుగనివారిజోలి నీకేల? కావుననే వారిబడి సాగనిచ్చినంతకాలము సాగనిచ్చి పిమ్మట పాపము ను ఫలవంత మొనరించుచుందువు. ఆహా! నీయాశ్రితజనావనబిరు దము నీకే చెల్లునుగాక- నమోనమశ్శ్రీమన్నారాయణా!

దీనివెల అయిదణాలు.

---

# సూచన.

చదలువాడ మల్లనకవి కృతవిప్రనారాయణ చరిత్రమును మఱ ల రెండవసారి ముద్రించియున్నారము. ఇందుఁ బ్రథమముద్రణములోని ప్రమాదములుఁ దప్పులుఁ జాలభాగము సవరింపఁబడినవి. ప్రథమముద్ర ణపీఠికలోలేని విశేషాంశములు ద్వితీయముద్రణ పీఠికలోఁ గలవు. పాఠ కులు త్వరపడుదురుగాక!

ఆంధ్రసాహిత్యపరిషత్కార్యదర్శులు.

శ్రీ

# ఆంధ్రసాహిత్యపరిషత్పత్త్రిక.

రెండునెలలకొకసారి ప్రకటింపఁబడును.

**(Journal of the Telugu Academy.)**

సంపుటము. ౨౭ { బహుధాన్యనామసంవత్సరము. జ్యేష్ఠాషాఢమాసములు. } సంచిక ౧



కాకినాడ:

కొత్తపల్లి సూర్యరావుచే బాలసరస్వతీముద్రాక్షరశాలయందు

ప్రకటింపఁబడినది.

చందా, పోస్టువ్యయములతో సంవత్సరమునకు రు 3-౦-౦.

విడిసంచిక, రు. ౧-౦-౦.

1938 జూన్, జూలై.

# విషయసూచిక.


1. మనవి ... ... ౪౯
2 తిక్కన-ఆంధ్రజయము ... ... ౫౦-౫౬
వెంపటి శ్రీనివాసమూర్తిగారు.
3. కాల్పట్టణము ... ... ౫౭-౫౯
క్రొత్తపల్లి సూర్యరావు,
4. ఆంధ్రవాఙ్మయమునకు వ్యక్తిత్వము లేదా ... ౬౦-౬౫
రామడుగుల వేంకటసుబ్బారావుగారు.
5. పాల్కురికి సోమనాథుఁడు-వృషాధిపశతకము ... ౬౬-౭౨
రేజేటి సత్యనారాయణాచార్యులుగారు.
6. గగనవాణి ... ... ౭౩-౮౬
కాశీభట్ల సుబ్బయ్యశాస్త్రిగారు.
7. నన్నిచోడదేవకుమారసంభవవిమర్శనము ... ౮౭-౮౮
జయంతి రామయ్యపంతులుగారు.
8. శ్రీసూర్యరాయాంధ్రనిఘంటువు-వేదము వేంకటరాయ శాస్త్రిగారు. ౮౯-౯౩
జ. రామయ్యపంతులుగారు.
9. కథాసరిత్సాగరము ... ... ౯౪-౧౦౬
మధునాపంతుల సత్యనారాయణశాస్త్రిగారు
10. గ్రంథస్వీకారము ... ... ౧౦౭-౧౦౯
11. లౌకికన్యాయవివరణము. ... ... ౪౧-౪౮
మేడేపల్లి వేంకటరమణాచార్యులుగారు.
12. లక్షణసారసంగ్రహము ... ... 73-80
చిత్రకవి పెద్దనార్యుడు.

# శ్రీ
# ఆంధ్రసాహిత్యపరిషత్పత్రిక.

## కాకినాడ.

రెండు నెలల కొకసారి ప్రకటింపఁబడును.

సంపుటము. ౨౭ } బహుధాన్యనామసంవత్సరము. జ్యేష్ఠాషాఢమాసములు. { సంచిక ౨

## — మనవి —

బహుధాన్య సంవత్సరములో (౨౭వ సంపుటములో) నిదియప్పుడే రెండవసంచిక. చందాలను వెంట వెంటనే పంపుమండు బలువురకు జాబులువ్రాసియుఁ బత్రికాముఖమునఁ గోరియుఁ బాఠకుల నారాధించుచున్నారము. అయినను వెంబడించి బంపువారు పంపుచున్నారు. పంపవలసినవారు నింకనుగలరు. కొందఱు క్రొత్తసంవత్సరమునకే పంపవలసియున్నది. కొందఱు వెనుకటి యేఁటిచందాయును బంపవలసి కనఁబడుచున్నది. దయచేసి యెల్లపాఠకులును క్రొత్తవత్సరమునకుఁ బ్రాఁతయేండ్లకును సాధ్యమైనంత శీఘ్రకాలములోఁ జందాధనమును దయచేయుదురని కోరుచున్నారము.

కార్యదర్శులు.

# తిక్కన — ఆంధ్రజయము.

— వెంకటి శ్రీనివాసమూర్తిగారు, బి. ఏ. తిరుపతి. —

'విశ్వశ్రేయః కావ్య' మ్మను నార్యోక్తిని మనమునం దిడుకొని పూర్వకవులు కావ్యములను సృష్టించినా రనుట జగద్విదితము. అందును మాన్యాముల నీయఁగలిగిన ప్రభువుల కంకిత మీయక ప్రతిఫలనిష్కాములై భగవదర్పిత మొనర్చిన కవులయం దీసూక్తి నిర్వివాదాంశము. ప్రభువుల కంకిత మీయఁదలఁచినప్పుడు వారిచిత్తవృత్తిఁబట్టి మెలఁగుట కర్తవ్యము. ఒకరాజునకుఁ బురాణము లన్నఁ బ్రీతి. ఇం కొకప్రభువునకు శృంగార మన్న మక్కువ. రాజు పండితుఁడైనచోఁ బాండిత్యప్రకర్షపై నాదరము మెండు. ఇట్లు రానురాను కవులకు స్వాతంత్ర్యము నశించి, అనుకరణమెక్కువై నీచకావ్యములు బయలుదేఱినవి. రాజాస్థానములుదున్నను, ఒకవేళఁ బ్రభువుల కంకిత మొనర్చినను, ప్రభువులును గవులును, గావ్యము కేవలము స్వీయానందముకొఱకుఁ గాక విశ్వశ్రేయస్సునకనుమాట మఱవని కాలము పురాణయుగము. మనుమసిద్ధివద్ద మంత్రిగా నుండియు, నతఁడు పోఁగొట్టుకొనిన రాజ్యమునకుఁ బునః పట్టాభిషిక్తుని జేసియు, తిక్కన భారతము నాతని కంకిత మీయక హరిహరనాథున కొసఁగుట యీసూక్తి ననుసరించియే. దారిద్ర్యముచే ననేకము లిడుమలం గుడిచియు, బావచేఁ బ్రేరేపితుఁ డయ్యును 'సిరిరా మోఁకాలొడ్డి' పోతన భాగవతమును భగవదర్పితము చేయుట యీయాదర్శమును మం దిడుకొనుటచేతనే. కావున ననన్యసామాన్యశేముషీసంపన్ను లగునిట్టికవుల కావ్యములను విమర్శించునప్పుడు కవివలెనే విమర్శకుఁడును నిష్కాముఁడై యుండవలెను.

బ్రహ్మశ్రీ కాశీభట్ల సుబ్బయ్యశాస్త్రిగారు 'ఆంధ్రజయము'లో (ఆంధ్రసాహిత్యపరిషత్పత్రిక సంచిక 5. సంపు. 26) తిక్కనవిరాటపర్వములో నొకఘట్టమును విమర్శించుచు 'వినోదార్థము కొంచెము ముచ్చటింప నెంచితిని' అని వ్రాసిరి. తిక్కనకవిత్వము నర్థము చేసికొనునప్పుడు

గాని, విమర్శించునప్పుడు గాని యేమాత్ర మజాగ్రత్తగా నున్నను దప్పు ద్రోవలోఁ బడుట నిశ్చయము. పూర్వకవుల మహాకావ్యము లన్నియు నిట్టే యున్నవి. ఒక్క తెలుఁగుననే గాక యితరభాషలయందును నీలక్షణము వర్తించును. ఆంగ్లమున ఛాసరు, మిల్టను, డ్రైడెను మొదలగు వారికావ్యములు, గ్రీకులో ఇలియడ్, ఓడిస్సిలు నిటువంటివే. ఆంగ్లవిమర్శకుఁడగు రస్కిన్ ఈకఠినత కొకకారణముఁ జెప్పెను. (Ruskin's Kings' Treasuries) పూర్వకవులు తమకావ్యముల నభిలాషతోఁ జదువువారికే యర్థ మగునట్లును, వినోదార్థము చదువు నల్పజ్ఞులమెడ నర్థము గాకుండునట్లును నాతికఠినముగ వ్రాసిరనెను. అంతేగాక పూర్వకవికృతగ్రంథములను బఠించునప్పుడు మనచిత్తము వచ్చినట్లు కవులు వ్రాసిరా, లేదా యని పరీక్షింపక, వారినుండి క్రొత్తవిషయములు గ్రహించు నుద్దేశ్య ముండవలె ననియు నుడివెను.

సుబ్బయ్యశాస్త్రిగారు తిక్కన వ్రాసిన 'అల్లదనంబున నమవు మైకొనఁజూచు నడపుకాంతికి వింతతోడవుగాఁగ...' (విరాటప. ఆ1-245.) అనుపద్యము 'అనాయాసముగా బోధపడుట కనువగు పదములతో నడచుటలేదనిరి. దీనికిఁ గారణ మీపైసీనవద్యములో మూఁడు తత్సమ పదములు తప్పఁ దక్కిన వన్నియుఁ దెలుఁగుమాటలగుటయే. తదితరము లగుచోట్ల సామాన్యముగ నర్థముగాని పదములను దిక్కన వాడియుండవచ్చును గాని, ఈపద్యమున నట్లర్థముకాని పద మొక్కటేనియుఁ గానరాదు. శాస్త్రిగారిసంస్కృతవ్యామోహము వారు తిక్కనపద్యముతోఁ బోల్చుట కిచ్చిన యేనుఁగువారిపద్యముచేతనే తెలియుచున్నది. (ఇంచుక ముద్దులేనగవు...) ఈపద్యమునందు పది తెలుఁగుమాటలు తప్పఁ దక్కిన వన్నియు సంస్కృతపదములే.

ఉత్తరావయోవర్ణనము నారికేళపాకమునఁ బడిన దనుట విచార్యము. ఈపద్యము కొలఁదిశ్రద్ధతోఁ జదివిన నర్థమగుచున్నదై కదళీపాకమున నున్నది కాని నారికేళపాకమున లేదు. శాస్త్రిగారు తమవిమర్శనములోఁ బదలాలిత్యమా లేక శబ్దాడంబరమా పాదాదినేత్రాంత

వర్ణనమా లేక నేత్త్రాదిపాదాంతవర్ణనమా—అను విషయములే చర్చించిరి గాని, ఆక్కసపద్యములోని భావగాంభీర్యమును గొలఁదిగానైన గమనింప లేదు.

అస లిచ్చట యువతీవయోవర్ణనప్రస్తావన మొదుల కని శాస్త్రిగారికి సందేహము వచ్చినది. కావ్యమున నేవర్ణనలు లేకుండ నుండునా? అదియునుగాక, ఉత్తర కథారంగమునఁ బ్రవేశించుట కిది మొదటిసారి, అప్పు డుత్తర ముక్కు మొగ మెట్లున్నదో, యేవయస్సున నున్నదో, నృత్యవిద్య నేర్చుట కను వగునో కాదో, యనువిషయములు పైపద్యమున లేకున్నఁ బాఠకులకుఁ దెలియఁజాలవు. పైనుండి శాస్త్రిగారు విరాటుఁ డీవర్ణనను విజయునకు వినిపించినట్లుగా భావించి, అర్జునుఁడు పేడియగుటచేతను అతనికి భావిసంబంధముచే నుత్తర కోడ లగుటచేతను నీశృంగారవర్ణన ముచితముగా లే దనిరి. ఇది పొరపాటు. ఈపద్యము కథాసందర్భమునకుండి పాఠకుల కొఱకు నుద్దేశింపఁబడినది గాని విరాటునిచే విజయునకుఁ జెప్పఁబడ లేదు. (జవ్వనంబు చెన్ను నివ్వటిల్లు చునికి దెలుపుచుండ నుత్తర చనుదెంచె) ఉత్తర పరోక్షమున నున్నయెడల విరాటుఁడు వర్ణించి చెప్పవలయును గాని ప్రత్యక్షముగా బృహన్నల చూచునప్పుడు విరాటుఁ డేలచెప్పవలయును ? ఇట్లు శాస్త్రిగారు పొరపాటుగా భావించుకొని, దానిని విమర్శించుట మొదమాపులకొఱకు వెతకిన ట్లున్నది.

శ్రీసుబ్బయ్యశాస్త్రిగారింకొకయపోహకుఁ గూడ లోనైదానికిఁ దగినట్లుగాఁ బద్యముల నన్వయము చేసికొని దురభిప్రాయపడియున్నారు. ఈసందర్భములు మూఁడు: రాజకుమారీయావనవర్ణనము పునస్సంధాన మందిరమును బ్రవేశింపఁబోవునపు డున్న ట్లున్న దనుట, విరాటుఁ డుత్తరపైఁ గనుపఱచిన చేష్టలు దీర్ఘవియోగసదష్ట యగునాయకియెడ నాయకుని యనురాగచేష్టలవలె నున్న వనుట, బృహన్నలకుఁ గూతు నప్పగించుట యల్లునకుఁ బిల్లనప్పఁ జెప్పినచొప్పున నున్నదనుట.

మొదటిసందేహమునకుఁ గారణ మేమాత్రమును గాన్పింపదు. యావనమున నుండు స్త్రీవర్ణన మెవరు చేసినను వయోవిలాసాదులనే

గదా వర్ణించునది ? 'జవ్వనంబుచెన్ను నివ్వటిల్లుచునికిఁ దెలుపుచుఁడ' అని తిక్కనయే వచించినాఁడు. యౌవనావిర్భావ మగుటచే నుత్తర వివాహయోగ్య యని తెలియుచున్నది. వివాహమును బునస్సంధానమును నొక్కదినముననే జరుగుట యాచార మగుటచే నుత్తర పునస్సంధానయోగ్యగా నున్నను దప్పేమియు లేదు. తరువాత నొకసంవత్సరమునకే యుత్తరకు వివాహమై గర్భవతిగూడ నయ్యెను. ఇట్లుత్తరావర్ణనము సందర్భోచితముగా నుండ నీవిమర్శనమున కేమికారణమో తెలియకున్నది. రాజకుమారి పునస్సంధానమందిరమునకుఁ బోవునపు డున్న ట్లుండుట కేమియాధారము లున్నవి? వచ్చునది సభామందిరమునకు, పిలిపించిన వాఁడు తండ్రి, పిలిపించునుద్దేశ్యము విద్యాభ్యాసము. అస లుత్తరకు వివాహమే కానప్పుడు పునస్సంధానప్రసక్తి యేమున్నది?

రెండుమూడుసందర్భములందును విమర్శన మీధోరణినే యనుసరించినది. సాధారణముగఁ దండ్రు లందఱును దమపిల్లలవిషయమున నిట్లే ప్రవర్తింతురు. కవుంగలించుట, ముద్దుపెట్టుకొనుట, తలను గోళ్ళతో దువ్వుట, ముఖములో ముఖముపెట్టి చూచుట, తండ్రులు సాధారణముగఁ జేయులాలనలు. తిక్కన యీయనురాగచేష్టలనే యెంత యపూర్వముగా వర్ణించెనో చూడుఁడు:

చ. తిగిచి కవుంగలించి జగతీశ్వరుఁ డక్కునులాయతాక్షి నె
మ్మొగము మొగంబునం గదియ మోపుఁ గరాంగుళులం గపోల మిం
పుగఁ బుడుకుం బొఱింబొఱి నపూర్వవిలోకన మాచరించుఁ గ
ప్పుగుమ్మృగమాళి నుజ్జ్వలనఖాంకురచేష్ట యొనర్చు నర్మిలిన్.

బృహన్నలకు విద్యాభ్యాసమునకై యుత్తర నప్పగించునప్పుడును రాజీప్రేమనే కనబఱచినాఁడు. 'నాకుహృదయ మలరు దీనియెడఁ గను నార్ద్రమై యుండు' నని స్పష్టముగాఁ జెప్పెను. క్రొత్తగఁ బిల్లలను బాఠశాలలోఁ జేర్చునప్పుడు జనకు లుపాధ్యాయులతోఁ దిక్కనవ్రాసినట్లు చెప్పుట మన మిప్పటికిని జూచుచుందుము. ఆభావములనే తిక్కన యెంత సహజముగఁ గూర్చెనో చూడుఁడు:

క. నెచ్చెలులతోడ నెంతయు, మచ్చిగఁ దనయిచ్చ నాడమరగినయది
విచ్చలవిడి నింతకుము, న్నిచ్చేడియ మెలఁగుశిక్ష యెఱుఁగదు సుప్పీ!
ఆ. బాల కేళిమీఁద భరము గ్రమంబున
విడువఁ గళలయందు వేడ్క పోనిపి
నయముతోడ నర్తనంబుల శిక్షింపు
నెలఁత కేడుగడయు నీవ కాదె.

అంతకుముం దెన్నిసంవత్సరములు చదువు నేర్చుకొనుచుండినను, వెనుకటివారు ప్రేమాధిక్యతచేత "మనుపు శిక్ష యెఱుఁగదు, ఆట్ల మీఁద బుద్ధి పోకుండఁ జూడవలసిన ద"ని చెప్పుచుండు టందఱును ఎఱుఁగుదురు. శాస్త్రిగా రీభావమును గుర్తింపక శిక్ష యెఱుఁగదు సుప్పీ యన్నంతమాత్రమున "ఈచేడియ కిదివఱకు పాధ్యాయునియొద్ద విద్య నభ్యసించుజాడయే తెలియ దని నుడువుటచేత నిద్దియే విద్యాభ్యాసమున కుఁ బ్రాథమికదివస మగుచున్న"దని యూహించుట పొరపాటు. ఈ పద్యములో "విరటుని వాగ్ధోరణి యల్లునకుఁ బిల్లనప్పఁ జెప్ప చొ... నులసిల్లఁజేయుచున్నద"నుటయుఁ జాల విపరీతముగ నున్నది.

'తిగిచి కవుంగలించి' యనుపద్యసందర్భమున "ఇది యుచ... గాక విరాటమహారాజేల పేరోలగమున నీలీల బాలికపై నింతటిమక్కు వను బ్రకటింప నెంచె? తనకుఁ గొమరితపైఁ గలయల్లారుముద్దును బృ హన్నలకుఁ జూపసమకట్టియా" అని సందేహము వచ్చినది. కొంచెము నిదానించి యాలోచించినచో నీసందేహము వచ్చుటకు వీలు లేదు. తండ్రి పిల్లలపైఁ జూపునను రాగము నిజాంతఃకరణము నుండి పొంగివచ్చు ప్రేమచేఁగాని యితరులకుఁ జూపుటకుఁ గాదని ప్రతిమనుష్యునకును తెలిసినవిషయమే. విరాటుఁడు కూఁతురిపై నంతటిమక్కువను జూపుటకు రెండుకారణము లున్నవి. మొదటిది యుత్తర రాజునకు జ్యేష్ఠ కూఁతురు. రెండవకారణము గ్రంథముననే లిఖితమై యున్నది. 'అల్లనల్లఁ గఱచి ప్రౌఢవనిత కైవడి ముద్దుముద్దుపల్కుఁ దనకు మ్రొక్కుటయును' చిన్న పిల్లలు పెద్దమనుష్యులమాదిరి మాటలాడినప్పుడు గాని ప్రవర్తించినప్పుడుగాని తలిదండ్రు లధికానురాగముతో నెత్తికొని లాలించుట సహజము

‘ప్రౌఢవనితకై వడి మ్రొక్కుటయు’ ననుచోట శాస్త్రిగారికి మఱియొక సందేహము వచ్చినది. నమస్కారాచరణములో భక్తివినయములు వెల్లడింపవలయును గాని, యీప్రౌఢిమ యెందులకని ప్రశ్న. ప్రశ్నకు సమాధానము ప్రశ్ననుండియే గ్రహింపవచ్చును. ఆభక్తివినయములు వెల్లడించుటకే ప్రౌఢిమ కావలెను. అన్నిపనులలోఁ బ్రౌఢిమ యెట్లవసరమో, నమస్కారాచరణములోఁ గూడ నట్లే యవసరము. కొందఱు పెద్దవారు గూడ సరిగా నమస్కార మొనర్చుట దెలియక పండ్లికిలించుట మనము చూచుచుందుము. చిన్నపిల్లలు నమస్కారములోని యర్థము దెలియకయే చేతులను జోడించుచుందురు. యువకులు బింకముగ నడుము వంచకుండ నమస్కారమిడుదురు. వీరిలో భక్తివినయములు తక్కువ. వృద్ధులీవిషయమందుఁ బ్రౌఢులు గనుక వంగివంగి నమస్కార మొనర్చెదరు. రాజాస్థానమునుండి, మంత్రిపుంగవుఁడైన తిక్కన యీభేదముల నెల్ల గ్రహించియుండును. అందువలన నుత్తర బాలికయైనను ప్రౌఢస్త్రీవలె నమస్కరించి నప్పుడు ముద్దుపుట్టినది.

ఇంతలో శాస్త్రిగారి కొకవింత గాన్పించినది. “ఇంత ప్రసంగము సాగినను సవ్యసాచికి నుత్తర విరటుని చెల్లెలో, మఱఁదలో, కూఁతురో, కోడలో, మనుమరాలో తెలియు నవకాశము చిక్కదాయెనఁట! రాజు సభామధ్యమున మఱఁదలిని గోడలినిగూడ ‘తిగిచి కవుంగలించు...’ కొనును కాఁబోలు! బృహన్నల వచ్చినతరువాత ‘తనకూఁతు విరాటుఁడు పిల్వఁబుచ్చె’(1-213)వని గ్రంథమునం దున్నది. రాజు కూఁతురిని దీసికొని రమ్మని యాజ్ఞ యిచ్చినప్పు డెదుట నున్న బృహన్నలకుఁ దెలియకుండ నుండఁగలదా? రాజు రహస్యముగా మాటాడె ననుకొనుట కేమియుఁ గారణము లేదు. రాజకుమారి వచ్చుటకు ముందు ప్రవేశమును దెలియఁజేయు రాజమర్యాదవలన నైనఁ దెలిసియుండదా? లేకున్న నుత్తర యభివాదన మొనర్చునప్పుడైనను, విరాటుఁడు లాలించునప్పుడైనను సవ్యసాచి గ్రహింపఁడా? అర్జునుఁ డన్నివిషయములు జరిగినను దెలిసికొనక, రాజు ‘ఈబాలిక నాకూఁతురు’ అని చెప్పినఁగాని తెలియనంత మందబుద్ధియా?

శ్రీ శాస్త్రిగారీ క్రిందివచనములోఁ బ్రతిపదవిమర్శనము గావించి యున్నారు.

'ఇవ్విధంబున గాదిలికూఁతు నుపలాలించి, బృహన్నలదెసం గనుంగొని, సాదరదరస్మితరుచిరాననుండై యిమ్ముగువ నీకు నాటగత్తెకుం దగు పాత్రం బగునే యని యడిగె...' (1 248) ఇందు రాజునకు 'దరస్మిత' ముదయించుట వెకిలిచేఁతయఁట! దరస్మిత మనిన ముప్పదిరెండుపండ్లు బైటఁబడునట్లు నవ్వుట యనుకొనిరి కాఁబోలు! మహాపురుషులకు మందహాస మొకలక్షణము కదా. 'ముగువ' పదము సున్నితముగా లేదఁట. 'పాత్ర' పదము శ్రోత్రియమార్గ్యమఁట! 'ఇమ్ముగువ నీకు నాటగత్తెకం దగుపాత్రంబగునే' యని రాజడుగుట మోటుగా నున్నదఁట! ఇంతకంటె నాణెముగా నుండు వాక్యములను శాస్త్రిగారు వ్రాసినారు చూడుఁడు: 'ఈనా బిడ్డ నీకు శిష్యయగుట కర్హయా' 'ఈబాలిక నీయొద్ద విద్యార్థినిగాఁ జేరఁదగునా?' తిక్కనవాక్యములోని మోటుఁదనమును, శాస్త్రిగారివాక్యములలోని సౌకుమార్యమును బదలాలిత్యమును పాఠకులే గ్రహించి యానందింతురుగాక!

శాస్త్రిగారీపద్యములో నొకనూత్నవిషయమును వెల్లడించిరి.

ఉ. ఆఁడుఁదనంబు నిక్కమున కారసి చూడిన లేదు పుంస్త్వమున్
బోఁడిమిదప్పి యున్నది నపుంసకజన్మ మవశ్యభోగ్య మై
వాఁడిమి గల్గుశాపమున వచ్చెఁ బురాకృతకర్మభావ్య మె
వ్వాఁడును నేర్చునే తొలఁగ వైవఁగ నోర్వక పోవవచ్చునే.

'విజయుఁ డిట్లు దనశాపరూపముల వర్ణించుకొనునా?' అని శాస్త్రిగారి ప్రశ్న. ఇట్లు శాపరూపముల వర్ణించుకొనుట కేమి యవసరము గల్గెనో, యీపద్యము వెనుకనున్న పద్యమును జదివిన యెడల బోధపడఁగలదు. విరాటుఁడు బృహన్నలవేషము తదాకారవిశేషములకు భిన్నముగా నున్నందున 'విభ్రమశ్రీయును బెంపునుం గలుగఁ జేసి విధాతృఁడు పేడిఁ జేసెనే' అని చింతించి, తద్భావకారణమును దెలియనెంచి బృహన్నల నిట్లు ప్రశ్నించును.

క. ఏము నిను మత్స్యరాజ్య, శ్రీమహిమకు నెల్ల యుక్తుఁ జేయఁ దలంపం
గా మామనోరథమునకు, నీమాట విరుద్ధ మయ్యె నిది యెట్లొక్కో.

రా జిట్లడుగుటచే బృహన్నల నిజశాపరూపములను 'ఆఁడుఁదనం బు నిక్కమున కారసిచూచిన లేదు...' అని చెప్పికొనవలసివచ్చినది. ఈపద్యమువలన బృహన్నల 'శుద్ధడబిద్ధుఁడు'గఁ బొడకట్టుచున్నాఁ డని శాస్త్రిగారాక్షేపించినారు. కాని విరాటునికి మాత్ర మట్లు గనుపడ లేదు. 'ఎవ్వఁడే నొక్కజగత్పూజ్యుండు గ్రీడార్థ మి ట్లొనరం దాల్చినరూపు గావలయు' ననుకొనినాఁడు.

వ్యాసభారతమున విరాటుఁడు బృహన్నలమాటలను నమ్మక మంత్రులచేతను, నెరజాణలగు స్త్రీలచేతను బరీక్షింపఁజేసి తరువాత నంతఃపురములోనికి వదిలెను. శాస్త్రిగారు తిక్కనరచనకన్న 'పరిశీలింప నిదియే సమంజస మగురచన' యని వ్రాసిరి. కాని వ్యాసుని రచనపైఁ దిక్కనకూర్పును బరిశీలింపుఁడు. వ్యాసభారతములో విరాటుఁడు బృహన్నలమాటలను నమ్మకపోవుటకుఁ గారణ మెద్దియో తెలియదు. బుద్ధిమంతుఁ డగు రాజు రూపసంభాషణాదులచే నిజతత్వమును గ్రహింపవలెను గాని మంత్రులచేతను స్త్రీలచేతను బరీక్షింపఁజేయుట భావ్యము కాదు. క్రొత్త వారిని బరీక్షించుట యన వా రబద్ధము చెప్పి రని యనుమానించుటయే కదా! అట్టియవమానమునకు లోనైన యర్జునునంతటిమానధనుఁ డచ్చోటఁ గొలువున కుండునా? ఈలోటును గ్రహించి తిక్కన మార్పొనర్చెను. తిక్కన భారతములోని విరాటుఁడు బృహన్నలశీలమును గుర్తింపలేనంత మందబుద్ధి కాఁడు. బృహన్నల సభలోనికి వచ్చుచున్నప్పుడే యాతని గుణశీలములను గ్రహించెను. చూడుఁడు:

మ. వనితావేషము గల్గియున్న యది చెల్వం బాడుచందంబు రా
దు నిరూపింప మహానుభావతయు నిర్దోషత్వమున్ రాజసం
బును శోభిల్లెడు నెవ్వఁడే నొకజగత్పూజ్యుండు గ్రీడార్థ మి
ట్లొనరం దాల్చిన రూపు గావలయు మీ రూహింపుఁడా యట్లగున్.

ఇంతేగాక తనకూఁతురిని బృహన్నల కప్పగించునప్పుడు రాజు ముం దాలోచనలేక పనిచేయలేదు. 'గారవమొంద నైపుణంబున నుచితంబు మై నరసి పొచ్చెములేమి తదీయసేవ గైకొనుటకు నిశ్చయించి' తరువాత నుత్తరను బిలిపించెను. తిక్కన భారతములోని విరాటుఁడిట్లు గౌరవయుక్తముగను లౌకికముగను బ్రవర్తింప, వ్యాసభారతములోని విరాటుఁడు బృహన్నల నపుంసకత్వము నాఁడువారిచేఁ బరీక్షచేయించి శుష్కవైదికముగాఁ బ్రవర్తించె ననుటకు సందేహము లేదు.

వ్యాసభారతములో లేకున్నను దిక్కన యీఘట్టమునఁ గొన్ని పద్యముల నెక్కువగా వ్రాసెనని యొకయాక్షేపణ. కళాదృష్టిలోఁ దిక్కన వ్యాసభారతములోఁ గొన్నిభాగముల పెంచియుఁ గొన్నిటిఁ దగ్గించియు వ్రాసినవిషయ మందఱును జర్చించినదే. చర్వితచర్వణముగ మరల నేను వ్రాయవలసినది లేదు.

మొత్తముమీఁద శాస్త్రిగారి విమర్శనము నిష్పాక్షికదృష్టితో వ్రాసినట్లు లేదు. పునఃప్రత్యుత్తర మీయ లేని పూర్వకవులకావ్యముల విమర్శించునప్పుడు సహృదయము లేకున్న గుణదోషముల నారయఁజాలరని మనవిఁ జేయుచున్నాను.

---

# కాల్పట్టణము.

## — క్రొత్తపల్లి సూర్యరావు. —

ఏదోసందేహము కలిగినపుడెల్లఁ బెద్దల నడుగుచుండును వారు బను లిడకున్న మరల జ్ఞప్తికిఁ దెచ్చుచుండును. కాల్పట్టణమేది? వారికి తటినున్నను లేకున్నను బలువురు పలువితముల బహుపట్టణములను బలుకుచున్నారు. ఎవ్వరికిని నిశ్చయముగాఁ దెలియవచ్చుటలేదు. శ్రీనాథునకు బమ్మెరపోతనకుఁ గలబాంధవ్యమును వారి సమకాలికత్వమును దెల్పఁజాలకున్నారు. ఏమో, అనితోఁచుచున్నది, క్షావచ్చు, నని సందేహ

ములే యెందుఁజూచినను. వీరినివారు, వారిని వీరు కాదనుట-ఔననుట-లోనే కాలము గడచుచున్నది. వారిధితటమునకు గుత్తికి బారెఁడెచ్చు తగుగా కనిగిరి, కదిరి, కాల్దరి, కావలి యని కాగుణించుచున్నారు. కనడుమ నొక్కరు శ్రీనాథుఁడు కన్నడదేశమువాఁడనియు మనదేశము నకు వచ్చి యాంధ్రము నేర్చికొని యాంధ్రులను మించిన కవియయ్యె నన్నట్లు వ్రాసినారు. దానికిచ్చిన యాధారములు దుర్బలములుగానే నాకుఁ గనఁబడినవి. ఇతరు లెవ్వరు దాని నౌనని కాదని యింకను బలికి నట్లు దెలియదు. నలుగురును జెప్పునాల్గుమాటలకు సాటియైనవే గాని యామాటలు విశ్వసింపఁదగినవిగాఁ గనఁబడవు. నాయూహ:—

"శ్రీనాథుఁడు సింహళద్వీపవాసి గావచ్చు—నని." ఇప్పటికిని సింహళ మునుండి విద్యాభ్యాసమునకై సింగాలీలు సంస్కృతవిద్యార్థులు చెన్న పురము వైద్యవిద్యనభ్యసించుటకును జిత్రలేఖనమునకును వచ్చుచుండుట మనకు విదితము. అట్లే పూర్వులును వచ్చుచుండవచ్చును. శ్రీనాథుఁడు విద్యాభ్యాసమునకు మనయాంధ్రదేశము వచ్చియుండును. కర్ణాటదేశము నుండి వచ్చెనన్నట్లే సింహళమునుండి వచ్చియుండవచ్చునన్న బాధలేదు. పైఁగా విద్యకై వచ్చి కేవలభాషాభివృద్ధి చేసికొన్న యితరదేశస్థులు మన లను మించినవా రెందఱో యుండవచ్చును. మనము బహువ్యాపారు లము; శ్రీనాథాదులు కేవల విద్యకొఱకే వచ్చియుండుటఁ జుఱుకైన వా రగుటఁ మనకంటెఁ బండితులు కావచ్చును. తర్వాత వారిధితటీ కాల్పట్టణము కన్నడదేశములో నున్నదేమో కాని తెనుఁగుదేశములో "నిది" యని యెవ్వరును ధైర్యముగాఁ జూపినవారు లేరు. సింహళ ములో వారిధితటిని (ఓడరేవు) గాల్పట్టణ మున్నట్లు భూగోళశాస్త్ర ములోఁ జదువుకొన్నాము. కాఁబట్టి "వారిధితటీగాల్పట్టణ" మనిన నది కావచ్చును. ఆగాల్పట్టణమున శ్రీనాథునితండ్రులుతాతలు నుద్యోగము చేయుచుండ వచ్చును. "వారిధితటీగాల్పట్టణాధీశుఁ"డన్నది యపుడు సరి పోవును.

---

# ఆంధ్ర వాఙ్మయమునకు వ్యక్తిత్వము లేదా?

—రామడుగుల వేంకటసుబ్బారావుగారు, విజయనగరము.—

---

"యతిప్రాసలు సంస్కృతమునుండియే తెలుఁగులోనికి వచ్చినవి. ఒక్కయతిప్రాసలే గాక ఛందశ్శాస్త్ర మంతయుఁ గూడ సంస్కృతమునందలి పింగళచ్ఛందస్సును జూచి రచింపఁబడినదే. సంస్కృతములో యతిప్రాస లున్న వనుటకు భారతచంపు, గీతగోవిందములే యుదాహరణములు. ఇంద్ర చంద్ర గణములు వాణీభూషణమునం దున్నవి. మొదటినుండియు యతిప్రాసలే కనుక, ఆంధ్రమున నుండినచో వానికి సరియైన తెలుఁగుపదము లేల యుండకుండును? నన్నయ యతిపారతంత్ర్యముచే గకారమునకు, వకారము వేసెను. పదమధ్యయతులు నన్నయభారతమునందు లేవు. సంధి, సమాస, శయ్యా, ప్రత్యయాలంకారాదులన్నియు సంస్కృతమునుండి తెలుఁగులోనికి వచ్చినవే. సంస్కృతములోనిపదములు తెలుఁగులోనికి రాక పోయినఁ, దెలుఁగులోఁ గవిత్వము చెప్పలే రని యాతని యభిప్రాయ మైన ట్లాతఁడు రచించిన భారతభాగమునందలి సంస్కృతపద బాహుళ్యమును బట్టియే తెలియుచున్నది. బ్ర॥ శ్రీ॥ ఆకుండి వేంకటశాస్త్రిగారు సమస్తము సంస్కృతమునుండియే వచ్చినట్లు వ్రాసినారు. కావునఁ బర్యాలోచన చేయఁగాఁ నాంధ్రవాఙ్మయమునకు వ్యక్తిత్వము లేనట్లు స్పష్ట మగుచున్నది" అని కొందఱు వాదించుచున్నారు.

ఈపైకారణము లెంతవఱకు వారివాదమునకు సహాయకారులగునో చర్చించి, యితరకారణములను బట్టియు, విజ్ఞుల యభిప్రాయములను బట్టియు, గ్రంథస్థోదాహరణములను సకారణముగా నిరూపించియు నాంధ్రభాషకు సంపూర్ణమైన, ప్రత్యేకత, వ్యక్తిత్వము కల దని లోకమునకు, నారోపితకళంకము వెల్లడిచేయ నుద్దేశించితిని. ఇందలి గుణదోషవిషయమై పండితులు క్షీరనీరన్యాయము నవలంబింపవలసిన దని

నామనవి. ఆంధ్రభాషకు వ్యక్తిత్వము కల దని ఋజువు చేయవలసిన బాధ్యత యాంధ్రదేశీయులది యు నాంధ్రసాహితీపత్రికలది యు నై యున్నది. కావున నింతకన్నను విపులమైన వ్యాసరాజములను, ఆంధ్రభాషాకోవిదు లాంధ్రపత్రికలద్వారా లోకమునకు వెల్లడిచేయుదు రని యాశించుచున్నాను.

ఆంధ్రభాషలో సంస్కృతప్రాకృతసమపదములును, వ్యాకరణసంప్రదాయములును దద్భవపదములును విశేషముగా నగుపడుచుండుటచే నాంధ్రభాష సంస్కృతప్రాకృతపరిణామ మని పెక్కురు దురభిప్రాయము నను లోనగుచున్నారు కాని యది సమంజసము కాదు. ఏమాత్రమును స్వాభావికసంబంధము లేనిసంస్కృతముతో సంబంధ మున్న దనుటకంటె సోదరభాష లైనద్రావిడభాషలతోనే హెచ్చుసంబంధ మున్న దనుట యుక్తము. సంస్కృతపదములు తెలుఁగులో నగుపడినంతమాత్రాన, తెలుఁగు సంస్కృతమునుండి పుట్టె నని పల్కుటకు సాహసించినచో, నితరభాషాపదము లగు పోష్టాఫీసు, కోర్టు, రోడ్డు, దాఖలా, మిఠాయి, సముద్దారు, ఫీజు, మొదలగుపదములను బట్టి తెలుఁగు, ఆంగ్లేయతురుష్కభాషాజన్య మని చెప్పవలయును గదా! ఆభాషలను వ్యవహరించువారివలన, నాయాభాషాపదములు, మన తెలుఁగులోఁ బ్రవేశించును గావున నంతమాత్రమునఁ దజ్జన్య మని చెప్పుట యుక్తము కానేరదు. అట్లే తెనుఁగుకవులును, ఛందోవ్యాకరణకర్తలును, గూడ సంస్కృతములో నాటితేటిన పండితులు. నన్నయ తా నుభయభాషాకావ్యరచనాభిశోభితుఁడ నని వ్రాసికొనియున్నాఁడు. ఆంధ్రసంస్కృతములం దసమానమైన ప్రజ్ఞకలవాఁ డని యాతనిభారతభాగమే చాటుచున్నది.

పింగళచ్ఛందమును రచించినవాఁడు పింగళనాగుఁడు. ఈగ్రంథ మెప్పుడు రచింపఁబడినదో తెలియదు, కాని యీపింగళనాగుఁడే, నాగవంశములోనివా డైన నాగవర్మ యని పలువురు పండితుల యభిప్రాయము. అట్లైనచో నీతఁడు 8 వ శతాబ్దిప్రాంతమువాఁ డగును. ఆంధ్రభాష 5 వ శతాబ్దినుండి మంచిప్రాచుర్యము కలిగియున్నట్లు భాషాశాస్త్రవేత్తల

కు విదితమే గదా! ఆకాలమున, రగడలు, ద్విపదలు, సీసములు మొదలయిన దేశీయవృత్తము లన్నియును వ్యవహారములో నుండు టచే, వానిని జూచియే యితఁడు, బాలవ్యాకరణమును జూచి హరికారి కలు రచింపఁబడ్డట్లు, తెనుఁగునుఁ జూచి సంస్కృతమున ఛందస్సు రచించి యుండనోపు. ఈపింగళనాగుని వాణీభూషణకర్తయు వృత్తరత్నాకరకర్త యుఁ బేర్కొనుటచే నితఁడు వారలకంటెఁ బూర్వుఁడనుటకు సందేహము లేదు. అట్లయినచో నీతఁడు మఱియు ముందువాఁడగును. ఆకాలమున, కన్నడము మంచియభివృద్ధిలో నున్నది. ఇప్పటికి 2 వేలసంవత్సరముల పూర్వమునుండియుఁ గూడ కన్నడమున వాఙ్మయ మగపడుచునే యున్నది. కనుక దానినిఁ జూచియైనను నితఁడు ఛందశ్శాస్త్రము రచించి యుండవచ్చును. అంతియేకాని, యాంధ్రకన్నడములను జూడకుండ నితఁడు ఛందశ్శాస్త్రమును రచించె ననువాదము నిరాధారము. గీతగోవింద మునందును, భారతచంపునందును, యతిప్రాస లగుపడుచున్న వని ప్రతివాదకు లనుచున్నారు. ఈరెండుగ్రంథములునుగూడ, ఆంధ్రభాషయందు, సుప్రసిద్ధవాఙ్మయము వెలసినపిదపనే పుట్టుటచే నివి యాంధ్రంబును జూచియే వ్రాసి రనుటకు సందేహము లేదు. శ్రీకృష్ణకర్ణామృతమునందును, శ్రీకృష్ణదేవరాయలు రచించిన జాంబవతీపరిణయమునందును నచ్చటచ్చట యతిప్రాస లగుపడుచున్నవి. ఆంధ్రకవిత్వమున నాఱితేఱిన నిపుణులే సంస్కృతకవిత్వము వ్రాయుటవలన నిందుఁ గొందు సొగసు నందును దీనిని రానుద్దేశముతో, నచ్చ టచ్చట మెఱుంగులు చూపిరే కాని వేఱొండు కాదు. ఆంధ్రంబును జూచియే వాడి రనుట కిదియొక తార్కాణము. ఒకవేళ, తత్పూర్వమునందుఁ గూడఁ యతిప్రాస లగుపడిన వని చెప్పినను నవి సకృత్తుగా నుండునే కాని, విరివిగాఁ గానరావు. ఆంధ్రకవులు సంస్కృతమునందలి శయ్యాలంకారాదుల నాంధ్రంబున నెట్లు చొప్పించిరో యట్లే సంస్కృతకవులు గూడ సౌలభ్యసంపాదనార్థమై తెలుంగునందలి మెఱుంగులను, సంస్కృతములోఁ జొప్పి రనినంతమాత్రమున దోషమేమి? తమ భాషలో లేనట్టియు, నుత్కృష్టములైనట్టియు భావదర్

నితరభాషలలో నుండి తెచ్చుకొనుట ప్రతిభాషకును సహజమేగదా ! తెలుఁగులో యతిప్రాసలు సహజము లనుటకు, సామెతలే మన కుదాహరణము. కావున యతిప్రాసలు సంస్కృతమునుండి యాంధ్రములోనికి రాలే దనియు నాంధ్ర భాషకుఁ బ్రత్యేకవ్యక్తిత్వము కల దనియుఁ బ్రతివాదకులు గ్రహించి తమయభిప్రాయమును మార్చుకొందురుగాక. తెలుఁగునఁ బదియవ పంక్తిచ్ఛందము మొదలుకొని యతి వేయవలయు నని, లాక్షణికు లందఱుఁ జెప్పిరి కాని, యెనిమిదవచ్ఛందమందలి విద్యున్మాలావృత్తమునందుఁ గూడ యతి యగుపడుచున్నది. అంతమాత్రమున 8 వ ఛందమునుండి యతివేయవలె నని చెప్పసాహసింతుమా ! ఏదో యైచ్ఛికముగా మాత్ర మందు పడిన దని చెప్పవలెను. సంస్కృతమునం దొకటిరెండుచోట్ల యతిప్రాస లగుపడినంతమాత్రమున సంస్కృతమునుండియే యతిప్రాసలు తెలుఁగులోనికి వచ్చిన వని చౌర్యము నొడికట్టఁ జూచుట తగనిపని. యతిప్రాసలే సంస్కృతమునఁ దొలుత ప్రారంభింపఁబడినచో, యతిప్రాసలతోఁగూడి నియమబద్ధ మైన కావ్య మొకటియైన ను సంస్కృతమున నుండవలదా ? ఇంద్రచంద్రగణంబులు వాణీభూషణమం దున్న వని చెప్పిరి కాని యుం దెచ్చటను గానరావు. గ్రంథమును జూచి యీవాక్యము బహుశః అని యుండరు. "కావున నెట్లుచూచినను సంస్కృతములోనుండి తెలుఁగులోనికి వచ్చినట్లు తగిన నిదర్శనములు కానరావు. ఒకవేళ నయినచో నిటునుండి యటు తాఱుమాఱై యుండవచ్చును." బ్ర॥ శ్రీ॥ బుఱ్ఱా శేషగిరిరావుపంతులుగారు కూడ పైయభిప్రాయమునే వారియుపన్యాసమందు వెలిపుచ్చిరి.

"యతి ర్విచ్ఛేదసంజ్ఞకః" అని సంస్కృతమున గ్రుక్కత్రిప్పుకొనుటకు మాత్రమే విశ్రాంతికొఱకు ఆపుస్థలమని యర్థము. తెనుఁగున నన్ననో, అక్షరసాజాత్యము యతి; ఇట్టి అక్షరసాజాత్యయతులు సంస్కృతములో నున్నవా ? సామాన్యముగా నాంధ్రంబందలి సమవృత్తలక్షణములు మాత్రము సంస్కృతోక్తములే యైయున్నను యతిస్థానములు మాత్రము వేఱు. కొన్నింటికి, ఆంధ్రంబున నొకస్థలమున సంస్కృతమున

మణ్ణోకస్థలమున యతు లగుపడుచున్నవి. గురుత్వ, లఘుత్వనిర్ణయవిష యమున బాదాంత్యాక్షరము వికల్పముగ గురువగు నను విషయమును పదాంతరస్థితద్విత్వము పూర్వపదాంత్యవర్ణమునకు గౌరవము నిచ్చు ననువిషయమున మాత్ర మాంధ్రచ్ఛందోరీతికి విలక్షణములు. అట్లే ప్రాసమును సంస్కృతములోని యనుప్రాసము వలె, నైచ్ఛికము గాదు. సంస్కృతమువారు శబ్దాలంకారములకొరకు కొన్నిప్రాసలు చెప్పిరేకాని తెనుఁగునందువలె పాదద్వితీయాక్షరము ప్రాస యని చెప్పలేదు.

తెనుఁగులోనే యతిప్రాస లున్నచో, వానికి సరియైన తెలుఁగుపదము లేల యుండకుండు నని ప్రతివాదకు లనుచున్నారు. 'యతి' యను సంస్కృతపదమునకు 'వడి—వళి' అనునవి తెలుఁగుపదములు. ఇవి యరవమాటతో సంబంధముకలవి. యతి విరతి మొదలగు పర్యాయపదములతోపాటు 'వడి, వళి' అనుమాటలను, లాక్షణికులు వ్యవహరించుచున్నను, దీని కొకయర్థవిశేష మున్నట్లు స్పష్టముగా కనుపించుచున్నది. "ఆద్యో వళిః" అనునాంధ్రశబ్దచింతామణిసూత్రమందును, అంధ కవు వాదములుగా నున్న తెనుఁగులక్షణగ్రంథములలోను, పద్యములందును "వడి-వళి"అనియె యున్నవి గాని యతి విరతి మొదలగువర్యాయపదములలో మఱి యేదియుఁ గనబడదు. చూ.

1. చరణాద్యక్షరమే వడి......కవిజనాశ్రయము.

2. పాదప్రథమాక్షరము, త్పాదిత మగు వళియనంగ-కావ్యాలంకారచూడామణి.

3. వాసనగల మొదలివ్రాయి వడి యనఁబరఁగున్-ఛందోదర్పణము.

4. చరణచరణమునకాద్యక్షరములు వళులయ్యె-అప్పకవీయము

ఈసందర్భమున, వడి-వళికి బదులుగా యతి-విరతి మొదలగు పర్యాయపదములలో మఱి యేదియు వాడఁగూడ దన్నట్లే తోఁచును. ఈయభిప్రాయమును, ఛందోదర్పణపీఠికయందు శ్రీ గిడుగు వెంకటసీతాపతిగారు స్పష్టీకరించిరి. ఈవిషయమును వారలు పరిశీలింపకయే తెలుఁ

గులో యతి అనుదానికి సరియైన తెలుఁగుపదము లేదని చెప్పు టెంత యు శోచనీయము. ఒకవేళఁ దెలుఁగులో, వానికి సరియైన తెలుఁగుప దము లిప్పు డగుపడనంతమాత్రమునఁ, దెలుఁగులో నవి లేవని చెప్పుట సమంజసము కాదు. ఒకవస్తువు పూర్వమునను నిప్పుడుఁ గూడ నుండవ చ్చును. దానికిఁ బూర్వ మొక పేరుండి యుండును. అది క్రమముగా వ్యవ హారమువల్లను, అన్యభాషాసంపర్కమువలన నాపేరు పోయి మఱొకపేరు రావచ్చును. అంతమాత్రమున నావస్తువుకూడ మనదేశములోఁ బూర్వ ము లేదు, ఉండిన దానికి సరియైనపేరే యుండియుండు నని సెలవిచ్చి నచో, నది, దీపశబ్దపర్యాయమైన, తిల్లిక, శబ్ద మాంధ్రంబున దొరకునం తవఱకు, సంస్కృతమునుండి యే దీపము వచ్చినది కాని, తెలుఁగువార లకు దీపము లేదని వాదించినట్లుగానే యుండును.

నన్నయ, యతిపారతంత్ర్యముచేతనే గకారమునకు వకారము యతివేయలేదనుట కాతని చింతామణిని శ్రీవారు పరిశీలించినఁ జాలు నని మామనవి. "క్వచి ద్గకారోవః" అనుసూత్ర మొకవేళఁ బ్రక్షిప్తమ నుటకు సాహసించినఁ జెప్పలేము, కాని, సకలభాషావాగనుశాసనుఁ డగునామహానుభావున కీకళంక మంటఁగట్టుట సాహసము. పలుఁగురు- పలువురు. వేగుదు-వేవుదు. తొగ-తొవ. పగలు-పవలు. ఇత్యాదులందు గకారమునకు వకారము, భాషాసంప్రదాయానుసారముగా వచ్చును. కావున, గాకు వాకు, యతివేసెను గాని, యసమర్థుఁడై వేయలేదని మామనవి.

---

# పాల్కురికి సోమనాథుఁడు—వృషాధిపశతకము,

— రేజేటి సత్యనారాయణాచార్యులుగారు-విజయనగరము. —

---

సామాన్యముగాఁ "దెలుఁగునఁ గవిత్వమేమి?" యనుదినములలోఁ గాలప్రవాహమున కెదురీఁది, యాంధ్రకవితాగౌరవమును నిలువఁబెట్టిన యీకవివతంసుని గూర్చియు, నీతనికృతులను గూర్చియు నెఱుఁగని భాషాసేవకు లీదినములలో లేరనియే చెప్పవచ్చును. చాలవఱకీతనిగ్రంథములు ముద్రితములై విద్యార్థులకుఁ బాఠ్యగ్రంథములుగాఁ గూడ గ్రహింపఁబడినవి. బ్రహ్మశ్రీ వేటూరి ప్రభాకరశాస్త్రిగారు తమ బసవపురాణపీఠికలో నీతని కాలమును గూర్చియు, గ్రంథములను గూర్చియు విశేషముగాఁ జర్చించియున్నారు. కాని యందు "వృషాధిపశతకమును" గూర్చి దిక్ప్రదర్శనముగా వ్రాసిరి. కావున నీవ్యాసమున నాశతకమును గూర్చియు, సోమనవ్యక్తిత్వమును గూర్చియు నించుక వ్రాయుచున్నాఁడను. ఇం దభిప్రాయభేదము లున్నచోఁ దద్జ్ఞులు సవరింతురుగాక!

ఈతని యీగ్రంథముచివరను 106వ పద్య మగు:—

చం. "బసవఁడు ప్రీతిఁ గైకొని యొ భక్తిమెయిన్ రచియించె సోముఁడున్
 బసవపురాణ మందు మును బ్రస్తుతిచేయుదు రట్లుగాన నీ
 యసమదయాధురీణతను నంకిలిపాటు ఘటిల్లకుండ నన్
 బసఁ గొని ప్రోవుమయ్య! బసవా........................"

అను దానియందు బసవపురాణము నంతకుముందే రచించినట్లు చెప్పుకొనియున్నాఁడు గనుక నీగ్రంథ మీతని రెండవకృతియై యుండవచ్చును. 'మాపండితమల్లికార్జునుఁడు ప్రస్తుతిచేయఁగ నేర్చు'నన్నను (101 వ పద్యమున) మల్లికార్జునపండితుని సామాన్యునిగాఁ జెప్పియున్నాఁడు, కాని, యాతనియందుఁ బెద్దభక్తిని వెల్లడింపలేదు. కావున నప్పటి కీతఁడు పండితారాధ్యచరిత్రము రచింపలేదని యూహించుట కవ

కాశము గలుగుచున్నది, లేకున్నచో నొకటిరెండు పద్యములలోఁ దన కుఁ గలభక్తిని బ్రత్యేకముగా వెల్లడించి యుండును, లేదా, మొట్టమొద ట గురువుగా నైన స్తోత్ర మొనర్చి యుండను.

శతకసామాన్యమునకు వలెనే దీనియందును 109 పద్యము లున్నవి. కాని యందఱివలెనే నాల్గవపాదమంతను మకుటముగా నుం చక "........... బసవా! బసవా! బసవా! వృషాధిపా" యని నాల్గవపాదమందలి కొంతభాగమే యుంచుటచే నత్పలచంపకములు రెండును వాడుట కవకాశము లభించినది.

ప్రారంభమునందుఁ దనగురు వగు "గురులింగార్యుని" పే రుచ్చరిం చుచు శివుని విశేషణములతోఁ గలిపి సాభిప్రాయముగాఁ "శ్రీగురులింగ" యని యారంభించినాఁడు. తరువాత 49 పద్యములవఱకును సామాన్య ముగ శతకములశైలితో శివపరమగు స్తోత్రములు మాత్రము చేసెను. అందు నూటికిఁ దొంబదిమైనచొప్పున సంస్కృతపదములే గలవు. సా మాన్యకవుల కందని కవితావైదుష్యములు గలవనుట కీశతక మొక్కటి యే చాలును. చూడుఁడు:—

ఉ. స్వీకృతభక్తలోక! యవశీకృతకర్కశవావదూక! యూ
రీకృతసద్వివేక! యురరీకృతజంగమభక్తిశూక! దూ
రీకృతమష్టపాక! యధరీకృతవేదవిరుద్ధబౌద్ధచార్వాక!
... ... ... బసవా! ... ...

యను మున్నగు పద్యముల ననుకరింపని శతకకవి యేఁడీ? కొ న్నియెడల మూఁడు పాదములవఱకు విచ్ఛేదమొందని యొక్కసమాసమే. చూ. ప. 43, 46, 47.

కవితయందు వింతపద్ధతులు చూపుశతకకవుల కల్పనల కీతనిదే భిక్ష యనవచ్చును. మొదటి 49 పద్యములను జూచినంతనే దాశరథి శతకము మున్నగుశతకము లెన్నో జ్ఞప్తికి వచ్చును. ఏపద్యమును బరిశీ లించినను యమకానుప్రాసలతో నిండియుండును. అంతియ కాక—

చ. ఇహపరసిద్ధ సిద్ధవృషభేశ్వర యీశ్వరభక్త భక్తహృ
ద్గహనవిలోక లోకహితకారణ కారణజన్మ జన్మదో
షహరణదక్ష దక్షరిపుసన్నిభ సన్నిభరూప రూపని
ర్వహణశరణ్య మయ్యబసవా ! ... ...

అని యక్కడక్కడ ముక్తపదగ్రస్తమునుగూడ గ్రహింపఁబడి
నది. చూ. పద్యసంఖ్య 66, 107, 108.

"సన్నుతజంగమాగమము స్వాతిజలంబులు" అను 67వ పద్యము మొదలుకొని "భీమగజంబు డీకొనిన" యను 79 వ పద్యమువఱకును బసవేశ్వరుని లీలలను జాలవఱకు వర్ణించియున్నాఁడు. బసవపురాణమున విపులముగా వర్ణించిన బిజ్జలుని తిరస్కరించుట యాతనిధనమంత్రియు భక్తుల కర్పించుట, బ్రాహ్మణద్వేషము, వారితో వాదించి యమానుషచర్యలను జూపుట మున్నగువాని నిందు సంక్షేపముగా నొక్కొక్క పద్యమునఁ జెప్పియున్నాఁడు. తరువాత 79 వ పద్యము మొదలుకొని 102 వ పద్యము వఱకు నొక్కొక్కని నొక్కొక్కపద్యమున నిరువదిమువ్వురుభక్తులను, వారిచర్యలను బ్రశంసించినాఁడు. వీరిలోఁ జాలవఱకు బసవపురాణమునం దుపాఖ్యానముల వివరముగా వర్ణింపఁబడినవారే.

ఆకాలమున నీతనివంటి కవితావేశముగలవాఁ డింకొకఁడు లేఁడన వచ్చును. అదియుఁగాక యాతని పాండిత్య మొకటి యసాధారణమైనది. ఈరెంటియం దేయది కారణముగా నైన నేమి యాతఁడు దన కృతులయం దనేకము లగుకవితాశిల్పములను జిత్రించినాఁడు. అవియే యాతని వ్యక్తిత్వమునకు నిదర్శనములుగా నున్నవి. ఈతని శతకము నుండి యట్టివానిని గొన్నిటి నిటఁ జూపుచున్నాను.

ఉ. "హృన్నలినే స్మరామి భవదీయపదద్వితయం భవాటవ
స్విన్నతనుశ్రమాపహ మశేషజగత్ప్రణుతం మదీయని
ష్పన్నదయానిధే! యనుచు సంస్కృతభాష నుతింతు నిన్ను"

చ. "పరమనె యన్నె యాండవనె పన్నగతానె యనాథనాథనే
పెరియవనే పుళిందవనె పేఱడయానె పిరానె యప్పనే
తరిమురి యయ్యనే యనుచు ద్రావిడభాష నుతింతు"

చం. హసుళేయ రెన్న రక్షిసువు దారయ లెన్నవనీత నెంమమ
స్నసివుదు నిమ్మడిం గెరగ నిమ్మప్రసాదియె నిమ్మదాత్తవే
కసిగతి యంచు భక్తి నినుఁ గన్నడభాష నుతింతు......"

అని యీరీతిగా సంస్కృత, ద్రావిడ, కర్ణాట, మళయాళాది భాషలంగుఁ గవిత్వము చెప్పినాఁడు. ఇాత నూరకుండక జాను తెనుఁగిట్టిది యని వాచ్యముగా నుడువుచు—

"బలుపొడతోలుచీరయును బాపసేఁల్ గిలుపారుకన్ను వె
న్నెలతల జేఁదుకుత్తుకయు నిండినవేలుపుటేఱు వల్గుపూ
సలుగిలజేని లెంక సని జానుఁదెనుంగున విన్నవించెదన్
వలపు మదిం దలిర్ప బసవా... ... ..."

అను నీపద్యమున స్పష్టము చేసినాఁడు. మఱి కొన్నిటియందు సంస్కృతాంధ్రములు, సంస్కృతద్రావిడములు, సంస్కృతకర్ణాటకములు, గలిపి మణిప్రవాళములను సంగ్రహించినాఁడు. తుదకొక్కపద్యమననే పైఁ జెప్పఁబడిన భాషలే గాక యనేకభాషల నుపయోగించి మణిప్రవాళములకుఁ దోడు నవరత్నకాంతులను సమ్మేళనము చేసినాఁడు.

పైఁ జెప్పఁబడినరీతిని భాషయందే గాక భావములందుఁ గూడఁ నీతని యావేశము గన్పడుచున్నది.

"ఖ్యాతయశఃప్రపూరిత జగత్త్రితయాయ నమోనమో.........
సముద్యోతవృషాయతే యనుచు నుత్సుకతన్ బ్రణుతింతు"
"ఆప్తగణప్రవిష్టసకలార్తిహరాయ...............
............యనుచు దీనగతిఁ బ్రణుతింతు నిన్ను......"
"కల్పితలింగ జంగమసుఖస్ఫురణాయ.........
.........యనుచు గౌరవలీల నుతింతు నిన్ను న
స్వల్పతరప్రభావ! బసవా!..................."

ఇట్టివిషయములందే గాక మతవిషయకము లగుసందర్భములం దీతనియుద్వేగ మెన్నఁదగినది. శివకవుల కిట్టియావేశ మున్న దని గాని, మనసోమన, యట్టివాఁ డని నిరూపింపఁ బూనుటగాని పునరుక్త మయ్యె

ను బ్రకృతమున సీశతకమునఁ గూడ నట్టివిషయము లిమిడి యున్న వ
నిరూపించి విరమించుచున్నాఁడను.

శైవులమతోద్రేకమును మించినయుద్రేకము మఱియొకరి కుం
ట కల్ల. ఆవిషయమున వారు మహమ్మదీయులకన్న మిన్నలు. వర్ణా
శ్రమధర్మములను దృణీకరించి యేజాతివాఁడైనను శివభక్తుఁడు పూజ్యుఁ
డే యఁట! సోమన కొన్నిచోట్ల "వర్ణనిరాసకాయ......బసవా"
యనునట్టి సంబోధనలు చేయుట యటుండఁగా భక్తులను గూర్చి చెప్పఁ
బూని 'శుభమస్తని' 79 వ పద్యమున చాకలిమాచనను బ్రశంసించి
నాఁడు. కాని శైవులను దక్షిణవారు వర్ణసంకరు లనిమాత్ర మనరాదు.
అట్టియెడ బ్రాహ్మణులకు, వీరికిఁ గల్గుస్పర్ధలను గూర్చియును సోమన
71 వ పద్యమున సూచన చేసియున్నాఁడు. వర్ణవిహీనుఁ డంచు ద్విజ
వర్గము గళమెత్తి పల్కినంతనే శివనాగయగారి కరంబులందు నమృత
ధారలు చూపి "సద్వర్ణుఁ డితండ" యనిపించినాఁడట! బసవఁడు
తాము స్వయముగా "నాశ్రితధర్మాధర్మవిసర్జిత!" "వర్ణనిరాసక!" యని
సంబోధింతురు గాని బ్రాహ్మణు లట్టియర్థ మిచ్చుపద ముపయోగింపరా
దఁట! అట్టిద్వేష మెంతయున్నదో చూడుఁడు:—"పరగుణదీప్ర! భక్త
జనవప్ర! తృణీకృతవిప్ర!" యని బసవని సంబోధించినాఁడు. వేదబా
హ్యులు వీ రని యప్పటివారు నిరసించుచుండిరి గాఁబోలు! "మా
యిండ్లఁ గుక్కలు గూడ వేదముఁ జదువఁగల" వని సమర్థించుటకై "కల్లి
దేవునిఁ" బ్రశంసించినాఁడు. చూ 98 ప.

దేవుఁడు వేఱు, గురువు మార్గదర్శకుఁ డనుట గాక గురువే
శివుఁడు, శివుఁడే గురు వనువాదము స్థిరపఱచుట కీశతకమున "బసవ"
స్తవమే చాలును. అంతతోఁ గాక భక్తులెల్లరు ను భగవంతునకు నన్న
దమ్ములనియు, స్నేహితు లనియుఁ జెప్పుకొను నలవాటు శైవుల కున్నది
అయ్యదియు నీశతకమునఁ జూడఁదగును.

"సదృశః పాత్త్రుఁడు'కిన్నరయ్య'కును బ్రాణసఖుఁ డగునిన్ను—
ఆ, "కక్కయ"గారి బిడ్డఁ డనఁగా నుతికెక్కిన నిన్ను—

అరియమరాజుగారి పరమాప్తుఁడ వైన మహానుభావ!" వేమేల? యేభగవంతునిగూర్చి వైష్ణవులు త్వద్భృత్య భృత్య, పరిచారకభృత్య భృత్య, భృత్యస్యభృత్య''యని తమ్ముఁ గూర్చి యనుకొందురో యట్టి వానిని గూర్చి శైవు లే మందురో! చూచితిరా! ఈశతకమున:—

"ఆ, శంకరదాసి దేవునకు సద్భటుఁ డంచు నుతింతు నిన్ను"

"......... మోళిగమారయకుఁ గ్రిబంట!"

"ఆ, కలికేత బ్రహ్మయకు నక్కిలిభృత్యుఁడ"

అని యి ట్లనేకసందర్భములు గలవు.

ఇట్లు శైవసంప్రదాయానుసారముగా ననేకవిధముల నుచ్చరించె ను గాని యీతని యంతరాత్మ మాత్రము ప్రతిపద్యమందును ద్రవీభా వము నొందుచునే యున్నది. లోకవిడంబనకై యనేకము లగు కవితా వైచిత్రులఁ జూపుచు వర్ణించి వర్ణించి యావేశముతోఁ దుదకు వెఱ్ఱియెత్తి నవానివలె నే మనుచున్నాఁడో చూడుఁడు. శతక మంతటను "బసవా! బసవా! యనుచు నోరారఁ బిల్చుసంబోధనములు చాలక:—

చం. బసవనిధానమా! బసవభవ్యనిధీ! బసవామృతాంబుధీ!
బసవమహానిధీ! బసవభర్మగిరీ! బసవామరద్రుమా!
బసవమహాబలీ! బసవబండరువా! బసవోల్లసన్మణీ!
వసిగని బ్రోవుమయ్య బసవా! బసవా! బసవా! వృషాధిపా."

అనుచుఁ బద్యమునంతను బసవపదభూయిష్ఠముగాఁ జేసి వైచె ను. అట్లే తరువాతిపద్యమందును, లోకమం దొకని కొకఁడు దయా పాత్రుఁ డగుట కెన్నివిధము లగు సంబంధము లుండునో యన్నిసంబం ధములను, దనకు బసవనితోఁ గల్పించుకొని "యెట్లూహించినను నీకు దయాపాత్రుఁడనే సుమా! యని తెల్పుచు:—

ఉ. నాయొడయుండ! నావిభుఁడ! నాహృదయేశ్వర! నామనోరమా?
నాయిలవేల్ప! నావరుఁడ! నాగురులింగమ! నాదుజంగమా!
నాయధినాథ! నావరద! నన్నుఁ గృపామతిఁ బ్రోవుమయ్య దేవా!
యమిబృందవంద్య బసవా! .........'' యని ప్రార్థించినాఁడు.

తుదకుఁ దనవెఱ్ఱిమొఱ్ఱి ప్రార్థనలు తనకే వెక్కస మనిపించెఁ గాఁబోలు! ఇట్లనుచున్నాఁడు:—

ఉ. "నోటికి వచ్చినట్లు నిను నానావిధంబులఁ బ్రస్తుతింతునే
నేరుతు నేరఁ బొమ్మనక ......... కై కొనఁగాఁదగు గౌరవంబుగన్.

ఇట్లు నూటయొమ్మిది పద్యములు మాత్రము గల్గుశతకమునందు నిట్టిమహావేశముతో ననేకములగు కవితారీతులఁ గన్పఱచి, శతకాతిశతకకవుల కేమి సామాన్యకవుల కేమి మార్గదర్శకుఁ డగుచు శతకకవులలో నగ్రగణ్యుఁ డగు నీ విద్వత్కవివతంసుఁ డాంధ్రు లెల్లరకును శ్లాఘాపాత్రుఁ డని చెప్పకతప్పదు.

---

# గగనవాణి.

—సాహిత్యవిశారద, కాశీభట్ట సుబ్బయ్యశాస్త్రిగారు- కాకినాడ.—

---

మొన్న చెన్నపురమునఁ గ్రొత్తగా నెలకొలుపఁబడిన గగనవాణీ యంత్ర (Radio) సవిధమున మ॥ రా॥ రా॥ రావుసాహేబు శ్రీగిడుగు రామమూర్తిపంతులుగారు సజీవభాషనుగూర్చి ఘనధ్వానమును బ్రకటింపఁజేసి యున్నారు. ఆమిటిజానుపలుకులనీటు, ఈజ్యేష్ఠబహుళ దశమీ గురువారము వెలువడిన యాంధ్రపత్రికారాజమునఁ బ్రకటితమైనది. దానిం గొంచెము పరామర్శింప నెంచి, యీ వ్యాసమును వ్రాసి యుంటిని, కావున సహృదయులు సాంతముగా దీనిం జదువఁ బ్రార్థితులు.

ఈగగనవాణీశిరోభాగమున "సజీవ మగు తెలుగు, 'గ్రాంథికభాష దేశభాషగాదు,' 'ఈకృతకభాషవల్ల దేశంలో విద్య వ్యాపించడం లేదు" అనుమాటలు మకుటీకరింపఁబడి యున్నవి. వీనింబట్టి శ్రీ రామమూర్తిపంతులుగారితలంపున గ్రాంథికభాష సజీవమగుభాష కాదనియు, వ్యావహారికభాషయే జీవకళాశోభిత మగుభాష యనియు, విదిత మగుచున్నది.

మఱియు వీరిప్రసంగము కొంత సాఁగినంత "గ్రంథాంభాష క్రమంగా భ్రష్ట మవుతుంది" అని వేఱొకతలవ్రాత యతుకఁబడినది. ఇందుచే గ్రాంథికభాషకు ముఖ్యం తప్పదని సిద్ధాంతీకరింపఁబడిన దన్నమాటయే. ముం దీశిరోలేఖలయందుఁ బొందుపఱుపఁబడిన భాష సజీవమో లేక నిర్జీవమో నాడీవిజ్ఞాననిపుణు లగుకోవిదులు నిశ్చయింపవలసి యున్నది. కావున, పైశీర్షికావచనములలోనిశబ్దములవిభాగించి చూపెదను.

"సజీవ మగు తెలుగుభాష,' 'గ్రాంథికభాష దేశభాష' గాదు, 'ఈ కృతకభాష' 'విద్య' 'గ్రంథభాష' 'క్రమ భ్రష్టము' ఈపదము లన్నియు, పంతులుగారు హతమొనర్చిన గ్రాంథికభాషకుఁ జెందినవి కాని, సజీవ మగు తెలుఁగుభాషలోనివి కావు. ఇవి పోఁగా నిలిచి యున్నవి-వల్ల, శంలో, పించడం, మంగా, అవుతుంది, ఈరూపములే సజీవభాషకుఁ జెందినవి.

శ్రీపంతులుగారు జీవకళాలసిత మగువ్యావహారికభాషలో మృత ము లైనగ్రాంథికభాషాపదముల నేల చొనిపిరో! ఎచటనైన జీవించియు న్నవారి నడుమఁ జచ్చినవారిమేనుల నుండనిత్తురా ? అమృతదేహముల నేఱి, వేఱుచేసి వానికి దహనసంస్కారమో, లేక ఖననకర్మమో, చేయు దురా? శ్రీ పంతులవారు గ్రాంథికభారతిని జంప నభిలషించుచున్నను భాషము వారి లేఖిని మాత్ర మాభాషామతల్లి కమృతము నుబోసి, జీవక ళావిలసితను గాఁ జేయుచున్నది.

పైని వివరింపఁబడిన తంత్ర్వాతలలోని మాటల నటుంచి, యుప న్యాసగర్భమున, పంతులవారు జోడించిన జానుసుదులజాలు నాలోకిం పుఁడు. "సారస్వతము గల ప్రతిసంఘములోనూ వాడుకలో ఉన్నభా షనే దేశభాషగా స్వీకరించి ప్రజలు అభ్యసిస్తారు. ప్రచారంలో లేనిభా షలో రచితమైన గ్రంథాలు గొప్పవై తే ఆభాషను అభ్యసించిన పండి తులు ప్రచారంలో నున్నభాషలో సామాన్యులకోసం అనువాదములు చేస్తారు."

ఈమహావాక్యములలో నున్నపదము లన్నియు నించుమించుగా వీరు మృతభాష యని పాణింధనుఁబును ప్రయోగించుచున్న గ్రాంథికభాషా వయవములే. ఇఁక "నూ, సిస్తారు, చారం, చేస్తారు" ఈనిరూపచతుష్టయ మే వీరిజీవభాషకుఁ జెందినది. ఇట్లుచక్కెరపొంగలిలోఁ గంకరరాలవలెఁ గొలఁది యపభ్రంశము లున్నమాత్రాన నిదంతయుచు వ్యావహారికభాష యగునా ?

కంటిరా ! పంతులవా రెట్లు మృతామృతకళేబరముల నంటఁగట్టు చున్నారో ! ఒకవ్యక్తి మృతమాయె నన దానియవయవము లన్నియు నిర్జీవములే యగును గాని కొన్నిజీవకళాశోభితములై యుండునా? ఆ హతభారతీశరీరభాగములతోడ సజీవభాషావయవములఁ బోషింప నగు నా ? పన్నీటను బురదను గలపినట్లు సంజీవినీవాణిలో మృతసాహితీ దేహభాగముల మేళవించుట యమంగళావహము కాదా ?

ఇట్లు మృతసాహితీపదములఁ బట్టినఁగాని వ్యావహారిక భాషలో ముచ్చటగా మూఁడుపంక్తులనైన వ్రాయుటకు నవ్యభాషాపతంజలులకే శక్తి లేకున్నయపుడు వీరిశిష్యగణముల మాట చెప్పనేల? మఱియు వీరి యాకాశవాణిలో "విషయం ప్రధానమైనది. శబ్దం కాదు, శబ్దం శరీరం వంటిది న్నీ! దాని అర్థము ప్రాణమువంటిదిన్నీ! కదా!" అని సెలవిచ్చిరి. అట్లగుచోఁ బ్రాణ మగునర్థమును విడిచి, ప్రాణహీన మగు వ్యావహారికభాషను సాధింప నింతటితాఁడవ మేమిటికి?

అర్థము ముఖ్యము కాని, శబ్దము కా దనుట సరియగు వాదము కాదు. కారణ మేమన నర్థము శబ్దాశ్రయము కాని విడి ముడి వస్తువు కాదు. అందుచే మనోహరార్థములఁ దెలియఁగోరుచో మంజులపదముల నాలింపవలయును. శబ్దార్థము లవినాభావసంబంధము కలజంటలు.

కావుననే సాహిత్యతత్త్వజ్ఞు లగువిద్వాంసులు కావ్యనిర్మాణమున వాని కగ్రస్థాన మొసంగియున్నారు. "వాక్యం రసాత్మకం కావ్యం" అని సాహిత్యదర్పణకారుఁడు బోధించియున్నాఁడు. అనఁగా రసాత్మకమగువాక్యమే కావ్యము. అని భావము. వాక్య మన శబ్దసముదయమే. మఱియు "రమణీయార్థప్రతిపాదకః శబ్దః కావ్యం." అనఁగా శబ్దమాత్రమే కావ్యము, అని రసగంగాధరకారుఁడు నుడివియున్నాఁడు. కవికులతిలకుఁ డగుకాళిదాసమహాశయుఁడు "వాగర్థావివసంపృక్తా" అని వాగర్థములకు సమ్యక్సంబంధమును బ్రకటించియున్నాఁడు. అందుచే నర్థమే కాని శబ్దము ప్రధానము కాదనుట పొరపాటుమాట కాని సూటిబాట కాదు. శబ్దము వినా అర్థ ముదయింపనేరదు.

కాలుగంటకాలములో నురవడితో నుపన్యాసమును సాగింపవలసియుండుటచేఁ గాఁబోలుఁ బంతులవా రర్థశూన్యము లగుశబ్దములఁ గొన్నిటినిఁ జాఱవిడిచియున్నారు.

ఇఁక నొకసంగతి "చిన్నయసూరిగారి నీతిచంద్రికలోని భాష వంటిది సామాన్యజనులకోసం రచించిన గ్రంథాలకు వుచితం కా దని, కీర్తిశేషులయిన సామినేని ముద్దుకృష్ణమ్మ నాయుడుగారు డబ్బైయేండ్ల

క్రిందట షష్టుక్లాసుమునసబుగా వుండేవారును, ఈలాగుననే వెంకటగిరి సంస్థాన ప్రభువులు గొప్పపండితులు కీ. శే. శ్రీ వెలుగోటి సర్వజ్ఞకుమారయాచేంద్ర భూపాలమహారాజావారును అనేకగ్రంథముల వాడుకభాషలో రచించి, అట్టిగ్రంథములకు అట్టిభాషే తగిన దని సిద్ధాంతము చేసినారు." అని పంతులవారు వాక్రుచ్చియున్నారు.

కాని పై పండితప్రభువులు "అట్టిగ్రంథములకు అట్టిభాషే తగిన దని" సిద్ధాంతం చేయటంచే, ఆగ్రంథములు భావప్రౌఢములు కాని సామాన్యవాచకము లని, విదిత మగుచున్నది. అట్టి యల్పరచనలు కొన్ని పైవారు సిద్ధాంతీకరించుటకు మున్ను చాలకాలముక్రిందటనే వ్రాయబడియున్నవి. వానిని వీ రీక్షింపలేదు కాఁబోలు. ఇట్టిసామాన్యాశయు లెప్పుడు నుందురు.

జనసంఘమున సంఖ్యాబాహుళ్యము గలకార్యములు జయప్రదము లగుటయు, అల్పసంఖ్యాకములు వీఁగిపోవుటయుఁ బ్రాజ్ఞవిదితము. కావున, భాషాతత్త్వములనామూలాగ్రముగా నెఱింగినపెక్కురు విద్వాంసులు సుకావ్యనిర్మాణమునకు గ్రాంథికాంధ్రభారతియే యర్హ మని, ప్రబోధించుచు, నందు కుదాహరణములుగా మంజులపదకదంబసుందరములును, మధురార్థబంధురములు నగు నసంఖ్యాకగ్రంథములఁ జూపుచుండ వ్యావహారికభాషలో నేమొ యొకటిరెండ్రో వ్రాసినపత్త్రములఁ బెద్దగాఁ జేసి, సాహిత్యరచనకు వాడుకబాసయే సమంజస మనుట యెట్టిత్రాసో తెలియకున్నది !

మఱియు పంతులవారు "ఇపుడు లోకవ్యవహారంలో తాండవమాడుతూవున్న వాడుకభాషలో గద్యంపద్యం రచిస్తూ ఉన్నవారు ఇప్పుడు వందలకొలదిగా వున్నారు" అని గ్రాంథికాంధ్రము వ్యావహారికరంగమున మృతమై నేలఁగూలిన దనియు, ఇపు డాసీమను వ్యావహారికాంధ్రప్రబంధకబంధములు తాండవ మాడుచున్న వనియు ఘోషీకరించుచున్నారు. పాప మిఁక నుత్తరాసోదరుని కీర్తిసాధము నేలపాలాయె నన్నమాటయే ! కట్టా ! గులకఱాలు గుట్టలుగాఁ బుట్టుచున్నమాత్రాన జాతిరత్నములకు విలువ లే దని, బూరల నూఁదుట యేటిమాట!

ప్రస్తుతము నవ్యసాహిత్యనాటకరంగముపై తాండవిస్తూన్నదం తయు శ్రీ పంతులవారు ప్రేమిస్తోన్న శిష్టవ్యావహారిక భాషాయోషయేనా? చిత్తాచెదారంపుసొంపులతోఁ జెలరేగుచున్న నవ్యగ్రామ్యసాహిత్యభాషా నర్తకిని బంతులుగారు గుర్తిస్తే బాగుంటుం దని తలుస్తాను.

శ్రీవారు గ్రాంథికాంధ్రము మృత మైన దనియు, దానిస్థానమున నవ్యసాహిత్యము తాండవించుచున్న దనియు, సజీవ మగుభాష వ్యావహారికమే కాని గ్రాంథికము కా దనియుఁ బ్రాగల్భ్యపదనాదములఁ బూరించుట వేగిరపాటు కాని పరిశీలనపాటవము కలమాట కాదు. వినుఁడు నవ్యసాహిత్యపండితసామ్రాట్టు లగు రాజునామకమహాశయులు పావన మగుకృష్ణాపత్రికలోఁ జిత్రించిన నీలవేణీగానమును.

"ఏనాటికైనా విశిష్టగుణోపేత మైన రచనయే పదికాలాలపాటు నిలుస్తుంది. ఇంక తుక్కూదూగరా ఏగాలివానకో లేచిపోయేదే" అని నవ్యాసభ్యకవితలు మాసిపోవునవే కాని నిలుకడగా నిలువఁ జాలినవి కా వని తెలిపియున్నారు.

మఱియు నీగగనవాణిలో "ఇప్పుడు మనరాష్ట్రంలో మంత్రిగా ఉన్న శ్రీగోపాలరెడ్డిగారు వ్యావహారికభాష నాదరించడం, శ్రీపిఠాపురంయువరాజావారు "స్వార్థత్యాగము" అనేనాటకము వ్యవహార భాషలో రచించి ప్రకటించడం, శ్రీకాళీపట్నపు కొండయ్యగారు "విశ్వరూపు" అనేపేరుగల గ్రంథము ఇట్టిభాషలోనే రచించడం (ఆంధ్రవిశ్వ విద్యాలయమువారు దానిని ప్రకటించడము ఇవన్నీ దేశభాషాభ్యుదయమునకు శుభసూచకములు) అని నవ్యసాహిత్యమున కపూర్వభాగ్యోదయ మైనట్టు వ్రాసికొనియున్నారు.

కాని యన్నలారా! పైన నఖరేఖాంకిత మైయున్న వాక్యములోనిభాష మీరు మరణింపఁజేసినగ్రాంథికాంధ్రములోనిది కాదా? వేగిరపాటు వీడి యోజింపుఁడు. శాంతమువంటి పంట వేఱొండు లేదనుఁడీ.

పంతులువారు తమనవ్యసాహిత్యభాషకు నొకమంత్రిపుంగవుని యాదరమునను, మఱియొకయువరాజకుమారుని కారుణ్యమునను, ఇంక

నాకకవికంఠీరవుని యభిమానమునను, మఱియొక విశ్వవిద్యాలయము ప్రాపునను మహాభ్యుదయప్రాప్తి సమకూఱియుండ మా కేమిబాధ యని యుపన్యసించుచున్నారు. సంతోషమే, కాని వీరు నవ్యసాహిత్యకృతి తాశయాదర్శ మనఁదగు తమప్రతిభలో నేను విరచించిన సాహిత్యము నవలోకించు పట్టున నాగ్రంథ మొకమహారాజున కంకిత మొసంగఁబడుటను నాంధ్రవాఙ్మయతత్త్వవేత్త లగుపెద్దలప్రశంసలకుఁ బాత్ర మగుటను, గేలి సేసి యున్నారు. చూచితిరా? వీరియోగ్యతను! ఒకమహా యువరాజాదులు తమవాడుకభాష కనుకూలు రగుట శ్రేయోదాయక మని, మురియుచు, మఱియొకచాయ మహారాజాదుల యాదరమునందుట పరిహాసాస్పద మని తెలుపుచున్నారు! దీని కేమి. నవ్యసాహిత్య మండలివారు పై వారియాదరమున కుబ్బుచుండిరి కదా!

గ్రాంథికభాషాభిమాను లన్ననో, విజ్ఞానఘను లగురాజరాజనరేంద్రాదిపూర్వాంధ్రసార్వభౌముల మన్ననలకుఁ దావల మగుటచు ఉభయభాషాపాండితీవిరాజితు లగు తిక్కనాది ప్రాచీనమంత్రిపుంగవులకు వందనీయమగుటను, సత్పురుషవరేణ్యులును, వివేకసాగరులును, అగు శ్రీశ్రీవిక్రమదేవవర్మమహారాజావారును శ్రీశ్రీపీఠికాపురమహారాజావారును లో నగు నేటిమేటిసామ్రాట్టులు ప్రేమించుటవలనను, మహామహోపాధ్యాయాదిబిరుదావళీవిరాజమాను లగుశ్రీ శ్రీపాద కృష్ణమూర్తిశాస్త్రి గారు నియమసుందరమగు త్రిలింగభాషలో భారతామ్నాయమును వి...చించుచుండుటచేతను, భాషాతత్త్వవేత్తలును దేశికోత్తములును ముక్తి కులసత్తములును నగు మ॥రా॥శ్రీ అక్కిరాజు ఉమాకాంతపండితులు నవ్యసాహిత్యదోషముల నెత్తి చక్కఁగా విమర్శించి యుండుటచేతను, ప్రాజ్ఞు లగు చెన్నరాజధానీవిద్యాశాఖాధికారులు నవ్యసాహిత్యకావ్యములు పఠనార్హములు కా వని, త్రోసిపుచ్చుటచేతను సనాతనగ్రాంథికాంధ్రభారతీమాతకుఁ ద్రిలింగదేశమునందు వివేకజనసంఘమున గౌరవాదరము లాచంద్రతారార్కముగా నిలిచియుండునే గాని నవ్యసాహి

త్యవాదులతూలలవతుల్యము లగు లేఖవ్రాతలచే నెట్టిలోటును రాఁ జాల దని, లోకమునకుఁ దెలియఁజేయుచున్నారు.

ఈగగనవాణిలో వేఱొకవింత తరంగితమై యున్నది.."క్రొత్తనీరు వస్తే పాతనీరుపోతుంది. దేశభాష నదీప్రవాహమువంటి దన్నారు పెద్దలు" అని పంతులవారు నుడివియున్నారు. అట్లగుచో నేఁటేటనేటనీరు గొట్టుకొనిపోయి క్రొత్తనీరు వచ్చునట్లు వ్యావహారికభాషాస్రవంతి ప్రతివర్షమునకుఁ బాఱి, తిరుగఁగ్రొత్తపోకడలతోఁ దలయెత్తుచుండును గాని, త్రికాలాబాధితమై మెడతెగని యురవడితో నిలుకడగా నడయాడనేర దన్నమాట! అట్టిలఱి నిడి సజీవభాష యగుట యెట్లో!

ఇట్లు పుట్టుఁగిట్టులఁబడి, కొట్టుకొనిపోవు బాస యమరవాణి యగునా? ఎంతమాత్రము కానేరదు. గ్రాంథికాంధ్రవాఙ్మయ మన్ననో గంభీరమగురత్నాకరముచాడ్పునఁ జెక్కు చెదరక, యొక్క పోలికతోఁ బరిపూర్ణజీవనసౌభాగ్యవిభాసితమై వెలయుచుండును. దీనికి సరిస్సరమునకు వలె వృద్ధిక్షయము లుండనేరవు.

మనపంతులవారు గ్రాంథికభాషాపండితు లిదివఱలో విమర్శించి విడిచినయుక్తులనే తిరుగఁదిరుగఁ దిరుగవేయుచున్నారు కాని విబుధసమ్మతము లగుసిద్ధాంతములచే నిజవాదముల సమర్థింపనేరరు.

వీరివాదములయందలి దౌర్బల్యములఁ జూడఁగోరువారు దేశికశిరోమణు లగు శ్రీకూచి నరసింహమహాశయులచే విరచింపఁబడిన "క్రొత్తతెనుఁగు తమాషా?" లోనగు గ్రంథములను "విమర్శాదర్శవిమర్శాదర్శము" అను గ్రంథముయొక్క 1, 2 సంపుటములను జదువఁగోరెదను. వానియందు వ్యావహారికాంధ్రవాదులయుక్తిశూన్యము లగు ప్రసంగములు సహేతుకముగ ఖండింపఁబడినవి.

మఱియు నాచే విరచితమైన "సాహిత్యకల" యను గ్రంథమున నవ్యసాహిత్యకవులు చిత్రించుచున్నయసభ్యరచనలు క్రోడీకరింపఁబడియున్నవి. ఈయవినీతివ్రాతల నెందఱెందఱుప్రాజ్ఞులు గర్హించుచున్నారో వివరింపఁబడినది.

నిజము చెప్పవలసివచ్చినచో నిపుడు నవ్యసాహిత్యరంగమున సింగారముగాఁ దాండవించుచున్నది యొక యపూర్వ సంకరభాషగాని గిడువారి కిష్టమైనశిష్ట్యవ్యవహారభాష కాదని నిశ్చయముగాఁజెప్పనగును.

అనుక్షణమును గ్రామ్యగ్రాంథికాంధ్రసంచారపరిణామములఁ బరీక్షించు మేధానిధు లగు మ. రా. శ్రీ ఆంధ్రపత్రికాధిపతు లీపంతులవారి యొడఁ దుడుకుతలంపులతోఁ దమభావముల జోడింపకున్నారు. కనుఁడు. "కాని యింకను యిది సర్వవ్యాప్తము కాలేదు పండితులు పామరులు కూడ అడ్డుబడుచున్నారు.........కాని ఒక్కటిమాత్రం చెప్పవలెను. క్రియాంతముల వచ్చాడు చేసాడు అని వాడినంతమాత్రాన వ్యావహారికం కాదు. లోకంలో వ్యవహారంలో వున్నమాటలకే వ్యాకరణసూత్రాలు పుట్టినవి. వాటిని చదువుకోకుండానే చక్కగా అర్థమయ్యేటట్లు వ్రాయవచ్చు. అయినను అది అంతసులభమైనది కాదనే చెప్పవచ్చినది. ఆ అనుభవము సంస్కారముకలిగితేతప్ప వారు చెప్పే అర్థమయ్యేవ్యావహారికభాషలో వ్రాయటంసాధ్యంకాదు.......ఆంగ్లకవులు వ్రాసినకావ్యములను చదివి వానిభావముగూడ పూర్తిగ తెలియక తెలుగులో వాటి అందఱికీ తెలిసేభాషలో వ్రాస్తున్నట్ల అనుకునేవారున్నారు. కాని భాష మోదారిని భావ ఒకదారిని ఉంటును. అదే నవ్యాంధ్రభాష, నవీనమగు తెలుగు, అంటే ఒప్పుకోలేము. భాషకు జీవం భావంతో కలుగుతుంది.......ఇంతకూ మేము చెప్పదలచినది వ్యవహారభాషలో దివ్యముగ వ్రాయుట సామాన్యవిషయం కాదు." వింటిరా! యీనిర్ణయములఁ

ఓర్పుతో నాలోచించి చూచినచో వ్యావహారికభాషాకావ్యములవలన సంఘమునకు శాశ్వత మగుగౌరవానందసంపద కలుగనేదని తెలియనగును. మఱియు నాగరకత కలదేశములం దంతటను గ్రాంథికభాష యనియు, వ్యావహారికభాష యనియు, భాషాభేదములు ప్రత్యేకములుగా నున్నయవి. న్యాయ్యముచే గ్రాంథికభాష లేకున్న ననాదికాలము మొద లనంతకాలమువఱకు క్కొక్కరీతిని జనులు విజ్ఞానానందముల నందనేరరు.

వాడుక భాష యాయావ్యక్తుల దుర్బలోచ్చారణములవలనను, ఆయామండలములయందలి వ్యావహారికపదభేదములవలనను, భిన్నభిన్నము లగురాజభాషలసంపర్కమువలనను స్థిరరూపము లేక, మాటిమాటికి మాఱిపోవుచుండును. లోకవ్యవహారమాత్రానుకూలమై యుత్పత్తిలయముల నందునది వ్యావహారికభాష, విజ్ఞానానందసంధాయకమై, శాశ్వతముగా నుండునది గ్రాంథికభాష.

కావున స్థిరాస్థిరరూపము లగుభిన్నభాష లుండుట సహజము. ఈభాషాభేదముల నన్నింటిని దొలంగించి, దేశమంతటికిని నేకరూపమగు వాఙ్మయమును సమకూర్చుట యసంభవము.

అంతదూర మెందులకు; ఒక్కమండలమున నున్నవివిధకులముల వారు నొక్కపోలిక గలభాషను మాటలాడుట కానరాదు. కావున గ్రాంథికభాషను బరిత్యజించి, వ్యావహారికభాషలో సర్వజనసుబోధముగాఁ గబ్బముల రచింపవలయును గాని, పండితమాత్రగ్రాహ్య మగుగ్రాంథికభాషలోఁ గావ్యముల విరచింపరా దని, వాదించుచున్న నవ్యసాహిత్యకవులరచనలఁ బరికించిన నన్నపద్యము తమ్మునకును దమ్మునిగద్య మన్నకును దెలియరా కున్నసంగతి విదిత మగును.

ఇఁక నొకపెద్దవింత! భావకవివరుఁడు ప్రత్యక్షమైనప్పుడు "కవిసోదరా నీయీపద్యరత్నమునకు భావ మేమి!" అని యడుగ నాకవికంఠీరవుఁడు వెల్లఁబోయి, "ఇవి కవితాసమాధిలోఁ దన్మయానందముతో నల్లినపద్య మగుటచేఁ బరులకు బోధింప నలవి కాదు." అని సమాధాన మొసంగుచున్నాఁడు.

ఇందున కనువుగా "రససమాధినిమగ్నుఁ డగు కవివరుఁడు తన్మయతతో కవిత నల్లును కాని భావమును స్థిరము చేసికొని పిమ్మట పద్యమును లిఖింపఁడు. కావ్యమునందలిపదసౌష్ఠవమును జూచువారును, భావమును తెలియగోరువారును గవి సాహిత్యసమాధిలో ననుభవించినయానందమును తెలియజాలరు. అది యోగదృగ్గోచరము" అని నవ్యసాహిత్యసారజ్ఞులైన లోకరు తెలిపియున్నారు.

ఈగగనవాణిలో శ్రీగిడుగువా ఁరేమనిరో వినుఁడు! "భాష అనగా ఏమిటో సూక్ష్మదృష్టితో కొంచెం పరికించి చూడండి. ఒకరిమనస్సులో ఉండేభావములు మరియొకరు తెలిసికోవడమునకు సాధనంగా భాష వున్నది." కంటిరా నవ్యసాహిత్యవిద్యాకులపతుల ప్రబోధముల ! వీరిమాటల నవ్యకవులు పాటించుచుండిరా ? పైని వివరింపఁబడినభావము పంతులవారియూహకు విరుద్ధము కాదా ?

ఇట్లొక భావభేదమే గాదు. మననవ్యసాహిత్యసోదరులకుఁ బదవిన్యాసములలోఁ గూడ ననుకూలత లేదు. ఒకరిమాట లింకొకరికి సరిపడవు. ఈయవి నామాటలు కావు. భారతీపత్రికలో శ్రీబులుసు వేంకటరమణయ్యమహాశయులు తెలిపినసత్యవచనములు—"ఒకరు రాసినట్లు యింకొకరు రాయరు. కొందరిరాత కొందరికి పరమాసహ్యం."

మఱియు నాపత్రికయందే శ్రీమండపాక పార్వతీశ్వరశాస్త్రిమహోదయులు "ప్రస్తుతము నవ్యసాహిత్యనిర్మాతలలో ఏకత లేదు. వారి భాషలో ఏకత లేదు. వారికవిత్వమున ఏకత లేదు. రచనలు, భాష, భావము వ్యక్తిగతముగానే ఉన్నాయి." ఇట్లన్యోన్యవిరుద్ధము లగు వ్రాఁత లెన్నియేని గలవు. ఈరీతిగాఁ బదరచనలయందుఁగాని, భావప్రకటనములయందుఁ గాని, యెట్టియేకతయు లేనివా రందఱు గుమిగూడి నవ్యసాహిత్యపరిషత్తును లేవనెత్తి అందు గిడుగువారికి మొదటిపీఁట నొసంగి యున్నారు.

ఇపు డీసంఘమువా రవివేకాంధకారపటలము నడంచి, యఖండవిజ్ఞానానందకాంతి నొసంగుచున్న గ్రాంథికాంధ్రకావ్యమండలిని దహించి గడ్డిగాదములను, జెత్తాచెదారములను బ్రోఁగుచేయుచున్నారు. ఇంతకును మించినదేశద్రోహము వేఱొండుకలదా ?

వినుఁ డాంధ్రవారపత్రికారాజములోని నవ్యసాహిత్యసింహముల ఘనగర్జనముల—"ప్రతివిషయంలోను అందివేసినచేయి అనిపించుకొన్న ఆంధ్రత్వగౌరవాన్ని ఘృతకోశాతకి చేయకుండా నిలబెట్ట పూనికోవాలి

పెద్దలు నిర్మించిన సాహిత్యసౌధాలను కూలద్రోయుప్రయత్నాలు విరమించాలి" ఆలించితిరా ? యీప్రాజ్ఞభాషితముల !

ఇంకను శ్రీపంతులవారివిపరీతసుందరోక్తుల నాలింపుఁడు. "ఎవరి కంటితో వారు చూచి, రూపములు రంగులు గ్రహించవలెను గదా ! అలాగే ఎవరినోటితో వారు భాషించి మనోభావములు ఇతరులకు తెలియజేయవలెను......మనోభావాలు పొందికగా ఇంపుగా వ్యక్తపరచే శక్తి సంపాదించడానికి ఎవరివాక్కు వారే తర్ఫీతుచేసికోవలెను ఎవరినోటితో వారు అన్నం తిని శరీరం పోషించుకోవలెను గాని ఇతరులు అవని తమకోసం చేసిపెట్టలేరు." అని సెలవిచ్చిరి.

కంటిరా ? పంతులవారెంతయింపుగాఁ బ్రసంగించిరో ! ఇట్టిసుబోధదేశికులు శిష్టవ్యవహారభాషను నిలువఁబెట్టుట కింతటిభగీరథప్రయత్న మేమిటికి? మఱియుఁ బామరజనవాటికలలో వాడఁబడుచున్న గ్రామ్యమును ఆదరింపకుండుటకు హేతు వేమి ? గ్రామీణులకు శ్రీపంతులుగారు నమలి యన్నమిడుట తగునా ?

జను లెవరిపనులు వారు చేసికొనవలసియున్ననాఁడు తాము జోలి కలుగఁజేసికొనుట యేమిసమంజసము ?

ఈనవ్యసాహిత్యబృందమునకుఁ బెద్ద లగుపంతులుగారి యీక్రింది సుద్దుల వినుఁడు. "ఇరవై యేండ్లక్రిందట.........ఆంధ్రసాహిత్యపరిషత్తువారు పెద్దగగ్గోలు పెట్టినారు. వారి ప్రోత్సాహమువల్ల తెలుగుదేశమంతా తిరుగబడ్డది." అని యిట్లు త్రిలిఙ్గదేశమంతయుఁ దిరుగఁబడి, తమవాదము నెదుర్కొన్నట్లు వ్రాసికొనిరి. పోనీ వీ రావాదమునకుఁ బ్రతివాదము సేయక యూరకుండిరా ! లేదే ! "అప్పుడు నామిత్రులు నేను ప్రతివాదము చేసినాము." "సత్య మేవ జయతి" అని లోకోక్తిగదా!"అని తా మాంధ్రసాహిత్యపరిషత్తువారిని బ్రతిఘటింపఁ బ్రయత్నించినట్లును గాని సత్యమునకే జయము చేకూరినట్లును వ్రాసియున్నారు.

ఈరీతిగ నాంధ్రసాహిత్యపరిషత్తువారు గ్రాంథికాంధ్రమును

గూర్చి శంఖములఁ బూరించుచుండ, వాడుక భాసను గూర్చి వీరు బా కాల నూఁదియున్నారు. అయినను బ్రజలు వీరివాదము ను నిరసించి, సాహిత్యపరిషత్తువారికి జయమును సమకూర్చి యున్నారు. ఇట్లుండ వీరు తమ వాడుక బాసయే లోకసమ్మత మగు బాస కాని గ్రాంథికాంధ్రము కా దని తెలుప సాహసించుచున్నారు.

కనుఁడు—"ఇప్పుడు లోకవ్యవహారంలో తాండవం ఆడుతూ ఉన్న వాడుకభాషలో గద్యం పద్యం రచిస్తూఉన్నవారు వందలకొలదిగ ఉన్నారు." అని ప్రస్తుతము లోకమునఁ దాండవించుచున్న భాష వాడుక భాష యని ప్రకటించుచున్నారు. ఇది యసత్యము-పండితులును పామరులును గూడ వ్యవ్యవహారభాష గ్రంథరచన కుపయుక్తము కా దని వాదించుచునేయున్నారు. ఈయంశమును శ్రీ పంతులుగారే యంగీకరించి యున్నారు.

మఱియు "ఇది యింకను సర్వవ్యాప్తము కాలేదు. పండితులు పామరులు కూడ అడ్డుపడుచున్నారు." అని యాంధ్రపత్రికవారు ఘంటాపథముగాఁ దెలుపుచున్నారు. దీనింబట్టిచూడ వ్యావహారిక భాషలో గ్రంథములు వ్రాయుట యాంధ్రజనసమూహమున కంతకును సంతోషజనక మనుట తగదు. ఏ పదుగురకో యింపుగానుండును.

మఱి యొకవింతపలుకు- "ఇటాలియన్ భాషవలె శ్రావ్యమైనదని ప్రసిద్ధిపొందిన తెలుగుభాష జీవలోకంలో విన బడేది కాని గ్రంథములలోమాత్రం కంటికి కనబడేది కాదు." అని వాడుకనుడికారమును బ్రశంసించిరి. చూచితిరా! వీరివిజ్ఞానవైభవమును ? "దేశభాషలందు దెలుఁగు లెస్స" అని తెలుఁగుబాసకు బిరుదము నొసంగినవాఁడు శ్రీకృష్ణరాయసార్వభౌముఁడు. ఆమహారాజుబిరుదము నిచ్చుటకుఁ గారణము వ్యావహారికాంధ్రగ్రంథరసపానపరవశతయా? కాదు కాదు; ముమ్మాటికిని గాదు. అందులకుఁ గారణము పండితకవివరేణ్యులు విరచించినమంజుల గ్రాంథికాంధ్రగ్రథితగ్రంథసుమమంజరీసారభాస్వాదనమే.

వేఱొకవిషయము—కీ. శే. శ్రీ వెలుగోటి సర్వజ్ఞకుమారయాచేంద్రమహారాజావా రనేకగ్రంథములు వాడుకభాషలో రచించినట్లు మీరు వ్రాసియున్నారు. న్యాయము పలుకవలసివచ్చినచోఁ బై ప్రభువరులు గ్రాంథికాభిమానకలావిరాజితులు కాని వ్యావహారికభాషాపోషకులు కారు. కావుననే యామహారాజావారు తమసంస్థానమున విద్వత్కవుల సన్మానించి, యనేకామూల్యగ్రాంథికాంధ్రగ్రంథముల విరచింపఁ బ్రోత్సహించియుండిరి. ఈక్రిందికవీంద్రు లారాజచంద్రుని ప్రోత్సాహాధారములపై నుత్తమకావ్యముల విరచించిరి. కనుఁడు:—

1. గోపీనాథుని వేంకటకవి, ఆంధ్రరామాయణము, శిశుపాలవధ, బ్రహ్మకైవర్తపురాణమునందలి శ్రీకృష్ణజన్మఖండము, బ్రహ్మానందశతకము.

2. మండపాక పార్వతీశ్వరశాస్త్రిగారు, రాధాకృష్ణసంవాదము.

3. మణిగొండ వేంకటరమణకవి, రుక్మిణీపరిణయము-ఇంక నెందఱో కవులు గ్రాంథికాంధ్రమున సత్కృతుల విరచించి, శ్రీమహారాజావారికంకితమొనర్చి యున్నారు.

ఈమహారాజావారును మతాదివిషయములను గూర్చి కొన్ని గద్యగ్రంథముల స్వయముగా విరచించి యున్నారు. ఆగ్రంథములయందు సర్వజనులకుఁ దెలియుటకు సుబోధ మగుగ్రాంథికభాషనే వాడియున్నారు. కాని నవ్యసాహిత్యమువారి వాడుకభాషను వాడి యుండలేదు. మహారాజావారు వ్రాయించిన గ్రంథములను గాని, వారు స్వయముగా వ్రాసినగ్రంథములనుగాని చూడఁగోరు వా రాంధ్ర సాహిత్యపరిషత్కార్యాలయమునకు దయచేసి చూడవచ్చును.

కౌపరను (Cowper) నొక యాంగ్లకవిశేఖరుఁడు—

"Thrwoing buckets in empty wells
Growing old in drawing nothing."

అనినట్లు మన రా. సా. గి. రా. పంతులుగారి నవ్యభాషోద్ధరణప్రయత్నము కానవచ్చు చున్నది.

ఆంధ్ర సోదరీసోదరులారా! ఎండమావులఁ గాంచి, మంచినీళ్లని భ్రమసి మృగగణములు పరుగిడునటులు గిడుగువారిగగనవాణీనినదములవిని మోహితులై వ్యావహారికభాషాకావ్యములు రసపూరితములని భ్రమయక, సుభావామృతపూరితములై, శ్రావ్యపదనాదసుందరములై శాశ్వతానందగౌరవముల సమకూర్చు గ్రాంథికాంధ్రగ్రంథములఁబఠింపుఁడు. ఆంధ్రదేశ మంధదేశము గాకుండ భారతీమాత కాపాడుఁగావుత.

ఓం తత్సత్.

---

నే నీవ్యాసమున నటనట నవ్యసాహిత్యమువారి ననుకరించుచు వారివ్రాతల వ్యాజానుకరణములఁ జేసియుంటిని గాని యావాక్యములు నాకు సమ్మతములు కావని పాఠకమహాశయులఁ భావింపఁగోరెదను.

# -:నన్నిచోడదేవకుమారసంభవవిమర్శము:-

ఇది బ్ర. శ్రీ. శ్రీపాద లక్ష్మీపతిశాస్త్రిగారిచే రచియింపఁబడినది. ఈయన కొంతకాలము శ్రీసూర్యరాయాంధ్రనిఘంటుకార్యాలయమునఁ బనిచేసి యిప్పుడు చెన్నపురివిశ్వకళాపరిషత్తార్యస్థానమున నాంధ్రసహాయోపాధ్యాయులుగాఁ బనిచేయుచున్నారు. వీరికి సంస్కృతాంధ్రముల యందసమానప్రజ్ఞ కలదు. వీరు కొంతకాలమునుండి నన్నెచోడకృతకుమారసంభవమును సంస్కరించి తిరుగ ముద్రింపింపవలయునను నూహతో నాకావ్యమును జక్కగాఁ బరిశీలించియున్నారు. ఆపరిశీలనఫలితమే యీవిమర్శనము.

ఈనన్నెచోడకుమారసంభవమునకుఁ బ్రాచీనలిఖితప్రతి యొక్కటియే గలదు. అది తంజావూరు శరభోజీసరస్వతీమహాలు పుస్తకభాండారమున నున్నది. దానినిజూచి శ్రీమానవల్లి రామకృష్ణకవిగారు ఎం. ఏ. మొదటియాఱాశ్వాసములును ౧౯౦౯ సంవత్సరమునను మఱికొంతకాలమునకుఁ దక్కినయాఱాశ్వాసములును బ్రకటించినారు. వీరే యీగ్రంథమునకుఁ బ్రథమప్రకాశకులు. అంతకుఁ బూర్వ మీగ్రంథముకల దని యాంధ్రలోక మెఱుఁగదు. ఈగ్రంథము బయలుదేఱినది మొదలాంధ్రులచిత్త మాకర్షించి కవికాలనిర్ణయమువట్టున భిన్నాభిప్రాయములకుఁ దావిచ్చినది. ఈయభిప్రాయముల నన్నిటిని బరిశీలించి లక్ష్మీపతిశాస్త్రిగారు తమయభిప్రాయము నీగ్రంథమునందుఁ బ్రకటించిరి. వీరు విద్వాంసులును విషయమును జక్కగాఁ బరిశీలించినవారు నగుటచే మొత్తముమీఁద వీరిరచన నిపుణముగానున్న దని వేఱ చెప్పనక్కఱలేదు.

ఈవిమర్శనము రెండుభాగముల క్రింద విభజింపవచ్చును. కావ్యగుణాగుణవిమర్శనభాగ మొకటి, కవికాలనిర్ణయభాగ మొకటి యని. ప్రథమభాగములో శ్రీ శాస్త్రులుగారు చెప్పినది మిక్కిలి రమ్యముగాను సమంజసముగాను నున్నది. కవికాలనిర్ణయవిషయములో మొదటినుం

డియు నభిప్రాయభేదములు కలవు. ఈయభిప్రాయభేదములకు మొట్ట
మొదటఁ దా వొసంగినవారు బ్ర. రామకృష్ణకవిగారు. ఆయన ప్రథమ
భాగముఖపత్త్రమున క్రీ. శ. ౧౨౧౦ సంవత్సరమందు గ్రంథకర్తయైన నన్నె
చోడుఁడు యుద్ధమున నిహతుఁడయ్యెనని వ్రాసిరి. అనఁగా నీకవి నన్నయ
భట్టారకునికంటెఁ బూర్వుఁడని వీరియభిప్రాయము. ఈవ్రాత నిరాధార
మైనది. కవిగా రిప్పటికిని దానిని సమర్థించుకొనలేకయున్నారు. కలువ
రీకవి నన్నయభట్టునకుఁ దరువాతివాఁడని యభిప్రాయపడుచున్నారు.
ఈవిషయమైనకొంతచర్చ పరిషత్పత్త్రికలలో (సంపుటము ౧౩-౧౪) ల
నున్నది. అందులోఁ బెద్దచెఱుకూరిశాసనమను నొకశిలాశాసనమును నా
ధారముచేసికొని నన్నెచోడుఁడు నన్నయభట్టారకునకుఁ దిక్కనసోమయా
జికిని నడిమికాలపువాఁడని నేను నిర్ణయించినాఁడను. ఆశాసనము నిరా
ధారము కాదని చెప్పి కొన్నిశబ్దసామ్యములను బట్టి నన్నెచోడుఁడు తిక్కన
సోమయాజికిఁ దరువాతివాఁడై యుండు నని లక్ష్మీపతిశాస్త్రిగారు నిర్ణ
యించుచున్నారు. ఈసామ్యములుకూడ నిర్ధారకములు కావని నాయ
భిప్రాయము. కొన్నికొన్ని పోలిక లున్నమాత్రముచేత నొకఁడని రెండవవా
రనుకరించి రని చెప్ప నలను పడదు. కేతనయుఁ దిక్కనయుఁ గేవలము
సమకాలికులుగదా ! కేతనవిజ్ఞానేశ్వరీయమునందుఁ దిక్కనపోలిక లనేక
ములు గానవచ్చుచున్నవి. అచ్చులేని యాకాలమునందుఁ దిక్కనగ్రంథ
మును జదివి కేతన్న యాపోలికలను జూపినాఁడనవచ్చునా ? తిక్కన
రచనము చాలవఱకు నప్పుడు నెల్లూరుప్రాంతదేశమునందు (పాకనాటి
యందు) శిష్టవ్యవహారమునందున్న భాష ననుసరించి యున్న దన
వలయును. నన్నెచోడుఁడును గేతనయు నాదేశమువారే కావున వీరి
కట్టి భాషావిశేషము స్ఫురించుట సాజము. ఏది యెట్లైనను నన్నెచో
డునికాల మిది యని సర్వజనసమ్మతముగా నిర్ణయించుటకుఁ దగినయా
ధారము లింకను లభింపలే దనవలసియున్నది. ఇది యెట్లున్నను లక్ష్మీపతి
శాస్త్రిగారి విమర్శనము శ్లాఘాపాత్రమై యున్నది. వీ రుద్దేశించిన కుమార
సంభవద్వితీయముద్రణము శీఘ్రముగా జరుగునుగాత.

జయంతి రామయ్య.

# శ్రీసూర్యరాయాంధ్రనిఘంటువు, వేదము వేంకటరాయశాస్త్రిగారు.

1937 సంవత్సరము ఫిబ్రవరి పదునాలుగవ తేదీ హిందూపత్రిక యందు శ్రీసూర్యరాయాంధ్రనిఘంటు ప్రథమసంపుటమును విమర్శించుచు బ్రహ్మశ్రీ నాగపూడి కుప్పుస్వామయ్యగారు వ్యాస మొకటి ప్రకటించినారు. ఆవ్యాసముయొక్క యవతారికలో నీ నిఘంటునిర్మాణప్రారంభదశలో కీర్తిశేషు లగు కళాప్రపూర్ణ వేదము వేంకటరాయశాస్త్రిగారు మిక్కిలి గొప్పపని చేసియుండి రనియు, ఆయన చేసినపనిని నిఘంటుపీఠికలో స్మరింపకపోవుట శోచనీయ మనియు నుడివిరి.

దీనినిబట్టి వేంకటరాయశాస్త్రిగారు చేసినపనిని నిఘంటునిర్మాణమున నుపయోగపర్చుకొనుచు దానిని స్మరింపకపోవుట యనుచిత మని కుప్పుస్వామయ్యగారి యభిప్రాయ మైనట్లు స్పష్టపడుచున్నది. కృతివిమర్శనములోఁ గృతియందలి గుణదోషములే విమర్శింపవలయును, గాని, యాకృతినిర్మాణమునం దెవ రెంతెంత పనిచేసి రనునది చెప్పుట ప్రస్తుతము కా దని నాయభిప్రాయము. అట్లైనను కుప్పుస్వామయ్యగారు వ్రాసిన దానినిబట్టి యిప్పటి నిఘంటుసంపాదకులు గ్రంథచౌర్యమును జేసినట్లు కొందఱకుం దోఁపవచ్చును. కావున నట్టిపని జరుగలే దని లోకమునకు వెల్లడించుట యావశ్యక మని తలఁచి జరిగినవృత్తమును యథార్థముగాఁ జెప్పవలసివచ్చినది. నిఘంటుపీఠిక నిఘంటునిర్మాణపద్ధతిని వివరించుటకు మాత్రమే యుద్దేశింపఁబడి యుండుటచేత నం దితరవిషయములు లేకుండుట యొకలోపము కాదు.

1936 సంవత్సరము ఏప్రిల్ నెలలో నిఘంటుప్రథమసంపుటము శ్రీ శ్రీ శ్రీ పిఠాపురము మహారాజావారికి సమర్పణము చేయుటకునై కావింపఁబడిన సభలో నేను జదివినవ్యాసమునందు వేంకటరాయశాస్త్రిగారికిని నిఘంటువునకును గలసంబంధము సందర్భోచితముగా సూచింపఁ

బడినది. ఆవిషయమునే యిపుడు కొంచెము విపులముచేసి తెలుపుచున్నాఁడను.

నిఘంటుకార్యస్థానము చెన్నపట్టణమున నున్నపుడు వేంకటరాయశాస్త్రిగారు సంపాదకులుగ నియమింపఁబడి సుమారు రెండుసంవత్సరములు పని చేసినపిమ్మట నిఘంటుకార్యము చక్కఁగా జరుగుచుండనట్లు తమకుఁ దెలియవచ్చిన దనియు, నిఘంటుకార్యస్థానము చెన్నపట్టణములో నుంచిన లాభ మంతగాఁ గనిపింపదు కావున కార్యస్థానము కాకినాడకుఁ గాని, పిఠాపురమునకుఁ గాని మార్చి యక్కడఁ బనిచేయింపఁ దలఁచినా మనియు, సభ్యులకుఁ బరిషత్తువా రంగీకరింపవలయు ననియుఁ గోరుచు శ్రీపిఠాపురము మహారాజావారు జాబు నంపిరి. ఆవిషయము చర్చించుటకై యొకపరిషత్కార్యనిర్వాహకసభ జరిగినది. ఆసభలో వేంకటరాయశాస్త్రిగారును, కుప్పుస్వామయ్యగారును గూడ నుండిరి. మిగులఁ జర్చ జరిగినపిమ్మట శ్రీమహారాజావారు వ్రాసినప్రకారము నిఘంటుకార్యస్థానము చెన్నపురినుండి మార్పవచ్చు నని తీర్మానింపఁబడినది. ఆతీర్మానము ననుసరించి 1918 సంవత్సరప్రారంభములోఁ గార్యస్థానము పిఠాపురమునకు మార్పఁబడినది పిఠాపురమునకు మార్చినపిమ్మట చెన్నపట్టణములో నెంతవఱకుఁ బని జరిగినదో యని కాగితములు పరిశీలింపఁగా స్వల్పశబ్దముల విషయమై తంజనగరము తేవప్పెరుమాళ్లయ్యగారు చేసినపని గాక, తక్కినపని యంతయు మొదటినుండియుఁ జేయవలసినట్లు కానవచ్చినది. అనఁగా, వేంకటరాయశాస్త్రిగారు చేయఁబూనుకొనిన పనిలో నిఘంటువునందుఁ జేర్చుటకర్హమైనది యేమాత్రమును గానరాలేదు. కావున యిప్పుడు ప్రకటింపఁబడుచున్న నిఘంటువులో వేంకటరాయశాస్త్రిగారు చేసినపని యేమాత్రమును గూడఁ జేరియుండ లేదనియే చెప్పవలసియున్నది.

పరిషత్తువారు నిర్ణయించిన నిఘంటునిర్మాణపద్ధతిలో నాంధ్రవాఙ్మయములోని ప్రమాణగ్రంథముల నన్నిటిని జదివించి యొక్కొక్క శబ్దము నొక్కొక్క కాగితపుముక్కమీఁద వ్రాయించి యచ్చటనే యా గ్రంథమునందలి

గలయర్థములను సోదాహరణముగాఁ జూపవలె ననియు, నీకాగితపుముక్కల నన్నిటిని వర్ణక్రమముగా నేకముఖముచేసి వాని నొకటిరెండుపర్యాయములు చక్కగా విమర్శించి నిగ్గుతేల్చి, యానిగ్గునే నిఘంటువులోఁ జేర్పవలె ననియు నియమింపఁబడియున్నది. వేంకటరాయశాస్త్రిగారు నిఘంటు సంపాదకులు గా నున్నకాలములో నీపని యేమాత్రమును జరిగియుండలేదు. శాస్త్రులవారు మాత్రము భారతాదిగ్రంథములను గొన్నిటిని జదివి వానిలో నచ్చటచ్చటఁ దమకుఁ దోఁచినవిషయములను సూచించుచు సంక్షేపముగా Note book లలో వ్రాసియున్నారు. అట్టిపుస్తకములు కొందొమ్మిది గలవు. వానిలోఁ గలవిషయము వేంకటరాయశాస్త్రిగారే చివరవఱకు నున్నయెడల నాయన యుపయోగింపఁ గలిగియుండుదురేమో కాని యితరు లుపయోగింపఁగలుగు స్థితిలో లేవు. వేంకటరాయశాస్త్రిగారు చేసినపని యంతయునిదే. ఇది నిఘంటునిర్మాణమునందేమాత్రము నుపకరించి యుండలేదు. శాస్త్రులవారు చేసినపని స్వరూపము పాఠకులకుఁ జక్కఁగాఁ దెలియుటకై వారు వ్రాసి యుంచిన పుస్తకములలోని కొన్నివాక్యము లీక్రిందఁ జూపుచున్నాఁడను.

(1) ఆంధ్రమహాభారతము-సభాపర్వము ద్వితీయాశ్వాసము.

పద్య 96 quote వైశ్యులపోలె- [పిటికితనముతోననుట]

98 అసమ్మతమై పూ వెలింగె.

101 qoute ఉదరిపడి=ఉలికిపడి ?

102 ఒలసి

105 త్రిధామపరాక్రముఁడు.

106 అయ్యుఁ బెట్టనివారులేరు.

109 శుకవర్ణవాహనివహములు [పసరువన్నెగుఱ్ఱములగుములు]

111 పదునాలుగువేలు గజంబులు [సమాసమా?]

113 quote ద్రవిడ- మాళవ- కళింగ- బంగాళ- ఆంధ్ర,

ఆజానేయ (దేశములు) మేరుమందర-

కౌసుమక్షౌద్రపాత్రంబులను

114 quote ల, త్క్శీవిభవంబుతోడ నుపమింపఁగ [ఇంచుక్కు

నకు స్వరసంధిలేదు.]

115 ఒక్కలక్షభూసురోత్తముల్ [సమాసమా?]

116 quote తనుమధ్యయర్ధరాత్రంబునపుడు [యతి]

119 కవలును

(2) అరణ్యపర్వము-చతుర్థాశ్వాసము.

284 quote కృష్ణుని శరణు సొరుము [చొరుము- ద్వికర్మక

మా? కాదు- శరణుచొచ్చు శబ్దపల్లవము]

288 [సత్యహానిసకలదుఃఖకారణము] సీసపద్యము.

290 [ద్రవిడవ్యాప్తిచేత భువి మెల్లెడం జాడగు న

యిందుఁ జెప్పఁబడియున్నది. ఈద్రవిడులెవరు?]

291 చఃంచెదరు [ఇంచుక్కునకు స్వరసంధి లేదు]

293 (ఇదే శ. ర.) కరిసనము= కర్షణము= దుక్కి.

294 దర్శన=శాస్త్ర

ఇల్లడసొమ్ములు.

295 quote ఇదే శ.ర. అప్రాసము- ఉఱవు × గొఱియ

తెఱవలు × ఎఱచియు.

అర్థి [ఈశబ్దమునకు నిష్పత్తి యెట్లు?]

297 హేతుప్రత్యయవాదవిచేతసులు.

(quote under పాచు) పెడఁబాతురు (పాయు

దురునకు రూపాంతరముగాదు. పాచుధాతుపు]

298 సుహృజ్జనమాతాపితృపుత్రహంతలు-

(3) విరాటపర్వము—తృతీయాశ్వాసము.

163 పేటులన్.

మ్రొగ్గు=పడునట్టి

!? అర్మ=ఆక్రమణముయొక్క [పా- ఇది ఆమునకు రూపాంతరమా? అమ్ము=అహంకారము భా.ల.]

పోటులవాతన్ = దెబ్బలబారిని [=పోటులపాలన్—అనుట.]

అగ్గలికన్=అహమికచేత.

పఱ్ఱు=ప్రవాహము

164 పెక్కండ్రకున్=పలువురమీఁదికి

చెఱ్ఱోకపోటు [పా. వేఱ్ఱోకపోటు (దరి)]

సళికి [యలమి-పా] [అలికి=సంకోచించి]

quote అగ్గలికమైన్

quote ఈడఁబోవక

quote ఓహరిసాహరి=గుంపులుగుంపులుగా (?) [ఓహరిన్=ఓడుటచేత, సాహరిన్=కూడుటచేత—భా. ల. ముందటికి వెనుకకును (?)]

ఉయ్యాలచేరుగా.

చదలన్ (షష్ఠీవిభక్తికము)

కుప్పుస్వామయ్యగారి విమర్శనములో గర్భితమై యున్న దోషారోపణము పరిహరించుకొనుటకై యింత వ్రాయవలసి వచ్చినది. వేంకటరామశాస్త్రిగారు మహావిద్వాంసు లని నే నెఱుఁగుదును. వారియెడ నాకు భక్తియు గౌరవమునుగూడఁ గలదు.

జ. రామయ్య.

# కథాసరిత్సాగరము.

—వఝునాయకంతుల సత్యనారాయణశాస్త్రిగారు, పల్లిపాలెము.—

---

సంస్కృతభాషలో సోమదేవభట్టారకుఁడు వ్రాసిన కథాసరిత్సాగరమును దానియాంధ్రీకరణములను గొంత పరిశీలింపఁ గడఁగుచు నేనాత్మక యగుబృహత్కథను గూర్చి ప్రథమమున నాకుఁ దోఁచినసంగతులు వ్రాయుచున్నాను.

బృహత్కథ—ఇది గుణాఢ్యునిచే పిశాచీభాషయం దేడులక్షలశ్లోకములపరిమితి కలుగునట్లుగా వ్రాయఁబడిన మహాగ్రంథము. ఈగుణాఢ్యుఁడు సుప్రతిష్ఠితపట్టణమునఁ బుట్టి సాతవాహనుఁ డనురాజునొద్ద నితఁడును శర్వవర్మయు ను మంత్రులుగా నుండిరి. ఆసాతవాహనమహీజాని సంస్కృతసారస్వతములోఁ దగినంత పరిజ్ఞానము లేనివాఁ డగుటచే స్వభార్యావమానితుఁడై తనకు సంస్కృతము నేర్పవలయు నని గుణాఢ్యశర్వవర్మల నర్థించెను. అంతట గుణాఢ్యుఁ డాఱుసంవత్సరములలో సంస్కృతభాష నామూలాగ్రముగాఁ జెప్పెద నన శర్వవర్మ... నే నాఱుమాసములలోనే చెప్పెద నని దారుణతర ప్రతిజ్ఞ చేసెను. అట్లు చేయఁజాలినచో నేను సంస్కృతభాషావ్యవహారమునకు స్వస్తి చెప్పుదు నని గుణాఢ్యుఁడనుటయు శర్వవర్మ యాశ్చర్యకరముగాఁ గుమారప్రసాదము వడసి సాంతముగా సంస్కృతవిద్య నాఱుమాసములలోనే సాతవాహనునిచే నభ్యసింపఁ జేయుటయు గుణాఢ్యుఁడు స్వప్రతిజ్ఞానుసారముగా సంస్కృతము మాటలాడక వింధ్యపర్వతప్రాంతభూములకుఁ బోయి యచ్చటఁ బిశాచములు వ్యవహరించు భాష నభ్యసించి కాణభూతి యనునతఁడు కథలు చెప్పఁగా నాపిశాచభాషయందే బృహత్కథను వ్రాసె నని సోమదేవవిరచితమైన కథాసరిత్సాగరమందును క్షేమేంద్రప్రోక్తమగు బృహత్కథామంజరియందునుఁ గలదు.

ఈగుణాఢ్యుఁ డేడులక్షలు శ్లోకములు నేడుసంవత్సరములలోపల వ్రాసి యీబృహత్కథను భూమిలోఁ బ్రతిష్ఠింపవలయు నని తలఁచి గుణదేవ, నందిదేవు లనెడు తనప్రియచ్ఛాత్త్రులఁ బిలిచి యీకృతిగ్రహణమున కర్హుఁడగు రా జెవరని యడిగెను. వా రిరువురు నీమహాకృతిసారము దెలిసికొనఁదగు రాజు సాతవాహనుఁ డొక్కఁడే యని చెప్పిరి. గుణాఢ్యుఁ డారాజునొద్దకు వెళ్లుటకు మొగమోటపడి శిష్యులచేత నతనియొద్ద కాగ్రంథ మంతయు నంపెను. ఆశిష్యు లిరువురు సాతవాహనున కాగ్రంథసందర్భము చెప్పుటయు నారాజు మదాంధుఁడై "భాష పైశాచము, గ్రంథపరిమితి యేడులక్షలు, వ్రాత రక్తమయము, ఆహాహా! యేమిగ్రంథము! చాలుఁజాలు" నని గర్హించెను. అంత నాశిష్యు లేమియుఁ జేయునది లేక విన్నఁబోవుచు గుణాఢ్యున కీసంగతి విన్నవించుకొనిరి. అతఁడును సాతవాహనుని యవజ్ఞకు మిగుల విచారించి యొక యగ్నికుండమును నెలకొల్పి యామహాగ్రంథమును నొక్కొక్క పుటయే శిష్యులచేఁ జదివించుచు నాపత్త్రములను దనచేతితో నగ్నిదేవునకు నాహుతి యొనర్పసాఁగెను. ఈమహాకథలను వినుచు వన్యమృగములు సైతము మేఁతమాని విచారమగ్నము లై యుండెను. ఇది యిట్లుండ దైవవశమున నక్కడ సాతవాహనున కస్వాస్థ్యంబు ప్రబలుటయు రాజవైద్యు లీరోగము శుష్కమాంసాహారమువలనఁ బుట్టిన దని చెప్పఁగా నారాజు వంటవారలఁ బిలిపించి యడిగెను. వారు నిందు మాదోష మేమియు లేదు. వేఁటకాఱదేలనో? యిట్టి శుష్కమాంసంబుఁ గొని తెచ్చుచుండి" రని చెప్పిరి. వెంటనే వేఁటకాండ్రను గూడఁ బిలిపించి యడుగఁగా వార "లయ్యా! మాయరణ్యప్రాంతమునఁ గలయొకపర్వతమునందొకతాపసుఁ డగ్నిహోత్రకుండము చేసి యొకమహాగ్రంథమును దన శిష్యులచే నొక్కొక్కపత్త్రమే చదివించుచు నగ్నికి బూర్ణాహుతి నిచ్చుచున్నాఁడు. ఆగ్రంథములో నున్నకథలు వినుచు వన్యమృగములు సైతము మేఁత మాని చిక్కిపోయినవి. కనుక మాంసముకూడ నెండిపోయియున్నది. ఇంతకంటె వే ఱొకకారణము లే" దని చెప్పిరి. తత్క్షణమే సాత

వాహనుఁడు గుణాఢ్యునొద్దకు వెళ్లి యామహాకవి యాహుతిసేయఁగా శేషించిన యొకలక్ష గ్రంథమును మాత్ర మాతనిని బ్రార్థించి పుచ్చుకొనెను. అదియే నరవాహనదత్తజననము.

తరువాత నారాజు గుణాఢ్యశిష్యులచే నా "బృహత్కథ" కర్థమును జెప్పించుకొనెను. గుణాఢ్యుఁడును యోగబలముచే స్వశరీరమును వీడెను. అప్పటినుండియు నీనరవాహనదత్తచరిత్రాత్మక మైన యీబృహత్కథ నరాతలమునం దెల్లెడలను బ్రఖ్యాతి వహించియుండెను.

ఈగ్రంథ మేశతాబ్దములోనిదో నొక్కి వక్కాణించుటకుఁ దగిన యాధారము లేవియును లేవు. కాని దండి తనకావ్యాదర్శమందు బృహత్కథను దాను వినియున్నట్లు వ్రాసియున్నాఁడు, మఱియు భట్టబాణుఁడు తన హర్షచరిత్రమం దీగ్రంథమును బేర్కొని యున్నాఁడు. దండి బృహత్కథను బేర్కొనె నన్నవిషయము నాలోచింపఁగా గుణాఢ్యుఁ డైదవ శతాబ్దమువాఁడు గాని యంతకుఁ దొల్లిఁటివాఁఁడు గాని కావలయు నని తెల్లమగుచున్నది. భాసవిరచితము లగుస్వప్నవాసవదత్త ప్రతిజ్ఞాయౌగంధరాయణనాటకములలోని కథలకు బృహత్కథలోని కథలు మూలభూతములై యుండనోపు నని కొందఱు విజ్ఞు లూహించుచున్నారు. అదియే సమీచీన మైనయెడల గుణాఢ్యుఁడు 3 వ శ. కంటె నూతనుఁడనుట యనుచితము.

పైశాచము వింధ్యపర్వతప్రాంతములో వ్యవహరింపఁబడు చుండినట్లు కథాసరిత్సాగరములోఁ గలదు. రాజశేఖరుఁడు తనకావ్యమీమాంసయందుఁ గూడ నిట్లే వ్రాసి యున్నాఁడు. ఇదియే సత్య మైనచో బృహత్కథ వింధ్యప్రాంతమున వ్రాయఁబడినది యనుట నిర్వివాదము. కాని కొందఱు పాశ్చాత్యపండితులు పిశాచము హిమవత్ప్రాంతములయందు వాడఁబడుచున్న దనియు, నాభాషను వింధ్యప్రాంతవర్తి యగు గుణాఢ్యుఁడు వర్తకులమూలమున నభ్యసించి బృహత్కథను వ్రాసె ననియుఁ జెప్పెదరు, కాని, యది యంత ప్రత్యయముగాఁ దోఁచుట లేదు.

ప్రశ్నయైన నేమి? గుణాఢ్యుఁడు 3 వ శ. కంటెఁ బ్రాచీనుఁడై యుండు నని చెప్పి తీరవలయును. ఇంతకును గుణాఢ్యుని పైశాచబృహత్కథ కాల గర్భమం దడఁగియున్నది.

ఇట్టి యీబృహత్కథ నాధారముగాఁ జేసికొని సోమదేవుఁడు కథాసరిత్సాగరమును క్షేమేంద్రుఁడు బృహత్కథామంజరిని బుద్ధస్వామి శ్లోకసంగ్రహమును వ్రాసియున్నారు. సోమదేవక్షేమేంద్రు లిర్వురుఁ గాశ్మీరదేశీయులు. బుద్ధస్వామి నేపాళదేశీయుఁడు. పై మూఁడుగ్రంథములకును బృహత్కథయే మూల మని స్పష్టముగా వ్రాసిరి. కథాసరిత్సాగర, బృహత్కథామంజరులకు విశేషభేద మేమియు లేదు గాని శ్లోకసంగ్రహకథాసరిత్సాగరములకు మాత్రము గాథలలో విశేషవ్యత్యాసమున్నది. శ్లోకసంగ్రహావిముక్తము లైనయనేకకథలు కథాసరిత్సాగరములోఁ గన్పట్టుచున్నవి.

కాని పాశ్చాత్యులు శ్లోకసంగ్రహమే బృహత్కథకు సరియైన యనువాదగ్రంథ మనియుఁ బ్రథమమున బృహత్కథ సంస్కృతభాషలోనే యుల్లేఖింపఁబడిన దనియుఁ బిమ్మట మఱికొన్నికథలు చేర్చి దానిని పిశాచములోనికిఁ బరివర్తన్మ చేసి రనియు, నీసంస్కృతగ్రంథమునుండియే సోమదేవక్షేమేంద్రులు గ్రంథములు వ్రాసి రనియుఁ జెప్పుచుండిరి. కాని సంస్కృతబృహత్కథ పైశాచములోని కెప్పుడు పరివర్తన చేయఁబడినదో తెలిసికొనుట కేమియు నాధారములు లేవు.

మఱియు నాంగ్లేయులు బృహత్కథ గద్యరూపముగా వ్రాయఁబడియున్నట్లు వ్రాసియున్నారు. కొన్నికొన్ని ప్రాకృతవ్యాకృతులయందుఁ గూడ గద్యరూపముగానే యుదాహరింపఁబడినది. సోమదేవక్షేమేంద్రులు మాత్ర మేలొకో? పద్యరూపముగా నున్నట్లే వ్రాసియున్నారు. దాని కేమి! బుద్ధస్వామి శ్లోకసంగ్రహము కథాసరిత్సాగర బృహత్కథామంజరులకంటెఁ జక్కని శైలితో సముచితవర్ణనలతో వ్రాయఁబడినది. ఇందు సుమారు 4500 శ్లో. కలవు, క్షేమేంద్రుని బృహత్కథామంజరి మాత్రము

కావ్యశైలిని వర్ణనాపూరితమై యున్నది. ఇందు సుమారు 7500 శ్లోకములు కలవు.

కథాసరిత్సాగరము.

దీనియందు 22000 శ్లో. కలవు. మహాభారతమునందు బహువిభాగము వలెనే దీనియందుఁ బదునెనిమిదిలంబకములు కలవు. 124 తరంగముల క్రిందఁ గూడ విభజించియున్నాఁడు. ఈతరంగవిభాగము సోమదేవకల్పితమే యని తెలియవచ్చుచున్నది. క్షేమేంద్రుని బృహత్కథామంజరివలెఁ గాక నీగ్రంథమునందు సముచితవర్ణనములు కలవు. శ్లోకములన్నియు సులభార్థబోధకములుగా నున్నవి. సోమదేవుని తరువాత నెవ్వఁడెన్నినాటకములు గాని కావ్యములు గాని వ్రాసినను వానికిఁ గథాసరిత్సాగరకథలే మాతృకలని చెప్పక తప్పదు. బేతాళపంచవింశతి, సింహాసనద్వాత్రింశిక, శుకసప్తతి మున్నగు గ్రంథములలోని కథలకుఁ బార్తిగా నీకథలే మూలము. కాళిదాసుని విక్రమోర్వశీయమునకు, మాళవికాగ్నిమిత్రనాటకమునకును, రత్నావళీ, ప్రియదర్శికాది దృశ్యకావ్యములకును గథాసరిత్సాగరకథలే యాధారములు. భాసుని ప్రతిజ్ఞాయౌగంధరాయణము, స్వప్నవాసవదత్త, అవిమారకము మున్నగునాటకములలోని కథాకల్పనలు దేనిలోనివి? బాణుని హర్షచరిత్రకథాకల్పన దేనిలోఁ బుట్టినది? పెక్కేల! సంస్కృతాంధ్రభాషాప్రపంచమునఁ గలసమస్తదృశ్యశ్రవ్యకావ్యములకు నిదియే జన్మభూమి. మనము హాస్యముగా నప్పుడప్పుడు చెప్పుకొను పిట్టకథల కిదియే మార్గదర్శి.

ఆంధ్రీకరణము.

ఇట్టి సమస్తకథాలవాల మగుసోమదేవుని కథాసరిత్సాగరముఁ గొంతకాలముక్రిందట కీ. శే. కళాప్రపూర్ణ వేదము వేంకటరాయశాస్త్రులుగారు వచనరూపముగా నాంధ్రీకరించిరి. వేంకటరాయశాస్త్రులుగారనేకాంధ్రప్రబంధములకు జక్కనివ్యాఖ్యలు వ్రాసి కొన్ని కొన్ని మహాగ్రంథములు రచించి యాంధ్రభారతీమతల్లి కగణ్యమగు సేవచేసి చనిన పండితకవులు. ఆమహామహుఁ డిట్టియపారసాగరమునకు నావ వేసి తీ

లకుఁ గొంతదారి నేర్పాటు చేసియుండెను. లేనిచో నీకథాసరిత్సాగర పారముఁ గనుఁగొనుట యేరితరము! శాస్త్రులుగారు పండితకవులు కనుక గ్రాంథికభాషలో నీగ్రంథము సంపూర్ణముగాఁ దెనిఁగించిరి. అపార మగు నిట్టియుద్గ్రంథము నాంధ్రముఁ జేసిన బ్రహ్మశ్రీ వేంకటరాయశాస్త్రులుగారి కాంధ్రలోక మంతయుఁ గృతజ్ఞతాపూర్వక ధన్యవాదము లర్పించుచున్నది. అనువాదముల యావశ్యకము, నాంధ్రీకరణపద్ధతి నాకుఁ దోఁచినరీతి వ్రాసినపిమ్మటఁ బ్రస్తుతగ్రంథవిమర్శమునకుఁ బ్రారంభింతును.

## అనువాదముల యవసరము.

ఏభాషలోనైనను సద్విషయములు సదర్థములు నున్నయెడల నవి దేశీయభాషలోని కనువదించుకొనుట యత్యావశ్యకము. అనువాదములవలన విజ్ఞాన మెక్కుడు సంపాదింపవచ్చును. కేవలాంధ్రములోనే గాక సంస్కృతములోను, ఆంగ్లములోను, హిందీలోను, ఏతదితరభాషలలోను విజ్ఞానదాయకము లయినగ్రంథములు లేకపో లేదు. ప్రతిభాషలోను మంచియుఁ జెడ్డయుఁ గూడ నుండును. భాషలో ననేల! విశ్వమానవప్రకృతులు పరికించుచుండిరి గాదా? గుణదోషములు రెండు నొక్కప్రదేశముననే యుండును. మనయాంధ్రభాషయందు మాత్ర మశ్లీలార్థబోధకములు, ననుచితార్థప్రతిపాదకములు నగుగ్రంథములెన్ని లేవు. నే నిట్లంటి నని కోప మూనకుఁడు. ఇతరభాషలలో మాత్రము విజ్ఞానము లేదా? కవులు లేరా? గ్రంథములు లేవా? కనుక సదనువాదముల వలన భాషకు రవంతయు నపచారము కలుగనేర దని నొక్కిచెప్పఁగలను. ఇతరభాషాసంపర్కము లేక యేభాషయు వృద్ధినొందదు. మనయాంధ్రభాష సంస్కృతసంపర్కము లేక యెన్నినాళ్ళు నిలువఁగలదు. సంస్కృతము వలననే యాంధ్రమునకు వృద్ధి, గౌరవము, రామణీయత తటస్థించినవి. ఆంగ్లేయులు సంస్కృతములోనుండి వేదములు, పురాణములు, మతగ్రంథములు నెన్ని యనువదించుకొనలేదు! ఏభాష యైనను నితరభాషాసహాయము లేక పెంపొందనేరదు. ఆంధ్రభాషలోని ముప్పాతిక మూఁడువంతులు గ్రంథములు సంస్కృతానువాదితములే గదా? ఈరామాయణము,

భారతము భాగవతము దేనిలోనివి! సంస్కృతములో నుండు సన్నియలంకార గ్రంథములు, సాహిత్యగ్రంథములు, మత గ్రంథములును, మఱియొక భాషలో నున్నవా? ఆంధ్రభాషలోనికి సంస్కృతాదీతరభాషలలో నుండి కొన్నికొన్ని మహాగ్రంథము లింకను ననువదింపఁబడవలసి యున్నవి. కథాసరిత్సాగరమున కాంధ్రపరివర్తనమే లేనియెడల దానిలోని వింతపు కడలు, చమత్కారకథలు నాంధ్రలోకమున కెట్లు తెలియును? కనుక నితర భాషలలోనుండు సమస్తసద్విషయములను మనదేశీయభాషలోని కనువదించుకొనవలయును.

## ఆంధ్రీకరణపద్ధతి.

మూలములోనుండురీతి నేపదమున కాపదము తూనికరాళ్ళవలెఁ బడవేసినచో నది యాంధ్రీకరణ మనిపించుకొనదు. ప్రతిపదార్థము (టీక) వ్రాసిన ట్లగును. ఇట్టి పద్యములు వ్రాసినచో నాంధ్రభాషకు మితిలేని హాని కలుగఁజేసినవార మగుదుము. నన్నయాదులు భారతము నాంధ్రీకరించునప్పుడు నిర్భయముగాఁ గొంతఁ బెంచియుఁ గొంతఁ దుంచియు స్వతంత్రకావ్యముగాఁ జేసిరి కాని యనువాద గ్రంథముగా మాత్రము చేయరైరి. అదియే నన్నయాదికవిత్రయాంధ్రీకృత మగుమహాభారతమునకుండుమహాగౌరవము. మఱియును వ్యాసభారతములోనుండుకొన్నికొన్ని చిన్నికథలను భగవద్గీతను గూడఁ దెనిఁగింపరైరి. భగవద్గీత వేదాంతసారసంయుతమగుఘట్టము. దాని నాంధ్రీకరింపఁజూచినచో నిరర్గళకవితాశైలికి భంగము కలుగునేమో? యని తలఁచి యాంధ్రీకరింపరైరి. వేదాంతపారిభాషిక పదభూయిష్ఠ మగు నాభగవద్గీతఁ దెనిఁగించినచో ద్రాక్షాసన్నిభ మగు కవితాప్రవాహమునకు నడ్డుతగులక మానదు. కనుక మూలము యందలి ముఖ్యాభిప్రాయమును దీసికొని యాదిత్యమును బోషించుచు నాంధ్రీకరించిన యాంధ్రీకరణమే యాదరణీయము.

## ఆంధ్రకథాసరిత్సాగరము.

వెనుకఁ జెప్పఁబడిన వేదమువారివచనకథాసరిత్సాగరము తరువాత మఱియు నామహాసాగరమున కేతా మెత్తినవారు బ్ర. శ్రీ. ఓలేటి

వేంకటరామశాస్త్రిగారు. వీరు వేదమువారివలె వచనరూపముగా నాంధ్రీకరింపక పురాణశైలిని గద్యపద్యరూపముగాఁ దెనిఁగించిరి.

### గద్య, పద్య, రచనలు.

కేవల గద్యరచన సామాన్యపరిజ్ఞానము కలవారు చదువుకొని కథలకై యానందించుట కుపయోగించును. కేవలపద్యరచనయే యైన చోఁ గథ సరిగా నడువక పద్యముల కొఱకుఁ బ్రయత్నింపవలసి వచ్చును. అట్లు గాక యుభయకవిత్వము (గద్యపద్యకవిత్వము) భారతరామాయణాదులవలెఁ బురాణమును జెప్పుకొనుట కుపయుక్తమగును. అని తలఁచియుఁ బండితకవుల కది యుక్తముగా నుండు ననియుఁ గాఁబోలు! శాశ్వతముగా నుండునట్టి యీకథాసరిత్సాగరము నాంధ్రీకరించిరి.

ఈకథాసరిత్సాగరము వేంకటరామకృష్ణకవులలోఁ బ్రథము లగు వేంకటరామశాస్త్రిగా రొక్కరే యాంధ్రీకరించినను బేరుమాత్రము జంట కవులు (వేంకటరామకృష్ణకవులు) అనియే పెట్టిరి. వీరిలో రెండవవా రగు ద్వివేది రామకృష్ణశాస్త్రిగారు తెనుఁగుతల్లి కమూల్యసేవఁ జేసి మిక్కిలి తరుణవయస్సునందే పరమపదించుటవలన వేంకటరామశాస్త్రి గారు శాశ్వతయశస్సంపాదనమున కీగ్రంథము నాంధ్రీకరించుచుఁ దమమేనమఱఁదియుఁ దోడికవియును నగురామకృష్ణశాస్త్రులుగారియం దుండు నిర్వ్యాజప్రేమచే "వేంకటరామకృష్ణ" లనియే యాగ్రంథమునకుఁ బేరు పెట్టిరి. ఇదియునుఁ గాక జంటకవులుగా నున్నపు డెవ్వరు రచించినను నిర్వురపేరు పెట్టుటయే యుచితము.

ఈగ్రంథమును నొక్కొక్కలంబకమును నొక్కొక్కసంపుటముక్రింద ముద్రింపించుచున్నారు. నేటికి 5 భాగములుమాత్రమే ముద్రితములైనవి.

కృతికి శ్రీ సూర్యరాయ మహీవల్లభప్రియసూనులును, రావువంశవిస్తారకులును, గంగాధరరామరాయాభిధానులును, నగు శ్రీ శ్రీ పీఠికాపుర యువరాజా బహద్దరుగారు నాయకులు.

వీరికవిత్వము చదువునపుడు కవిత్రయమే గాక నడుమనడుమ శ్రీనాథుఁడు పోతన్నమున్నగు మహాకవిసార్వభౌములు స్మృతికివచ్చుచుందురు.

క. మెలఁగవు మేఁతల కైనను
మలగవు జలములకు నైన మనుజులఁ గనియున్
గలఁగవు చను వగుదనుకను
దలఁగవు తన్మునివరేణ్యు దరినుండి నృపా!

పదలాలిత్యముచేతను, భావసౌష్ఠవముచేతను నీదిగువపద్య మేప్రాచీన మహాకవిని జ్ఞప్తికిఁ దెచ్చుచున్నదో తద్జ్ఞు లూహింపుఁడు.

సీ. నిండుచందురు పోందు నిందసేయఁగఁజాలు
చొక్కపు నెమ్మోము సోయగంబు
మెఱుఁగుటద్దముల నక్కఱకుఁ గైకొనఁబోని
నిద్దంపుఁ జెక్కుల నెఱతనంబు
మరుని విండులకు వంకరల నెన్నఁగఁ జూచు
కనుబొమ దోయి చక్కందనంబు
కటికిచీఁకటి యొప్పు నటమటమొనరించు
కుదిరికగల గొప్ప కొప్పు బెడఁగు
మేల్మిబంగారు పసమించు మేనిచెలువు
ముదురు పవడంబు దొరయు నెమ్మోముసొబగు
కలదు లేదనఁ దగు లేఁతకౌను సొగసు
గలిగి చెలువొందు చిన్నయక్కన్నెఁ జూచి—౧ లం. ౮ త. గి వ.

ప్రథమలంబకమున నెలుకసెట్టి వృత్తాంతమం దీక్రిందిపద్యమును బఠించితిరా!

గీ. అట్టియెడ నీవు చేతిలోఁ బెట్టినట్టి
సొమ్ము కడతేర్చి వెండియుఁ దెమ్మనంగ
వచ్చినాఁడవు పోపొమ్ము చచ్చినాఁడ!
దాఁచఁ బెట్టితె? యిచట నీ తాతమూట.

మూలమునలేని దూషణ సందర్భోచిత మగునీపద్యోత్తరార్థ మీకథకెంతయో రమణీయత నాపాదించిన దని చెప్పవచ్చును.

క. ఏకర్మము నెఱుఁగను మొ
ఱ్ఱో కావుం డనుచు వేఁడుచున్న నతని యా
వాకు లపు డెవ్వరికిఁ జెవి
సోఁకవ యాతఁడు వినష్టశోభనుఁ డగుటన్.— ౨ ల. 3౧3 ప.

గీ. ఎంద ఱొదలినో కొమ్ముటేనుఁగులను
బోలుకాముకులను మోసపుచ్చి మిపులఁ
గఠినవృత్తి మెలంగునీగడుసుముండ
కద్దిరా! మంచిపని చేసె నాతఁ డౌవుఁడౌ!!

"ఏకర్మము నెఱుఁగను మొఱ్ఱో" "గడుసుముండ" యనునీస్వాభావికసూక్తిద్వయముచే నీ రెండుపద్యములును నతిచమత్కారముఁ గలిగించుచున్నవి.

కేవలము మూలానుసారముగా తూ, చా, తప్పకుండఁగాఁ దెనిఁగింపవలయు ననియే వేంకటరామశాస్త్రిగారి ముఖ్యాభిప్రాయ మైనట్లు దెలియుచున్నయది. సాధారణముగా వీరు తెనిఁగించినంత గ్రంథములో మూలము నెక్కడను విడువలేదు. కాని యావిత్యపోషణమున కక్కడక్కడ సంభాషణములును జమత్కారజననమునకు నవ్యభావములు మాత్రము కొన్నికొన్ని మార్చిరి. వీరు కృత్యాది నెట్లు ప్రతిజ్ఞ చేసికొనిరో చూచితిరా!

క. అంచితమూలగ్రంథ మొ
కించుకయును వీడఁబోక నెడనెడ నెదియేన్
బెంచుచు నౌచిత్యముఁ బో
షించుచుఁ దెనిఁగింపసాహసించితి దీనిన్.

వీరిప్రతిజ్ఞ యీ క్రిందిపద్యములలోఁ దెలియఁగలదు.

శ్లో. జనమేజయపుత్రోఽభూ త్పౌత్రో రాజ్ఞః పరీక్షితః
అభిమన్యుప్రపౌత్రస్య యస్యాదిపురుషోఽర్జునః
త్రిపురారిభుజస్తంభదృష్ట దోర్దండ విక్రమః— మూలము.

సీ. హరభుజాస్తంభనోద్ధురపరాక్రమశాలి
యర్జునుఁ డెవ్వానికాదిపురుషుఁ

డభిమన్యుఁ డేవానియనుఁగుముత్తాత య
భేద్యప ద్మవ్యూహ భేదకుండు
మహితగాథాసక్తమతి పరీక్షి న్మహీ
తలనాథుఁ డెవనిపితామహుండు
జనమేజయుఁడు మహాసర్పయాగ క్రియా
వష్టంభ చరితుఁ డేవానితండ్రి
గీ. యతఁడు విఖ్యాతధీరవీరాన్వవాయ
కలశవారాశిపూర్ణిమాకమలవైరి
నిఖిలలోకజన స్తవనీయగుణుఁడు
పొగడఁదగఁడె శతానీకభూవిభుఁడు.

మూఁడవలంబకమున "వైశ్యకన్యామానవ్రతుఁకథ" మూలము లో 25 శ్లోకములలో నున్నది. దాని నీయాంధ్రీకర్త 50 గద్యపద్యము లలో వ్రాసిరి.

సంభాషణాదిఁకనిఁ కూర్చి మాత్రము కొంత వ్రాయుక తప్పదు.

కోమటి యామానవ్రతునియొద్దకు వెళ్ళి "నాకూఁతురు మీకు భిక్షపెట్టుచుండఁగా కటకటా! కష్టమొదవె నని యేఁకు" కని రని యడు గును. యతియును "ఆమెసుందరవతియైనను దుర్లక్షణములు కలదిగాఁగ న్పడుచున్నది. ఆమె కెప్పుడు వివాహముచేయుకువో యప్పుడే నీవు స పుత్త్రదారముగా నశింతువు. కావున నాపిల్ల నొకమందసములో నుంచి దానిపై నొకగండజోతి నెలకొల్పి గోదావరిలో వదలివేయుము." అని చెప్పఁగా నాకోమటి వెట్టివాఁడై యట్లేచేయును.

అని సంస్కృతములోఁ గలదు. ఈక్రిందిశ్లోకములు చూడుఁడు.

శ్లో. దుర్లక్షణేయం కన్యా తే వివాహోఽస్యా యదా భవేత్
తదా ససుతదారస్య క్షయః స్యాత్తవ నిశ్చితమ్
తదేతాం వీక్ష్య దుఃఖం మే జాతం భక్తోహి మే భవాన్
తేనైవ ముక్తామౌనోస్మి త్యక్త్వా మౌనం భవత్కృతే
తదేషా కన్యకా నక్తం మంజూషాయాం నివేశితా
ఉపరిన్యస్త దీపాయాం గఙ్గాయాం క్షిప్యతాం త్వయా.

ఈసంస్కృతమూలమున కాంధ్రీకరణములోని మార్పు నవలోకింపఁదగినది.

గీ. అనిన విని యావణిగ్వరుం డధికభయస
మన్వితమనస్కుఁ డయి మహాత్మా! మదీయ
కష్టము తొలంగ నేదేని గతి యొకండు
తెలిపి మీరె కటాక్షింప వలయునన్ను.

క. తపమో దానమొ యాత్రయొ
జపమో శాంతియొ మఱేదొ సలుపవలయుచోఁ
గృప మీఱఁ దెలిపి నన్నీ
విపదంబుధిఁ గడవఁజేయవే మౌనీంద్రా!

శ్రీవేంకటరామశాస్త్రిగారు, ఔచిత్యమును బాగుగాఁ బోషించుచుఁ, గ్రొంగ్రొత్తభావములు నడుమనడుమఁ బడవేయుచు నొక స్వతంత్రప్రబంధమో? యను నట్లీకథాసరిత్సాగరము నాంధ్రీకరించిరి. ఈ క్రిందిపద్యములలోని రసనైర్మల్యము, పదవిన్యాసము, నర్థసంపదయు వేనోళ్ల శ్లాఘనీయము లనుట కేమైన సందేహ మున్నదా?

చ. ఒడలిబెడంగుతో నడలమొప్పులతో స్మరవిభ్రమంబుతో
వెడవెడ నవ్వుతోఁ గనులవెల్వడు చూపులసోయగంబుతోఁ
దొడరెడు ప్రేమచిహ్నములతో వలపుల్ దులకించు లీలతోఁ
గడుకొను వేడ్కతోఁ బొలుపుగావిహరించుచు నొయ్యనొయ్యనన్.

సీ. చూపులు సుమనోజ్ఞశుద్ధాంతకామినీ
వదనాబ్జములమీఁద వ్రాలి నిలువ
మదిరారసాస్వాదమాత్రసమాసక్తి
రసన తదేకపారణ మొనర్ప
వీను లానందాబ్ధివీచీరవసదృక్ష
కలవిపంచీరాగకళలఁ దనియ
నిరతంబును దృతీయపురుషార్థసంపాద
నాసక్తమై బుద్ధి నెయ్యమున నలర

ఆ. వె. వత్సవిభుఁడు సకలవైభవదేవేంద్రుఁ
డగుచు విస్మృతాఖిలాన్యకార్య
భారవహాత నూత్నపరిణీతనిజవధూ
జనసుఖోత్సవానుసక్తి నుండె.

స్థాలీపులాకముగాఁ గొన్నిపద్యముల నుదాహరించెద నని వ్రాయిప్లే వ్రాయఁ గడఁగినచోఁ దిరిగి కథాసరిత్సాగర మంతయు నీవ్యాసములోనికే దింపవలసివచ్చు ననెడుభయముతో నీపద్యములు మాత్రము పాఠకులకుఁ జవిచూపితిని.

వివిధవిషయములుగల యీమహాగ్రంథము నాంధ్ర వాఙ్మయ ప్రపంచమున కర్పించి యాంధ్రవాణి కనశ్వరము, నమూల్య ము నగు సేవఁ జేసిన శ్రీ వేంకటరామశాస్త్రిగారికి నాయభివాదము లర్పించుచు నేతద్గ్రంథాంతమునఁ దమస్వాహంకారపరిహారభావము వెలిపుచ్చుచు శ్రీశాస్త్రులుగారు వ్రాసిన పద్యము నిక్కడ నుల్లేఖించి యీ వ్యాసము నింతటితో విరమించుచున్నాను.

క. పలుకుల వెలందియెట్లెటు
పలికించిన నట్టు లేను బలికితి దోసఁగుల్
గలిగిన మన్నింపుఁడు పె
ద్దలు రసవత్పదపదార్థతాత్పర్యజ్ఞుల్.

---

# గ్రంథస్వీకారము.

1. కర్షకా!—ఇదియొకచిన్న పొత్తము. నలువదితొమ్మిదివృత్తము లుగలది. ఉభయ భాషాప్రవీణులు, కొండపేటి వెంకయ్యగారు రచించినది. కర్షకునిస్థితి యిం దతినిపుణముగా వర్ణింపఁబడినది. ఇది మిగులననుభవము గలిగిన కర్షకులసంబోధనము! కవనము విషయమునం దెక్కుడువిలువగనఁ బఱచుచున్నది. జాతీయములు, స్వభావోక్తులుఁ గలిగి కర్షకులదీనావస్థను గదళీపాకమున విశదముచేయుచున్నది. వ్రాఁతలోఁ బొరపాట్లు చాల భాగము సవరింపకుండ నచ్చువేయించిరి. ఉదా:-మీఁదనురక్తమెల్లఁ దిగ ద్రింగి - ౨౨. నీవుకలఁగాలము - పైబడినఁభాగము - 30. యథేచ్ఛని వాసముఁజేయ ౨౮ మొదలైనవి.

ఉ. ఎండయు వానయంచనక నెప్పటికప్డు బండచాకిరీ
తిండికిఁ జేయుచుండెదవు, దేవురులాడుచు నెప్డైన నీ
మండెడుఁ పొట్టనింపుకొను మార్గము లేదుగదోయి యింకనో
మొండికృశించిపోయినవి ఎమ్ములు సర్వమునీకు కర్షకా!

ఉ నాగలిఁ జేతబట్టి నరనాథులపాలికిఁబోయి కష్టముం
బోగలమార్గమెద్ది యనుమోయి వచింపక నూరకుండినన్
చేగలయంతవట్టు కనిచేసియె రమ్మిక కొంపముంపనా
వేగినఁ జూచుకొంద మది యెంతటిదో యని బుద్ధికర్షకా!

ఈరెండుపద్యములు నన్నివిషయములకు మచ్చు.

గ్రంథమును గవిగారు తమవిద్యాభివృద్ధికిఁ గారకులగు శ్రీ నర్రా వాసవయ్య చౌదరిగారికి నంకితముచేసిరి. గుంటూరుజిల్లా సత్తెనపల్లి తాలూకా కోసూరుపోస్టుకుఁ జేరిన విప్పర్ల గ్రామములోని కవిగారికి వ్రాసిన నూరకయే పుస్తకమును బంపెద రని తోఁచుచున్నది.

---

2. తోరణము:- మధునాపంతుల సత్యనారాయణశాస్త్రిగారు కవి. ఆంధ్రికుటీరము, తొలిపువ్వు. మాతామహు లగు రామమూర్తిగారివత్సలత కర్పణము చేయఁబడినది. 40 పుటలలో 40 పద్యములుఁ బుటకొక్కొక్కటిగా ముద్రింపఁబడినవి. పద్యములన్నివిధముల హృద్యము

గానున్నవి. "మంచిత్రోవఁబోవుదమురండు ధీరాంధ్రపుత్త్రులారా!" యని మొదటినుండి బోధించినారు.

"నోడువఁ జాలనియుడుమలఁ గుడిచి బడలి
చిక్కిజీర్ణించి నిజదేశ సేవఁ జేసి
తుదకు స్మరణీయులైన యాంధ్రులఁ దలంప
గాజు కన్నైన నొక యశ్రుకణము రాల్చు.
"ఆంధ్రభాషాభివృద్ధియు, నాంధ్రదేశ
భాగ్యవృద్ధియు నేనాఁడు పడయనగునొ
యప్పుడే యాంధ్రశబ్ద మన్వర్థమగును
మనయెడలఁ గానిచో నామమాత్రమగును.

పితృశిక్షను లెక్కసేయకున్న యొక్కకుమారునికిఁ దండ్రి దినదిన మొక్కరూపాయయిచ్చి లోపఱుచుకొని రామాయణభారతాదులు తన నిమిత్తమై చదువుమని క్రమక్రమముగా సన్మార్గమునకు దింపిన ట్లొకచిన్న కథయున్నది. కవిగారికి, పల్లెపాలెము వ్రాసినదొరకును.

---

3. శ్రీశంకరాచార్యజీవితసంగ్రహచరిత్రము-గ్రంథకర్త శ్రీ కృత్తివెంటి లక్ష్మీనారాయణగారు. పదియధ్యాయములు- డెబ్బదిరెండుపుటలు - వచనకావ్యము - శ్రీమత్పరమహంసపరివ్రాజకాచార్యవర్య శ్రీవిమలానంద భారతీస్వాములవారి పూర్వపీఠికతోఁ గూడినది. కంకటావ దేవస్థానములోఁ బ్రతిష్ఠింపఁబడిన శ్రీశంకరాచార్యుల ఛాయాపటము ముఖపత్త్రమునఁ గలదు. పీఠికవ్రాసిన శ్రీవిమలానందస్వాములపటము లోనఁగలదు. శ్రీశంకరుల జీవితచరిత్ర మిందుఁ జక్కగ సంగ్రహరూపమున వ్రాయఁబడినది. భాష నాతికఠినముగానున్నది. విషయము సంగ్రహముగానున్ననుఁ జదువరులకుఁ గావలసిన ముఖ్యవిషయములు విడువఁబడలేదు. షణ్మతస్థాపనాచార్యులగు శ్రీశంకరాచార్యులుచారిత్రమును మతాభిమానముగల యెల్లవారును జదివితీరవలయును. గ్రంథము బందరులోని నర్సిల్లిపేటలోని కృత్తివెంటి లక్ష్మీనారాయణగారి యొద్ద నాలుగణాలకు దొరకును.

---

నుభయకవిమిత్రనామము
త్రిభువనముల నెగడ మంత్రితిక్కనకు దాల్చెఁ.

సీ. సరసకవీంద్రుల సత్ప్రబంధము లొప్పఁ
గొను నను టధికకీర్తనకుఁ దెరువు
లలితనానాకావ్యములు చెప్పి నుభయభా
షలయందు ననుట ప్రశంసత్రోవ
యర్థిమైఁ బెక్కూళ్ళ నగ్రహారంబులు
గా నిచ్చు ననుట పొగడ్తపొలము
మహిత దక్షిణలైన బహువిధయాగంబు
లొనరించు ననుట వర్ణనముచొప్పు

వరుని కొకనికి నివ్నియుఁ బ్రకటవృత్తి
నిజము లై పెంపుసొంపారి నెగడు నెట్టుఁ
గొమ్మనామాత్యు తిక్కనికొలఁది సచివుఁ
డింక నొక్కరుఁ డెన్నంగ నెందుఁ గలఁడు.

క. చతురానన సన్నిభునకు
సతతస్వాహాస్వధాదిశబ్దస్వనసం
స్తృతహవ్యకవ్యసంత
ర్పితమఖశిఖిముఖనిలింపపితృవర్గునకున్.

ఇఁకఁ దిక్కనకవి క్షిప్తీకరించిన చోటులును విపులీకరించిన తావులును, ఔచితీసంపాదనకై యన్యమార్గముల నవలంబించినవట్టులును గ్రమముగాఁ జూపుచున్నాను.

—క్షిప్తీకరణమునకు—

కవిబ్రహ్మ రసము చెడకుండుటకును గథ పాఠకులకు విసుగుపుట్టింపక వేగముగా నడచుటకును గొన్నిచోట్ల మూలములోని విషయములను గ్షిప్తీకరించినాఁడు. అందును దనకృతహస్తతను గొంత కనఁబఱిచినాఁడు. చూడుఁడు.—భార-ఉద్యో-3-౧౫౭.

చ. కొడుకులకంటె నయ్యనఁగఁ గోడలి కెక్కుడు కూర్తుఁ గోడలుం
గొడుకులు సేయుభక్తి కటఁ గోటిమడుంగులు భక్తి నాకు నె
క్కుడుఁ దగఁ జేయుచుండు నది పుణ్యచరిత్ర కులాగ్రగణ్య క్రొ
త్తడి సకలంబుఁ జూడ సభ దైన్యముఁ బొందుట సూచి ప్రాక్కిలిన్.

ఈపద్యమునకు మూలమును గూడ నిటఁ జూపుచున్నాను.

"సర్వైః పుత్రైః ప్రియతరా ద్రౌపదీ మే జనార్దన. సం. భార. ఉద్యోగం
అధ్యా. ౮౩."

ఈవిషయమునే తిక్కనకవి చతురముగాఁ "గొడుకులకంటె...చే
యుచుండు." ననువఱకుఁ బెంచివ్రాసినాఁడు.

శ్లో....తథా వృత్తా...సం. భార. ఉద్యో. గం అధ్యా ౮౮.

(తథావృత్తా=పుణ్యశీలా. నీలకంఠ వ్యాఖ్య.)

ఇది "పుణ్యచరిత్ర" అనుదానికి మూలము.

శ్లో. కులీనా........,, ,, ,, ౮౩.

శ్లో. మహాభిజనసంపన్నా... ,, ,, ,, ౮౭.

ఇవి "కులాగ్రగణ్య" యనుదానికి మూలములు.

శ్లో. పతిభిః పంచభిశ్శూరై రగ్నికల్పైః ప్రహారిభిః,
ఉపపన్నామహేష్వాసైః...... ౮౯.

ఇందలిభావమునే "సభర్తృక" యనునర్థము గల "క్రొత్తడి" యను
పదముచేఁ బ్రకటించినాఁడు.

శ్లో. సర్వైః ప్రైక్షన్త కురవః...౯౧

ఇది "సకలంబుఁ జూడ" ననుదానికి మూలము.

శ్లో. తన్మాం దహతి యత్కృష్ణా, సభాయాం కురుసన్నిధౌ, ధార్తరాష్ట్రైః
పరిక్లిష్టా...౯౨.

ఇందలిభావమునే "సభ దైన్యముఁ బొందుట సూచి ప్రాక్కిలిన్"
అని చెప్పినాఁడు. ఈవిధముగా ననేక శ్లోకములలో వ్యాసమహర్షి చెప్పి
నవిషయము నొక్కపద్యములోఁ దిక్కనమహాకవి సంగ్రహించినాఁడు.

— విపులీకరణమునకు. —

౧. సోమయాజికిఁ దనదేశాచారముల యందెక్కువ మక్కువ. అవు నైనచోట నయ్యాచారములను బ్రవేశపెట్టుచుండును. చూడుఁడు:—

శ్లో. ప్రతిగృహ్యాచ తాం పార్థః పురస్కృత్య జనార్దనమ్
వివాహం కారయామాస సౌభద్రస్య మహాత్మనః
శ్లో. కృతే వివాహే తు తదా ధర్మపుత్రో యుధిష్ఠిరః
బ్రాహ్మణేభ్యో దదౌ విత్తం యదుపాహర దచ్యుతః.

అని క్లుప్తముగా వ్యాసుఁడు చెప్పిన వివాహగాథను దనదేశాచారముల నందుఁ జొప్పించుటకును జాతకులకు రసాంతరానుభవముచేఁ గొంతయుత్సాహమును గలిగించుటకును విస్తరించి వర్ణించినాఁడు. అందలి తలఁబ్రాలుపోసికొనుట మున్నగునవి యాంధ్రాచారములే. ఇట్లే భీముఁడు విరాటునియొద్ద మల్లులతోఁ 'గుస్తీపట్లు' పట్టునపుడును సంస్కృతమున లేకున్నను దనకాలమున నాంధ్రదేశమునఁ బ్రసిద్ధములై యున్న 'కుస్తీపట్ల' నే యెంతయో రమ్యముగా వర్ణించినాఁడు.

౨. శ్లో. క్లేశితశ్చ వనే సూరో వాసవేన చ శిక్షితః
అమర్షవశ మాపన్నో యోత్స్యతే నాఽత్రసంశయః.
సం. భార. విరా. ౪౦ అ ౨౬.

శా. సింగం బాఁకటితో గుహాంతరమునం జేడ్పాటుమై నుండి మా
తంగస్ఫూర్జితయూథదర్శనసముద్యత్క్రోధమై వచ్చునో
జం గాంతారనివాసఖిన్నమతి నస్మత్సేనపై వీఁడె వ
చ్చెం గుంతీసుతమధ్యముండు సమరస్థేమాభిరామాకృతిన్.
భార. విరా ౪-౯౭.

ఇక్కడఁ జక్కని యుపమానమును గల్పించి శ్లోకమునందలి భావమున కెట్టిశోభను గలిగించినాఁడో చూచితిరా!

—అన్యమార్గావలంబనమునకు—

"క్లేశితశ్చవనే" ఇత్యాది శ్లోకమునకు వెనుక
శ్లో. ఏషపార్థోహివిక్రాంతో ... నాజిత్వావినివర్తేత సర్వాఃపిమరుద్గణాన్.

సం. భార. విరా. ౪౦ అధ్యా. ౧౬ మొదలు ౨౫ వఱకుఁ గల పదిశ్లోకముల నిక్కడఁ దిక్కన తెనిఁగింపలేదు. ఏలయన నీశ్లోకములలోని భావమునే మరలఁ గర్ణుని నిందించు కృపాచార్యునిచే శ్లో. ఏకో హి శత్రూన్ సమరే సమర్థః ప్రతిబాధితుం,—తథా నివాతకవచాః కాలకేయాశ్చ దానవాః, దైవతైరప్యవధ్యాస్త ఏకేన యుధిపాతితాః.

అని క్లుప్తముగాఁ జెప్పించి నాఁడు వ్యాసమహర్షి. మఱితిక్కన య సమయమున గురువగు ద్రోణాచార్యునిచే నర్జును నంతగా నుతింపఁజేయు టకన్నఁ గర్ణుని గర్వోక్తులకుఁ గ్రుద్ధుఁడైన కృపునిచేతనే యర్జునస్తుతి చేయించుట యుచితముగా నుండు ననియును, ద్రోణునిచేతను గృపునిచేతను గూడ నొక్కమాఱుగానే పైవిధముగా నర్జునస్తుతి చేయించుట సరసము గాదనియును దలఁచి యీవిధముగాఁ గృపునిచేతనే యర్జునస్తుతి చేయించినాఁడు.

వ. అక్కిరీటి యొక్కరుఁడ కాఁడే యని తలంతుమేని—

సీ. శక్రాది సురులతో సంగ్రామ మొనరించి
ఖాండవం బేర్చె నొక్కరుఁడ కాఁడె
యాదవబలమెల్ల నాఁగఁ ద్రోచి సుభద్రఁ
గడిమిమైఁ దెచ్చె నొక్కరుఁడ కాఁడె
దిగ్విజయంబునఁ దేజంబు సేసె ని
క్కురువంశమునకు నొక్కరుఁడ కాఁడె
బలముతో గంధర్వపతి నోర్చి విడిపించెఁ
గౌరవేశ్వరుని నొక్కరుఁడ కాఁడె
మును నివాతకవచులను దానవుల నాతఁ
డొక్కరుఁడ కాఁడె యుక్కుమడఁచె
నమరులకు నజేయు లగుకాలకేయుల
నొక్కరుఁడ కాఁడె యొడిచెఁ గర్ణ! భార. విరా. ౪-౨౧౦.

మఱియును దిక్కన భావోద్రేకమును వర్ణించునప్పు డొకవిధ మగు నూతనపద్ధతి నాశ్రయించి యెంతయూ రమ్యముగా వర్ణించును.

గీ. దివిజపతి నీకు నిచ్చిన తీవ్రశక్తి
చేతఁ గవ్వడి వధః నని చూతు వేని
వసుదేవునిచే నది వ్రయ్యలయ్యెఁ
దునియ లయ్యును బొడియయ్యెఁ దొరఁగుఁ ధరణి. ఉద్యో. ౨-౨౭౨.

గీ. పాండవులకుఁ దగినపాలు మేదినిఁ బంచి
యిచ్చుకంటెఁ గార్య మెద్ది గలదు
ధర్మ మెద్ది సముచితం బగువిధ మెద్ది
శక్య మెద్ది చెప్పుఁడ వాక్యవిదులు. ఉద్యో. ౩-౨౭౫.

క. నిండెసమయాబ్దములు నిం
డొండన లే దిపుడ చని సుయోధనుతో భీ
ష్ముండును గురుఁడును వినఁగా
నిండె ననుము నిండె నిండె నిక్కంబునకున్. విరా. ౪-౩౭౦.

ఈవిధముగాఁ దనభారతరచనయం దనన్యసామాన్యప్రతిభను బ్రకటించి కృతార్థుఁడైనాఁడు. అట్టికవిబ్రహ్మను గనుటచే నాంధ్రదేశమాతయు కృతార్థురా లైనది.

శా. మూలం బొక్కఁడు దీనికిం గలుగునే మూలంబు తాఁజూడకే
వైళం బీకృతి తిక్కయజ్వ కవితావాల్లభ్యమేపార నా
నాలంకారరసౌచితీయుతముగా నల్లెన్ జుమీ యంచు ధీ
శాలుల్గూడ నుతింప భారతము యజ్వా! కూర్చి మాకీయవే!

ఉ. నీమహిమం బచింత్యము, గణింప నశక్యము నీకవిత్వశో
భామహిమం బనన్యసులభం బగుఁ దావకపాత్రపోషణా
శ్రీమహిమం బుదాత్తము వచింపఁగ నీఘనయప్రశస్తి ని
ర్నోమహిమాకరా ! తెలుతు మోపినభంగి ననుగ్రహింపవే.

# గ్రంథస్వీకారము.

---

## గృహలక్ష్మి.

దసరాసంచిక:—చెన్నపురమున స్త్రీలజ్ఞానాభివృద్ధికై డాక్టరు కే. యన్. కేసరిగారిచేతఁ బ్రకటింపఁబడుచున్న గృహలక్ష్మి మాసపత్రికను బ్రతిసంవత్సరమువలెనే యీసంవత్సరమును దసరాసంచికను బ్రకటించిరి. సంచికయంతయు సతీలలామలచేతనే వ్రాయఁబడిన వివిధవిషయ వ్యాసములతో నిండియున్నది. స్త్రీలు వ్రాసికొన్నవియే గనుక విషయములన్నియు స్త్రీలయభివృద్ధినిగూర్చినవే యని వేఱుగఁజెప్ప నక్కఱయుండదు. ఇట్టిపత్రికను బ్రకటించుచున్న శ్రీడాక్టరుగారి నభినందించుచున్నారము. కాని, జ్ఞానాభివృద్ధి నందుచున్న నారీమణు లందఱును మాతృభాషనుగూర్చి యశ్రద్ధ చేయుచున్నా రని వగచుచున్నారము.

---

## ఆంధ్రభూమి.

ఇదిచెన్నపురములో శ్రీయుతులు ఆండ్ర శేషగిరిరావుపంతులు బి. ఏ. గారిచే నడపఁబడుచున్న దేశోపకారకమాసపత్రిక. ఈ 1936వ సంవత్సరము సెప్టెంబరునెల పత్రిక యంతయు (౭ సంపుటము-బహుధాన్య, భాద్రపదము ౨ సంచిక) "మదరాసుసంచిక" యనునామముతో వెలువడినది. విషయము లన్నియు మదరాసునుగూర్చినవియే.

"మదరాసు మహానగరము మనమ్మాటికి మనది. దానికిఁ జెన్నపురి యనుపేరు మనమిచ్చినది... మద్రాసు లేనియాంధ్రరాష్ట్రము తల లేని మొండెము, మద్రాసు అనునిరుసుమీఁద ఆంధ్రుల భవిష్యచ్చక్రము దిరుగనున్నది. మద్రాసు మనరాష్ట్రములోనుండి పోయినయెడల మననిధులుపోవును." ఈరీతిగా మద్రాసు మనయాంధ్రరాష్ట్రమునకు ముఖ్యనగరము కావలెనని చెప్పు వ్యాసము లనేకములు గలవు. మొదటినుండియు నాంధ్రులవలననే మద్రాసునగర మభివృద్ధిలోనికి వచ్చిన దనియును

దెల్పఁబడుచున్నది. అనేకులుచరిత్రములను బరిశీలించియతినిపుణముగను యుక్తియుక్తముగను వ్యాసములను లిఖించియున్నారు. చాలసంతోష ము. కాని ఆంధ్రదేశమునకై, యాంధ్రభూమికై, యాంధ్రరాష్ట్రము నకై, భగీరథప్రయత్నములు చేయుచున్న యాంధ్రులందఱు నాంధ్రభాష నధోగతికిఁ దెచ్చుచున్నారు. ఆంధ్రభాషను నీరసస్థితికిఁ దెచ్చుచున్నవ్వా డాంధ్రభూమి యేయనంతాధారమునఁ గాలూనుకొనియుండునా, యని మాత్రము విచారముగా నున్నది.

---

## కన్నడనుడి.

ఇది, బెంగుళూరులో నిరువదిమూఁడు వత్సరములక్రిందట స్థాపింపం బడిన కర్ణాటసాహిత్యపరిషత్తువారిచే, నూతనముగా వెలువ రింపఁబడుచున్న వారపత్రిక. మొదటిసంపుటము, మొదటిసంచిక మాకం దినది. కర్ణాటకభాషలో నాంధ్రభాషలోకంటె ననేక వారమాసపత్రికలు, కన్నడభాషాపోషకములు గలవు. తగినంతభాషాభిమానుల యాదరణ ము వానికిఁగలదు. కన్నడసాహిత్యపరిషత్తువారిపుడీవారపత్రిలోఁ గూ డఁ గేవల భాషావిషయములనే ప్రకటించుచున్నారు ఈపత్రికకు శ్రీ అ. న. కృష్ణరాయరుగారు సంపాదకులుగానున్నారు. ఈకర్ణాటసాహిత్య పరిషన్ముఖమున వెలువడు కన్నడనుడి దేశమున కంతకును జేఁదోడు వాదోడుగా నుండుఁగాత ! మహారాజాదరణమునందిన యీభాషకు నీ పత్రికలకుఁ గొఱఁతయేమి!

---

## మదవిదళనము.

ఇది యొక్క చిన్నపుస్తకము. చెన్నపురములో, ముత్యాలపేట హైస్కూలు ప్రధానాంధ్రోపాధ్యాయులు విద్వాన్ తా. అర్ముగంపిళ్లెగారు రచించినది. (క్రౌనుసైజు) ౭౩ పుటలుగలది. క్షేమేంద్రమహాకవి యొక్క దర్పదళనమను గ్రంథమును జదివి, యారీతిని దెనుఁగులో వచనరూపము ననొక్క కావ్యమును రచింపవలయు ననియుత్సాహపడి ప్రారంభించినది. ఇందు మదవిదళనవిషయములే పెక్కులు గలవు. మదము, అనఁగా గర్వ

ము—కూడనిది దానివలన ననేకానర్థము లున్నవని చూపుటయే కవి కడంక, కావున, గర్వలక్షణము—కులమదము, దానినిర్వాసనము, ఇట్లే ధనమదము, దానిదళనము, విద్యామదము, దానివిదళనము, రూపమదము, దానివిదారణము, యౌవనమదము, తన్మదధ్వంసనము, అధికారమదము, తద్ధరణము, ఆచారమదము, తన్నిరాసము నని చిన్నిచిన్ని యుదాహరణములలో వివరించియున్నారు. భాషజటిలము సిద్ధసమునై రాజిల్లుచున్నది.

ఇవ్విద్వాంసులు, "ఆంధ్రవాఙ్మయలక్షణదర్పణమును" వ్రాయుచున్నారు. అఱవములోని కంబరామాయణము నాంధ్రీకరించుచున్నారు. ఈ మదవిదళనము వెల మొనిమిదణాలు.

---

## సాంఖ్యార్థము.

శ్రీఉర్లాముజమీందారు లగు శ్రీరాజా కందుకూరి బాలసూర్య ప్రసాదబహదరుగారు చిరకాలమునుండి వ్రాయుచుండు నాంధ్రవిజ్ఞానమను విజ్ఞానసర్వస్వమున కనుబంధము. సంఖ్యార్థనామప్రకాశికయను నది తొల్లియొక్కటి శ్రీకనుపర్తి వేంకటరామశ్రీవిద్యానందనాథవిరచితముకలదు. దానికంటె నిది విలక్షణమైనది. దానికి దీనికిని భేదమేమన నిందు విషయవివరణముగలదు. అందుఁగేవలపదములు మాత్రమే చెప్పఁబడినవి. ఉదాహరణము:—పన్నిద్దఱాళ్వారులు-వీరిలోఁ దొమ్మిదవయాళ్వారు "తిరుమంగైయాళ్వారు (పరకాలయతి) వీరికి-కవిధ్వంసకులనియుఁ బేరుగలదు. కవిలోకదివాకరులనియు, చతుష్కవి శిఖామణులనియు, షట్ప్రబంధకవులనియు, కవివైరియనియు బిరుదనామములు కలవు. తిరునావిత్తిరువగరు అనుగ్రామమున కలియుగమున నాల్గువందల వత్సరములనాఁడు నీలుఁడనుశూద్రునకుఁ జనించి ధనుర్విద్యనేర్చి చోళభూపతికడ కొల్వుండి (అయోనిజ యగు) కుముదవల్లిం గోరి దొంగిలించిన ధనముతో నామె బడసినవారు. వృశ్చికమాస (కార్తికనెల) కృత్తికవీరితిరునక్షత్రము. విష్ణుదేవుని శార్ఙ్గాంశసంభూతులు."

శ్రీ

# ఆంధ్రసాహిత్యపరిషత్పత్రిక.

కాకినాడ.

రెండు నెలల కొకసారి ప్రకటింపఁబడును.

సంపుటము. ౨౭ | బహుధాన్యనామసంవత్సరము. శ్రావణభాద్రపదమాసములు. | సంచిక 3

## పాఠకులకు మనవి.

---

ఇప్పటికి బహుధాన్యసంవత్సరము (౨౭ వ సంపుటము)లో మూఁడు సంచికలు వెలువడినవి. చందాదారులు తాము పంపవలసిన చందాలను బంపి పరిషత్తునకుఁ దోడ్పడుదురని విశ్వసించుచున్నాము. పత్రికాముద్రణమునకు వలయు కాగితము సకాలములో దొరకకపోవుటచే నీ సంచికలను ముద్రించుటలో నాలస్యమగుచున్నది. అట్టి యాలస్య మేమియును లేక ముందుసంచికలు ప్రకటింపఁబడును.

కార్యదర్శులు.

---

# సందేహము.

క్రొత్తపల్లి సూర్యరావు, కాకినాడ.

---

ఈనడుమ నన్నయభట్టారకవిలాసములో సభ్యసమావేశ మైనది. అందులో భారతము మొదటి మూఁడు పర్వములును దీక్షగాఁ జదువుట సభ్యులకొక్క యుత్సాహకార్యము గావున నాదిపర్వమును బఠించుచుండిరి. ఈసభ్యుల నియమములు మున్నగునవి పలువురు జనవాణి మొదలగు పత్రికలలోఁ జూచియే యుందురు. పలువురు పలుతావులఁ జదువుచున్న సందర్భములో దీక్షగాఁ జదువుచుండుటచే సందేహములు కొన్నికొన్ని గలుగుచువచ్చినవి. వాని నాసభలో నందఱు నొక్కచోఁ జేరి చర్చించిరి. దాని సారాంశ మీక్రింద నిచ్చుచున్నాఁడను.

"సీ. తాలాభ మగువిల్లు దాల్చి విరోధుల
నెగుచుచు నున్నవాఁ డింద్రతనయుఁ
డాతని కెలన మహోన్మత్తహస్తిఁడై
యున్నవీరుండు వృకోదరుండు
యంత్రంబు నరుఁ డేసినప్పుడు వోయిన
యాగౌరవర్ణుండు యమతనూజుఁ
డాతనితోడన యరిగిన యిరువురుఁ
గవలవా రర్కప్రకాశతేజు
లనిన లక్షయిం‌ట నగ్నిదాహంబున
నెట్లు బ్రదికి రొక్కొ యిమ్మహాత్తు
లెట్టి పుణ్యదినమొ యేవురఁ జూచితి
మనుచు సంతసిల్లె హలధరుండు." 7 ఆ. 195 ప.

అనుదాని నొకరెత్తుకొనిరి.

"వ. అయ్యవసరంబున ధర్మనందనుండు నకులసహదేవానుగమ్యమానుండై నిజనివాసంబునకుం జనియె నిట ధృష్టద్యుమ్న సహితుండయి యజ్ఞసేనుండు మహాసేనతో నర్జునునకు సహాయుండయి నిలిచె."

అని యొకరు చదివి (7ఆ.187) చూపిరి.

చ. అని మొన నట్లు దాఁకినమహారథులన్ ధృతరాష్ట్రరాజనం
దనుల బలాఢ్యులన్ దళితదర్పులఁ జేసినవారు ధర్మనం
దనయము లుగ్రవీరు లని తద్విధమంతయు నేర్పడంగఁ జె
ప్పినవిని కౌరవప్రభుఁడు పెల్లుఁటి తద్దయు దుఃఖితాత్ముఁడై. ఆ. 8. 11.
అనుపద్య మింకొక్కరు గనఁబఱిచిరి.

సాధారణముగా నీవిలాసనభ్యులు కవిత్రయమువారి భారతము లోని పదములు ప్రయోగములు నర్థములు నిట్టి వానినే గణించువారు గాని కథలలోని పూర్వాపరసందర్భాసందర్భములను విచారించువారు కారు కాని యానాఁడు గొంత చర్చ జరిపిరి.

యాత్రంబు నరుఁ డేసినప్పుడు ధర్మతనయుఁడు నకులసహదేవాను గమ్యమానుఁడై నిజనివాసంబునకుఁ జనియెఁగదా "ధృతరాష్ట్రరాజనం దనులను బలాఢ్యులను దళితదర్పులను జేసినవారు ధర్మనందనయము లెట్లయిరి. నాలుగైదు ముద్రణములలోని భారతపాఠములఁదీసి చదివిరి. అన్నియు నిట్లే యున్నవి. కాని చదలువాడ సుందరరామశాస్త్రిగారును దండిగుంట సూర్యనారాయణశాస్త్రిగారును—టీకాతాత్పర్యములతోఁ బ్రచురించిన యాదిపర్వములోమాత్ర మొక్కింత చర్చించిరి:—8వ యాశ్వాసము 11వ పద్యము తాత్పర్యములో "ధర్మరాజు నకులసహదేవుల తోఁగూడ యుద్ధమునకు ముందే నివాసమునకుఁ బోయినట్లు సప్తమాశ్వాసము 187 వచనమునందుఁ జెప్పఁబడినది. ఇట నేతత్పద్యార్థము దానికి విరుద్ధముగాఁ గనఁబడుచున్నది. కావున అట నివాసం బనఁగా స్వయంవరస్థానమున వారు పూర్వ ముండిన స్థల మని యర్థము చెప్పి విరోధపరిహారము చేయవలెను. మత్స్యయాత్రము తెగనేసినప్పుడు కలిగిన సంరంభమునఁ దమతమస్థలముల విడిచి పోయి యుండి మరల నాచోటికి వచ్చియుండవచ్చును. యుద్ధప్రసంగంబున ధర్మరాజు నకులసహదేవులు యుద్ధముచేసినట్లు వర్ణింపకుండుట సంక్షేపార్థమై యుండవచ్చును" అని లిఖించిరి. ఇది సభ్యులకు రుచింపలేదు.

సంస్కృతములో నేమున్నదో యని చూడఁబోయిరి. మీఁద నట్లు వ్రాసినవారు మూలము చూడకుండఁగనే తమ యభిప్రాయము నిచ్చియుందు రని తలంచిరి. శ్రీవావిళ్లవారు నూతనముగా నచ్చువేయించిన దక్షిణదేశపాఠప్రతినిజూచిరి. స్వయంవరపర్వములో ౧౮౩ వ అధ్యాయముకడ ౫౦-౫౧ శ్లోకములలో—

"తం వృత్త మాదాయ రిపుప్రమాథీ దణ్డీవ దణ్డం పితృరాజ ఉగ్రమ్
తస్థౌ సమీపే పురుషర్షభస్య పార్థస్య పార్థః పృథుదీర్ఘబాహుః
తదన్తరే ధర్మరతోఽపిగత్వా విజ్ఞాయ కున్తీం కుశలీం క్షణేన
ఆగమ్య తస్థౌ సహసోదరాభ్యాం పురుషర్షభాభ్యాం పురుషప్రవీరః"

అని యున్నది.

పూనాలో భండార్కరుసంఘము వారు సుక్తంకరుమహాపండితుని సాయమునఁ బ్రకటించిన యుత్తరదేశపాఠభారతములోఁ జూడఁగా ద్రౌపదీస్వయంవరపర్వములో ననేక భేదములు కనఁబడినవి.

౧౮౯ అధ్యాయము ౧౭ శ్లోకము.

"తస్మింస్తు శబ్దే మహతిప్రవృత్తే యుధిష్ఠిరో ధర్మభృతాం వరిష్ఠః
ఆవాస మేవో పజగామ శీఘ్రం సార్థం యమాభ్యాం పురుషోత్తమాభ్యామ్"- అని యున్నది.

శ్రీవావిళ్లవా॥ప్రతిలో 'విజ్ఞాయ కున్తీం కుశలీం క్షణేన ఆగమ్య' అన్నమాటలు పూనాగ్రంథములో నధోజ్ఞాపికలోఁ గూడఁ గనఁబడవు. పూనాప్రతిలో ధర్మరాజు మరలవచ్చినట్లు లేదు. తెనఁగర్థము వ్రాసినవారు చెప్పినట్లు "స్వయంవరస్థానమున వారు పూర్వముండిన స్థలమని యర్థము చెప్పుకొనుటకు వీలుకనఁబడదు. తల్లియొద్దకే వెళ్లినట్లు తలంపవలయును.

"అట్టి యవసరంబునఁ దల్లియొద్దకు ధర్మరాజును గవలవారును మున్నవచ్చియున్నఁ దదనంతరంబ భీమార్జునులు ద్రౌపదీసహితులై చనుదెంచి" అని 7 వ ఆ. 210 వచనము నన్నయభట్టారకుని దొకటి పిఱుసలాగునఁ గనఁబడుచున్నది. దీనిగతి యేమి !

నన్నయభట్టారకవిలాసము వారు వారిబుద్ధికిఁ దోఁచినట్లు చర్చించుకొని, కథ యేమైపోయినను సరియేగాని నన్నయభట్టుగారు వ్రాసిన భారతములోఁ బ్రసక్తభాగమున నేమైన వాక్యములు పద్యములు నిటీవలఁ బ్రతులు వ్రాసికొనినవారి ప్రమాదమున లోపించినవేమో యనికొనిరి. కొందఱు చెప్పునట్లు ఆనుశాసనికపర్వము ప్రక్షిప్తమే కానిండు, కొందఱనునట్లు సౌతి చెప్పినదగ్గఱనుండియే భారతమూలము కానిండు మాకిబ్బంది లేదు, నన్నయభట్టారకుని వాక్యములు లోపించిన మాత్రము సహించి యూరకుండ లేమని వారు చెప్పుదురు

'మాత్రాలాభో పుత్రలాభః' అన్నట్లు నన్నయభట్టారకుని ప్రతియొక్కపదమును బంగారమువలెఁ జూచుకొందురు.

ఇపుడిపుడు పలువురు భారతపఠములలో "అయ్యెడమని" "నీవు విదపడిగుదు" "కానతగ్గ" మొదలగునవి మాపుస్తకములో నిట్లున్నవి, మాపుస్తకములో నిట్లున్న వని తెల్పుచున్నారు. అట్లే యేమహాత్ములప్రతిలోనైన నీలోపములు సవరింపఁబడినవేమో తెలిసికొందమని యుబలాటపడుచున్నారు. విజ్ఞులీవిషయమును జర్చించి తెల్పఁబ్రార్థించుచున్నారు.

నన్నయభట్టారకుని వాక్యములు కాలగర్భములో నడఁగి పోయినవేమో యనుభయముచేతనే గాని మూలభారతసందర్భాసందర్భములను దెగడుటకుఁ గాని పండితులను బరీక్షించుటకుఁ గాని యీసందేహములను దీర్పఁ డని కోరుట లేదని భాషాభిమాను లూహింతురుగాక.

---

# వ్యావహారికాంధ్రులయసంగత ప్రసంగములు.

(గ్రాంథికాంధ్రము మృత మైనదా?)

---

విమర్శకాగ్రేసరాది బిరుదాంకితు లగు

— బ్రహ్మశ్రీ కాశీభట్ట బ్రహ్మయ్యశాస్త్రిగారు, కాకినాడ —

---

శ్రీమంతం బగు భరతఖండంబున సంస్కృతం బాద్యం బై, యనంతం బై, యఖండం బై, యద్భుతం బై వెలుంగుచుండఁ దత్సాన్నిధ్య భాష యడఁగాఁ గలిగి యాంధ్రభాష యభివృద్ధినొంది శోభించుచున్న యది. అది బహువిశేషములు గలిగి విరాజిల్లుచున్నది ఇప్పుడు వ్యావహారికాంధ్రుల మని పేరుఁ గొనిన యొకనూతనసంఘమువారు బయలువెడలి గ్రాంథికాంధ్రమునుగూర్చి విచిత్రప్రసంగములు గావించుచున్నారు. సత్యము తేలఁ గలందులకై దానిని గూర్చి ముచ్చటించుకొందము.

"వినఁదగు నెవ్వరు చెప్పిన
విని నంతనె వేగపడక వివరింపఁదగున్
కని కల్ల నిజము దెలిసిన
మనుజుఁడె పో నీతిపరుఁడు మహిలో సుమతీ"

అని ప్రాజ్ఞులు చెప్పుదురు.

ఆంధ్రము గ్రాంథికాంధ్ర మనియు, వ్యావహారికాంధ్ర మనియు, రెండువిధము లనియు, వానిలో గ్రాంథికాంధ్రము మృత మైపోయినదని వ్రాయుటకును, సమన్వయించుటకును వ్యావహారికాంధ్రులలో ప్రథమగణ్యు లగు రావుసాహెబు గిడుగు రామమూర్తిపంతులుగారు సాహసించుచున్నారు. కాని యెప్పుడు మృత మైనదో యెచ్చటను జెప్ప లేదు. అసలీగ్రాంథికాంధ్ర మెప్పుడు జనన మొందినదో తెలుపలేదు. కాన ముందుగా సాధ్యమైనంతవఱకు దానిఁ గనుఁగొందము.

గ్రాంథికాంధ్రముయొక్క పుట్టుకను గూర్చి "దేశభాషలందుఁ దెలుఁగు లెస్స" యని నుడివియున్న కృష్ణదేవరాయలవారికి సమీపకాలమందున్న రామరాజభూషణునిచేఁ దనవసుచరిత్ర యందిట్లు తెల్పఁబడియున్నది.

మ. మహిమున్ వాగనుశాసనుండు సృజియింపం గుండలీంద్రుండు త
న్మహనీయస్థితిమూలమై నిలువ శ్రీనాథుండు ప్రోవన్ మహా
మహులై సోముఁడు భాస్కరుండు వెలయింపన్ సొంపు వాటించు నీ
బహుళాంధ్రోక్తిమయప్రపంచమునఁ దత్ప్రాగల్భ్య మూహించెదన్.

దీనిని బట్టి నన్నయభట్టారకునినాఁ డిది సంభవమైనట్లుగాఁ దేలుచున్నది. మఱియు మిక్కిలి పురాతనకవియే యగు నన్నిచోళమహారాజుకూడ దీనిసంభవమును గూర్చి కుమారసంభవములో నిట్లు వ్రాసెను.

"మును మార్గకవిత లోకం
బున వెలయఁగ దేశికవితఁ బుట్టించి తెలుం
గును నిల్పి రాంధ్రవిషయం
బునఁ జనఁ జాళుక్యరాజు మున్నగుపలువుర్."

దీనిని బట్టి చూచిన రాజరాజనరేంద్రునికాలమున—అనఁగా నన్నయభట్టుకాలముననే గ్రంథరచన ప్రారంభమైన దని తేలుచున్నది. ఇట్లాంధ్రము జన్మించినకాలము మనకు బోధపడుచున్నది. ఇఁక నెప్పుడు మృతిపొందినదో తెలియదు. రామమూర్తిపంతులుగారును నది తెల్పలేదు. మనసారస్వతముం గన నది మృతినొందినట్లు కాన్పింపదు. నన్నయనాఁడు బయలువెడలి యది బహువిధశాఖల విరాజిల్లుచుఁ గ్రమక్రమముగాఁ బెరుఁగుచున్నది. నాఁటినుండియు బహుపురాణములు, నితిహాసములుఁ, బ్రబంధములు, వచనములుఁ, గావ్యములు, వచనకావ్యములు, ద్విపదకావ్యములు, యక్షగానంబులు, దండకములుఁ, గళికోత్కళికలు, శతకములు, నష్టకములు, నీమున్నగునవి బహువిపులముగా బయలువెడలుచున్నవి. శ్రీ రామమూర్తిపంతులుగారు తాము బయలుదేఱినతరువాత గ్రాంథికభాష మృతిపొంది తీరవలయు నని దృఢసంకల్పము చేసికొని నిద్ర పోయి

యానిద్రలో వచ్చినకలలో గ్రాంథికాంధ్రము మృతిఁబొంది పోయినట్లు పెద్దస్వప్నముఁ గాంచి రేమో! అట్లు చెప్పుటకును వల్లకాదు. ఏమన వీరితరువాతఁ గూడఁ గళాప్రపూర్ణేత్యాది బిరుదాంకితు లగు బ్రహ్మశ్రీ శ్రీపాద కృష్ణమూర్తిశాస్త్రిగారి శ్రీకృష్ణభారతము, వావిలికొలను సుబ్బారావుగారియొక్కయు బ్ర శ్రీ. జనమంచి శేషాద్రిశర్మగారియొక్కయు శ్రీమద్రామాయణములు, నింకనువందలకొలఁది నూతనగ్రంథములును, అనంతపంతుల రామలింగస్వామిగారి శుకపక్షము, శ్రీ జయంతి రామయ్యపంతులుగారి ఉత్తరరామచరిత్రము, మాసోదరుఁడగు సాహిత్యవిశారదసుబ్బయ్యశాస్త్రియొక్క సాహిత్యకళ మఱియు నిట్టిగ్రంథరాజము లనేకములును బయలుదేఱుట మనరామమూర్తిపంతులుగారిమనస్సునకు వెగటుగానున్నను గ్రాంథికాంధ్రము మృతిపొందిన దని వ్రాయుట లోకమును మోసపుచ్చుటకై వ్రాసినమోసపువ్రాఁత యని స్పష్టమగుచున్నది.

శ్రీ శ్రీ శ్రీ జయపుర మహారాజావారును శ్రీ శ్రీ శ్రీ పీఠికాపుర మహారాజావారును మఱియు శ్రీమంతు లగుపలువురు సంస్థానాధిపతులును బండితప్రకాండులును దీని నభివృద్ధిఁగావింప విశేషప్రయత్నములు దేశమునం దంతటను గావించుచుండ దీనికిఁ జ్యుతి కలుగు టెట్లు? వెఱ్ఱిసంకల్పములు తమమనస్సులోఁ దాము పెట్టుకొని తమలోఁ దాము సంతసించుచున్నారు మనరావు సాహేబు గిడుగు రామమూర్తిపంతులుగారు.

అరవము, తెలుఁగు, కన్నడము, మళయాళము మున్నగునవి సోదరదేశభాషలై యుండఁగా నందులో నొక్కతెలుఁగునకుమాత్ర మీ శాపము కలుగనేల ?

ఇది యంతయు మన శ్రీ రామమూర్తిపంతులుగారియొక్కయు వారిశిష్యులయొక్కయు గారడి కాని వేఱు కాదు. ఇందుల కేవిధమున జంకఁ బనిలేదు. రామమూర్తిపంతులుగారిశిష్యులు కొందఱు గ్రాంథికాంధ్రము మృత మాయె ననుసంగతి కల్ల గాని నిజము కా దని చాటుచున్నారు.

సత్యమేవ జయతి—నానృతమ్

# ఆంధ్రవాఙ్మయమునకు వ్యక్తిత్వము లేదా?

(2)

— రామడుగుల వేంకటసుబ్బారావుగారు, విజయనగరము. —

పదమధ్యయతులు నన్నయభాగమున లేవనిరి. చూడుండు:—

"సాత్యవతేయవిష్ణుపదసంభవమై విబుధేశ్వరాబ్ధిసం
గత్యుపశోభితంబయి జగద్విదితం బగుభారతీయభా
రత్యమరాపగౌఘము నిరంతరసంతతపుణ్యసావను
స్నత్యభివృద్ధిసేయు వినినం గొనియాడిన నెల్లవారికిన్."

ఇట్లు పదమధ్యయతులు నన్నయభాగమునందుఁ బెక్కు లగపడుచుండ లేవని పల్కుట యనాలోచిత మని చెప్పవలసియున్నది. సంస్కృతమునఁ బదమధ్యయతి వేసినచో నది యొకదోషముగాఁ బరిగణింతురు, కాని, తెలుఁగున నది శోభాదాయక మందురు.

ఆంధ్రభాషకు భాషాశాస్త్రసంప్రదాయము నెఱుంగక, వ్యక్తిత్వనిమగ్న చేయఁబూనుట నాఁగలి లేక వ్యవసాయము చేయుటవంటిదే. వారియుపన్యాసములో గ్రుక్క త్రిప్పుకొనకుండఁ గావ్యము లేమి, నాటకములు, అలంకారములు, ఛందస్సులు, గిందస్సులు, సమాసములు, పదములు, తుదకు "ఫుల్‌స్టాపులు" గూడ వచ్చి చేరిన వనుమన్నారు. పదములు చేరిన సమాసములు చేరిన వనుటేల! వాఙ్మయములో ననేకగ్రంథములు తెనిఁగింపఁబడినప్పు డిన్ని యనుకొన నవసరము లేదు. సమస్తము సందుండియే వచ్చినచోఁ, జిగురుఁగేలు, జుంటిమోవి, యనువానిమా టేమందురు? "సంస్కృతలక్షణంబు దొడరని సమాసంబులుం గల" వను సూరిగారి పంక్తులు శ్రీవారు చూడలేదనుకొల్లు? ఆసంప్రదాయము లన్నియు వచ్చినఁ దెలుఁగులోఁ బ్రత్యయరహితముగా విశేషణవిశేష్యభావము చూపింపఁగలరా? "రామాయ రామభద్రాయ" అనునట్లు తెలుఁగులోఁ రామునికొఱకు రామభద్రునికొఱకు నమస్కార మనుట

విరసముగా నుండును. ఇట్లే యనేకములు భాషాశాస్త్రజ్ఞులకుఁ దెల్ల
మగుచుండును.

నన్నయకాలమునాఁటికి శుద్ధదేశీయపదములు 4 వేలకుఁ బైగా
నున్నట్లు కవిత్వవేదిగారు వ్రాసియున్నారు. కనుక నావదములతో దేశీయ
భాషలోఁ గావ్యము సులువుగా రచింపవచ్చును. కాని నన్నయామ
దేశీయభాషలోఁ గావ్యములను రచింపక తత్సమపదములతో రచించు
టకుఁ గారణ మేమను సంశయము పొడమువచ్చును. ఆకాలమున సం
స్కృతభాష చాల విరివిగాఁ బ్రచారములో నున్నది. పండితాదరణలో
నున్నది. కాన, పండితాదరణమును, మెప్పును బొందవలె ననుబుద్ధి
ముతోను, దనసంస్కృతభాషాపాండిత్యప్రకటనార్థమును, నన్నయ తత్స
మపదముల నెక్కుడుగా భారతభాగములోవాడియున్నాఁడు, కాని, యాం
ధ్రభాషలో దేశీయపదములు తగినన్ని దొరకకను దేశీయభాషలోఁ దాను
గావ్యరచన చేయుట కసమర్థుఁడు నై తత్సమపదములను వాడి యుండ
లేదు. కావున నన్నయకాలమున కుండు నాంధ్రభాషలోని యన్యదే
శ్యపదములు తీసివేసినను, దేశికావ్యము రచించుటకుఁ దగినంత దేశీయ
పదసామగ్రి యాకాలమున లేకపోలేదు.

బ్రహ్మశ్రీ ఆకొండి వేంకటశాస్త్రిగారు సమస్తము సంస్కృతము
నుండి తెలుఁగులోనికి వచ్చినట్లు వ్రాసి రని నుడివిరి. వారివ్యాసమును
దలి కొన్నివాక్యముల నీక్రింద నుదాహరించుచున్నాను. వానినిబట్టి, శ్రీ
వేంకటశాస్త్రిగారే య ట్లన్నారో, లేక ప్రతివాదకులే యట్లు దురభిప్రా
యపడినారో ప్రాజ్ఞు లూహింతురుగాక. "ద్రావిడభాషలలో నసంఖ్యము
లగుసంస్కృతప్రాకృత సమపదములును దద్భవపదములు నగుపడుచుం
డుటచేతను ఆంధ్రవ్యాకరణపురీతులు, సంస్కృతప్రాకృతవ్యాకరణమార్గ
ములే యయి యుండుటచేతను ఆంధ్రభాష సంస్కృతప్రాకృతముల సం
తానము మను నసంగతాభిప్రాయము స్ఫురించుట కవకాశ మొదవె నని తో
చుచున్నది. ప్రాచీను లగునాంధ్రవైయాకరణు లెవరును, నాంధ్రభాష

సాకల్యముగా, సంస్కృతప్రాకృతములనుండి పుట్టిన దని చెప్పియుండలేదు. ఆంధ్రభాషలోని తత్సమ తద్భవ పదములు సంస్కృతప్రాకృతజన్యము లని మాత్రము చెప్పియున్నారు ''

"వ్యాసభారతమున—దుష్యంతోపాఖ్యానము తరువాత యయాతి చరిత్రమున్నది. ఆంధ్రభారతమున నట్లు గాక, యయాతిచరిత్రము ముందు, దుష్యంతోపాఖ్యానము తరువాత, బ్రాహ్మణాసురఃకన్యాజాతసంతతిప్రకాశనపూర్వకము గగౌరవవంశీయుల యాభిజాత్యమును విశదీకరించుటకై నిర్వచింపఁబడినవి. పరీక్షిన్మరణోత్తరమున, జనమేజయరాజ్యాభిషేకసందర్భమున "తతోనృపే తత్ర ణతేబహూ హతే'' నృపం శిశుం తస్యసుతం ప్రచక్రిరే'' "స బాల ఏ వార్యమతి ర్నృపోత్తమః" అనుమూఁడుశ్లోకములును సౌతి చెప్పినట్లుండ మరల 49వ అధ్యాయములో జనమేజయుఁ డడుగఁగా మంత్రులు పరీక్షిచ్చరితము దెల్పినట్లు సంస్కృతభారతములో నున్నది. ఈ రెంటిని గలిపి చెప్పిన కథనే మరలఁ జెప్పనవసరము లేకుండ మంత్రు లొక్కరే చెప్పిన ట్లాంధ్రభారతమున నున్నది. మూలమున, కీచకుఁ డర్ధరాత్రమునఁ జంపఁబడఁగా నుపకీచకులు మొదలగువా రందఱు దెల్లవాఱిన పిదప వచ్చిచూచి యాతనికి దహనసంస్కారము చేయఁ దలంచి, ద్రౌపదిని గూడ, వానితోఁ దుద ముట్టింప నిశ్చయించుకొని పోయి రనియు, నాప్రాతఃకాలసమయముననె, భీముఁ డుపకీచకులను వధ గావించె ననియు, నుండఁగా, నియ్యది సంగతముగా నుండుటచే, నుపకీచకుల వధయుఁ దెల్లవాఱుటకుఁ బూర్వమే చీకటిలోనే గావించిన ట్లాంధ్రభారతమున మార్పు గావింపఁబడి మూలమునకు వన్నె పెట్టుచున్న ట్లున్నది. కీచకుఁడు ద్రౌపది సౌందర్యమును జూచి యాశ్చర్యపడుచుఁ దద్వర్ణనావసరమున నతిశయోక్తులతోఁ గూడిన భావముల నుత్ప్రేక్షోపమాద్యలంకారములతోఁ గూర్చి, సమాంతరము లగువాక్యరచన గలపద్యములతోను మూలమున లేని యాంతరంగికశృంగారభావాతిశయములతోను మూలమును మించిన ట్లున్న దాంధ్రభారతము.

ఒకచో నీభాషాంతరీకర్తలు, మూలములోని కథాంశములను వెనుకనున్న దానిని ముందు, ముందున్న దానిని వెనుకగా గ్రహించి కథావస్తువునం దైక్యగుణము సంపాదించుచును మూలమునందలి నీరసస్థలముల నతిరమ్యములుగాఁ బ్రదర్శించుచు నమును నతికిన భావగర్భితము లగు పదములచేతను నాకారవర్ణనలచేత నొకదృశ్యమును మనకన్నులయెదుటనడచుచున్న దానినిగాఁ జేయుచును, ఆయాకథాపురుషుల మనోవృత్తులను, భావవైఖరులను వర్ణించుచుఁ బాత్రౌచిత్యమును బాటించి యాకారేంగితాదులను సూచించుచు మూలమునందలి పాత్రలను నూతనజీవముతోఁ బ్రకాశించునట్లు ప్రదర్శించుచును, సందర్భానుసారముగా నూతనము లగుప్రకృతివర్ణనలను జేర్చుచును, మూలమునకు మెఱుఁగు పెట్టుదురు. ఇట్టి సూక్ష్మవిశేషములను, బ్రత్యేకవ్యక్తిత్వమును దెలిసికొనుటకు మూలముతో సరిపోల్చి చూడవలసియుండుటచేతను, గ్రంథవిస్తరభీతిచేతను బైని నాలుగుదాహరణములు మాత్రమే చూపితిని. ఆంధ్రవాఙ్మయమునకు వ్యక్తిత్వమున్న దనుటకాంధ్రమునుండి సంస్కృతములోనికిఁ బరివర్తితము లైనగ్రంథములును, నచ్చతెనుఁగు గ్రంథములును బ్రబలసాక్ష్యములే గదా! రఘునాథనాయకుఁడు రచించిన రామాయణమును మధురవాణి సంస్కృతములోనికిఁ బరివర్తించెను. వసుచరిత్రముకూడ సంస్కృతములోనికిఁ బరివర్తింపఁబడినది. కూచిమంచి తిమ్మనార్యుని యచ్చతెనుఁగుగ్రంథములుకూడ నిందులకు సాక్ష్యములే.

ఆంధ్రభాషాస్వరూపము పూర్తిగఁ దెలిసి యవగాహన చేసికొనియున్నవా రెవ్వరు నాంధ్రవాఙ్మయమునకు వ్యక్తిత్వము లేదని సకారణముగ నిరూపింపఁజాలరు. పక్షపాతదృష్టితోఁ గాక సమదృష్టితోఁ బరిశీలించినచో, నేను బైని నిరూపించినవానివలన, నాంధ్రవాఙ్మయమునకు సంపూర్ణమైన వ్యక్తిత్వము కల దని తెలియు నని నాయభిప్రాయము.

---

శ్రీరస్తు.

# సుమతిశతకపద్యములు.

---

క. క్షితిఁ గానికూఁతుఁ గుడువకు
సతి నమ్మి రహస్యవిధులు సలుపకు మెచ్చుకుం
బతిలేని యింట నుండకు
మతిమంతుల కిదియె నీతిమార్గము సుమతీ. ౧

క. భగవాఁడు తనకుఁ జిక్కినఁ
బగఁ జావక మేలుచేసి పంపుట ధరలోఁ
బగవాని కదియె చంపుట
తగువ నికిదియె నీతి తథ్యము సుమతీ. ౨

క. కుటిలునితో నొనఁ గూడకు
పటువగు సభలోన వెడలఁ బల్కకు మది దు
ర్ఘటమగు కార్యము చేయకు
నిటలాక్షుని మీఁదిభక్తి నిలుపుము సుమతీ. 3

క. వినయము కంఠాభరణము
ఘనమగుదానంబు నధికకరభూషణముల్
విను కర్ణాభరణంబుగ
వినవలె శివకథల నెపుడు వేడుక సుమతీ. ౪

క. కాదన్నవాఁడె కరణము
వాదణఁచినవాఁడె రెడ్డి వసుధేశుఁడుర్
లేదన్నవాఁడె చనవరి
గథలు పెక్కాడువాఁడె కావ్యుఁడు సుమతీ. ౫

క. ఇంపెఱుఁగని సతిఁ గోరుట
కంపలరనిపూవు ముడువఁ గైకొను టెల్లం
బెంపెఱుఁగని నృపుఁ గొల్చుట
సంపెంగకుఁ దుమ్మెదేఁగి చచ్చుట సుమతీ. ౬

క. నెనరుగలవాఁడె చుట్టము
తనమనసుకు వచ్చువాఁడె దాత ధరిత్రిన్
కనుమఱుఁగుకలదె యాఁడుది
తనవాఁడొరులనెడుమాట తథ్యము సుమతీ. ౭

క. స్థితిలేక బల్మిచెల్లకు
స్థితిగల్గిన బల్మి లేక స్థితిచెల్లదు నా
స్థితియును బల్మియుఁ గల్గిన
నతనిది త్రైలోక్యపదవి యందురు సుమతీ. ౮

క. రిపుపొత్తుఁ బాముపొత్తును
గపటుండగు మిత్రుపొత్తు గడుసరిపొత్తున్
విపరీతభార్యపొత్తును
నెపమున విడనాడకున్న నేరము సుమతీ. ౯

క. మాతంగము మదమెక్కిన
భూతలపతి జారుఁడైన భువి విద్వాంసుల్
పాతకులైనను సాగర
భూతంబులు చేసట్లు భువిలో సుమతీ. ౧౦

క. కనరానిది చల మైనను
వినరానిది గురులనింద వినుకలిమైనన్
అనరానిది తలిదండ్రుల
మనరా దవివేకితోడ మతమిది సుమతీ. ౧౧

క. తెరువున నేనుఁగుఁ బోడఁగని
మొరయించుక వెట్టిగంతు మొఱఁగినభంగిన్
దొర నల్పుఁ డెఱుఁగ కాడిన
సరిసేయఁగవలదు వానిసహజము సుమతీ. ౧౨

క. తమకించిన నెపమెంచును
దమకించినఁ దల్లిమైనఁ దనుఁజెడఁ జూచున్
దమకింపఁ గార్యహానియుఁ
దమకించినఁ బ్రాణహాని తప్పదు సుమతీ. ౧౩

క. ఎన్నఁడుఁ గుడువక కట్టక
తన్నేమఱి కూర్చుధనము ధరలో నెపుడున్
అన్నలకు రాజులకు మఱి
కన్నములకుఁ బోవుచుండుఁ గదరా సుమతీ. ౧౪

క. చకలత లాభముఁ జెఱచును
నెకమునఁ బగవారిఁ గూడి నేరము లెంచున్
అకలాపించును నమ్మిక
కకటాత్ములతోడిపొందు కాదుర సుమతీ. ౧౫

క. హరినైన జిష్ణునైనను
సురపతిసుతునైనఁ జంద్రసూర్యులనైనన్
సురకాని వ్యయము సేయుక
తరుణులు డాయంగనీరు తథ్యము సుమతీ. ౧౬

క. భూమీశుచిత్త మెఱుఁగక
ప్రేమముతో మనవిచెప్పఁ బెనఁగుటలెల్లం
బాముకు వాకట్టెఱుఁగక
సామునఁ జెఱుచాఁచునట్టిచందము సుమతీ. ౧౭

క. నగజాతకు హరుమేనను
సగపాలిప్పించె మరుఁడు చచ్చెఁ బిదపం
బగసాధించనిమనుజుఁడు
మగవాఁడా! మగువగాక మహిలో సుమతీ. ౧౮

క. ఎడ్డెఁడు సతివలపెఱుఁగఁడు
జడ్డిలఁబడితిరుగువాఁడు జాణండగునా
యడ్డమునిడుపును దిరిగెడు
త్రెడ్డెఱుఁగునె పాల తీపిఁ దెల్లము సుమతీ. ౧౯

క. అరమాడ జీతమైనను
ధరణీశుఁడు తగవరైన దగ్గఱవచ్చున్
సురరాజ్య మిచ్చెనేనియుఁ
దరమెఱుఁగనిరాజుఁ గొల్వఁ దగదుర సుమతీ. ౨౦

క. బలువిద్య లెన్ని గలిగినఁ
గులవిద్యయె వన్నెఁ దెచ్చుఁ గొంకక ధరలో
విలువిద్య పరశురాముని
కులవిద్యయె? యెన్నిచూచికొనఁగా సుమతీ. ౨౧

క. దీపము వెలిగినఁ జీకటి
యేపునఁ గానంగవచ్చి హెచ్చినపగిదిన్
శ్రీపొలఁతి వాసినప్పుడె
యాపద లానరునిమేన నలముర సుమతీ. ౨౨

క. పులినాకి విడుచు దైవము
గలకాలము; దైవరహితకాలం బైనం
గలుషించి గొఱ్ఱెగఱచును
దలపోయఁగ దైవవశము తప్పదు సుమతీ. ౨౩

క. తప్పునకుఁ దగినదండన
మప్పుడె సేయంగవలయు నవనీశునకున్
నిప్పునను జీరఁజుట్టిన
యప్పగిదినిఁ జేయవలయు నాతని సుమతీ. ౨౪

క. కలిమియె కాలమున నధికము
కలిమియె బలవర్ధనంబు కలిమియె మిగులుం
గలిమియె యుక్తికి మూలము
కలిమియె సుఖకరము తలఁపఁగా నిల సుమతీ. ౨౫

క. సత్య మఖిలజనపూజ్యము
సత్యమె సురలోకసౌఖ్యసోపానం బౌ
సత్యమె నిశ్చల ధర్మము
సత్యమె భవహరము జయము సత్యమె సుమతీ. ౨౬

క. బలవంతుఁడె గుణవంతుఁడు
బలవంతున కాజ్ఞ చెల్లు బలవంతునకే
కలిమి గలవారె బంటురు
బలవంతుం డఖిలమునకు బలమగు సుమతీ. ౨౭

క. ఆయంబు వ్యయము మించిన
శ్రీయుతు సమమైన దళముచెడకుండు వ్యయం
బాయంబు మించెనేనియుఁ
బాయదు పేదఱిక మెన్నిభంగుల సుమతీ. ౨౮

క. గుప్తముసేయుము తంత్రము
సప్తోపాయములనైన శత్రుల గెలుమీ
సప్తవ్యసనము లుడిగియు
నాప్తుల రక్షింపు చాలు నంతియె సుమతీ. ౨౯

క. రాఁగలభాగ్యము వచ్చినఁ
దాఁ గుడువక దాన మిడక దాఁపఁగ నేలా
పోఁగాలంబులు వచ్చిన
మాఁగిన పండ్లూడినట్లు మహిలో సుమతీ. 3౦

క. గాడిద మదకరి యగునే
బూడిద కర్పూరరజము పోలిక యగునే
మోడు విమానం బగునే
మూఢుఁడు గుణియగునె తలఁప మున్నుగ సుమతీ. 3౧

క. ఇచ్చినదినములదాఁక నె
లచ్చికి నెడఁబాయరాదు లజ్జయునలెనే
యిచ్చినదినములు తేరిన
నిచ్చఁ దనుంబాసి లచ్చియేఁగుర సుమతీ. 3౨

క. తనయుఁడు తండ్రికి బాలుఁడు
ఘనుఁ డాతఁడు తండ్రి లావుగలనాఁ డెల్లన్
జనకునిలా వుడిగిన మఱి
తనయునికిని దండ్రి శిశువు ధరలో సుమతీ. 33

క. రానిది కోరిన వచ్చునె
రానున్నది కోరకున్న రాకేలుండున్
దానెంత తమకపడినను
గానున్నది గాకపోదు గదరా సుమతీ. 3౪

క. అంజనసూనుఁడు దెచ్చిన
సంజీవికి సాటివచ్చు సకలార్థులకున్
రంజిల్ల నపుడువార్చిన
గంజిసుమీ ప్రాణరక్ష గదరా సుమతీ. ౩౫

క. దారిద్ర్యముకంటె మహా
దారుణ మగు పాతకములు తలఁప గలవే
చేరుదురు మృతిని నలువురుఁ
జేరనొకొ దరిద్రు నొకఁడు సిద్ధము సుమతీ. ౩౬

క. అలుకునెడ రొంపిఁ జల్లుట
కొలు చొల్లమిగాదు మిగులఁ గూర్చుటకొఱకే
వలయునెడ నర్థమిచ్చుట
వెలయఁగ నభివృద్ధికొఱకె వినురా సుమతీ ౩౭

క. ఏడెన్నెలుఁగఁగవలయును
నేడెన్నఁడు విడువవలవ దేడున్ వినుమీ
యేడున్ మనమున నిలుపుమ
యేడెన్నఁడు విశ్వసింప కెన్నఁగ సుమతీ. ౩౮

క. అనఘా విను ముద్యోగికి
ధనమొండెను గీర్తి యొండె ధన్యత యొండెం
బొనరంగ నిరుద్యోగికి
ధనకీర్తులు రెండు లేవు తథ్యము సుమతీ. ౩౯

క. మదిఁ బొడమిన దుఃఖమునకుఁ
జను వొండెనుఁ బ్రాయ మొండె సజ్జనగోష్ఠిం
బొదలుచు నొకపద మొండెను
బద నెఱిఁగిన చెల్మియొండెఁ బ్రాణము సుమతీ. ౪౦

క. ఆసించినవ్వాడిచ్చిన
పీసము పదివేలుపోలు వెయివేలై నన్
పీసముగఁ జూజు మనుజుం
డాసల నడిమాఁడ నీయ నర్థికి సుమతీ. ౪౧

క. ఒఱిగొడ్డ పూరనుండకు
మఱుగలచుట్టంబు కలిమి కాసింపకు మిం
చెఱుఁగని హీనునిఁ గొల్వకు
మఱవక దుర్జనుల గోష్ఠి మానుమి సుమతీ. ౪౨

క. భువి నీవి కొంచె మైనను
కువలయపతి సుగుణియైనఁ గొల్వఁగవచ్చున్
యువరాజ్యపట్టమిచ్చిన
నవివేకిని గొల్చుటెల్ల నధమము సుమతీ. ౪౩

క. త్రాసును ధరలోఁ బడిచెను
వీసనబడి యొక్కరూపు వివరింపంగా
వీసంబైనను దిరముగ
నోసరముగ నొక్కవంక నొదుఁగుర సుమతీ. ౪౪

క. వలవని వల్లును మదిలోఁ
గలయని సతిపొందు రాజుగానని కొలువుం
బిలువని పేరంటంబును
దలఁపని చెలిమియును నొచఁ దగదుర సుమతీ. ౪౫

క. ఘన మెఱుఁగనట్టి కోడలు
వినయము లేనట్టి సుతుఁడు వెఱవని యనుజుల్
అనుకూల గానిభార్యయు
మనుజునకును మంకు లేనిమరణము సుమతీ. ౪౬

క. తఱిమినఁ బాఱనిగుఱ్ఱముఁ
దరమెఱుఁగని రాజుకొలువు తరుణులయెడలం
దఱితీపు సేయు మోహము
గరగరగా విడువవలయుఁ గదరా సుమతీ. ౪౭

క. సుంకరికి బొంకు వలయును
అంకనకును దిరుగవలయు నవనీస్థలిలో
శంకుడిగి మిగుల ముదిసిన
వంకాయకుఁ జింతపండు వలెరా సుమతీ. ౪౮

క. సిరి తనకు వలచి వచ్చిన
సిరికిం దగు చిహ్నలెల్లఁ జేయఁగవలదా
సిరిగూర్చి ప్రాఁకఁ దలఁచిన
సిరికడపటఁ జేరు నదియు సిద్ధము సుమతీ. ౯౯

క. మొగసాల నొఁటి నుండకు
వగచాటి జయించు దాఁకఁ బదరకు మదిలోఁ
వెగఁబాఱువాని నమ్మకు
వగగొనునాచోట నిల్వ వలదుర సుమతీ. ౧౦౦

---

ఇవి, అంద్రంగి గ్రామనివాసులు బొడ్డపాటి లక్ష్మీపతిగారిచే క్రీ. శ. ౧౮౬౩ సంవత్సరమున వ్రాసికొనఁబడిన తాళపత్ర సుమతిశతకపద్యములనుండి శ్రీ దువ్వూరి బాపన్నగారెత్తి వ్రాసి పంపినవి.

కొన్ని పద్యములింకను గలవుగాని మృదువుతప్పియున్నవి. ప్రకటించిన వానిలోను గొన్నిసందేహములుగా నున్నవి.

అచ్చుపడిన పుస్తకములలో నివి కనఁబడవు.

---

# వ్యాకరణశాస్త్ర ప్రశంస.

— ఉ. భా. ప్ర. మల్లాది సత్యనారాయణశాస్త్రిగారు, నూజివీడు —

---

వ్యాకరణశాస్త్ర మనఁగా నాయాపదముల కాయాయర్థము లెట్లు సరిపడినవో, యాయాపదములలో నాశాస్త్రజ్ఞులు పారిభాషికములుగ నేయేయవయవము లున్న వని యంగీకరించిరో యందుఁ బ్రకృతిప్రత్యయము లని వేఁకిఁ బేరులో వానిలో నొక్కొక్కదాని కెంతెంత యర్థమో సమిష్టివలనఁ గలుగునర్థ మెట్టిదో మొదలగునంశములను విమర్శించి నిర్ణయము చేయు నియమన మని యాపేరుచే బట్టి నిర్ణయింప నగును. (వ్యాకరణ=విశేషముగా (శబ్దములలో) నవయవులయు, నవయవములయు విభజనమును జేయు, శాస్త్రము=శాసనములు-అని వ్యుత్పత్తి)- ఈశాసన మిష్ప డొకరు చేసినట్లు కానిపించుచున్నదే గాని విచారింప నది స్వతస్సిద్ధమే యని తేలఁగలదు.

లోకములోని పదార్థములు మనుష్యుఁడు తనయనుభవమునకుఁ దగిన ట్లుపయోగపఱచుట యరయుచున్నాము. కాని వాఁడాపదార్థములోని ప్రత్యంశమును దెలియఁజాలకున్నవాఁడు. పదార్థవిజ్ఞానశాస్త్రవేత్త మాత్ర మాపదార్థములో నెన్ని యంశము లున్నవో యాదేయంశ మెందుల కుపయోగపడునో మొదలగు నంశములను విమర్శించి యాకారణముచే నీవస్తువును జను లిట్టియుపయోగములో నుంచి రని నిర్ణయము చేయఁగలఁడు. సామాన్యమానవునకును శాస్త్రవేత్తకును గలభేద మిట్లే యనంతమై యున్నది. ఆశాస్త్రవేత్త కట్టివిజ్ఞానము మొదట లేకపోయినను విమర్శించుస్వభావముగలిగి విమర్శించుచుండుటచే నలవడుచున్నది. అట్టి యనుభూతవిషయవిమర్శకులు స్థూలదృష్టితోఁ జూచి కొంతజ్ఞానము సూక్ష్మదృష్టితోఁ జూచి కొంతజ్ఞానము నుపార్జించి విజ్ఞానవంతు లగుచున్నారు. ఇట్టి విజ్ఞాతలు చేయునుపదేశములవలనను స్వయముగా విమర్శించు స్వభావము గలవా రగుటవలనను గ్రొత్తవిమర్శకులు లోఁతునకు బు

ద్దిని జొరనిచ్చి యందలి క్రొత్తయంశములను వెల్లడిచేయుటను. ఇట్లు చే
యుటచేత విజ్ఞానము నొక గ్రంథరూపమును దాల్చి శాస్త్రమను పేర వెల
యుచున్నది.

ఆశాస్త్ర మభ్యసింపఁదలచినవాఁడు శాస్త్రజ్ఞుఁడు చెప్పానంశము
ను దెలిసికొనలేక మాటిమాటికి విసుగుఁగొనుట విద్యార్థులతోఁ బని
యము గల యాగురువులకు ననుభవగోచరమే. ఆవిధముగనే వ్యాకరణ
శాస్త్రముకూడ నభిప్రాయబోధకశబ్దప్రయోగములలోఁ బుట్టి యావిషయ
మెఱుఁగువాఁడు వచ్చుపర్యంత మణఁగియుండి యావిమర్శకునివలనఁ దల
యెత్తి క్రమముగా శాఖోపశాఖల విరాజిల్లు మహావృక్షమువలెఁ బ్రకృ
తిప్రత్యయాద్యనంతవిశేషములు గలదై చూచువారికి భయంకరము నా
శ్చర్యకరము నై యుండును. పదార్థవిజ్ఞానశాస్త్రమట్లు లీవ్యాకరణశాస్త్ర
మును సామాన్యమానవుల కగోచరమే.

కనుక భాషతోడనే పుట్టి భాషతోడనే పెరిఁగి భాషతోడఁగల
సిమెలసి యున్న వ్యాకరణము క్రొత్తవిషయము గాదు. కనుకనే వైయా
కరణు లఖండస్ఫోటవాదు లైరి.

ఆవ్యాకర్త యాశాస్త్రమును గనుఁగొననే కాని భాషకుఁ జేసిన
మహాహాని యేమియును లేదు. శాస్త్రకర్తకు శాస్త్రరచనయందలి యుద్దేశ్య
ము సాధకుఁడు సులభముగా నావిషయమును గ్రహించియుండవలెనని
యే గాని బాధపడవలెనని కాదు. అయిన నంతయధికవిషయమును సు
లభముగ గ్రహింపఁజేయవలెనను నుద్దేశ్యముతో నాశాస్త్ర మారంభిం
చెను గానఁ గష్టముగా నుండకమానదు.

అనఁగా మానసికపరిశ్రమముకంటె శారీరకపరిశ్రమము కష్టమని
తలఁచి మానసికపరిశ్రమముగఁ జెప్పఁబూనినయంశమును గొన్నిశబ్దముల
తోనే చెప్పఁదలంచినఁదునఁ గష్టమని యభిప్రాయము. అదునుప్రారం
భమునఁ జెప్ప నలవికాని యంతకష్టము. వే యేల "కష్టం శాస్త్ర మ్మ"ను
సూత్రమే కలదు. ఆకష్టమునకుఁ దాళినవానిబుద్ధి కావిషయ మంతయు
సులభమై పోవును.

కాన వాఁడు శబ్దస్వరూపనిర్ణయముఁ జక్కగాఁ జేయఁగలవాఁడగును. అదియేదానికి నుపయోగము. అంతగొప్పవిషయము నన్ని కొద్దిపదములతోఁ జెప్పఁబూననియెడల నాశాస్త్రము వ్యర్థప్రయోజన మనవచ్చును. భాషనంతను బరిపూర్ణముగా నేర్చి యాయాప్రయోగవిశేషములను జక్కగాఁ బ్రయోగింప నభ్యసించినవారికి నీశాస్త్రమువలనఁ గలుగులాభ మేమి? అవి సులభముగా సాధ్యము గా దనియే శాస్త్ర మనుదానివైపు చూపుచు బ్రసరింపఁజేయుట తటస్థించినది. ఇందుల కనియే పతంజలిముని బృహస్పతియొద్ద నింద్రుఁడు శబ్దములనే కొన్ని వేలేండ్లు నేర్చెనని యితిహాసము నుపన్యసించెను. కనుక శాస్త్రము మహాప్రయోజనవంతమని తేలినది. అట్టిశాస్త్రము జనులవ్యవహారమునుండియే బయలుదేఱును గాని పనిలేనివాఁడు కాలక్షేపమునకై నిర్మించి ప్రజలపై వేసినబ్రహ్మాస్త్రము గాదు. ఆశాస్త్రకర్తను గేవలప్రకాశకుఁ డనియే కాని యుత్పాదకుఁడని నుడువరాదు. ఆశాస్త్రవేత్తలును శాస్త్రములును లేనిచో నాభాష వ్యవహారైకశరణ్యా శబ్దసాధకమై యుండును, గాన, నప్పుడు ప్రయోక్తల యవయవలోపాదికమువలన వచ్చునుచ్చారణములు నానావిధములై యుండి క్రమముగా బలిసి బలిసి యొక యానుపూర్వి గలశబ్దము నైనను శీఘ్రముగా భిన్నానుపూర్విగల శబ్దమును గా మార్చుచుండును. అంతియే కాదు, పూర్వప్రయోగములు ముందుముందు కాలమునకు నప్పటివి తరువాతికాలమునకు నిలువక యెప్పటి కప్పుడు క్రొత్తవియై యుండును, గాన, నాభాష చిరకాలముక్రిందట నుత్పన్నమైనను వెదకికొనఁ దగినశబ్దములు గలదై పోవును. ఆభాష యేదైన గ్రంథరూపమున నున్నచో శాశ్వతముగా నిలుచును గాని కాలము గడచినకొలఁదిఁ దద్వేత్తలు దుర్లభులు గాన నందలిపదములు నర్థములును దెలియఁబడవు. కనుకనే ఋగ్వేదభాష కౌత్సాదులకుఁ దెలియకుండుట తటస్థించినది.

శాస్త్రవేత్త లున్నచో నాయాప్రయోగముల నన్నింటిని గొన్నిసూత్రములచేతనే గుదిగ్రుచ్చి యుండుట, వానికి విపులముగ వ్యాఖ్యానము వ్రాయుట వాని ననుసరించి కొన్నికావ్యాదిగ్రంథములఁ జేయుట మొద

లగునవి వారివని గావునఁ బూర్వప్రయోగములు ఖిలములు గాక తెలియఁబడునర్థములు గలవై యుండును. అదియే శాస్త్రమునకు వినియోగము. ఆకారణముచే భాష వృద్ధి యగును గాని క్షీణింపదు. కేవలవ్యవహారమునకు నివి యన్నియు నక్కఱలేదు. కావున నీప్రయోగవిశేషముల నెఱిఁగి ప్రయోగించినవారు గ్రాంథికులును, పెఱలు వ్యావహారికులు నగుదురు. ఇట్లు గ్రాంథికవ్యావహారికత్వరూపవ్యవహారభేదము ప్రాదుర్భవించి బలియుచుండును. క్రమముగా నాభేదము బలిసి యాగ్రాంథికవ్యావహారికభాషల నొకదానికొకటి చూపుమేరదూరమున నున్నట్లుచేయును. అయినను గ్రాంథికవ్యావహారికు లొక్కచోట నున్నందునను వ్యవహారము ప్రబలమైనదగుటచేతను గ్రాంథికులకుఁ గూడ నప్పుడప్పుడు వ్యవహారదుష్టపదములు భాషలో దొరలకపోవు, గ్రంథములలోఁ జొరకను బోవు. అదికారణముగా శాస్త్రము వ్యర్థప్రయోజన మనవచ్చునా?

ఏవ్యావహారికభాషకు నైన నేదో యొకకట్టుపాటు స్వతస్సిద్ధమై యుండనే యుండును. ఆకట్టుపాటు లేనిచో నాభాష యర్థమగుట యెట్లు? కొంతకాలమునకు దానికిఁగూడఁ బ్రకాశకుఁడు బయలుదేఱనే తేఱును. ఏగ్రాంథికభాషయైన మొదట వ్యావహారికభాషగానే యుండియుండును. ఇప్పటి వ్యావహారికభాషకువలెనే (త్రిలింగభాషకువలెనే) యప్పటివ్యావహారికభాషలకుఁ (వైదికలౌకికసంస్కృతభాషలకు) గూడ మొదట వ్యాకరణనియమములు వ్రాయఁబడి యుండనే యుండవు. కనుకనే కౌత్సుఁడనుఋషి వేదమున కర్థము లేదనియు దానివిమర్శనము శుష్కప్రయోజన మనియుచు నిందింప యాస్కఋషి నిరుక్తనిఘంటువును జేసి సమర్థించుకొనవలసిన యవసరము గలవాఁడాయెను. గీర్వాణభాషకుఁగూడ వ్యాకరణము వ్రాయనవసరము ప్రాకృతభాష వ్యావహారికభాషగా నున్ననప్పుడే గాని ముందుగాఁ గాదు. ఏకొందఱు వ్యవహారములో నైన నున్నంగాని భాష గ్రాంథికత్వ మందదు. అప్పుడు గాని దానికి నియమములు గనిపెట్టుట వ్రాయుట సంభవింపవు. లోకములో ననర్థము ప్రాప్తింపఁగాఁ దత్ప్రతీకారము నరయుటవలె గ్రాంథికభాషలో వ్యవహారబలము

చే మార్పులువచ్చుచుండఁ దత్ప్రతిక్రియ నరయుట యుండును గాని ముం దుగాఁ గాదు. ఇప్పటి వ్యావహారికభాషకు (తెనుఁగుభాషకు) వెనుకటి గ్రాంథికభాషతో (ఆంధ్రభాషతో) సంబంధము లేకుండ వ్యాకర ణనియమములను వ్రాసికొనవచ్చును గాని యట్లు శాస్త్రమును బెంచి చేయఁదగిన దేమో తెలియదు. శాస్త్రమున కుపయోగము సులభముగను నిర్దుష్టముగను భాషనలవడఁజేసికొనుటయే కాని యూరక ప్రయాసము నకుఁ గాదు. దీనివిషయమై పతంజలిమహాముని "రక్షోహాగమలఘ్వ సందేహాః ప్రయోజన" మ్మని నుడివియే యున్నారు. ఈప్రయోజనములు వేదమునకు సంబంధించినవియే కాని సందర్భమును బరిశీలించినచో నన్ని గ్రాంథికములకు నుపయోగించు నని తెలియఁగలదు. గ్రాంథికమైన వేద భాషకూడ నొకప్పుడు వ్యావహారికభాషయే యై తీరవలెఁ గాన దాని తరువాతి దగు సంస్కృతభాష వ్యావహారికభాషగా నుండినప్పుడు గ్రాంథికభాషాప్రయోగములను రక్షించుట మొదలగునంశములు సార్థ కమైనట్లు ప్రస్తుతవ్యావహారిక త్రిలింగభాషాకాలమునఁ గూడ గ్రాంథి కాంధ్రభాషారక్షణాదికము సార్థకము కాకపోదు. భాష యని పేరు వచ్చు టకు జనులవ్యవహారము కారణము గాన వైదికభాష కూడ నొకప్పుడు వ్యావహారికభాషయే యని నిర్ధరింపఁబడినది.

మఱియు నీవ్యావహారికభాష ప్రస్తుత వ్యవహారములో నున్నం దున నందలి ప్రయోగములు వానినియమములును మఱుఁగుపడుటకు వలనుపడవు. గ్రాంథికభాషాప్రయోగములును వానినియమములును గ్రం థైకదృష్టములు గనుక మఱుఁగుపడుట కవకాశము చాలఁ గలదు. కనుక గ్రాంథికభాషకు నియమప్రకాశన మెట్లవసరమో యట్లు వ్యావ హారికభాష కవసరము గాదు. లాభములేని పని కెవ్వఁడు ప్రయత్నింపఁ డు గదా!

మఱియు నే భాషకైన వ్యాకరణప్రయోజనము నేకొంచెమునై నఁ జూచి యుండి గదా వ్యాకరణశాస్త్ర మను వానిని గనుఁగొన య త్నించుట. ఎప్పటి కప్పు డుచ్చారణభేదముచే మార్పు చెందు నీవ్యావహా

రిక భాషకు నియమములను వ్రాయసమకట్టుట యీ భాషాభ్యాసకులకు నుపద్రవము చేయుటయే కాని సాయము చేయుట కాదు. ప్రయోగరక్షణాది ప్రయోజనములు వ్యావహారిక భాషకు నుండనే యుండవు. మఱవఁబడిన దానిని గదా శాస్త్రకర్త జ్ఞాపనము చేయుట. అది వ్యవహారమునం దున్న భాషవిషయమై యెప్పుడు నవసరము కాదు. కనుక వ్యావహారిక భాషకు వ్యాకరణనియమములను వ్రాయఁబూనుట వృథాప్రయాసకారణము. ఈహేతువుచేతఁ గవులు వేఱనియు శాస్త్రకర్తలు వేఱనియుఁ దలఁచి కవి తనయిష్టమువచ్చినట్లు గ్రాంథిక వ్యావహారిక భాషాపదములను గలిపి యుపయోగించుకొనవచ్చును. "ప్రయోగైకశరణా వైయాకరణా" యనునభియుక్తోక్తి గలదు గదా. కనుక నాతని ప్రయోగము లెట్లున్నను వానిది దోషము కాదు. వాని నన్నింటిని మేనమామయస్థులవలె మొత్తముచేసి దాఁచి యుంచుకొనవలసిన "పూచీ" శాస్త్రకర్తది కాని కవి కేమియు లేదు-అని చెప్పుచుఁ గావలసినచో వ్యావహారికభాషకుఁ గూడ వ్యాకరణము వ్రాసికొనుఁడని వ్యాకర్తలపై నాభారమును వేయుట యెంతటిహాస్యప్రసంగమో యెంతటి శుష్కవాదమో శిక్షితవిద్యు లూహించెదరుగాక! మఱియుఁ బైనిఁ జెప్పఁబడిన భారమును బండితులపైఁ వేయఁదలఁచిన వారియుద్దేశ్యము ప్రకారము పండితుఁడు కొఱవిచేఁ దలఁగోఁకికొనఁ దలఁచినవాఁడని యెంచఁదగును. అందఱవలె నతఁడు నేదో యొకకథలపుస్తకమును వ్రాసి యిహపరములయందు సుఖంపలేక శాస్త్రాభ్యాసమున కని కొన్నియేండ్లు భాషాభ్యాసమున కని కొన్నియేండ్లు శ్రమపడి చివరకుఁ బొందఁదగినఫల మేమియు లేక యిట్టి వారినిందల పాలగుట యేనామతేమయినఁ గలదా? అందు శాస్త్రము గనుఁగొనిన వానిది తప్పా? యభ్యసించినవానిది తప్పా? కనుక నీ వాదము గట్టిపెట్టి పెద్దవారిమతము ననుసరింతము.

మనుష్యసృష్టికిఁ బ్రారంభమున నొకప్రదేశమునందు నొకస్త్రీపురుషుల జతయైన నుండియుండును. ఆదంపతులు గాని వారిసంతతివారు గాని తమయభిప్రాయమును బరస్పరము బోధించుకొనుటకు నేదో యొక

శబ్దరూపసాధనమును (అఖండవాక్యమును) దప్పక యుపయోగించుకొని యుందురు. ఆసాధనములో నప్పుడు తెలియఁబడకపోయిన యవయవములను పేరఁ బరఁగు శబ్దము లనేకము లుండి యుండును. ఆశబ్దములకుఁ గూడఁ గర్తృకర్మక్రియాత్వాది ధర్మములు స్వరూపభేదము గలిగియుఁ బ్రయోక్తలచేఁ దెలియఁబడకయే యుండును. పరస్పరము వారు పలుకు పదములు సాధారణముగా నొకతీరుననే యుండును. అనఁగా నప్పుడు కూడ నభిప్రాయబోధకశబ్దరూపసాధనమున నొక యర్థముగల యేయానుపూర్వికి నేయేవిశేషార్థములు గలుగవలె నని యుద్దేశించి వక్త ప్రయోగించుచున్నాఁడో యాయానుపూర్వికే యాయావిశేషార్థములే గలుగవలె నని యాశ్రోత కూడ వక్తయైన మఱియొకప్పుడు ప్రయోగించుచున్నాఁ డని తాత్పర్యము.

ఆసాధనము దుష్టమగుటకు నాతనివాతివారి కేదికిని నో రాడదు గదా! దానినే తప్పనువారికి లోకమునఁ దప్పనరానిది యుండనే యుండదు. ఆసాధనముతో వ్యవహరించువారి కుటుంబము పెఱిగినకొలఁది నాయభిప్రాయబోధకశబ్దరూపసాధనముకూడఁ బెరిగియే యుండును. అనఁగా వస్తువిశేషవాచకములే గాక యాయాపదములలో వర్ణలోపములు గలిగి పర్యాయాదిపదములుగా మాఱి భాష పెరుఁగు నని యర్థము; ఆసాధనసామగ్రిని సాంగోపాంగముగ విమర్శించువాఁడు బయలుదేఱువఱకు నం దవయవావయవులభేదము దుర్గ్రాహ్యము. ఆ కాలమందుఁ గూడ నేకొంచెముగానో జీవనోపాధి భేదమును బట్టియు నుపదేశశ్రద్ధామలఁ బట్టియు శబ్దోచ్చారణసాధనావయవముల సౌష్ఠవమును బట్టియు నేకైకశబ్దోచ్చారణము విషయమైకూడ జనులలో నుత్తమమధ్యమాధమభేదము కలుగకమానదు. కలిగినభేదము క్రమముగా బలిసి యాశబ్దమునకు రూపాంతరము నాపాదింపకపోదు. అప్పు డది పర్యాయాదిపదములుగా నుండి వ్యవహరింపఁబడును. మఱియును, బొత్తిగ రూపము మాఱిపోయినచోను బూర్వప్రయోగములను దరువాతి సామాన్యమానవులు తెలిసికొనలేక పోయినచోను మొదటి

రూపమునకును రెండవరూపమునకును సాధారణనియమము కుదురక పోయినచోను నా రెండు రూపములకు రెండుభాష లని వ్యవహారము రాక మానదు. ఆవ్యవహారము మొదట గ్రాంథిక వ్యావహారికత్వములతో మొదలిడి పోనుఁబోను దృఢపడిపోవును. శిష్టవిద్యులు వ్యవహరించుపదజాలము గ్రాంథికముకాన నందు నేకట్టుపాటును వారు గ్రహింపఁగలిగిరో యదియే వ్యాకరణ మని చెప్పఁబడును. అది యాభాషాసహజన్మము గాని దేశాంతరమునుండి దిగుమతి యైనది గాదు. కనుక మనుష్యులతో వ్యవహారము దానితో భాష యద్దానితో గ్రాంథికవ్యావహారికత్వములు వానితోవ్యాకరణము నిట్టివి సూదితో దారమువలె నొకదాని నొకటి వీడక కలసిమెలసి యున్న వే కాని భేద్యములును బరిహార్యములును గావు.

కనుక భాష ముందు పుట్టినదా? వ్యాకరణము ముందు పుట్టినదా? యనువ్యాకరణదూషణపరవికటప్రశ్న పరంపరలను వదలివేయుట సర్వరమణీయము. మఱియు నీగ్రాంథిక వ్యావహారికత్వములు వ్యర్థధర్మము లని పట్టుదలతో నందు రేని యొకభాషాకుటుంబములోని వని చెప్పఁబడు రెండుభాషలు మొదట నెట్లుండినవి? అవి యట్లు చీలిపోవుటకుఁ గారణము మొదటినుండి ప్రజలయుచ్చారణభేదము గాక మఱే మని చెప్పఁదగును. దీనికి భాషాంతరసంపర్కమే కారణ మని నిర్ధారణ యగుదునా? ఎట్లు పలికినను బలికినవాని యుద్దేశ్యమును వినువాఁడు గ్రహింపఁగలుగునా? అట్లుచేయఁగలిగినచో నీప్రపంచములో నొకకుటుంబములోని వనిచెప్పఁబడు నిన్నిభాష లెందుల కాకుటుంబములో సర్వసాధారణములు గావు? వేలువేలు పలుకుబడులతో నారబ్ధమగుభాషల నొకటిగాఁజేయుట యెట్లు? కనుక నీగ్రాంథిక వ్యావహారికత్వధర్మము లనివార్యపృథక్పథము లని యొప్పి యూరకుండుట మంచిది.

పండితులు పరస్పరవిజయేచ్ఛ గలిగి యుందురు గదా యని యంతట నసూయాపీడితు లగుదు రనునింద కర్హులుగారు. అదివాఁడును టనే వ్రాయఁ బడలేదు. ఎం దైన సామర్థ్యము గల ప్రతిమానవుఁడును సామర్థ్యము గలప్రతిమానవునితో నాయంశము ప్రస్తావింపఁబడినప్పుడు

త్న శూరత్వము ను వెల్లడింపకపోడు. అది న్యాయ్యముకూడ నగును. కనుక నే మహాకవి కాళిదాసుగారు "ఆపరితోషా ద్విదుషాం న సాధు మన్యే ప్రయోగవిజ్ఞాన" మ్మనియు "తం సంతః శ్రోతు మర్హంతి సద సద్వ్యక్తిహేతవః" యనియుఁ బ్రశంసించి యున్నారు. పదవాక్యప్రమాణజ్ఞ భవభూతిమహాకవికూడ "ఉత్పత్స్యతే స్తి మమ కోపి సమానధర్మా" యని సవిచారముగనైనఁ బండితప్రశంస చేసియున్నాఁడు. "విద్వానేవ విజానాతి విద్వజ్జనపరిశ్రమ" మ్మను సదుక్తికూడఁ బండితుఁడు చేసిన కావ్యాదికమును బండితులకే యర్పింపవలె నని యుద్బోధించుచున్నది. "సమకాలురు మెచ్చ రెన్నఁడున్" అనుచేమకూర వేంకటకవి దూషణపరవాక్యములు వ్యతిరేకముఖమునఁ బండితప్రశంసఁ జేయుట లేదా ? ఈ రండుఁ బండితుల మెప్పును గోరియే కాదా వారి నుగ్గడించుట మొదలగునవి జరిగియున్నవి? కనుక పండితులు గ్రంథకర్తలనో రడంచుటకు వ్యాకరణ మను మహామోహనద్రవ్యమును దెచ్చిపెట్టి రని నిష్కారణముగ వారిని నిందింపక వారిపైఁ జిరాకు మాని వరాకులేక శాస్త్ర మభ్యసించి వరాల కెన యగు సత్కావ్యములను రచించి మిరాతి గులైన పండితశూరులకే కానుకగాఁ జేసినచోఁ జతురాననయువతి కంఠమున నిస్తులముక్తాకలాపసమర్పణ మగు నని నాచిత్తసర్వస్వము.

అయిన, వ్యవహారదుష్టపదములు గ్రాంథికకవుల రచనలయందుఁ గూడఁ గానఁబడుచున్నను, గ్రాంథికవ్యావహారికభాషాభేద మల్లే యుండవలె నని మీయభిప్రాయమా ? యనినచో "శాస్త్ర ప్రయోగవచసో శ్శాస్త్రం బలవ దుచ్యతే, అనిష్పన్నే పదే తేన ప్రయోగాశ్రయణం హితమ్" అనుప్రామాణికవచనమునుబట్టి వ్యవహారదుష్టపదములు బహుపండితప్రయోగమధ్యమునఁ దఱచు మెలఁగెనేని యవి యనివార్యగ్రాహ్యము లని వేఱుగఁ బునరుక్తి యవసరము లేదు, గావున, నాపదముల విషయమై వ్యాకరణము చాల దనుమొదలుగాఁ గల తద్దూషణములు సంకుచితదృష్టిమూలకములు గాని, న్యాయములు గా వని విన్నవించుచున్నాను.

# తిక్కన—భారతరచన.

—విద్వాన్. పిసుపాటి విశ్వేశ్వరశాస్త్రిగారు, పిఠాపురము.—

---

మనుమసిద్ధిక్ష్మాపాలుని రాజ్యచక్రమును దన యసమానమేధాశక్తిచే నస్ఖలితముగా నడపిన సామాదిచతురుపాయజ్ఞుం డగుమహామంత్రియు, వేదశాస్త్రాధ్యయనము చేసి తదుక్తకర్మాచరణమునందు మిక్కిలి యాసక్తి గలిగి స్వాహాస్వధాశబ్దద్వయసంస్కృతము లగుహవ్యకవ్యములచేత దేవతలను బితృదేవతలను దృప్తిపఱిచిన సోమయాజియు, నుభయభాషాకవిత్వంబున మిగులం జతురుండై యుభయకవిమిత్రుం డనం బేరుగాంచిన మహాకవియుం, దాను గృతికర్త యయ్యు నితరకవులచేం గృతులందిన మహాత్యాగియు, నిరంతరస్మరణీయచరిత్రుండును, హరిహరాద్వైతభావనాపవిత్రీకృతహృదయుండును, నగుతిక్కన సోమయాజి నిర్వచనోత్తరరామాయణాదికృతులను రచించియుం దృప్తిలేక తాను సంసారసాగరమును దరించుటకును, భారతకథారసపానముచేత 'నాంధ్రావళి మోదము బొరయుటకును' దనమనంబున ననువైన మార్గము నాలోచించి మహాభారతము విరాటపర్వము మొదలు పదునైదుపర్వము లాంధ్రీకరించెను.

మనకవిబ్రహ్మ తనయాంధ్రీకరణమునం గ్లుప్తీకరణవిపులీకరణముల సాహాయ్యమున గ్రంథ మంతయును నడపినాండు; మఱియుం గొన్నిచోట్ల నౌచిత్యమునే ప్రధానముగాం జేసికొని మూలమున నున్నదానిని దెనిగింపక విడుచుటయు, మూలమున లేనిదానిని గల్పించి పెంచుటయును జేసినాండు. ఇట్టిమార్పులు దక్షక కవులెల్లరును జేయవలయు నని ధ్వనిమార్గప్రతిష్ఠాపనాచార్యుం డగునానందవర్ధనుండు చెప్పెను చూడుండు.

"శ్లో. ఇతివృత్తవశాయాతాం త్యక్త్వానసనుగుణాం స్థితిమ్
ఉత్ప్రేక్షోప్యంతరాభీష్టరసోచితకథోన్నయః.

---

ఈవ్యాసము శ్రీసూర్యరాయవిద్యానందపుస్తకభాండాగారమున జరిగిన తిక్కన వర్ధంతి సందర్భమునం జదువం బడినది.

ఇతివృత్తవశాయాతాం కథంచిత్ రసాననుగుణాం స్థితిం త్యక్త్వా పునః ఉత్ప్రేక్ష్యాపి అంతరా అభీష్టరసోచిత కథోన్నయో విధేయః యథా కాళిదాసప్రబంధేషు (శాకుంతలాదిషు) కవినా ప్రబంధ ముపనిబధ్నతా సర్వాత్మనా రసపరతంత్రేణ భవితవ్యం. తత్రేతివృత్తే యది రసాననుగుణాం స్థితిం పశ్యేత్ తాం భంక్త్వాపి స్వతంత్రతయా రసానుగుణం కథాంతర ముత్పాదయేత్.

శ్లో. అనౌచిత్యా దృతే నాన్యద్ రసభంగస్య కారణమ్
ప్రసిద్ధౌచిత్యబంధస్తు రసస్యోపనిషత్పరా" (ధ్వన్యాలోకము.)

ఆలంకారికమార్గమును జక్కఁగాఁ బరిశీలించి యౌచిత్యానౌచిత్యములను గుర్తించి తిక్కన తనభారతమును దీర్చి దిద్దినాఁడు. ఈమహాకవి యేవిషయమును వర్ణించినను బాఠకులను దన్మయులఁ జేయునట్లుగా వర్ణింపఁగలఁడు. దీనికి ముఖ్యోదాహరణములు:—అభిమన్యునియుద్ధఘట్టము, కృష్ణునిరాయబారపుఘట్టము. ఇట్టిఘట్టము లింకననేకములుగలవు. ఈఘట్టములు చదువునప్పుడీగ్రంథమున కొకమూలగ్రంథము కలదనియును దాని కిది యాంధ్రీకరణ మనియు నెట్టివిద్వాంసునకేని తోఁపదు. అచ్చముగా నాంధ్రముననే (అనఁగా సంస్కృతమున లేకయే) తొలుత నీగ్రంథము రచింపఁబడిన దనుదృఢవిశ్వాసము పాఠకులకుఁ గలుగునట్లు రచించినతిక్కనకవి మహాప్రతిభకు నమస్కరింపని యాంధ్రకవి యుండఁడు; కావుననే కవిత్రయములోనివాఁడగు నెఱ్ఱనార్యుఁడు తనహరివంశమునఁ దిక్కనను గవిబ్రహ్మ యని నుతించినాఁడు.

ము తనకావించినసృష్టి తక్కొరులచేతం గాదనా నేముఖం
టునఁ దాఁ బల్కినపల్కు లాగమములై పొల్పొందనా వాణి న
త్తను నీతం డొకరుండ నాఁ జను మహత్త్వప్తిం గవిబ్రహ్మనా
వినుతింతుం గవితిక్కయజ్వ నఖిలోర్వీదేవతాభ్యర్చితున్.

మనతిక్కనకు సాక్షాచ్ఛిష్యుఁడును మార్కండేయపురాణము నాంధ్రీకరించినవాఁడును నగుమారయ యాతనిగూర్చి యిట్లుచెప్పినాఁడు.

చ. ఉభయకవిత్వతత్త్వవిభవోజ్జ్వలు సంవిహితాధ్వరక్రియా
   ప్రభు బుధబంధు భూరిగుణబంధురు భారతసంహితాకథా
   విభుఁ బరతత్త్వబోధను నవీనపరాశరసూను సంతత
   త్రిభువనకీర్తనీయయశుఁ దిక్కకవీంద్రుని గొల్తునర్థితోన్.

ఇందలి 'నవీనపరాశరసూను' 'ఉభయకవిత్వతత్త్వవిభవోజ్జ్వలు' అను విశేషణములు నాఁడు తిక్కనయందు వారికిఁ గలగౌరవమునకు సూచకములు. ఇంకను దిక్కనను గూర్చి విశేషములు తెలిసికొనుటకు దశకుమారచరిత్రమొకఁ డాధారముకలదు. దీనిని కేతన తిక్కనకుఁ గృతియిచ్చినాఁడు. ఇందుఁదిక్కనవంశము వర్ణింపఁబడినది. ఈవిధముగాఁ(అనఁగాఁగృతిద్వారమున) దనవంశమును దాను వర్ణించుకొననక్కఱ లేకయే యితరులచే వర్ణింపఁజేసికొనిన తిక్కన వివేక మెట్టిదో యాలోచింపుఁడు. ఇఁకఁ గేతన తిక్కనను గూర్చి చెప్పినదానిని గొంచెము పరికించినచో నాతనిప్రవర్తనను బ్రతిభాపాండిత్యములును స్పష్టముగాఁ దెలియఁగలవు. చూడుఁడు.

సీ. సుకవీంద్రబృందరక్షకుఁ డెవ్వఁ డనిన వీఁ
      డనునాలుకకుఁ దొడవైనవాఁడు,
   చిత్తనిత్యస్థితశివుఁ డెవ్వఁ డనిన వీఁ
      డనుశబ్దమున కర్థమైనవాఁడు,
   దశదిశావిశ్రాంతయశుఁ డెవ్వఁ డనిన వీఁ
      డనిచెప్పుటకుఁ బాత్రమైనవాఁడు,
   సకలవిద్యావిశారదుఁ డెవ్వఁ డనిన వీఁ
      డనిచూపుటకు గుఱియైనవాఁడు,
   మనుమసిద్ధిమహీశ సమస్తరాజ్య
   భారధౌరేయుఁ డభిరూపభావభవుఁడు
   కొట్టరువుకొమ్మనామాత్యు కూర్మిసుతుఁడు
   దీనజనతానిధానంబు తిక్కశౌరి.

క. అభినుతుఁడు మనుమభూవిభు
   సభఁ దెనుఁగున సంస్కృతమునఁ జతురుండై తా

శ్రీ

# ఆంధ్రసాహిత్యపరిషత్పత్రిక.

కాకినాడ.

రెండు నెలల కొకసారి ప్రకటింపఁబడును.

**(Journal of the Telugu Academy.)**

| | | |
|---|---|---|
| సంపుటము. ౨౭ | బహుధాన్యనామసంవత్సరము.<br>ఆశ్వయుజకార్తికమాసములు. | సంచిక ౪ |


గత కార్తికబహుళ పంచమీశనివారమున (12-11-38) పరిషత్పత్రికాసంపాదకులును, ఆంధ్రభాషాభిమానులు నగు బ్రహ్మశ్రీ కొత్తపల్లి సూర్యరావుగారాకస్మికముగ మరణించిరని వ్రాయుట కెంతయుఁ జింతిల్లుచున్నారము. వీరిభాషాభిమానము, కార్యదీక్ష, నిరాడంబరజీవితము నందఱికిని దెలిసినవే. వీరాంధ్రమునఁ బెక్కుగ్రంథముల రచించుటయేగాక తమిళము, కన్నడము మొదలగుభాషల జ్ఞానములవరచుకొని పరిషత్కార్యములఁ జక్కఁగ నిర్వహించియున్నారు. భగవంతుఁడు వీరి యాత్మకు శాంతి నొసఁగుఁగాక.

పరిషత్కార్యదర్శులు.

# కీర్తిశేషులగు క్రొత్తపల్లి సూర్యరావుగారి జీవితసంగ్రహము.

సాహిత్యవిశారద బ్రహ్మశ్రీ కాశీభట్ట సుబ్బయ్యశాస్త్రిగారు

---

"జాతస్య మరణం ధ్రువం" అనునట్లు పుట్టినవారు గిట్టుటసహజము. అయిన నీలోకమునం గొందరు మహనీయులు భంగురములగు భౌతికదేహములం బాసినను స్థిరతరములగు కీర్తిదేహములతోం జిరంజీవులై వెలయుచుందురు. అట్టి యశఃకాయులలో క్రొత్తపల్లి సూర్యరాయసూరిగారొకరగుటకు సంశయములేదు.

ఈవిబుధవరుని జన్మస్థానము పీఠికాపురసమీపమున నున్న చెందుర్తియను గ్రామము. ఇందుం గ్రొత్తపల్లివారని ప్రసిద్ధిగాంచిన శ్రోత్రియకుటుంబమున రామయ్య సుబ్బమ్మగార్లను పుణ్యదంపతులకు నెనమండ్రుపుత్రులు, నిరువురు పుత్రికలు నుదయించిరి. ఈకుమారులెల్లరు మేధానిధులు. విజ్ఞానఘనులు. ఈసోదరగణమున సూర్యరావుగారొకవారు. వీరు చిన్ననాం డూరిసావడిబడిలోం దెలుగున వ్రాయను జదువను నేర్చి యటనంతకుం బైవిద్దెల నేర్పు పాఠశాలలేకుండుటచే నింటనున్న యన్నలకడం బురాణములయందలి మేలుపద్దెముల వ్రాసికొని కంఠపాఠముసేయుచుం గాలము గడుపుచుండిరి. ఇట్లు పదునారేండ్లవయసు వచ్చువఱకుం జాందుర్తియందే వర్తించుచుండిరి.

ఇట్లుండగాం గాకినాడపట్టణమున గురజాడ శ్రీరామమూర్తిపంతులుగారిచే నెలంగొలుపంబడిన రాజయోగివత్రికాముద్రణాలయమునకుం బాలకులుగానుండిన పారేపల్లి లక్ష్మీనారాయణగారు మిత్రులవలన సూర్యరావుగారి తెలివితేటలం దెలిసికొని, కాకినాడకు వారిం బిలిపించుకొని, వీరి సురూపస్వభావములకు సంతసమంది, తమ మందిరమునందే యుంచికొని పుత్త్రప్రేమతో నాదరించుచు, నచ్చువని నేర్చుకొనుటకు

రాజయోగిముద్రణకార్యాలయమునఁ బ్రవేశపెట్టి, స్వయముగా ముద్రణాదికార్యముల బోధింపఁదొడఁగిరి.

అంత నచిరకాలములోనే సూర్యరావుగారు పరసాహాయ్యాపేక్ష లేకయే స్వయముగా నక్షరములఁగూర్చుట యందును, ముద్రితపత్రముల దిద్దుటయందును నేర్పరులై, పత్రికానిర్వాహకులగు లక్ష్మీనారాయణగారికిఁ గొంత కార్యభారము తగ్గింపఁజొచ్చిరి. ఈరీతిగా పచ్చువనుల నేర్చికొనుటయ కాక రాత్రులయందు శ్రీరామమూర్తి పంతులుగారియొద్ద నాంధ్రప్రబంధములఁ జదువ మొదలిడిరి. విద్యార్థిదశ నిట్లు హాయిగ సాగించుచుండ "కాలమొక్క రీతి గడువబోదు" అను సామెతవడువున సూర్యరావుగారిని నందఱుని పగిదిఁ బ్రేమించుచున్న పారేపల్లి లక్ష్మీనారాయణమహాశయులు 1895 సం॥రం డిసెంబరు మాసానదివి కేగుటయు, గురజాడ శ్రీరామమూర్తి పంతులుగారు కాకినాడపురమును వీడి విజయనగరమునకుఁ జనుటయుఁ దటస్థమాయెను. అందుచే రాజయోగికార్యాలయము పాలకాభావమున మూయఁబడవలసి వచ్చెను. కాని సూర్యరావుగా రప్పటికి నచ్చుకూటము నడిపింప నర్హమగు నేర్పును తెలుఁగునఁ బుస్తకముల రచియింప నగునగు విజ్ఞానమును గడించియుండిరి.

రాజయోగి యాగినకొలది వత్సరములకే పోలవరము జమీందారువారగు శ్రీ కొచ్చెర్లకోట వేంకటకృష్ణారావుబహదూరు వారు సరస్వతీపత్రికాలయమును స్థాపించి దానికి శ్రీ చిలకమర్తి లక్ష్మీనరసింహముగారి నధిపతులనుగా నేర్పరచి, వారికి సహాయముగాఁ గార్యముల సాగింపసమర్థుఁడగు బుద్ధిశాలికై వెతకుచున్న సంగతిని గురజాడ శ్రీరామమూర్తి పంతులుగారు తెలిసికొని సూర్యరావుగారి శక్తిసామర్థ్యముల నుగ్గడించుచు నుత్తరము వ్రాసిరి. అంతపై జమీందారుగారు సూర్యరావుగారిని సరస్వతీపత్రికాలయమున లక్ష్మీనరసింహముగారికి సహాయకార్యదర్శిగా నియమించిరి. ఈతరినుండియే సూర్యరావుగారి మేధావైభవము లభివృద్ధి నందజొచ్చినవి.

అపుడు పోలవరము జమీందారుగారియొద్దఁ బండితులుగానున్న దివాకర్ల తిరుపతిశాస్త్రిగారి సాహచర్యమున సంస్కృతసాహిత్యప్రాణ్యమును చిలకమర్తి లక్ష్మీనరసింహకవిసింహుని నేస్తమునఁ దెలుగు కైతల నేర్పును సాకల్యముగా సమకూర్చికొని వీరు స్వయముగా గావ్యనిర్మాణము జేయఁదొడంగిరి. ఇట్లు క్రమముగాఁ గవివరులై వ్యాసరచనానిపుణులై ముద్రణాలయకార్యనిర్వహణదక్షులై సూర్యరావుగారు ప్రసిద్ధిగాంచిరి.

వీరు సరస్వతీపత్త్రికారాజమునఁ బురాతనాముద్రితగ్రంథముల నెన్నిటినో ప్రకటించిరి. వీరి ప్రయత్నములకుఁ బోలవరముజమీందారువారు చేదోడై తగుప్రోత్సాహమును సమకూర్చుచుండిరి. ఇట్లు పదేడేండ్లు వీరు సరస్వతీపత్త్రికాలయమునఁ బ్రభుసమ్మితముగను సజ్జనస్తుత్యముగను ఆత్మగౌరవానుకూలముగను కాలము గడుపుచు సుఖముగానుండ గ్రాంథికాంధ్రభారతీపదారవిందసమారాధనాసక్తచిత్తులగు శ్రీజయంతి రామయ్యబుధవరేణ్యులు సూర్యరావుగారి గుణాతిశయములను, కార్యనిర్వహణప్రావీణ్యము విని, చెన్నపురినున్న యాంధ్రపరిషత్పత్త్రికాకార్యాలయమునఁ బనిసేయుటకు రండని పిలుపు నంపిరి. వీరు వారి పిలుపుపైఁ జెన్నపురమున కేగి, పదిరెండేండ్లటఁ గాపురము చేసి, పిమ్మట పరిషత్తు వెంటఁ గాకినాడపురమునకే తెంచి, బహుసమర్థతతో బుధప్రశంసార్హమగురీతిని నిదానముగాఁ బరిషత్కార్యములన్నిటిని నెరవేర్చుచు నిజకార్యాచరణనైపుణ్యముచేఁ బైయధికారుల గౌరవమునకుఁ బాత్త్రులై నిర్వదైదేండ్లు గడపి 1938 సం॥ నవంబరు నెల పన్నెండవతారీఖు శనివారము పగలు పన్నెండుగంటల సమయాన నన్నకబలము నోటనిడుచుననాయాసముగా నసువుల బాసిరి. ఇప్పటికి వీరివయసు అరువదియారు వత్సరములు. ఈ యనాయాసనిర్యాణము జూడఁ జూడ నీ ధీనిధి పూర్వభవమున యోగసమాధిధీయుఁడగు పుణ్యపురుషుఁడై కర్మశేషానుభవమునకుఁ దిరుగ నీరీతి నవతరించి ముక్తకర్ముఁడై ముక్తి నందెననుటకు సందియము లేదు. వీరిగుణసంపత్తిని వీరికిఁ బెద్దలయెడఁ గలభక్తిప్రపత్తులును

వివరముగా వ్రాయఁబూనినచోఁ నొకగ్రంథము కాగలదు. పత్రికాము ఖమున నొక్కమారు వీరిప్రావీణ్యమునుగూర్చి తెలియఁజేయుటకు వలను గామిచే సంగ్రహముగ సూర్యరావుగారి పాండిత్యమును గూర్చి కొలఁదిగ ముచ్చటించి యీవ్యాసమును ముగింతును.

సూర్యరావుగారు సంస్కృతాంధ్రములఁ బండితులై యుండుట యేకాక, ఆంగ్లము, అరవము, కన్నడము, మహారాష్ట్రము, హిందీ, ఉరుదు భాషలయందుఁ జక్కని ప్రవేశముగల ధీమంతులు. వీరీభాషల యందుఁ బ్రకటితములగుచున్న పత్రికలను, కావ్యములను జదివి, వాని యందలి యందములగుభాగముల వినువారికి వివరించుచుండెడివారు. అన్నిటికంటెను వీరియందెన్నఁదగు సుగుణమేని యనకలంకమగు ప్రవర్తనము. మఱియు నిగర్వమునకు వీరిజీవిత ముదాహరణము. కలలోఁ గూడఁ బరిహాసమునకాడి యెఱుఁగరు. ఈకవిశిఖామణి యనేక గ్రంథముల విరచించియుండెను. అందుఁ గొన్ని ముద్రితములైనవి. మఱికొన్ని యచ్చు కాదగియున్నవి. వానిపట్టిక నిటనిచ్చుచున్నాను.

ముద్రితములు.

1. దర్యోధనాభిమానము (నాటకము)
2. కన్యకాపరమేశ్వరి. (డిటో)
3. గుణమంజరి.
4. హరిశ్చంద్రమహారాజుకథ.
5. నెట్టికివేయి విధములు.
6. కమలపాలిక.
7. ఆనందసాగరము.
8. రాజలక్ష్మి.
9. నీతిభవనము.
10. త్రిలోకసుందరి (నాటకము)
11. ఉదయోత్సు.
12. సిరియాళచరిత్ర.

అముద్రితములు.

1. అమోఘరాఘవము (నాటకము.)
2. వీరకృష్ణరాయలు (డిటో)
3. శుద్ధాంధ్రనిరోష్ఠ్యనిర్వచన కుచేలోపాఖ్యానము.
4. పరుగబిళ్ల.
5. సౌభాగ్యసుందరి (నాటకము)
6. బాలికాబోధన.
7. సమయమంత్రి (600 నీతివాక్యములు.)
8. శ్రీరామశతకము.
9. చతుర్గణికటకము.
10. స్వప్నలీల.

13. రామలక్ష్మణులు.
14. వాసవదత్త.
15. కచదేవయానులపెండ్లి.
16. హమ్మీరదేవరాజ.
17. కళావిలాసము.
18. సంస్కృతకథాసారము.
19. వీరబలునివినోదములు.
20. నమస్కారములు.
21. వసానేఆజాయ్.

11. కిరాతార్జునీయము (వచనగ్రంథము)
12. సువృత్తశతకము.
13. లోకోక్తులు (8 వేలు)
14. కాశీనాథశతకము.
15. ఆహ్లాదిని (పద్యకావ్యము)
16. జామాతృవిలాసము (నాటకము)
17. రాజకళింగగంగు (డిటో)
18. సూర్యోదయమను పేరుగల స్త్రీసుచరితము ద్విపదకావ్యము. ఇది వీరి తుదికృతి.

ఇవికాక వీరెన్నియో యమూల్యములగు వ్యాసముల వివిధ పత్రికలయందును బ్రకటింపఁజేసియుండిరి. నిజముగా నాంధ్రపరిషత్పత్రికాలయమున వీరివలెఁ గార్యములనేర్పుతో సాగింపఁగల కార్యనిర్వాహకులు సమకూరుట సందేహాస్పదము. సూర్యరావుగారు యువకులకు వినయవివేకాలంకృతమగు నిజజీవితము నుదాహరణముగఁ జూపుటయేకాక, వీరుచెందిన యనాయాసమరణముచేఁ జరఠులకుఁ దమనిర్యాణము నపేక్షణీయముగఁ జేసియుండిరి.

ప్రస్తుతము వీరికిఁ గలాకోవిదుఁడగు పుత్త్రుఁడును, సౌభాగ్యవతియగు పుత్త్రికయు, చిరంజీవియగు బాలదౌహిత్త్రుఁడును, విధేయుఁడగు నల్లుండును, సాధ్వీమణియగు నిల్లాలునుకలరు. కరుణాకరుఁడగు భగవానుఁడు వీరికుటుంబమువారికి నాయురారోగ్యాది భాగ్యములను, సూర్యరావుగారి యాత్మకుఁ గైవల్యానందమును నందఁజేయుఁగావుతయని ప్రార్థించుచున్నాను.

---

# మేఘసందేశము — యక్షునిశాపము.

విమర్శకాగ్రేసర కాశీభట్ట బ్రహ్మయ్యశాస్త్రిగారు.

---

కవిసార్వభౌముఁడగు కాళిదాసువ్రాసిన కావ్యములలోనికెల్ల చాల చిన్నదిగానుండు మేఘసందేశమను గ్రంథమునందలి విశేషములెంచిచూడఁ జాలపెద్దదిగా నున్నది. అది కాళిదాసు బుద్ధివైభవమునఁ బట్టి కథాకల్పనాదికము కలిగియున్నది. అదంతయు కల్పితమే. కుబేరుని ప్రభుత్వములో నున్న యొకానొకయక్షుఁడు మత్తుఁడై తాను చేయవలసిన స్వామికార్యములు తిన్నగాఁ జేయక దిరుగఁ జొచ్చెననియు నందుమూలముచే నాయజమానుఁ డాయక్షునకు సంవత్సరమువఱకు ద్వీపాంతరవాసశిక్షను విధించి వానిని రామగిర్యాశ్రమములలో శయనైకాదశి మొదలు ఉత్థానైకాదశివఱకు అనగా సంవత్సర మనుభవింపవలసినదని కుబేరుఁ డాజ్ఞాపింపగా నారీతిగా ననుభవింప నాతఁడు మొదలుపెట్టెననియు చెప్పబడియున్నది. ఇట్లాశిక్ష నెనిమిదిమాసముల వఱ కనుభవించెనట. కాని యింతలో వర్షకాలము వచ్చినది. వర్షకాలము విరహులకు మిక్కిలి దుస్సహము. ఆదుస్సహకాలములో వియోగమనుభవింపలేక, తనభార్య మృతిపొందునేమోయని జంకి యామెకొక సందేశమును బంపిన నామె జీవించుననునాశతో నీనాల్గుమాసముల కాలములో శిక్షవలని వియోగమును గన్నుల మూసికొని యెట్లైన గడపవలసినదని బోధించుచు సందేశమునంపెను. అదియట మేఘసందేశము. అదియక్షుఁడు విరహమత్తుఁడై యొడలుదెలియక జడమైనమేఘమెక్కడ సందేశముపట్టుకొని వెళ్లుట యెక్కడయని యాలోచింపక జడమతియై పంపెనట. ఈసందేశము పంపుట యాషాఢమాసములో ప్రథమదివసమునందు జరిగెనని మల్లినాథాదులు చెప్పుచున్నారు.

ఇంక మఱికొందరది యాషాఢమాసములో ప్రథమదివసమున జరిగినదని నుడువుచున్నారు. ఈవిధముగా వివాదము చిరకాలమునుండి వచ్చుచున్నది. కాని మల్లినాథాదులు చెప్పునదియే పొరపాటని తోచుచున్నది. రెండవవారు చెప్పినదే సత్యమని తోచుచున్నది. ఈవాదమునుగూర్చి యింకను జర్చించుటకు పూర్వము మనము ముఖ్యముగా తెలిసికొని నిర్ణయింపవలసినది మాసములు లోకములో అమాంతములా పూర్ణిమాంతములాయనునదియై యున్నది. మల్లినాథసూరిగారు మాసములన్నియు నమాంతములే, యనగా నమావాస్యతో నంతమగునవని తలంచి తనవాదమును తీసుకొనివచ్చెను. మనయాంధ్రదేశప్రాంతమునందుగల మాసములన్నియు నమాంతములే. ఇంక నుత్తరదేశమునందుగల మాసములన్నియో పూర్ణిమాంతములు. అటులయిన మన యక్షునిశాపము సరిగ హెచ్చుతగ్గు లంతలేకుండ సరిపోవును. యక్షుని శాపమోక్షమెప్పుడో గ్రంథమునందు స్పష్టముగ జెప్పబడియున్నది అదేదియన 'శాపాంతో మే భుజగశయనాత్ ఉత్థితే శార్ఙ్గపాణౌ' అని మూలమునందే తెల్పఁబడి యున్నది. కాన యక్షునిశాపము కార్తీకశుద్ధఏకాదశితో పూర్తియైనది. సాధారణముగా మాసాంతము శుద్ధఏకాదశితో పూర్తిగాక పూర్ణిమతో నగును. గనుక మనము చెప్పకొనునది యైదునోజులు భేదముగా నున్నది. ఈవద్వైషమ్య మవివక్షితమని మల్లినాథుడే చెప్పియున్నాడుఁకదా. కావున శాపాంతము సరిగనే చెప్పబడినదని చెప్పుకొనవచ్చును. కావున నేవిధమగు భేదమును లేదనియే చెప్పవచ్చును. మల్లినాథుఁడు మాసాంతము పూర్ణిమతో నగుటను కనిపెట్టలేకపోయెనని చెప్పుకొనవలసియున్నది. అంతియకాని కాళిదాసు గ్రంథములో కాలభేదము వచ్చుచున్నదని చెప్పుకొన నవసరము లేదు. అమాంతమాసాంతమువఱకుగాని పూర్ణిమాంతమాసాంతమువఱకుగాని మనము వేచియుండనవసరము లేదు. యక్షశాపాంత మెప్పుడైనదో తెలుసుకొనిన జాలును. అది కార్తీకశుద్ధఏకాదశితోనే యైనదని స్పష్టముగా గ్రంథమునందు చెప్పఁబడినది. కావున నదియే చూచుకొనవలెను. అలమతివిస్తరేణ. 'ఆషాఢస్య ప్రథమదివసే' యనుపాఠమవసరము లేదు. 'ప్రశమదివసే' యనునది తప్పుగాదు.

# వ్యాకరణశాస్త్ర ప్రశంస.

మల్లాది సత్యనారాయణశాస్త్రిగారు నూజివీడు.

---

మఱియు గీర్వాణభాష వాఙ్మయావస్థను బొందకమునుపే యా భాషకుఁ బాడితులు సంస్కారము చేసియుండి రనియు నది యట్లుకానిచో నాదికాలము నందుఁగూడ నాభాషకు సంస్కృతభాషయను పేరెట్లు వచ్చు ననియు నాసంస్కారము గూడ బ్రాకృతాదిభాషాపదములకుఁ గొన్నింటికిఁ జేసి రనియుఁ గొందఱు చెప్పుచున్నారు. ఆవిషయము లాలోచింపఁదగినవి.

భాష వాఙ్మయావస్థను బొందకమునుపు కట్టుపాట్లు వ్రాయుట యెట్లు సాధ్యమగునని తలచిరో తెలియకున్నది. ఏమన వ్యాకరణశాస్త్రము భాషపైనను, భాషయుచ్చారణము పైన నుచ్చారణము ప్రాణి పైనను, నాధారపడియున్నవి. ఆప్రాణులు వ్యక్తావ్యక్త ధ్వనికర్తలని రెండు తెగలు. అందువ్యక్తధ్వనికర్త లే ప్రస్తుతకార్యోచితులుగాన వారిలోఁ గూడఁ బ్రస్ఫుటస్థిరోచ్చారణకర్తల యుచ్చారణములే యీవ్యాకరణములకు మూలములు. అట్టితఱి నాశాస్త్రమును వాదులుచెప్పిన ప్రకారము చేయుటకుఁ బ్రస్ఫుటస్థిరోచ్చారణ కర్తలలో విమర్శకులంద ఱొకచోట నుండనవసరము లేనిచో వారు కూడఁ బలుకుకొని వ్రాయసముకట్టుట యెట్లు సాధ్యమగును ? అంద ఱొప్పుకొని యాచరణములో నుంచినం గాని యదియంతట వ్యాపకమగుట యెట్లు ? ఒకరుచెప్పినంతమాత్రముననంద ఱామోదించి తెలిసికొనుట, యనుసరించుట సంభవించునా ? కనుక వాదిమతమున నాప్రథమ వ్యాకర్తలందఱొకచోటనుండి రనక తప్పదు. కాని వాఱందఱొకచోటనే యుండశక్యమా ? అట్లున్నను వారు పరస్పర మతావలంబకులుగాఁ గాని యేకవిధాభిప్రాయకులుగాఁగానితప్పక యుందు రని నిర్ధారణయుండునా ? అట్లుండుట సహజమా ? అయి

నను భాషాచార్యకులెందఱుందురు? అట్లున్నప్పుడు శాస్త్రాంతరాది రచయితలు తమశాస్త్రములలో నవీన శాబ్దికుల శబ్దానుశాసనముల నెట్లామోదించి యనుసరించుట సంభవించును? సమస్తశాస్త్రముల కంటె నీవ్యాకరణశాస్త్రమే ముందు పుట్టినదని నిర్ధారణ మెట్లు చేయ నగును? శాస్త్రాదికర్తలందఱు భాషను సంస్కరించి తమగ్రంథములలో వ్రాయుటయే నిర్ధారణ యనినచో భాషవాఙ్మయావస్థను బొందకముందు పు భాషలో వ్యాకరణమునకు నాధారమైన వాక్య, పద, పదావయవ, ప్రత్యయాది, జ్ఞానము మొదట వారి కెట్లు కలుగునని తలంచిరి? ఏవాక్యసముదాయమో యెవని నోటినుండియో యేకదండాకారముగ బయలు వెడలినపిమ్మట దానినే శుశ్రూషాపూర్వకముగ నభ్యసించిన తరువాతివారు విమర్శకులైనచో వారికి దానియందు గ్రహింపఁదగిన యర్థమెట్లువచ్చుచున్నదో యను జిజ్ఞాస కలుగుట, విభజనము చేయఁబూనుట మొదలగునవి సంభవించునుగాని ముందుగనే, యనఁగా భాష వాఙ్మయావస్థను బొందకమునుపే యాపని యెట్లు సంభవించును? ఆ దండాకార వాక్యసముదయమే యాకాలమున నాభాషకు వాఙ్మయావస్థయును నా మతమున వాఙ్మయావస్థకుఁ బూర్వము వ్యాకరణరచనాభావము సాధ్యమగుచున్నది. వాదిమతమున వాఙ్మయావస్థకుఁ బూర్వము వ్యాకరణజ్ఞానము కలుగుటకు నాధార మేది? అనఁగా వాక్యపద్యాదులుకూర్పఁబడినప్పుడే వాని నాధారముచేసికొని యంకురించెడి వ్యాకరణమునకు నావాక్యపద్యాదు లేకచోఁ గూర్పఁబడకపోయినచో నాధారము లేక రచనాప్రవృత్తియే యసంభవమగు నని తాత్పర్యము, కనుక భాష వాఙ్మయావస్థను బొందకమునుపు భాషకు వ్యాకరణము చేసిరనుట సంగతముకాదు. పతంజలి భగవానుని "వేదాన్నో వైదికాస్సిద్ధా" యను వ్యాకరణశాస్త్ర ప్రత్యాఖ్యాన ప్రశ్నపర గ్రంథమునందలి "వేదాత్"అను పదమువలన వైదికభాష వ్యాకరణోత్పత్తికిఁబూర్వము వాఙ్మయావస్థను బొందినట్లగపడుట లేదా?

మఱియు, వ్యాకరణశాస్త్రోత్పత్తికిఁ దరువాతివారు సంస్కరణ పద్ధతిఁదెలిసి భాషను సంస్కరించి తమతమ శాస్త్రాదికములలో వ్రాసి యుండు రనిన నందురుగాక. ప్రాచీనులును, విప్రకృష్టదేశస్థులగుసమకాలికులును వాఙ్మయ రచయిత లయినచో వారు క్రొత్తగావచ్చిన యీశాబ్దికుల శబ్దానుశాసనము నె ట్లనుగమింపఁగలుగుదురు ? అ ట్లనుగమింపక వారు తమగ్రంథములలో నప్పటివ్యాకరణమునకు విరుద్ధప్రయోగము లేవిమైన, ననఁగా నప్పటి వైయాకరణులకు సంభవింపఁగూడనివియు నప్పటి యవైయాకరణులకు సంభవింపఁదగినవియుఁ, బ్రయోగించియున్నారా ? అట్లన్నచో వారు క్రొత్తగావచ్చిన శబ్దానుశాసనము నెఱుఁగరనిచెప్పవీలగును గాని యాప్రయోగములు వాఙ్మయావస్థాప్రారంభకాలమునాఁటివియు, లేక వాఙ్మయావస్థాబాల్యకాలమునాఁటివియు నుత్పత్స్యమాన వ్యాకరణములకు మూలములునుగాన నందు నిది వ్యాకరణ విరుద్ధ మనియు, నిది యనుకూలమనియు, నేర్పఱుప నేలికి శక్యమగును. ? మఱియు వైదికభాషానుశాసనమువలనఁ బ్రయోజనము దాని యర్థాదినిమిత్తముగ జ్ఞప్తియందుంచుకొనఁదగిన యంశములందుఁ బొరపాటులు రాకుండఁ జేసికొనుటయే గాని యందలి ప్రయోగముల దుష్టతాదుష్టతలను నిరూపించుట గాదనిన నాయభిప్రాయము సర్వసమ్మతమైనచో ఋషులవాక్యములకు ననుశాసన మవసరముగాదు. కనుకనే

"లౌకికానాం హి సాధూనా మర్థం వా గనువర్తతే-
ఋషీణాం పున రాద్యానాం వాచ మర్థోనుధావతి."

యని భవభూతిమహాకవి ఋషుల యాధిక్యము నంతగఁ బొగడియున్నాఁడు. త్రిమునివ్యాకరణముకంటెఁ బ్రసిద్ధమై, వ్యాపకమైన మఱియొకవ్యాకరణము, మునిత్రయమునకుఁ బూర్వముగాని పరమునఁగానియున్నదని కని విని యెఱుఁగుదురా ? అట్టితఱి వారిలోఁ బరమ ప్రామాణికుఁడైన పతంజలి మహర్షి "వేదా న్నో వైదికాస్సిద్ధా" యను వాక్య

తాత్పర్యమునకును భాషవాఙ్మయావస్థను బొందకమునుపు కట్టుపాట్లు చేసి రనుఃధునాతనవిమర్శకుల వాక్యతాత్పర్యమునకును విరోధము రాకమానుట లేదు. అట్లైనచో నేది గ్రాహ్యమో యేది త్యాజ్యమో యావాదప్రధానులే నిర్ణయింపఁదగుదురు. కనుక భాషవాఙ్మయావస్థను బొందక మునుపు భాషకు కావలసిన కట్టుపాట్లు చేసి యుంచుటకు నేకాలమున నెట్టివారికి శక్యముకాదుగాన నట్టివ్రాత పొరపాటున వచ్చినదని నాయభిప్రాయము.

ఇఁక గీర్వాణభాషకు సంస్కృతభాష యని యెట్లు వ్యవహారము గలిగినదో విచారింపఁదగినది.

సంస్కృతమను పదమును బాగుచేయఁబడిన యేవస్తువునైనను అనఁగాఁ జెరుగుట, జల్లించుట, యెగురఁబోయుట, వడియఁబోయుట, యెండఁబెట్టుట మొదలగు నేపని చేసినవస్తువునైనను-జెప్పునపుడు వాడుచుండుట యలవాటు. ఆవిధముగనే వ్యాకరణసూత్రము లోక యభిప్రాయమునే బోధించు వ్యస్తపదముల సంఘటనాసాధుత్వమునుగాని యొకపదముపై వచ్చెడి ప్రత్యయములకు నాశబ్దార్థముతో నర్థసాధుత్వనిర్ణయమునుగాని బోధించును. ఉదాహరణము వ్యస్తమందుఁ జూపుచున్నాము. "దధ్నా సంస్కృతం వ్యంజనమ్" దధిచే సంస్కృతము వ్యంజనము. "భ్రాష్ట్రేసంస్కృతామాషాః" భ్రాష్ట్రమందు సంస్కృతములు మాషములు. ఇందలి మొదటిదానికిఁ "బెఱుగుతోఁ గూర్పఁబడిన వ్యంజనము (పచ్చడి)" అని యర్థము. రెండవదానికి "మంగలమందు వేఁపఁబడిన మాషములు" అని యర్థము. ఈరెం డుదాహరణములలోను సంస్కృతమను పదము గలదు. కాని యీరెండుచోట్లను జరుపఁబడిన సంస్కారములు రెండువిధము లైనవి గాని యొకవిధముగాదు. కనుక సంస్కృత మనుపదమునకు భిన్నకారణక సంస్కారము చేయఁబడినవస్తువు మొదలైనది యర్థముగాన సంస్కారములు వేలువేలు విధము లని తేలుచున్నది అవసరము లేకపోయినను ప్రత్యయాంత పదముల నుదాహరించుచు

స్నాను. "దాధికంవ్యంజనమ్" దాధిక వ్యంజనము. "భ్రాష్ట్రామాషాః" భ్రాష్ట్రములు మాషములు. అర్థములు మానుపటి యట్లే ఇట్లే యనేకములు చెప్పవచ్చును. కనుక సంస్కృత మనుపదము భాషకే విశేషణముగా నుండి తీరవలెనని నిర్బంధము లేదు. కర్త్రర్థప్రత్యయాంతమైన యా సంస్కృతమనుపదము భాషకు విశేషణ మైనచో విశేషాంశ మేదో యచటఁ గలిగినదను సర్థము మాత్రము తప్పకాదు. కాని వాదుల యుద్దేశ్యము మాత్రము భాషలోని ప్రయోగము లొకలాగున నుండఁగఁ బండితులు వానిని దమ కనువగు మఱియొకలాగున మార్చి యిదియే శుద్ధశబ్దమని యామోదించి యనుసరించి రని యుండుటచేఁ దప్పనక తీరదు. ఆపని యెట్లుసాధ్య మగునని తలఁచిరో తెలియకున్నది. ప్రయోగ మొకతీరునను శాస్త్రవిధి మఱియొక తీరుననుండి యున్నచో నాశాస్త్రముతో నేకాలమందుఁగాని పనిగలవా రుందురా? "ఉపేయ ప్రతిపత్త్యర్థముపాయా అవ్యవస్థితా" అనున్యాయము చొప్పునఁ బ్రణాళికలోనే కొంచమైన భేద ముండినను, బ్రధానోద్దేశము తలక్రిందులుగా నుండఁగూడదు గనుకఁ బైన వర్ణింపఁబడిన దండాకార వాక్యసముదయము నాధారముగఁ జేసికొని వైయాకరణులు కొందఱు జ్ఞాపకముగా నుంచుటకై వైదిక ప్రయోగ సాధుతాపరశాసనములను, కొందఱు లౌకిక ప్రయోగ సాధుతాపరశాసనములను, కొంద ఱుభయములను భిన్నభిన్నానుపూర్వీక ప్రత్యయాది విధులతోఁజేయ నారంభించి యుండిరి. అందుఁ బాణిన్యాది మహర్షులు మువ్వురు సంపూర్ణముగ వైదిక లౌకిక ప్రయోగ సాధుతాపరశాసనముల ననన్యాదృశ రచనా నైపుణిగ రచించి యుండిరనుట విశ్వజనీనము. కాని "ఇకో యణచి"యను మొదలగువిధులఁజూచి యావిధానమే యాయారూపసిద్ధికి మూల మని, యది యాభాషలో లేని క్రొత్త పద్ధతియని యనుకొనఁదగదు. భాష ధ్వని రూపముతోఁ బ్రారంభించినది మొదలు భాషలోనే యున్న విషయములను జ్ఞాపనార్థమైన వ్యాకరణములో నొకానొక సౌకర్య మపే

క్షించి యెప్పుడే క్రొత్తగాఁ దెచ్చిపెట్టినట్లు విధించుటయే కాని యచట్టి కొకటియు రానులేదు మఱొకటి పోనులేదు. అట్లైనచో వారి ప్రధానోద్దేశ్యమగు నీఖండస్ఫోటవాదిత్వమునకు భంగము వాటిల్లదా? వారు భిన్నభిన్నానుపూర్వీక ప్రత్యయాదులను విధించుటచే వారొకరితో నొకరు కలసి మాట్లాడుకొని వ్రాయలేదనియు, భిన్నభిన్న దేశస్థులనియు, వారి వ్యవహారములో నాభాష యెట్లున్నదో యట్టిస్థితికి భంగము జరుగకుండ నిబంధనము చేసిరనియుఁ దెలియుచున్నది. కాని సంస్కృతమను పదము భాషకు విశేషణమైన యెడలఁ జెప్పఁదగిన యర్థమేమి? యది యెట్లు సంగత మగునని యడిగినచో వినుఁడి.

జనవృద్ధితోఁ బాటు వ్యవహారమునకుఁ జాలినంత శబ్దజాలము కూడఁ బెఱిగినపిమ్మట నాశబ్దజాలగ్రథిత ప్రాచీనవాక్యములను దఱువాతివారిలో నందఱుఁ గాకపోయిన శ్రద్ధాళువులైన కొందఱు క్రమముగా విడువకుండ నభ్యసించుట యాచారము. అది యిప్పటికి దేశభాషలలోఁ గూడఁ గలదు. అట్లభ్యసించిన ప్రాచీనవాక్యసముదయము నెవరికొఱకైన నర్థాదిబోధనోద్దేశ్యమున నుదాహరించుట యసంభవము గాదు. అట్టివారిలో విమర్శకులుండి యావాక్యమున కాయర్థ మెట్లు వచ్చుచున్నది? వాక్యార్థముల రెండిటికి సంబధ మేమి? యను మొదలగు జిజ్ఞాస లుదయించి యావాక్యసముదయమును సామర్థ్యానుసారముగ విభాగింపకపోరు. విభజించిన భాగములలోని విభేదమును గ్రమముగ గుర్తుపట్టక మానరు. గుర్తించిన విషయములను జ్ఞాపనము కొఱకు విషయభేదమును బట్టి వేఱువేఱు సూత్రములయందు గ్రుచ్చకుందురా? ఈపని మొదటఁ దత్కాలోపయుక్తముగా నారబ్ధమైనను విషయబాహుళ్యమునుబట్టి శాస్త్రరచనయే యగును. ఇట్లు ప్రత్యేకముగా నాసక్తిగలిగి యభ్యసించిన ప్రాచీనవాక్యములకును, సాధారణ జనశ్రవణమాత్రాధార వ్యవహార వాక్యములకు, నుచ్చారణములో భేదము కలుగుచునే యుండును. అట్టి వ్యవహార మాత్ర శరణ్య భాషావేదు లధిక

సంఖ్యాకులుగాను, శిక్షిత ప్రాచీన వ్యవహారవాక్య లల్పసంఖ్యాకులుగా ను నుందురు గనుకను, సాధారణవ్యవహార మందఱకుఁ గావలసియే యుండును గనుక నధికసంఖ్యాకుల వ్యవహారవాక్యము లనల్పసంఖ్యా కులు నేర్చియేయుందురు. అల్పసంఖ్యాకు లభ్యసించిన ప్రాచీన వ్యవహా రవాక్యముల నధికసంఖ్యాకులు వ్యవహారములో లేనివి కాన నభ్యసిం పరు. అల్పసంఖ్యాకు లభ్యసించిన ప్రాచీనవ్యవహారవాక్యములు మొద టఁ గొంతకాలము వఱకు నధికసంఖ్యాకులకుఁ దెలిసినను గాలము గడచిన కొలఁదిఁ దెలియనేరవు. అట్లగుటచే శిక్షితాశిక్షితుల భాష లుచ్చారణభేదమును బురస్కరించుకొని ప్రాచీనార్వాచీనతా భేదము నందుచుండును. అట్టి ప్రాచీన భాషాభేదమునఁగూడ వ్యవహారబలమున మొదట లేకపోయినఁ గ్రమముగాఁ గొన్నిపదములలో నక్షర లోపా దులుకలిగి మార్పుప్రారంభించును. క్రమముగ నది యంతట నలముకొని ప్రాచీన వ్యవహార వాక్యపద్ధతి వేఱుగను నవీనవ్యవహార వాక్యపద్ధతి వేఱుగను జేయుచుండును. ఆప్రాచీనవ్యవహారవాక్యపద్ధతి గలదియే వై దికభాష; యానవీనవ్యవహారవాక్యపద్ధతి గలదియే గీర్వాణభాష; యా యశిక్షిత వ్యవహార వాక్యపద్ధతి గలదియే ప్రాకృతాదిభాష యని యా ది దంపతి కుటుంబోద్ధృత ధ్వనిరూపవ్యవహార సాధనము క్రమముగా మూఁడు భాష లగుచున్నది. కనుకనే యెంత నేర్పుతో వ్రాయఁబూనినఁ గొన్నిస్థలముల సాంకర్యము రాకమానదు. ఇదియే కారణముగఁ బ్రా కృతాదిభాషలలోఁ గనంబడు ప్రయోగవిశేషములు, వైదికభాషయం దుఁగూడఁ గనఁబడుట సంభవించుచున్నవి. ఈ భాషావిభాగము మొద ట తెలియఁబడకపోయిన నప్పటప్పటి భాషాపరిస్థితులను గాపాడ బయ లుదేఱలిన విమర్శకులవలన బయలుపడుచుండెను. అట్టి వైయాకరణులు ప్రాచీనార్వాచీ నాశిక్షిత జనవ్యవహారఫలిత త్రివిధ భాషారాశికి వ్యాక రణ మను చాలనిని గనిపెట్టి జ్ఞాపనార్థమైన సంస్కార మనుభ్రమణ క్రి యను గల్పించి ఘనాఽఘన వేలవత్వ ధర్మముల మూఁటిని గనుఁగొ

నఁగలిగిరి. అనఁగా నప్పటికిఁ గొంచెము కొంచెము గలిసి మెలిసి యున్న పైమూఁడు భాషలలోని పదములను వేలువేలు రాసులుగఁ జేసి రనియే కాని ప్రాకృతాది భాషాపదములకు సంస్కారము (క్రొత్తమార్పు) కల్పించి సంస్కృతభాష యనలేదని తాత్పర్యము. ఇట్లు సంస్కార మిట్టిదని నిర్ణయించుటచేత, సంస్కృత మనుఁపదము విశేషణ విశేష్యభావమంది నప్పుడు చెప్పఁదగిన యర్థము చెప్పి యిదియే గీర్వాణభాషకు సంస్కృభాషయని పేరువచ్చుటకు నిర్దుష్టసమాధానమని కృతకృత్యత నందుచున్నాఁడను. ప్రాకృతభాషాదిపదములకుఁ గ్రొత్తగా సంస్కారముచేసి యా సేతుహిమాలయపర్యంతము ననాదినుండి ప్రసిద్ధికెక్కిన వ్యాకరణేతర సమస్తశాస్త్రాది కర్తల నందఱ నొక్కసారి యావైపుఁ ద్రిప్పఁగలిగిన కృత్రిమవ్యాకర్త లీభారతావనియం దుండిరని మీకు విశ్వాసమున్నచో మీకొకనమస్కారము. అట్లాక్రొత్తసంస్కార మెన్నఁడైన భాషలోనికిఁ జొరునా ? యని నాసందేహము. "నియమార్థం వ్యాకరణమ్" అను పతంజలిమహర్షి వాక్యమునకు నాభాష యప్పు డేపద్ధతిలో నున్నదో, యాపద్ధతినుండి తప్పింపక కాపాడ నవసర మని తాత్పర్యము గాని క్రొత్తక్రొత్తవ్యాకరణము వ్రాసికొని మఱలమఱల సంస్కారముచేయ మని కాదు. అట్లుచేయుట నియమ మని చెప్పఁబడదు. భాషోత్పత్తి ప్రజాసంఘమునుండియేకాని వైయాకరణులనుండి కాదు. అందుఁలకనియే పతంజలిమహర్షి కుమ్మరివానిని గుండలుచేయు మనినట్లు వైయాకరణుని శబ్దములు చేయుమని యెవరును బలుకరని వేనోళ్ల నుద్ఘోషించుచున్నాఁడు. భాషలో సూక్ష్మముగా నున్న యనుగమకసూత్రమే వ్యాకరణమనియు నదిగీర్వాణభాషను సంస్కృతించుటకు మూల మనియు విన్నవించుచున్నాను. కనుక సంస్కృత మనుపదముకూడ వైయాకరణసృష్టముగా దని తెలిసికొందురుగాక. ఈయభిప్రాయము పతంజలిభగవానుని "లోకాచ్చ లౌకికా" యను ప్రమాణవచనమువలనఁ దెలియుచున్నది.

---

# తిక్కనకవిబ్రహ్మ.

ఉ. పంచమవేదమై పరగువ్యాసుని భారతమాంధ్రమందు ని
ర్వంచితకీర్తివైభవ విరాజితులైన కవిత్రయంబు వా
రంచితరీతివ్రాసి జగమందుననిల్పిరి తెన్గుభాషలో
మించినయాదికావ్యమిది మేలొసఁగుఁగద యాంధ్రభూమికిన్. ౧

ఉ. నన్నయభట్టముఖ్యకవినాథులు ముగ్గురుభారతంబు మే
లెన్నికఁగన్నరీతి రచియించిరి పెట్టిరిభిక్ష తెన్గుకై
తన్నెటివ్రాయువారలకుఁ దత్కృతియాదికి నాదియాట
చేరెన్నికఁగన్న సత్కవులకేనియుమార్గము జూపఁగల్గెడిన్. ౨

ఉ. పూర్వకవీంద్రులన్న రసముఁదొలుకాడెడు రీతిఁగూర్చియే
పర్వముజూచినన్ హృదయపర్వముగా గనుపింపవ్రాయరే!
సర్వమెఱుంగువారలకు సర్వపదార్థము గోచరించు నీ
యుర్వరనాంధ్రజాతి కిది యొక్కటిచాలదె? గర్వమందగన్. ౩

ఉ. ఎన్నియొ సత్కవీశ్వరులు నేర్పడవ్రాయరె? యందులోనఁ ది
క్కన్నకవిత్వమెంతయు మహామహిమంబున రాజిల్లుఁగదా
తిన్నగదానితత్వమును దేటపడన్ గ్రహియింపఁగల్గు వా
రెన్నఁగ నొక్కరుందురు మహీస్థలి సత్కవికోటిలోపలన్. ౪

క. అందు విరాటోద్యోగము
లందున్ గల కవితయిట్టిదంచువశంబా
పొందుగఁ జెప్పఁదలంచిన
డెందము నలరించుఁగాదె? దృఢీకృతమహిమన్. ౫

ఉ. తిక్కన సోమయాజికవిధీరుని తేటతెనుంగుకైతలోఁ
జక్కనినేర్పుకూర్పును రసజ్ఞులుమెచ్చెడి వాక్చమత్కృతుల్
నక్కువమీఱుభావములు మాటికిమాటికిఁ గానుపించు స
మ్యక్కృతితోడఁజూచు కవులందరకున్ బ్రతిపద్యమందునన్. ౬

ఉ. ఇంతియగాదు తిక్కనకవీంద్రుని తెన్గు కవిత్వధోరణుల్
జింతనఁజేసియున్ దెలియలేఁరహస్యము సత్కవీశు లా
క్రాంతమహత్వ మెట్టులొ గ్రహింపఁగనయ్యెనటంచుఁ జెప్పఁగా
నెంతపరిశ్రమించి పఠియించెడిగ్రంథమొ చెప్ప నేటికిన్. ౭

క. లౌకికవైదికధర్మ
ప్రాకట్యంబెల్ల నెఱుఁగుభవ్యగుణుండై
శ్రీకవియగుటన్ దిక్కన
శ్రీకరమగురచనఁజేసి చేకొనెయశమున్. ౮

చ. తలఁచినయంతమాత్రన సుధామధురాంచితవాక్యసంపదల్
నిలచుఁదమంతఁదామె రమణీయముగాఁగ రసప్రతీతిగాఁ
దెలుఁగుకవిత్వ ధోరణులు తిక్కనకావ్యమునందుఁ గన్పడుఁ
దెలుఁగురచించువారలకు తిక్కనదైవమనంగఁ జెల్లదే ? ౯

క. ఆపావన మావాచా
నైపుణ్యం బామనోజ్ఞనయమార్గవిధం
బా పాత్రౌచిత్యగుణ
శ్రీపాటవ మెంచ సుకృతసిద్ధముసుమ్మా ! ౧౦

ఉ. మూగురుసాటివత్తురు త్రిమూర్తులకన్నిఁటఁ గావ్యసృష్టిలో
మూగురకున్ సమానమగుమూర్తి కనంబడదావిరాటము
ద్యోగములందుఁ దిక్కనమహోన్నతభావవిశేష శేముషీ
శ్రీగరిమం బనన్యకవిశేఖర లభ్యమనంగనొప్పదే ! ౧౧

క. తిక్కనహృదయ మెవారలు
జక్కఁగ నేర్వంగలేరు సముచితపదముల్
జక్కని తేట తెనుంగున
నక్కజముగఁగూర్పఁగల మహాకవియగుట౯. ౧౨

ఉ. భారతమన్నసత్కృవులపాలిఁట కన్నివిధంబులెంచఁగా
మేరువురీతిభాసిలుచు మేలొనఁగూర్చునిధాన మందులో
ధీరుడు సోమయాజికవిధీవరుభాగము తెన్గుకైతకున్
దారినిఁజూపుచుండెఁ గవినాథులకయ్యది గోచరించెడిన్. ౧౩

క. తినిసన్ గారెలె తినవలె
విన్నసన్ భారతమునొండె వినవలె ననుచున్
మనసారవీను లలరఁగ
వినమో? లోకోక్తి నెపుడు పెద్దలుసెప్పన్. ౧౪

ఉ. తిక్కనయర్థగౌరవము తిక్కనభావ మెఱుఁగుటన్నచోఁ
దిక్కనయంతవారలయి తేజరిలన్ వలె భావుకుండనన్
జక్కనిశాంతిదాంతిగుణసంపదలందనఁగాని నాఁడు మా
తిక్కనభారతంబు కడుఁదిక్కఁగనుండుటఁ జిత్రమేటికిన్. ౧౫

ఉ. తూకమునందు భారతముతో సరితూఁగెఁడు గ్రంథరాజ మీ
లోకమునందులేదు కవిలోకము దీనిమహత్వతత్వమున్
బ్రాకటపుణ్యగౌరవము బావసదృష్టియు భావపుష్టి న
స్తోకమహత్వమున్ దనివితోఁ బరిఖించి తలంపవేడెదన్. ౧౬

వి. రామసుబ్బారాయుఁడు,
స్నేహలతాకవితాసంఘము.
కొల్లాపురం.

---

# తిక్కన యర్జునపాత్రమును బోషించినవిధము.

శ్రీమత్తిరుమల పెద్దింటి రాఘవాచార్యులుగారు—కాకినాడ.

కవులు తమ గ్రంథములయం దుదాహరించు సమానబలపరాక్రమాదులు గల పాత్రములను వర్ణించునపుడు వానిలో నొకపాత్రమునం దభిమానము జూపుచు వర్ణించుట సంప్రదాయమై యున్నది. ఇట్టి సంప్రదాయమును సంస్కృతకవులు పాటించిన నద్దానికి మెఱుంగువెట్టుట యాంధ్రీకరణకవులకు నాచార మగుచుండెడిని.

శ్రీమద్రామాయణమున సీతాపహరణము వంశనాశనము, హేయము, నరకహేతువు, నను మొదలగు విషయములను సూచించువాక్యములను రావణునితో విభీషణకుంభకర్ణులు సమానప్రవృత్తిగలవారై పలికిరి. కాని, కుంభకర్ణునియం దొకవిధమగు నిరభిమానము, విభీషణునియం దొకవిధమగునభిమానము లోకులకు గల్గుచున్నది. ఇట్లు కల్గుటకుఁ గవులువ్రాసెడి యభిమానసూచకములగు వ్రాతలే కారణములని యూహింపనగును.

భారతమునఁ గర్ణార్జునుల యుభయులలోఁ గర్ణుఁడే బలపరాక్రమాదిగుణసంపత్తి కలవాఁడని విమర్శనాదృష్టితోఁ జూచువారికి గోచరించును. అయినను సామాన్యులు కర్ణుఁడు వీరుఁడు కాఁడనియు నర్జునుఁడే మహావీరుఁడనియు ననుకొనుచుందురు. అట్లనుకొనుటకుఁగూడఁ గారణములు కవి యాయాపట్టుల నర్జునబలపరాక్రమముల నతిశయోక్తులలో వర్ణించుట, కర్ణునిబలపరాక్రమముల నీరసముగా వర్ణించుట యని యెన్నవలసి యున్నది.

“తల్లిచెవులు తఱిఁగినపుత్త్రుఁడు పినతల్లిచెవులు తఱుఁగఁగోసునా” అనునట్లు సమానవీరులగు కర్ణార్జునులను వర్ణించునపుడే సహజప్రేమమును జూపినకవి యుత్తరార్జునులకు సంగ్రామసంబాధము కలిగినపు డుత్తరునినీచముగా వర్ణింపఁ డనుటకు హేతువు లేదుకదా!

ఉత్తరదిశ నున్న తనగోగణమును దుర్యోధనాదులు ముట్టడించిరనునుడి విని యెక్కటి యగు నుత్తరుఁడు బృహన్నలసారథియై విజయా

రము బయలు వెడలి నూతనజలధరశ్యామ ప్రదేశము లాకు జొంకముల
సనకరించుచు సంధ్యారాగసదృశచ్ఛాయాదేశంబులు పల్లవప్రతతిని బరి
హసించుచు రాజహంసగౌరంబు లగుపట్టులు పూబొదలచందమునఁ
బ్రకాశించుచు, హరిద్రరుచిసమానాకారస్థానములు పుష్పాంకులట్లు మెఱ
యుచుఁ గలసి మెగయుసేనాపరాగము శృంగారవన మొకటి దివికి నరి
గాఁపువోవుచున్నదా యనున ట్లుండ గోవులను మరలించుకొని పోవు
చున్న కౌరవరాజుసైన్యమును జూచి భయపడి గరుపారినమేనును, దలఁ
కుమనము, ఱిచ్చవడినచూపును నై తొట్రుపడి బృహన్నలతో నీక్రింది
విధమునఁ బిఱికితనమును వివరించువాక్యముల వచించె నని చెప్పఁబడినది.

శా. భీష్మద్రోణకృపాదిధన్వినికరాభీలంబు దుర్యోధన
గ్రీష్మాదిత్యపటుప్రతాపవిసరాకీర్ణంబు శస్త్రాస్త్రజా
లోష్మస్ఫారచతుర్విధోజ్జ్వలబలాత్యుగ్రం బుదగ్రధ్వజా
ర్చిష్మత్త్వాకలితంబు సైన్య మిది యేఁ జేరంగ శక్తుండనే.

క. అకృతాస్త్రుఁడ బాలుఁడఁ గా
ర్ముకవిద్యాప్రౌఢిమై నిరూఢు లయిన యీ
శకునిజయద్రథదుర్ముఖ
వికర్ణకర్ణాదియోధవీరుల కెదురే.

పరికించి చూడఁగా నుత్తరువంశము పరాక్రమవంశ మని యీ
క్రిందిపద్యములవలనఁ దేటపడుచున్నది.

శా. లోకస్తుత్యవిభూతి నస్యవృతనాలుంటాక బాహాబల
శ్రీకల్మిన్ రథదంతిఘోటకభట శ్రేణీసముద్దాంత సే
నాకల్పధ్వజవిభ్రమంబున సుహృద్వ్యప్రోద్యముండై శతా
నీకుం డుద్ధతి నేఁగుదెంచె నఖిలానీకంబు నుప్పొంగగన్.

ఉ. ఆతని తమ్ముఁ డైనమదిరాశ్వుఁడు కర్ణఝుళంఝుళాసము
ద్ధూతబలోత్థరేణుపరిధూసరితాంబర మైనవారణ
వ్రాతము గొల్వ రాఁ గడఁగి వచ్చె సముజ్జ్వలహేమవర్మ ని
ర్యాతరుచిచ్ఛటాపటలరంజితహేతిమహోగ్రసైన్యుఁ డై.

తే. అతసియనఁ జండు సూర్యదత్తాహ్వయుండు
సమరసైనిక నానాస్త్ర శస్త్రబహుళ
దీప్తిజాలకప్రతిహత దినకరాంశు
రాజి యై చనుదెంచె సంరంభ మెసఁగ.

ఉ. తెల్లనిజోడు వెట్టుకొని తీవ్రగతిం జనుదెంచె మత్స్యభూ
వల్లభునగ్రనందనుఁడు వైరిమదాపహవిక్రమ ప్రకా
రోల్లసితుండు వన్యబల ముద్ధతిఁ గొల్చుమృగేంద్రరేఖ శో
భిల్లుచునుండ శంఖుఁడు విభీషణశంఖనినాద మొప్పఁగన్.

ఈపద్యవిషయములనుబట్టి శతానీకమదిరాశ్వసూర్యదత్తులను విరటునిసోదరులుఁ విరటుని ప్రథమపుత్త్రుఁ డగుశంఖుఁడు బహుపరాక్రమాతిశయము కలవారనియు దక్షిణగోగ్రహణవిజయమునకై విరటునికి సహాయపడుచుండి రనియుఁ దెలియవచ్చెడిని. ఇట్టిపరాక్రమవంతులు కల రాజవంశమునఁ బుట్టినయుత్తరుఁడు కూడ నొకవీరుఁ డని గ్రహింపవలసియున్నది. సింహ మజమును గనుట లోకవిరుద్ధముకదా!

మఱియు గోపాధ్యక్షుఁడు దుర్యోధనబలశరాసారబాధితుఁడై కౌరవబలమును జయింపనేరక రథికుఁ డై కురుబలజయశీలుఁ డుత్తరుఁడే యని గ్రహించి యతని సమీపించి గోవర్గము కురుసైన్యంబులచే ముట్టడింపఁబడిన స్థితివివరించి, యీక్రిందివిధమునఁ బల్కెను.

ఆ. తేరుఁ బూన్పఁబంపు తెప్పింపు దృఢతను
త్రాణ ముగ్రచాపబాణపూర్ణ
తూణఘనగదాసి తోమరచక్రాసు
లనువుగానొనర్పు మతిరయమున.

చ. విరటుఁడు నిన్ను నెప్డుఁ బదివేవురముందటఁ జెప్పు బాహువి
స్ఫురితుఁడు శౌర్యశాలి కులభూతివిశేషవిధాయకుండు భూ
భరణవిశారదుండు జనభవ్యతపఃఫలసంభవుండు గా
తరపరిరక్షకుం డనుచు దానికి నీవుగఁ జేయు మిత్తఱిన్.

విరటునివంటివీరుఁడు పదుగురిలోఁ దనకుమారుని బ్రశంసించుట స్వాభావిక మనియు నిందతిశయోక్తి లే దనియు గ్రహింపవలయును.

తనయనంతరము రాజు కానున్న యసమర్థుఁ డగు నుత్తరు నిట్లు ప్రశం సింపని-చో జనులు తనపుత్రునకు విధేయులు కానోపరను నూహాతో ననేసని యనఁదగదు. తండ్రియనంతరపుహక్కును సంపాదించుటకుఁ బ్రథమపుత్రుఁడు వీరుఁడు నగుశంఖుఁడే కలఁడు. ఆకారణమున నితని స్తుతింపనవసరము లేదు. కాన నితనిని తండ్రి ప్రశంసించుటంజేసి సత్య విషయమును విశదీకరించుట యని గ్రహింపవలయును.

ఇదియుఁగాక సంస్కృతభారతమున దక్షిణగోగ్రహణయుద్ధము నకు సైన్యోపేతుఁడై పోవు విరటుఁడు పురరక్షణకై వీరుఁ డగును త్తరుని నాజ్ఞాపించె నని "త్వాం హి మత్స్య మహీపాలః శూన్యపాల మి హాకరోత్" అను శ్లోకభాగముచేఁ జెప్పఁబడి యున్నది. శూన్యపాల శబ్దమునకు విషమపదార్థవివరణటీకాకారులు శూన్యంవీరరహితం ఏక ఏవ పాలయ తీతి శూన్యపాలః అతిసమర్థత్వాత్ అని వ్యాఖ్య వ్రాసిరి. వీరుఁ డగునుత్తరుని పురరక్షకునిగాఁ జేసె నని జెప్పువిషయమును తిక్కన తనభారతమున నాంధ్రీకరింపలే దని తెలియవచ్చెడిని.

మఱియు నుత్తరుఁడు గవాక్షస్థుఁడు పల్లినవల్లుల నాలించి తనకు సారథి లేఁ డనియుఁ దనసారథి తనకింతకుముందు సంభవించిన యిరువదియెనిమిది లేక యొకమాసము దినముల కాలపరిమితి గల యుద్ధమున మృతి నొందె నని యనుకొనినట్లు సంస్కృతభారతమునఁ గలదు.

శ్లో. అష్టావింశతిరాత్రం వా మాసం వా నూన మన్తతః
యత్తదాసీ న్మహ ద్యుద్ధం తత్ర మే సారథి ర్హతః.

తిక్కనమాత్రము తనభారతమున నుత్తరునికి జరిగినయుద్ధకాలపరి మితి నాంధ్రీకరించక యుత్తర బృహన్నలతో

క. ఇచ్చట నొకకయ్యంబునఁ
జచ్చెమదీయాగ్రజన్మసారథి తగువాఁ
డెచ్చోటఁ లేమి నాతం
డచ్చుపడుఁ డయ్యె నీక్రియకు నొండొకనిన్.

అని పల్కినట్లు వర్ణించియున్నాఁడు.

కాలపరిమితి గమనించినఁ జనుపరు లంతదీర్ఘకాలము యుద్ధము చేసిన వీరుఁ డర్జునునకంటె ఘనుఁ డనుకొందు రనియు నట్లైన నర్జున పాత్రపోషణము సరిపడ దనియుఁ దిక్కన గ్రహించి యావిషయము నాంధ్రీకరింపకపోవచ్చు నని తోఁచెడిని. కాని యిట్లాంధ్రీకరింపకున్నను దన వ్రాసిన "ఇచ్చట నొకకయ్యంబునఁ జచ్చె మదీయాగ్రజన్ముసారథి" అను పద్యమును బట్టియే యుత్తరుఁడు వీరుఁ డని విశద మగుచున్నది.

ఉత్తరునకు భూమింజయుఁ డనునామాంతరముకూడఁ గలదు. నామాంతరములు సార్థకములు కానోపుననుపక్షము నంగీకరించిన నితఁడిదివరలో యుద్ధములుచేసి శత్రువుల జయించి భూముల వశపరచుకొనె ననియు నాకారణమున నితఁడు వీరుఁ డనియు విశద మగుచున్నది.

దక్షిణదిశావిజయము నొందివచ్చినవిరటుఁడు తనకుమారుఁడు సహాయహీనుఁడై యొక్కఁడే వెళ్లె నని విచారించినట్లు చెప్పఁబడియున్నది. కాని యతఁ డస్త్రశస్త్రాదివిద్యాయుక్తుఁ డని యెకడను వర్ణింపఁబడలేదు.

పై నుదాహరించినవానిచేఁ గాకుండ నీక్రింది వానివలనఁ గూడ నుత్తరుఁడు వీరుఁ డని తేటపడఁగలదు.

ధనూంషి చ మహార్హాణి బాణాంశ్చ రుచిరా స్బహూన్
ఆదాయ ప్రయయే వీరః స బృహన్నలసారథిః.
ఏవ ముక్త స్తు సుశ్రోణ్యా తయా సఖ్యా పరంతపః
జగామ రాజపుత్త్రస్య సకాశ మమితౌజసః.
త ముత్తరం వీక్ష్య రథోత్తమే స్థితం
బృహన్నలాయా స్సహితం మహాభుజమ్
స్త్రియ శ్చ కన్యా శ్చ ద్విజా శ్చ సువ్రతాః
ప్రదక్షిణం చక్రు ర థోపురాంగనాః.
సరాజధాన్యా నిర్యాయ వైరాటి రకుతోభయః
ప్రయాహీ త్యబ్రవీ త్సూతం యత్ర తే కురవో గతాః
నాతిదూర మథో గత్వా మత్స్యపుత్త్రధనంజయౌ
అవేక్షేతా మమిత్రఘ్నౌ కురూణాం బలినాం బలమ్.

ఈశ్లోకములయం దుత్తరపదమునకు విశేషణపదములు వీరః అమితౌజసః మహాభుజః అకుతోభయః అమిత్రఘ్నః అని నిష్ప్రాతికముగ వాడఁబడినవి. తిక్కనమాత్రము వీరః అనుపదమేగాక తక్కుంగల విశేషణములైనను నుత్తరపదమునకు వాడినట్లు కన్పట్టదు.

మఱియు నుత్తరుఁడు బృహన్నల యర్జునుఁడే యని గ్రహించిన పిమ్మట నతఁడు మాతలి దేవేంద్రునకు, దారుకుఁడు శ్రీకృష్ణునకుం బోలె సారథ్యము గావించి సారథ్యకర్మయందు శ్రీకృష్ణునిశక్తికిమించు సాహసశక్తి జూపఁగల్గె నని యీ క్రిందిపద్యముచే స్థిరపడుచున్నది.

చ. మనము కలంక దేఱె రిపుమర్దనవిక్రమ మెక్కు తేప నీ
ఘనభుజశక్తిప్రాపున నఖండితశౌర్యమహోన్నతుండ నై
యనిమొన సారథిత్వముమహత్త్వము వైరులు మెచ్చఁజూపెదన్
ననుఁ బనిగొమ్ము లెమ్ము కురునాథు నదల్పు మరల్పు గోవులన్.

ఇట్టిసారథ్యసాహసశక్తిని జూపయత్నించుటయేకాక యాయుద్ధకథాభాగమును జదివినవారి కతఁడట్లు ప్రవర్తించె ననికూడ విధిగా వ్యక్తమగును.

ఈ యుదాహరించిన విషయములచే నుత్తరుఁడు వీరుఁడని స్థిరపడుచున్నను స్వర్గమునకుఁ గట్టుగావలిగాఁ బోవులలితవనమనఁ బరఁగు సేనాపరాగము కలిగి లలితదృశ్యరూపమునను్న కురుసైన్యమును జూచి యుత్తరుఁడు భీతి చెందె నని సామాన్యమానవునికంటె హీనముగ వర్ణించి తుద కర్జునునిచే నుత్తరుఁడు శూరాధముఁ డని యీ క్రిందిపద్యరూపమునఁ బలికించెను.

చ. ఘనభుజశక్తియున్ రిపులదర్పము నేర్పడ జూచిచూచి యె
ట్లును డెగకున్నఁ బోక యిది లోకము చక్కటి శూరులైన దీ
నిని మది మెచ్చరీబలము నీదెసఁ దేఱియుఁ జూడ దింతకున్
మును భయహేతువైనవిధముం దగఁ జెప్పుము నాకు నిత్తఱిన్.

ఉత్తరునిదెస నీవిధము లగునీచవర్ణనములు గావించుట యర్జును నసహాయవీరత్వమును లోకులకు వెల్లడించుట కని గ్రహించునది.

అర్జుని బాహులఛాయ, గమనభంగి మున్నగువానిని భీష్మద్రోణకృపాదులు గ్రహించి వచ్చెడువాఁ డర్జునుఁడే యని గుర్తించి యతని విక్రమాదిగుణసంపత్తిఁ వర్ణింప నవకాశము కల్పించుటకై, ఉత్తరుఁడు సైన్యమును జూచి భయపడె నని చెప్పినమాత్రమునఁ దనివితీఱక యతనియందు బహుహైన్యమును దైన్యమును సూచించురథలంఘనాదికము వర్ణింపఁగడంగెను. రథమునుండి లంఘించి యుత్తరుఁడు పర్వెత్తనిచో రథస్థితబృహన్నలాచ్ఛాయలు ప్రాజ్ఞు లగుభీష్మాదులుకూడఁ దెలిసికొనుట కశక్యముకదా !

మఱియు విరటుఁడు దక్షిణగోగ్రహణమునకుఁ బోనున్నపుడు 'పిలువని పేరంటము చెప్పనివిందు' అనునట్లు యుధిష్ఠిరుని రమ్మనకున్నను యుధిష్ఠిరుఁడు సమయముకల్గించుకొని బృహన్నలను విడచి తక్కినతనసోదరులయుఁ దనయు యుద్ధకుశలత్వమును వివరించి యతని నంగీకరింపఁ జేసి వెంటబోయె నని నుడువఁబడినది.

"దక్షిణదిశకు ససైన్యుఁడై విరటుఁడు సుశర్మపై దాడివెడలును. పంచపాండవులును దప్పక యుత్తరదిశను జర్గుయుద్ధమునకు రాఁగల్గుదురు, అప్పుడు వారిని గుర్తించి తిరిగి వారిని నరణ్యవాసాజ్ఞాతవాసంబులకుఁ బంపుద"మనుకొనుదుర్యోధనునూహకు విరుద్ధముగా ధర్మభీమనకులసహదేవులను దక్షిణదిశ కంపి యుత్తరదిగ్యుద్ధమునకు నర్జును మిగుల్చుటకును, తనసోదరులసంగ్రామకౌశలము వర్ణించుయుధిష్ఠిరునిచే విరటుని సమ్ముఖమున బృహన్నలాపరాక్రమము వర్ణింపఁబడకుండఁజేయుటకును హేతు వుత్తరగోగ్రహణయుద్ధసందర్భమునఁ గవి యర్జునకు లోకైకవీరత్వము నాపాదించి పాత్రౌచిత్యమును బాటింప సమకట్టునూహయే యని యెన్ననగును. ఇంతియగాక యింతకుముం దుదాహరించి

సవిషయములను బట్టి యచేతనమగు నుత్తరపాషాణము నాధారము చేసికొని కౌరవసేనాసముద్రము నసహాయుఁడై పార్థుఁ డొక్కఁడే యీఁదఁగలైనను ప్రతిమ్మలోకమున వ్యాపింపఁజేయ నర్జునవీరత్వమును బోషింపఁగొనుచువచ్చెను.

పరిశీలించి చూడ నుత్తరుఁడు వీరోత్తరుఁడు. ఉత్తరగోగ్రహణ ముత్తరగోగ్రహణమే. ఎట్లైనను నజ్ఞాతవాసగుహాంతర్గతార్జునసింహ పరాక్రమాదులు దుర్యోధనాదిమత్తేభంబులకుఁ జవిచూప నుద్దేశించుచు వీరుఁడగునుత్తరుని హీనోత్తరునిగా వర్ణించి కవి యర్జునపాత్రౌచిత్యమును బాటించె నని పాఠకులు విమర్శకులు గ్రహింతురుగాక.

---

# తవుటిపాములు.

కీ. శే. క్రొత్తపల్లి సూర్యారావుగారు.

కాకినాడ, ఆజిల్లయగ్రహారములోని నన్నయభట్టారకవిలాసము వారు, దీపావళిసెలవునాఁడు చిన్నసభ పెట్టుకొనిరి. సభ్యులు పెక్కుమందికిఁ గొందఱుమాత్రమే రాలేదు. ఆనాఁడు చిన్నచర్చ జరిగినది. వారము దినములనుండి కద్రూవినతలు శ్వేతాశ్వమును గాంచుటమొదలగు కథాభాగమును, ఆదిపర్వములో నున్నదానినే విమర్శించి చదువుచుండిరి.

"ఆయతవక్షుతుండహతి నక్కులశైలము లైన (లెల్ల) నుగ్గుగాఁ
జేయుమహాబలంబును బ్రసిద్ధియుఁ గల నాకు నీవనిం
బాయక యొమ్మునం దవడుఁ బాముల మోవను వారికిం బనుల్
సేయను నేమికారణము సెప్పుము దీనిఁ బయోరుహాననా! ౨౬-౬౫ప.

దవడుఁబాములా, అవడుఁబాములా, తవడుఁబాములా, కొన్ని ప్రతులలో "నెపుడుఁ బాములమోవ" నని యున్నది. ఇందేది సరియైనది? తవడుఁబాములఁ=ప్రాఁకునట్టిపాములన్ అని యర్థము వ్రాసినారు. నడచుపాములుఁగూడఁ గలవా? యొమ్మునందు + అవడుఁబాములు, అనియా? యొమ్మున + తవడుఁబాములు, అనియా. ప్రాఁకునట్టి పాములనుటకుఁ దవడుఁబాములని యేకోశమునను నాధారము గనఁబడదు. అవడు= అగడు. అనునది భారతము పైపద్యములోనే గాని యేకోశములలోను గానరాదు.

అంత యందమైనపద్యమును రచించిన నన్నయభట్టారకుని, అవడుఁబాపా, తవడు బాపాయని యల్పబుద్ధితో నెట్లడుగఁ గలము. ఏకవియు దీనిని వాడియున్నట్లు తోఁపదు. భారతము లక్ష్మీపతి సోమయాజులుగారి వ్యాఖ్యానగ్రంథము దొరకలేదు. సంస్కృతములో నెట్లున్నదో యని వెదకిచూడఁబడియెను.

"సవిచిన్త్యాబ్రవీ త్పక్షీ మాతరం వినతాం తదా
కింకారణం మయామాతః కర్తవ్యం సర్పభాషితమ్. ఆస్తిక ౨౦ అ౹వశ్లో.

అని మాత్రమున్నది. ఒక్కదానిలో "సర్పభాషణం" అని యున్నది. ఈచిన్నశ్లోకమున కెంత మనోహరార్థకల్పనలతోడి పద్యమును నన్నయ భట్టారకుఁడు రచించెనో యని యానందింపనివా రెవ్వరు? స్వతంత్రించి యథేచ్ఛముగా, మూలమునుండి కథను వ్రాయఁ దలఁచి భారతబద్ధనిరూపితార్థ మేర్పడ నెఱిఁగింపుమని రాజు కోరుటచే నుపక్రమించి నతఁ డట్లు రచించెనేమో. మూలమునకు దగ్గఱగా నాంధ్రమున రచించుటకై యత్నించి "క్షురము" అను దానికి "దారుణాఖండలశస్త్ర" మన నన్నయభట్టుగారిని మెచ్చని శ్రీకృష్ణభారతములో నేమున్నదో చూతమని తీసితిమి.

"అతులతపః ప్రభావనిధి యైనుడి కెక్కిన కశ్యపప్రజా
పతికి సుతుండనై ప్రథితపక్షబలార్జితవిక్రమంబునన్
క్షితిధరకోట్లనైన నుసిఁజేయ సమర్థతగల్గి వెల్గునే
నతినికృతిన్ భుజంగులకు నంజలి సేయఁగ నేటి కమ్మరో.

అని యున్నది. ఈరెండుపద్యములకు నభిప్రాయములో నంత భేదము లేదు. కల్పనలోను గనఁబడదు. మనోహరతకుఁ గొఱఁత లేదు. భట్టారకుని పద్యములోవలెఁ బమోహపూనవా యనక అమ్మరోయన్నది తగియున్నది. మూలాధారము నట్టెకోరువాఁడుగాక స్వతంత్రుఁడై నన్నయగా రట్లు రచించిరేమో. శ్రీకృష్ణభారతమునకు మూలాతిక్రమణము కిట్టనట్లు పొడకట్టుచున్నదిగదా! "అంజలిసేయఁగ నేటికమ్మరో" అన్నది. అతినికృతిం బనులుసేయుటగాదు, బిడ్డలనెత్తుకొనుటగాదు, అంజలి సేయుట యేమూలములో నున్నదో. ఇంకొక్క సంస్కృతభారతమును దీసినారము. అందు ౨౪ అ. ౮ వ శ్లోకము.

"కింకారణం మాయా మాత! కర్తవ్యం సర్పభాషితమ్"

అనియు నధోజ్ఞాపికలో

"కి మర్థంచ వయం సర్పా న్వహామో దుర్బలాధమాన్"

అనియును గలదు. ఆహా! యిట్టి స్వల్పార్థశ్లోకమున కనల్పార్థపద్యమును రచించిన నన్నయభట్టారకుఁడు భారతమంతయు నీరీతినే వ్రాసినచో భూలోకము పట్టునా! ఒక్క మహాకవి బండ్లమీఁద నెక్కింపనాయన్నాఁడఁట. ఇప్పు డట్టిగ్రంథమే వ్రాసియుండినచో రైళ్లమీఁద నెక్కదా! చాలు! నీసంగ్రహభారతమునే శ్రద్ధగాఁ జదువలేకున్న మా విలాససభ్యులవంటివారు దాని నెట్లు చదువఁగలరు!

ఏదో నీరసపాఠముక్రిందఁ బుటయడఁగునఁ బడవైచిన "వహామోదుర్బలాధమాన్" అను ముక్క కేదో "అొమ్మునం దవడుఁబాముల మోవ" నని గరుడునిచే ననిపించినది! శబ్దరత్నాకరము ఈపద్యమునే "వని" యైదవయర్థములోను "అవడు" అనుచోటను ద్రిప్పిత్రిప్పి కొట్టనది. పైఁగా నిది వ్రాఁతప్రతులలోని పాఠమన్నది. అచ్చుప్రతులసంగతి తెల్పదు. అవడు, అగడు, తవడు, ఎవుడు, ఇట్లర్థరహితపదములను విశ్వసించుటకంటెఁ "తవుటిపాములమోవ" నన్నచో "దుర్బలాధమా" న్నదానికి సరిపడునేమో. తవుటిపాములను నవి యొకజాతి నిర్వీర్యపుఁ జేపలు-పేరు పాములేకాని, పాపము వానికిఁ గ్రౌర్యము లేదు, విషము లేదు. తేలికగాఁ బట్టుకొని చంపి మత్స్యభుక్కులు మాంసభుక్కులుఁ గూడఁ దిందురు.

దీనినే మలుఁగుఁబామని యందురు. ఆయతకక్షతుండహతి నక్కులశైలములైన నుగ్గుగాఁ జేయుదునని నన్నయభారతమును, "ప్రథితపక్షబలార్జితవిక్రమంబున క్షితిధరకోట్లనైనను సేయుదు" నని శ్రీకృష్ణభారతమును (పాప మీరెండవది ముక్కులేకుండఁగనే ఱెక్కలచేతనే కొండలు పిండిచేయుఁదు నన్నది) ఇట్టిసామర్థ్యము గలవాఁడనని పొగడఁబడుచున్న నేను తవుటిపాములను, వానపాములను మోవబనేమి, పా మన్నారుగదా యని యిట్టి తుచ్ఛకీటకములను నేను దినవసరిగదా ముట్టనైనముట్టనే అట్టి మనకీగ్రహచార మేలకల్గినదని తల్లితో గరుత్మంతుఁ డన్నాఁడేమో.

# గ్రాంథిక గ్రామ్యభాషావిమర్శము.

---

బ్ర॥ శ్రీ॥ మల్లాది రామకృష్ణవిద్వచ్చయనులుగారు, బెజవాడ.

దినపత్రికలు, వారపత్రికలుఁ, పక్షపత్రికలు, మాసపత్రికలు నాంధ్రదేశమునఁగలవు. వీనిలోఁగొన్ని సనాతనధర్మప్రోత్సాహకములు, కొన్ని ధర్మధ్వంసకములు - అదియటుండనిండు - ఎద్దియెటులైనను వీరందఱుఁ జిరకాలమునుండి వారికి సాధ్యమైనంతవఱకు నాంధ్రవ్యాకరణమునకు విరుద్ధము గానిభాషయందే వ్యాసముల వ్రాయుచుండెడివారలు. జనులు వారివారివాసనల కనుగుణములగు పత్రికలఁ జదివి సంగతులు గ్రహించెడివారలు. కొలది కాలమునుండి పత్రికలలో మహాకవు లనఁదగినవారలును మహాపండితు లనఁదగినవారలును దేశప్రఖ్యాతులును వ్రాయువ్యాసములును - గ్రామ్యభాషతో నిండియుండుటవలన వ్రాసినవారిప్రసిద్ధిఁబట్టి యేమైనవిషయ ముండునేమో యని చదువ నుద్యమించుటతోడనే వొచ్చాయి, పోయాయి, పోర్సు యిట్టి యపభ్రంశముల నన్యభాషాపదములను జేర్చినందునఁ గర్ణకఠోరము లగునశ్రావ్యపదముల వినుటతోడనే నిరుత్సాహముచే నిరసింపవలసివచ్చుచున్నది. మనుజులు తమయిండ్లలో నున్నప్పుడే సామాన్యపు చినిఁగిపోయినట్టియు మాసిపోయినట్టియు వస్త్రముల వాడుకొనినను బహుగురిలోనికి వెళ్లవలసివచ్చినప్పుడు తమయుపపత్తికిఁ దగినవస్త్రముల నలంకారముల ధరించియే వెళ్లుచుందురు. రాజద్వారమున వానిస్థితి కనర్హము లైనవస్త్రముల ధరించి యధికారియొద్దికి వచ్చెనేని దన్నగౌరవపరిచినట్లాయధికారి యెంచును. ఇది లోకవ్యవహారము. నేఁటివఱకు నాంధ్రదేశమున నేమి యితరదేశములలో నేమి వారివారి యిండ్లలో వారియలవాటునుబట్టి యెట్టియపశబ్దములు గలభాషను వాడినను వారు గ్రన్థములలోఁ గాని పత్రికలలోఁ గాని వ్రాయునప్పుడు తమకు సాధ్యము లైనసుశబ్దములలో వ్రాయుచుందురు. పద్యకావ్యమువలెనే గద్యకావ్యముకూడ భాషానియమబద్ధమై యుండుట న్యాయము. ఈన్యాయ మశ్రావ్యపదభూయిష్ఠము లగున్యా

సములు వ్రాసిన లోకోత్తరు లగుకవులకుఁ గాని, పండితులకుఁ గాని, తెలియనియంశము కాదు. పామరులప్రీతికై భాషానియమముల నుల్లంఘించుట విషాదకరము.

బాలసఖిత్వ మకారణహాస స్త్రీషు వివాదో౽సజ్జనగోష్ఠీ
గర్దభయాన మసంస్కృతవాణీ షట్సు నరో లఘుతా ముపయాతి.

యను సభియుక్తోక్తి నైన గమనించి పండితులును, గవివరులును నిట్టియసంగతపుభాషను వ్యాసములం దుపయోగింపకుండుటయును, భాషాశుద్ధి లేనియిట్టివ్యాసములం బత్త్రికాధిపులు బ్రకటింపకుండుటయును బ్రార్థితులు. వీరలిటులే బ్రకటించుటకు మొదలిడి రేని

య ద్య దాచరతి శ్రేష్ఠ స్తత్త దేవేతరో జనః
స యత్ప్రమాణం కురుతే లోక స్తదనువర్తతే.

యనుశ్రీభగవద్గీతావచనప్రకారము నియామకాభావముచే భాష భిన్నభిన్న మైపోయెడిని.

ఇట్టిగ్రామ్యభాషాభూయిష్ఠవ్యాసములను బ్రాజ్ఞు లగుకవివరులను, బండితులును వ్రాయఁబూని రేని శుద్ధభాషకుఁదిలోదకపిండప్రదానములు సేసిన ట్టగును. దీనికి వ్యాసముల వ్రాసినవారలే ప్రవర్తకు లగుదురు. తన్మూల మగునపఖ్యాతికి, దురితమునకు వారే బాధ్యు లగుదురు. ఈ సుప్రసిద్ధు లెట్టిభాషతో వ్రాసినను వారియశస్సునకుఁ గొఱఁత లేకఁ బోవచ్చును. దీనివలన భావికాలమున సంభవింపఁబోయెడి యనర్థమునకు లోకాయతమతమునకు బృహస్పతివలె వీరుమార్గదర్శకు లగుదురు. నే నొకరిని దూషించుతలంపుతో నీవ్యాసము వ్రాయలేదు. సుహృద్భావముతో నిట్టివ్రాఁతలమూలమునఁ జెడియున్నజనుల నింకను జెడకుండని సవినయముగ విజ్ఞులఁ బ్రార్థించుచున్నవాఁడను. ప్రతిఖండనములలో నవసరము లేదు. గుణముండిన గ్రహింపవచ్చును. దోష ముండిన క్షమింపుఁడు.

గుణదోషౌ బుధో గృహ్ణ న్నిందుక్ష్వేళా వి వేశ్వరః
శిరసా శ్లాఘ్యతే పూర్వం పరం కంఠే నియచ్ఛతి.

యను శ్లోకార్థమును గమనింపఁ బ్రార్థితులు.

# శ్రీరామోత్తరేతివృత్తము.



సాహిత్యవిశారద కాశీభట్ట సుబ్బయ్యశాస్త్రిగారు.

కవితావాహిని ఉపజ్ఞానుకారానువాదభేదములచే మందాకినీవాహినివలెఁ ద్రిపథగామినియై పరలుచున్నది. అందుపజ్ఞయన గవివరుని యపూర్వకావ్యనిర్మాణము. అనుకారమన నొకకవిచే వ్రాయఁబడిన కావ్యేతివృత్తమును దీసికొని యాభాషయందే కొలఁదిమార్పుతోఁ దిరుగ వ్రాయుట. అనువాదమన నొకభాషలోఁ జిత్రింపఁబడియున్న కావ్యవస్తును వేఱొకభాషలోనికి నవతరింపఁజేయుట. ఇట ననుకారానువాదములుభయములును నుపజ్ఞములోని యితివృత్తమునకుఁ గ్రొత్తమార్పులు చేర్పనగును.

కావ్యము లోకమున కస్తోకానందమును సమకూర్చునదిగా నుండవలయునన్న ఆపుస్తకమునందు స్తుత్యమగు కథావస్తువు విస్తరీకరింపఁబడి యుండవలయును. ఉత్తమశ్లోకజీవిత విలసితములగు కావ్యములు, ఏకాలమునందున్నను, ఎన్నిసార్లువిన్నను తనివితీరదు. తిరుగ వినవలయునను నభిలాష యుదయించుచుండును.

పావనానురాగశోభితులగు నుత్తమదంపతులు నాయికానాయకులుగానున్న కావ్యములకుఁ గల కళ కళత్రవిరహితులగు బ్రహ్మచారిసన్న్యాసులు నేతలుగానున్న కబ్బములకబ్బదు. కావుననే ప్రసిద్ధగ్రంథమందారములన్నియు నాయికానాయకామూల్యజీవితసుమమంజరీసౌరభమంజులములై వెలయుచున్నవి.

అట్టిగ్రంథరాజములన్నిటను నగ్రగణ్యమగునది రామాయణకావ్యము. దీని నాసేతుశీతనగము స్త్రీపుంభేదములేక భారతీయులెల్లరు గుంపులుగుంపులుగాఁ గూడి విసుగు విరామములువీడి, అత్యాసక్తితోడను, అమితభక్తితోడను వినుచుండుట కాననగును. ఇందుకుఁగారణమేమి? ఇందుఁ గావ్యనాయకులగు సీతారాముల పావనజీవితములు సుధాతిమధురముగాఁ జిత్రింపఁబడి యుండుటయే.

మున్ను త్రేతాయుగమున శ్రీరామసమకాలీనుఁడగు వాల్మీకి మునిసింహుఁడు శ్రీమద్రామాయణకావ్యమును సకలమానవమనోహరముగా నిర్మించియుండెను. ఈకావ్యరాజము సప్తద్వీపసుందరమగు వసుంధరవలె సప్తకాండములతో నలరారుచున్నది. ఇందలి యుత్తరకాండేతివృత్తమును జేకొని, పలువురు కవివరులు అనుకారానువాదరూపములగు కావ్యరాజముల విరచించియున్నారు. ఆప్రబంధములయందు వెలయుచున్న సీతాపరిత్యాగరంగరమ్యతనుగూర్చి ప్రశంసింపనెంచి యీవిమర్శమును వ్రాయఁబూనితిని.

విమర్శమన నొకగ్రంథమును బఠించునపుడు చదువరికి గోచరమగు గుణదోషముల వ్యక్తీకరించుటకుఁ జేయుచర్చకాని, వాదులాడ డీకొను రచ్చకాదు. కొందఱు విమర్శనమన నేదియో దురితకృత్యమని భావింతురు. మఱికొందఱు సాహసకార్యముగాఁ దలంతురు. ఇటులే పలువురు పలుతెఱఁగుల నూహింతురు. ఈభావములన్నియు భ్రమలుకాని ప్రమలుకావు. సువర్ణభూషణములకు వర్ణమును గొనివచ్చునది శిలాశలాకాస్పర్శమే. కావ్యవర్ణనములకు లావణ్యమును దెచ్చునది సాహిత్యకలావిమర్శనమే. సందియము లేదు.

విమర్శనము విమర్శకుని ధీశక్తిని బురస్కరించుకొని గుణదోషపరిష్కారములఁ జేయుచుండును. ఈవిమర్శకార్యమునకెల్లరు సర్హులే. సకలకావ్యములు నర్హములే. అంతియకాని, ఇట్టివారు విమర్శకులుగా నుండఁదగినవారనియు, నిట్టికావ్యములు విమర్శనీయములనియుఁ బ్రత్యేకముగా నొకవిభాగమును జూపెట్టుపట్టికలేదు. మఱియు వ్యక్తుల రుచులను బట్టి విమర్శములు వివిధరూపములతో నుండును. భావసమాధినుండి కవితావాహిని వివిధగతులపొర్లి వెల్లువగావచ్చునట్లే యూహాహారమునుండి విమర్శప్రవాహము పొంగి పలుదారులఁ బరుగిడుచుండును.

విమర్శకుఁడు తనకిష్టుఁడైనచో వానివాతలు బంగరుపూఁతలని మెచ్చుటయు, నాతఁ డనిష్టుడైనచో వానిచర్చలు రొచ్చుగుంటలని

నిందించుటయు సంకుచితహృదయలక్షణము. విమర్శకుని వ్యక్తిత్వమును బురస్కరించుకొనక యాతని విమర్శమర్యాదనుబట్టి గుణాగుణనిర్ణయము చేయుట విశాలహృదయచిహ్నము.

నేఁటి యపూర్వమేధానిధులుకొందఱు విమర్శనములు మృదుభావసుందరములై మంజులపదాలంకృతములై కథనులఁ ద్రొక్కక సన్మార్గముల సత్యనిర్ణయముసకుఁ బూనుకొనవలయునని నోరూర శ్రీరంగనీతులఁ బలుకుచుందురు. కాని యావిద్యాసాగరులు కలముఁజేపట్టి విమర్శకు గడఁగునపుడుమాత్రము పైపురాణవైరాగ్యమునుగంట సహజాసూయాతరంగము పైకెగయఁ బరులవ్రాఁతలఁగసిదీర దూరుచుందురు.

అట్టివారు లోకవంచకులగు వ్రాయసకాండ్రుకాని సత్యరతులగు విలేఖకులుకారు. ధీరుఁడగు విమర్శకుఁడు ఆత్మబోధల నాధారముగాఁ గైకొని, కావ్యమునందు గుణములఁ బ్రశంసించుటకును, లోపములఁ బ్రదర్శించుటకును పూనుకొనునేకాని యీమోసపువ్యాసములఁగొంది కలము నిలుపఁగోరఁడు. నిజముగా సద్బింకతోఁ గవివిమర్శకులఁ గనిపెట్టువారు బ్రహ్మణ్యులనఁదగుదురు.

నేఁడు వేదములు మొదలెంకిపాటలవఱకుఁగల వాఙ్మయసాగరముపై ననితములగు విమర్శతరంగములు చెలరేగుచుండుట లేదా? కృష్ణద్వైపాయనమునివిరచితమగు భారతామ్నాయసంపుటముయొక్క పుటలనూడఁబెఱికి, ఆత్రిపై నుఱికి వానినలుపుచు వదలఁగొట్టి వెల్లకంగునుబట్టింపఁ బాటుపడెడి మేటిచదువరులెందరు లేరు? కావునఁ గావ్యముతోఁబాటు విమర్శమును, నీడవలె జంటగా నంటియుండును. ఇంతటితో నీవిమర్శప్రశంసను విశ్రమింపఁజేసి నేచర్చింపనెంచినవిషయమును వివరింతును.

భవభూతికవివరుఁడు వాల్మీకిమునీంద్రుఁడు సంస్కృతభాషలో విరచించిన రామాయణోత్తరకాండములోని యేకదేశేతివృత్తమును జీవితమునఁగాఁ జేకొని, నిజమేధాచాతుర్యసంపద మెఱయ హృదయంగమములగు నపూర్వరంగముల నందు సంధించి, సుందరరూపముతో నుత్తర

రామచరితనాటకమును నిర్మాణముచేసి యున్నాఁడు. ఈసువాగ్విభూతి విరచించిన యుత్తరరామచరితము లోకోత్తరాసాధారణపరిణామరమణీయమగు కరుణరసముతోనిండి హృదయాకర్షకమై వెలయుచున్నది. కావుననే "ఉత్తరే రామచరితే భవభూతి ర్విశిష్యతే" అనెడి ఖ్యాతి సారస్వతనభోమణి సార్వజనీన గౌరవమునకుఁ బ్రతిష్ఠపించుచున్నది.

పరిశీలించిచూచినచో నీశ్రీరామోత్తరచరితమంతటిలోను హృదయంగమములగు రంగములు రెండు. అందొకటి హృదయారవిందమును నానందామోదభరితమునుగాఁజేయు సీతాపరిత్యాగరంగము. రెండవది స్వాంతమును సంతసాక్రాంతమునుగాఁజేయు కుశలవయుగళమేళనరంగము. ఇఁక మిగిలినరంగములు వీని కంగములు.

ఇట్టి మనోహరములగు ఘట్టములరెంటను భవభూతిమహాశయుఁడు కుశలవమేళనరంగము నుత్తరచరితములో నతిమోహనముగాఁజిత్రించియేలకో! సీతాపరిత్యాగరంగమును సూచించి విడచెనే కాని పైరంగమట్లు కర్ణపేయముగా వర్ణింపఁడాయె. భవభూతి యీరంగము నుగూడఁ జిత్రించియుండినచో నుత్తరరామచరితము మఱెంతటిహృద్యమైయుండెడిదో!

భవభూతిని వినా యితరులగు సంస్కృతాంధ్రకవివరులెల్లరు నీసీతావివాహఘట్టమును దమకావ్యములలో నతిమనోహరముగాఁ బ్రపఞ్చించియున్నారు. ఈయుత్తరకథ కుపజ్ఞమగు నుత్తరకాండమునందుకంటెఁ దదనుకారకావ్యముల నీకట్టు నతిరమ్యముగ వర్ణించిన కవిచంద్రులిరువురు. వారిలో మొదటివాఁడు కాళిదాసమహాశయుఁడు. రెండవవాఁడు దిఙ్నాగమహాపాదయుఁడు. ఈకవిచంచరీకము లిరువురును వాల్మీకిభాస్కరునిచే వికసింపఁజేయఁబడిన యుత్తరకాండేతివృత్తారవిందమునందలి సీతాపరిత్యాగకథామధుమాధుర్యమును సంగ్రహించి, ఒకరు శ్రవ్యకావ్యపాత్రముననను, వేఱొకరు దృశ్యకావ్యభాజనముననను బూరించి యున్నారు. రసవిదులగు సోదరులయానందముకొఱకు ముందు వాల్మీకి సంయమీంద్రోపజ్ఞమగు నుత్తరకాండమునందు అస లీసీతాపరిత్యాగ

ఘట్ట మెట్టిమనోహరరూపముతోఁ జిత్రింపఁబడి యున్నదియో యా శ్లోకభావముల నిట వివరింతును.

అట గంగాతటమున లక్ష్మణుఁడు సీతకు శ్రీరామపరిత్యాగ వార్తను దెలిపినతోడనే యాభూజాత మూర్ఛితయై కొంతతడవునకుఁ దెలివినంది యిట్లు పలుకఁదొడగెను.

(1) "లక్ష్మణా! నాకుఁ బ్రత్యక్షమగుచున్న దుఃఖదేవతారూపమును జూడ నలువ నానొసట దుఃఖానుభవమునుదీర్చి వ్రాసినట్లు విదితమగుచున్నది. (2) మున్ను పూర్వభవమున నే నెన్నిదురితములఁజేసి యుంటినో! ఎందఱిని దారదూరులనుగ నొనర్చియుంటినో! లేకున్న విశుద్ధచరితయగు సతికిఁ బతివియోగదుర్గతి యెట్లు సంప్రాప్తమగును? (3) మునిజనులనడుమ నీవొనర్చినతప్పేమి? మహాత్ముఁడగు శ్రీరాముఁడు నిన్నుఁ బరిత్యజింపఁగారణమేమి? అనెడి నుడులు పిడుగులవలెఁ జెవులఁబడినపుడు నే నేమని బదులుతెల్పఁగలను? (4) సుమిత్రానందనా! నాయందు సంరక్షణీయమగు మీరవిపంశాంకురతేజమే లేకున్న నీక్షణమున నాజీవితము నీపావనజాహ్నవీనీరములలీనముల చేయకుందునా? (5) వత్సా! మాయత్తలకందఱకు నేచేతులుజోడించి వినయముతో పాదవందనము లాచరించితి ననుము. ఆనృపాలునకుఁ గుశలము నివేదింపుము. (6) లక్ష్మణా! ఈసీత జనాపవాదములకుఁ గుందుచున్నది కాని శరీరవినాశమునకు బెగ్గడిల్లుటలేదు" అని మీయన్నకు విన్నవింపుము. (7) మఱియు సతికిఁ బతియే దైవము, బంధువు, గురువు నగుటచే సతి పతికీర్తికై ప్రాణములనుగూడ నర్పింప సంసిద్ధయై యుండును కాని వెను దీయదని యారాజశిఖామణికి నచ్చఁజెప్పుము."

ఆర్యసోదరులారా! కంటిరా సీతావచనములయందలి వినయాభిమానవికాసముల సీతనుమించిన ధీరస్వాంతయగు పురంధ్రీలలామ యీపృథివీస్థలిని వేఱొకయాపె కలదా? ఇంతటితో వాల్మీకిమునివరుని సూక్తులనిలిపి, వీని కనుకారములగు కాళిదాసకవిచంద్రుని మధురభాషితముల వివరింతును. ఈకవిపుంగవుఁడు రఘువంశమునందలి చతుర్దశసర్గములో నీసీతాపరిత్యాగమునిట్లు వర్ణించియున్నాఁడు.

సౌమిత్రి యంతర్వత్నియగు శ్రీరామపత్నిని గంగదరిని జేర్చి దుస్సహపతిపరిత్యాగవార్త నెఱింగించి యిట్లు ప్రార్థించెను. (1) "మాతరో! పరాధీనజీవనుఁడగు నీరామానుజుఁడు తెలిపిన వాక్పారుష్యమును క్షమింపుము" (అని విషాదనమ్రుఁడైయున్న మఱఁదిని లేవనెత్తి సీతపలికిన వాత్సల్యోక్తు లెంత మృదుసుందరములై యొప్పుచున్నవియో పరికింపుఁడు (2) సీత-"సౌమ్యహృదయా! సుమిత్రాతనయా! నీ వినయసంపద కెంతయు సంతసించితిని. నీయెడ నా కాగ్రహమెన్నఁడు కలుగనేఱదు. వత్సా! ఉపేంద్రుఁ డింద్రునికి బలె నీ వారాజేంద్రునకు విధేయుఁడవై చిరంజీవివి కమ్ము."

అనిపలికి పిమ్మట అత్తలకందఱకు విన్నవింపుమన్న వినయకందళితసందేశభాషితములెట్లు సుధాస్యందములై వెలయుచున్నవియో గమనింపుఁడు. (3) "లక్ష్మణా! జ్యేష్ఠానుక్రమముగా మాయత్తగారలందఱకు నావినయాభివందనముల ముందందఁజేసి యిట్లు ప్రార్థించితి నని విన్నవింపుము. నాయందు వెలుగందు మీనందనసంతానతేజము కీర్త్యానంద సుందరమై వర్ధిల్లునట్లు మానసముచేఁ దలంపు మనుము." (అనఁగా మీనందనునిచే నిందితచరితగాఁ దలంపఁబడి పరిత్యజింపఁబడిన యీవసుంధరానందనగర్భముకూడ హేయమేయని యోజించి యుపేక్షింపక, మనసున నాశీర్వదింపఁ బ్రార్థించితి ననుము. "మనస్సుచే" అనుటచే మీసన్నిధి నుంచుకొని స్వయముగా దయాపూరితములగు గర్భసంరక్షణసంస్కారముల సాగింపఁజాలకున్నను మనస్సుచేతనైన రవికులకంద మానందరాజితమై తేజరిల్లునట్లు తలంపు మనుము)

ఇంక సీత శ్రీరామున కందఁజేయుమన్న సూక్తులు సున్నితములై వెలయుచున్నవి. అచటి ప్రణయగాంభీర్యాభిమానసందేశవచనము లెట్లు ముప్పిరిగొని వెడలి యున్నవియోయాలింపుఁడు. (4) "రామానుజా! ఆకోసలసార్వభౌమునితో నిట్లు తెలుపుము. "మీకన్నులయెదుట వీతిహోత్రపవిత్రమైన క్షమాపుత్రిని సామాన్య

జనాపవాదశ్రవణమాత్రమునఁ బరిత్యజించుట ప్రశంసార్హమగు విద్యాసంపదకుఁ గాని, అత్యున్నతమగు మీగోత్రగౌరవము నకుఁ గాని తగియున్నదియా? "అని ప్రశ్నించితి ననుము." (5) మఱియు మఱిఁది ! "మీభాస్కరాన్వయాంకుర తేజమును సంరక్షింప వలసిన బాధ్యత నాయందు లేకున్న నీకున్నజనాపవాదానలదందహ్యమానము లగు మలీమసప్రాణముల మేననిలువఁగోరుదానను కానను" (అనఁగా సుఖముగాఁ జీవించుటకే కాక స్వేచ్ఛగా మరణించుటకుఁ గూడ మీయన్నగారి యనురాగ మడ్డగుచున్నది సుమీ ! అని భావము) (6) నరపాలునకు వర్ణాశ్రమపరిపాలనమే ధర్మ మని మును మనువు శాసించియున్నాఁడు. కావున మీచే నడవికి వెడలింపఁబడి యటఁ దాపసవృత్తిని జీవితమును గడఁపనున్న యబలపైఁ దిరుగఁ గఠినశాసనములఁ బ్రసరింపఁజేయక యొక దీనతపస్వినిగాఁ దలంచి జాలిఁజూపు మనుము." (7) రామానుజా! పొరఁబడి నుడువుచుంటిని.నిజముగా నీదుస్సహమగు నిరసనఖేదము దయాశీలుఁడగు శ్రీరామచంద్రుని వలనఁగలిగినది కాదు. ఇందులకు వేఱొండు కారణముగలదు. వినుము.మున్ను మీయన్న పట్టాభిషేకసమయానఁ జక్కగా సింగారించుకొని యొయ్యారముగ రాముని తో సింహాసనమెక్క మురియుచున్న రాజ్యరమను సరకుసేయక నన్నువెంటనిడికొని సంతసముతోఁ గాంతారమునకేగుటచే నాపైఁగుపితయై శ్రీరామచంద్రుఁడు తనకువశుఁడై యుండుటను గుర్తించి యాతొసిరి మిన్నతానొంటరిగా నాసుందరాంగునితో సుఖముండఁదలంచి నన్నాపడుచుమగనిచే నడవికి గెంటించినది. ఇది రహస్యము (అనఁగా మీయన్న చంచలమగు రాజ్యసంపదనే మహాభాగ్యముగా నెంచికొని యగ్నిసాక్షికముగాఁ బరిగ్రహించిన ధర్మపత్నిని దయావిరహితుఁడై పరిత్యజించెను. సౌమిత్రీ! కంటివా మీయింటిగొప్పతనమును. రాజ్యశ్రీమోహితులగు రాకొమరులు నిజరాజ్యరమల రక్షింపఁగోరునట్లు స్వకాంతానురాగసంపదలఁ బాటింప నభిలషింపరుసుమా ! అని సోపా

లంభోక్తి) (8) మఱియు నిట్లనుము "మంగళాశయులగు మీరలీ దీనురాలియెడ నన్యాయ మాచరింతురని తలంపఁదగదు. కావున నీయసహ్యాపరిభవదుఃఖమునకుఁ గారణము తన జన్మాంతరదురితరాశియే యని తలంచిన దనుము." (9) రాక్షసోపద్రవద్రుతపతికలగు తాపససతులకు మీకటాక్షముచే సంరక్షకమై తనరారిన యీ క్షమాతనయ మీరలు సార్వభౌములై వెలయుచుండఁగనే యీ పెడదారుల దారలయందుఁజేరి యెట్లుజీవించి యుండగలదు ? అని వాపోవుచున్న దనుము. (10) మఱియు నో సుమిత్రాతనయా! "రాజచంద్రా! మీచే నిరసింపఁబడి యడవికి నెట్టఁబడిన యీ నేలపట్టి యెట్టితపమాచరించిన భావిజననమునఁ గూడ మీరలే ప్రాణేశ్వరులగుదురో, తిరుగ నీరీతి వియోగఖేదము రానేఱదో, యట్టిమునివ్రత మవలంబించి రవిమండలనిహితనేత్రయై జీవితమును ముగింప సంసిద్ధయైయున్న దని నివేదింపుమన్న దనుము" సౌమిత్రి భూపుత్రిని విడచి వెడలినతోడనే యా యిల్లాలు వినువారి యుల్లములు తల్లడిల్లునటుల విలపింపఁదొడంగెను. అపుడు ప్రకృతియంతయు విచారమగ్నమాయెను.

గీ. వృక్షములు పూల నెమళులు నృత్యములను
లేడు లాస్యంపుదర్భల వీడియుండె
నామెతో సమముగ దుఃఖమందియున్న
వనమునందునురోదనధ్వనులునిండె." (ఆదిపూడిసోమనాథరావుగారు)

పాఠకమహాశయులారా ! ఆలించితిరా ! ఈవిదుషీలలామధీరోదార భాషితముల. విపత్సమయమున ధీరతను బ్రకటించుటయే క్షత్త్రియకులజాతలగు వీరవనితల లక్షణము. ఈయది యీ భూజాతజీవితమునఁ జిన్ననాటనుండియు విదితమగుచున్నది. ఇంతటితోఁ గాళిదాసుభాషితములఁజాలించి యుత్తరకాండములోని యీ కథానకమునకు రెండవయనుకారమగు కుందమాలయందు దిఙ్నాగకవీంద్రుఁడు పొందుపఱచియున్న సీతాపరిత్యాగరంగమును బ్రకటింతును.

శ్రీ

# ఆంధ్రసాహిత్యపరిషత్పత్రిక.

కాకినాడ.

రెండునెలల కొకసారిప్రకటింపఁబడును.

**(Journal of the Telugu Academy.)**

స పుటము. ౨౭ } బహుధాన్యనామసంవత్సరము. మార్గశిర—ఫాల్గునములు. { సంచిక. ౫-౬.

## మిత్రస్మృతి.

మోచర్ల హనుమంతరావుగారు.

---

చ. కనికర మించుకంతయును గల్గను మృత్యువు తోడునీడయై
వెనుకొని యుండు మానవుని వెట్టియెకాని జగాన సుస్థిరం
బనుకొనరాదు దేనిని నహర్నిశముంబలె బ్రాణికోటికిన్
జననము మృత్యువుంగలుగు సాజముగా మహిఁ గాలనిర్మితిన్. 1

ఉ. ఆసలుపోవు జీవితమునందలి మోహము పోనెపోదు సం
త్రాసము మృత్యువన్న నది తప్పనిదైనను జీవధారికే
గాసియులేక యింటికి సుఖంబుగనేగి భుజించుచో ననా 2
యాసపు మిత్తిఁగాంచితిగదయ్య మహాత్ముఁడవీవు మిత్రమా !

తే.గీ. అస్తమించెను సూర్యరా వస్తమించె
గ్రొత్తపల్లి కులాంభోధి కువలయాప్తుఁ
డాప్తబాంధవదారాసుతాళి వీడి 3
యాంధ్రలోకము బహుళ దుఃఖాబ్ధిముంచి.

చ. విమలయశోనిధాన యెటుపోయెదఁగఁజాలితి ముప్పదేండ్లనుం
డి మనకుఁ గల్గు స్నేహలత నేఁడు నికృత్తమొనర్చి, యయ్యమా
రమణ పదారవింద మకరందమునందలి మేఁటియాస న 4
శ్రమ మరణంబుఁ గాంచితివె శాశ్వత దివ్యసుఖాభిలాషివై

మ. తన దారింజనుగాని తానితరసందర్భంబులం బోని స
జ్జన మాన్యుండగు పుణ్యమూర్తి బహుభాషాజ్ఞానసంపన్నుఁ డె
వ్వనికిం గీడుఁ దలంపనట్టిఘనుఁ డాపద్బంధుఁ డీరీతివాఁ
డనుచున్ మిత్రముఁగూర్చి స్తోత్రమును జేయం జాల నే నిచ్చటన్.

క. హనుమత్సూర్యకపీశ్వరు
లను పేరునఁ బుస్తకంబు లలరింతమటం
చును నీవు కొన్ని వ్రాసితి
వనఘా నీవలర వ్రాయనైతి నొకటియున్. 6

మ. నవలల్ నాటకరాజముల్ మఱిప్రబంధంబుల్ మహావ్యాసముల్
వివిధంబుల్ బలుపోకడల్గల వరబ్బీమున్నుగాఁ గల్గు నూ
త్న విదేశీయ కళానువాదములు గ్రంథంబుల్ వినిర్మించినాఁ
డవు గన్నాఁడవు కీర్తి నల్దిశలు నిండన్ సూర్యరాయాగ్రణీ ! 7

మ. కొడుకుం గోడలు లేరు దగ్గఱని నీకుంజింత లేకుండ న
ల్లుఁడునుం గూతురొకర్త భక్తిఁగను నాలున్ జెంత నేయుండ నొ
క్కడుగుంగూడ మెదల్ప కొక్కనుడియే నాడంగలేకుండ గ్రు
క్కెడు ప్రాణంబు హఠాత్తుగా విడిచి ముక్తింగంటివే మిత్రమా ! 8

చ. అఱువదివర్షము ల్కలియుగాయువటందురు నీకు నర్వదై
దరిగెఁ బ్రయోజకుండు సుతుఁ డన్నిట ధన్యుఁడవీవు కాలమె
వ్వరికిని నొక్కరీతి నిలువంబడ దుత్తమలోకముం దయా
పరుఁడగు నీశ్వరుండు సులభంబుగ నీకొసఁగున్ సుహృద్వరా. 9

తే.గీ. ఆంధ్రసాహిత్యపరిషత్తు నందుఁజాల
కాలముననుండి నిర్వాహకత్వమూని
చేసితివి సేవ, మృత్యువు చెంతకొక్క
గంటకే తెంచువఱకు, నొక్కగతి నీవు. 10

తే.గీ. నిన్ను విడువంగలేక మే మిన్నిగతులఁ
జింత వాపోవుచుంటి మేచింత లేక
పరమపదమార్గమును బట్టి యరుగు నీకు
శాంతి సుఖమిచ్చుఁగాత మీశ్వరుఁడు సఖుఁడ. 11

# కవిత్వకళ.

— శిష్టా రామకృష్ణశాస్త్రిగారు, బందరు. —

పాశ్చాత్యులు చిత్ర లేఖనము, విగ్రహరచన, కవిత్వము మొదలైన లలితకళ లనుకరణకళ లని పేరిడిరి. దీనికిఁ గారణము వానియం దనుకరణము ప్రాముఖ్యమగుటయే. సంస్కృతాలంకారికులు లలితకళలలో నొకటైన నాటకముఁగూర్చి చెప్పునపుడు "అవస్థానుకరణం నాట్య" మ్మని నిర్దేశించిరిగాని తక్కిన వే లలితకళకు ననుకరణ మాపాదించినట్లు లేదు. పాశ్చాత్యులలోఁ గొందఱు గానమునకుఁగూడ ననుకరణ మాపాదించిరి. కొందఱకిది నచ్చలేదు. కాని మిగిలిన లలితకళ లన్నిటికి ననుకరణత్వ మంగీకరించిరి.

అనుకరణము మానవస్వభావము. అది ప్రతిమానవునిహృదయమునందుఁ బాదుకొనియున్నది. ప్రకృతిని చిత్రకారుఁడు రమణీయమైన వర్ణములమూలమునను, విగ్రహరచకుఁడు మృత్తికమూలమునను, గాయకుఁడు మధురనాదముమూలమునను,కవి శబ్దసౌందర్యమూలమునను ననుకరించి దాని మహత్త్వమును గ్రహింతురు. విగ్రహరచకుఁ డొకస్థితియందున్న యొకవ్యక్తినిమాత్ర మనుకరింపఁగలఁడు. చిత్రలేఖకుఁ డొకదృశ్యమునుమాత్రమే పటమునందనుకరింప సమర్థుఁడు. కాని కవి భిన్నములైన వివిధపాత్రలను దృశ్యముల నొక్కమాఱు ప్రదర్శింపఁగలఁడు. చిత్రకర్మవిగ్రహరచనలలో క్రియారూపమగు చలనము చూపుటమాత్రము సాధ్యముగాదు ఇది కవిత్వమున సాధ్యమగును. ఈకారణముచేతనే యాకళ వస్తువును సాక్షాత్కరింపఁ జేయును. అనుకరణము కవిత్వమునందు సాగినంతగ నితరకళలందు సాగదు. ఇట్టి విస్తృతియు, చైతన్యమును గలుగుటచేతనే కవిత్వము మిగిలినకళలకంటె శ్రేష్ఠమయ్యెను.

'రసాత్మకం వాక్యం కావ్య' మ్మని చెప్పునపుడు రసాత్మకత్వము శబ్దమునకంటె నర్థమున కెక్కువప్రాముఖ్యమని పండితులంద ఱంగీకరింతు

రు. కాన రసాత్మకమైన యర్థము లేక భావము కవిత్వమనఁబడును. ఆ భావమును వ్యక్తీకరించునది భాష. కానఁగవిత్వమునకుఁ బ్రాతిపదిక భావము. తిక్కనకాలమున వర్ణింపఁబడిన మానవమానసికవ్యాపారములు ప్రతికాలమువారు దమస్వానుభవములకు సరిగానుండుటను గ్రహించి యానందించుటచేతను, నితరదేశీయుల కావ్యములందలి భావముల మనము చదివి మన యనుభవములకుఁగూడ సమన్వయించుకొని యానందింపఁ గలిగి, యాభావములను భాగములను మనము మన భాషలోనికిఁ బరివర్తనము చేసికొనుచుండుటచేతను, మానవమానసిక ప్రవృత్తులు సర్వకాలములందు నొక్కవిధముగనే యుండుననుట నిశ్చయము. భాషభిన్నమైనను, భావములు విశ్వజనీనములగుటచేతను, గవిత్వ మాభావముల వ్యక్తీకరణమే యగుటచేతను, గవిత్వము విశ్వజనీన మని యొప్పుకొనవలసి వచ్చుచున్నది.

అరిస్టాటిలు తనవిమర్శనశాస్త్రమందు మూఁడు ప్రధానలక్షణములఁ దెలిపెను. ఒకటి,యితరలలితకళలతోఁబాటు కవిత్వముయొక్క కర్తవ్య మనుకరణముగాని యుపదేశముగాదు. రెండు, కవిత్వమనుకరింపఁదగిన విషయము విశ్వజనీనమై యుండవలెఁగాని ప్రత్యేకవ్యక్తిగతము కాఁగూడదు. మూఁడు, కవిత్వోత్కృష్టతను బరీక్షించు ప్రయోజన మే మన నది శాశ్వతమైన యానందము సంఘమునకుఁ గూర్పవలెఁగాని కవికిమాత్రము గలుగఁజేసినఁ జాలదు.

కళలయం దనుకరణము మూలము నెంత సమీపించిన దానియోగ్యతయంత పెరుఁగును. కాని సంపూర్ణముగ నేవస్తువునైన ననుకరించుట యేకళకైనను సాధ్యముకాదు. మఱియుఁ గళాకార్యమునకు సంపూర్ణానుకరణ మనావశ్యకము. ఎందు కనఁగా కళపని వస్తువును గుర్తించుటకుఁ గావలసిన ముఖ్యధర్మముల మనస్సునందుఁ బ్రతిబింబింపఁజేయుటయే గాని, దాని సూక్ష్మములైన వివిధాంగోపాంగముల జ్ఞానము మనమెదపున తికకించుటకాదు. కవి తన యింద్రియములకు గోచరించునట్లు ప్రపంచము

ననుకరించునుగాని, మూలమునకు నకలుసేయఁ జూడఁడు. మఱియుఁ గవిత్వము ప్రతిప్రాకృతిక వ్యాపారము ననుకరింపదు. ప్రపంచమునఁ గుత్సితవస్తువులనేకములున్నవి. కవిత్వము వాని జోలికిపోదు. కనుకనే యేమహాకవియు నాహారాది శారీరకక్రియలను వర్ణింపఁడు. సంస్కృతాలంకార శాస్త్రములందుఁ గూడ వానిఁ జూపింపగూడ దను నిషేధముగలదు. లలితకళలు నైతికలక్షణములను, హృదయపూర్వకముగఁ జేయఁబడినకార్యములను మాత్రమే యనుకరించును, మానవజీవితమును,—శీలము, ఆవేశము, చేష్టలు—నింద్రియగోచరమగురీతిని గళయనుకరించును. అందుచే భూసీమ, మృగవృక్షపక్ష్యాదులు ముఖ్యానుకరణవిషయములు గావు. చర్యలకు రంగస్థలముగ నుండుటకై యివి బాహ్యప్రపంచమునఁ బ్రవేశపెట్టఁబడును. అనుకరణము రెండువిధములు. మొదటిది బహిరంగానుకరణము. ఇందు వస్తువుల బాహ్యరూప మనుకరింపఁబడును. రెండవది యంతరంగానుకరణము, ఇందుఁబాత్రల భావము లనుకరింపఁబడును. బహిరంగానుకరణముకంటె నంతరంగానుకరణముసేయు కళయే జనుల నెక్కువ యాకర్షించును. వస్తువుయొక్క యంతరంగమును జక్కఁగభావనచేసి యనుకరింపఁగల్గిన శిల్పిగల్గెనేని మనము సామాన్యముగ నావశ్యకములని తలఁచు బైటియంగములుఁగూడఁ గొన్నినిరర్థకము లనిపించును. అట్టియంతరంగానుకరణము కష్టసాధ్యము.

ఇట్టి యనుకరణము విశ్వజనీనమైయుండవలయును గాని ప్రత్యేకవ్యక్తిగతమైయుండరాదు. ప్రపంచమందలి సకలమానవులమానసికవ్యాపారములు సర్వదేశకాలములం దేకముగనుండునని వెనుకఁ దెలిసికొంటిమి. కాననొకవిషయముఁగూర్చి ప్రపంచమునందు సకలమానవులకు నైక్యముగ నెట్టిభావముగలుగునో యది విశ్వజనీనము. నిర్దిష్టశీలముగల యొక పాత్రే యొకానొక పరిస్థితియందుఁ దదవసరముఁ బట్టి సందర్భోచితముగ నెట్లు మాట్లాడి ప్రవర్తించునో యది విశ్వజనీనమనఁబడును. నామధాములైన పాత్రలుగల కవిత్వ మిట్టి విశ్వజనీనత్వమే లక్ష్యముగాఁ

గలది. కవి యొకానొక ప్రత్యేకవ్యక్తిగతవిషయమును గ్రహించి దానికి విశ్వజనీనతాముద్ర నొసఁగును, కవిమూలమునందున్నది కొంత, యుండ వచ్చునది కొంత, యుండవలసినది కొంత చూచి యూహించి విశ్వజనీనముగ నుండున ట్లనుకరించును. ఇదియే కళాధర్మము. సర్వజనులు విశ్వజనీనముగ ననుభవించి భావించునొకదృశ్యము నెవఁడు చిత్రించునో వాఁడే నిపుణుఁడైన మహాశిల్పి. అతఁడే కళయొక్క మూలమునంత సమగ్రముగా నెఱిఁగినవాఁడు. ప్రకృతియొక్క విచిత్రరహస్యముల గ్రహించుట కెట్టిపద్ధతుల నవలంబింపవలెనో యతనికే తెలియును.

ఒకకథయొక్క సంఘటన పరంపరనొకటి తరువాత నొకటి యెట్లు జరిగెనో యట్లు కాలక్రమముగ 'జాబితా' వలెఁ జెప్పుట కవిత్వముకాదు. ఇది చరిత్రపని. చరిత్ర ప్రత్యేకవిషయములగుఱించి చెప్పును. కవిత్వము విశ్వజనీనవిషయములఁ గూర్చి చెప్పును. చరిత్రయందుఁ గాలక్రమము ననుసరించి చెప్పఁబడిన సంఘటనలు కార్యక్రమముగ నుండునట్లు, నొకసంఘటనమునకు మఱియొకసంఘటనమునకుఁ గలసంబంధమును కార్యకారణరూపమునఁ గలిపి యాసంఘటనలను విశ్వజనీనములైన సత్యములుగనుండునట్లు కవిత్వము మార్చును. భూతకార్యము నున్నదున్నట్లు చెప్పుట కవికర్తవ్యము కాదు. తదవసరపరిస్థితులంబట్టి యెట్లుజరుగునో, మఱియు నెట్లుజరుగసాధ్యమో చెప్పుటయే కవిపని. సంఘటనలమార్చి చెప్పకపోయినచోఁ గవిత్వమునకు గౌరవము లేదు; మార్చిచెప్పినచోఁ జరిత్రకు గౌరవము లేదు. చరిత్రకారుఁడును గవియు గద్యపద్యములందు వ్రాయుటచే భిన్నులుగారు. శ్రీయుత చి. వీరభద్రరావుగారియాంధ్రులచరిత్రను బద్యరూపముగ రచించినను నది చరిత్రయేయనిపించుకొనును. కానఁగవిత్వము చరిత్రకంటె నెక్కువయుత్తమమును దాత్త్వికమునైనవస్తువుగలది. చరిత్రలయందుఁ బురాణములయందు నక్కడక్కడఁ గొన్ని రసవంతములైన యుత్కృష్టసంఘటనలుండును. కవి వానినేరి యాదర్శప్రాయముగఁ జేయును.

అద్యతనకాలమున వెలువడుచున్న భావకవిత్వ మనుపేరుగల
...డకావ్యము లుద్రేకపూరితములయ్యు సర్వజనాదరణపాత్రముకాకపో
...టకుఁ గారణ మందలి భావములు విశ్వజనీనములు కాకపోవుటయే.
...నుఁగవులు దమసొంత గోడును జెప్పుకొనుచుఁ దమప్రత్యేకవ్యక్తిగత
...వములనే వెలువరించిరిగాని, తమభావములకు నితరులభావములతోఁ
...లసంబంధమును విచారించి వానిని విశ్వజనీనముగఁ జేయరైరి, కవిభా
...ములు వేఱును పాఠకజనుల భావములు వేఱునైనవి. అందుచే జనులు
...రిభావములతో సహృదయత్వము నెఱపి, వారికవిత్వ మర్థముచేసి
...నఁ జాలరైరి. కవిత్వమున విశ్వజనీనత్వమునకుంగల స్థానమిది.

ఇట్టివిశ్వజనీనత్వమునకు సాధారణాగత్యధర్మముల ననుసరించి యే
...సాధ్యమో యది ముఖ్యలక్షణమై యుండవలయును. కళలయందు సా
...మైన యసాధారణవిషయముకంటె నసాధ్యమైన సాధారణవిషయ
...నే గ్రహింపవలెను. సాధారణమనఁగ సామాన్యమనికాదు. సామా
...మనఁగఁ గొందఱియందుండునది, సాధారణమనఁగ లోకమునందంతట
...ండఁదగినది. కావ్యమున నసాధ్యవిషయముకంటె నసాధారణవిషయ
...క్కువదోషమైనది. ఇక్కడనే కవిత్వమునకు శాస్త్రమునకు భేదము
...లదు.

శాస్త్రకవిత్వములు రెండును బ్రకృతిని బరిశోధించి సత్యమును
...లువరించుటకే ప్రయత్నించును. కాని భిన్నలక్షణముగల సత్యమును
...న్నమార్గముల వ్యక్తీకరించును. శాస్త్రము సత్యసంఘటనమును, కవి
...ము సత్యభావమును దెలుపును. శాస్త్రము భౌతికప్రకృతియందలి
...థార్థవస్తువులఁ గూర్చి యున్నదున్నట్లు చెప్పును. శాస్త్రము విభజన
...లమునను, గవిత్వమనుకరణ మూలమునను దమపనిని సాధించును.
...ప్రకృతిని రసమయదృష్టితోను, శాస్త్రజ్ఞుఁడు పదార్థపరిజ్ఞానదృష్టి
...ను జూచును. శాస్త్రము విజ్ఞానమును, గవిత్వ మానందమును గలు
...జేయును. శాస్త్రమున కాధారము బుద్ధి. కవిత్వమున కాధారము

స్వానుభూతి. శాస్త్రమున కుత్పత్తి స్థానము మెదడు. కవిత్వమున కుత్ప త్తిస్థానము హృదయము. శాస్త్రముయొక్క రాజ్యము సత్యము. కవిత్వ ముయొక్క రాజ్యము సౌందర్యము. శాస్త్రము భౌతికసత్యమును గవిత్వ ము నిగూఢసత్యమును దెలుపును. శాస్త్రజ్ఞుఁడు వస్తువుల రూపములు, గుణములు, నిర్మాణవిధము, సంబంధము మొదలైనవానిఁగూర్చి పరీ క్షించి, వానిని వివిధజాతులుగ విభాగించి, యవి యేపరిణామధర్మమునను సరించి యుట్లుండుటకుఁ గారణమయ్యెనో పరిశోధించి, కొన్నిప్రయోగ ములమూలమునఁ దనపూర్వాభిప్రాయమును బునఃపరీక్ష చేసి నిశ్చయిం చును. ఈవిధముగ శాస్త్రము ప్రకృతియొక్క భౌతికరూపమునందలి యొక్కొక్క వస్తువును బరిశోధించి, వివిధవస్తువుల నొక్కసాధారణధర్మము క్రిందికిఁ దెచ్చి, చివరకుఁ బ్రపంచమునఁ జెదరిన నానావస్తువులం దంతర్భూ తమైనది యొకటేయని విశ్వమున కైక్యమునాపాదించును. ఈవిధమున శాస్త్రము ప్రత్యేకత్వమునందు విశ్వజనీనత్వముఁ గనిపెట్టుటకుఁ బ్రయ త్నించును. ప్రత్యేకత్వమూలమున విశ్వజనీనత్వమును వ్యక్తీకరించుట కవిత్వముయొక్కలక్ష్యము. కొలని యందలి పూవును జూపి యొకసామా న్యమానవు నడిగిన నది, 'పద్మ' మని చెప్పును. శాస్త్రజ్ఞుఁడది యే జాతి పుష్పమో తెలుపును.

కవి దానినే "సరోవరసుందరి" యని యనువదించును. ఇట్లనుటచే నాసుమముయొక్క సౌందర్య సౌకుమార్యము లవగతమగును. మఱియొక కవి దానినే తేజోకుసుమమని వ్యక్తీకరించును. శాస్త్రజ్ఞుఁ డా పుష్పమునే దళములు, కాడ, కర్ణిక మొదలైన యవయవవిభాగముసేసి, దాని యుత్పత్తివృద్ధిక్షయములఁ దెలుపును. ఈవిధమున శాస్త్రకవిత్వములు రెండును సత్యమునే వెలార్చును. కాని మన మాశించునది శాస్త్రజ్ఞుని చేతియందు విభజింపఁబడిన పుష్పముకాదు. కవి పద్మపుఱేకు లుత్తరింపఁ బడుటఁ జూచినచో విలపించును. అట్లు సేయుట కాతనిచేతు లాడవు. కవికే కాదు, మన హృదయముగూడ నట్టిచర్యలకు సమ్మతింపదు. కాన

కవిత్వసత్యమునకు మనకు నెక్కువసన్నిహితసంబంధము; శాస్త్రసత్యము దూరము. ఇట్లు శాస్త్రము వస్తువులయొక్క పుట్టుక, తత్వము, జాతి, చరిత్ర మొదలైనవానితోఁ గూడుకొనిన సక్రమహేతుపూర్వకవ్యాఖ్యానము సేయును. ఇంతే. శాస్త్రజ్ఞుని ప్రజ్ఞయు, దృష్టియు దీనికి వాటిపోలేవు. ఇట్టి విజ్ఞానముగలిగినతరువాత మనకుఁ బ్రకృతికిఁగల సంబంధమెట్టిదో శాస్త్ర మెంతమాత్రము దెలుపఁజాలదు. ప్రపంచములో సామాన్యముగా మానవులందఱకుఁ బ్రకృతియందలివస్తువుల శాస్త్రవిషయకవిజ్ఞానమం దభిరుచియు నాదరణమును బహుస్వల్పము. కాని ప్రకృతికి మానవునకుఁగల సంబంధము ననుభవపూర్వకముగ గ్రహింపనెంచెదరు. శాస్త్ర మీయర్థమునఁ బ్రయోజనకారి కాదు. అందుకొఱకుఁ గవిత్వము నుపాసింపవలసినదే.

కవిత్వము ప్రకృతికి మనకుఁగల సంబంధమును, ప్రకృతిని మనము చూచురీతిని మన యోజనోద్రేకములపరమున, మన భావానుభవములకుఁ దాఁకునట్లు మానవజీవితమును వ్యాఖ్యానప్రాయముగ ననువదించును. ఇట్టి రచనగల కవిత్వము మానవుల భావోద్రేకముల నుద్బోధించు శక్తిగలిగి యున్నది. ఈశక్తియే దీని విశిష్టలక్షణము. ప్రకృతియొక్క రసావిష్టభాగములందే యుద్భవమంది యాదిక్కునుండియే కవిత్వము వ్యాఖ్యానముసేయుచు మనల నుద్రిక్తులఁజేయును. కవిత్వము ప్రకృతియందలి సౌందర్యరహస్యముల వెలార్చును. ఇవి ప్రపంచమునందంతట వ్యాపించి నిత్యము ప్రదర్శింపఁబడియున్నవి. అందఱు చూడవచ్చును. మనముగూడ ప్రకృతిలో నొక భాగమగుటచే మనలోఁగూడ నాసౌందర్యరహస్యము లున్నవి. కనుక నాగుణములమూలమున నే ప్రకృతియందలి సౌందర్యరహస్యముల గుర్తింపనవకాశము గలుగుచున్నది. ప్రతిమానవుని హృదయమునందొక రసమయకోశమున్నది. కాని యనేకులం దది నిత్యవ్యవహారమందలి యనేకేతరాభిరుచులవలన నణఁచివేయఁబడుచుండుటచే క్షీణించి క్రమముగా మాటుపడుచున్నది. అందుచే

బహుస్వల్పసంఖ్యాకులు తప్ప మిగిలినమానవులందఱు నాసౌందర్య రహస్యముల నల్పవిషయములుగ నెంచి నిరసనభావముతోఁ జూతురు. కాన నది యందఱకుఁ గనఁబడుటలేదు. చూచినదికూడ వెంటనేవారు మఱచిపోవుదురు. ఇందుచే మానవులనేకులాసౌందర్యరహస్యముల నేత్రములుండియుఁ జూడలేరు. చెవులుండియు వినఁజాలరు. హృదయముండియు భావింపలేకుందురు. కానఁ గవికిఁ బ్రకృతియందిట్టి యుపేక్షాభావముండదు. అతఁడు ప్రకృతిభౌతికస్వరూపము నడుగునదాగియున్న పవిత్రమైన దేవరహస్యమును దనసూక్ష్మదృష్టితోఁ జూడఁ బ్రయత్నించును. ఇట్టిశక్తి యతనికిఁ బ్రత్యేకముగ దైవముచే నొసఁగఁబడును. కొన్నిరసావిష్టసమయములందుఁ బ్రకృతి తనగుణముల విశేషశక్తితో బహుస్పష్టముగఁ గనఁబడుచును. అపుడు మనహృదయములుసూర్యోదయమునకుఁబద్మములు వికసించునట్లు వికసించి, మేఘోదయమున నృత్యమాడు నెమిలివలె దేహము పులకరింప మనము తన్మయత్వమును బ్రహ్మానందమును బొందుదుము. అంతవఱకే మన బులుపు. ఆ యానందమును మాటలతో వ్యక్తీకరింపలేక కాళ్లుసేతులు నటునిటు త్రిప్పుదుము. మాటపెనఁగి రాదు. బలవంతముగా మాట్లాడఁ బ్రయత్నించినచో నత్తివచ్చును. ఇది మనస్థితి. కవిస్థితివేఱు. కవి ప్రకృతియిచ్చిన యీ యరుదైన యవకాశమును గౌరవాదరణలతో గ్రహించి, యానందాశ్చర్యములతోఁగూడిన యొక యావేశానుభవముచే తన్మయత్వమునుబొంది, చంద్రునిగాంచిన సముద్రమువలెఁబొంగును. ఇది వానిలోనున్న తమోగుణమువలన నుద్భవించును. ఇట్టియుద్వేగము పాలుపొంగినట్లు కవిహృదయమునఁ బొంగిననేగాని కవిత్వ మున్నతపదమునొందఁజాలదు. ఆ యుద్రిక్తభావము కంఠగతమై పొర్లఁజూచును. వెంటనే యాభావమును వ్యక్తీకరింపఁ జూచినచో నది సంస్కారశూన్యమైయుండును. కాన సత్కవి తన యుద్రేకమును గొంచెమాపుకొని దైవదత్తమగు సూక్ష్మదృష్టివలనఁ బ్రకృతిసౌందర్యరహస్యముల స్పష్టముగఁ బొడగాంచి యవగతము చేసికొనును. పరేం

గీత జ్ఞానముగల సూక్ష్మదృష్టి కవికి, ఋషికివలెఁ దనయందుఁగల సత్వగుణమువలనఁ గలుగును. అందుచేతనే 'నానృషిః కవిః' "నానృషిః కురుతే కావ్య' మ్మనిరి. పిమ్మట తనభావనాబలముచే నతఁడు దానిననుకరించుచు వ్యాఖ్యాన ప్రాయముగ వ్యక్తీకరించును. ఆభావముల వ్యక్తీకరించుటకై కవికి సృష్టించుశక్తి యుండవలయును. స్రష్టశక్తిచేతనే యతఁడు కవిబ్రహ్మయనఁబడుచున్నాఁడు. కవి కిట్టి సృష్టిసమయమున బ్రహ్మవలె రజోగుణముండును. సృష్టి రజోగుణమువలననేసాధ్యము. అట్టిరజోగుణమువలననే కవి బ్రహ్మయగుచున్నాఁడు. ఈవిధముగఁ గవిమనకుఁ బ్రకృతికి నడుమనిలిచి మనకనులు దెఱచి, మనచిత్తముల నుద్బోధించి, మనల నాప్రకృతిరహస్యముల కభిముఖులఁజేసి, మనముచూడలేనివస్తువుల మనభావనతోఁ జూచునట్లు, మనకునచ్చునట్లనువదించును. ప్రతిమానవునియందు నాప్రకృతిలక్షణములును, రసమయకోశమును గొంతగానైననుండును గాన మనము సమ్మతించి కవిపొందిన యావేశానందములనే పొందుదుము. ఈవిధముగ మనముగూడ ప్రకృతిసౌందర్యానుభవమునందుఁ బాల్గొనునట్లు కవులుసేయుచున్నారు. ఇది కవిత్వముయొక్క శక్తి. ఇట్టికవిత్వము లేనియెడల మనము బ్రకృతిరహస్య మెఱుఁగనియంధులమగుదుము. కవిత్వము పాఠకులమనస్సులకు సంస్కారము గలుగఁజేసి ప్రకృతి నభినందించు శక్తినొసఁగుచున్నది. ఇది విశ్వజనీనమైన సత్యమునకుఁ బ్రియమును బ్రత్యక్షమునైన స్వరూపమునిచ్చును. ఇందలి విశ్వజనీనసత్యము నిరాకారమైన భావముగాక సజీవప్రక్రియగల యాకారముగలది. కవిత్వమందుఁగల యిట్టియుద్రేకశక్తి శాస్త్రమందుఁగాని, చరిత్రయందుఁగాని లేదు.

---

# వ్యాకరణశాస్త్రప్రశంస.

ఉభయభాషాప్రవీణ మల్లాది సత్యనారాయణశాస్త్రిగారు.

---

మఱియు భాషాభివృద్ధినిఁబట్టి వ్యాకరణశాస్త్ర గ్రంథ సంఖ్యాభివృద్ధియనియు నదికారణముగ వెనుకటి వ్యాకరణగ్రంథములనే పట్టుకొని వ్రేలాడక క్రొత్తవ్యాకరణ గ్రంథములను వ్రాసికొనవచ్చుననియు నీగ్రంథములవలన మహాకవి ప్రయోగముల ననేకములను సాధువులుగఁ జేయవచ్చుననియుఁ గొందఱు చెప్పుచున్నారు. అనఁగాఁ గొన్నిపదములు మాత్రమే యాకాలమున నుండినవనియు వానికి మాత్రమే యప్పటివారు శాసనములను వ్రాయఁగా నాతరువాతికాలమునఁ బెఱిఁగిన పదములకుఁ దరువాతివారు నియమముల నేర్పఱిచిరనియు నట్లుకాని-చో శాకటాయన ప్రభృతుల శాసనముల సమగ్రముగఁ గూర్పఁబడ నేలయనియు వైయాకరణులు పాణిని కాత్యాయన పతంజలులయందుత్తరోత్తర ప్రామాణ్యముంచుటకుఁ గారణముకూడఁ బాణినికంటెఁ గాత్యాయనుఁడు నాయనకంటెఁ బతంజలియుఁ గ్రొత్త క్రొత్త శబ్దముల సాధుత్వము నంగీకరించు శాసనముల నిర్మించుటయే యనియు నాకారణమునఁ గ్రొత్తవ్యాకరణ గ్రంథములను వ్రాసికొనినచోఁ దప్పులేదనియు నందులకుమహాప్రయోజనము మహాకవిప్రయోగసాధుత్వసంపాదన మనియు భాషకు నెప్పుడు పెఱుఁగుటయను స్వభావము గలిగినను నాస్వభావ ప్రవాహమును వ్యాకరణ మనుపర్వతప్రాయసేతురచనచే నరికట్టఁ జూచుట యాప్రవాహముయొక్క జీవాంశమునకు భంగముకలిగింపఁ జూచుటయే యనియు వారితాత్పర్యము.

ఆయంశములు చర్చింపఁదగినవి.

లక్షణకర్తలు మొదట లక్షణములను వ్రాయునపుడు కొన్నిపదముల విషయమునసే తమచూపును బ్రసరింపఁజేయుట సత్యము. అది

కారణముగఁ బైయంశములను నిర్ణయించుట మాత్రము నిజముగ నాభాషకు నపభ్రంశత్వ లక్షణసంపూర్ణద్రోహమునందింపఁదలంచుటయే. స్థలయన మునిత్రయమునందుఁ దరువాతి వైయాకరణులకు నుత్తరోత్తర ప్రామాణ్యబుద్ధిగలుగుటకుఁ గారణము వారు క్రొత్తక్రొత్త శబ్దముల సాధుత్వము సంపాదింపఁ బూనుటకాదు. అట్లైయైనచోఁ బతంజలి మహర్షి "గావీ"ఇత్యాదిపదముల నపభ్రంశముల క్రింద ననఁగ గ్రామ్యముల క్రిందఁ జేర్ప నేల? వానికిఁగూడ నేదోయొక శాసనము వ్రాసినచోఁ గాదని యడ్డుపెట్టువారెవరు? కొన్ని పదములు వర్ణాగమ, వర్ణవ్యత్యయ, వర్ణ వికృతి, వర్ణనాశముల, నంది రూపాంతరత్వమొందుటయు సద్దాని మూలమున భాషకొంచెము పెరుఁగుటయు విరుద్ధముకాదు. భాషాంతర సంపర్కము భాషాభివృద్ధికిఁ బ్రధానకారణము కాదని యామాట నెత్తనైతి. అట్టివర్ణాగమాదులనొందిన కొన్నిపదములను మాత్రము సాధువులనుజేసి గ్రహించుటయు నామార్పెగల కొన్నిపదములను విడుచుట యును బతంజలిమహర్షి యేమిహేతువుఁదలఁచి చేసెనో తెలియకున్నది. పాణినిమునియు"లోపశ్శాకల్యస్య"యను మొదలగు మున్యంతరమతాంగీ కారము నేల చేయవలసివచ్చెనో? మతాంతరాంగీకారముచేయు నతఁడు ప్రామాణికుఁడైననే చేయునుగాని క్రొత్తవానికి సాధుత్వముచేయఁబూను నతఁడు మతాంతరము నంగీకరింపఁడుగదా. కనుక నతనియుద్దేశ్యముకూడ నేమైయుండునో? నాయభిప్రాయము శిక్షితాశిక్షితవిద్యుల వ్యవహార స్థములగుటచేతనే యాపదములట్లు వైయాకరణాదృత్యనాదృతుల నంది నవని (అనగా శిక్షితభాషుల పరస్పరవ్యవహారమున మెలఁగు పదముల నాదరించుటయు నశిక్షితభాషుల పరస్పరవ్యవహారమున మెలఁగు పదముల నాదరింపమియు వైయాకరణులపనియని తాత్పర్యము. శిక్షితభాషు లనఁగ శుశ్రూషాపూర్వకవిద్యాగ్రహీతలు. అశిక్షితభాషులనఁగ శ్రవణ మాత్రోపలబ్ధమాత్రాదివ్యవహారస్థపదవ్యావహారికులు.) అట్లు కానిచో నాపదములు చేసినపాపమేమి? అవియు వర్ణలోపాదుల నందినవియే

కదా. కనుక వ్యాకరణము వ్రాసినపిమ్మటఁ గ్రొత్తగవచ్చిన శబ్దములకు సాధుత్వసంపాదనము మునిత్రయమువారు చేయఁబూనను లేఁడు. ఆకారణమున నారియందుఁ బ్రామాణ్యబుద్ధి గలుగను లేదని తేలుచున్నదికదా.

మఱియుఁ బాణినిమహర్షి పూర్వాచార్యుల శాసనములయందు లాఘవగౌరవాదులను బర్యాలోచనచేసి తాను వారికంటె నధికలక్ష్యదర్శిగావున నంతకన్న లాఘవసమగ్రతలు కలుఁగ వలెనని సూత్రరచనకుఁ గడంగుటయేకారణముగ నాయనయందు నాయన యెంతశక్తిగలవాఁడైన మఱచునది జంతుసహజాతముగనుకఁ గొన్నిపదముల విషయము మఱచెఁగా నాయనకంటె నధికతర లక్ష్యదర్శియగు కాత్యాయనుఁడు వార్త్తికములను గొన్నింటిని వ్రాయుట కారణముగ నాయనయందు నాయనయుఁ గొన్నిమఱచుటచే నంతకంటె నధికతమలక్ష్యదర్శియగు పతంజలిముని యాసూత్రవార్త్తికముల యావశ్యకతానావశ్యకతలను విమర్శించి యందలి లోటుపాటులను సవరించి కొన్నిటఁ గ్రొత్తభాష్యేష్టలను నిర్మించి లఘుత్వసమగ్రతలను గనఁబఱచినందున నాయనయందు నుత్తరాభివృద్ధిగ సర్వవైయాకరణులకుఁ బ్రామాణ్యబుద్ధి యేర్పడినదేగాని శాసననిర్మాతలైనంతమాత్రమునఁ గలుగలేదు. కనుకనే "లుపియుక్తవద్వ్యక్తివచనే" ఇత్యాదులను బాణినిమహర్షి కాదనుట సంగతము లేకపోలేదు. మఱియు సర్వపదజ్ఞానము సర్వేశ్వరునిదిగాని యెంతమోగులైన మనుష్యులుగాన వీరిదిగాదను కారణముచే వీరికిఁగూడ మఱపు మొదలైన ప్రాకృతజనసహజధర్మముల నాపాదించినందులకు మన్నింతురుగాక. కనుక శాకటాయనాదిప్రథమ వైయాకరణులు కొన్నిపదముల విషయము మఱచియుందురనిన నొకదోషముకాదు. ఆకారణమున భాషాభివృద్ధినిబట్టి వ్యాకరణగ్రంథాభివృద్ధియని నిర్ధారణయుండఁగూడదు. భాషాభివృద్ధి జనసంఘాభివృద్ధినిబట్టి యేర్పడవలసినదేకాని తీరికూర్చుండిన యొకరిద్దఱివలన నగునదిగాదని "లోకాచ్ఛలౌకికా"యను భాష్యమును

ట్టి తెలియుచున్నదిగదా. అట్లే భాష యెవరిచేతను వికారమునొందిం
ను బడదని "సిద్ధా"యనుపదమువలనఁ దెలియుచున్నది. అనఁగా లక్షణ
ర్తలు భాషను మాఱుపలేరని తాత్పర్యము. అట్టి జనసంఘము తనకు
వ్యవహారములో నెంతయవసరమో యంతకంటె నొకపదమునైన నధిక
ముగ భాషలోనికిఁ జొరనీదు. అట్లు చొరనిచ్చుట స్వభావవిరుద్ధము.
ట్లయినచో నీప్రపంచములోనిభాషలలో వ్యవహారమునకు నవసర
ముగు పదములకంటెఁ జాల యధికముగఁ గలవుగదా? యవి యెట్లు
చ్చినవని ప్రశ్న రాకపోదు. అందులకు నొకజనసంఘమువ్యవహారము
నకుఁ జాలినంతభాష పెఱిగినకాలమున నాభాషలోఁ గూర్పఁబడిన వా
క్యాదుల భాషమార్పుచెందక యట్లేయుండును. వ్యవహరింపఁబడు భాష
కాలముగడచినకొలఁదిఁ బ్రయోక్తల యభ్యాసపాటవాది లోపము
ల ననుసరించి వర్ణలోపాదులు గలిగి పదములు మాఱుచుండును. ఇట్లు
మాఱినభాషలోని పదములును బైవాక్యాదులలోని పదములును(గొన్ని
మార్పు లధికమగువఱకు) నేకభాషలోనివిగఁ బరిగణింపఁబడును. ఆకా
రణముచేఁ బ్రపంచభాషలలో నవసరమునకుమించిన పదజాలము కనఁ
బడుచున్నదని లఘుసమాధానము. అప్పటి శిక్షితజనవ్యవహారస్థపద
ముల వాక్యపద్యాదులలోఁగూర్చి వాని నానియమములతోఁ బాటు వల్లి
వేసి భద్రపఱచువారు పండితులు. అందుముఖ్యముగ వైయాకరణులు.
అపనిసాధారణులకు సాధ్యముకాదు. కనుక వ్యాకరణమును వ్రాయుట
చే భాషాప్రవాహ మడ్డుకట్టఁ బడినదను మాట మిగులఁ బొరపాటని
స్పష్టము కదా. గీర్వాణవాణీగంగాప్రవాహము ప్రథమదంపతి హిమ
శైలములనుండి బయలువెడలిన కొలఁదిదూరముమాత్రమే యనప
నాహిత స్వరూపము గలిగి పిదప గమనవేగస్థలవిశేషపతనప్రభృతు
లచేఁ గ్రమకలుషత్వమునందుచుండ నాస్థితినిగాపాడుటకై మహర్షులు
తమతమసమయానువర్తులై సంస్కారవస్త్రమున వడియఁబోయ సమ
కట్టి సూత్రనిర్మాణమునకుఁ బూనుకొని రనిన సమంజసమని తోఁచెడిని.

ఆప్రవాహ మడ్డంకు లేకుండ నడచుచుండుటచే నానావర్ణములు నానా గుణములుగలదగుచుండుటయు నసంభావ్యముగాదు. అంతియకాని యెవ రు నాప్రవాహ మఱికట్టఁజూడలేదు. అనఁగా నాపనిసంఘమునకుఁ గాక యొక రిద్దఱిముగ్గురకు సాధ్యము గాదనియు, సంఘమట్టిపనికిఁ బూనుకొన దనియుఁ దాత్పర్యము. అట్టి గీర్వాణభాషాప్రవాహముయొక్క వికృతి రూపములే ప్రాకృతాదిభాషాప్రవాహములనినచో, లోపమేమి ? ప్రాచీన తమములైన చరిత్రలను సూచించు వైదికలౌకికసంస్కృతభాషలు కతి పయదేశభాషాసాధారణములుగఁ బ్రత్యక్షముగఁ గనఁబడుచుండఁ గేవల మానుమానిక మాతృభాషాంతరకల్పన మెందులకుఁ జేయవలసివచ్చె నో ? తెలియకున్నది. అది యీభాషాకుటుంబములోని భాషలకు, నీగీర్వాణభాషయే మూలమనినఁ దమభాషలకు న్యూనత వాటిల్లునని తలంచువారికల్పనమై యుండనోపును. లేనిచో నట్టి యభూతకల్పన మెం దులకు ? ప్రాచీనవాఙ్మయమే యాభాషాప్రాచీనతను వ్యక్తపఱచును గదా ? చిరకాలముక్రిందటి వృత్తము నూహించుట యందమేకాని నిర్ధ రించుట సాహసము కాకపోదు. మఱి యొకవిశేషమేమనఁగాఁజిరకాలము క్రిందట వ్యవహారములోనుండి నట్టియుఁ దమకాలమున సాధారణజన విస్మృతములగునట్టి యాభాషాపదములను బండితులు ప్రాచీనకాలగ్రథి తతద్భాషావాక్యములయందు నామ్రేడించివాఙ్మయములయందుఁ గూర్చు వారై యున్నందునఁ దమతరువాతి వాఙ్మయరచయితలకుఁ గావలసినన్ని పదములను సంగ్రహించియుంచిరని వారియందు మనము సంపూర్ణము గఁ గృతజ్ఞతగలిఁగి ప్రవర్తింపవలెను గాని వారుభాషాజీవములను దీసివేసి రనుట చాల యక్రమము. అట్టివాక్యములలోని నియమములను గనుగొని వెల్లడించువారు వైయాకరణులు. వారు భాషాప్రవాహ మఱికట్టఁజూచి రోసంరక్షింపఁజూచిరో చదువరు లీతూరి గ్రహింతురు గాక. వారు సౌల భ్య ప్రధానప్రక్రియాప్రదర్శకులగుటయేకారణముగ వారియందు మిగి లినభాషాదివేత్తలకందఱకు నట్టిగౌరవ మంకురించెను గాని క్రొత్త క్రొత్త

పదములకు సంస్కారము కల్పించుటచేతఁ గాదు. ఇందులకుఁ బ్రమాణము "శక్తిగ్రహంవ్యాకరణోపమానే" త్యాది గ్రంథమే కనుకఁ గ్రొత్తవ్యాకరణములను వ్రాయఁబూనుటయాభాషకు నసంస్కృతత్వము నందింపఁ బూనుటయేకదా. అట్టి యీవ్యాకరణశాస్త్రము ప్రకృతివిజ్ఞానశాస్త్రమువలె నాకాలమునఁ గనుగొనఁబడి వృద్ధిపొందింపఁబడినది. విజ్ఞానశాస్త్రముప్రళయమువఱకుస్థిరములైన పంచమహాభూతములగుణక్రియల నాశ్రయించి బయలువెడలినది. వ్యాకరణశాస్త్రమో నిమిత్తకారణజన్యమైన శబ్దము నాశ్రయించి యుత్పన్నమైనదని యాభేదముమాత్ర మొప్పవలెను. ఆనిమిత్తకారణములు క్షణికములును అనేకవిధములును గాన వానివలనఁ గలుగునొక్కొక్క శబ్దమును బహువిధత్వమును నచిరస్థాయిత్వమునొందినది. ఆశబ్దములలో నేకవిధానుపూర్వక ప్రతిశబ్దము కొంతకాలమైనను గొందఱిచేతనయిన నొక యభిప్రాయము బోధింపవలె నను నుద్దేశ్యముతోఁ బలుకఁ బడును గాన నాకాలమం దాకొందఱిచేతఁ బలుకఁబడు నాశబ్దములలోనే యేవిశేషములను శిక్షితవిద్యులగువారు గ్రహింపఁగలిగిరో యాయావిశేషములనే యొకచోఁ జేర్చినచో నదియే వ్యాకరణమనిచెప్పఁబడును. ఆవిశేషముల నన్నిటి నొకస్థలమునకుఁ బ్రోగుచేయుటకు సాధనసామగ్రి యధికముగ నవసరము. దానికి మఱపు మొదలగు ప్రతిబంధకములు దప్పనే తప్పవు. కనుకఁ బూర్వవైయాకరణులు లక్షణములను వ్రాయక విడిచినపదములు వ్యాకరణము వ్రాసిన పిమ్మటఁ గ్రొత్తఁగ భాషలోనికిఁ జేరినవేయని యనరాదు గదా. అవి మఱచుటచే మిగిలినవియే. వ్యాకరణము వ్రాసినపిమ్మట భాషవెలుగఁగా వచ్చినపదములే యని పట్టుదలతో వాదించువారి నడుగుచున్నాను. అట్లయినచో మొదటివాఁడు వ్రాసినగ్రంథమును రెండవవాఁడును వానిది మూఁడవవాఁడును జూచి యుండి గదా క్రొత్తవానిని వ్రాయబూనుకొనవలయును ? అట్లయినచో వైదికప్రయోగముల మాట యటుండనిచ్చి లౌకికసంస్కృతశబ్దములలోనే శబ్దమువిషయమై యేరెండవవారు లక్షణమును వ్రాయనక్కఱలేదు కదా. క్రొత్తవాని విషయమైనచో నవసరము. అట్లు జరుగవలసియుండఁగ

వ్రాసినవానికే మఱలవ్రాయుట; యంసుక్రొత్తవాని విషయమంతగ లేకుండుట మొదలగు సంశములమాటకు బదులేమని వచింతురు? ఆలక్షణకర్తలు భిన్నభిన్నదేశస్థులై యుండి యెవరికి వారుస్వతంత్రముగను సంపూర్ణముగ నానాటిభాష కుండిన కట్టుబాట్లనువ్రాయఁబూనుటవలన వచ్చిన పౌనరుక్త్యముగాని భాష పెఱుగుచుండఁ దమతమకాలములలోని ప్రయోగవిశేషములకెల్ల వ్రాయఁబూనుట కారణముగనైన పౌనరుక్త్యము కాదని నాయభిప్రాయము. ఒక్కమునిత్రయమువారును యాస్కాచార్యుఁడును ద్రక్షత్రక్షిన ప్రాచీన వైయాకరణులు పరస్పరమతముల నుగ్గడించుట కాని ఖండించుటగాని చేసియున్నట్లుచెప్పికొనఁ గానైన వినియుంటిమా? అనఁగాఁ గ్రొత్తక్రొత్త శబ్దములసాధుత్వసంపాదనము వైయాకరణాభిమతమైనచో నెందైన. బూర్వవైయాకరణుల కృతుల యందొకరినొకరు తెలిసికొని యున్నట్లుగాని వైయాకరణాభిమతమగు సర్థమాత్రాలాఘవము నపేక్షించి క్రొత్తసూత్రముల నిర్మాణమునకుఁ బూనుకొనినట్లుగానిసూచన లేవియైనఁ గనఁబడుచున్నవా? యని యభిప్రాయము. ఆయభిప్రాయమే యున్నయెడల నొకచోనైన నట్టిది వ్యక్తముకాదా? కనుక భాష పెఱుగుచుండ నా యాకాలములందు నాయావైయాకరణులు వ్యాకరణకరణమునకుఁబూనుకొనిరనుట సయుక్తికమునున్యాయమును గాదు.

అందుచేఁ గ్రొత్తఁగా నిప్పుడు మహాకవిప్రయోగసాధుత్వము నకై వ్యాకరణమును వ్రాయఁబూనుట పైనఁజెప్పిన యసంస్కృతత్వాపాదనమునకే కాని ప్రయోజనమునకుఁ గాదు. జనులవ్యవహారమున కెంత భాష యవసరమో యంతయుఁ బెఱిగినపిమ్మట నప్పటి యాభాషకుండిన కట్టుబాట్లు క్రమముగా సామాన్యజనులవ్యవహారములో సడలుచుండ ననఁగా నపభ్రంశత్వమునందుచుండ నప్పటి వ్యాకర్తలు తమతమ యనుభవములో నున్న యాభాషయొక్క యాకట్టుబాట్లను గ్రోడీకరించిరనియే నిర్ధారణ చేయవలసియున్నది. అప్పటి భాషాపరిస్థితులను దెలుపుటకే యున్ని వ్యాకరణగ్రంథములు బయలుదేరినవి. పాణినికాత్యాయనపతంజలులు సంపూర్ణముగ నాపనిని నెరవేర్చినందునఁ దరువాతిమునీశ్వరులు

మఱల నాపనికిం బూనుకొనరైరి. బోపదేవాద్యర్వాచీన వైయాకరణు లయొక్క క్రొత్తక్రొత్త శబ్దముల సాధుత్వసంపాదనశాసనములు ప్రామాణిక ములైన యెడల వృత్తికారుని "యంగగాత్రకంఠేభ్యో వక్తవ్య"మ్మను వార్తికమువమాత్రము ప్రామాణికము కాకపోవునా? ప్రాచీనకాలము నుండియు భాషలో మెలగుచుండి వైయాకరణులదృష్టిని బడని ప్రయో గవిశేషములవిషయమై క్రొత్తశాసనమువ్రాసినను రమణీయముగాని సర్వ జ్ఞుండైన ఋషియొక్క "అసంయోగోపధాత్" అను నిషేధవాక్యము ప్రత్య క్షముగం గన్పడుచుండ వ్యాఖ్యాతలు సవరింపకయుండ నట్లుచెప్పుటవృత్తి కారునిది సాహసము కాకపోదు. మఱియుం బాత్రవిశేషానుకరణేతరస్థల ములం గవికిని లక్షణకర్తకును భేదమేమి? అనంగాం బ్రవృత్తినిమిత్తము వేఱు కాదని కాదు. భాషాస్వరూపనిర్ధారణలో భేదమేమని యభిప్రాయ ము. లక్షణకర్త యాప్రయోగము నట్లనుశాసించుటకు లక్ష్యజ్ఞానములేని వాండా? కవికిమాత్రము పూర్వకాలికప్రయోగపరిజ్ఞాన మవసరముకా దా? పూర్వకాలికప్రయోగములును బరకాలికప్రయోగములు నేకొం తకాలమునన్నోకాక యెల్లప్పుడు వాడుకభాషలో నిమిడి యుండవుగదా. పూర్వకాలికప్రయోగము లంతరించుచుండం బరకాలికప్రయోగములు తలలెత్తుచుండును. కనుకనే ఋగ్వేదములోం గనంబడు ప్రయోగవిశేష ములుతరువాతివేదములలోం గనంబడకున్నవి.అట్లే సర్వకాలములయందు నాయుభయమునకు సామానాధికరణ్యము సంభవింపదు. అట్లగుటచే వేనినో కొన్నింటిని వీడుట గ్రహించుట జనసంఘమునకు స్వాభావిక మని తెలియుచున్నది. అట్టి సంఘసంబంధియగు భాషలో నొకానొకకా లపు గృహీతవిద్యులభాషకు మాత్రమే వ్యాకరణము గనుంగొనంబడినది. కాన నట్టిభాషలోనికి నగృహీతవిద్యుల యపప్రయోగములు చాలవరకుం జొరంబడవు. కావ్యాదిగ్రంథములుగూడగృహీతవిద్యులభాషలో వ్రాయం బడుచున్నందున నాయుభయమునకు నవినాభావసంబంధ మేర్పడినది. కనుకం గవియుం బూర్వప్రయోగపరిజ్ఞానము కలిగియే యుండవలయు ను. లక్షణకర్తయుం దనలక్షణము సర్వత్రతల్లక్ష్యశరణ్యమగునని కాదో

విమర్శించి యుండవలెను. బాగుగా నాలోచించినచో నిద్దఱును బ్రయోగపరిజ్ఞాతలే. ఇద్దఱకు స్వేచ్ఛ లేదు. ఇద్దఱి ప్రయోగశాసనములు తరువాతివారిచే నామోదింపఁ దగినవియే. కవి భాషలోని కట్టుబాట్లు వీక్షింపకుండ రమ్యమగు పదగుంభనములచే భాష నలంకరించుచుండును. లక్షణకర్త యాయార్పు, కవ్యభిప్రేతార్థ మెట్లు కలిగియున్నదో విమర్శించి యాభాషలో స్వతస్సిద్ధముగానున్న కట్టుబాట్లమూలమునఁ గలుఁగుచున్న దనివానిని నిరూపణము చేయుచుండును. లక్షణకర్తకుఁ బ్రయోగవిస్మృతి క్వాచిత్కముగ సంభవింపను సంభవించును. కవికి రసాదినిరూపణభారమున బ్రయోగప్రచ్యుతి యెచ్చోనైనఁ గలిఁగినను గలుఁగును. కనుకఁ బ్రయోగవిస్మృతి యుభయసాధారణమే కాని యనుకరణేతరస్థలములలోని శాసనవిరుద్ధప్రయోగములపట్లఁ గవిది మాత్రము కొంచెము పొరపాటు. అప్పు డతనికి నవి సంభవింప వీలయినది. (అనఁగారాకమానవు) కనుకనే పండితులు "నిరంకుశాఃకవయః"యని మన్నించిరి. ప్రసిద్ధప్రయోగవిరుద్ధశాసనము లెప్పుడును లక్షణకర్త చేయఁడు. ఆతఁడు చేసినశాసనములో కప్పుడతివ్యాప్త్యవ్యాప్తిదోషగ్రస్తములు కానోపును గాని యసంభవదోషగ్రస్తము లెన్నటికిఁ గానోపవు. అతివ్యాప్తిగాని యవ్యాప్తిగాని సంభవించినయెడల వ్యాఖ్యాతలు సవరించుచునేయున్నారు. లక్షణకర్తదృష్టిని బడని యనుకృతేతరప్రయోగము కవి ప్రయోగించినచో నది యందఱకు శిరమున నుంచుకొనఁ దగినదియే. కనుకనే "శాస్త్రప్రయోగవచసో శ్శాస్త్రం బలవ దుచ్యతే, అనిష్పన్నే పదే తేన ప్రయోగాశ్రయణం హిత"మ్మనుకారిక యుత్పన్నమైనది. సామర్థ్యము గలిఁగినదని యీకారికకు ననర్థకల్పనము చేయరాదు. లక్షణకర్త భాషానియమముల నెట్లు మాఱుపఁజాలఁడో యట్లే కవియు శక్తుఁడు గాఁడు. ఆసామర్థ్య మొక్క జనసంఘమునకే కలదు. కనుకఁ "బ్రయోగైకశరణా వైయాకరణా" యను నార్యోక్తికి నొక్కొక్క కవిప్రయోగము ననుసరించి వైయాకరణుఁడు తనలక్షణమును సవరించుకొనవలసినదని తాత్పర్యముగాదు. అట్లే యయినచో నావ్యాకరణముతో నెవరికిని బని యుండదుగదా. భాష

యంతయు న్యొక కావ్యములలోనే నిమిడియుండలేదు. ధర్మవైద్యాది శాస్త్రములుగూడ భాషాస్థానములే. అందుచే భాషా సంరక్షణము కవికంటె లక్షణకర్తకు వేయి రెట్లధికముగ నున్నది. పైఁగాఁ గావ్యములలో భాషలోని పదములన్నిఁటిని సమయాను గుణముగ నైనఁ బ్రయోగింప వీలుగాదు. ఆయాపదముల కుంచిన నియమము లన్నియుఁ గావ్యములలో నుపయోగింపను రాదు. చూడుఁడు "వా పుంసి పద్మం నళిన"మ్మనుకోశము పద్మశబ్దమునకుఁ బుంలింగతను గూడ ననుశాసించుచుండ నాలంకారికులు కావ్యములలో నాపదము నా లింగముగ వాడఁ గూడ దనుచున్నారు. ఇట్లే కొన్నిపదములనుగూడ నిషేధించుచున్నారు. కాబట్టి కావ్యములలోఁ గవికి నంతగ స్వేచ్ఛ లేదు. కవికిఁ గవిసమయమను నింకొక బలమైన నియమనమును గలదు. అట్టి కవి లక్షణకర్తకు విధేయుఁడయియే యుండవలయు నని స్పష్టపడుచున్నదిగదా. అయితే "ప్రయోగైకశరణా" వైయాకరణాయనునార్యోక్తికి నర్థమేమని మీరడుగవచ్చును. దానిక్రిందిది సమాధానము. వ్యాకరణ శాస్త్రమొకప్పుడున్న భాషలోని కట్టుబాట్ల నాధారము చేసికొని యుత్పన్నమైనదిగాన నప్పటిప్రయోగవిశేషములే యావైయాకరణులకు దిక్కనఁగాఁ దరువాతి ప్రయోగముల సాధుత్వాసాధుత్వములు విషయ నిర్ణాయకసాధనములని, వానినే యొకచోఁ జేర్చినవారు వైయాకరణులని చెప్పఁబడుచున్నారు. కనుకఁ గవియనువానిచుట్టు, లక్షణకర్త తిరుగ వలసినవాఁడు గాఁడుగదా? మఱియొక్క విషయమేమనఁగ నాంధ్రభాషకు సంస్కృతమునకువలెఁ బ్రాచీనకాలికప్రయోగసాధుతాపరవ్యాకరణ శాస్త్రము పూర్వము కనుఁగొనఁబడి యుండనందున దానియిప్పటి యీ వ్యాకరణము, పూర్వకవి ప్రయోగప్రమాణకము కానోపును. అట్లు సంస్కృతమున కవసరముకాదు. ఆకారణముచే నాభాషలోఁ గవిప్రయోగములకై వైయాకరణుఁడు తన లక్షణమును సవరింపవలసిన యగత్యము గలవాఁడు గాఁడు. దాని కాస్థితి గతించి పోయినది. తెనుఁగునను బూర్వకవి ప్రయోగమును లక్షణకర్త మఱచి విడిచిన యెడల దానివిషయము

మాత్రము లక్షణములో సవరింప నవసరముగాని యన్నింటివిషయముమం గాదు. కారణము తాత్కాలిక ప్రయోగపర లక్షణమునే తాత్కాలికప్రయోగపరముం జేయుట న్యాయముకాక పోవుటయే. కనుకం బేరుప్రోగిన మహాకవుల వచనరచనలను గాక యితరములను జూచి లక్షణమును దిద్దుకొమ్మనుట యసంగతముకదా. క్రొత్తపదములకు వ్యాకరణము వ్రాయనెంచినయెడలం బూర్వవ్యాకరణముతో సంబంధము లేకుండ వ్రాసికొనినచో నంతతప్పులేదుకాని దానివలన నంతగ నుపయోగము కలుంగదని యిదివఱలో నేమనవిచేసియున్నాను. దీక్షితులవారుకవులపై నెంత గౌరవముగలవారో యీక్రిందివిషయమునుబట్టి నిర్ణయింపనగును. ఆయనకవికులతిలకమగు కాళిదాసుని "విమాననా సుభ్రు కుతః పితుర్గృహే" యను వచనము ప్రత్యక్షముగం గనంబడుచుండ నెక్కడనో యున్న భట్టికావ్యములోనిదగు "హాపితః క్వాసి హేసుభ్రు" వనువచనమును దీసి "ప్రమాద ఏవాయమితిబహవ" యని నిందించి యుండిరి. భట్టివ్రాసిన గ్రంథము కావ్యమైనను వ్యాకరణప్రధానకముగాన దానినే పట్టి యామాట యనగలిగిరేకాని రసప్రధానకములైన కావ్యములనుబట్టి యావంతమాటనైన నెచ్చోనైన ననియుండిరా? ఆయనచే సాధారణపాణినీయమై యాకరణులకుం గుమరని యెన్ని కవిప్రయోగములు పాణినీయమునకు సరిపడునట్లు సమర్థింపంబడలేదు? ఎట్టిత్రోవయు లేనిచో "నిరంకుశాః కవయ"యని వదలివేసిరే కాని శాస్త్రజ్ఞుని నిందించినట్లు కవిని నిందించి యుండిరా? అయితే పై భట్టిప్రయోగము ననుకరణముగా గ్రహించి యొకరు సమర్థించియే యుండిరి. సమర్థింపవలసివచ్చినచో బ్రసిద్ధమైన యాప్త శాస్త్రమునందే సమర్థింపవలెం గాని క్రొత్తక్రొత్త శాసనములవలన నాపని సాధ్యముకాకపోవునా? అట్లున్నచో నేప్రయోగము తప్పున వచ్చును? ఋషులయందు సర్వజ్ఞత్వాదిధర్మముల నాపాదించినవారు వారి యెంతకౌశలమును బరిశీలించియుండిరో గదా! భారతభూమి సజీవమై యున్నయెడల వారివిజ్ఞానము మదర్శనమువలననేకాని యిప్పటి మనవలనం గాదని యభిమానము వదలి చెప్పవలసియుండును. లేనిచో

నేదేశమందైన నేకాలమందైన నాప్రకారము కొన్నివేలేండ్లు సర్వకళలతో సర్వసమర్థతలతో సర్వసంపదలతో దయాసత్యశౌచాదిసర్వధర్మములతోఁ గూడినజను లనేకులున్నట్లు కని విని యుంటిమా ? కనుక నారినిఁ గాదని యన్యుని నాసింహాసనముపై నెక్కించుట కృతఘ్నత లోనికిఁ జేరునేమో యని నాకు భయము. ఒక్కయితివృత్తముఁ బరికింపుఁడు యాజ్ఞవల్క్యమహాముని వైశంపాయనుఁడను గురువునాజ్ఞను శబ్దమయములగు వేదముల నగ్నికణరూపమున వెడల నుమిసెననియు నావేదములు భూమిపైఁ బడి నశింపకుండ నావేదాధిదేవత లగ్నికణములను మ్రింగఁగల తిత్తిరిపక్షులై గ్రహించె ననియు నున్నదిగదా! ఇందుశబ్దము తేజోరూపమును బొందెనను నది సాధారణులకు గోచరించు విషయమేనా ? వినువారు నమ్మియుందురా ? ఇప్పుడు రేడియో యంత్రములలో జరుగుచున్నది ప్రత్యక్షమగుచున్నది యేమి ? ఈయంత్రములలోని యీయంశమును గన్నులారఁ గనుఁగొన్నవారు వెనుకటి యితివృత్తము నిజేఁగియున్నచో నేమైపోదురో! పాశ్చాత్యవిద్యలలోఁ బరిపూర్ణులై మనవిద్యయందుఁ బ్రవేశముగల మనదేశీయులగు పెద్దపెద్దలు ఇప్పటిసర్వవిజ్ఞానము వెనుకటివిజ్ఞానలేశముతో సరిగాదని యుద్ఘోషించుచుండఁ బండితులే వారినట్లు క్రిందుఁజేయ యత్నించుట యన్యాయముగదా ! కనుక బోపదేవాదులు మనకంటె సర్వజ్ఞులని చెప్పఁబడినను మహర్షులముందఱ చెప్పఁదగినవారు కారు. "పణినాపత్యాదులు" పాణినీయమునకుఁ గుదురనిచో "నిరంకుశాఃకవయ"యని మన్నించుటే యుచితము. ఇట్లెన్ని వేలు లేవు ? కవి పొరపడిచెప్పిన యంశముల నటుండనిచ్చి కావలెనని ప్రత్యేకముగఁ జెప్పిన యంశములమాట కేమి బనులు ? చూడుఁడు. "పప పతామి హాహా భభ భూతలే" మొదలగు ప్రయోగములనుబట్టికూడ లక్షణమును సవరింప నవసరమేనా ? అట్లయినచోఁ బాణినీయమునే వదలివేయుట మంచి దనుఁడు. పతంజలి మహర్షి "యస్మిన్ దశసహస్రాణి పుత్రే జాతే గవాందదౌ బ్రాహ్మణేభ్యః ప్రియాఖ్యేభ్యః సోయ ముఞ్ఛేన జీవతి" యను కవిప్రయోగ

ము నుదహరించుటలోను "చన్దోవత్కవయఃకుర్వన్తి" యనిగౌరవముతో వదలివేయుటలోను తాత్పర్యము, కవిప్రయోగము, పాణినీయలక్షణమునకు దూరముగా నుండవలెననియా? కేవలమును వారప్రయోగము లనే యుదహరింపఁదలచినచోఁ బామరప్రయోగము లెన్నివేలు లేవు? వారియుద్దేశ్యము కవి పామరుఁడనిగాని ప్రామాణికుఁడనిగాని కాదు. కవి కట్టిస్వాతంత్ర్య మవసరము. కొన్నిటఁ బొరపాటులును సంభవించును. కనుకఁ గవిప్రయోగము ననుసరించి లక్షణమును సవరింపఁ జూచుట తమకుఁ బాండిత్యమునందలి యవిశ్వాసముగాని వేరొండు గాదు. మఱియుఁ గవి, యొకలక్షణమునే కాసుకదా ప్రపంచపరిస్థితులనే దిగనాడుచున్నాఁడు, లేదా తాఱుమాఱుచేయుచున్నాఁడు. మహానదియందుఁ దామరలా! లతాభృంగములకు దాంపత్య సంబంధమా! మేఘపర్వతములకు స్నేహబాంధవ్యమా! యీమున్నగు నెన్నియంశములఁ జూపవలెను. కనుకనే కవిని బ్రహ్మ యని, కవిభారతిని భారతియని, యామెకావ్యనిర్మాణమును నియమరహితమై నవరసరుచిరమైన సృష్టియని, యాలంకారికశిరోమణి మమ్మటభట్టాచార్యుఁడు స్తుతించి యున్నాఁడు. కనుకఁ గవి కొన్ని నియమములచే బద్ధుఁడైనఁగొన్నిట సర్వాతీతప్రజ్ఞుఁడై యున్న కారణమున నాతనిప్రయోగము తప్పనుటకు నెరికిని శక్యముకాదు. అతని ప్రయోగమును బట్టి లక్షణమును దిద్దను నీతిగాదు. అతఁడు కావలసినచోట లక్షణకర్త. మఱి యొకచోట నున్మత్తుఁడు; వేరొండుచోటఁ బ్రబుద్ధుఁడు. ఇట్లు పలుతావులఁ బలుపు రవుటచేత నాతని కొక నియమములేదు; లేకపోను లేదు. కనుకఁ గవిప్రయోగమునననుసరించి లక్షణమనునది యవిచారక్షమమని నాయూహ. సంస్కృతభాషలోఁ గావ్యములుగాకయనేకగ్రంథములుదాహరణమునకులభించును గాన లక్షణవేత్తప్రయోగములకైతడుములాడఁబనిలేదు. తెనుఁగుభాషలో నట్టికావ్యేతరగ్రంథములులేనందున నివియే వేమన్న చెప్పినదే వేదమన్నట్లు శిరసావహింపఁదగినవి. కాని వెనుకఁ జెప్పిన ట్లనుకరణమునందును లక్షణముతోఁ బనిఁబెట్టుకొనరాదు

# శ్రీరామోత్తరేతివృత్తము.

సాహిత్యవిశారద కాశీభట్ట సుబ్బయ్యశాస్త్రిగారు.



ఉన్నత సాహితీ సారకోవిదుఁడగు నీదిఙ్నాగ కవిశిఖామణికవిత యసదృశభావకలాలలితమై వెలయుచున్నది. నిజముగా సాహిత్యవిద్యకు వన్నెను గొనివచ్చునవి కవికాలాదులు కావు.మనోహరమగు ధ్వనిలాలిత్యములే. అందువలననే సరససాహితీసంపన్నులగు ప్రాజ్ఞులు ప్రాగ్రూత్తల గణింపక వ్యంగ్యభంగీతరంగితములగు ధ్వనిసంపదలనే కవితాకాంతకు జీవితసౌభాగ్యచిహ్నములనుగా నెన్నుచున్నారు. కుందమాలయందలి సీతాలక్ష్మణ సంభాషణముల వెలయుచున్న భావకలావైభవముల నిటఁ బ్రకటింతును.

లక్ష్మణుఁడు, శ్రీరాముఁడు సీతతోఁ దెలుపుమన్న పరిత్యాగకారణమును వివరించుట.

(1) "ఓపూతచరితా ! సీతా ! నీవు కులగౌరవాదులచే నాకుఁ దగిన సతివనియు, అత్యంతానువ్రతవనియు, పావనోదారగుణశోభితవనియు, సుఖదుఃఖముల నెడబాటు లేని ప్రేయసి వనియు, బాగుగా నెఱుంగుదును. కేవలజనాపవాదదోషనివారణమునకై నిన్నుఁ బరిత్యజింపవలసి వచ్చినది కాని, నీవు దుశ్శీల వని భావించి కాదు." ఇది యార్యపూజ్యపాదుని సందేశము.

(2) సీత:—ఏమీ ! జనాపవాదమా ! సౌమిత్రీ! నాయెడ నేవిమైనఁ జెడు నుడులు వెలువడెనా ?

(3) లక్ష్మణుడు:—లోకవంద్యవగునీయెడ నపవాద మెన్నఁ దగునా ? మహర్షుల ముంగట, లోకపాలుర సమ్ముఖమున, దాశరథి ముందు, నాకండ్ల యెదుట నగ్నిప్రవేశ మొనర్చి పూతచరితవుగాఁ బ్రత్యక్షమై యుంటివి. కాని లోకము నిరంకుశముకదా !

(4) సీత:—కట్టా! ఇట్టి నింద్యావస్థలో నీజనకరాజపుత్త్రి గర్భవతిగాకున్న వెంటనే జీవితమును ద్యజింపకుండునా?

(5) లక్ష్మణ:—అమ్మా! త్వరపడకుము. మాయన్న వేఱొక సంగతినిఁ గూడ నీకుఁ దెల్పుమన్నాఁడు.

(6) సీత:—దాని స్వరూప మెట్టిది?

(7) లక్ష్మణ:—తల్లీ! వినుము శాంతముగా "దేవీ నీవు నామానస సరసిజమున నిలచియుండు గృహలక్ష్మివి. కలలోఁ గన్పట్టు ప్రాణేశ్వరివి. కాంతాంతరానురాగవిరహితుఁడ నగు నాకు జన్మముల నీబొమ్మయే సోమిదమ్మగా నుండఁగలదని నమ్ముము."

(8) సీత:—సౌమిత్రీ! ఆకౌసల్యానందనుని యనురాగ సుందరములగు సందేశవచనము లాలించుటచే నామానసము నలమియున్న పరిత్యాగఖేదతిమిర మంతయుఁ దొలఁగి పోయినది. సౌమిత్రీ? స్వప్రాణేశుఁడు అన్యాసక్తచిత్తుఁడగుచో మానినులకుఁ గలుగు దుఃఖము మఱే యితరకారణములవలనను గలుగనేఱదు సుమీ!

(9) లక్ష్మణుఁడు:—మాతరో! నాసోదరునకు నివేదింప నర్హమగు ప్రతిసందేశ మేదియైనఁ గలదా?

(10) సీత:—మృదుభాషీ! ఈయవస్థలో నాజనరంజకునకుఁ నందఁజేయఁజాలు సందేశ మేమి యుండును? అయినను వినుము. మొదట మాయత్త లందఱకును నామఁ బ్రతినిధిగా నిలిచి వందనముల సమర్పించి ఇట్లు మనవిచేయుము. "శ్వాపదసంఘసంకులమగు విపినాంతరమున నాథునిచే విడువఁబడి యెట్టి సహాయమును లేక యొంటరిగా నున్న ఈపేదఱాలగు కోడలిని వాత్సల్యముతో దీవింపు మనుము.

(11) లక్ష్మణ:—జననీ! తప్పక నీవినయోక్తుల మాతల్లులకుఁ దెలుపుదును. కాని సతీమణీ! మాయన్నకు విన్నవింపనగు పలుకులఁ దెలుపకుంటివదేల?

(12) సీత:—ఆనిశాచరనిశితశాసకునకు నేనేమని సందేశ మంపుదాన ! కాని యిట్లు విన్నవింపుము. మందభాగ్యయగు కామినిపైఁ దలపుచే శ్రేయస్కరములగు ప్రజామోదకార్యముల నిర్లక్ష్యము సేయ వలదనుము. పురుషార్థసాధనమగు శరీరసంరక్షణమున జాగరూకులై యుండుఁ డనుము. రామానుజా ! నా యీమాటలయందు రాజనింద గానవచ్చుచున్నదియా ?

(13) లక్ష్మణ:—దేవీ ! ఈమాత్రమనుటకును నీకధికారము లేదా ?

(14) సీత:—మఱియు నాకోసలరాజుతో "తపోవనసహవాసిని యగు క్షమాజాత వినతయై యిట్లు నివేదించిన దనుము. నే గుణహీను రాలనైనను, చిరపరిచిత ననికాని, దిక్కుమాలినదాన ననికాని, తుదకు సీత నని కాని, భావించి స్మృతిమాత్రముననైన దయఁ జూపు మంటి ననుము."

(15) లక్ష్మణ:—విదేహరాజపుత్రీ! గాయముపైఁ గారపుపొడి పడినట్లు భావగర్భితములగు నీయీవినయోక్తులు ఆదయామయుని చెవినిఁ బడినతోడనే లోరవులుచున్న సంతాపాగ్ని భగ్గుమనక మానదు.

(16) సీత:—ధర్మజ్ఞా! మీయన్న నన్ను వినా యితరకామినుల గలలోఁ గూడ స్మరించువాఁడు కాకుండుటచే నీవ యావసుమతీశునకు వలయు నుపచారములఁ జేయుచుండవలయును. ఏమఱి యుండరాదు సుమా !

(17) లక్ష్మణ:—అమ్మా ! ఇవి నీయుదారహృదయమునకు సాటియగు మాటలు.

(18) సీత. పుత్రికా ! ప్రియంవదలగు నాచెలికత్తియ లందఱి నూరడింపుము. ఈమందభాగినిని సర్వదా స్మరించుచుండుము. (అని రోదనము చేయును.)

(19) లక్ష్మణః—(దుస్సహవేదనతో) కటకటా ! పూత చరిత్రయగు సీతామాతను జేతులార నీభాగీరథీతీరమున విడచుటకును, ఈసాధ్వీమణి యొనర్చు హృదయవిదారకములగు పరిదేవనములఁ జెవులార వినుటకును, మున్నట రణరంగమున ననాయాసముగాఁ బ్రాణములఁ బాసిన నన్ను సమీరకుమారుఁడు సంజీవిఁ బోసి బ్రతికించెను. నే నానాఁడు హనుమానుఁడు నిండు నేస్తముతో నను జీవింపఁ జేసెనని తలంచితినే కాని పగఁ బూని యిట్లేడ్పించుటకుఁ గాను బ్రతికించెనని భావింపఁ జాలనైతిని. (నలుదిక్కులు పరికించి) కట్టా! ఈయడవిలేడి యలు మైథిలీవిలాపముల నాలించి గఱికమేతను మాని విలపించుచున్నవి. ఈరాయంచలు పరితాపపరవశలై రోదనములఁ జేయుచున్నవి. ఈవనమయూరములు నృత్యమును జాలించి జాలిఁజెందియున్నవి. ఈప్రాణులు తిర్యగ్జాతిసంభవంబులైనను ప్రశంసనీయములే. కాని కోసల మానవులు మాత్ర మెంతమాత్రమును స్మరింపఁ దగినవారు కారు.

చం. హరిణములేడ్చెఁ దున్ దొరఁగనశ్రులు పచ్చికమేయ మానుచున్,
గరుణముగాఁ గటావిలపనం బొనరించెడు రాజహంసముల్
మఱి విరమించు నృత్యమును మానిని గాంచి మయూరవారముల్
బెఱిమను లాతి జంతువులె మేలొకయించుక గారు మానవుల్.

శ్రీవడ్డాది సుబ్బారాయకవిగారి యాంధ్రకుందమాల:—

నిజముగా భక్తాగ్రేసరుఁడగు సుమిత్రానందనుఁడు సీతాపరిత్యాగ సమయమునఁ జెందిన దుఃఖ మెంత దుర్భరముగా నుండెనో కుందమాల యందు దిఙ్నాగకవి హృదయంగమముగఁ జిత్రించి యున్నాఁడు. ఈవిదేహనృపాలబాల కోసలరాజేంద్రుని మందిరమునఁ గాలువెట్టినది మొదలు నేఁడీపరిత్యాగసమయము వఱకు నొక్కరీతిని హృదయపూర్వకములగు భక్తిగౌరవములతోఁ దనయునివలెను, దాసునివలె, నాయిల్లాలి కడ మెలంగిన లక్ష్మణునకు, సతీలలామయగు నిలాతనయ నడవిపాల్సేయుటలో నాతని గుండె యెట్లు ఖిన్నమాయెనో యూహింపఁదరమా ?

సీత మఱది పరిదేవితముల నాలించి సూర్యాస్తమయమగుటను గుర్తించి యిట్లు ప్రబోధించెను.

(20) సీత:—లక్ష్మణా! అస్తమయసమయ మాసన్న మగుచున్నది. మనుష్యసంచారభూము లిటకుఁ జాల దవ్వుగానున్నయవి. పిట్టలునికిపట్టుల కెగిరిపోవుచున్నవి. క్రూరజంతుసంతతుల కంఠస్వనములు చెలరేఁగుచున్నవి. కావున వత్సా! ఇక నిట జాగుసేయక నస్వీడి యయోధ్యకు వేగముగా వెడలిపొమ్ము.

సోదరీసోదరులారా! కంటిరా! దిఙ్నాగకవీంద్రుఁ డెంత మనోహరముగ నీ సీతాపరిత్యాగరంగమును జిత్రించియున్నవాఁడో. ఇట్టి ఘనకావ్యరసపూరములు కావా భారతీయమానసరాజీవముల జీవకళావిలసితములనుగాఁ జేయఁజాలినవి? చదువవలెనన్న నిట్టి పావనోదార భావసుందరములగు కావ్యములఁ జదువవలయును గాని, నీరసవిషయ నిలయములగు కవనములు కావు. మృద్వీకఫలముల కుండు మాధుర్యము మృత్తికాగుళికలకు సమకూరునా? పుత్తడి పుత్తడియే, యిత్తడి యిత్తడియే.

(21) లక్ష్మణ:—(చేతులు జోడించి) తల్లీ! శ్రీరామపత్నీ! ఇవి నా తుదివందనములు. వీనిని సావధానముగా గ్రహింపుము.

(22) సీత:—వత్సా! సిద్ధముగా నున్నాను.

(23) లక్ష్మణ:—మాతరో! దైవసముఁడగు మా యన్నయాజ్ఞకు మాఱు పలుకనేఱక నిను దోడ్కొనివచ్చి ఈ నిర్జనారణ్యభూమిని బరిత్యజించిన నా యీ ప్రథమాపరాధమును క్షమింపఁ బ్రార్థించుచున్నాను.

(24) సీత:—కుమారా! పూజ్యులగు మీ యన్నగారి యానలెట్టివైనను మాఱాడక నన్నుఁ గొనివచ్చి కానలో విడిచిన నీ యోగ్యతను గాంచి యానందింతునే కాని యొంతమాత్ర మలుకఁ జెంది నిను నిందించుదానను గాను.

ఆ పావనోక్తుల నాలించి లక్ష్మణుఁడు సీతకుఁ బ్రదక్షిణ మొనర్చి దశదిశలఁ బరికించి యిట్లు ప్రార్థింపఁ దొడఁగెను.

(25) లక్ష్మణః—ఓ లోకపాలకులారా! ఈ గర్భగుర్వి స్వర్గమువఱకు స్వేచ్ఛగా రథసంచార మొనర్చుదశరథసార్వభౌముని యనుంగు కోడలు. రాక్షసానీకముల నరకమునకుఁ బారదోలిన శ్రీరామచంద్రుని ధర్మపత్ని. నాచే నీయడవి నేకాకినిగా విడువఁబడినది. కావున దయామయులగు మీ రెల్లరును రక్షింపుఁడు.

ఉ. దీనతఁ గేలుమోడ్చి వనదేవతలార! నమస్సరించెదన్;
వీనుల నొగ్గి నాదయిన విన్నపముం గృప నాలకింపుఁ డీ;
మానిని నిద్రనున్న విషమస్థితి నున్నఁ బ్రమాద మొందినన్
హాని ఘటిల్లకుండను దయామతి నేమఱ కోముఁడీ యనున్.

చ. సకియలు వాఁకలార!; బలుసాములు దిక్పతులార! మాతరో
యకలుషజాహ్నవీతటిని! యన్నలు కొండల తేఁడులార! చే
రిక మిము లక్ష్మణుం డిదె మదిన్ మదిఁ బ్రార్థనసేయు, రాజపు
త్త్రికఁ గనిపెట్టుఁడీ; కనికరింపుఁడి; కావుఁడి పోయివచ్చెదన్.

(వా॥ సు॥ కవి)

కుందమాలయందలి ఈ సీతాపరిత్యాగరంగము నెన్నిసారులు పఠించినను తనివి తీరకున్నది. అంతచే నీరంగము నింతవిరివిగాఁ బ్రకటించి యుంటిని.

ఇంతటితో నీ సంస్కృతానుకార కావ్య వర్ణిత భావ వివరణముల నిలిపి ఆంధ్రానువాదకావ్యములం దీ సీతాపరిత్యాగఘట్ట మెట్టి ప్రతిభతోఁ జిత్రింపఁబడి యుండెనో ప్రకటింతును. ఉత్తరకాండకథ నాంధ్రములోని కనువాద మొనర్చిన కవులు ముఖ్యముగా మువ్వురు. 1. తిక్కన సోమయాజి, 2. కంకంటి పాపరాజు, 3, వావిలికొలను సుబ్బారావు గార్లు. ఈ మువ్వురును సీతాపరిత్యాగ ఘట్టమును దమకృతులలో మనోహరముగాఁ జిత్రించియున్నారు.

అందుఁ గంకంటివారిచే విరచింపఁబడిన యుత్తరరామాయణములోని కరుణరసభరితములగు సీతాలక్ష్మణసంవాదనాదతరంగములు చెవికిసోకినఁ గాజుతాబొమ్మల కన్నులనుండి కూడ దుఃఖవారిపూరము లవిరతముగ నొలుకఁ దొడఁగును. "అపిగ్రావారోదిత్యపిదళతివజ్రస్య హృదయ"మ్మను భవభూతిసూక్తి సత్యమని తోఁచును. పాపరాజ కవివరుఁ డుత్తరకాండదధిని మథించి సమకూర్చిన ఆంధ్రానువాద నవనీతము నాస్వాదింపఁ జేసెదను.

వేల్పుటేటి యీవలిగట్టునఁ దన్ను దింపి శిరమువంచి కన్నీటిబొట్టులు బొటబొట గట్టుపై రాల వెలవెలఁబాఱి మాటాడనేఱక నిలిచి యున్న మఱదిని జూచి బెగడంది యాజనకనందిని యన్న తొలిపలుకులు.

ఉ. విన్నతనంబు మించెఁ బురి వెల్వడినప్పటినుండి నీ మొగం
బున్న తెఱంగుఁ గాంచి దిగులొందుచు నుండు నిదేమొ యంచు మీ
యన్నకుఁ దత్సహోదరుల కాప్తులకున్ శుభమే కదన్న నీ
కన్నుల నేల నశ్రువులు గ్రమ్మెడిఁ దెల్పు గదన్న లక్ష్మణా!

ఉ. మానసికవ్యథల్ రుజలు మాన్పఁగ నోపిన పుణ్యరాశి గం
గానదిఁ జేరి యుండియు గస్తిపడన్ దగునయ్య వేడ్కతోడుత
నీ నది దాటి తాపసులయింతులఁ గన్గొని భూషణావళుల్
కానుకలిచ్చి దీవనలు గైకొని వత్తము రమ్ము చెచ్చెరన్.

అని యా యమాయకురాలగు నిలాతనయ పలుక సుమిత్రానందనుఁడు మూఁగవానివలె మాటాడక యా ప్రజావతిని గంగయావలియొడ్డునఁ జేర్చి యతిప్రయత్నముచే నశ్రుపాతము నరికట్టుచు పెదవు లదుర నేల నవలోకించుచు నిలిచియున్న రామానుజుని ముఖవైవర్ణ్యము నాసారసాక్షి పరికించి భీతహృదయయై మఱఁదితో నాడిన యావలి జాలి మాటల నాలింపుఁడు.

చం. పరసతు లెల్లఁ దల్లులుగ భావనసేయుదు వెల్లవేళలం
బరధనమన్న హాలహాలభంగిగఁ జూతువు బొంక వెన్నఁడున్

బరుషములాడ నెవ్వరిని బ్రాహ్మణభక్తియు రామసేవయున్
దిరమగు నీకుఁ దండ్రి జననందితకృత్యము లెవ్వి యియ్యెడన్.

కం. మన్ననఁ దొలంగి నిను మాయన్న నిరాకరణచేసి యాజ్ఞనొ నీ కా
యన్నపయి భక్తి దొలఁగెనొ కన్నాయమ నేమిమైనఁ గాఱించితివో

కం. గురునింద యాచరించితొ పరదూషణ చేసితివొ కృపారహితుఁడవై
శరణన్న వారిఁ ద్రోచితొ యరులకు వెన్నిచ్చి వేగ యరుదెంచితివో.

శా. సౌమిత్రీ! భయమయ్యెడిన్ నుడువు మార్త్మాదేవిజామాత యా
శ్రీమత్పద్మదళాక్షుఁ డారవికులక్షీరాబ్ధిపూర్ణేందుఁ డా
హేమక్ష్మాధరధీరుఁ డాయసురమత్తేభేంద్రహర్యక్షుఁ డా
శ్యామాంగప్రభుఁ డామహాప్రభుఁడు లెస్సైయున్నవాఁడే పురిన్.

ఈ పద్యరత్నము విన్నిర్మల ప్రణయముగ్ధయగు ముద్దియ నిజజీవితేశుఁ డా పన్నుఁడై యున్నవాఁడేమో యను వేగిరపాటుతో నాథుని కుశలమును దెలిసికొను నాపుల నేరీతిని ప్రశ్నించునో యాసీటును జాటుచున్నది. ఈ కుశలప్రశ్నము నాలించి లక్ష్మణుఁ డెట్టకేలకు మనసుఁ జిక్కఁబట్టి మెల్లగా పదిని కన్నయాన నెఱింగించుట.

ఉ, ఇంతకుఁ బూనివచ్చి వచియింపక పోదున విన్ము తల్లి ! దు
శ్చింతులు దైత్యుచేఁబడిన సీతను గ్రమ్మఱ నేలుచున్నవాఁ
డెంతవిమోహి రాముఁడని యెగ్గులు వల్కిన నాలకించి భూ
కాంతుఁడు నిందఁజెంది నినుఁగానలలోపల డించి రమ్మనెన్.

ఉ. అంచిత వామలూరు జననాంతర భూముల నిన్ను డించి ర
మ్మంచు రఘూద్వహుం డనిచె నక్కట యెక్కడ నిల్చి యెట్లు వే
గించెద వమ్మ ! యెవ్వరు సఖీజను లయ్యెద రమ్మ! యేమి యూ
హించి దినంబు లింకఁ గ్రమియించెద వమ్మ ! బతివ్రతామణీ !

ఉ. నీవిమల ప్రభావమును నీవినయాదికసద్గుణంబులున్
దేవుఁ డెఱింగియుండియును నిందలకున్ బుయిలోడి యోజగ

త్పావని ! నీవుగోరిన నెపంబున నిచ్చటి కంపినాఁడు గా
క్షీవిరహాబ్ధి నేకరణి నీదఁగలాఁ డతఁ డింకమీఁదటన్.

సీత యీ యసహ్యమగు లోకాపవాదమును, దుస్సహమగు శ్రీరామపరిత్యాగమును విని యాపలుకుల నమ్మఁజాలక సౌమిత్రిని బ్రశ్నించుట.

చ. కళవళ మంది తెల్పితివొ కాక పరాకునఁ దప్పవింటివో
కలనయినన్ రఘూద్వహుఁడు కానలలో ననుఁ ద్రోయఁ బంచునే
తెలిసి గణింపు లక్ష్మణ ! మతిభ్రమ మైనదొ హా ! సహింపు మి
ప్పలుకు లెఱుంగకంటి వెతఁ బాటిలె నీకొక భ్రాంతి యున్నదే.

చ. పతి మతి నెంచెనేమొ తనుఁ బాసి యశోకవనంబులోపలన్
బ్రతుకదె పెక్కునాళ్లనుచుఁ గ్రమ్మఱఁ దాఁ జనుదెంచి శత్రునిన్
హతునిగఁ జేయు నేలు వను నాసగదా బ్రదికించె నాఁటి కా
గతి నిఁక నేమి యాసఁగొని కాయము నిల్పునుఁ దెల్పు లక్ష్మణా !

చ. ఎఱుఁగని మూఢు లాడుకొను నెగ్గులకున్ భయమంది యప్పుడే
కఱకు మనంబుతో విభుఁడు కాననసీమకుఁ బంచెఁ గాక య
త్తెఱఁగొకసారి నన్బిలిచి తెల్పి మనోవ్యథతీర్చి నిన్ను నే
మఱి నని బంపఁడయ్యె నభిమానము గూర్మియు నెంచఁ బోయెనో.

అని యిట్లు సీతామతల్లి తల్లడిల్లి తిరుగ నాభూరమణప్రణయ సమీరణప్రసరణము నిజజీవితమును రవణింపఁ జేయ నిట్లు పలికెను.

శా. ఆకర్ణాయతనేత్రమై మణిమయోద్యత్కుండలద్వంద్వశో
భాకీర్ణాంచిత గల్లమై సురదనంబై సుందరభ్రూయుతం
బై కమ్రస్మితచంద్రికావిలసితంబై యొప్పు శ్రీరామమో
మీకాయంబునఁ జూచు భాగ్య మిక లేదేమో సుమిత్రాత్మజా !

చ. వనముల కేలవచ్చితివి వల్లభుని న్బెడఁబాసి యొంటిగా
నని మునిపత్ను లెల్ల గుమిగూడి యడుగన్ ధృతిమాలి వారి కే

మని వివరింతు నింత విపదంబుధి నేకరణిం దరింతు నే
యనువున నీప్రతిక్షణమహాయుగముల్ క్రమియింతు లక్ష్మణా!

సీ. అన్నలక్ష్మణ! యింక నాలస్యమేటికిఁ
జను మయోధ్యాపురంబునకు నీవు
ముప్పూరత్తలకును మ్రొక్కితినని తెల్పు
మచటి బంధుల నెల్ల నడిగితి నను
మతికృపాళునకు రామావనీంద్రునకు నా
మ్రొక్కుగా నతిభక్తి మ్రొక్కు మీవు
తనయాజ్ఞఁ దలఁ దాల్చి జననింద తనుఁజెంద
నీక కాసలఁ జరియింతు ననుము

తే. భూజనుల బాంధవుల లెస్స ప్రోవుమనుము
తలప నాకేమగడయును దానె యనుము
భావ మెప్పుడుఁ దనమూర్తిఁ బాయదనుము
నెమ్మి మొకయింత నామీఁద నిల్పు మనుము.

తే. పోయిరమ్ము శుభంబులు బొందు నిన్ను
నన్ను మఱవక యుండుమా యన్న యనుచు
గన్నుగవ నశ్రుధారలు గ్రమ్ముకొనఁగ
నన్నెలంతుక దీనమై యడలుచున్న.

లక్ష్మణుఁడు హృదయవిదారకములగు నాయిల్లాలిజాలిపలుకుల నాలించి మనసు చెదర నెట్టకేలకు దిట్టమై పలికెను.

క. చనఁ గాల్గురాక చన కిక్కఁ
జనదని ధేనువునుఁ బాయఁజాలని వత్సం
బునుఁ బోలి జాలిఁగొని యో
జననీ! జననాథుఁ గొలువఁ జనుదునె యనుచున్.

ఉ. అల్లన మ్రొక్కి కాళ్లు వడఁకాడఁ బ్రదక్షిణ మాచరించి మే
నెల్లఁ జలింప హాహారుమని యేడ్చుచుఁ బెద్దయెలుంగుతోడ మా

తల్లిని డించి పోయెదను దాపసకామినులార ! కూర్మి సం
ధిల్లఁగఁ బ్రోవరే యనుచు దీనత లక్ష్మణుఁ డేగె నయ్యెడన్.

అప్పు డాకోసలనృపాలకాంత తల్లడ మందుచు లక్ష్మణుఁడు మరలి తనకడకు వచ్చుచున్నాఁడేమో యనునాసతో నాతని రథమువైపు చూపులఁ బ్రసరింపఁ జేయుటను, పాపరాజకవీంద్రుఁ డతిమనోహరముగ వర్ణించియున్నాఁడు.

తే. రమణి మఱికొంతదాఁకను రథముఁ జూచెఁ
దరుణి మఱికొంతసేపు కేతనముఁ జూచె
గాంత మఱిమీఁద రథపరాగంబుఁ జూచెఁ
బడతి మఱియంతటను వట్టిబయలు చూచె.

రామానుజుఁ డేగినపిదప నాశ్రీరామకాంత యెదను భావించిన తలపులలాలిత్య మెంత మనోహరముగా వర్ణింపఁబడినదియో పరికింపుఁడు.

సీ. ఒడిమీఁద నిడికొని యురముపైఁ జేర్చుట
చేరిక కది కడసారి యేమొ
చెక్కుఁ జెమ్మట చేలచెరఁగునఁ దుడుచుట
చెలిమికి నది తుదిచీటి యేమొ
పుక్కిటితావి కప్పురవీడె మిచ్చుట
యనురాగమున కది యవధి యేమొ
కోరిన పని కియ్యకొనుటది కరుణా
ప్రబంధమునకు ఫలగ్రంథమేమొ
తే. మోము మోమునఁ గదియించి ముద్దుగొనుట
యదియె మోహంపుఁ బనికిఁ దీరుదల యేమొ
మెల నగవుదేరఁ జూచి లోపలి కనుచుట
మేలు చిన్నెల కది పొలిమేర యేమొ.

ఘనాశయులారా! వైదేహీవదనారవిందమునుండి వెలువడిన యీ భాసురానురాగసౌరభసుందరములగు ప్రణయగేయములు వీనుల సోకినం గంటం దడిపెట్టని ప్రాణి యుండునా? ఏనిర్మల ప్రణయపాశబద్ధ లగు సతీమణులు నిజప్రాణవల్లభుల యెడంబాటున కెన్నిరీతులం దల్లడ మందుదురో? యెన్నివిధములం బలవరింతురో యాజాడలన్నియు నిటం బాపరాజ కవిచంద్రునిచేం జక్కగా వ్యక్తీకరింపంబడినవి.

సోదరీసోదరులారా! కంటిరా? మనకంకంటివారి యకుంఠితకావ్య నిర్మాణనైపుణ్యమును? మనసుం గరంగించు భావలాలిత్యనిర్మితికే కవిత యనుపేరు. జీవితలతను జిగిరింపంజేయురసమునకే యమృతమనిపేరు. ఇంతటితోం గంకంటివారి కవితామృతప్రసంగమిని నిలిపి, ఆంధ్రకవిత్వరంగమున సన్నుతికెక్కిన తిక్కనసోమయాజి నిర్వచనోత్తరరామాయణరత్నాకరమునైపు మనసు మరల్తము.

అట సీత లక్ష్మణుని ముఖవైఖరిని గాంచి ప్రశ్నించుట.

ఉ. కారణమేమి నన్ను దశకంఠకులాంతకుం డెగ్గు వట్టెనో
నేరమి గల్గెనో యకట నిక్కము నా కెఱింగింపు మెట్టి దు
ర్వారమహోవ్యథన్ బొరయువాఁడవు కావు వివేకవిస్ఫురతా
చారుఁడ వైన నీవని విశాలవిలోచన గారవించినన్.

రామానుజుని దీనపరిదేవనోక్తులు.

ఉ. ఇత్తెఱంగాచరింపుటకు నే నిది యేటికి నియ్యకొంటి నీ
యుత్తముశాలి నోంబలుక నోపగవచ్చునె యంచు వెండియుం
జిత్తముం గూడందెచ్చికొని చెప్పక పోదని నిర్ణయించి డ
గ్గుత్తిక వెట్టి లక్ష్మణుఁడు కోమలిం జూచుచు నశ్రులొల్కఁగాన్.

ఈపద్యరాజము సాధుజనులకు దుస్సహదుర్వార్త నెఱింగింపవలసివచ్చినపుడు సజ్జనచిత్త మెట్లు వ్యాకులాయత్తమై యుబ్బుతలూగునో వివరించుచున్నయది. లక్ష్మణుఁడు సీతకు శ్రీరామసందేశ మందిచ్చినతోడనే యాసతీమణికిం గలిగిన యలజడుల నీరీతిని గవివరుఁడు వర్ణించి యున్నాఁడు.

క. పలుకుడిగి పెదప్రొద్దా
కులదృష్టి మఱంది( జూచు( గొండొక నవ్వున్
దలయూచు ముక్కుపై నం
గుళ మిడు వెఱగందు వగలకుం గొలు విచ్చున్.

సీత తన్నడవిని డించిరమ్మనిన శ్రీరాముని నిందింపక తనకర్మమును నిందించుకొనుట.

సీ. అఖిలధర్మస్థితి నపచారి యందునే
యౌవనంబున( దప మాచరించె
గరుణాసముద్రు(డు గా(డందునే యట్టి
యపరాధి కృతకవాయసము( గాచె
నాశ్రితరక్షమై నర్థిలే(డందునే
పగతుతమ్ముని రాజ్యపదవి నిల్పె(
బాటించి నన్ను సంభావింప( డందునే
నాకు(గా నెన్ని యత్నములొ చేసె(

తే. బతి జనించినకోలెను బరహితైక
లోలమతి యొకల్ సిదిమిన( బాలు వచ్చు
నాత(డిది కార్యమని నిశ్చయంబుచేత
నానుభాగ్యంబ యొండొక వేయునేల.

సీత తనవారికి సందేశమంపుట.

చ. అతులితపుణ్యమూర్తులగు నత్తలకెల్లను నేను భక్తి మ్రొ
క్కితి నెఱిగింపు సూర్యకులకేతువునా విలసిల్లు రాము సం
తతిభరియించి యున్నయది దానికి శోభనమంద( గచ్ఛప
స్థితినయిసం దలంపు దయ సేయు(డు మీరని యప్పగింపుమీ.

క. జనపతికి నింక నేనే
మని చెప్పిన నేమియగును నది గడచనె నై

నను నూసువోక వెండియు
ననిమెద నొకమాట రఘువరానుజ నీతోన్.

చ. తనమదినొక్క యుమ్మలిక దక్కిన మంచిది దానిఁ బాపఁగా
నని తలపోసి చేయుపని కక్కట యేనును లోనుగానె నా
కు నెఱుఁగఁజెప్పి పొమ్మనుటకుం దగ నే మొగమోటలేక మ
న్ననమెడనైన రాజులమనంబులు ద్రిప్పఁగఁ బల్మి గల్గునే.

ఉ. మేనికి నంతవంతఁ బడ మిక్కిలి కాఱియఁబెట్టి నొంపఁగాఁ
బూనితి నోర్వకున్న నది వోఁపునె యొట్లు జగంబువారలున్
మానములేక యీ తులువమాటలు నాదెస నాడ దుస్సహం
బైనది దీని మానుపు నుపాయము చొప్పడ దేమి సేయుకన్.

*ఇంతటితో తిక్కమఖి కవితావైఖరిని ముగించి వావిలకొలను సుబ్బారావుగారి యుత్తరకాండములోని సీతావివాసఘట్టము నుదహరింతును. లక్ష్మణుఁడు సీతకు శ్రీరామశాసనమును విశదీకరించుట.

ఉ. తల్లి వచింతు నేమనుచు దారుణవార్తలు పట్టణంబులం
బల్లెల నిన్నుఁగూర్చి జనవర్గము పల్కుట తాను గొల్వులో
నెల్లరుఁ జెప్పగా విని మహీంద్రుఁడు దుఃఖముపేర్మి హృద్గతం
బెల్ల వచించి నాకుఁ దనయింటికి నేగెఁ బతివ్రతామణీ !.

ఈదుర్వార్తను విని సీత పరితపించుట.

ఉ. ఏటికిఁ బుణ్యశీలుఁడు నరేంద్రుఁడు రామవిభుండు నివ్వనీ
వాటికిఁ బంచె నింపు నటువంటి యసత్కృతి యేమి చేసితో
బోటి యటంచు నన్ను మునిపుంగవు లాడఁగ నేమి పల్కుదున్
బాటి దొలంగి నావిభునిపై నెటు చెప్పుదు నిర్దయత్వమున్.

అని పరితపించి సీత తనవారికి సందేశముల నందఁజేయును.

---

* తిక్కన యిక్కడ సీతనోటనాడించినమాటలనీటు సాటిలేని బాటను బడి యొఱగినది !

క. నామాజ్ఞగ భూపతికిని సౌమిత్రి మ్రొక్కి వ్రాలి చరణంబుల మీఁ
సేమంబు నడిగెననుమీఁ యామ్మాక్షిని జెప్ప వన్న యత్తల కెల్లన్.

ఉ. పౌరుల రిత్తనిందలకుఁ బాల్పడకుండెడునట్లు, ధారుణీ
భారము బూను మంచనము; భార్యకుఁ బ్రాణవిభుండె దైవతం
బారగఁ జుట్టమున్ గురువునౌటను బ్రాణము కంటె మిన్నగా
సారసనేత్ర భర్త కెలసంబులు దీర్చుటె యుక్త మెప్పుడున్.

క. అని నాసంగ్రహవాక్యం
బును జెప్పుము బతికి నింకఁ బుఱికిం బొమ్మా
కనుమీఁ నను గర్భము చి
హ్నమును దాల్చినదాన నెట్టి యలజడి గలిగెన్.

ఇంతటితో వావిలకొలనువారి కవితను ముగించి రామ
నారాయణకవులు విరచించిన కుశలవపట్టాభిషేకనాటకములో సీసీతా
పరిత్యాగరంగమునందలి కొన్నిపద్యముల నుదహరింతును.

సీత శ్రీరామపరిత్యాగవార్తను విని లక్ష్మణునితో నన్నమాటలు.

చ. వనమున మున్ గురంగమును బట్టఁగ బోయెడు కాలమందు
జనకజఁ జూచుచుండవలె జాగ్రత్తతో నని యేగినట్టి య
మ్మనుకులవర్ధనుండె యనుమానము బూనక కాననాళిలో
నను విడనాడి రమ్మనియెనా నిజఁ దెల్పు సుమిత్రపుత్రకా.

ఉ. ఇంతకు రామభూపతి యహీనగుణాఢ్యుఁడు లోకనిందకై
కాంతను నన్ను వీడి త్రిజగంబులయందునఁ బ్రాకుచున్న భా
స్వంతుకులప్రసిద్ధికిని భంగము జేకుఱకుండఁ జేసె నా
కంతియు చాలు నీవు వగపొందిన లాభము లేదు లక్ష్మణా.

ఇంతటితో సీకుశలవపట్టాభిషేకమును ముగించి పండిత కె. సుబ్ర
హ్మణ్యశాస్త్రిగారిచే విరచింపఁబడిన లవకుశనాటకమున సీతాపరిత్యాగ
రంగ మెట్లు కరుణరసోచితముగాఁ జిత్రింపబడినదియో వివరింతును.

సీత శ్రీరాముఁడు తన్ను విడనాడె నన్న సంగతిని దెలిసికొని మనసార దాశరథినిఁ దలంచి యిట్లు పలికెను.

సీ. చిన్ననాటనుగోలె నిన్ను దైవముగాఁగ
నెన్నియుండిన భక్తి నెన్నవలదె
అలరావణుని బాధ లన్ని నే నోర్చినీ
కొఱకునై మనుట యింతరయవలదె
బంధుల రాజ్యంబుఁ బాసి నే నీవెంట
కానకు వచ్చుట కాంచ వలదె
అనదయే దీనయే యబల గర్భిణి యంచు
ననుఁబ్రోవ సత్కృప కనఁగవలదె
గీ. మనసు ఱాయియె నీకు నోమనుజపాల
భువననుతనామ రవికులాంభోధిసోమ
దానవవిరామ సత్కృపాధారసీమ
రమ్యగుణధామ శ్రీరామ రామరామ.

సీత సౌమిత్రితోఁ దనవారి సందఱి నడిగితినని తెల్పుమనుట

సీ. అరయ కౌసల్యాదియత్తల నడిగినా
వందనంబుల నీవు పలుకు మన్న
భరతశత్రుఘ్నుల కఱయ నాకడసారి
దీవనలను నీవు తెలుపు మన్న
మారామచంద్రుతో మరణవేళను దన్ను
నడిగితి నని నీవు నుడువు మన్న
ఇఁకనైన నపకీర్తి యేమియు లేక తా
హాయిగ నిద్రింపు మనఁగదన్న
గీ. తన్ను దైవంబుగా నమ్మి యున్న కాంత
కకట ప్రతిఫలం బిదియె యంచనఁగదన్న

తనదు నుపకృతి మఱువసం చనఁగదన్న
మహిని నీజానకిని నింక మఱువ కన్న.

ఇంతటితో నీపండితభాషితముల ముగించి శ్రీ బులుసు వెంకట సుబ్బారావు బి. ఎ. బి. ఎల్ గారు రచించిన కోసలసామ్రాజ్యనాటకమున లక్ష్మణుఁడు భరతునితోఁ దాను సీతను విడనాడిన దుఃఖవార్తనుఁదెల్పు రంగము హృద్యముగాఁ జిత్రింపఁబడి యున్నది. దాని నిటఁ బ్రకటింతును.

లక్ష్మణ :—సంతతబాష్పధార యాపరమపావని పట్టుపైఁటను బూర్తిగాఁ దడిపి వేసియుండెను.

భరతు:—ఈలోకము మేలుకొఱకు దుఃఖముల నెల్లఁ దానె యనుభవించుచున్నది గదా.

లక్ష్మణ:—నిశ్చయము... "నాకంటికొనలనుండి వేఁడికన్నీటి నీక నీపుడమిపైఁ బడనీయను. అది యార్యపుత్త్రున కమంగళావహము. పరిత్యజింపఁబడినను నీసీతకు శ్రీరామచంద్రుఁడే పతి, గతి, ప్రాణము దైవము అనిచెప్పుము. పూజ్యులగు నాయత్తలకు నమస్కారములను, మఱదులకు దీవనలను జెప్పుము. నాపై దయగలదేని యీ సీతను మఱచి పొండని యందఱ వేడుకొనుచుంటి ననిచెప్పుము. లక్ష్మణా! రథముపై రాజధానికి మఱలుము. మఱియు మీయన్నగారికిఁ దోడ్పడుము." అని చెప్పుచుండగా నాహృదయము ద్రవమైపోయినది. నాదేహము ముచ్చెమటలు పోయుచు నించుక వడఁక జొచ్చెను. కనులవెంట నూఱక కన్నీరు ధారగా రాఁజొచ్చెను. అది కేవలము విచారమనియుఁ దోపదాయె. నాశిరస్సు భక్తిచే నమ్రమాయె. చూపు లాపె పాదపద్మములపై నిలచినవి. చేతులు నమస్కరించుచుండెను.

భరతు:—ఆహా! ఏమి యాభావపారిశుద్ధ్యము! నిష్కలంకప్రేమ! నిర్మలభక్తి! సీతా! నీవు ధన్యవు. కాదు. నీజన్మచే నీలోకము ధన్యమైనది. సతీత్వమున కాదర్శము నీభూమియందు నిలుపుటకై, యవతరించితివి.

గీ. అతిగభీరమగుట నగపడదు పైకిఁ
గాని లోనమిగులఁ గసలుచుండు
గుతగుతమనుచు నుడుకు పుటపాకముగతి,
గురుతరమగు రామకరుణరసము.

రామభద్రుఁ డిపుడు మరల నిటకు వచ్చి పూర్వపరిచితములైన పంచవటీవనప్రదేశములఁ జూడనైయున్నాఁడు అందువలన మాటి మాటికి మహాప్రమాదములు గలుగవచ్చును......

తమస:—స్నేహమునకు దాక్షిణ్య ముచితమే......

ఈప్రసంగముచే రాముని ప్రాణములఁ గాపాడ సీతను రాముని కడకుఁ దోడ్కొని వచ్చినట్లు విదితమగుచున్నది.

ఉత్తరరామచరితమునఁ దృతీయాంకమునందలి శుద్ధనిష్కంభము వింతమార్గమున నడచినది. కారణమేమన ధీరోదాత్తుఁడగు పురుష సింహుఁడు కాంతావియోగముచే నంత మోహస్థితికి రాఁగలఁడని తలఁచి యా యాపద నివారింప నెంచిన కవిశేఖరుఁడు బేలయౌ యబల, పైగా నెలలునిండిన చూలాలు, కేవలపతివియోగచింతనే కాక దుస్సహజనాప వాదఖేదమునఁ గూడ మడయుట తప్పదని తలంచి యావిపత్తునుండి యాయార్తను గాపాడఁ దగు రంగమును సంఘటింపవలదా ? అట్లొనర్పక మేరుధరాధరధీరుఁడగు రాముని జీవితమును గాపాడఁ దలంచుట వింత కాదా ?

మఱియొక వింత. సీత శ్రీరామునితోఁ దనకు గంగాతీరమునందలి మునిపల్లెల దర్శింపఁ గుతూహలము కలదని నివేదింప నాదాశరథి వైదే హిమనోరథము నీడేర్చు నెపమున నాపెను గంగాతీరమునందలి వాల్మీకా శ్రమముచెంత విడచిరమ్మని తమ్మునితోఁ దెలిపెను. సౌమిత్రియు నన్న యాజ్ఞానుసారము సుకుమారియగు జనకకుమారినిఁ దోడ్కొనిపోయి ప్రాచేతసాశ్రమమునకు సమీపముగా గంగయొడ్డున దిగవిడిచి తిరిగి వచ్చి యావార్తను శ్రీరామునకు నివేదించి యుండెను.

తనదు నుపకృతి మఱువనం చనఁగదన్న
మహిని నీజానకిని నింక మఱువ కన్న.

ఇంతటితో నీపండితభాషితముల ముగించి శ్రీ బులుసు వెంకట సుబ్బారావు బి. ఏ. బి. ఎల్ గారు రచించిన కోసలసామ్రాజ్యనాటకమున లక్ష్మణుఁడు భరతునితోఁ దాను సీతను విడనాడిన దుఃఖవార్తనుఁదెల్పు రంగము హృద్యముగాఁ జిత్రింపఁబడి యున్నది. దాని నిటఁ బ్రకటింతును.

లక్ష్మణ :—సంతతబాష్పధార యాపరమపావని పట్టుపైఁటను బూర్తిగాఁ దడిపి వేసియుండెను.

భరతు:—ఈలోకము మేలుకొఱకు దుఃఖముల నెల్లఁ దానె యనుభవించుచున్నది గదా.

లక్ష్మణ:—నిశ్చయము... "నాకంటికొనలనుండి వేఁడికన్నీటి నీక నీపుడమిపైఁ బడనీయను. అది యార్యపుత్రున కమంగళావహము. పరిత్యజింపఁబడినను నీసీతకు శ్రీరామచంద్రుఁడే పతి, గతి, ప్రాణము దైవము అనిచెప్పుము. పూజ్యులగు నాయత్తలకు నమస్కారములను, మఱదులకు దీవనలను జెప్పుము. నాపై దయగలదేని యీ సీతను మఱచి పోండని యందఱ వేడుకొనుచుంటి నని చెప్పుము. లక్ష్మణా! రథముపై రాజధానికి మఱలుము. మఱియు మీయన్నగారికిఁ దోడ్పడుము." అని చెప్పుచుండగా నాహృదయము ద్రవమైపోయినది. నాదేహము ముచ్చెమటలు పోయుచు నించుక వడఁక జొచ్చెను. కనులవెంట నూఱక కన్నీరు ధారగా రాఁజొచ్చెను. అది కేవలము విచారమనియుఁ దోపదాయె. నాశిరస్సు భక్తిచే నమ్రమాయె. చూపు లాపె పాదపద్మములపై నిలచినవి. చేతులు నమస్కరించుచుండెను.

భరతు:—ఆహా! ఏమి యాభావపారిశుద్ధ్యము! నిష్కలంకప్రేమ! నిర్మలభక్తి! సీతా! నీవు ధన్యవు. కాదు. నీజన్మచే నీలోకము ధన్యమైనది. సతీత్వమున కాదర్శము నీభూమియందు నిలుపుటకై, యవతరించితివి.

గీ. అతిగభీరమగుట నగపడదు పైకిఁ
గాని లోనమిగులఁ గనలుచుండు
గుతగుతమనుచు నుడుకు పుటపాకముగతి,
గురుతరమగు రాముకరుణరసము.

రామభద్రుఁ డిపుడు మరల నిటకు వచ్చి పూర్వపరిచితములైన పంచవటీవనప్రదేశములఁ జూడనైయున్నవాఁడు అందువలన మాటి మాటికి మహాప్రమాదములు గలుగవచ్చును......

తమస:—స్నేహమునకు దాక్షిణ్య ముచితమే......

ఈప్రసంగముచే రాముని ప్రాణములఁ గాపాడ సీతను రాముని కడకుఁ దోడ్కొని వచ్చినట్లు విదితమగుచున్నది.

ఉత్తరరామచరితమునఁ దృతీయాంకమునందలి శుద్ధవిష్కంభము వింతమార్గమున నడచినది. కారణమేమన ధీరోదాత్తుఁడగు పురుష సింహుఁడు కాంతావియోగముచే నంత మోహస్థితికి రాఁగలఁడని తలఁచి యా యాపద నివారింప నెంచిన కవిశేఖరుఁడు బేలయగు యబల, పైగా నెలలునిండిన చూలాలు, కేవలపతివియోగచింతనే కాక దుస్సహజనాప వాదఖేదమునఁ గూడ మడయుట తప్పదని తలంచి యావిపత్తునుండి యాయార్తను గాపాడఁ దగు రంగమును సంఘటింపవలదా ? అట్లొనర్పక మేరుధరాధరధీరుఁడగు రాముని జీవితమును గాపాడఁ దలంచుట వింత కాదా ?

మఱియొక వింత. సీత శ్రీరామునితోఁ దనకు గంగాతీరమునందలి మునిపల్లెల దర్శింపఁ గుతూహలము కలదని నివేదింప నాదాశరథి వైదే హీమనోరథము నీడేర్చు నెపమున నాపెను గంగాతీరమునందలి వాల్మీకా శ్రమముచెంత విడచిరమ్మని తమ్మునితోఁ దెలిపెను. సౌమిత్త్రియు నన్న యాజ్ఞానుసారము సుకుమారియగు జనకకుమారినిఁ దోడ్కొనిపోయి ప్రాచేతసాశ్రమమునకు సమీపముగా గంగయొడ్డున దిగవిడిచి తిరిగి వచ్చి యావార్తను శ్రీరామునకు నివేదించి యుండెను.

ఇటుల నిజప్రేయసి తపసిపల్లెపొంత గంగదరిని విడువఁబడెనని యెఱింగి యుండుటచే శ్రీరాముఁ డింతగాఁ జింతఁజెందవలసిన యగత్యము కానరాదు. కావున రఘువీరుఁ డింతటి వంతలపాలగుటకుఁ గారణమేమి? గర్భగుర్విణియగు నుర్వీసుత విడువఁబడిన యడవి క్రూరమృగభయంకరారణ్యసీమ కాదే! అదియొక యహింసాసుందరమగు శాంతపావనతపోవనభూమియే! అందుచే భవభూతికవివరుఁడు వర్ణించినంతటి శ్రీరామ దుఃఖావిర్భావమునకుఁ దగినకారణము కానరాకున్నయది.

పరిశీలింపఁ గోసలసార్వభౌముఁ డగు శ్రీరాముఁడు, భవభూతికవివరుఁడు చిత్రించినంతటి దురంతచింతలకు లోనగు బేల కాఁడు. మేరునగధీరుఁడగు పురుషసింహుఁడు. ఈసంగతి నీక్రిందిఘట్టములు ధ్రువముచేయుచున్నయవి. బాలరామాయణమున నారదుఁడు శ్రీరాముని గుణముల నిట్లు వర్ణించియున్నాఁడు "సముద్ర ఇవ గాంభీర్యే ధైర్యేణ హిమవానివ" అనగా రాముఁడు గాంభీర్యమున సముద్రమునకును ధైర్యమున ధరాధరనాథునకును నెన యని భావము. "ధైర్యంబునను హిమధరణీధరము సాటివీర్యసమున్నతి విష్ణునిభుఁడు. (భాస్కరరామాయణము)

పట్టాభిషేకసమయమున దశరథరాజేంద్రుఁడు ప్రజలకు శ్రీరామ గుణముల నిట్లు వర్ణించియున్నాఁడు

శా. ధీరోదారుఁడు నిర్వికారుఁడు జగద్వీరుండు సౌజన్యవి
స్తారుం డుత్తమశీలుఁ డర్కకులవిస్తారుండు శూరుండు గం
భీరుం డిద్ధవిచారసారుఁ డగుటన్ బెంపార విశ్వంభరా
భారం బెల్ల భరింప రాఘవు మహాభాగున్ నియోగించెదన్.
(భాస్కరుఁడు)

కౌసల్య శ్రీరాము నెడఁబాసి యుండఁజాలక ప్రాధేయపూర్వకముగా నిట్లు బ్రతిమాలికొనెను.

శ్లో. కథంహి ధేను స్స్వంవత్సం గచ్ఛంతం నానుగచ్ఛతి
అహం త్వా నుగమిష్యామి యత్ర పుత్త్ర గమిష్యసి.

లక్ష్మణుఁడు సీతను గంగదరిని విడచి వచ్చిన పిదప నిజసతిగతి యేమా యెనో యని వ్యాకుల మంది ఆపె యెక్కడ నెట్లున్నదియో తెలిసికొ నుటకు దూతను బంపఁడాయె. అట్టి ధృఢవిశ్వాసమే లేకున్న మున్నర ణ్యావాస సమయమున సీతకై కుంజపుంజములును, గుట్టమెట్టలును, కందరమందిరములును, కోనలోయలును, లోనుగాఁగల తావులెల్లఁ దమ్మునితోఁ గలయఁ దిరిగిన రాముఁ డిట్లుపేక్షించి యుండఁగలఁడా?

శ్రీరాముఁడు సీతక్షేమమును దెలిసికొనుటకై దూతను బంపిన సంగతి ప్రజలకుఁ దెలిసి "ఈకోసలనృపాలుఁడు మాటమాత్రమునకు సీతను విడచెనే కాని విరాగుఁడై యామెను బరిత్యజింపలేదు" అని తలం తురను జంకుచేఁ దటస్థముగా నుండె నందుమా! అట్లనుట సరిపడదు. ఏమందురా! ఆత్మసములును సర్వదా తన్నుఁ గనిపెట్టుకొనియుండు వారును ధీశాలురునగు లక్ష్మణాదిసోదరులకుఁ గూడఁ దెలియరాకుండ రహస్యముగా లోకవార్తలఁ గొనివచ్చు దుర్ముఖాదిగూఢచారులు తనకడ నుండిరే. వారిలో నొక్కనిపుణునిఁ బంపి సీతస్థితిగతులఁ దెలిసికొన సగునే.

ఎట్టి కట్టుదిట్టమగు రహస్యమును గూడఁ బ్రజలు కనిపెట్టఁగల ధీమంతు లందురా! అట్లగుచో నిపు డాతఁ డడవినిఁ బడి యెడ లెఱుం గక యాపుడమితనయకై తల్లడిల్లిన సంగతిని మాత్రము కనిపెట్టఁ జాల కుందురా? కావున శ్రీరాముఁడు ధీరుఁడగుటను, సీతస్థితిగతుల నూహిం పఁజాలిన ధీశాలియగుటను, నిజకాంత క్షేమమును దెలిసికొన వేగిరపడఁ డాయె నని యూహించుటయే సమంజసము.

మున్ను బంచవటిని సీత యపహృతయైనప్పుడన్ననో, హింస్రా రణ్యజంతుసంతతులతోడను క్రూరాతిక్రూరములగు క్రవ్యాదసందోహ ములతోడను నిండి యడుగడుగునకు నాపదల కాలవాలమైన భీకరార ణ్యమున శిరీషకుసుమపేశలగాత్రియగు జనకక్ష్మాపాలపుత్రిక యెట్టి యిక్క ట్టునకు లోనాయెనో యని తల్లడమంది "అపి గ్రావా రోదిత్యపి దళతి వజ్రస్య హృదయ" మ్మని భవభూతి తెలిపినరీతిని రాలుకరగునట్లును, రవలు పగులునట్లును శ్రీరాముఁడు విలపించెననుట సమంజసము.

ఇటుల నిజప్రేయసి తపసిపల్లెపొంత గంగదరిని విడువఁబడెనని యెఱింగి యుండుటచే శ్రీరాముఁ డింతగాఁ జింతఁజెందవలసిన యగత్యము కానరాదు. కావున రఘువీరుఁ డింతటి వంతలపాలగుటకుఁ గారణమేమి? గర్భగుర్వియగు నుర్వీసుత విడువఁబడిన యడవి క్రూరమృగభయంకరారణ్యసీమ కాదే! అదియొక యహింసాసుందరమగు శాంతపావనతపోవనభూమియే! అందుచే భవభూతికవివరుఁడు వర్ణించినంతటి శ్రీరామ దుఃఖావిర్భావమునకుఁ దగినకారణము కానరాకున్నయది.

పరిశీలింపఁ గోసలసార్వభౌముఁ డగు శ్రీరాముఁడు, భవభూతికవివరుఁడు చిత్రించినంతటి దురంతచింతలకు లోనగు వేల కాఁడు. మేరునగధీరుఁడగు పురుషసింహుఁడు. ఈసంగతి నీక్రిందిఘట్టములు ధ్రువముచేయుచున్నయవి. బాలరామాయణమున నారదుఁడు శ్రీరాముని గుణముల నిట్లు వర్ణించియున్నాఁడు "సముద్ర ఇవ గాంభీర్యే ధైర్యేణ హిమవానివ" అనగా రాముఁడు గాంభీర్యమున సముద్రమునకును ధైర్యమున ధరాధరనాథునకును నెన యని భావము. "ధైర్యంబునను హిమధరణీధరము సాటి వీర్యసమున్నతి విష్ణునిభుఁడు. (భాస్కరరామాయణము)

పట్టాభిషేకసమయమున దశరథరాజేంద్రుఁడు ప్రజలకు శ్రీరామ గుణముల నిట్లు వర్ణించియున్నాఁడు

శా. ధీరోదారుఁడు నిర్వికారుఁడు జగద్వీరుండు సౌజన్యవి
స్తారుం డుత్తమశీలుఁ డర్కకులవిస్తారుండు శూరుండు గం
భీరుం డిద్ధవిచారసారుఁ డగుటన్ బెంపార విశ్వంభరా
భారం బెల్ల భరింప రాఘవు మహాభాగున్ నియోగించెదన్.
(భాస్కరుఁడు)

కౌసల్య శ్రీరాము నెడఁబాసి యుండఁజాలక ప్రాధేయపూర్వకముగా నిట్లు బ్రతిమాలికొనెను.

శ్లో. కథంహి ధేను స్స్వంవత్సం గచ్ఛంతం నానుగచ్ఛతి
అహం త్వా నుగమిష్యామి యత్ర పుత్త్ర గమిష్యసి.

లక్ష్మణుఁడు సీతను గంగదరిని విడచి వచ్చిన పిదప నిజసతిగతి యేమా మెనో యని వ్యాకుల మంది ఆపె యెక్కడ నెట్లున్నదియో తెలిసికొ నుటకు దూతను బంపఁడాయె. అట్టి దృఢవిశ్వాసమే లేకున్న మున్నర ణ్యావాస సమయమున సీతకై కుంజపుంజములును, గుట్టమెట్టలును, కందరమందిరములును, కోనలోయలును, లోనుగాఁగల తావులెల్లఁ దమ్మునితోఁ గలయఁ దిరిగిన రాముఁ డిట్లుపేక్షించి యుండఁగలఁడా ?

శ్రీరాముఁడు సీతక్షేమమును దెలిసికొనుటకై దూతను బంపిన సంగతి ప్రజలకుఁ దెలిసి "ఈకోసలనృపాలుఁడు మాటమాత్రమునకు సీతను విడచెనే కాని విరాగుఁడై యాపెను బరిత్యజింపలేదు"అని తలం తురను జంకుచేఁ దటస్థముగా నుండె నందుమా ! అట్లనుట సరిపడను. ఏమందురా ! ఆత్మసములును సర్వదా తన్నుఁ గనిపెట్టుకొనియుండు వారును ధీశాలురునగు లక్ష్మణాదిసోదరులకుఁ గూడఁ దెలియరాకుండ రహస్యముగా లోకవార్తలఁ గొనివచ్చు దుర్ముఖాదిగూఢచారులు తనకడ నుండిరే. వారిలో నొక్కనిపుణునిఁ బంపి సీతస్థితిగతులఁ దెలిసికొన నగునే.

ఎట్టి కట్టుదిట్టమగు రహస్యమును గూడఁ బ్రజలు కనిపెట్టఁగల ధీమంతు లందురా ! అట్లగుచో నిపు డాతఁ డడవినిఁ బడి యొడ లెఱుం గక యాపుడమితనయకై తల్లడిల్లిన సంగతిని మాత్రము కనిపెట్టఁ జాల కుందురా ? కావున శ్రీరాముఁడు ధీరుఁడగుటను, సీతస్థితిగతుల నూహిం పఁజాలిన ధీశాలియగుటను, నిజకాంత క్షేమమును దెలిసికొన వేగిరపడఁ డాయె నని యూహించుటయే సమంజసము.

మున్ను బంచవటిని సీత యపహృతమైనప్పుడన్ననో, హింస్రా రణ్యజంతుసంతతులతోడను క్రూరాతిక్రూరములగు క్రవ్యాదసందోహ ములతోడను నిండి యడుగడుగునకు నాపదల కాలవాలమైన భీకరార ణ్యమున శిరీషకుసుమపేశలగాత్రియగు జనకక్ష్మాపాలపుత్రిక యెట్టి యిక్క ట్టునకు లోనాయెనో యని తల్లడమంది "అపి గ్రావా రోదిత్యపి దళతి వజ్రస్య హృదయ" మ్మని భవభూతి తెలిపినరీతిని రాలుకరగునట్లును, రవలు పగులునట్లును శ్రీరాముఁడు విలపించెననుట సమంజసము.

కాని యటువలె నిట విలపింపఁ దగిన యాపద సీతకు సంప్రాప్తమై యుండుననీ తలంప వలను పడదు. "పురా కిల వాల్మీకితపోవనోపకంఠే సంత్యజ్య ప్రతినివృత్తే లక్ష్మణే" అను నుత్తరరామచరిత తృతీయాంకమునందలి తమసావచనముచే సీత వాల్మీకిమునీంద్రుని తపోవనోపకంఠమున నున్న సంగతి విదితమగుచున్నది కదా ? అందుచే నెందులకు మునుపటికంటె నింత మిన్నగాఁ గన్నీటిధారలు కాలువలై ప్రవహింపవలసివచ్చె.

అరణ్యకాండమున దండకాటవిని జానకిని గోల్పోయి ఖిన్నుఁడై యున్న సీతాకాంతుని యవస్థకును, ఉత్తరకాండమున వైదేహినిఁబరిత్యజించి విచారించుచున్న కోసల జనపతి యవస్థకును హస్తిమశకాంతరమున్నయది. అచటిస్థితి జానకీరమణునకు సీత దుర్జ్ఞేయమగుటచేఁ ప్రబల విలాపకారణమాయెను. ఇచటి దాశరథికి భూసుతయునికి యవగతమగుటచే సహ్యావేదనాహేతుకమై యున్నది.

మఱి యొక విషయము. భవభూతి, సీత దుస్సహమగు ప్రసవవేదనకుఁ దాళఁ జాలక గంగాజలముల నుఱికె ననియు, ఆనీటిపాటువలన నిరువురు కొడుకులు పుట్టినట్లును, గంగాపృథ్వీలాశిశువులతో సీతను పాతాళమునకుఁ గొంపోయినట్లును, పిమ్మట నాకూనలు స్తన్యముల విడచినతోడనే గంగాదేవి వాల్మీకాశ్రమమునకుఁ దోడ్కొని వచ్చి యాశిశువులఁ బ్రాచేతసుని వశమొనర్చినట్లును, కథను జిత్రించియున్నాఁడు. పరికింప నీరంగ మస్వాభావికముగఁ జూపట్టుచున్నది.

ఉత్తరకాండాది గ్రంథములయం దంతటను సీత వాల్మీకాశ్రమములోఁ బ్రసవించినట్లును తపసిముత్తైదువు లాపెకుఁ బురుడు బోసినట్లును వర్ణింపఁబడి యున్నది. భవభూతి సహజమగు నిట్టి ప్రసవవృత్తాంతమును ద్రోసిపుచ్చి, చిత్రించిన ప్రసవప్రశంస యంత సొంపుగాఁ గాన

వచ్చుట లేదనవచ్చును. మఱియు నీవిరుద్ధప్రసవరంగము లేకున్న నాట కేతివృత్తమున కట్టికొఱఁతయు గానేఱదు.

ఇదియునుం గాక సీత తాను ప్రసవించువఱకు మేనఁ బ్రాణముల నిలిపియుంతును గాని మఱెట్టి సాహసకార్యము నొనరింపనని పలికియున్నది. కనుఁడు "న ఖల్వద్యైవ సౌమిత్రే జీవితం జాహ్నవీజలే, త్యజేయం రాజవంశస్తు భర్తుర్మే పరిహాస్యతే." (ఉత్తరకాండము.) సౌమిత్రీ! రాజవంశము నిర్లక్ష్యముసేయఁ దగినదైనచో గంగానీరమున జీవితమును విడువకుందునా.?

"స్యాద్రక్షణీయం యదిమే న తేజస్త్వదీయ మంతర్గత మంతరాయః" (రఘువంశము) అంతర్గుప్తమైయున్న తేజము రక్షణీయము. అట్టియంతరాయమే లేకున్న.

"కిన్ను ఖలు తస్యైవ నిరనుక్రోశస్య సమాన ఏవ ప్రసవః ప్రేక్షితవ్య ఇతి వచనీయకంటకోపనీతం జీవితం పరిరక్షామి" (కుందమాల)

ఏమిచేతును! నిర్దయాత్ముఁడగు నారాజునకు సమానమగు ప్రసవము పాలింపఁదగి యుండుటచే లోకాపవాదదూషితమగు జీవితమును రక్షించుచున్నాను.

ఇట్లు పైగ్రంథములన్నియు సీత తనయందు సంరక్షణీయమగు సూర్యవంశసంతానతేజము లేకున్న నీయసహ్యాదుఃఖసమయమునఁ బ్రాణములఁ బరిత్యజింపకుందునా ? అని లక్ష్మణునితోఁ బలికినట్లును, ఆరీతినే ప్రాణముల దేహమున నిలిపి వాల్మీకి తపోవనమున శిశువులఁ బ్రసవించినట్లును బోధించుచున్నవి.

వేఱొక సంగతి. భవభూతి యుత్తరరామచరితమున సీతగంగలోఁ గవలలఁ గనినట్లును గంగావసుంధరలు శిశువులతో సీతను రసాతలమునకుఁ దోడ్కొనిపోయి సీతనొక్కతెను నట విడచి, శిశువులు పాలువిడచినతోడనే వాల్మీకియొద్దకుఁ గొనివచ్చి యాతనివశ మొనర్చినట్లును కథను చిత్రించియున్నాఁడు. పరికింప నీకథానకవిన్యాసము ప్రకృతివిరుద్ధముగాఁ

ఖాపట్టుచున్నయది. ఎక్కడనైనఁ బుత్త్రప్రేమవశంవదయగు మాత సంద
పలతోఁ గలసియుండఁ గోరునుగాని గొడ్డ్రాలివలె నిర్దయాత్మయై విడి
యుండ సాహసించునా? పదిరెండేండ్ల దనుక మందహాససుందరము
లగు నిజనందనవదనారవిందముల నవలోకింపక యుండఁగలదా? ఇట్లు
జననీనందనుల విడదీయుటచేఁ జేకూరువస్తురమ్యత యేదియో కానరాదు.
కావున నితరకవివరులు వర్ణించినరీతిని సీత మునిపల్లెను బుత్త్రులఁ బ్రస
వించి యాబాలుర ముగ్ధభాషితములను వీనులార వినుచు వారి మురి
పెంపు చేతలఁ గనులారఁ గాంచుచుఁ దనకు వాటిల్లిన పతిపరిత్యాగదుః
ఖమును గొంత మఱపొంది యున్న దనుటయే సంగతము.

భవభూతికవివరుఁడు, ధీరోదారుఁడగు రాముఁడు సీతాపరిత్యాగ
స్థానకోవిదుఁడగుటచే సహ్యావిచారుఁడుగాఁ జిత్రింపఁదగియుండ దుస్త
రదుఃఖసాగరమగ్నునిగాఁ జిత్రించుటయు, ధీరాతిధీరుఁడగు నావీరుఁడు
సీతావియోగఖేదాతిశయముచేఁ బ్రాణములఁ బాయునేమో యని సీత
నాతని కడకుఁ గొనివచ్చుటయు, మునిపల్లెను దాపసకాంతలచెంత సు
తులఁ బ్రసవించిన జానకి, జాహ్నవీజలములఁ గవలలఁ గనెనని వ్రాయుట
యు, స్వతనయముఖారవిందములఁ బరికింపక సీత పాతాళమునఁ బదిరెం
డేండ్లొంటరిగా నిలచియుండెనని చిత్రించుటయు, సుప్రసిద్ధ కవివర
ప్రబంధములయందలి యితివృత్తమునకు భిన్నముగా నుండుటయకాక
ప్రకరణానుకూలమగు సహజసౌందర్యమును గూడఁబోషింపఁజాలకున్న
వని నాభావము.

ఈనావిమర్శనమునందలి చర్చలన్నియు వివిదిషతో వ్రాయఁబడి
నవి కాని విజిగీషతోఁ జిత్రింపఁబడి యుండలేదు. కావున సహృదయు
లగు సాహిత్యకోవిదులు సోదరభావముతో నాసంశయముల సవరింపఁ
బ్రార్థితులు. ఊరక కాలముఁగడుపుటకంటె సారస్వతచర్చలతో సమ
యమును జరపుట శ్రేయస్కరమని పెద్దలు బోధించియున్నారు.

ఓంతత్సత్.

వాల్మీకివిరచితమగు నుత్తరకాండమునందలి సీతాపరిత్యాగ రంగమున వర్ణింపఁబడిన మూలశ్లోకములు. (సర్గ ౪౮)

(1) మామికేయం తనుర్నూనం సృష్టా దుఃఖాయ లక్ష్మణ !
భాత్రా యస్యా స్తథా మేద్య దుఃఖమూర్తిః ప్రదృశ్యతే ౩

(2) కింను పాపం కృతం పూర్వం కో వా దారై ర్వియోజితః
యాహం శుద్ధసమాచారా త్యక్తా నృపతినా సతీ. ౪

(3) కిం ను వక్ష్యామి మునిషు కర్మ వా ఽ స్కృత్రృతం చ కిం
కస్మిన్వా కారణే త్యక్తా రాఘవేణ మహాత్మనా. ౭

(4) న ఖల్వద్యైవ సౌమిత్రే జీవితం జాహ్నవీజలే
త్యజేయం రాజవంశస్తు భర్తు ర్మే పరిహాస్యతే. ౮

(5) శ్వశ్రూణా మవిశేషేణ ప్రాంజలిః ప్రగ్రహేణచ
శిరసా వంద్య చరణౌ కుశలం బ్రూహి పార్థివం. ౧౦

(6) అహం తు నానుశోచామి స్వశరీరం నరర్షభ
యథాపవాదం పౌరాణాం తథైవ రఘునందన. ౧౩

(7) పతి ర్హి దైవతం నార్యాః పతి ర్బంధుః పతి ర్గురుః
ప్రాణై రపి ప్రియం తస్మాత్ భర్తుః కార్యం విశేషతః. ౧౭

కాళిదాసవిరచితమగు రఘువంశములోని సీతాపరిత్యాగఘట్టమునందలి మూలశ్లోకములు. (సర్గ-౧౪)

(1) నిఘ్నస్య మే భర్తృనిదేశరౌక్ష్యం
దేవి క్షమ స్వేతి బభూవ నమ్రః॥ ౫౮

(2) సీతా త ముత్థాప్య జగాద వాక్యం
ప్రీతాస్మి తే వత్స చిరాయ జీవ
బిడౌజసా విష్ణు రివాగ్రజేన
భ్రాత్రా యదిత్థం పరవానసి త్వం. ౫౯

(3) శ్వశ్రూజనం సర్వ మనుక్రమేణ
విజ్ఞాపయేః ప్రాపితమత్ప్రణామః

ప్రజానిషేకం మయి వర్తమానం
సూనో రనుధ్యాయత చేతసేతి. ౬౦

(4) వాచ్య స్త్వయా మద్వచనా త్సరాజా
వహ్నౌ విశుద్ధామపి యత్సమక్షం
మాం లోకవాదశ్రవణా దహాసీః
శ్రుతస్య కిం తత్సదృశం కులస్య. ౬౧

(5) కిం వా తవాత్యంతవియోగమోఘే
కుర్యా ముపేక్షాం హతజీవితే స్మిన్
స్యాద్రక్షణీయం యది మే న తేజ
స్త్వదీయ మంతర్గత మంతరాయః. ౬౨

(6) నృపస్య వర్ణాశ్రమపాలనం యత్
స ఏవ ధర్మో మనునా ప్రణీతః
నిర్వాసితా ప్యేవ మత స్త్వయాహం
తపస్విసామాన్య మవేక్షణీయా. ౬౩

(7) ఉపస్థితాం పూర్వ మపాస్య లక్ష్మీం
వనం మయా సార్థ మసి ప్రపన్నః
త్వ య్యాస్పదం ప్రాప్య త యాభిరోషాత్
సోఢాస్మి న త్వద్భవనే వసంతీ. ౬౪

(8) కల్యాణబుద్ధే రథ వా తవాయంన
కామచారో మయి శంకనీయః
మమైవ జన్మాంతరపాతకానాం
విపాకవిస్ఫూర్జథు రప్రసహ్యః. ౬౫

(9) నిశాచరోపప్లుతభర్తృకాణాం
తపస్వినీనాం భవతః ప్రసాదాత్
భూత్వా శరణ్యా శరణార్థ మన్యం
కథం ప్రపత్స్యే త్వయి దీప్యమానే. ౬౬

(10) సాహంతపసూర్యనివిష్టదృష్టి ౬౬
రూర్ధ్వం ప్రసూతె శ్చరితుం యతిష్యే

(11) శ్లో. నృత్యం మయూరాః . కుసుమాని వృక్షా
దర్భా నుపాత్తా న్విజహు ర్హరిణ్యాః
తస్యాః ప్రపన్నే సమదుఃఖభావం
అత్యంత మాసీ ద్రుదితం వనేపి. ౬౭

దిఙ్నాగవిరచితమగు కుందమాలనాటకములోని మూలభాగము

1. శ్లో. తుల్యాన్వయే త్యనుగుణేతి గుణోన్నతేతి
దుఃఖే సుఖేచ సుచిరం సహవాసినీతి
జానామి కేవల మహం జనవాదభీత్యా
సీతే త్యజామి భవతీం నతు భావదోషాత్।

అయ మార్యస్యసందేశః ॥

2. సీతా—కథం జనాపవాదభయేనేతి! కిమపి వచనీయం మేఽస్తి ?

3. లక్ష్మణ—కీదృశ మార్యాయా వచనీయం.
శ్లో. ఋషీణాం లోకపాలానా మార్యస్య మమ చాగ్రతః
అగ్నౌ శుద్ధిం గతా దేవీకిం తు లోకో నిరంకుశః.

4. సీతా—కిం ను ఖలు తస్యైవ నిరనుక్రోశస్య సమాన ఏషప్రసవః ప్రేక్షితవ్య ఇతి వచనీయకంటకోపహితం జీవితం పరిరక్షామి.

5. లక్ష్మణ—అనుగృహీతోస్మి. ఇద మార్యేణ సందిష్టం.

6. సీతా—కిం ను ఖలు భవిష్యతి ?

7. లక్ష్మణ. శ్లో. త్వం దేవి చిత్తనిహితా గృహదేవతా మే
స్వప్నాగతా శయనమధ్యసఖీ త్వ మేవ
దారాంతరాహరణనిస్పృహమానసస్య
యాగే తవ ప్రతికృతి ర్మమ ధర్మపత్నీ.

8. సీతా—ఏవం సందిశ తార్యపుత్రేణ పరిత్యాగదుఃఖం మయి నిరవశేష మపనీతం, న హి తథాన్యాసక్త్యాః పత్యు, స్త్రీజనస్య దుఃఖముత్పాదయతి యథా న్యాసక్తః

(9) లక్ష్మణః—కః ప్రతిసందేశః ?

(10) సీతా:—ఏవం గతేపి ప్రతిసందేశః! శ్వశ్రూణాం పున ర్మమ వచనాత్ పాదవందనం కృత్వా విజ్ఞాపయ, ఏవ మహం నీరక్షా శ్వాపదసమాకీర్ణే వనే ప్రతివసంతీ సర్వథా హృదయే నార్యాభి రను గృహీతవ్యేతి.

(11) లక్ష్మణః—ప్రతిగృహీ తేయ మాజ్ఞా. ఆర్యస్య న కించి త్సందిష్టం.

(12) సీతా—తథా నిష్ఠురో నామ సందిశ్యతే. తథా మమ వచనాత్తం జనం విజ్ఞాపయ:—మందభాగినీ మనుశోచన్ వర్ణాశ్రమప రిపాలన మభిఘ్న న్నాత్మానం న బాధయ, సద్గర్భే స్వశరీరే సావధానో భవేతి వత్స. లక్ష్మణ ! కిముపాలభే మహారాజం ?

(13) లక్ష్మణః—కిమేతావత్యపిన ప్రభవతి దేవీ ?

(14) సీతా:—ఏవమపిమద్వచనాత్ సవిజ్ఞాపయితవ్యః 'సాతపో వనవాసినీ సర్వథా సీమంతనిహితేనాంజలినా నివేదయతి యద్యహం నిర్గుణా చిరపరిచితేతివా, అనాథేతివా, సీతేతివా, స్మరణమాత్రకేనా ప్యనుగృహీతవ్యేతి.

(15) లక్ష్మణః—ఇమంసందేశమాకర్ణ్య క్షతే క్షార మివాహితం దశా మసహ్యం శోకస్య వ్యక్త మార్యో గమిష్యతి.

(16) సీతా:—అతిమహితేపి స్వమండలే కథం తేసంతి స్త్రియో దుఃఖసహాయాః ? సాంప్రతం మయా వినా త్వ మైకే నైవ చింత యితవ్యః. త్వం భ్రాతుః శరీరే సావధానో భవ.

(17) లక్ష్మణః—అనురూప మేతన్మహానుభావతాయాః.

(18) సీతా:—సమాశ్వాసయితవ్యా ప్రియంవదా మమ ప్రియ సఖ్యాః; స్మర్తవ్యా సర్వకాల మియం మందభాగినీ. (ఇతి రోదితి)

(19) లక్ష్మణః—(సోద్వేగం)

శ్లో. ఆర్యాం స్వహస్తేన వనే విమోక్తుం శ్రోతుంచతస్యాఃపరిదేవితాని।
సుఖేన లంకాసమరే హతం మామ జీవయ న్మారుతి రాత్తవైరః

(దిశోవిలోక్య) శ్లో. ఏతే రుదంతి హరిణా హరితం విముచ్య
హంసాశ్చ శోకవిధురాః కరుణం రుదంతి
నృత్తం త్యజంతి శిఖినోఽపి విలోక్య దేవీం
తిర్యగ్గతా వర మమీ న పరం మనుష్యాః.

(20) సీతా:—వత్స లక్ష్మణ ! ఆసన్నాస్తమయః సూర్యః దూరేచేతో మనుష్యసంపాతః. ఉడ్డీనాః పక్షిణః. సంచరంతి శ్వాపదాః. గచ్ఛ న యుక్తం పరిలంబితుం.

(21) లక్ష్మణ:—(అంజలిం బద్ధ్వా) సర్వపశ్చి మోయం లక్ష్మణస్య ప్రణామాంజలిః తత్సావధానం పరిగృహ్యతాం.

(22) సీతా:—నిత్యావహితా ఖల్వహం

(23) లక్ష్మణ:—శ్లో. జ్యేష్ఠస్య భ్రాతురాదేశాదాసీయ విజనేవనే
పరిత్యక్తాసి దేవిత్వం దోషమేతం క్షమస్వమే.

(24) సీతా:—జ్యేష్ఠస్యవచనానువర్తీ త్వ మితి సంతోషకాలే కోదోష ఆశంక్యతే.

(25) లక్ష్మణ:—(దిశో ఒవలోక్య) భో భో లోకపాలాః శ్రుణ్వంతు భవంతః

శ్లో. ఏషా వధూ ర్దశరథస్య మహారథస్య
రామాహ్వయస్య గృహిణీ మధుసూదనస్య
నిర్వాసితా పతిగృహా ద్విజనే వనేస్మి
న్నేకాకినీ వసతి రక్షత రక్ష తైనామ్.

శ్లో. ఏషోంజలి ర్విరచితో వనదేవతానాం
విజ్ఞాపనాం క్షణ మిమా మవధారయంతు
సుప్తా ప్రమాదవశగా విషమస్థితా వా
యత్నా ది యం భగవతీభి రవేక్షణీయా.

శ్లో. సఖ్యో ఽద్యః స్వామినోలోకపాలాః మాతర్గంగే భ్రాతరః శైలరాజాః
భూయోభూయోయాచ తేలక్ష్మణో ఒయంయత్నాద్రక్ష్యా రాజపుత్రీ గతో ఒహం. (అంక-౧ పు6-13)

# ప్రేమ చంద్.

కొమాండూరి శఠకోపాచార్యులుగారు, ఎం. ఏ. బి. యల్.
కాకినాడ.

---

సాధారణముగ రాజులు సేనానులు మతకర్తలు మున్నగువారలే మహాపురుషులుగఁ బరిగణింపఁబడుట సంప్రదాయము; కాని యేవృత్తి లోనివారైనను మహాపురుషులు కావచ్చును. సేనానులు శాంతి నెల కొల్పుదురు. రాజులు ప్రజలఁ బాలించి రక్షింతురు. మహాశిల్పులు దేశీ యభౌతికసంపదను వృద్ధిచేయుదురు. మత ప్రవర్తకులు నాధ్యాత్మి కక్షేమము గల్గింతురు. ఇట్లే మహాకవులును లోకకళ్యాణకారులగు వీరులే! జనుల జ్ఞానమును నీతిని వృద్ధిఁజేసి, గ్రంథరూపమున దానిని మహానిధిగఁ దరతరములవారి కందఁజేయువారు మహాపురుషులే! కనుకనే వేదద్రష్టలగు వసిష్ఠ విశ్వామిత్రాదులను, ఇతిహాసరచయితలగు వ్యాస వాల్మీకులను, ప్రబంధకావ్యనిర్మాతలగు కాళిదాసాదులను గూడ, గౌర వించుట సంప్రదాయమైయున్నది.

సంస్కృతివృద్ధికి వాఙ్మయాభివృద్ధి ముఖ్య చిహ్నము. పూర్వ గౌరవముతోఁ దృప్తినొందక, మానవలోకమం దుచిత స్థానమును బొం దఁదలంతుమేని, మనము నున్నతవాఙ్మయమును సృజింపవలెను. పూర్వ కవు లప్పటివాడుకభాషలగు సంస్కృతప్రాకృతములందు, ఆయాసంఘా వశ్యకతకుఁ దగిన గ్రంథముల రచించిరి. మన సంస్కృతి సనాతనమని ప్రసిద్ధి; అనఁగా నది ప్రవాహనిత్యతవంటిదని భావింపవలెను. మనదేశ భాషలందిప్పు డేర్పడు వాఙ్మయము పరిణామవశమగు నీనాటి సంఘా వశ్యకతలకుఁ దగినదిగనే యుండవలెను.

ఇప్పటి మనదేశభాషలన్నిటిలోను హిందీ హిందుస్థాని ప్రధానమై నది. నేటి హిందీ, మరాటీ, బంగాలీ మొదలగుభాషలు పూర్వపుసంస్కృత ప్రాకృత భాషల సంతతిలోనివే. వీనిలో హిందీ కేంద్రస్థానమందున్నది.

తక్కిన యార్యభాషల కది సన్నిహితము. అది మనదేశీయులలో నధిక సంఖ్యాకులకు మాతృభాష. ఆంధ్రముతోను హిందీకిఁ జాల సంబంధము న్నది. కనుక హిందీకిఁ బ్రాముఖ్యము హెచ్చుట సహజము. అట్టి హిందీ లోని యాధునిక లేఖకులలో ముఖ్యుఁడగు 'ప్రేమచంద' జీవితము నుండి మనము జ్ఞానానందములఁ బొందవచ్చును.

ప్రాచ్యలోకమున హిందూ బౌద్ధ ముస్లిముధర్మముల వారి కందఱి కిని దీర్థస్థలమగు కాశీనగరికి సమీపమందున్న 'మఠవా' అను కుగ్రామ ములో 'ప్రేమచంద్' 1880 వ సం॥న జనించెను. ఆతని మొదటి పేరు ధనపతిరాయ్. వీరికుటుంబస్థితి సామాన్యమైనది.

అక్కడఁ బూర్వార్జితమగు జిరాయితీభూమి వీరి కుండెను. కాని యది కేవలము స్వల్పము. అతని శైశవమునందే, తండ్రి ప్రభుత్వపు తపాలుశాఖలో నొక చిన్నయుద్యోగమును సంపాదించుకొని స్వగ్రా మము వీడి, జీవితార్థము 'గోరఖ్ పురము' చేరెను. ఇది హిమాలయపా దములయొద్దనున్నది. బాలుఁడగు ధనపతి యచ్చటి యద్భుతప్రకృతి సౌందర్యమును గ్రోలుచుండెను. హిమాలయము భౌతికముగ నత్యున్న తము, అతిగంభీరము. కాళిదాసాది పూర్వకవుల గ్రంథములలోను మన ప్రాచీన సంస్కృతిలోను గూడ నీగిరిరాజుస్థాన మట్టిదే. ఋషులకువలె మన ధనపతికి నా దృశ్యము పవిత్రభావములఁ గల్గించెను.

అతనికి బాల్యమందే కష్టములు గలిగెను. అతని యెనిమిదవ యేఁ టనే తల్లి కాలధర్మమునొందెను. సవతితల్లి యేర్పడెను. ఇంక నాఱేండ్ల లోఁ దండ్రియు మరణించెను. అప్పటి కాతఁడు కాశీలో 'హైస్కూలు' లో నాంగ్లవిద్య నేర్చుచుండెను. ఆబాలునికీస్థితిలోఁ గుటుంబభారము పైఁబడెను. కష్టముల నెదుర్కొనుటవలననే కదా నరుని ఘనత తేటఁబడు టః "హేమ్నః సంలక్ష్యతే హ్యగ్నౌ విశుద్ధిః శ్యామికాపి వా". ధనపతి నిర్ధనుఁడైనను సౌమ్యుఁడు,ధీరుఁడు,మానధనుఁడు. సవతితల్లిని, సవతితమ్ము ని బోషించు భారము గూడఁ దనపైఁ బెట్టుకొని, శ్రీమంతులయిండ్లకుఁ

ప్రతిదినమును బోయి, వారిబాలురకుఁ జదువుచెప్పుచును, ఇతరవిధముల నెట్లో వారాణసిలోఁ దనకుటుంబపోషణకును, ఆంగ్లపాఠశాలలోఁ దన విద్యాభ్యాసమునకును వలయు ధన మాతఁ డార్జించుచుండెను. అతఁడు సహజముగ దృఢదేహి కాఁడు; కాని యెట్లో శ్రమకోర్చి ప్రతిదినము పాఠములఁ జెప్పి ద్రవ్యమార్జించుటకై నైళ్ళకొలఁది నడచు చుండెడి వాఁడు. తనసహజాభినివేశముచే నాతఁ డెట్లో కొంతవఱకు విద్యాభ్యాసముఁ బూర్తిచేసికొనెను. ఆతనిప్రజ్ఞను గమనించి, ప్రభుత్వము వారాతనికి విద్యాశాఖలోనుద్యోగమిచ్చిరి. పాఠశాలల"సూపర్వైజరు"గ నతఁడు గొన్నియేండ్లు పనిఁజేసెను; అట్టుద్యోగ మందుండియే, స్వయంకృషితో నున్నతవిద్య నభ్యసించి, 'ఇంటరు' లోను, పట్టపరీక్షలోను గృతార్థుఁ డాయెను. అంతట సర్కారువారి యుద్యోగమున నున్నతస్థానము లభించెను. గోరఖ్‌పురమున సర్కారువారి యున్నతపాఠశాల కధ్యక్షుఁడై, అతఁడు తరువాత 'ఇన్స్పెక్టరు' రాయెను. ఈలోపల సాహిత్యరచనలవలన నాతనికి విద్వాంసులలోఁ బ్రఖ్యాతివచ్చెను.

ఈస్థితిలో జర్మనుయుద్ధానంతరమున లోకమంతటితోఁ బాటుమనదేశమందు నశాంతి గల్గెను. రాజకీయరంగము కలుషితమై 1919 లోఁ బ్రభుత్వమునకును బ్రజానాయకులకును సంఘర్షమారంభమాయెను. చాలమంది ధీమంతు లప్పు డుద్రిక్తులైరి. దేశక్షేమపరాయణు లందఱు ప్రభుత్వోద్యోగములను, న్యాయవాదిత్వమును, పాఠశాలలనువదలి ప్రజల హక్కుకై త్యాగముచూపవలెనని గాంధిమహాత్ముఁడు ప్రచారము చేసెను. ఈ 'అసహకార' సిద్ధాంతపు ఝంఝామారుత మందప్పుడెందఱో ప్రాజ్ఞులు మగ్నులైరి. ధనపతియు నట్లాకృష్టుఁడై, ప్రభుత్వోద్యోగమును వీడి, త్యాగియై, రాజకీయ రంగమున కుఱికెను. 1921 లో మఱికొందఱితోఁ బాటాతఁడును కారాగార యాత్రఁ జేసివచ్చెను. అప్పటినుండియు నతఁడు తనజీవిత మంతయును ద్రవ్యార్జనకుఁ గాక ప్రజాసేవకే వినియోగింప నిశ్చయించుకొనెను.

దీనులబాధల గమనించి యాతఁడు ప్రేమమయుఁ డాయెను. ఆసమయమందే యాతనిపేరు మాఱి పోవుట చిత్రము. అప్పు డతఁడు తఱచు హిందీపత్త్రికలలోఁ గథలను వ్యాసములను బ్రచురించుచుండెను; కాని సౌమ్యుఁడు వినమ్రుఁడు నగు ధనపతి యాపత్త్రికలలోఁ దనపేరు నుదాహరింపనీయలేదు. అవి 'ప్రేమచందు' అనునతఁడు వ్రాసినట్లు యాపత్త్రికలలోఁ గనఁబడుచుండెను. ఈప్రేమచం దెవ్వరో చాలయేండ్ల వఱకుఁ బాఠకులకుఁ దెలియదు. ఆరచనల కద్భుతమగు ప్రసిద్ధిమాత్ర ము గల్గెను. అవి ప్రేమచందురచనలనియే వాడుక దేశమంతటను వ్యాపిం చెను. ధనపతిరాయలే ప్రేమచందను గ్రంథకర్త యని తరువాత వెల్లడి యైనది. కాని, ఈలోఁగా నా మాఱుపేరునకే హెచ్చు ప్రసిద్ధి గల్గి నందున, వ్యక్తియెవరో తెలిసిన మీఁదటను, ఆయననందఱును 'ప్రేమ చందు' అనియే వ్యవహరింపసాగిరి; మొదటిపేరు జనులదృష్టినుండి పో యినది. ఈరీతిగా 'ధనపతి' స్వభావములోను, ఆచరణలోను, లోకుల వ్యవహారములోను గూడ, 'ప్రేమచందు'డై పోవుట సంభవించినది.

కారాగారమునుండి వచ్చినతోడనే ప్రేమచందు క్రొత్తగాఁ దన వృత్తిని నిర్ణయించుకొనవలసివచ్చెను. అసహాయోద్యమము తీవ్రముగా నుండినప్పు డాయాప్రాంతములందలి పాఠశాలలఁ జాలమంది విద్యార్థు లు వీడి బయటకు వచ్చిరి. అందుఁ గొందఱు మఱల ప్రభుత్వపాఠశాలల లోఁజేరలేదు; కాని వారికి విద్యాకాంక్ష యుండెను. అట్టివారి విద్యాభి వృద్ధికై యా యాప్రాంతములం దప్పుడు కొన్ని జాతీయపాఠశాలలు స్థా పింపఁబడినవి. ప్రేమచం దట్టివానిలో నుపాధ్యాయుఁడుగఁ బనిచేయ నిశ్చయించెను. సంయుక్త ప్రాంతపుఁ గాన్పురములో మార్వాడీ మహా విద్యాలయమను జాతీయ పాఠశాలలోఁ గొంత కాలము ప్రేమచందు ప్రధానోపాధ్యాయుఁడై యుండెను. ఇంతలో వారాణసిలో కాశీవిద్యా పీఠమను పేర నొక జాతీయకళాశాల స్థాపింపఁబడినది. తరువాతఁ బ్రేమ చం దీసంస్థలోఁజాలకాలము బోధకుఁడై బాలురకు జాతీయవిద్యను బాగుగ నేర్పెను.

కాని యాయన తనకాలముసంతను సాధ్యమైనంతవఱకు సాహిత్యరచనకే వినియోగించుచుండెను. తరువాత ప్రేమచందు లక్నోనగరిలో స్థాపితమైన 'మాధురి' అను హిందీమాసపత్రికకు సంపాదకుఁడై యయిదాఱేం డ్లాపత్రికను నడపెను. ఆయన యాజమాన్య మందాపత్రిక హిందీ మాసపత్రిక లన్నిటిలో నగ్రగణ్యమని పేరుఁగాంచెను. తత్కాలపు సమస్యలఁగూర్చి యాయన చేయుచుండిన విమర్శలును టిప్పణులు నాయాసాంఘికార్థికాది సమస్యలఁగూర్చి, రాజకీయసిద్ధాంతముల గూర్చియు నాతని పరిజ్ఞానమును స్ఫుటముఁజేయుచుండెను. ప్రచురణార్థమై వచ్చు వ్యాసములందును, కథలందును, ఏవి గణ్యములో యేకథకులు ప్రజ్ఞావంతులో, ఆయన చక్కఁగఁగనిపెట్టి, వారికిఁ దగు సూచనలఁ జేయుచు, ప్రతిభావంతులగు యువకలేఖకులకు బ్రోత్సాహ మిచ్చుచుండెను. ఉన్నతభావములతోను సవిమర్శమగు చర్చలతోను సరళమగు నవ్యవాఙ్మయమును నవ్యమార్గమున సృజించునట్లాయన యువకులకు మార్గదర్శకుఁ డాయెను.

తరువాత, ప్రేమచందు కాశీనగరముకుమరలివచ్చి, యాపురమందు స్వతంత్రముగఁ దానే పత్రికలను స్థాపించెను. ఈవాఙ్మయమును సకాలమునఁ బ్రచురించుచుండుటకై యాయన కాశిలో 'సరస్వతీప్రెస్' అనుపేరనొకపెద్దముద్రణాలయమును దానేస్థాపించి దానిలో, జైనేంద్రకుమార్ వంటి ధీమంతులగు యువకుల గ్రంథములను బ్రచురించుచు, వారికిఁ దోడ్పడెను; తాను 'జాగరణ్' అను వారపత్రికను నడపుచు సందు వాఙ్మయసమస్యలనే గాక సామయికవిషయములన్నిటిని గూర్చి యుఁ జర్చించుచుండెను. లోకానుభవముఁ దెల్పుసూచనలును శాస్త్రపరిజ్ఞానముఁ దెల్పువ్యాసములును విమర్శలును నాతని లేఖినినుండి వెలువడుచుండెను. సంఘక్షేమకరమగు విషయములన్నిటినిఁ గూర్చియు నానాయన యుదారాభిప్రాయములు ...

యుండెను. ఆయన 'హంస' అనుమాసపత్రికనుగూడ నడపెను. ఇది కేవలము వాఙ్మయమును సంస్కృతిని బ్రోత్సహించుటకుద్దేశింపఁబడినది. ఈపత్త్రికయును ద్వరలోనే గొప్ప ప్రసిద్ధి గల్గినది. ఈపత్త్రికల ముద్రణ సౌకర్యమునకై పెట్టిన 'సరస్వతీప్రెస్' అను నచ్చుకూటమునకు సంచారకుఁడై, ప్రేమచందు దాని యార్థిక నిర్వాహపు భారమునుగూడ వహించెను.

ప్రేమచందు స్వతంత్రముగఁ జాలకథలను నవలలను బత్త్రికాముఖమునఁ బ్రచురించెను. అవి జనాదర మొంది తరువాత గ్రంథరూపము గను బ్రచురింపఁ బడినవి. అయినను, వానివలన విశేషముగ ద్రవ్యాదాయము లేకుండెను. సాహిత్యమే తనకు వృత్తి యైనను, ద్రవ్యాకర్షణకై రచనలఁ జేయుట యాయనకెంతమాత్రమును సమ్మతము కాదు. మనదేశభాషలందు విశిష్టగ్రంథముల రచించిన సుప్రసిద్ధులకును గూడ వాఙ్మయసేవ జీవికాధారమగుటలేదు. సాధారణముగా, మనసాహిత్యవర్ధకు లందఱును బీదవారు. ఈస్థితి మిక్కిలి శోచనీయము. ఇది మనదేశభాష లన్నిటికిని వర్తించును. లక్ష్మీసరస్వతులమధ్య సాహచర్యమును, సహవాసమునుండదు. కనుక నీయిద్దఱి యనుగ్రహము నేకకాలమందు లభింపకుండుట సహజమేయని, మనవారు సమాధానపడుచుందురు. కాని యీ నైరాశ్యస్థితి సహజము కాదనియు నిరుత్సాహకరమనియు గ్రహించుట యవసరము. పూర్వము మనరాజులు పండితులను గవులను మిక్కిలి యాదరించుచు, వారు కుటుంబపోషణకై బాధపడనక్కఱలేకుండఁ జేయుచుండిరి. కనుకఁ గవులును సాహిత్యాభిలాషులును నిర్విచారముగఁ దమబుద్ధిని గాలమును దదేకదీక్షతో జ్ఞానాభివృద్ధికే వినియోగింపఁగల్గిరి. కాని, యిప్పటిస్థితిలోఁ బ్రజలే వాఙ్మయము నాదరింపవలెను. ఇంగ్లండువంటి పాశ్చాత్యదేశములలో 'బెర్నర్డుషా', 'వెల్సు' మొదలగు విద్వాంసులెందఱో సాహిత్యసేవను బత్త్రికాసంపాదనను మాత్రమే జీవనాధారముగఁజేసికొని, ప్రజాదరణవలననే లక్షాధికారులును గోటీశ్వరు

లునైనారు. రాజకీయపరిస్థితినిబట్టి యాంగ్లవాఙ్మయమున కున్నంత వ్యాప్తియు నాదరణమును మనదేశభాషల వాఙ్మయమున కుండుట యసంభవము. మనదేశము ప్రస్తుతమున దారిద్ర్యయుతము. అయినను, మన దేశీయులలో నాంగ్ల విద్యాధికులకు స్వభాషలోని యాధునిక వాఙ్మయముపై శ్రద్ధలేదు; తక్కిన వారు చాలవఱ కజ్ఞానులు; వారికి గ్రంథములఁ జదువు నలవాటేతక్కువ. గ్రంథప్రకాశకులును బ్రేమచందునకు న్యాయమగు ద్రవ్యసహాయముఁజేయక, చాలవఱకు స్వలాభమే చూచుకొని, తామే శ్రీమంతులైరి. కుటుంబపోషణయుఁ బత్రికానిర్వహణమును గష్టమైనవి. తుదకతఁడు బొంబాయిఁ జేరి యక్కడఁ నొక సినిమాసంఘమువారికిఁ గథలవ్రాసి సరిఁజేయు నుద్యోగమును స్వీకరించెను. అది యాయనకు నార్థికముగ లాభకారిగ నుండెను. కాని, యావృత్తి తన ప్రకృతికిని సాహిత్యప్రేమకును ననుగుణముగాలేదు. కనుక నాయన త్వరలోనే తనపత్రికానిర్వహణకార్యమునకు వచ్చెను. మనభారతీయభాషలలో నాయావాఙ్మయములమధ్య నాయాప్రాంతీయ సంస్కృతులమధ్యను గొన్నివిభేదము లేర్పడినవి. అందువలనఁ బ్రాంతీయ భావములకుఁ బ్రాముఖ్యముగల్గి, చిరకాలాగతమగు జాతీయసంస్కృతికిని, ఐక్యభావమునకును భంగముకలుగ వచ్చెను. కనుకఁ బరస్పర సమీకరణమును సానుభూతియును గల్గించుట యవసరమని భావించి, 1934 సం॥లో గాంధిమహాత్ముఁడును మరికొందఱు నందుకొఱకై భారతీయసాహిత్య పరిషత్తును స్థాపించిరి.

ఈకార్యములోఁ బ్రేమచందు శ్రద్ధవహించి, యుత్సాహముతో నాకార్యక్రమమును సాగించుటకుఁ దోడ్పడెను. ఆపరిషత్తునకుఁ బ్రారంభమునుండి కార్యదర్శిగ నుండుచు, ప్రేమచందు తన 'హంస' పత్రికను బొంబాయికి మార్చి, దానిని భారతీయసాహిత్యపరిషత్తునకు ముఖపత్రముగఁ జేసెను. అప్పటినుండి యాయన మనసంస్కృతిసమన్వయమునకు సంబంధించినవి, పరస్పరసహాయము గల్గించునవియు నగు ననేకవ్యాస

ముల నాపత్త్రికలోఁ బ్రచురించెను; మఱియు బంగాళీ, గుజరాతీ, ఆంధ్రము, అఱవము, మొదలగు నాయాదేశభాషలందలి మాదిరి రచనల నా యాప్రాంతీయ విశేషములను బ్రత్యేకాచారములను దెల్పు వ్యాసములను హిందీలో హంసపత్త్రికాముఖమునఁ బ్రచురించెను. 1935 సం॥ డిసెంబరులో భారతీయసాహిత్యపరిషత్తు వార్షికోత్సవమును హిందీపట్టప్రదానోత్సవమును మద్రాసునగరమందు జరిగినవి. అప్పుడాయన హిందీసభ కధ్యక్షుఁడై, మద్రాసులో నారెండు సభల కార్యక్రమములోను బాల్గొని, వానిని జయప్రదముగ జరిగించెను.

హిందీలో వాఙ్మయమునకు నవ్యతను బ్రగతిని గల్గించుట కాతఁడే ముదంజ వేసి యితరులకు దారిఁజూపెను. ఇట్లన్నివిధములను బ్రేమచందు వాఙ్మయసేవ జేయుచుండగా, 1936 సం॥లో నాయన వ్యాధిగ్రస్తుఁడై, అక్టోబరులోఁ గాలముఁ జేసెను. ఆయన మరణముచే హిందీవాఙ్మయమునకే గాక, భారతీయసంస్కృతివర్ధనమునకును గొప్ప లోటు గల్గినది. ప్రేమచందున కిద్దఱు చిన్నకొమాళ్ళు, ఒక కొమార్తెయు, మిగిలిరి. ఆయనభార్యయగు శివరాణీదేవి గొప్పవిదుషి; ఆమెచక్కని కథలను, ఆఖ్యాయికలను రచించుచున్నది. ఆమెయే యిప్పుడు హిందీలోఁదనభర్తస్థాపించిన 'హంస'పత్త్రికను కాశీనుండి నడుపుచున్నది.

ప్రేమచందు సాహిత్యరచనలఁ గొన్నివిశేషముల గమనింతము. బాల్యమునుండి సాహిత్య ప్రియుఁడై, అతఁడు తనకు దొరకిన యాఖ్యాయికలను గథలను విద్యార్థిదశలో నుత్సాహముతోఁ జదువుచుండెను. ఆయనప్రభుత్వోద్యోగములో నున్నప్పుడే కాన్పురమునుండి యుర్దూలో వెలువడు 'జమానా' అను మాసపత్త్రికకుఁ గథలను వ్యాసములను వ్రాసి, 'నబాబ్‌రాయి' యను మాఱుపేరుతో బ్రచురించుచుండెను. వెంటనే యాయన కుర్దూలేఖకులలో గొప్ప పేరు వచ్చెను. ఆయన చిన్నికథ లాహ్లాదకరములై పాఠకు లందఱిదృష్టి నాకర్షించెను. అంత నతఁడు యుర్దూలోనే కొన్నినవల (=ఆఖ్యాయిక)లనుగూడ వ్రాసి ప్రచురించెను.

ఆయనప్రజ్ఞ వెంటనే వెల్లడియైనది. ఆర్యావర్తపు హిందువులు ముస్లిములుగూడ నుర్దూలో నట్టిస్వతంత్రమగు చక్కని వాఙ్మయము రచించుచున్నందుల కాయన నభినందించిరి; హిందీరచనల వ్రాయు తరువాతకాలములో నాయన తనగ్రంథముల నుర్దూలోనికి తర్జుమా చేయుచుండెను; అప్పుడప్పు డుర్దూలో వివిధవిషయములఁ గూర్చి ప్రతిభాయుతమగుఁ జర్చతో వ్యాసములు వ్రాసెను. ఆయన మహాపురుషుల జీవితచరిత్ర నొకదానిని గూడ వ్రాసి ప్రచురించెను. ఉర్దూవచనవాఙ్మయమున కాయన చేసిన యమూల్యసేవవలన మనదేశపు ముస్లిముల కాయనపై మహాగౌరవము గల్గినది. అట్టిమధురములై నీతిబోధకములగు రచనలను ముస్లిములలో నెవ్వరును వ్రాయలేదని కొందఱు ప్రామాణికుల యభిప్రాయము.

ఈస్థితిలో మనదేశపు వాతావరణము మాఱినది. దేశమంతటను జాతీయభావమును దేశమంతటికిని హిందీ సామాన్యభాషగా నుండఁదగునను భావమును, వ్యాపించినవి. అందువలన నప్పటినుండి ప్రేమచందు మనస్సు హిందీవైపునకుఁ దిరిగినది.

ఈ సందర్భమున సూక్ష్మముగ హిందీయుర్దూల సంబంధమును గమనింతము. ఈరెండునుభిన్నభాషలని కొందఱు వ్యవహరింతురు. కాని భాషాశాస్త్రప్రకార మీభావము తప్పు. సర్వనామములు, క్రియలు, దైనికజీవితములో వాడఁబడు పదములును జాలవఱకు వ్యాకరణమును నీరెంటిలో నొక్కరీతిగ నున్నవి. భాష కివియే స్కంధముల వంటివి. కనుక 'హిందీ' 'ఉర్దు' రెండు నొకే భాషయని యెంచక దప్పదు. కాని యుర్దూకుఁ బారసీలిపినే వాడుటయు హిందీకి దేవనాగరిలిపినే వాడుటయు సంప్రదాయమైనది. ఇందుకుఁదోడు, ఉత్తరహిందూ దేశమందు హిందూముస్లిముల యాయా సాంఘిక ప్రముఖుల మధ్యఁ దఱచుగఁ గలఁత లుండుచున్నవి. కనుక ముస్లింప్రముఖు లుర్దూలిపినే యభిమానించుచు, వాఙ్మయములోఁ బారసీ యరబ్బీపదములను హెచ్చుగ వాడుచున్నారు. ఇట్లే హిందువులలో హెచ్చుమంది యిప్పుడు విశేషముగ సం-

స్కృతపదములను నాగరిలిపిని వాడుదురు. ఈరీతిగా వాఙ్మయరంగమందు హిందీ యుర్దూల మధ్య నానాటికి విభేద మేర్పడు చున్నది. ఇది యచ్చ తెలుఁగు ప్రాత్తములకును సంస్కృతపదభరితమగు ప్రబంధములకును మధ్యనుండు విభేదమువంటిది. ముస్లిమురాజుల పరిపాలనలో హిందువు లుర్దూను రాజభాషగ నెంచి, దానిలో వాఙ్మయమును రచించు చుండిరి. ఆర్యావర్తములోఁ బశ్చిమప్రాంతములోను నైజాం సంస్థానములోను నేటికి నట్లే జరుగుచున్నది. బ్రిటిషుప్రభుత్వమును మనదేశమందు హిందీకన్న నుర్దూకే యెక్కువ ప్రోత్సాహ మిచ్చుచున్నారు. కౌమారదశలోఁ బ్రేమచందు 'నబాబ్ రాయి' అనుపేర నుర్దూ కవిశేఖరుఁడని పేరొందెను. ఆయనకుఁ బారసీలోను బ్రావీణ్యము కలదు. ఆయన సందఱును 'మున్షీప్రేమచంద'నియే పిల్చుచుండిరి.

ఈస్థితిలో హిందీయే హెచ్చుమంది కాదరపాత్రమను కారణమున నాయన హిందీలో రచనల నారంభించెను. హిందీలోని ధార్మిక వాఙ్మయము ప్రాచీనము, ప్రశస్తము. మన యాంధ్రములోవలె 19 వ శతాబ్దివఱకుఁ బద్యప్రబంధములకే హిందీలోను బ్రాముఖ్య ముండెను. వచన రచనలున్నను, అవిక్లిష్టశైలిలో నుండెను.

ఈ శతాబ్దారంభమందుఁ దెలుఁగులో శ్రీవీరేశలింగం, లక్ష్మీనరసింహంగార్లవలె హిందీలోను మహావీరప్రసాద్ ద్వివేదియును బ్రేమచందును సులభవచనశైలికి నవ్యరచనకు మార్గదర్శకులైరి. సాహిత్యమును ముఖస్థముఁ జేయు పూర్వకాలమందుఁ బద్యరచన లుండుట సహజము. కాని యచ్చుకూటములును సామాన్యులలో విద్యాసక్తియు, విజ్ఞానవికాసమును, వృద్ధియైన యీకాలమందు సులభమగు గద్యగ్రంథములే యధికోపయోగులు; కనుక గద్యమందే ప్రేమచందు తన ముఖ్యరచనల వ్రాసెను. చిన్నికథలను నవలలను వ్రాయుటలో నతఁడు సిద్ధహస్తుఁడు. ఇది వాఙ్మయములోఁ గ్రొత్తపద్ధతి. ఇయ్యది పాశ్చాత్త్యులనుండి యనుకరణ మని చాలమంది భావము.

ఈకాలమం దాఖ్యానరచనల కన్ని దేశముల వాఙ్మయమందును గొప్ప ప్రాముఖ్యమున్నది. ప్రేమచందు కథలకును నవలలకును కొందఱి పాశ్చాత్యకథకులరచనలతో—ముఖ్యముగా గోర్కీ, తుర్గనోవు మున్నగు రష్యను లేఖకుల కథలతోఁ—జాల పోలికయున్నది. కాని, పూర్వకాలమందుఁ బ్రాచ్యవాఙ్మయమందును కథలు లేకపోలేదు. మహాభారతాదులందలి యుపాఖ్యానములు పంచతంత్రము, బృహత్కథ, కథాసరిత్సాగరము, దశకుమారచరిత్రము, భేతాళపంచవింశతి మొదలగు వానిలో నెన్నియో చిన్నికథలు చేరియున్నవి. కాని, యవి విడిగా నుండక హారములో ముత్యములవలె నొక ప్రధానగాథ యను సూత్రమున గ్రుచ్చఁబడి యున్నవి. ఇట్లే కాదంబరి, కర్పూరమంజరి మొదలగు నాఖ్యాయికలును బ్రాచీనవాఙ్మయమందుండినవి. కాని, యాధునికభావముల కనుగుణముగను బాశ్చాత్య వాఙ్మయసంపర్కముననుమన సాహిత్యమందును బరిణామము గల్గినది. ప్రేమచందు హిందీలో రమారమి నాలుగు వందల చిన్నకథలును యిరువదినవలలను వ్రాసెను; అవి చాలవఱకుఁ బ్రచురితములైనవి. కథాగుచ్ఛములు కొన్ని గ్రంథములుగ వెలువడినవి. వీనిలో ముఖ్యమైనవి నవనిధి, సప్తసరోజ్, ప్రేమద్వాదశి, ప్రేమపచ్చీసి, మానసరోవర్ (రెండు భాగములు.)

ఈ రచనలలోఁ బ్రేమచందు కళాశక్తి యద్భుతమని గోచరమగును. ఈకథలు మిక్కిలి మనోరంజకములు, ఉత్సాహకరములు, హృదయవికాసకరములు; ప్రేమచందుకథలను నవలలను జదువనారంభించువారు వానిని బూర్తిగఁ జదువక నిలుపలేరు. వానిలో నన్నిరకముల విషయములు నుండును. ఈకథలచే నతని లోకజ్ఞానమును జీవితానుభవములును తెలియవచ్చును. అందుఁ గొన్ని 'సౌతేలీ మా' (=సవతితల్లి), 'బడేఘర్ కీ బేటీ' (=పెద్దయింటిపిల్ల) మొదలైనవి కుటుంబసంబంధులు; కొన్ని 'పంచపరమేశ్వర్, బాంక్ కా దివాలా' వంటివి సాంఘికములు, ఆర్థికములు. ఇందు కొన్ని యాత్మానుభవమునకు సంబం

ధించినవి, కొన్ని చారిత్రకములు, కొన్ని రాజకీయములు నున్నవి. నవల లలోను, ప్రతిజ్ఞా, సేవాసదన్, వంటివి సాంఘికములు; ప్రేమాశ్రమ్, కర్మభూమి, కొంతవఱకు నార్థికములు; 'రంగభూమి' వంటివి ముఖ్యము గా రాజకీయములు. ఆయన 'పేక్ చిలీకీ కహానియా, ఆజాద్ కథా' అను ననువాదగ్రంథముల గూడ వ్రాసెను. ఇవి మృదువగు హాస్యరస ముతో నిండినవి. కాని స్వతంత్ర గ్రంథములవలననే యాయనకు మహా ప్రసిద్ధిగల్గినది.

'సేవాసదన్' లో నతఁడు మన హిందూసంఘమందలి వివిధలోపములను యుక్తితోఁ జిత్రించి, వాటి నివృత్తికై సంఘసేవాతత్పరతను బ్రోత్సహించెను. తరువాత 1910 లో రచించిన 'పేమాశ్రమ్'లో సహజముగ రాజకీయభావములకు బ్రాముఖ్యము గల్గినది. కొంద ఱుద్యోగుల వలన సామాన్యజనులకుఁ గల్గుబాధలు, కర్షకజనుల పరాధీనస్థితియు నిందుఁ జక్కగాఁ జిత్రింపఁబడినవి. ఇది 600 పుటల నవల. దీనితరువాతవ్రాసిన 'రంగభూమి' యింతకన్నను బెద్దది. దీనిలోఁదాత్త్వికచర్చకు, ఆర్థికపరిణామమునకు, సామ్యవాద సిద్ధాంతములకును బ్రాముఖ్యమీయఁబడినది. దీనితరువాత వచ్చిన'కర్మభూమి'లో సత్యాగ్రహదృశ్యములఁ జిత్రించి, యాయన నిర్మాణకార్యక్రమపు టాధిక్యమునుగూడ సూచించినాఁడు. పంచములను గ్రామ్యలోకము నుద్ధరించుట యవసరమనియుఁ జాల చోటులఁ గనపరుచఁబడినది. ఆయన తుదనువ్రాసిన 'గోదాన' నవల గ్రామ్యజీవితపుఁబ్రస్తుతస్థితిని, అందలిలోపములను, సాంఘికవిభేదములను పునర్నిర్మాణపు టావశ్యకతను దానివిధములనుఁ జక్కగా సూచించుచున్నది.

'కళ కళనిమిత్తమే' Art for Art's Sake అను సిద్ధాంత మాయన కిష్టముకాదు. కళను జీవితముకును సంఘక్షేమమునకునే విని యోగించవలెను (Art for Life's Sake; Art for Society's sake) అనియే యాయన యుద్దేశము. ప్రేమచందు రచనలలోను

శృంగారరసము లేకపోలేదు. కాని యది మృదువై నీతియుతమై హృద్యమైయుండును. వర్ణనలలో నాయన భౌతికసౌందర్యము కన్న నాంతరిక సౌందర్యమునకే ప్రాధాన్యమిచ్చెను. మంగళప్రదమైనదే సుందరమని యాయనభావము. ప్రకృతిసౌందర్యమును, ముఖ్యముగ గ్రామములందలి నిసర్గదృశ్యములను, ఆయన మనోహరముగ వర్ణించెను. సంఘమందలి గుణదోషములన్నిటిని యథాస్థితిగఁ జిత్రించుటయే పాశ్చాత్యుల ముఖ్య పద్ధతి. షేక్స్పియరువంటి కవీశ్వరులును యథాస్థితిని జిత్రించుటలోనే ప్రజ్ఞావంతులై ఘనతగడించిరి. కాని ప్రాచ్యాదర్శ మట్టిది కాదు. మానవ లోకమునకు నీతియే ముఖ్యాధారము. జీవితమున కాదర్శముండవలెను. వ్యక్తియభివృద్ధి స్వల్పసంపాదనమునేగాక, లోకక్షేమమును, ఆత్మానుభవములునే మానవుని జీవితోద్దేశములుగ నుండవలెనని (మనఋషులవలె) ప్రేమచందును భావించెను. ప్రేమచందుపాత్రలలో చాల వివిధత గలదు. లోకమందలి యన్నివర్గముల యన్నిరకముల వ్యక్తులును, ఆతని గ్రంథములలో నేదోయొక దానిలోఁ గాన్పింతురు. ఆయాపాత్రలలో నాయా సన్నివేశములందుఁ గలుగుమానసికపరిణామమును జిత్రించుటలో నాయన రవీంద్ర మహాకవితో సమానముగఁ బ్రజ్ఞను బ్రదర్శించినాఁడు. ఆయన మనోవిశ్లేషణచాతుర్య మద్భుతము.

పాశ్చాత్యానుకరణమువలన మనదేశభాషలలో నిప్పుడువెలువడు కథలలోను సంఘపుఁబ్రస్తుతస్థితిని జిత్రించుటే లేఖకులకృత్యముగ భావింపఁబడుచున్నది. అందును, శృంగారప్రధానములు, ఉద్రేకకరములు, వక్ర వికార రూపములు, అపసవ్యసంఘటనమయములునగు దృశ్యములకే యిప్పటి రచనలలోఁ బ్రాముఖ్య మీయఁబడుచున్నది. పాఠకలోక మిట్టి రచనలకే ప్రోత్సాహ మిచ్చుచున్నదందురు. ఇదినిజమైనచో, మనసంఘపు టభిరుచి వికృతమై శోచనీయస్థితిలో నున్నదని యెంచవలసివచ్చును.

ఈలోప మాంధ్రమందే గాక యభివృద్ధమని యెంచఁబడు వంగవాఙ్మయములోను గలదు. హిందీసాహిత్యమునకు నిట్టి యపఖ్యాతి

యున్నది. అట్టిరచనలే జనతాదరమును బొందుచున్నవని సదుద్దేశయుతులగు లేఖకులును యెంచి, తాము నట్టిసాహిత్యమునే సృజించుచున్నారు. ఈయార్థిక దుర్దశలోఁగవులు-ముఖ్యముగ నార్థికబాధచేఁ బీడితులగువారట్లుచేయుట కొంతవఱకుసహజము. పాఠకులును దొరకిన వాఙ్మయమును జదువుచుందురు. ఇందుఁగొంతయన్యోన్యాశ్రయదోషమున్నది. కాని, సంఘస్థితిని జిత్రించి పాఠకుల కానందమిచ్చుటేగాక, సవ్యమగు సాహిత్యాభిరుచి గల్గించి, ఆర్థికముగను సాంఘికముగను, రాజకీయముగను గూడ సంఘము నున్నతస్థితికిఁ దెచ్చుబాధ్యత లేఖకులకుఁ గలదని ప్రేమచందు గుర్తించెను. ఆయనరచనలలోఁ గేవలము వినోదమేగాక నున్నతాదర్శములు, సంఘలోపముల సంస్కరణావశ్యకతయుఁ గూడ, ద్యోతితమగుచుండును. ఆయనవందలకొలదికథలువ్రాసినను,ప్రతికథలోనుయేదో మహోద్దేశమును నైతికదృష్టియు సూచితములగును. కాని యాయన నవలలలోఁగూడ నివి ప్రత్యక్షముగ నుండవు; కేవలము గాంభీర్యముతో నైతికవర్తనముభావ్యమని స్ఫురింపఁజేయునుగాని యాహ్లాదమున కాటంకము గల్గదు. ఇదియే ప్రేమచందు కళాశక్తిలోని ముఖ్యవిశేషము.

ప్రేమచందు విశాలహృదయుఁడు; ఆయనప్రవర్తన యాదర్శరూపము. ఆయన సవతితల్లిని దనజననిగనేజూచుకొని, ఆమెను దనయింటనే బెట్టుకొని పోషించెను; కనుక నామెయు జననివలె సంచరించెను. తన ప్రథమభార్య తన్నుద్యజించినను, ఎట్టి తగువును లేకుండ (తా నార్థికముగఁ గష్టపడుచుండినను), ఆయన యామె యావజ్జీవమును బ్రత్యేకపోషణ జరిగించెను. సాంఘిక సమస్యలలో నాయన యుదారభావుఁడు, ఒకబాలవితంతువును ద్వితీయభార్యగఁ జేసికొనెను. ఆమె యాయన ప్రోత్సాహమున విద్యావతియై, వాఙ్మయకృషిలో నాయనకు సహాయకురాలైనది. ప్రేమచందు ముఖ్యనవలలన్నిటిలోనుగూడ నుదారమగు జాతీయభావము సూచితమగును. ఆయన గొప్పజాతీయకవి. ఆయనజీవితప్రవృత్తిని బట్టి యది సహజమే. ఇటీవలమనదేశమందు 'ప్రొగ్రెసివ్రైటర్స్న

అసోసియేషన్' (=ప్రగతిశీల లేఖక సంఘము) యనుపేర సాహితికుల సంఘమొకటి యేర్పడినది. ప్రేమచందందలి ప్రముఖసభ్యుఁడు. 1936 లో లక్నోలో నీసంఘపువార్షికసభ ప్రేమచందుని యధ్యక్షతనే జరిగినది. దేశమునకుఁ బురోభివృద్ధిఁ గల్గించిఁ బునర్నిర్మాణమునకు దోడ్పడు సాహిత్యమునే నిర్మించుట యీసంఘాశయము.

ప్రేమచందు కేవలము దీనదయాళువని కొందఱికిఁ దెలియదు. భారతదేశమునకుఁ బల్లెటూళ్ళేప్రాణము. గ్రామములందలి బీదజనుల కష్టములను బాధలను వారియాశలను, వారియార్థికస్థితిని, యథా తథముగఁ బ్రేమచందు చక్కగవర్ణించెను. ముఖ్యముగ, 'ప్రేమాశ్రమ' లోను 'గోదాన'లోను బీదలబాధలును, సాంఘికలోపములును గన్నులఁ గట్టినట్లు చిత్రింపఁబడినవి. ఈవిషయమున, శ్రీ ఉన్నవ లక్ష్మీనారాయణ గారి 'మాలపల్లి' యాయన నవలలతోఁ గొంతపోలియున్నది. ప్రేమచందు సామ్యవాది. కనుక, కర్షకులను గార్మికుల నైట్లైన నుద్ధరింపవలెనను తీవ్రోద్దేశము పాఠకులకు జనించునట్లే యాయన కథావిషయముల నేర్పరుచుకొని, తనవస్తునిర్మాణశక్తిని దదనుకూలముగనే వినియోగించెను. ఆయన నవలల ముఖ్యపాత్రలును దఱచు కర్షకులో లేక త్యాగులగు సంఘసేవకులోయగుట సహజము. కాని, కొందఱు పుంజీపతులును జమీందారులును ద్యాగవీరులై, తమసంపత్తును రయితుల యుద్ధరణకును బ్రజాక్షేమమునకును వినియోగించినట్లాయన చిత్రించుట విశేషము. ప్రేమచందు సిద్ధాంతరీత్యా సామ్యవాదియైనను, ఆచరణలో సమన్వయవాది; గాంధిశిష్యుఁడుగనుక కథలలో హింసాతత్వమును, స్పర్ధను, సాంఘికవైరమును నిరసించును; అహింసను, సాంఘికమైత్రిని, దేశభక్తిని, విశ్వప్రేమను ప్రోత్సహించి, తనలేఖిని నందుకే వినియోగించెను. ఆయన వందలకొలది కథలను చాల నవలలను వ్రాసినను, ప్రతికథలోనువచ్చు పాత్రలలోఁ బ్రత్యేకత కలదు. ప్రతికథలోను నేదో యొక యాశయము నైతికోద్దేశము కాంతాసమ్మితముగ నిమిడియుండును. ఈవిశాలవిశ్వప్రేమ

దుఁ గలవైవిధ్య మాయనరచనలలోఁ బ్రతిబింబితము. కొన్నికథలనుబట్టి యాయన యథాస్థితివాది (realist) యని తోఁచినను, మొత్తముమీఁద నాయన యాదర్శవాది (idealist) యని యెంచవలెను. ఈరెండు పద్ధతుల సమన్వయ మాయన గ్రంథముల ప్రత్యేక విశేషము. ప్రేమచందు శైలి యాకర్షకము; సంభాషణలో నాయన పాత్రోచితభాషనే వాడెను. భాషమిక్కిలిసరళము, కాని యోజోవంతము,రంజకము;ద్రాక్షాపాకము. ఆయన రచనలలో లోకోక్తులను జాతీయములను హెచ్చుగా వాడును. అవి చదువుట కానందకరమై, భావగాంభీర్యము గల్గియుండును. ఆయన నవలలలోఁగొన్ని చాలపెద్దవి. 'రంగభూమి' వేయిపుటలుగలది. కాని, అట్టి గ్రంథములలోను వాగాడంబర మెక్కడనులేదు; ఆయనరచనలలో వ్యర్థపదములు లేవు. మొత్తముమీఁద నాకర్షకమై యుజ్జ్వల మయ్యు సులభమై సుబోధమగు నవ్యశైలి నాతఁడు సృజించినాఁడు. అతఁడు కథారచనలో మనదేశీయు లందఱిలో నగ్రగణ్యుఁడు. ప్రేమచందు కథలలోఁ గొన్ని యాంధ్రములోనికిని దక్కిన మనదేశభాషలలోనికి ననువదింపఁబడినవి; కొన్నిజపానీ, ఆంగ్లము, జర్మను,లలోను ప్రచురితములైనవి. ఆయన సిద్ధాంతములను శైలి ననుసరించి, యిటీవల కొందఱు లేఖకులు హిందీలో నుద్బోధకము వైజ్ఞానికము ప్రజాక్షేమకరము రంజకమునగు చక్కనివచనవాఙ్మయమును సృజించుచున్నారు.

## ఆంధ్రసాహిత్యపరిషత్తు—ప్రతిష్ఠాపకులు.

శ్రీమహారాజా రావు వేంకటకుమారమహీపతి సూర్యారావుబహద్దరువారు పిఠాపురము మహారాజావారు, పరిషదాధ్యక్షజీవాధ్యక్షులు.
కీ. శే. శ్రీ వేంకటగిరి మహారాజావారు
కీ. శే. శ్రీ బొబ్బిలిమహారాజావారు

## ఉద్ధారకులు.

శ్రీరాజా వేంకటాద్రి అప్పారావుబహద్దరువారు-ఉయ్యూరు జమీందారువారు

## ఆంధ్రసాహిత్యపరిషత్కార్యనిర్వాహకసభావర్గము.

### కార్యనిర్వాహకసభాధ్యక్షులు.

జయంతి రామయ్యపంతులుగారు బి. ఏ, బి. ఎల్.

### కార్యదర్శులు.

కొశాంబి రాఘవాచార్యులుగారు ఎం. ఏ., బి. ఎల్.
వింజమూరి వెంకన్నపంతులుగారు ఎం. ఏ

### కార్యనిర్వాహకసభాసభ్యులు.

దివాన్ బహద్దర్ కొమ్మిరెడ్డి సూర్యనారాయణమూర్తినాయుడుగారు, (కోశాధ్యక్షులు).
పెద్దాడ రామస్వామిగారు, ఎం. ఏ. ,,
చిలకమర్తి లక్ష్మీనరసింహముగారు.
సాహిత్యవిశారద కాశీభట్ట సుబ్బయ్యశాస్త్రిగారు,
శ్రీమాన్ గొడవర్తి జగన్నాథస్వామిగారు ఎం. ఏ., ఎల్. టి.
దర్భా వేంకటశివరామరాసుగారు బి. ఏ., బి. ఎల్.
అళక్కి వేంకట్రామయ్యగారు.
కేశవరపు కామరాజుగారు.
కోకా వేంకటసుబ్బారావునాయుడుగారు.
ఓలేటి వేంకటరామశాస్త్రిగారు, శతావధాని.
పానుగంటి లక్ష్మీనరసింహారావుపంతులుగారు.
పిఠాపురిసెట్టి రంగబ్రహ్మరావునాయుడుగారు.

# శ్రీసూర్యరాయాంధ్రనిఘంటువు.

—♦ ప్రథమభాగము. ♦—

ఇది బహువిధముల నాంధ్రనిఘంటువు లన్నింటికంటె మిక్కి‌లి శ్రేష్ఠమైనది. సంస్కృతపదములకుఁ, దెనుఁగుపదములకు వానిప్రయోగములకుఁ దడవికొననక్కఱలేదు. విద్యార్థులకుఁ గవులకు నీనిఘంటు వనేకవిధముల సమస్తసహాయమును జేయును.

సాదాప్రతి రు 5 లు. ఆర్టుపేపరు ప్రతి రు 7 లు

---

# రఘునాథరామాయణము.

ప్ర థ మ భా గ ము.

తంజావూరు రఘునాథభూపాలుఁడు రచించినదానిలోని కొంత భాగము ! ఈ భూపాలునికే చేమకూర వేంకటరాజకవి విజయవిలాసము నంకితము చేసినది. ఈ రాజకవి కవిత్వము మృదుమధురమైనది. కల్పన లతి మనోహరములు, పాఠకలోక మీతని ద్విపదనలచరిత్రమును, వాల్మీ చరిత్రమును జదివియేయుందురు, కావున, మేము వేఱుగఁ జెప్పనక్కఱ యుండదు.

వెల రు. 0-8-0

ఆంధ్రసాహిత్య పరిషత్కార్యదర్శులు, కాకినాడ



Printed by N. Achutaramiah at the Cocanada Printing Works Cocanada and Published by K. Raghavacharyulu, Secretary, Telugu Academy, Cocanada.

